# శ్రీభగవద్గీతా శాంకరభాష్య తత్త్వబోధిని

## చతుర్థ కుసుమమ్

"శాస్త్రరత్నాకర" బ్ర॥ వే॥ దెందుకూరి నృసింహశాస్త్రిణాం
ప్రియశిష్యేణ,
బ్ర॥ వే॥ బులుసు వేఙ్కటశాస్త్రిణాం
తనూభవేన,
శ్రీ శేషమాంబాగర్భశుక్తి ముక్తాఫలాయమానేన
"తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ, దర్శనాలంకార"
గౌతమసగోత్రోద్భవేన,

**బులుసు అప్పన్నశాస్త్రిణా**
ప్రణీతా సతీ,

ఆస్తికవదాన్యానాం ద్రవ్యసహాయేన,
తత్పుత్రాభ్యాం న్యాయశాస్త్ర కోవిదాభ్యాం,
శ్రీవేఙ్కటశాస్త్రి, మిత్రసత్యనారాయణాభ్యాం
భట్నవిల్లి గ్రామసంస్థాపితే స్వీయ శ్రీశారదాముద్రణాలయే
ముద్రాపితాసతీ విజయతేతరామ్॥

పునర్ముద్రణమ్

గ్రంథప్రాప్తిస్థానమ్ :

**శ్రీ శారదా గ్రంథమాలిక**

భట్నవిల్లి – 533 222

అమలాపురం తా॥ (తూ॥ గో॥ జిల్లా.)



[మూల్యం : 16-00

## శ్రీభగవద్గీతా 13, 14, 15 అధ్యాయశ్లోకములకు

# అకారాద్యనుక్రమణిక.

శ్రీరస్తు. శుభమస్తు. అవిఘ్నమస్తు

# శ్రీభగవద్గీతా

# శాంకరభాష్యతత్త్వబోధిని

## త్రయోదశోఽధ్యాయః.

### ప్రకృతిపురుష (క్షేత్రక్షేత్రజ్ఞ) వివేకయోగః

శ్రీభగవానువాచ:—

గీ॥ ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్ర మిత్యభిధీయతే ।
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ ॥౧॥

పదవిభాగము:— శ్రీభగవాన్- ఉవాచ- ఇదం- శరీరం- కౌన్తేయ!- క్షేత్రం- ఇతి- అభిధీయతే- ఏతత్- యః- వేత్తి- తం- ప్రాహుః- క్షేత్రజ్ఞః- ఇతి- తద్విదః ॥ ॥౧॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=పలికెను; హేకౌన్తేయ!=ఓకుంతీపుత్రుడవగు యర్జునా!; ఇదం=ఈపరిదృశ్యమానమగు; శరీరం=దేహేంద్రియాదిసంఘాతము; క్షేత్రమితి=క్షేత్రమని; అభిధీయతే=చెప్పబడుచున్నది; యః=ఎవడు; ఏతత్=ఈక్షేత్ర మగు శరీరమును; వేత్తి=తెలిసికొనునో; తం=అట్టివానిని; క్షేత్రజ్ఞ ఇతి=క్షేత్రజ్ఞుడని; తద్విదః=క్షేత్రక్షేత్రజ్ఞులను తెలిసికొనినవారు; ప్రాహుః=చెప్పుచున్నారు. ॥౧॥

---

శాంకరభాష్యమ్:—

సప్తమేఽధ్యాయే సూచితే ద్వే ప్రకృతీ ఈశ్వరస్య । త్రిగుణాత్మికాఽష్టధా

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సప్తమాధ్యాయమునందు యీశ్వరునకు పరాపరప్రకృతులు రెండు సూచింపబడెను. అందు "భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ । అహంకార ఇతీయం మే

---

—◆ ౧౩వ అధ్యాయము ౧వ శ్లోకవ్యాఖ్యానిశేషములు ◆—

మధుసూదనసరస్వతీయము:—

శ్లో॥ "ధ్యానాభ్యాసవశీకృతేన మనసా తన్నిర్గుణం నిష్క్రియం,
జ్యోతిః కించన యోగినో యది పరం పశ్యన్తి పశ్యన్తు తే ।
అస్మాకం తు తదేవ లోచనచమత్కారాయ భూయాచ్చిరం,
కాలిన్దీపులినేషు యత్కిమపి తన్నీలం మహో ధావతి ॥"

శాంకరభాష్యమ్:—

భిన్నా ఽ పరా సంసారహేతుత్వా త్పరా చాన్యా జీవభూతా క్షేత్రజ్ఞలక్షణే శ్వరాత్మికా । యాభ్యాం ప్రకృతిభ్యా మీశ్వరో జగదుత్పత్తిస్థితిలయహేతుత్వం ప్రతిపద్యతే । తత్ర క్షేత్ర క్షేత్రజ్ఞలక్షణప్రకృతిద్వయనిరూపణద్వారేణ తద్వత ఈశ్వరస్య తత్త్వనిర్ధారణార్థం క్షేత్రాధ్యాయ ఆరభ్యతే। అతీతానంతరాధ్యాయే చా ద్వేష్టా సర్వభూతానా మిత్యాదినా యావదధ్యాయపరిసమాప్తి స్తావత్తత్త్వజ్ఞానినాం సంన్యాసినాం నిష్ఠా యథా తే వర్తన్త ఇత్యేత దుక్తం, కేన పునస్తే తత్త్వజ్ఞానేన యుక్తా యథోక్తధర్మాచరణా ద్భగవతః ప్రియా భవంతీ త్యేవ మర్థ శ్చాయ మధ్యాయ ఆరభ్యతే । ప్రకృతి శ్చ త్రిగుణాత్మికా సర్వకార్యకరణవిషయాకారేణ పరిణతా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భిన్నా ప్రకృతి రష్టధా" అని త్రిగుణాత్మికము, యెనిమిది విధములు నగు ప్రకృతి సంసార హేతువగుటవలన నపరాప్రకృతియని, "అపరేయ మిత స్త్వన్యాం" అనుదానిచే క్షేత్రజ్ఞ లక్షణజీవస్వరూపప్రకృతి యీశ్వరాత్మకమగుటచే పరాప్రకృతి యని యనిపించుకొనును. ఈరెండు ప్రకృతులచేతనే ఈశ్వరుడు జగదుత్పత్తిస్థితిలయకారణత్వమును పొందుచున్నాడు. అందు క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపప్రకృతిద్వయనిరూపణద్వారమున నీప్రకృతిద్వయము కల యీశ్వరునియొక్క తత్త్వనిర్ణయముకొరకు క్షేత్రాధ్యాయము ప్రారంభింపబడుచుండెను. పన్నెండవయధ్యాయమునందు "అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ" ఇత్యాదికముచే యాయధ్యాయసమాప్తివరకు తత్త్వజ్ఞానులగు సంన్యాసుల నిష్ఠయు, వారి స్థితియు చెప్పబడెను.

తత్త్వజ్ఞానులగు యట్టి సంన్యాసులు యెట్టి తత్త్వజ్ఞానముతో కూడినవారై యథోక్త ధర్మాచరణమువలన భగవంతునకు ప్రియులగుచున్నారో యట్టి విషయమును బోధించుట్కై యీ యధ్యాయ మారంభింపబడు చుండెను.

సత్త్వరజస్తమోగుణాత్మక మగు ప్రకృతి సర్వకార్యకరణవిషయాకారముగ పరిణతమై పురుషునకు భోగాపవర్గరూపమగు నర్థమును చేయునదిగ దేహేంద్రియాద్యాకారముగ

ధ్యానాభ్యాసముచే స్వాధీనమొనరించుకొనిన మనస్సుచే యోగులు నిర్గుణము, నిష్క్రియము నగు ప్రసిద్ధమైన యొకానొక తేజస్సును చూచెదరు. వారట్టి తేజస్సును చూచుదురుగాక. కాళిన్దీపులినముల యందు యేతేజస్సు పరుగిడుచున్నదో ఆ యొకానొక నీలమైన తేజస్సు మాకు నేత్రచమత్కారము కొఱకు చిరకాలమగుగాక.

మొదటిషట్కమునందు త్వంపదార్థము, రెండవషట్కమునందు తత్పదార్థము, చెప్పబడెను. వాక్యార్థనిష్ఠము, సమ్యగ్ధీప్రధానము నగు మూడవషట్క మిపుడు ప్రారంభింపబడుచుండెను. అందు "తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్" మృత్యుసంసారసాగరమునుండి నేను వారల నుద్ధరించువాడను.

శాంకరభాష్యమ్:—

పురుషస్య భోగాపవర్గార్థకర్తవ్యతయా దేహేంద్రియాద్యాకారేణ సంహన్యతే సోఽయం సంఘాత ఇదం శరీరం త దేతత్— ఇద మితి సర్వనామ్నోక్తం విశినష్టి—శరీర మితి । హే కౌంతేయ క్షతత్రాణాత్ క్షయాత్ క్షరణాత్ క్షేత్రవద్వాఽస్మి న్కర్మఫలనిర్వృత్తేః క్షేత్ర మితి । ఇతిశబ్ద ఏవం శబ్దపదార్థకః క్షేత్ర మిత్యేవ మభిధీయతే కథ్యతే । ఏత చ్ఛరీరం క్షేత్రం యో వేత్తి విజానా త్యాపాదతలమస్తకం జ్ఞానేన విషయీకరోతి స్వాభావికే నౌపదేశికేన వా వేదనేన విషయీ

నగు జీవుడు ప్రతిక్షేత్రమున నొకడే, నిర్వికారుడే యని చెప్పుటకొఱకు నీయధ్యాయమునందు క్షేత్ర క్షేత్రజ్ఞవివేకము చేయబడుచుండెను. అందు భూమ్యాదిక్షేత్రస్వరూపముగ నపరాప్రకృతి, క్షేత్రజ్ఞస్వరూపముగ పరాప్రకృతి, జీవరూపక్షేత్రజ్ఞస్వరూపముగ పరాప్రకృతి యనెడి రెండు ప్రకృతులు సప్తమాధ్యాయమునందు సూచింపబడెను. తద్వివేకముగ (తద్భిన్నముగ) తత్త్వమును నిరూపింపదలచి శ్రీకృష్ణపరమాత్మ "ఇదం శరీరం" అని చెప్పమొదలిడెను.

ఓకున్తీపుత్ర! ఇన్ద్రియాంతఃకరణసహితము, భోగాయతనము నగు శరీము క్షేత్రమనబడును. క్షేత్రమునందు సస్యముయొక్కవలె యీశరీరమునందు అసకృత్తుగ (అనేకసార్లు) కర్మఫలముయొక్క నిర్వృత్తివలన (ప్రాప్తించుటవలన) ఇంద్రియాంతఃకరణసహితమైన భోగాయతనమగు శరీరము క్షేత్రమనబడును. కృషీవలుడువలె యీక్షేత్రమును "అహం, మమ" (నేను, నాది) అని యెవడభిమానించునో యట్టివానిని క్షేత్ర క్షేత్రజ్ఞ వివేకవేత్తలు క్షేత్రజ్ఞునిగ చెప్పుచున్నారు.

ఇచట "అభిధీయతే" అని కర్మణిప్రయోగముచే క్షేత్రము జడమగుటవలన నద్దానికి కర్మత్వమును, క్షేత్రజ్ఞశబ్దమునందు ద్వితీయావిభక్తిని విడచి "ఇతి" అను శబ్దమును కూర్చి శ్రీకృష్ణపరమాత్మ క్షేత్రజ్ఞుడు, స్వప్రకాశస్వరూపుడగుటవలన క్షేత్రజ్ఞునకు కర్మత్వాభావమును తలచుచుండెను. అందునను క్షేత్రమునందు కర్తృగతవిశేషాపేక్ష లేనందున యెవరిచేతనైన క్షేత్రమని చెప్పబడును. క్షేత్రజ్ఞుడన్ననో స్థూలదృక్కులకగోచరమగుటవలన కర్మత్వమును విడచియే తద్వివేకులు చెప్పుచుండిరి. అని చెప్పుటకు విలక్షణవచనవ్యక్తిచే "క్షేత్రజ్ఞః" అని కర్తృపదోపాదానముచే శ్రీకృష్ణపరమాత్మ నిర్దేశించుచుండెను. ||౧||

శంకరానందీయము:— ముముక్షువుల కీశ్వరోపాసనము సత్త్వశుద్ధికొఱకవశ్యము కర్తవ్యమని మన్ద, అతిమన్ద, అత్యన్తమన్దప్రజ్ఞుల కుపాసనాభేదమును, ఉపాసనచే పరిశుద్ధమైన యంతఃకరణకలవారలకు అక్షరోపాసనము విదేహముక్తికై చేయదగినదని సూచించుటకు శ్రవణమనననిదిధ్యాసనలలో శ్రవణముకంటె మననము, మననముకంటె నిదిధ్యాసన ముత్కృష్టమని చెప్పి, బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముచే అనాత్మబంధనిర్ముక్తులైన జీవన్ముక్తులగు బ్రహ్మవేత్తల కద్వేష్టృత్వాదికము లక్షణమనియు, సాధకులకైతే అయద్వేష్టృత్వాది సాధనమన్వేయమని బోధించి, యిపుడు జిజ్ఞాసువు, మోక్షైకకాముడునగువానికి బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానమెట్టిది? బ్రహ్మమనగ నెట్టిది? ఆత్మయనగ నేది? అనాత్మయనగనేది? అనాత్మకృతమగు బంధమెట్టిది? అట్టి బంధము జ్ఞానముచే యెటుల నివర్తించును? జ్ఞానమనగ నెట్టిది? జ్ఞానసాధనమేది? జీవన్ముక్తి యెటుల ప్రాప్తించును? అను శంక జనింప అనాత్మాత్మశబ్దార్థములగు క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపులైన ప్రకృతిపురుషుల వివేచనము, వివిక్తుడైన క్షేత్రజ్ఞుడగు యాత్మకు బ్రహ్మముతో నేకత్వము, వివిక్తములగు క్షేత్రక్షేత్రజ్ఞులకు వైలక్షణ్యజ్ఞానదార్ఢ్యమునిమిత్తము తిరిగి తిరిగి వివేచనము, ప్రకృతికి బంధకత్వము, ఆత్మకైతే యధ్యాసకృతమైన బంధము అని బోధించుటకు, ఆత్మ కద్వితీయత్వమును లెస్సగ ప్రతిపాదించుటకు పదమూడవయధ్యాయ మారంభింపబడుచుండెను.

అందు సంక్షేపముగ క్షేత్రజ్ఞుని క్షేత్రముకంటె వేరుగ వివేచనచేసి వివిక్తమైన యాత్మకు బ్రహ్మముతో నేకత్వమును బోధించుటకు శ్రీకృష్ణపరమాత్మ "ఇదం శరీరం" అని చెప్ప మొదలిడెను.

అపరాప్రకృతి యన సత్త్వరజస్తమస్సుల సామ్యావస్థయే. అట్టి యపరాప్రకృతియే భోక్తయగు పురుషునియొక్క యదృష్టద్వారమున నీశ్వరప్రేరణచే గుణవైషమ్యమును పొంది సుఖదుఃఖానుభూతికి, బంధమునకు, మోక్షమునకు సాధనముగ స్వయముగనే దేహేన్ద్రియప్రాణమనోబుద్ధ్యాదిరూపముగను, రాగద్వేషాదిరూప

ముగను, శబ్దస్పర్శరూపరసగంధస్వరూపముగను, జాగ్రదాద్యాకారముగను, యనేకవిధములుగ పరిణమించును. అట్టి యీ కార్యకరణసంఘాతస్వరూపము, ప్రత్యక్షముగ ననుభూయమానము నగు శరీరము క్షేత్రమనబడును. "క్షీయతేఽనేనేతి క్షేత్రం" దీనిచే రాగద్వేషావిష్టుడై పురుషుడు క్షీణించునుగాన శరీరము క్షేత్రమనఁబడును. లేక "క్షతే స్త్రాయత ఇతి క్షేత్రం" శమదమాదియుక్తుడైన పురుషుని క్షయాత్మకమైన సంసారరూపానర్థమునుండి రక్షించునదిగాన శరీరము క్షేత్రమనబడును. లేక "క్షిణోతీతి వా క్షేత్రం" దీపశిఖవలె యెల్లప్పుడు స్వయముగ నశించునదిగాన శరీరము క్షేత్రమనబడును. లేక "క్షేత్రవదాచరతీతి వా క్షేత్రం" సుఖదుఃఖాదిఫలోత్పాదనవిషయమై క్షేత్రమువలె నాచరించునుగాన శరీరము క్షేత్రమనబడును. ఈశరీరము క్షేత్రమని క్షేత్రశబ్దముచే విద్వాంసులు చెప్పెదరు. ప్రకృతి, ప్రాకృతమగు దృశ్యజాతము (సమూహము) సర్వము క్షేత్రమనబడును. అట్టి దీనిని శరీరమని క్షేత్రశబ్దముచే యనాత్మస్వరూపమును నిరూపించి యనంతరమున ఆత్మస్వరూపమును బోధించుటకై శ్రీకృష్ణపరమాత్మ "ఏతద్యో వేత్తి" అని చెప్పుచుండెను.

ఎవడీయనుభూయమానమగు శరీరస్వరూపమగు క్షేత్రమును స్వాభావికజ్ఞానముచేతను, పాదప్రదేశము మొదలు మస్తకపర్యంతము విషయముగ చేసికొనునో "అహం" అని గురూపదేశజన్యమగు జ్ఞానముచే తనకు విషయభూతము బుద్ధ్యాదిస్థూలాంతము ఇది శరీరము, ఇది చక్షుస్సు, ఇది ప్రాణము, ఇది శబ్దము, ఇది గంధము, అని యెవడు ప్రత్యక్షముగ ఇదంశబ్దప్రత్యయార్థమగు నిఖిలదృశ్యజాతమును తెలిసికొనునో అట్టి వానిని క్షేత్రస్వరూపమగు యనాత్మయైన దృశ్యజాతమును (సమూహమును) తెలిసికొనిన అహంపదప్రత్యయార్థమైన చేతనుడైన, పురుషుని "క్షేత్రజ్ఞుడు" అని యాత్మస్వరూపమును తెలిసికొనినవారు చెప్పుచుండిరి. "క్షేత్రమును, ప్రకృతిని, ప్రాకృతమగు నిఖిలదృశ్యమును తనకంటె యభిన్నముగ తెలిసికొనువాడుగాన క్షేత్రజ్ఞుడగు యాత్మయని వెలుపల, లోపల యంతటను నిఖిలదృశ్యమును ప్రత్యక్షాదిప్రమాణములచే వ్యవధానము లేకుండగ సాక్షాత్తు యెవడు తెలిసికొనునో వాడు క్షేత్రజ్ఞుడగు యాత్మ యని యాత్మస్వరూపమును తెలిసికొనిన సత్పురుషులు చెప్పుచుండిరి.

లేక, క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క స్వరూపమును జ్ఞేయత్వజ్ఞాతృత్వములచేతను, ప్రకాశ్యత్వప్రకాశకత్వములచేతను, వికారిత్వావికారిత్వములచేతను పరస్పరవిలక్షణములుగ నెవరు తెలిసికొనెదరో యట్టివారాత్మానాత్మస్వరూపవేత్తలు. అట్టి వసిష్ఠాదులు జ్ఞేయమగు సర్వమనాత్మ యనియు, అట్టి యనాత్మను తెలిసికొనిన యాత్మయే అహంపదార్థమని చెప్పుచుండిరి.

—• పూర్వపక్షము •—

ప్రత్యక్షాదిప్రమాణములకు విరోధము ప్రాప్తించును గాన కార్యకరణవ్యతిరిక్తముగ అహంపదార్థమగు జ్ఞాత యెవడును లేడు. అట్టి జ్ఞాత లేనితరి "ఈశరీరము క్షేత్రము, దీని నెవడు తెలిసికొనునో వాడు క్షేత్రజ్ఞుడు" అని చెప్పుట యెట్లు పొసగును? ప్రత్యక్షముగ "అహం గచ్ఛామి, అహం భుంజే" (నేను నడచుచుంటిని, భుజించుచుంటిని) అని గంతవ్యభోక్తవ్యపదార్థజ్ఞాతృత్వము, క్రియాకరణము కార్యకరణసంఘాతమునకే (శరీరేంద్రియాదులకే) చూడబడుచున్నది. మరియు "వీడితో సమానుడగుటవలన వీడు వీని కొమరుడు" అను యనుమానప్రమాణమువలనను, ఇట్టి యుపమానప్రమాణమువలనను ఇదంశబ్దార్థము కార్యకరణసంఘాతమే యగును. మరియు "అయు రాశాస్తే యజమానోఽసౌ" అని అయురాద్యాశాసనము శ్రుతియందున్న "అసౌ" అను శబ్దము ప్రత్యక్షార్థవాచకమగుటవలన కార్యకరణసంఘాతమువకే సిద్ధించుచున్నది. అని కొందరీవిషయమున ప్రశ్నించుచుండిరి.

—◆ సిద్ధాంతము ◆—

అట్టి పూర్వపక్షు లీవిషయమున కొన్ని విషయము లడగదగియుండిరి. అవియేవనిన? నీమతమున (1) జ్ఞాత దేహమా? (2) ఇన్ద్రియసముదాయమా? (3) ప్రాణమా? (4) మనస్సా? (5) బుద్ధియా? (6) అహంకారమా? (7) లేక పైసముదాయమా?

స్వాపమునందును, పరవశత్వాదులయందు దేహమునకు జ్ఞానము కనుపించనందున, నాయొక్క పాదమునందు వేదనకలదు. నాయొక్క శిరస్సుయందు సుఖము కలదని సుఖదుఃఖజ్ఞాత దేహాన్యముగ తెలియబడుటవలనను, దేహము జ్ఞాత యను మొదటి పక్షము నిరస్తము.

నాయొక్క దృష్టి మన్దమైనది, నావాక్కు స్పష్టమైన దని తత్స్పష్టవాస్పష్టవములను తెలిసికొను వాడింద్రియసముదాయముకంటె వేరుగ తెలియబడుటవలన నింద్రియగణము జ్ఞాత యను ద్వితీయపక్షము తొలిగించబడెను.

నిద్రాదులయందు స్వ,పరజ్ఞానము లేనందున ప్రాణము జ్ఞాత యను తృతీయపక్షము హేయము.

నాయొక్క మనస్సు బాధపడుచున్నది. నాయొక్క బుద్ధి చపలమైనది. నాయొక్క యహంకారము దుష్టమైనది. అని మనఆదులకు తనకంటె భిన్నముగ జ్ఞేయత్వనిశ్చయ ముండుటవలన నేది జ్ఞేయమో యది జడ మను యనుమానముచే జ్ఞేయ మగు ఘటాదులకు జడత్వనిశ్చయమువలన జ్ఞేయములగుటం జేసి జడములగు మనస్సు, బుద్ధి, అహంకారము జ్ఞాతలను చతుర్థపంచమషష్ఠపక్షము లుపేక్ష్యములు. జడములైనను జ్ఞాతలన వచ్చుననెదవా? అట్లగుచో జ్ఞేయత్వముభయసాధారణమగుటవలన జడములగు ఘటాదులుకూడ జ్ఞాతలు కావలసివచ్చును.

అవయవము లచేతనములగుటంజేసి తత్సమూహముకూడ కట్టెలమోపువలె యచేతన మగుటవలన నింద్రియాదిసమూహమునకుగూడ జ్ఞాతృత్వము సంభవింపనందున తత్సమూహము జ్ఞాత యను సప్తమపక్షముకూడ దూరతో నిరస్తము.

—◆ పూర్వపక్షము ◆—

జ్ఞాతమగున దెల్ల జడమగుచో చైత్రునిచే జ్ఞాతమైన మైత్రుడు జడము కావలసివచ్చును. అని శంకింపజనదు.

—◆ సిద్ధాంతము ◆—

చైత్రునిచే మైత్రశరీరమే జ్ఞాతము. శరీర మచేతనమే యని పూర్వమునందే సాధితమగుటవలన చైత్రునిచే జ్ఞాతమైన మైత్రుడను పేరు గల శరీరమున కచేతనత్వ మిష్టమే. కాన నీవు చెప్పిన దోషము మాకనర్థదాయకము కాదు. మరియు ఘటమును తెలిసికొనినవాడు ఘటముకంటె వేరగునట్లు దేహాదులను తెలిసికొనువాడు దేహాదులకంటె వేరు అను యుక్తులచేతను, "చక్షుషో ద్రష్టా శ్రోత్రస్య ద్రష్టా వాచో ద్రష్టా మనసో ద్రష్టా బుద్ధేర్ద్రష్టా తమసో ద్రష్టా సర్వస్య ద్రష్టా" అను చక్షురాదులకు ద్రష్ట యని బోధించెడి శ్రుతులచేతను లెస్సగ విచారించినచో అనాత్మ యగు క్షేత్రమునకు, క్షేత్రధర్మములకు, తదవస్థలకు జ్ఞాత క్షేత్రముకంటె భిన్నుడే యగును. కాని యెన్నటికిని దేహేంద్రియాదిరూపమగు క్షేత్రముమాత్రము జ్ఞాత కాదు. క్షేత్రమే జ్ఞాతయగుచో "నాది యీశరీరము, నాది చక్షుస్సు" అని శరీరేంద్రియాదులయందు స్వభిన్నత్వజ్ఞానము లేకపోయెడిని. క్షేత్రమునందు స్వభిన్నత్వజ్ఞానము వివేకులకు ప్రసిద్ధ మగుట

వలన శరీరేంద్రియాదిరూపక్షేత్రముకంటె క్షేత్రజ్ఞుడు భిన్నుడే యగును. కనుకనే సర్వజ్ఞుడగు శ్రీకృష్ణ పరమాత్మ "ఇదం శరీరం క్షేత్రం, ఏతద్యో వేత్తి స క్షేత్రజ్ఞః" అని చెప్పెను. నీచే చెప్పబడిన ప్రత్యక్షాదిప్రమాణము లజ్ఞానివిషయములు కాన నీవిషయమున నేమియు విరోధము లేదు.

—♦ పూర్వపక్షము ♦—

క్షేత్రముకంటె వేరుగ క్షేత్రజ్ఞుడు అనువాడొకడు "అయం" (వీడు) అని యొకానొకడు ప్రత్యక్షమగుటలేదు. "వీడు" అని యొకానొకడు ప్రత్యక్షముగ తెలియబడనందున నట్టివాడే లేడు అని శంకింపజనదు.

—♦ సిద్ధాంతము ♦—

ఈవిషయమున నీవడగదగియుంటివి. "అట్టివాడే లేడు." అనుట క్షేత్రములేదనియా? క్షేత్రజ్ఞుడు లేడనియా? నీయాశయము. ప్రత్యక్షముగ కనుబడుచుండిన క్షేత్రము లేదనుట సంభవింపనందున క్షేత్రములేదను ప్రథమపక్షము సంభవము కాదు. క్షేత్రోపలబ్ధియగు క్షేత్రజ్ఞుడే లేనిచో "ఇదం శరీరం, అయం ఘటః, అయం పటః" (ఇది శరీరము, ఇది ఘటము, ఇది పటము) అనెడి జ్ఞానమే సంభవింపకపోవుటవలన సూర్యుడు లేనటుల జగదాన్ధ్యము ప్రసక్తము కావలసివచ్చును. సూర్యునివలె క్షేత్రజ్ఞునిచేతనేకదా తన తేజస్సుచే మహదాదిస్థూలాంతమగు దృశ్యజాతముల బహిరంత, (లోపల వెలుపల) ర్వ్యాపించి ఈసర్వము ప్రకాశింప జేయబడుచున్నది. అని సర్వము తెలియబడుచున్నది. అట్లు కానిచో అంతరమహదాదులకు, బహిర్ఘటాదులకు, సుఖాదిప్రత్యయములకు, జాగ్రదాద్యవస్థలకు స్వరూపవివేకవిజ్ఞానమే లేకపోయెడిని. కాన ప్రత్యక్షాదిసర్వ ప్రమాణములకు, అహమాదిప్రమేయములకు, సర్వమునకు ప్రామాణ్యము దేనివలన సిద్ధించుచున్నదో అట్టి క్షేత్రజ్ఞునియొక్క యభావము నెవడు చెప్పగలడు? క్షేత్రజ్ఞుడు లేడని యెవడును చెప్పలేడు. క్షేత్రజ్ఞుడేలేనిచో తన యభావమే సంభవించెడిని. సర్వప్రమాణములకు ప్రామాణ్యమును నిర్వహించెడి చిదాభాసరూపమగు ప్రమాతకలడుకదాయని శంకింపజనదు. అట్టి చిదాభాసయు వికార్యంతఃపాతియగుటచే అతనికి సర్వజ్ఞత్వము సంభవింపదు. అంతఃకరణవికారముతోకూడ ప్రతిక్షణమునందు వికృతిని పొందుచున్న చిదాభాసుడుకూడ వికారియగుటవలన, వికారభావముల ననుసరించుటవలనను జాగ్రదాద్యవస్థలయందితనికి (చిదాభాసునకు) ఈనిఖిలవ్యవహారజ్ఞానము సంభవింపదు. విశ్వతైజసప్రాజ్ఞులు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను తెలిసికొనెడి వారు కలరుకదాయని శంకింపజనదు. "ఏతద్యోవేత్తి" అని యేకవచనముచే యొకడే క్షేత్రజ్ఞుడని ప్రామాణ మగుటవలన, అభిమానము వికారియగుటవలన జాగ్రత్స్వప్నసుషుప్త్యభిమానముకల విశ్వతైజసప్రాజ్ఞులుకూడ వికారులేయగుటచే వారలకు నిత్యత్వము సంభవింపనందున విశ్వతైజసప్రాజ్ఞులలో ఒకనికైన నవస్థాత్రితయజ్ఞానము సంభవింపదు. కాన. యే నేను జాగ్రత్తు ననుభవించితినో, యేనేను స్వప్నమును చూచితినో యేనేను సుఖముగ నిద్రించితినో ఆ నేను ఉంటున్నాను. అని జాగ్రత్స్వప్నసుషుప్తిరూపావస్థాత్రయజ్ఞాతకు విశ్వతైజసప్రాజ్ఞులకంటె భిన్నత్వము తెలియబడుటవలన విశ్వతైజసప్రాజ్ఞుల కవికారిత్వము సిద్ధింపదు. అవికారిత్వమే సిద్ధింపనిచో జాగ్రత్స్వప్నసుషుప్తిరూపావస్థాత్రితయజ్ఞానము సుతరాం సిద్ధింపదు. కాన విశ్వతైజసప్రాజ్ఞులకంటె భిన్నుడు, అవికారి, నిత్యుడు, ఏకము నగు చేతనుడు నిఖిలక్షేత్రమును తెలిసికొనువాడు క్షేత్రజ్ఞుడు. వాడే యాత్మయని సిద్ధించుచున్నది.

ఆత్మకు క్షేత్రజ్ఞత్వ ముండుగాక, అయినను "అయం" (వీడు) అని క్షేత్రజ్ఞుడు తెలియబడుట లేదు. ఇదియెట్లుపొసగు ననెదవా? చెప్పెద వినుము. క్షేత్రజ్ఞుని తెలిసికొను మరియొక జ్ఞాత లేమింజేసి "వీడు"

అని క్షేత్రజ్ఞుడు తెలియబడుటలేదు. అట్టి జ్ఞాతను మరియొకనిని యొప్పుకొనినచో అట్టి జ్ఞాతను తెలిసికొనుటకు మరియొక జ్ఞాత నంగీకరింపవలయును. మరియొక జ్ఞాతనుగూడ యంగీకరించినచో అతనిని తెలిసికొనుట కింకొక జ్ఞాత నంగీకరింపవలయును. ఇట్లంగీకరించుచుండిన యనవస్థాదోషము ప్రాప్తించును. మరియు క్షేత్రజ్ఞుడుగూడ "అయం" (వీడు) అని జ్ఞాతుడగుచో నతనికి క్షేత్రభావమే ప్రాప్తించి క్షేత్రజ్ఞత్వము తొలగిపోవును. మరియు అనిత్యత్వము, అచేతనత్వము మొదలగు దోషములు ప్రాప్తింపవలసి వచ్చును. మరియు "ఏకో దేవః, ఏక ఏవ సాక్షీ స్వప్రకాశః, అజో నిత్య శ్శాశ్వతః" ఇత్యాదిశ్రుతులకు విరోధము ప్రాప్తించెడిని. కాన ఆత్మ ఘటాదులవలె జ్ఞానవిషయుడు కాడు.

"తరతి శోక మాత్మవిత్" అను శ్రుతి యాత్మజ్ఞానముకలవానికే శోకతరణమును బోధించుచున్నది. "ఆత్మ యిది" అని తెలినయుపుడే శోకతరణము విద్వాంసునకు సిద్ధించును. అందువలన "అయం" అని యాత్మ యెటుల తెలియఁబడును? అని శంకింపజనదు. శ్రుతిసిద్ధమైన జ్ఞానముచేతనే యాత్మ తెలిసికొనదగినది. అది యెట్లనిన? చెప్పెదవినుము. "నాంతః ప్రజ్ఞం, న బహిఃప్రజ్ఞం, నోభయతః ప్రజ్ఞం, న ప్రజ్ఞానఘనం, న ప్రజ్ఞం, నాప్రజ్ఞ మదృశ్య, మవ్యవహార్య, మగ్రాహ్య, మలక్షణ, మచింత్య, మవ్యపదేశ్య, మేకాత్మప్రత్యయసారం, ప్రపంచోపశమం, శివ, మద్వైతం, చతుర్థం, మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః" అను శ్రుతియందుగల "నాంతఃప్రజ్ఞం" ఇత్యాదికముచే తైజసవిశ్వాదులకంటె యాత్మకుభిన్నత్వమును, తైజసవిశ్వాదులకు అనాత్మత్వమును చెప్పి, "అదృశ్యం" అనుదానిచే సర్వదృశ్యభిన్నత్వమును, "అవ్యవహార్యం" అనుదానిచే కర్మేంద్రియావిషయత్వమును, "అగ్రాహ్యం" అనుదానిచే జ్ఞానేంద్రియావిషయత్వమును, "అలక్షణం" అనుదానిచే అనుమానాగోచరత్వమును, "అచిన్త్యం" అనుదానిచే మనస్సునకుగూడ అగోచరత్వమును, "అవ్యపదేశ్యం" అనుదానిచే వాగవిషయత్వమును, "ఏకాత్మప్రత్యయసారం" అనుదానిచే చిదేకరసత్వమును, స్వగతభేదరాహిత్యమును. "ప్రపంచోపశమం" అనుదానిచే విజాతీయభేదరాహిత్యమును, "అద్వైతం" అనుదానిచే సజాతీయభేదరాహిత్యమును, "శివం" అనుదానిచే ఆనన్దఘనత్వమును, 'చతుర్థం' అనుదానిచే స్వాభాసవిశ్వతైజసప్రాజ్ఞులనెడి త్రితయాపేక్షచే తురీయత్వమును, సర్వదృశ్యవైలక్షణ్యమును లెస్సగ నాత్మకు చెప్పి, ఇట్టి "సర్వదృశ్యవిలక్షణము, చిదానందైకరసము నేదికలదో యదియే యాత్మ. ఆయాత్మయే స్వలక్షణలక్షితము. అట్టి యాత్మయే నేనైతిని" అని విద్వాంసులచే స్వాత్మస్వరూపముగ తెలిసికొనదగినదని పై మాండూక్యశ్రుతి బోధించుచున్నది. ఇట్టి శ్రుతిసిద్ధజ్ఞానముచే తనను అవిద్యాతత్కార్యసంబంధరహిత మగు యాత్మనుగ తెలిసికొని విద్వాంసుడు సంసారమునుండి ముక్తుడగును. కాన సర్వదృశ్యవిలక్షణత్వము, క్షేత్రజ్ఞత్వము ఆత్మకు లక్షణమని సిద్ధము. ॥౧॥

శ్రీ భ గ వా ను వా చ ము:—

శ్లో॥ "భక్తానా మహ ముద్ధర్తా సంసారా దిత్యవాది యత్ ।
త్రయోదశేఽథ తత్సిద్ధ్యై తత్త్వజ్ఞాన ముదీర్యతే" ॥౧॥

"తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ । భవామి" మృత్యుసంసారసాగరమునుండి నాభక్తుల నుద్ధరించువాడను నేనే." అని శ్రీకృష్ణపరమాత్మ పూర్వమునందు ప్రతిజ్ఞ చేసెను. ఆత్మజ్ఞానము లేనిదే సంసారసాగరమునుండి సముద్ధరణము సంభవింపదని తత్త్వజ్ఞానోపదేశము నిమిత్తము ప్రకృతిపురుషవివేకాధ్యాయ మారంభింపబడుచుండెను. అందు సప్తమాధ్యాయమునందలి అపరాప్రకృతి, పరాప్రకృతి అని రెండు ప్రకృతులు చెప్పబడెను. అట్టి ప్రకృతుల యవివేకమువలన జీవభావమును పొందిన చిదంశకే యీసంసారము. జీవోపభోగార్థమీశ్వరుడు యేప్రకృతిద్వయముచే సృష్ట్యాదులయందు ప్రవర్తించుచుండెనో పరస్పరము విలక్షణమైన క్షేత్రక్షేత్రజ్ఞశబ్దవాచ్యమైన అట్టి ప్రకృతిద్వయమును యథార్థముగ నిరూపించదలచి శ్రీకృష్ణపరమాత్మ "ఇదం" అని చెప్పమొదలిడెను.

శరీరము సుఖదుఃఖప్రత్యక్షప్రయోజకము. అనగా శరీరముతో గూడినపుడే సుఖదుఃఖసాక్షాత్కారము సంభవించును. కాన శరీరము భోగాయతన మనఁబడును. "ఇదం" భోగాయతనమగు "శరీరం" శరీరము సంసారముయొక్క ప్రరోహమునకు భూమి యగుటవలన క్షేత్రమనబడును. "ఏతత్" ఈశరీరమును.

"అహం, మమ" (నేను, నాది) అని యెవడు చెప్పుకొనునో వానిని- కృషీవలుడువలె తత్ఫలభోక్త యగుట వలన క్షేత్రజ్ఞునిగ క్షేత్రక్షేత్రజ్ఞుల వివేకముకలవారు చెప్పుచుండిరి. ॥౧॥

సదానందీయము:—

శ్లో॥ ముముక్షూణాం విత్తం స్థిరచరనిమిత్తం స్థిరపదం,
మహామాయాచిత్తం శ్రుతిహృదయ మద్వైతచరితమ్ ।
అఖండానన్దం శ్రీపతి మజ మనన్తం యదుపతిం,
ముకున్దం నన్దాంకే విలసిత మహం నౌమి శతశః ॥

(ఈసదానందీయవ్యాఖ్యయందు మధుసూదనసరస్వతీయవ్యాఖ్యావిషయమే శ్లోకరూపమున చెప్పబడు టచే నిచట నీవ్యాఖ్య ననువదించలేదు.)

భాష్యోత్కర్షదీపికః:—

శ్లో॥ యో మాయాం జగదేకమోహనకరీ మాశ్రిత్య సృష్ట్వాఽఽలయం,
దేహం జీవతయాఽనువిశ్య మతిభి స్సంయాతి నానాత్మతామ్ ।
వన్దే తం పరమార్థత స్సుఖఘనం బ్రహ్మాద్వయం కేవలం,
కృష్ణం వేదశిరోభి రేవ విదితం శ్రీశంకరం శాశ్వతమ్ ॥౧॥
ఆకాశస్య యథా ఘటాదిభి రసౌ భేదో నచాస్త్యర్థతః, ।
ఏవం బ్రహ్మణి నిర్గుణేఽతివిమలే బుద్ధ్యాదిభిః కల్పితః,
యస్మి న్నేకరసే విహాయ మమితం తం వాసుదేవం భజే,
సత్యానన్దచిదాత్మకం గురుగురుం శర్వం తమోనాశకమ్ ॥౨॥
దేవీం భక్తజనార్థసార్థజననీం ప్రత్యూహదైత్యార్దినీం,
భాసం భానుమృగేన్ద్రసూదితమహావిఘ్నాఘనాగం ప్రభుం,
శుండాదండనిరస్తసర్వదురితాఽగం పావనం మంగలం,
ధ్యేయం నౌమి గజాననం సురగణై రిన్ద్రం గణానాం విభుమ్ ॥౧॥

ప్రథమషట్కముచే త్వంపదార్థమును, ద్వితీయషట్కముచే తత్పదార్థమును ప్రతిపాదించి యఖండార్థ ప్రతిపాదన కొఱకు తృతీయషట్కమారంభింపబడుచుండెను.

అందు "భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ । అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥ అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ : జీవభూతాం మహాబాహో య యేదం ధార్యతే జగత్ ॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ । అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా ॥ అని సప్తమాధ్యాయమునందలి త్రిగుణాత్మికము, క్షేత్రస్వరూపము నగు ప్రకృతి సంసారహేతువగుటవలన "అపరా" యనియు, దానికంటె భిన్నము, జీవస్వరూపము, క్షేత్రజ్ఞస్వరూపము నగు ప్రకృతి యీశ్వరరూపమగుటవలన "పరా" యనియు యీశ్వరునకు రెండు ప్రకృతులు సూచింపబడెను. ఏపరాపరప్రకృతిద్వయమునందే యీశ్వరుడు జగదుత్పాదనహేతుత్వమును పొందుచుండెనో దానియందే క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపప్రకృతిద్వయనిరూపణద్వారా పరాపరప్రకృతిద్వయము కల యీశ్వరుని యొక్క తత్త్వనిర్ణయార్థము, ద్వాదశాధ్యాయమునందలి "అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ" ఇత్యాదికముచే తత్త్వవేత్తవిశేషణములు చెప్పబడెనో, యేతత్త్వజ్ఞానముతో సంపన్నులై అద్వేష్ట్రృత్వాది విశేషణవిశిష్టులై నాకు ప్రియులగుదురో అట్టి తత్త్వజ్ఞానావధారణార్థము "ఇదం శరీరం" అని శ్రీకృష్ణపరమాత్మ చెప్పమొదలిడెను.

ప్రత్యక్షాదిప్రమాణములచే నుపలభ్యమానమగు దృశ్యము "ఇదం" అను శబ్దముచే చెప్పబడుచున్నది. అది యేదనిన? "శరీరం" సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతి సర్వకార్యకరణవిషయాకారముగ పరిణమించి పురుషునకు భోగాపవర్గములు కర్తవ్యముగ దేహేంద్రియాద్యాకారముగ కలుసుకొనుచున్నది. ఈసంఘాతమే శరీరమని చెప్పబడుచున్నది. ఓకౌన్తేయ! ఈశరీరము "క్షతాత్త్రాణాత్" నాశమువలన రక్షించునదిగాన క్షేత్ర మనబడును. లేక "క్షిణో త్యాత్మాన మవిద్యయా" అవిద్యచే నాత్మను క్షీణింప జేయునుగాన క్షేత్ర మనఁబడును. "త్రాతి తం విద్యయా" విద్యచే నాత్మను రక్షించునది కాన క్షేత్ర మనబడును. "క్షీయతే నశ్యతి క్షరతి అపక్షీయతే" నశించునది కాన అపక్షయమును పొందునది కాన క్షేత్ర మనఁబడును. క్షేత్రమువలె యీశరీరమునందు కర్మఫలము సంభవించును కాన నీశరీరము క్షేత్ర మనబడును. ఎట్లు కుంతి నీప్రాదుర్భావమునకు స్థానమగుటవలన క్షేత్రమనుపించుకొనెనో అట్లే యీశరీరముకూడ నాత్మకభివ్యక్తిస్థానమగుటవలన క్షేత్రమనబడు నని తెల్పుటకై "హేకౌన్తేయ!" అని సంబోధించెను. ఈచెప్పుటచే నాత్మకు, శరీరమునకు భేదము బోధింపబడెను. దృశ్యమగు శరీరమును చెప్పి దానికంటె భిన్నమైన ద్రష్ట యగు నాత్మను చెప్పుచుండెను. ఈశరీరరూప మగు క్షేత్రమును ఆపాదతలమస్తకము "మనుష్యోఽహం, మమేదం శరీరం" అనుస్వాభావికజ్ఞానముచేతను, శరీరము దృశ్యనుగుటవలన ఘటమువలె నాత్మ కాదు. అను ఔపదేశికజ్ఞానముచేగాని స్వాతిరిక్త మనెడి జ్ఞానముచే గాని యెవడు తెలిసికొనునో క్షేత్రక్షేత్రజ్ఞులనుదృశ్యద్రష్టలుగ తెలిసికొనినవారు వానిని క్షేత్రజ్ఞునిగ చెప్పుచుండిరి. ॥౧॥

పరమార్థప్రపా:— పూర్వాధ్యాయమునందలి సగుణనిర్గుణోపాసనాభేదముచే బ్రహ్మప్రాప్తియందధికారిద్వయము చెప్పబడెను. అందు క్రమముక్తికి సుఖసాధనత్వము చెప్పబడెను. అందునను సుఖసాధనములు కల సగుణోపాసకునియొక్క ధర్మములు యెనిమిది శ్లోకములచే చెప్పబడెను. ఇపుడు క్లేశరూపసాధనములుకల నిర్గుణోపాసకునకు బహుసామగ్రిసాధ్యతత్త్వజ్ఞానపూర్వకమైనది బ్రహ్మప్రాప్తి యని చూపుటకు మొట్టమొదట క్షేత్ర; క్షేత్రజ్ఞులయొక్క స్వరూపమును శ్రీకృష్ణపరమాత్మ "ఇదం శరీరం" అని యుపదేశించుచుండెను.

భోగాయతన మగు యీశరీరము సంసారతరుప్రరోహమునకు భూమికయగుటవలన క్షేత్ర మనబడును. అనంతరమున సామాన్యమున "ఏత ద్యో వేత్తి" అనుదానిచే క్షేత్రజ్ఞస్వరూపమును చెప్పుచుండెను. ఈక్షేత్రము నెవడు తెలిసికొనునో వానిని క్షేత్రజ్ఞు డని క్షేత్రక్షేత్రజ్ఞవిభాగమును తెలిసినవారు చెప్పుచుండిరి.

ఈచెప్పుటచే దేహాతిరిక్తమగు క్షేత్రజ్ఞు డొకడు కలడని సూచింపబడెను. అన్వయవ్యతిరేకములచే ఘటాదులవలె దేహమునకు జాడ్యనిశ్చయముచే (మృతదేహమునందు దాహదుఃఖానభిజ్ఞత్వ దర్శనమువలన) స్వకీయద్రష్టృత్వము సంభవింపదు. ఎట్లు ఘటద్రష్ట ఘటముకంటె భిన్నుడో అట్లే దేహద్రష్టయు దేహముకంటె భిన్నుడు అని యర్థము. ॥౧॥

నీలకంఠీయము:— "అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే। నిత్య స్సర్వగత స్స్థాణు రచలోఽయం సనాతనః॥" అనుశ్లోకముచే ద్వితీయాధ్యాయమున త్వంపదార్థస్వరూపము చెప్పబడెను. అట్లే ద్వాదశాధ్యాయమున "యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే। సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్॥" అనుశ్లోకమున తత్పదార్థస్వరూపము నిరూపింపబడెను. ఈరెండు శ్లోకములలోని లక్షణములకు భేద మేమియు లేనందున నీలక్షణములచే లక్షితములైన త్వంపదార్థ, తత్పదార్థములకు నభేదమే సిద్ధించుచున్నది. కాన నిక నభేదప్రతిపాదక మగు నుత్తరగ్రంథము నారంభించుట

వ్యర్థము కాదా? అను ప్రశ్న ముదయించుచున్నది. త్వంపదార్థ, తత్పదార్థములకు అవ్యక్తత్వ, అచింత్యత్వ, అచలత్వ, సర్వగతత్వాదికము సమానము కదా! కాన నారెండింటికి భేదమే సంభవింపనందున నభేదప్రతిపాదకమగు నుత్తరగ్రంథము వ్యర్థము అని సిద్ధించుచున్నది. ఆరెంటికి సర్వగతత్వము వేర్వేరుగ సంభవింపదు. అట్లైనచో బరస్పరవ్యావృత్తములైన యారెండింటికిని యసర్వగతత్వమె సంభవించెడిని. ఇక, త్వంపదార్థ, తత్పదార్థములకు లక్షణభేదము లేకున్నను ఆయా యాత్మగతములైన విశేషములు కలవు. వాటి ననుసరించియే ముక్తులకు, జీవులకు ఈశ్వరునికి గల భేదము తెలియబడుచున్నది. (ఒక్కొక్క విశేషము తన కాశ్రయమగు దానికి వ్యావర్తకమగుచున్నది) అని యనరాదు. అట్టి విశేషముల నొప్పుటలో బ్రమాణ మేమియు గాన రాదు. ఇక, అట్టివిశేషములు లేకున్నను బంధమోక్షాదివ్యవస్థ వేరొక విధముగ నుపపన్నము కాదుగాన సాంఖ్యవృద్ధసంమతమైన భేదము నొప్పవలయును. (అనగా నొకడు పుట్టినపుడు వేరొకడు గిట్టుచుండుటనుబట్టి దీనికి కారణములు నియమముగ నొకే మారు కలుగకుండుటచే బురుషు లనేకులని సిద్ధించుచున్నది. లేక, జన్మ, మరణ, కరణములు (ఇంద్రియములు) నియమముగ నొకే సమయమున ప్రవర్తింపకుండుటనుబట్టి పురుషబహుత్వము సిద్ధించుచున్నది. సత్త్వ, రజ, స్తమోగుణముల వైపరీత్యముచే జన్మాదివ్యవస్థకలుగుచున్నది. దాని ననుసరించియే యుగపత్ప్రవృత్తి కానరాకున్నది. సాత్త్విక, రాజసాదిభేదముచేతను, పురుషబహుత్వము నొప్పవలయు నని శంకింపజనదు. ఇట్టి సర్వవ్యాపకానేకాత్మవాదమతమున భోగసాంకర్యరూపదోషము అనివార్యమగును. ఎట్లన: ఒక ప్రదేశమున నున్న యంతఃకరణము సుఖరూపముగగాని, దుఃఖరూపముగగాని పరిణమించినచో నట్టి సుఖమునుగాని, దుఃఖమునుగాని యొకే చేతనుడు తెలిసుకొను నని నియమించుటకు శక్యముగానేరదు. ఏమన: ఆస్థలమున యన్నియాత్మల సాన్నిధ్యముండుటలో విశేష మేమియు లేదు కాన సర్వవ్యాపకములగు నన్నియాత్మలకును నట్టి సుఖదుఃఖానుభవము సమానమే యగును. ఇట్టి యనివార్య మగు భోగసాంకర్యరూపదోషము ప్రసక్తమగును గాన యాత్మైకత్వమునే జెప్పవలెనుగాని యాత్మనానాత్వమును జెప్పరాదు. మరియు శబ్దగ్రాహక మగు ఒకే యాకాశము కర్ణశష్కులీరూపోపాధిభేదవశమున యొకే స్థలమున శబ్దమును గ్రహించును. అట్లే యాత్మ యొకటే యైనను అంతఃకరణరూపోపాధుల ననుసరించి జన్మాదివ్యవస్థయు, సుఖ. దుఃఖభోగాఽసాంకర్యముగూడ నుపపన్న మగును. కాన పురుషబహుత్వమును జెప్ప వలనుపడదు. కనుకనే త్వంపదార్థ, తత్పదార్థము లగు జీవేశ్వరులకు లక్షణైక్యమును బట్టియే యైక్యము సిద్ధించుచుండ నిక నభేదప్రతిపాదకముగ ముందు గ్రంథమును జెప్పుట వ్యర్థమని ప్రశ్నించుట న్యాయమే.

కాని "యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూ త్త త్కేన కం పశ్యేత్" అను శ్రుతిప్రతిపాదితమగు పారమార్థికావస్థయం దిట్టి జీవేశ్వరభేదము లేకున్నను, "అంతః ప్రవిష్ట శ్శాస్తా జనానాం। ఏష హ్యేవ సాధు కర్మ కారయతి తం య మేభ్యో లోకేభ్య ఉన్నినీషతే" అను శ్రుతిప్రతిపాదితమగు వ్యావహారికదశయందు శాస్యశాసకభావముచేతను, కర్తృకారయితృత్వభావముచేతను ప్రసక్తమైన జీవేశ్వరభేదమును నిరసించుటకై ముందుగ్రంథము నారంభించుట యుపపన్నమే యగును. అందునను అనుపదోక్తమగు తత్పదార్థముతో త్వంపదార్థమున కిభేదమును చెప్పటకై తగునట్లుగా భాస్యభాసకభావముచే క్షేత్రముకంటె క్షేత్రజ్ఞుడు (ఘటముకంటె ఘటావభాసకుడగు సూర్యుడువలె) భిన్నుడు అని తెలుపుటకై వివేకమును జూపుచుండెను. "ఇదం" ఈ యనాత్మగా భాసించెడి ఘటాద్యహంకారాంతమగు "శరీరం" విశరణధర్మముగల శరీరము "క్షేత్ర మిత్యభిధీయతే" అవిద్యచే నాత్మను క్షీణింపజేయునది గనుకను, విద్యచే నాత్మను రక్షించునది కనుకను క్షేత్రమని చెప్పబడుచున్నది. (కర్మబీజప్రరోహస్థానము క్షేత్రశబ్దముచే చెప్పబడును.) "ఏతత్... తద్విదః" ఈక్షేత్రము నెవడు భాసింపజేయునో అట్టి చిదాత్మను క్షేత్రక్షేత్రజ్ఞవివేకవంతులు 'క్షేత్రజ్ఞుడు' అను సార్థకనామము కలవానిగ జెప్పుదురు. ఈచెప్పుటచే "నేను వెళ్ళుచుంటిని; చూచుచుంటిని; భుజించు

గీ॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత! ।
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం య త్త జ్జ్ఞానం మతం మమ! ॥ ॥౨॥

పదవిభాగము:— క్షేత్రజ్ఞం- చ- అపి- మాం- విద్ధి- సర్వక్షేత్రేషు- భారత- క్షేత్రక్షేత్రజ్ఞయోః- జ్ఞానం- యత్- తత్- జ్ఞానం- మతం- మమ । ॥౨॥

ప్రతిపదార్థము:— హేభారత!=ఓభరతవంశోద్భవుండవగుఅర్జున; సర్వక్షేత్రేషు=బ్రహ్మాది స్తంబపర్యన్తానేకోపాధులయందు; (ప్రవిభక్తమైన) క్షేత్రజ్ఞం=క్షేత్రజ్ఞుని; చ=క్షేత్రములను; మామపి=(ఇట "అపి" అనునది "ఏవ" అనుశబ్దముయొక్క యర్థము కలది) అనగా; మామేవ=యే యుపాధిభేదము లేనట్టియు, సదసదాదిశబ్దప్రత్యయాగోచరమైనట్టి నాస్వరూపముగనే; విద్ధి=తెలిసికొనుము; క్షేత్రక్షేత్రజ్ఞయోః=క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క; యత్=ఏ; జ్ఞానం=జ్ఞానము కలదో; తత్=అజ్ఞానము; (ఏజ్ఞానములో క్షేత్రక్షేత్రజ్ఞులు విషయ మగుదురో యట్టి "క్షేత్రక్షేత్రజ్ఞులు పరమేశ్వరస్వరూపులే" అను జ్ఞానము) మమ=పరమేశ్వరుడ నగు నాయొక్క; మతం=మతము. ॥౨॥

శాంకరభాష్యమ్:—

(1) ఏవం క్షేత్రక్షేత్రజ్ఞా వుక్తౌ కి మేతావన్మాత్రేణ జ్ఞానేన జ్ఞాతవ్యా వితి, నే త్యుచ్యతే— క్షేత్రజ్ఞం యథోక్తలక్షణం చాపి మాం పరమేశ్వర మసంసారిణం విద్ధి జానీహి । సర్వక్షేత్రేషు యః క్షేత్రజ్ఞో బ్రహ్మాదిస్తంబపర్యంతానేక క్షేత్రోపాధిప్రవిభక్త స్తం నిరస్తసర్వో

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) భేదకములు, యావద్దేహభావులు, దృశ్యములు నగు దుఃఖాదులకు అనాత్మధర్మత్వసిద్ధి కొఱకు ద్రష్ట దేహముకంటె నన్యు డని చెప్పి సాంఖ్యులకువలె అంతమాత్రముచేతనే ముక్తి సంభవింపదని క్షేత్రజ్ఞునకు సర్వదేహములయందైక్యప్రతిపాదనపూర్వకముగ తనస్వరూప మైన పరమార్థ మగు నక్షరపరబ్రహ్మముతో నైక్యము ననువదించి ప్రశ్నద్వారమున "ఏవం" ఇత్యాదిభాష్యముచే చూపుచుండెను.

చుంటిని" అను మొదలగు అనుభవములవలన దేహము, ఇంద్రియములు, అహంకారము ప్రతీత్యనుసారము భాసకకోటిప్రవిష్టములువలె కనబడుచున్నను వస్తుతఃవీనికి భాస్యత్వరూపమగు అనాత్మధర్మమే కలదని సూచిత మైనది. ॥౧॥

—• ౧౩ వ అధ్యాయము ౨ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు దేహేన్ద్రియాదివిలక్షణము, స్వప్రకాశము నగు క్షేత్రజ్ఞుని చెప్పి, అట్టి క్షేత్రజ్ఞునకు పారమార్థికతత్త్వమును, సంసారియు నగు పరమాత్మతో నైక్య మును శ్రీకృష్ణపరమాత్మ "క్షేత్రజ్ఞం" అనుదానిచే చెప్పుచుండెను.

సర్వక్షేత్రములయందు స్వప్రకాశచైతన్యస్వరూపము, నిత్యము, విభువు నగు క్షేత్రజ్ఞుడు ఒకడే. ఓభరతాన్వయసంభూతుఁడా! అవిద్యాధ్యధ్యారోపితకర్తృత్వభోక్తృత్వాదిసంసారధర్మములు కల యాక్షేత్రజ్ఞుని అవిద్యకరూపపరిత్యాగముచే అసంసారి, అద్వితీయబ్రహ్మానందరూపము, ఈశ్వరుడు నగు నాస్వరూప ముగ తెలిసికొనుము. క్షేత్రము మాయాకల్పితము, మిథ్య యనియు, క్షేత్రజ్ఞు డన్ననో పరమార్థసత్యము, తద్భ్ర

శాంకరభాష్యమ్:—

పాధిభేదం సదసదాదిశబ్దప్రత్యయాగోచరం విద్ధీత్యభిప్రాయః । హే భారత! యస్మాత్క్షేత్రక్షేత్రజ్ఞేశ్వరయాథాత్మ్యవ్యతిరేకేణ న జ్ఞానగోచర మన్య దవశిష్ట మస్తి తస్మా త్క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞేయభూతయో ర్యజ్జ్ఞానం క్షేత్రక్షేత్రజ్ఞౌ యేన జ్ఞానేన విషయీక్రియేతే తజ్జ్ఞానం సమ్యగ్జ్ఞాన మితి మత మభిప్రాయో మమేశ్వరస్య విష్ణోః ॥

(2) నను సర్వక్షేత్రే ష్వేక ఏవేశ్వరో నాన్య స్తద్వ్యతిరిక్తో భోక్తా విద్యతే చేత్తత ఈశ్వరస్య సంసారిత్వం ప్రాప్త మీశ్వరవ్యతిరేకేణ వా సంసారిణోఽన్యస్యాభావా త్సంసారాభావప్రసంగస్తచ్చోభయ మనిష్టం బంధమోక్షతద్ధేతుశాస్త్రానర్థక్యప్రసంగా త్ప్రత్యక్షాదిప్ర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వశ్లోకమునందు క్షేత్రక్షేత్రజ్ఞులు చెప్పబడెను. ఇట్టి జ్ఞానముచేతనే క్షేత్రక్షేత్రజ్ఞులు తెలిసికొనదగినవారా? కాదు. పూర్వమునందు చెప్పబడిన లక్షణములు కల క్షేత్రజ్ఞుని, క్షేత్రమును (నిఖిలప్రపంచమును) అసంసారి యగు నాస్వరూపముగనే తెలిసికొనుము. సర్వక్షేత్రములయందు బ్రహ్మాదిస్తంబపర్యన్తానేక క్షేత్రోపాధిప్రవిభక్తుడైన క్షేత్రజ్ఞుని, నిఖిలక్షేత్రములను నేయుపాధిభేదములేనట్టి, సదసదాదిశబ్దప్రత్యయాగోచరమైనట్టి పరబ్రహ్మముగనే తెలిసికొనుము. అని యాశయము.

ఓయర్జున! క్షేత్రక్షేత్రజ్ఞగోచరమైన యాథాత్మ్యముకంటె వేరుగ తెలిసికొనదగినది లేదు. అందువలన జ్ఞేయము లగు క్షేత్రక్షేత్రజ్ఞుల యేజ్ఞానము కలదో అనగా క్షేత్రక్షేత్రజ్ఞులేజ్ఞానముచే విషయముగ చేసుకొనబడెదరో యట్టి "క్షేత్రక్షేత్రజ్ఞులు పరమాత్మస్వరూపము" అను జ్ఞానము సమ్యగ్జ్ఞాన మని యీశ్వరుడనగు శ్రీవిష్ణువునైన నాయొక్క యభిప్రాయము.

(2) "క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి" అనుదానిచే జీవేశ్వరుల కేకత్వము చెప్పబడెను. అట్టి జీవేశ్వరుల కేకత్వము సంభవింపదు, ఎందువలననిన: సర్వక్షేత్రములయం దుండువాడీశ్వరు డొక్కడే యగుచో యీశ్వరునికంటె వేరుగ భోక్తలే లేనిచో నీశ్వరునికి సంసారిత్వము ప్రాప్తించును. ఈశ్వరవ్యతిరిక్తముగ సంసారి మరియొకడు లేనందున సంసారమే లేక పోయెడిని. ఈశ్వరునికి సంసారిత్వము, లేకసంసారాభావము అనెడి యీయుభయ మనిష్టమే. బంధమోక్షతద్ధేతుశాస్త్రానర్థక్యము, ప్రత్యక్షాదిప్రమాణవిరోధము ప్రాప్తించును. ప్రత్యక్షప్రమాణముచే సుఖదుఃఖతద్ధేతుస్వరూపసంసారము ప్రత్యక్షమే. జగద్వైచిత్ర్యోపలబ్ధివలన ధర్మాధర్మనిమిత్త మగు సంసార మూహింపబడుచున్నది. అనగా జగత్తునందు వైచిత్ర్యము కానవచ్చుటవలన నది ధర్మాధర్మహేతుక మనియు, నద్దానివలన సంసార మనునది యొకటి

మాధిష్ఠానము అనెడి క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క యేజ్ఞానము కలదో అదియే మోక్షసాధన మగుటవలన "జ్ఞానం" అవిద్యావిరోధియై ప్రకాశరూపమని నామతము. యితరమగునది యజ్ఞానావిరోధియగుటవలన నజ్ఞానమే యని నాయభిప్రాయము. జీవేశ్వరులకు భేద మావిద్యకము, పారమార్థిక మభేదమే యనుటయందు

శాంకరభాష్యమ్:—

మాణవిరోధాచ్చ। ప్రత్యక్షేణ తావ త్సుఖదుఃఖతద్ధేతులక్షణః సంసార ఉపలభ్యతే। జగ ద్వైచిత్ర్యోపలబ్ధేశ్చ ధర్మాధర్మనిమిత్త స్సంసారోఽనుమీయతే। సర్వ మేత దనుపపన్న మాత్మే శ్వరైకత్వే ॥

(3) న, జ్ఞానాజ్ఞానయో రన్యత్వే నోపపత్తేః। "దూర మేతే విపరీతే విషూచీ అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా।" తథా చ తయో ర్విద్యావిద్యావిషయయోః ఫలభేదోపి విరుద్ధో నిర్దిష్టః శ్రేయశ్చ ప్రేయ శ్చేతి। విద్యావిషయః శ్రేయః ప్రేయస్త్వవిద్యాకార్య మితి। తథా చ వ్యాసః— "ద్వా విమా వథ పంథానౌ" ఇత్యాది "ఇమౌ ద్వా వేవ పంథానౌ"

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కలదని యనుమానప్రమాణమువలన సంసారము సిద్ధించుచున్నది. జీవేశ్వరుల కేకత్వమే యంగీకరించినచో యీసర్వ మనుపపన్నము కానేరదు. (అందుచే జీవేశ్వరులకు భేదమే యంగీక రింపవలయును.)

(3) జ్ఞానాజ్ఞానములు స్వరూపమువలనను, ఫలమువలనను భిన్నములగుటచే సర్వ ముప పన్న మగుచుండుటవలన నైవిధమున ప్రశ్నింపవలదు. "దూర మేతే విపరీతే విషూచీ అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా" అవిద్య, విద్య యను రెండును పరస్పరభిన్నములు, విరుద్ధఫలము కలవి యని శ్రుతి బోధించుచున్నది. "శ్రేయశ్చ ప్రేయశ్చ" అని విద్యకు శ్రేయస్సు ఫల మనియు, అవిద్యకు ప్రేయస్సు ఫలమనియు విరుద్ధమగు ఫలభేదముకూడ చూపబడెను. ఈవిషయమునే వ్యాసభగవానులుకూడ "ద్వా విమా వథ పన్థానౌ" "ఇమౌ ద్వావేవ పన్థానౌ" అనియు చెప్పియుండెను. ఇచట (గీతాశాస్త్రమునందు) కర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠ యని రెండు నిష్ఠలు శ్రీకృష్ణపరమాత్మచే చెప్పబడెను. అట్లగుచో నారెండును యుపాదేయములే యనె దవా? యని శకింపజనదు. అవిద్య తన కార్యముతోకూడ విద్యచే నశింపజేయదగిన దని శ్రుతి స్మృతిన్యాయములవలన తెలియబడుచున్నది, "ఇహ చే దవేదీ దథ సత్య మస్తి న చే దిహా వేదీ న్మహతీ వినష్టిః" బ్రతికియుండగనే యాత్మస్వరూపమును తెలిసికొనినచో సత్యస్వరూ పమై యుండును. అట్లాత్మస్వరూపమును తెలిసికొననిచో గొప్ప వినాశము ప్రాప్తించును. అని యీవిషయమునే యీశ్రుతి బోధించుచున్నది. "త మేవం విద్వా నమృత ఇహ భవతి" పరమాత్మను తెలిసికొనినవాడు యీలోకమునందే ముక్తుడగుచున్నాడు. "నాన్యః పంథా విద్యతేఽయనాయ" మోక్షము కొఱకు జ్ఞానముకంటె మరియొకమార్గము లేదు. "విద్వా న్న బిభేతి కుతశ్చ నేతి" విద్వాంసుడు దేనివలనను భయపడడు. అనగా విద్వాంసునకు భయ కారణమేదియు లేదని యాశయము. అవిద్వాంసున కన్ననో "అథ తస్య భయం భవతి"

యుక్తులు శ్రీశంకరభగవత్పాదులచే భాష్యమునం దనేకము వర్ణింపబడెను. గ్రంథవిస్తరభయమువలనను, పూర్వమునందే యట్టియుక్తులు అనేకవిధముల మాచే చెప్పబడుటవలనను యిచట అట్టి యుక్తులు చెప్పబడలేదు.

॥౨॥

శాంకరభాష్యమ్:—

ఇత్యాది చ। ఇహ చ ద్వే నిష్ఠే ఉక్తే। అవిద్యా చ సహకార్యేణ విద్యయా హాతవ్యేతి శ్రుతిస్మృతిన్యాయేభ్యోఽవగమ్యతే। శ్రుతయ స్తావత్— "ఇహ చే దవేదీ దథ సత్య మస్తి న చే దిహావేదీ న్మహతీ వినష్టిః, త మేవం విద్వా నమృత ఇహ భవతి, నాన్యః పంథా విద్యతేఽయనాయ, విద్వా న్న బిభేతి కుతశ్చన, అవిదుషస్తు— అథ తస్య భయం భవతి, అవిద్యాయా మంతరే వర్తమానాః, బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి, అన్యోఽసా వన్యోహ మస్మీతి న స వేద యథా పశు రేవం స దేవానామ్, ఆత్మవి ద్యః స ఇదం సర్వం భవతి, యదా చర్మవత్" ఇత్యాద్యాః సహస్రశః। స్మృతయశ్చ— 'అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః, ఇహైవ తై ర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః, సమం పశ్య న్హి సర్వత్ర' ఇత్యాద్యాః॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈపరమాత్మయం దించుకేని భేదము నెవడు చేయునో అనగా పరమాత్మ వేరు నేను వేరు అనియించుకేని భేదమును తెలిసికొనునో అట్టి భేదదర్శికి భయము ప్రాప్తించును. "అవిద్యాయా మన్తరే వర్తమానా స్స్వయం ధీరాః పండితం మన్యమానాః। దంధ్రమ్యమానాః పరియన్తి మూఢాః అన్ధేనైవ నీయమానా యథాన్ధాః" అజ్ఞానాంధకారమునందు మునిగినవారై, స్వయంధీరులై, ఆత్మజ్ఞానములేని తమను ఆత్మజ్ఞానవంతులుగ తలచువారగు మూఢులు దంధ్రమ్యమాణులై యంధునిచే తీసుకువెళ్లబడు యంధులువలె సంసారమనెడి కూపము నందు ప్రవేశించుచుండిరి. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" బ్రహ్మమును తెలిసికొనినచో బ్రహ్మమే యగును. "అన్యోఽసా వన్యోఽహ మస్మీతి న స వేద యథా పశు రేవం స దేవానామ్" పరమాత్మ వేరు, నేను వేరు అయితిని. అను జ్ఞానము కలవాడు పరమాత్మను తెలిసికొనినవాడు కాడు. మనచే నీయబడిన తృణాదులను భక్షించి చతుష్పాత్పశువు లెట్లు సంతసించుచుండునో యట్లే యట్టి యనాత్మజ్ఞుడు దేవతలకు పశువు. అనగా దేవతలచే నీయబడిన భోగముల ననుభవించుచు వారల కుపకృతి నాచరించుచు సంతసించుచుండును. "ఆత్మవి ద్యః స ఇదం సర్వం భవతి" ఎవ డాత్మను తెలిసికొనునో వా డీసర్వరూపుడగును. "యదా చర్మవత్" ఆత్మజ్ఞానము లేనిదే మోక్షమునకు యత్నించువాడు ఆకాశమును చర్మమువలె చుట్టుటకు యత్నించువాడే యగును. అనగా చర్మను చుట్టునటుల యాకాశమును చుట్టుట యెట్లు సంభవము కాదో యట్లే యాత్మజ్ఞానము లేనిదే మోక్షమును పొందుట శక్యము కాదని యాశయము. ఇట్టి శ్రుతులు వేలతరబడి కలవు.

"అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః" అజ్ఞానముచే జ్ఞాన మావరింపబడెను. అందుచే జీవులు మోహమును పొందుచుండిరి. "ఇహైవ తై ర్జిత స్సర్గో యేషాం సామ్యే

శంకరానందీయము:— ఇట్లు యీశరీరము క్షేత్రము, దీని నెవడు తెలిసికొనుచుండెనో వాడు క్షేత్రజ్ఞుడు నని అనాత్మయొక్కయు, ఆత్మయొక్కయు స్వరూపమును గృహ, ప్రదీపములవలె వేరుపరచి చూపి బ్రహ్మమునకు పరోక్షత్వ, సద్వితీయత్వనివృత్తికొఱకును, ఆత్మ కాత్యన్తికసంసారినివృత్తికొఱకును, అనం

శాంకరభాష్యమ్:—

(4) న్యాయత శ్చ— సర్పా న్కుశాగ్రాణి తథోదపానం జ్ఞాత్వా మనుష్యాః
వర్జయంతి । అజ్ఞానత స్తత్ర పతంతి కేచి జ్జ్ఞానే ఫలం పశ్య యథావిశిష్టమ్ । తథా చ దేహ
ష్వాత్మబుద్ధి రవిద్వా న్రాగద్వేషాదిప్రయుక్తో ధర్మాధర్మానుష్ఠానకృ జ్జాయతే మ్రియతే
త్యవగమ్యతే, దేహాదివ్యతిరిక్తాత్మదర్శినో రాగద్వేషాదిప్రహాణాపేక్షధర్మాధర్మప్రవృత్త్యుపశమ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

స్థితం మనః" ఎవరి మనస్సు సామ్యమునం దుంచబడెనో యట్టి వారలచే సృష్టి (సంసారమ
జయింపబడెను. "సమం పశ్యన్హి సర్వత్ర" నిఖలప్రపంచమును బ్రహ్మముగ తెలిసికొ
వాడు. ఇట్టి స్మృతులును యనేకము యజ్ఞానివిషయముగను, జ్ఞానివిషయముగను కలవు.

(4) "సర్పా న్కుశాగ్రాణి తథోదపానం జ్ఞాత్వా మనుష్యాః పరివర్జయన్తి । అజ్ఞాన
స్తత్ర పతన్తి కేచి జ్జ్ఞానే ఫలం పశ్య యథావిశిష్టం" మనుష్యులు సర్పములను, కుశాగ్రములన
పాడుభావులను "ఇవి సర్పములు, ఇవి కుశాగ్రములు, ఇది పాడుభావి" అని యథార్థము
తెలిసికొని వాటిని విడిచెదరు. అనగా సర్పములను తెలిసికొని వాటికి దూరముగ పోయెదర
కుశాగ్రములను తెలిసికొని వాటిమీదనుండి నడవక దూరముగ తొలిగెదరు, పాడుభా
యిచట యున్నదని తెలిసికొని యామార్గమును విడిచెదరు. కొందరు ఇది సర్పమని, ఇ
కుశాగ్రములని, ఇది పాడుభావియని తెలిసికొనక యజ్ఞానమువల్ల యామార్గముల వెంట
నడచి ప్రమాదమును పొందెదరు. కాన జ్ఞానమునం దెట్టి విశేషఫలము కలదో తెలిసికొనుమ
అట్లే దేహాదులయం దాత్మబుద్ధికలవా డవిద్వాంసు డనబడును. అట్టి యజ్ఞాని రాగద్వేషా
ప్రయుక్తుడై ధర్మాధర్మముల నాచరించువాడై పుట్టుచు, గిట్టుచునుండు నని తెలియుచున్న
ఆత్మ దేహేన్ద్రియాదులకంటె వేరు, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము, ఏకము, అను జ్ఞానము క
వానికి రాగద్వేషాదులు లేమింజేసి ధర్మాధర్మములయందు ప్రవృత్తియే సంభవింపదు. ధరా
ధర్మములయందు ప్రవృత్తి లేమింజేసి ధర్మాధర్మనిమిత్తమైన దేహాదులు సంభవింపవు. కా
నట్టి యాత్మతత్త్వవేత్తలు ముక్తు లగుదురు. న్యాయప్రాప్తమైన యీవిషయము నెవరును కా
నలేరు. పైన్యాయమువలన విషయ మిట్లు ప్రాప్తించుచుండ క్షేత్రజ్ఞు డీశ్వరస్వరూపమే యై
యుండ యవిద్యాకృతమైన యుపాధుల భేదమువలన క్షేత్రజ్ఞునకు తనకు దేహాద్యాత్మత
మెటులో యట్లే సంసార ముండినటుల యగుచున్నది. నిజము విచారించినచో క్షేత్రజ్ఞున
సంసారము లేదు. సర్వప్రాణులకు యనాత్మలగు దేహాదులయం దజ్ఞానమువల్ల నిశ్చితమై
యాత్మభావము ప్రసిద్ధమే. అది యెట్లనిన? స్థాణువునందు (మొద్దునందు) ఇది పురుషుడ

దరూపత్వసిద్ధికొఱకును, క్షేత్రజ్ఞుడగు నాత్మకు, శ్రుత్యాదిప్రమాణసిద్ధబ్రహ్మభిన్నత్వమును శ్రీకృష్ణపరమాత
"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" యనుదానిచే ప్రతిపాదించుచుండెను.

"భాయా మఖండవృత్తావేవ సదా రమత ఇతి భారతః హేభారత!" అఖండాకారవృత్తియం దెల్లపుడ
క్రీడించు నోయర్జునా! చెప్పబడిన లక్షణములుకల బ్రహ్మాదిస్తంబపర్యన్తశరీరములయందు యెవ డాయా క్షేత్ర
తద్ధర్మ, తత్కార్మ, తదవస్థలను తెలిసికొనువాడై, ఒకడేయై, పరిపూర్ణుడైనను ఘటాదులచే నాకాశమువ

శాంకరభాష్యమ్:—

న్నుచ్యంత ఇతి న కేనచి త్ప్రత్యాఖ్యాతుం శక్యం న్యాయతః । తత్రైవం సతి క్షేత్రజ్ఞ స్యేశ్వరస్యైవ సతోఽవిద్యాకృతోపాధిభేదతః సంసారిత్వ మివ భవతి । యథా దేహాద్యాత్మత్వ మాత్మనః । సర్వజంతూనాం హి ప్రసిద్ధో దేహాది ష్వనాత్మ స్వాత్మభావో నిశ్చితోఽవిద్యాకృతః. యథా స్థాణౌ పురుషనిశ్చయః । న చైతావతా పురుషధర్మః స్థాణో ర్భవతి స్థాణుధర్మో వా పురుషస్య; తథా న చైతన్యధర్మో దేహస్య, దేహధర్మో వా చేతనస్య । సుఖదుఃఖమోహాత్మకత్వాది రాత్మనో న యుక్తోఽవిద్యాకృతత్వావిశేషాజ్జరామృత్యువత్ । నాతుల్యత్వా దితిచేత్,

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అను నిశ్చయ మెట్లో యట్లే దేహేంద్రియాదు లాత్మ యనునిశ్చయముకల్గును. "ఇది పురుషుడు" అను నిశ్చయ ముండినను స్థాణుధర్మము పురుషునకు, పురుషధర్మము స్థాణువునకు సంభవింపదు. అట్లే చైతన్యధర్మము దేహేంద్రియాదులకు, దేహేంద్రియాదిధర్మము చేతనునకు (ఆత్మకు) సంభవింపవు. అవిద్యాకృతములగుటవలన జరామరణాదు లెట్లాత్మధర్మములు కావో అట్లే సుఖదుఃఖమోహాదులు వికృతములగుటంజేసి యవియు నాత్మధర్మములు కానేరవు.

—• పూర్వపక్షము •—

స్థాణువును చూచి 'ఇది పురుషుడు' అను భ్రాంతి స్థలమున భ్రాంతివిషయమైన స్థాణుపురుషు లిరువురు జ్ఞేయములు. ఇట్టి భ్రాంతి కల జ్ఞాత వేరు. దేహాత్మభ్రాంతియం దన్ననో జ్ఞాతకే దేహాత్మభ్రాంతి. దేహము జ్ఞేయము. అనగా జ్ఞేయజ్ఞాతలకే పరస్పరాధ్యాస (భ్రాంతి) కాన స్థాణుపురుషదృష్టాంతము విషమము (సరిపడదు.) కాన దేహధర్మము జ్ఞేయమైనను ఆత్మకు సంభవించునని శంకింపజనదు.

స్వయముగ నవిద్యచే స్వాత్మయందు కల్పితమైన ఆయా యుపాధులచేతను, సుఖదుఃఖాదిప్రత్యయములచేతను, విభక్తుడువలె ప్రతిశరీరమునందు "అహ మహం" అనెడి అహంప్రత్యయార్థముగ సర్వప్రత్యయసాక్షియై ప్రత్యగ్లక్షణముగ నుండెనో యట్టి క్షేత్రజ్ఞుని చెప్పఁబడిన లక్షణముచే నిఖిలక్షేత్రములనుండి లెస్సగ విభక్తమైనట్టి, తత్తదుపాధి, తద్ధర్మ, తత్కార్మాదుల సంబంధములేనట్టి, తత్తచ్ఛబ్దప్రత్యయాగోచరమైనట్టి, ఆకాశమువలె నిరాకారమైనట్టి, నిర్వికారము, నిరంజనము, కూటస్థాసంగచిద్రూపము, ఆత్మస్వరూపము, సర్వశ్రుతిప్రసిద్ధము, సత్యజ్ఞానానందస్వరూపము, నిర్విశేషము నగు పరబ్రహ్మమునుగ దెలిసికొనుము. అనగా "అయ మాత్మా బ్రహ్మ" అను శ్రుతి ననుసరించి క్షేత్రజ్ఞుడు పరబ్రహ్మమేయని తెలిసికొనుమని యర్థము. క్షేత్రముకంటె విభక్తమైన క్షేత్రజ్ఞుని నన్నుగ యెట్లు తెలిసికొంటివో యట్లే క్షేత్ర మవిద్యాకార్య మగుటవలన స్వతః సత్త లేమింజేసి యధిష్ఠాన మగు బ్రహ్మమునందు కల్పితమైన క్షేత్రమునుకూడ నాస్వరూపముగనే తెలిసికొనుము. ఇట "అపి" అను శబ్దము క్షేత్రమునకు క్షేత్రజ్ఞునివలె బ్రహ్మాభిన్నత్వమును బోధించుచున్నది. అట్లు కానిచో ద్వైతహేతువగు దేహాదిప్రపంచము వేరుగ నున్నచో బ్రహ్మ కద్వితీయత్వము సిద్ధింపనేరదు. బ్రహ్మ కద్వితీయత్వమే సిద్ధింపనిచో అద్వైతశ్రుతివిరోధము సంభవించెడిని. కాన "క్షేత్రజ్ఞంచ, క్షేత్రమపి మాం విద్ధి" క్షేత్రజ్ఞుని క్షేత్రమునుగూడ నాస్వరూపముగ తెలిసికొనుము. అని క్షేత్రజ్ఞక్షేత్రములకు బ్రహ్మత్వప్రతిపాదనము యుక్తమే. ఈచెప్పుటచే తనచే నపేక్షింపబడిన ప్రయోజనము క్షేత్ర

శాంకరభాష్యమ్:—

స్థాణుపురుషౌ జ్ఞేయావేవ సంతౌ జ్ఞాత్రాఽన్యోన్యస్మిన్నధ్యస్తావవిద్యయా దేహాత్మనోస్తు జ్ఞేయజ్ఞాత్రోరేవేతరేతరాధ్యాస ఇతి న సమో దృష్టాంతోఽతో దేహధర్మో జ్ఞేయోఽపి జ్ఞాతురాత్మనో భవతీతి చేత్ । న, అచైతన్యాదిప్రసంగాత్ । యది హి జ్ఞేయస్య దేహాదేః క్షేత్రస్య ధర్మాః సుఖదుఃఖమోహేచ్ఛాద్వేషాదయో జ్ఞాతురాత్మనో భవంతి తర్హి జ్ఞేయస్య క్షేత్రస్య ధర్మాః కే చనాత్మనో భవంత్యవిద్యాధ్యారోపితా జరామరణాదయస్తు న భవంతీతి విశేషహేతుర్వక్తవ్యః । న భవంతీత్యస్త్యనుమానమవిద్యాధ్యారోపితత్వాజ్జరామరణాదివదితి హేయత్వాదుపాదేయత్వాచ్చేత్యాది ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

—• సిద్ధాంతము •—

అట్లగుచో నాత్మ కచైతన్యము ప్రాప్తించెడిని. జ్ఞేయములగు దేహాదిక్షేత్రధర్మములగు సుఖదుఃఖమోహేచ్ఛాదులు జ్ఞాతకు సంభవించుటచే క్షేత్రధర్మావిశేషమువలన జరామరణాదులు కూడ క్షేత్రజ్ఞునకు ప్రాప్తించెడిని. అట్లంగీకరించినచో క్షేత్రజ్ఞున కచైతన్యము ప్రాప్తించెడిని. దేహధర్మములైనను సుఖదుఃఖమోహేచ్ఛాదులే క్షేత్రజ్ఞునకు ప్రాప్తించును. జరామరణాదులు ప్రాప్తింప వనుటయందేమియు హేతువు కాన్పింపదు. దేహధర్మములగు సుఖదుఃఖమోహేచ్ఛాదులు అవిద్యాధ్యారోపితములగుటవలన, హేయములగుటవలన, ఉపాదేయములగుటవలన జరామరణాదు లాత్మధర్మములు కానట్లు యవియు నాత్మధర్మములు కావనుటయందు పై హేతుత్రయము కలదు. ఇంకను దృశ్యత్వజడత్వములు హేతువులు కలవు

క్షేత్రజ్ఞులకు బ్రహ్మాభిన్నత్వజ్ఞానదృఢీకరణమువలన క్షేత్రము, క్షేత్రజ్ఞుడు సర్వము బ్రహ్మమే యని సిద్ధమగుచున్నది. ఈవిషయమునే "భోక్తా, భోజ్యం, ప్రేరితారం చ మత్వా సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మమేతత్" "వాసుదేవాత్మకా న్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవ చ" అను శ్రుతిస్మృతులు బోధించుచున్నవి.

క్షేత్రక్షేత్రజ్ఞులకు బ్రహ్మమాత్రత్వ మిష్టమేయగుచో "సర్వం బ్రహ్మైవ" (సర్వము బ్రహ్మస్వరూపమే) అనువాక్యము చేతనే సర్వమునకు బ్రహ్మమాత్రత్వము సిద్ధించుచుండ "ఇదం శరీరం కౌన్తేయ" ఇత్యాది గ్రంథగౌరవముచే నేమి ప్రయోజనమని శంకింపఁజనదు. "ఇదం శరీరం క్షేత్రం" అని ప్రకృతి, ప్రాకృత మగు నిఖిలదృశ్యజాతము క్షేత్రమేయని యనాత్మస్వరూపమును నిరూపించి "ఏతద్యో వేత్తి సః క్షేత్రజ్ఞః" (దీని నెవడు తెలిసికొనునో వాడు క్షేత్రజ్ఞుడని) క్షేత్రజ్ఞుడగు యాత్మకు క్షేత్ర, తద్ధర్మ తత్కార్య, తదవస్థాసంబంధలేశరాహిత్య ముపపాదింపబడ క్షేత్రముకంటె భిన్నము, అకర్త, అభోక్త, అవిక్రియము, కూటస్థాసంగచిద్రూపము నగు క్షేత్రజ్ఞుని తననుగ సాక్షాత్తు తెలిసికొనినట్లైయు, మంచిచెడ్డల కుపయోగించు దేహేంద్రియాది వ్యాపారములకు సర్వదా తటస్థునిగ తనను ప్రత్యగ్వృత్తిచే తెలిసికొనిన విద్వాంసునకు క్షేత్రధర్మములగు కర్తృత్వభోక్తృత్వాదులచేతను, జరారోగాదులచేతను, తత్కార్మలచేతను, పుణ్యాపాపములచేతను, పుణ్యాపాపములచే ప్రాప్తించెడి మానావమానములచేతను, విక్షేపము సంభవింపదు. ఇట్లు జీవన్ముక్తిసుఖము, ఆగామిసంచితాదిసర్వకర్మక్షయము సిద్ధించును. "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అను న్యాయ

శాంకరభాష్యమ్:—

(5) తత్రైవం సతి కర్తృత్వభోక్తృత్వలక్షణ స్సంసారో జ్ఞేయస్థో జ్ఞాత ర్యవిద్యయాధ్యారోపిత ఇతి న తేన జ్ఞాతుః కించి ద్దుష్యతి । యథా బాలై రధ్యారోపితేనాఽఽకాశస్య తలమలినత్వాదినా । ఏవం చ సతి సర్వక్షేత్రే ష్వపి సతో భగవతః క్షేత్రజ్ఞ స్యేశ్వరస్య సంసారిత్వగంధమాత్ర మపి నాఽఽశంక్యమ్ । న హి క్వచి దపి లోకేఽవిద్యాధ్యస్తేన ధర్మేణ కస్యచి దుపకారోఽపకారో వా దృష్టః । యత్తూక్తం న సమో దృష్టాంత ఇతి । తదసత్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(5) జరామరణాదులువలె సుఖదుఃఖమోహాదులుకూడ నాత్మధర్మములు కానిచో క్షేత్రజ్ఞునకు వాస్తవికమగుసంసారిత్వమే సిద్ధించుచున్నది. కర్తృత్వభోక్తృత్వరూప మగు సంసారము జ్ఞేయస్థమై జ్ఞాతయం దవిద్యచే నధ్యారోపితము కాన నదానిచే జ్ఞాత కొంచెమైననుదూషితుడు కానేరడు. బాలురచే నధ్యారోపితమైన తలమలినత్వాదులచే నాకాశము కొంచెమైనను దూషితము కానటుల నని గ్రహింప నగును. సంసారము క్షేత్రధర్మమే యయి యుండ సర్వక్షేత్రములయందుండు భగవంతు డగు నీశ్వరస్వరూపమైన క్షేత్రజ్ఞునకు సంసారలేశమైన సంభవించు నని శంకింపజనదు. లోకమునం దెచ్చటనైన నవిద్యచే నధ్యస్థమైన ధర్మముచే దేనికైన నుపకారముగాని, యపకారముగాని చూడబడుటలేదు.

స్థాణువునందు పురుషనిశ్చయమువలె నాత్మకు దేహాదులయం దాత్మత్వనిశ్చయమున కధ్యస్తత యుక్తము కాదు ఎందువలననిన? దృష్టాంతము జ్ఞేయమాత్రమగు స్థాణుపురుషమాత్రవిషయము. దార్ష్టాంతికము జ్ఞేయజ్ఞాతృవిషయము కాన స్థాణువున పురుషాధ్యాసను శరీరాదులయం దాత్మత్వాధ్యాసకు దృష్టాంతముగ చెప్పుట విషమదృష్టాంత మనిశంకింపజనదు.

ముచే క్షేత్రమును, క్షేత్రజ్ఞుడగు తనను, సర్వమును బ్రహ్మస్వరూపముగనే చూచువానికి ద్వైతజ్ఞానము లేనందున యెల్లపుడు వాసనాక్షయము, మనోనాశము సిద్ధించును. అనంతరము ప్రారబ్ధకర్మక్షయానంతమున విదేహకైవల్యమును, తత్సుఖము సిద్ధించును. అని యీయర్థమునే సూచించుటకొఱకు క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క విభాగమును, వానికి బ్రహ్మమాత్రత్వమును చెప్పి యిపుడు క్షేత్రక్షేత్రజ్ఞులకు బ్రహ్మభిన్నత్వదర్శనరూప మగు జ్ఞానము ముక్తికి పరమకారణమని "క్షేత్రక్షేత్రజ్ఞయోః" ఇత్యాది వాక్యముచే నిశ్చయించుచుండెను.

విచారింప పురుషుడు ప్రకృతికంటె భిన్నుడు, తద్గుణకర్మసంబంధలేశశూన్యుడు, సదా అసంగచిద్రూపుడు, అనెడి ప్రకృతిపురుషుల పరస్పరభిన్నత్వవిజ్ఞానము ముక్తికి పరమకారణమని సాంఖ్యులు తలచెదరు.

అట్లగుచో ప్రకృతిసాన్నిధ్యమువలన బాధితానువృత్తిచే పురుషునకు పునఃపునః సంసారము కొంబడిచును. నిశ్శేషముగ నివర్తింపనేరదు. బ్రహ్మస్వరూపముగ నవస్థానరూపమోక్షు మనగ నిశ్శేషముగ సంసారనివృత్తి కదా! "నిరంజనః పరమం సామ్య ముపైతి" ఇత్యాదిశ్రుతిసిద్ధము. ఇట్టి మోక్షము పరావరైకత్వజ్ఞానైకలభ్యము, "తస్మి న్దృష్టే పరావరే" అను శ్రుతిసిద్ధము. కాన పరావరైకత్వజ్ఞానము నిశ్శేషసంసారధ్వాంతవిధ్వంసకము, విదేహముక్తికి పరమకారణము అని తలచి "క్షేత్రక్షేత్రజ్ఞయోః" అని చెప్పెను. ప్రకృతిపురుషులయొక్క యాథాత్మ్యజ్ఞానము (తెలిసికొనుట) అనగా యీసర్వము, నేను బ్రహ్మస్వరూపమే.

శాంకరభాష్యమ్:—

కథమ్— అవిద్యాధ్యాసమాత్రం హి దృష్టాంత దార్ష్టాంతికయోః సాధర్మ్యం వివక్షితమ్। తన్న వ్యభిచరతి। యత్తు జ్ఞాతరి వ్యభిచరతీతి మన్యసే తస్యా ప్యనైకాంతికత్వం దర్శితం జరాదిభిః। అవిద్యావత్త్వా త్క్షేత్రజ్ఞస్య సంసారిత్వ మితిచే న్న, అవిద్యాయా స్తామసత్వాత్। తామసో హి ప్రత్యయః ఆవరణాత్మకత్వా దవిద్యావిపరీతగ్రాహకః, సంశయః తదుపస్థాపకో వా అగ్రహణాత్మకో వా।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎట్లనిన? అవిద్యాధ్యాసమాత్రమే దృష్టాంతదార్ష్టాంతికములకు సాధర్మ్యముగ వివక్షితము. అట్టి యవిద్యాధ్యాస రెండు స్థలములయందును వ్యభిచరింపదు. స్థాణువునందు పురుషాధ్యాసయు యవిద్యాధ్యాసయే. శరీరాదులయం దాత్మాధ్యాసయు యవిద్యాధ్యాసయే. కాన రెండుస్థలములయందు నవిద్యాధ్యాసయే యగుటవలన నీధర్మ ముభయత్ర యుండుటవలన శరీరాదులయం దాత్మాధ్యాసకు స్థాణువునందు పురుషాధ్యాసను దృష్టాంతముగ జెప్పుట సమదృష్టాంతమే కాని, విషమదృష్టాంతము కాదు. జ్ఞేయాంతరమునందు జ్ఞేయమున కారోప మనెడి నియమమువలన జ్ఞాతయం దారోపము సంభవింప దని శంకింపజనదు. సుఖదుఃఖాదులయధ్యాసవలె జరామరణాదుల యధ్యాసయు జ్ఞాతయందు సంభవించు నని పూర్వమునందే చెప్పియుండుటచే జ్ఞేయాంతరమునందు జ్ఞేయమునకే యధ్యాస యను నియమము వ్యభిచరించుచున్నది. కాన పూర్వోక్తాశంక కవకాశము లేదు.

అట్లగుచో క్షేత్రజ్ఞు డవిద్యావంతుడగుటవలన సంసారి కావలసివచ్చు నని శంకింపజనదు.

అవిద్య తామసమగుటవలన పూర్వోక్తాశంకకు తావు లేదు. అనగా అవిద్య యనగ విపరీతగ్రాహాదికమా? అనాద్యనిర్వాచ్యాజ్ఞానమా? విపరీతగ్రాహాదిక మనెదవా? అట్టి విపరీతగ్రాహాదికము తమశ్శబ్దితానిర్వాచ్యాజ్ఞానకార్యమగుటవలన నది యజ్ఞానమునందే యుండును కాని, యాత్మయం దుండదు.

అను ప్రత్యగ్దృష్టిచేనైన క్షేత్రమునకు, క్షేత్రజ్ఞునకు బ్రహ్మమాత్రత్వదర్శనము. ఇదియే సమ్యగ్జ్ఞానము. ఇది ఆత్యంతికసంసారనివృత్తి కారణమని సర్వజ్ఞుడను, ఈశ్వరుడను అగు నాయొక్క నిశ్చయము.

లేక, విజ్ఞానముచే క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క 'తత్త్వం' అనగా "జ్ఞాత, జ్ఞేయమనగు సర్వము బ్రహ్మస్వరూపమే." అను తత్త్వము తెలియబడునో అదియే బ్రహ్మస్వరూపమగు నాజ్ఞానము. అని నామతము. క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క అప్రతిబద్ధవృత్తిచే బ్రహ్మమాత్రత్వావగమనమే బ్రహ్మజ్ఞానము. అట్టిజ్ఞానమే కైవల్య కారణమని ఋషులయొక్క నిశ్చయము.

—◆ ద్వైతిపూర్వపక్షము ◆—

సర్వక్షేత్రములయం దుండు క్షేత్రజ్ఞుడగు నాత్మ బ్రహ్మస్వరూపమే. యని చెప్పుటవలన (జీవేశ్వరుల కేకత్వము చెప్పుటచే) ప్రత్యక్షాదిసర్వప్రమాణములకు విరోధము ప్రాప్తించును. కాన నట్టి యేకత్వము జీవేశ్వరులకు ప్రాప్తింప నేరదు.

శాంకరభాష్యమ్:—

(6) వివేకప్రకాశభావే తదభావాత్ తామసే చావరణాత్మకే తిమిరాదిదోషే సత్యగ్రహణాదే రవిద్యాత్రియ స్యోపలబ్ధేః । అత్రాహ — ఏవం తర్హి జ్ఞాతృధర్మో అవిద్యా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(6) అవిద్య- విపరీతగ్రాహకము, సంశయోపస్థాపకము, అగ్రహణాత్మకము గాని యగును. ఆవరణాత్మకత్వము వస్తువునందు సమ్యక్ప్రకాశప్రతిబంధకత్వమే యగును. వివేకప్రకాశ యున్నచో విపరీతగ్రహణాదికము సంభవింపనందున వివేకప్రకాశ లేనితరి విపరీతగ్రహణాదికము సంభవించుటచేతను, విపరీతగ్రహణాదికము నవిద్యాకార్యము, విద్యానివర్త్యమునగును. కాన నవిద్య యాత్మధర్మము కానేరదు. అనాద్యనిర్వాచ్యమగు కారణావిద్య

ప్రత్యక్షముగ జీవునకు కర్మనిబన్ధనమై జన్మ, మృత్యు, సుఖ, దుఃఖాదిరూపసంసారము కనుపించుచున్నది. అట్టి సంసారముతో గూడిన జీవునితో యీశ్వరున కేకత్వమే యున్నచో యీశ్వరునికంటె వేరుగ మరియొకభోక్త లేనందున యీశ్వరునికే సంసారము ప్రాప్తింపవలసివచ్చును. అట్లగుచో "అనశ్న న్నన్యో అభిచాకశీతి" (మరియొకడు కర్మఫలము ననుభవింపక సాక్షిగ చూచుచుండెను.) అనుమొదలగు శ్రుతులకు, ప్రత్యక్షమునకు విరోధము ప్రాప్తించెడిని. జీవు డీశ్వరాభిన్నుడగుచో జీవునికంటె భిన్నముగ నీశ్వరుడు లేనందున జీవునికే సర్వనియన్తృత్వము సంభవించెడిని. అట్లగుచో స్వతంత్రుడగు జీవునకు సంసారము యొక్క యనుపయోగము వలన సంసారమే లేకపోయెడిని. సంసారసంసారు లుభయులు లేనిచో ప్రత్యక్షవిరోధము, "కర్మానుగా న్యనుక్రమేణ దేహీ స్థానేషు రూపా ణ్యభిసంపద్యతే" (దేహి తనచే చేయబడిన కర్మల ననుసరించి యాయాస్థానములయందు క్రమముగ శరీరములను పొందును.) "తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి" (జీవేశ్వరులలో నొకడగు జీవుడు స్వకృతకర్మఫలము ననుభవించును.) అని బోధించెడి శ్రుతులకు విరోధము ప్రాప్తించును. మరియు "ద్వా సుపర్ణా సయుజా" ఇత్యాది జీవేశ్వరభేదబోధకశాస్త్ర (వేద) విరోధము ప్రాప్తించును. మరియు "మన్త్రేషు కర్మాణి కవయో యా న్యపశ్యన్ తాని త్రేతాయాం బహుధా సన్తతాని తా న్యాచరథ నియతం సత్యకామాః" ఇత్యాది కర్మశాస్త్రమునకు, "తరతి శోక మాత్మవిత్ । ఆత్మా వా అరే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మన్తవ్యః" ఇత్యాది జ్ఞానశాస్త్రమునకు నానర్థక్యము ప్రాప్తించును. మరియు జననాదులు కలవాడవగుటవలనను, కించిజ్ఞుడగుటవలనను, నికృష్టమైన యుపాధికలవాడగుటవలనను, నిత్యదుఃఖి యగుటవలనను, నియమ్యుడగుటవలనను జీవుడు యీశ్వరునికంటె వేరు, అను అనుమానమునకు విరోధమువలన జీవేశ్వరుల కేకత్వము సిద్ధింపనేరదు.

—♦ అద్వైతసిద్ధాంతము ♦—

అని శంకింపజనదు. జీవు డీశ్వరునికంటె వేరగుచో ననేకశ్రుతిస్మృతులకు విరోధము ప్రాప్తించును. అది యెట్లనిన? "అయ మాత్మా బ్రహ్మ" 'ప్రజ్ఞానం బ్రహ్మ' "అహం బ్రహ్మాస్మి" "త ద్వా ఏత ద్బ్రహ్మాఽద్వయం" "సదానన్దచిన్మాత్ర మాత్మైవ" "తదేత త్సత్య మాత్మా బ్రహ్మైవ బ్రహ్మాత్మైవ అత్ర హ్యేవ న విచికిత్స్యం సూక్ష్మా త్సూక్ష్మతరం నిత్యం తత్త్వమేవ త్వమేవ తత్ తత్త్వమసి" "స ఏకః" ఇత్యాదిశ్రుతులు జీవేశ్వరుల కద్వైతమును (ఏకత్వమును) బోధించుచున్నవి. జీవేశ్వరులకు భేదమే యొప్పినచో పైనుదహరించిన శ్రుతులకు విరోధము ప్రాప్తించును. మరియు "సోఽహం స చ త్వం స చ సర్వ మేతత్" "ఆత్మనో బ్రహ్మణో భేద మసన్తం కః కరిష్యతి" "ఏక స్స్వ మాత్మా పురుషః పురాణః"

శాంకరభాష్యమ్:—

న, కరణే చక్షుషి తైమిరికత్వాదిదోషోపలబ్ధేః । యత్తు మన్యసే జ్ఞాతృధర్మో అవిద్యా తదేవ చావిద్యాధర్మవత్త్వం క్షేత్రజ్ఞస్య సంసారిత్వం, తత్ర యదుక్తమ్— "ఈశ్వర ఏవ క్షేత్రజ్ఞో న సంసారీ" ఇత్యేత దయుక్త మితి ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యనిర్వాచ్య మగుటవలననే యాత్మధర్మము కానేరదు. మఱియు తిమిరాది దోష ముండినచో అగ్రహణ విపరీతగ్రహణాదికము సంభవించును. తిమిరాదిదోషము లేనిచో అగ్రహణ, విపరీతగ్రహణాదికము సంభవింపనందున అగ్రహణ, విపరీతగ్రహణాదికము దోషజన్యమే యగును. కాన నాత్మధర్మము కానేరదు.

అగ్రహణ, విపరీతగ్రహణ, సంశయ త్రయము దోషజన్య మగుచో దోష మనునది నిమిత్తకారణమే కాని, యుపాదానకారణము కాదు. భావకార్యముపాదానకారణజన్య మగుటం జేసి అనిర్వాచ్యావిద్య సంమతముకానందున నాత్మయే విపర్యయాదుల కుపాదాన మని చెప్పవలయును. అట్లు విపర్యయాదుల కాత్మ యుపాదానకారణ మగుచో అట్టి కార్య ముపాదాననిష్ఠమే యగుటవలన నాత్మకు అవిద్యావత్త్వము ప్రాప్తించుచున్నది. అవిద్యావంతు డగుటవలన నాత్మ సంసారియే యగు నని శంకింపఁజనదు. విపరీతగ్రహాదికము దోషజన్యమై యుండును. అగ్రహ, విపరీతగ్రహ, సంశయత్రితయము అవిద్య, విపర్యయాదికము భావోపాదానమే యగుచో విపర్యయాదికము సత్యము కావలసివచ్చును. కాన నాత్మ విపర్యయాదికమున కుపాదానము కాదు. మఱేమనః దోషము చక్షురాదిధర్మముగ గ్రహింపఁబడుటవలన నగ్రహణాదికముకూడ దోషమే యగుటవలన కరణధర్మమగుటయందు కారణము అవిద్యాజన్యమైన యంతఃకరణము కాదు. ఎందువలననినః అంతఃకరణకు హేతువగు అవిద్యయే సిద్ధింపనందున యని శంకింపఁజనదు. "అజ్ఞోఽహం" అనెడి యనుభవలనను, స్వాపమునం దజ్ఞానపరామర్శవలనను కార్యలింగకానుమానమువలనను, "అజా మేకాం" అనెడి శ్రుతివలనను అజ్ఞానము సిద్ధించుచున్నది.

జ్ఞాతృధర్మ మవిద్య, అట్టి యవిద్యావత్త్వమే క్షేత్రజ్ఞునకు సంసారిత్వము. ఇట్లు యీశ్వరుడు సంసారియై యుండ "క్షేత్రజ్ఞుడు యీశ్వరుడే యని చెప్పుట సమంజసము కాదు" అని శంకింపఁజనదు.

---

"సకల మిద మహంచ వాసుదేవః" 'జీవో బ్రహ్మైవ నాపరః' "సర్వే వయ మతః పరం" "భోక్తారం యజ్ఞతపసామ్" 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' "ఉపద్రష్టాఽనుమన్తా చ" ఈ మొదలగు జీవబ్రహ్మముల కేకత్వమును బోధించు పైనుదహరింపఁబడిన స్మృతులకు విరోధము ప్రాప్తించును.

మఱియు, సద్రూపుడగుటవలనను, చిద్రూపు డగుటవలనను, ఆనన్ద రూపుడగుటవలనను, అవిక్రియుడగుటవలనను అసంగు డగుటవలనను, పరిపూర్ణు డగుటవలనను, ఆత్మ (జీవుడు) బ్రహ్మస్వరూపుడు. "యన్నైవం తన్నైవం" బుద్ధ్యాదులవలె అని వ్యతిరేక దృష్టాంతము ఘటాకాశమహాకాశములవలె ఉపాధికల్పిత మగుటవలన జీవేశ్వరుల భేద మసత్యము, స్వప్నార్థములువలె మాయాకార్య మగుటవలన జీవోపాధి

శాంకరభాష్యమ్:—

(7) తన్న, యథా కరణే చక్షుషి విపరీతగ్రాహకాదిదోషస్య దర్శనా న్న విపరీతాది గ్రహణం తన్నిమిత్తో వా తైమిరికత్వాదిదోషో గ్రహీతుః, చక్షుషః సంస్కారేణ తిమిరేఽపనీతే గ్రహీతు రదర్శనాత్ న గ్రహీతృధర్మో యథా తథా సర్వత్రైవాగ్రహణవిపరీతసంశయప్రత్యయా స్తన్నిమిత్తాః కరణస్యైవ కస్యచి ద్భవితు మర్హంతి, న జ్ఞాతుః క్షేత్రజ్ఞస్య । సంవేద్యత్వాచ్చ తేషాం ప్రదీపప్రకాశవ న్న జ్ఞాతృధర్మత్వం- సంవేద్యత్వా దేవ స్వాత్మవ్యతిరిక్తస్య సంవేద్యత్వం; సర్వకరణవియోగే చ కైవల్యే సర్వవాదిభి రవిద్యాదోషవత్త్వానభ్యుపగమాత్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(7) విపరీతగ్రాహకాదిదోషము- కరణమగు చక్షుస్సునందే కన్పట్టుటవలన విపరీతాది గ్రహణము, దానికి కారణ మగు తైమిరికాదిదోషము కరణ మగు చక్షురాదీంద్రియధర్మమే కాని, జ్ఞాతృధర్మము కాదు. చక్షురింద్రియమునకు సంస్కారముచే తిమిరము (చీకటి) తొలగించబడినచో విపరీతగ్రహణము, తత్కారణ మగు తిమిరాదిదోషము గ్రహీతకు కన్పట్టనందున యెట్లు విపరీతగ్రాహకకరణాదిదోషము గ్రహీతృధర్మము కాదో, అట్లే యంతటను అగ్రహణ, విపరీతగ్రహణ, సంశయములు, తత్కారణ మగు దోషములు యేదో యొక కరణధర్మములే యగుట న్యాయము. కాని జ్ఞాత యగు క్షేత్రజ్ఞుని ధర్మములు కావు. అగ్రహణ, విపరీతగ్రహణ, సంశయములు సంవేద్యమగుటవలన నవి ప్రదీపప్రకాశవలె జ్ఞాతృధర్మములు కావు. అగ్రహణాదులు సంవేద్య మగుటవలననే యవి స్వాత్మవ్యతిరిక్తసంవేద్యములు. అనగా నేది వేద్యమో యది వేద్యమగు దీపాదులవలె తన కంటె భిన్నమైనదానిచే వేద్యము. అను వ్యాప్తివలన విపరీతగ్రహాదులుకూడ వేద్యమగుటవలన నతిరిక్తవేద్యములు అని సిద్ధించుచుండ "సంవేదితా న సంవేద్యధర్మవాన్ వేదితృత్వాత్ యథా" ఎట్లు దేవదత్తుడు వేదిత

మిథ్య" అను నిత్యాదియుక్తులచే లెస్సగ విచారించినచో జీవేశ్వరుల కభేదమే తెలియబడును. కొంచమైన భేదము గోచరింపదు. జీవేశ్వరులకు భేదమే యున్నచో భేదదర్శననిషేధమే సంభవింపదు. "నాత్ర కాచన భిదాఽస్తి నైవాత్ర కాచన భిదాఽస్తి అత్ర భిదా మివ మన్యమాన శ్శతధా సహస్రధా భిన్నః" "మృత్యోః స మృత్యు మాప్నోతి" ఇత్యాదిశ్రుతులు పౌనఃపున్యముచే భేదదర్శనమును నిషేధించుచున్నవి. జీవేశ్వరభేదదృష్టికు గొప్పయనర్థముకూడ శ్రుతులయం దుద్ఘోషింపబడెను. కాన ముముక్షువులచే జీవబ్రహ్మల కభేదమే లెస్సగ తెలియనగును.

"అహం సుఖీ, దుఃఖీ" అని జీవునకు ప్రత్యక్షముగ సంసార ముపలభ్యమానమగుచున్నది. అట్టి సంసారియగు జీవునకు అసంసారియగు నీశ్వరునితో నైక్య మెట్లు సిద్ధించును? అని శంకింపజనదు. మరిచిమివలె యవిద్యాధ్యారోపిత మగుటవలన నాత్మకు సంసారము మిథ్యఅను యనుమానప్రమాణముచే నాత్మయందు గోచరమగు సంసారమవిద్యా కార్య మగుటచే సంసారమునకు మిథ్యాత్వము సిద్ధించుచున్నది. మరియు "అమూఢో మూఢ ఇవ వ్యవహర న్నాస్తే మాయయా ఏవ" (అమూఢుడగునట్టి యాత్మ మాయచే మూఢునివలె వ్యవహరించుచుండెను.) అనిశ్రుతిబోధించుటవలనను ఆత్మ స్వయముగ సంసారియయియే యవిద్యచే సంసారివలె కరణాదిదోషముచే శంఖము పచ్చనిదిగ గోచరించినట్లు కన్పట్టుచుండెను.

శాంకరభాష్యమ్:—

ఆత్మనో యది క్షేత్రజ్ఞస్య సంసారిత్వ మగ్న్యుష్ణత్వవ త్స్వధర్మః, తతో న కదాచి దపి తేన వియోగ స్స్యాత్ । అవిక్రియస్యచ వ్యోమవ త్సర్వగతస్యామూర్తస్యాత్మనః కేనచిత్సంయోగ వియోగానుపపత్తే స్సిద్ధం క్షేత్రజ్ఞస్య నిత్యమేవేశ్వరత్వమ్; 'అనాదిత్వా న్నిర్గుణత్వా' దిత్యాదీశ్వరవచనాచ్చ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(జ్ఞాత) యగుటవలన వేద్యధర్మములేనివాడో యట్లే సంవేదితకూడ వేదితయే (జ్ఞాతయే) యగుటవలన సంవేద్యధర్మము కలవాడు కాడు. ఏకరణసంబంధములేని కైవల్యమునందు (మోక్షమునందు) సర్వవాదులు అవిద్యాదిదోషములు (జ్ఞాతకు) అంగీకరింపనందున నగ్రహణాదులు, తత్కారణములు జ్ఞాతృధర్మములు కావు. ఆత్మస్వరూప మగు క్షేత్రజ్ఞునకే అగ్రహణాదులు, అగ్నికి ఉష్ణత్వమువలె స్వధర్మమే యగుచో నెన్నడును క్షేత్రజ్ఞునకు వియోగము సంభవింపకపోయెడిని. అవిక్రియుఁడు, ఆకాశమువలె సర్వగతుడు, అమూర్తము నగు నాత్మకు దేనితోటియు సంయోగముకాని, వియోగముకాని సంభవింపనందున క్షేత్రజ్ఞునకు నిత్యమైన యీశ్వరత్వము "అనాదిత్వాన్నిర్గుణత్వాత్" ఇత్యాదీశ్వరవచనమువలన సిద్ధమగుచున్నది.

వస్తుతః విచారించినచో "అయ మాత్మా సన్మాత్రో నిత్య, శ్శుద్ధో, బుద్ధ, స్సత్యో, ముక్తో, నిరంజనో, విభు, రద్వయాత్మానందః, పరః ప్రత్యగేకరసః" అను శ్రుత్యుక్తరీతిని జీవుడు నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావుడే యగుచున్నాడు. చక్షుర్ధర్మమగు పచ్చతనము శంఖమునందువలె సంసార మనాత్మధర్మమై అవిద్యచే నాత్మయం దధ్యారోపితము. జ్ఞేయమగు రూపాదులవలె సంసారము జ్ఞేయమగుటవలన నాత్మధర్మము కాదు. అను యనుమానప్రమాణముచేగూడ సంసారమున కనాత్మధర్మత్వమే తెలియనగును. ఆత్మధర్మము కాదు. సంసార మాత్మధర్మమే యగుచో నాత్మ కెన్నడును మోక్షమే లేకపోయెడిని. ఆత్మకు మోక్షమునైతే "తరతి శోక: మాత్మవిత్" "విముక్తశ్చ విముచ్యతే" "బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి" ఇత్యాది శ్రుతులు బోధించుచున్నవి. కాన ఆత్మకు అవిద్యారోపితసంసారిత్వదశయందు స్వప్నమునందువలె ప్రత్యక్షాదిప్రమాణసిద్ధద్వైతసర్వవ్యవహారములు సంభవించుటవలన నేమియు విరోధము ప్రాప్తింపదు. కర్మజ్ఞాన శాస్త్రమున కానర్థక్యము సంభవింపదు. విద్యావిర్భూతిదశయందు మెలకువ గాంచినపుడు స్వప్నసంసారాభావమువలె ఆవిద్యకసంసారము లేనందున నిత్యశుద్ధబోధస్వభావముగల, పరిపూర్ణమైనయాత్మకు బ్రహ్మాభిన్నత్వము విరోధింపదు. కనుకనే ప్రమాణశిరోమణి, సర్వజ్ఞమూర్తి యగు శ్రుతి "ఐతదాత్మ్య మిదం సర్వం త త్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" అని ఆత్మకు సంసారనిమిత్తమైన ఆకాశాదిస్థూలాంతము, అవిద్యాకార్యము, అధిష్ఠానసత్తైకాలంబనము, స్వతః సత్తాస్ఫూర్తిశూన్యము నగు నిఖిల ద్వైతప్రపంచమునకు ""ఐతదాత్మ్యం" అని సన్మాత్రత్వమును బోధించి భేదహేతు వేదియు లేనందున చిదేకరస స్వరూపమగు నాత్మకు "తత్త్వ మసి" అని బ్రహ్మాత్వమును బ్రహ్మయొక్క యద్వితీయత్వసిద్ధికొఱకు బోధించెను. ద్వైతమే యగుచో అద్వైతశ్రుతిస్మృతులకు విరోధమే ప్రాప్తించును. "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" ఏక మేవాద్వితీయంబ్రహ్మ "ఏకో రుద్రో నద్వితీయోఽవతస్థే" "ఏకో దేవో నారాయణః" "ఏక ఏవ హి భూతాత్మా" "ఏకం స ద్విప్రా బహుధా వదన్తి" "ఏక స్సన్ బహుధా విచచార" "ఏకం సన్తం బహుధా కల్పయన్తి" "ఏకో దాధార భువనాని విశ్వా" "ఏకో దేవో బహుధా సన్నివిష్టః" "త్వ మేకోసి బహూననుప్రవిష్టః" "తదేత ద్బ్రహ్మాపూర్వ మనపర మనన్తర మబాహ్యమ్" "ఈశావాస్య

శాంకరభాష్యమ్:—

(8) న న్వేవం సతి సంసారసంసారిత్వాభావే శాస్త్రానర్థక్యాదిదోష స్స్యా దితి చేన్న, సర్వై ర భ్యుపగతత్వాత్ । సర్వై ర్హ్యాత్మవాదిభి రభ్యుపగతో దోషో నై కేన పరిహర్తవ్యః। కథ మభ్యుపగత ఇతి ? ముక్తాత్మనాం హి సంసారసంసారిత్వవ్యవహారాభావః సర్వై రేవాత్మ వాదిభి రిష్యతే ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(8) అట్లగుచో సంసారసంసారిత్వములే లేనందున శాస్త్రమున కానర్థక్యాదిదోష ములు ప్రాప్తించు నని శంకింపజనదు. ఈశాస్త్రానర్థక్యాదిదోషము ఆత్మవాదు లందరిచేతను యంగీకరింపబడినదే. కాన నొకనిచే పరిహరింపదగినది కాదు. ఆత్మవాదు లెట్లు సంసారసంసా రిత్వాభావము నంగీకరించి రనెదవా? ఆత్మవాదు లందరు ముక్తాత్మలకు సంసారసంసారిత్వము లేదని యంగీకరించిరి.

మిదం సర్వం'' ''తద్ధీదం సర్వం చిద్ధీదం సర్వమ్'' పురుష ఏవేదం సర్వం'' ''బ్రహ్మై వేదం విశ్వ మిదం వరిష్ఠం'' ''మాయామాత్ర మిదం ద్వైతమ్'' ''నేహ నానాఽస్తి కించన'' ''న హ్యస్తి ద్వైతసిద్ధిః'' ఇత్యాదిశ్రుతులు, బ్రహ్మ కద్వితీయత్వమును బోధించుచున్నవి.

మరియు:— ''తస్మా న్న విజ్ఞాన మృతేఽస్తి కించిత్'' ''జ్ఞానం విశుద్ధం విమలం విశోకం'' ''ఏక స్సమస్తం య దిహాస్తి కించిత్'' ''విశుద్ధం జ్ఞాన మే కైకం'' ''మత్తః పరతరం నాన్యత్'' ''వాసు దేవ స్సర్వమిదం'' ''సర్వభూతస్థితం యో మామ్'' ''వేదార్థః పరమాద్వైతమ్'' ఇత్యాదిస్మృతులు బ్రహ్మ కద్వితీయత్వమును బోధించుచున్నవి.

మరియు:— ఆకాశమువలె అనన్తము, సర్వాత్మకము అగుటవలన బ్రహ్మ మద్వితీయము. సుషుప్తి వలె వస్త్వంతరశూన్య మగుటవలన బ్రహ్మ మద్వితీయము. ఇత్యాదియుక్తులు బ్రహ్మమున కద్వితీయత్వ మునే బోధించుచున్నవి.

కాన నిది సర్వశ్రుతిస్మృతి న్యాయప్రసిద్ధమే. క్షేత్రజ్ఞుడగు నాత్మకు బ్రహ్మత్వము. అందువలననే ''క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి'' అని సర్వజ్ఞుడగు శ్రీ కృష్ణపరమాత్మ చెప్పెను.

—♦ పూ ర్వ ప క్ష ము ♦—

ఇచట (ఈ ''క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి'' అను స్థలమున) శ్రీకృష్ణపరమాత్మచే జీవేశ్వరుల కేక త్వము చెప్పబడలేదు. మరేమనిన: ''ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి'' అను న్యాయముచే సర్వక్షేత్రములయం దంతర్యామిగనున్న యీశ్వరరూపమునకే యేకత్వము చెప్పబడెను. సర్వభూతములయం దంతర్యామియగు నీశ్వరు డొక్కడే. యని మూఢులకు యీశ్వరు డొక్కడేయను విజ్ఞానము కల్గుటకై ''క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి'' అని చెప్పెనని శంకింప జనదు. ఇచట నీ వడగదగియుంటివి.

—♦ సి ద్ధా ం త ము ♦—

(1) ఈశ్వరుడు స్వయముగ సావయవుడై భూతములను నియమనము చేయుచుండెనా? (2) లేక నిరవయవుడై భూతములను నియమనము చేయుచుండెనా? లేక, (3) ఉభయాత్మకమై భూతములను నియ మనము చేయుచుండెనా?

శాంకరభాష్యమ్:—

(౭) నచ తేషాం శాస్త్రానర్థక్యాదిదోషప్రాప్తి రభ్యుపగతా । తథా నః క్షేత్రజ్ఞానా మీశ్వరైకత్వే సతి శాస్త్రానర్థక్యం భవ త్వవిద్యావిషయే చార్థవత్త్వం- తథా ద్వైతినాం సర్వేషాం బంధావస్థాయా మేవ శాస్త్రాద్యర్థవత్త్వమ్, న ముక్తావస్థాయా మేవమ్ । నను ఆత్మనో బంధముక్తావస్థే పరమార్థత ఏవ వస్తుభూతే ద్వైతవాదినాం సర్వేషామ్, అతో హేయోపాదేయతత్సాధనసద్భావే శాస్త్రాద్యర్థవత్త్వం స్యాత్, అద్వైతినాం పునః ద్వైత

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(౭) అట్లగుచో ముక్తుల విషయమై, విధిశాస్త్రమునకు, చక్షురాదీంద్రియములకు ఆనర్థక్యము ప్రాప్తించు నని శంకింపజనదు. వ్యవహారాతీతు లగు ముక్తాత్మల విషయమై గుణదోషా శంకయే లేదు. కాన ముక్తాత్మలవిషయమై శాస్త్రానర్థక్యాదిదోషప్రాప్తి కవకాశమే లేదు. అవిద్యావిషయము నన్ననో శాస్త్రమున కర్థవత్త్వము సంభవమే. ఈవిషయమునే ద్వైతు లందరు బన్ధావస్థయందు శాస్త్రాదుల కర్థవత్త్వమును, ముక్తావస్థయందు శాస్త్రమున కర్థవత్త్వ ముయొక్క యభావమును యొప్పియే యుండిరి. అట్లే అద్వైతులునుయనిగ్రహింప నగును.

## —• ద్వైతిపూర్వపక్షము •—

ద్వైతులమగు మాయందరి పక్షమునందు ఆత్మకు బన్ధముక్తావస్థలు రెండును పరమార్థములు. కాన బన్ధమునువదలించుటకును, మోక్షమును పొందుటకును తత్సాధనసద్భావమునందు శాస్త్ర మర్థవత్తగును. అద్వైతుల కన్ననో ద్వైతము పరమార్థము కానందునను, అవిద్యాకృత మగుటవలనను బంధావస్థ యాత్మ కపరమార్థ మగుచో శాస్త్రప్రవృత్తికి విషయమే లేనందున శాస్త్రాదుల కానర్థక్యము ప్రాప్తించునని శంకింపజనదు,

సావయవుడయియే భూతములను నియమనము చేయుచుండెనను ప్రథమపక్షమునందు నీశ్వరునకు వికారిత్వాఽనిత్యత్వాదిదోషప్రసక్తియు, శ్రుతివిరోధము సంభవించుటవలనను, "యస్యాదిత్య శ్శరీరం" ఇత్యాది శ్రుతిచే నతిరిక్త శరీరాభావము శ్రూయమాణమగుటవలనను, యీశ్వరుడు సావయవుడను ప్రథమపక్షము పొసగదు. అట్లగుచో పరిచ్ఛిన్నత్వము, దానిచే పూర్ణత్వవ్యాఘాత, ఏకత్వానుపపత్తియు ప్రాప్తించును. ఈశ్వరుడు నిరవయవుడయియే భూతములను నియమన మొనరించుచుండెనను రెండవపక్షమున "యః ప్రాణేన ప్రాణితి స త ఆత్మా సర్వాన్తరః। ఏష త ఆత్మా సర్వాన్తరః" అను శ్రుతివలన నీశ్వరునకు ప్రాణిత్వప్రాణనక్రియావత్త్వముల ప్రసక్తిచే నశరీరత్వ మనుపయోగము. అట్లంగీకరించినచో "అశరీరం శరీరేషు" "అప్రాణో హ్యమనా శ్శుభ్రః" ఇత్యాది శ్రుతి విరోధముకూడ ప్రాప్తించును. కాన రెండవపక్షము పొసగదు. నిరవయవత్వ, సావయవత్వము లొకచోట పొసగనందున "యీశ్వరుడు నిరవయవుడు, సావయవుడు అయియే నియమనము చేయుచుండెను." అను మూడవ పక్షము నిరస్తము. ఈశ్వరుడే క్షేత్రజ్ఞుడగుచో "పురుష స్సుఖదుఃఖానాం" అని చెప్పబడిన న్యాయమున జీవత్వము, సుఖదుఃఖాదిభోక్తృత్వము సంభవించెడిని. "కారణం గుణసంగోఽస్య" అని చెప్పబడుటవలన సదసద్యోనిజన్మయు ప్రాప్తింపవలసివచ్చును. క్షేత్రజ్ఞు డాత్మ యను పక్షమునగూడ నివి సంభవింపవలసివచ్చునని శంకింపజనదు. అవిద్యచే నాత్మకు జన్మాద్యనర్థము లంగీకరించుట

శాంకరభాష్యమ్:—

స్యాపరమార్థత్వాదవిద్యాకృతత్వా ద్బంధావస్థాయా శ్చాత్మనోఽపరమార్థత్వే నిర్విషయత్వా చ్ఛాస్త్రానర్థక్య మితి చేన్న, ఆత్మనోఽవస్థాభేదవత్త్వానుపపత్తేః । యది తావ దాత్మనో బంధముక్తావస్థే యుగప త్స్యాతామ్, క్రమేణ వా యుగప త్తావ ద్విరోధా న్న సంభవతః స్థితిగతీ ఇవైకస్మిన్ క్రమభావిత్వే చ నిర్నిమిత్తత్వేఽనిర్మోక్షప్రసంగః । అన్యనిమిత్తత్వే చ స్వతోఽభావా దపరమార్థత్వప్రసంగః । తథాచ సత్యభ్యుపగమహానిః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

—• అద్వైతి సిద్ధాంతము •—

ఆత్మ కవస్థాభేదము సంభవింపదు. (ఇదిసంగ్రహవాక్యము దీని కేముందుగ్రంథమువివరణము) ద్వైతిమతములందు ఆత్మకు బన్ధముక్తావస్థలు పారమార్థికము లని చెప్పుచుండిరి. ఆబంధముక్తావస్థలు ఒక్కసారియే ప్రాప్తించునా? (1) లేక క్రమముగ ప్రాప్తించునా? (2) ఒకనియందే యొక్కసారి స్థితిగతులు ప్రాప్తించనటుల విరుద్ధము లగుటంబట్టి యాత్మకు ఒక్కసారి బన్ధముక్తావస్థలు ప్రాప్తింపనేరవు. ఒకటి తరువాత మరియొకటి ప్రాప్తించు ననెదవా? అట్టిప్రాప్తికి కారణము కలదా? (1) నిష్కారణముగనే ప్రాప్తించునా? (2) నిష్కారణముగ ప్రాప్తించు నందువా? నిష్కారణముగ ప్రాప్తించుదానిని విడచుట ప్రాప్తింపనేరదు. సకారణముగ ప్రాప్తించునందువా? బంధమోక్షము లన్యనిమిత్తము లగుటంజేసి స్వతః యాత్మకు లేమింజేసి బంధమోక్షములకు పరమార్థత్వమే లేకపోయెడిని. అట్లే బంధమోక్షములు పరమార్థములు కాకుండుగాక యనెదవా? ఆత్మకు బంధమోక్షములు పరమార్థములని యొప్పిన ద్వైతుల సిద్ధాంతమునకు విరోధము ప్రాప్తించును.

వలనను, విద్యచే జన్మాద్యనర్థనివృత్తి యుపపన్నమగుటచేతను పూర్వాశంక సంభవింపదు. దీనిచే క్షేత్రజ్ఞునకు బ్రహ్మత్వభంగము సంభవింపదు. "బన్ధో మోక్ష ఇతి వ్యాఖ్యా గుణతో మే న వస్తుతః । గుణస్య మాయామూలత్వా న్న మే మోక్షో న బంధనమ్॥" నాకు బంధనము, మోక్షము అను వ్యాఖ్య గుణమువలన కాని, వాస్తవికము కాదు. గుణమనునది మాయామూలకమగుటవలన నాకు బంధమూ లేదు, మోక్షమూ లేదు. అని యీశ్వరునిచేతనే చెప్పబడెను. కాన నాత్మకు అవిద్యచే జీవత్వ మనినచో నీచే చెప్పబడిన వికల్పముల కవకాశములేదు. విద్యచే బ్రహ్మత్వము సిద్ధించును. అందువలన యిచట యేయనుపపత్తియు లేదని సిద్ధమగు మన్నది.

॥౨॥

శ్రీధరీయము:— ఇంతకుపూర్వమునందు క్షేత్రజ్ఞుని స్వరూపము చెప్పబడెను. ఇపు డాక్షేత్రజ్ఞునకే పారమార్థికమగునట్టి ఆసంసారిస్వరూపమును శ్రీకృష్ణపరమాత్మ "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అనుదానిచే చెప్పుచుండెను.

"తత్త్వమసి" అను శ్రుతిచే లక్షితమైన చిదంశచే నాస్వరూపమే చెప్పబడుటవలన క్షేత్రజ్ఞుడు, సంసారియునగు జీవుని వస్తుతః సర్వక్షేత్రములయం దనుగతమైన నన్నుగ తెలిసికొనుము. ఆదరార్థమిట్టి జ్ఞానమును స్తుతించుచుండెను. క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క వైలక్షణ్యపూర్వకమైన యే జ్ఞానము కలదో అదియే మోక్షహేతువగుటవలన నామతము. (సంమ్మతము) ఇతరజ్ఞానము బంధహేతువగుటవలన వృథా (వ్యర్థ) పాండిత్యము.

శాంకరభాష్యమ్:—

(10) కించ బంధముక్తావస్థయోః పౌర్వాపర్యనిరూపణాయాం బంధావస్థా పూర్వం ప్రకల్ప్య, అనాదిమత్యంతవతీ చ; తచ్చ ప్రమాణవిరుద్ధం; తథా మోక్షావస్థాఽఽదిమత్యనంతా చ ప్రమాణవిరుద్ధైవాభ్యుపగమ్యతే । నచాఽవస్థావతోఽవస్థాంతరం గచ్ఛతో

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(10) మరియు బంధావస్థముందుగను అనంతరము ముక్తావస్థ అని యంగీకరించిన బంధావస్థ అనాది, అంతవత్తు అని చెప్పినట్లగును, అట్లయిన "ఏది యనాదియో యది నిత్యము." అనున్యాయమునకు విరోధము ప్రాప్తించును. మరియు బంధావస్థతరువాత నిత్యమగు మోక్షావస్థ ప్రాప్తించుచో యిదియు "ఏది జన్యమో యది యనిత్య" మను న్యాయమునకు విరుద్ధమే. అట్లుకాక ద్వైతమతమున మోక్షావస్థ కనిత్యత్వదోషపరి

"తత్కర్మ యన్న బన్ధాయ సా విద్యా యా విముక్తయే । ఆయాసాయాపరం కర్మ విద్యాఽన్యా శిల్పనైపుణీ" ఏకర్మ బన్ధముకొఱకు కాదో యాకర్మయే కర్మ యనిపించుకొనును. ఏవిద్య మోక్షముకొఱకు సమర్థమగునో ఆవిద్యయే విద్యయని యనిపించుకొనును. బంధముకొఱకగు కర్మ ఆయాసముకొఱకే యగును. మోక్షమునకు సమర్థముకాని విద్య శిల్పనైపుణ్యమే యగును. ॥౨॥

సదానందీయము:—

(ఈసదానందీయవ్యాఖ్యానము శ్లోకరూపమైనది. దీనిలో మూలశ్లోకము విపులముగను, హృద్యముగను వివరింపబడెను. కాన నిట ఆశ్లోకములను, వాని యాంధ్ర వివరణమునుగూడ చూపుచుంటిమి,)

శ్లో॥ ఏవం దేహేంద్రియాదిభ్య స్త్వంపదార్థో విలక్షణః,
క్షేత్రజ్ఞ స్స్వప్రకాశోఽస్తీ త్యభిధాయ శ్రుతే ర్మతమ్ ॥ 1.
శ్లో॥ తస్య యద్వాస్తవం తత్త్వం మహావాక్యార్థ మద్వయమ్,
బ్రహ్మాత్మైక్యం స్వయం ప్రాహ భగవా న్కరుణానిధిః ॥ 2.

(శ్లో॥ సం॥ 1-2) ఇట్లు దేహేన్ద్రియాదులకంటె త్వం పదార్థము, విలక్షణము, క్షేత్రజ్ఞుడునగు స్వప్రకాశుడు కలడను వైదికమతమును చెప్పి, యాక్షేత్రజ్ఞునియొక్క వాస్తవతత్త్వము, మహావాక్యార్థము, అద్వయము నగు బ్రహ్మాత్మైక్యమును కరుణానిధియగు శ్రీకృష్ణపరమాత్మ స్వయముగ చెప్పెను.

శ్లో॥ బ్రహ్మాదిస్థావరాంతేషు సర్వక్షేత్రేషు చిద్ఘనః.
క్షేత్రజ్ఞ ఏక ఏవాస్తి స్వప్రకాశోఽద్వయో విభుః ॥ 3.

(3) బ్రహ్మాదిస్తంబపర్యన్తమగు నిఖిలక్షేత్రములయందు చిద్ఘనుడు, స్వప్రకాశుడు, అద్వయుడు, సర్వవ్యాపకుడు నగు క్షేత్రజ్ఞ డొకడే కలడు.

శ్లో॥ తస్మి న్నవిద్యయాఽధ్యస్తం కర్తృత్వా ద్యఖిలం భ్రమమ్,
పరిత్యజ్య త మాత్మానం క్షేత్రజ్ఞం మా మవేహి భోః ॥ 4.

(4) ఆట్టి క్షేత్రజ్ఞునియం దవిద్యచే నధ్యస్తమైన నిఖిలకర్తృత్వాదిభ్రమను పరిత్యజించి ఆయాత్మస్వరూపమగు క్షేత్రజ్ఞుని నన్నుగ తెలిసికొనుము.

శాంకరభాష్యమ్:—

నిత్యత్వ ముపపాదయితుం శక్యమ్ । అథాఽనిత్యత్వదోషపరిహారాయ బంధముక్తావస్థాభేదో న కల్ప్యతేఽతో ద్వైతినా మపి శాస్త్రానర్థక్యాదిదోషాఽపరిహార్య ఏవ; ఇతి సమానత్వా న్నాఽద్వైతవాదినా పరిహర్తవ్యో దోషః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

హారముకొరకు బన్ధముక్తావస్థాభేదమునే కల్పింప మనెదరా? అట్లగుచో ద్వైతులకుకూడ శాస్త్రానర్థక్యదోషమే ప్రాప్తించును. కాన ద్వైతాద్వైతమతములయందు సమానముగ ప్రాప్తించు శాస్త్రానర్థక్యదోషమును ఉభయులూ పరిహరింపదగును. కానియద్వైతులే పరిహ రింపదగినది కాదు.

శ్లో॥ అహ మేవాద్వయానందః ప్రత్యగాత్మాఽక్షరోఽచలః,
సర్వక్షేత్రేషు మయ్యేవ కల్పితే ష్వనృతేషు చ ॥ 5.

శ్లో॥ జీవాంతర్యామిసాక్ష్యాత్మతయా తత్ర స్థిత స్స్వయమ్,
మాయయా కల్పితో భేదః క్షేత్రజ్ఞే మయి చిద్ఘనే ॥ 6.

(5, 6) నాయందు కల్పితములు, అనృతములు నగు నిఖిలక్షేత్రములయందు అద్వయానన్దము, ప్రత్యగాత్మ, అక్షరము, అచలము నగు నేనే స్వయముగ జీవ, అంతర్యామి, సాక్షీరూపమున నుంటిని. చిద్ఘనస్వరూపము, క్షేత్రజ్ఞుడు నగు నాయందు మాయచే భేదము కల్పితము.

శ్లో॥ విద్యయా తాం చ తత్కార్యం భేదం త్యక్త్వాత్మగోచరమ్,
నిర్వికారం సదా ముక్తం మా మఖండం చిదద్వయమ్ ॥ 7.

శ్లో॥ విద్ధి త్వం ప్రత్యగాత్మానం క్షేత్రా ద్భిన్నం స్వ మాదరాత్,
యతో మాయాకృతో బంధః క్షేత్రజ్ఞే న తు వస్తుతః ॥ 8.

(7, 8) విద్యచే నామాయను, మాయాకార్యమును, ఆత్మగోచరమైన భేదమును విడచి నిర్వికారము, సదాముక్తము, అఖండము, చిద్రూపము, అద్వయమునగు నన్ను క్షేత్రముకంటె భిన్నునిగను, ప్రత్యగాత్మనుగను, తెలిసికొనుము. క్షేత్రజ్ఞునియందు బంధము మాయాకృతముకాని వాస్తవికము కాదు.

శ్లో॥ నిత్యముక్తస్వభావోఽతః క్షేత్రజ్ఞోఽహం మహేశ్వరః,
పరమాత్మనో హ్యనంతస్య క్షేత్రజ్ఞత్వ మవిద్యయా ॥ 9.

(9) కాన క్షేత్రజ్ఞుడను, మహేశ్వరుడను నగు నేను నిత్యముక్తస్వభావుడను. అనంతుడగు పరమాత్మకు క్షేత్రజ్ఞత్వము మాయచే కల్పితము. ఇట్లగుచో "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అనునది యుపపన్న మగును.

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధీ త్యేవం స త్యుపపద్యతే,
సర్వజ్ఞత్వాదయో ధర్మా మాయయా పరమేశ్వరే ॥ 10.

శ్లో॥ కల్పితా స్తేన సత్యేఽస్మి న్కథం స్యుః స్వాత్మ నీశ్వరే,
తథాఽల్పజ్ఞత్వముఖ్యా యే ధర్మా మాయాప్రకల్పితాః ॥ 11.

(10, 11) సర్వజ్ఞత్వాదిధర్మములు పరమేశ్వరునియందు మాయచే గల్పితములు.

శాంకరభాష్యమ్:—

(11) న చ శాస్త్రానర్థక్యం యథా ప్రసిద్ధావిద్వత్పురుషవిషయత్వా చ్ఛాస్త్రస్య । అవిదుషాం హి ఫలహేత్వో రనాత్మనో రాత్మదర్శనమ్, న విదుషామ్, విదుషాం హి ఫలహే-

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(11) శాస్త్రము యథాప్రసిద్ధమైన యవిద్వత్పురుషవిషయమగుటవలన శాస్త్రానర్థక్యము సంభవింపదు. ఫలహేతువు లనాత్మలు. అట్టి యనాత్మలయం దాత్మదర్శనము విద్వాంసులకు సంభవింపదు. విద్వాంసులకు ఫలహేతువులకంటె తనకు (ఆత్మకు) భిన్నత్వజ్ఞానము

శ్లో॥ నైవ తై రాత్మన స్సంగః కూటస్థస్యామలాత్మనః,
తేన జీవగతో బంధో న ప్రసజ్యేత ఈశ్వరే ॥ 12.

(10) అందుచే సత్యము, స్వాత్మయగు నీశ్వరునియం దాకల్పితధర్మము లెట్లు సంభవించును?సంభవింపనేరవు. అట్లే అల్పజ్ఞత్వాదిధర్మములు మాయచే నాత్మయందు కల్పితములు. అట్టికల్పితమైన అల్పజ్ఞత్వాదిధర్మములతో కూటస్థము, నిర్మలము నగు నాత్మకు సంబంధము సంభవింపదు. అందుచే జీవగతమగు బంధ మీశ్వరునికి సంభవింపనేరదు.

శ్లో॥ న సార్వజ్ఞ్యాదయో ధర్మా జీవే వా సం త్యసంకరాత్,
యత ఔపాధికో భేదః పరమేశ్వరజీవయోః ॥ 13.

శ్లో॥ వ్యవహారస్థలేఽస్మాభిః స్వీకృత స్తత ఏతయోః,
ధర్మాణాం సంకరో నాస్తి న తత్రాభేద ఇష్యతే ॥ 14.

(13, 14) సర్వజ్ఞత్వాది ధర్మములు జీవునియందు అసాంకర్యమువలన సంభవింపవు. పరమేశ్వరునకు, జీవునకు భేద ముపాధిప్రయుక్తము. జీవపరమేశ్వరుల భేదము వ్యవహారావస్థయందు మాయచే స్వీకరింపబడెను. కానయీజీవేశ్వరుల ధర్మములకు సాంకర్యములేదు. అచట (ఆధర్మములయందు) అభేదమున్ను లేదు.

శ్లో॥ నను స్వాభావికో భేదః ప్రసిద్ధోఽస్తీశజీవయోః,
ప్రత్యక్షేణానుమానేన వేదాంతైః స్మృతిభి స్తథా ॥ 15.

—♦ పూర్వపక్షము ♦—

(15) జీవేశ్వరులకు స్వాభావికమగు భేదము ప్రత్యక్షముచేతను, అనుమానముచేతను, శ్రుతులచేతను, స్మృతులచేతను ప్రసిద్ధము.

శ్లో॥ ప్రత్యక్షం తావ దస్త్యత్ర భేదే జీవేశయోః స్ఫుటమ్,
నాహం సర్వజ్ఞ ఇత్యాద్యనుభవో నిర్వివాదతః ॥ 16.

(16) అది యెట్లనిన? "నాహం సర్వజ్ఞః" (నేను సర్వజ్ఞుడను కాను) అను అనుభవము (ప్రత్యక్షము) నిర్వివాదముగ జీవేశ్వరుల భేదమును సిద్ధింపజేయుచున్నది.

శ్లో॥ న చానధ్యక్షభావత్వా ద్బ్రహ్మణః పరమాత్మనః,
తద్భిదాపి న చాధ్యక్షాస్తీతి వాచ్యం కదాచన ॥ 17.

(17) అభావప్రత్యక్షమునుగూర్చి ప్రతియోగిప్రత్యక్షము కారణము. అదియెట్లనిన? ఘటాభావప్రత్యక్షము కలుగవలెనన్న యెచటనో యొకచోట యెపుడో యొకప్పుడు ఘటప్రత్యక్షము కలిగిననాడే

శాంకరభాష్యమ్:—

తుభ్యా మాత్మనోఽన్యత్వదర్శనే సతి తయో రహ మిత్యాత్మదర్శనానుపపత్తేః । న హ్యత్యంత మూఢ ఉన్మత్తాది రపి జలాగ్న్యో శ్ఛాయాప్రకాశయో ర్వా ఏకాత్మతాం పశ్యతి; కిముత

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రాప్తించుచుండ ఫలహేతువులయందు "అహం"నేను అనెడి యాత్మదర్శనము సంభవింపదు. అత్యన్తమూఢుడైన యున్మత్తుడుగూడ జలాగ్న్యులకుకాని. ఛాయాప్రకాశలకుకాని ఏకాత్మత్వమును తెలిసికొనడు. అనగా జలాగ్న్యులు రెండు నొకటియే యనికాని, ఛాయా

"ఇట ఘటము లేదు." అని ఘటాభావప్రత్యక్షము కలుగును. అట్లే "జీవుడు (నేను) సర్వజ్ఞుడను కాను" అని జీవునియందు సర్వజ్ఞుడగు యీశ్వరునియొక్క భేదము ప్రత్యక్షము కావలెననిన ప్రతియోగియగు యీశ్వరునియొక్క ప్రత్యక్షము లేనిదే జీవునియం దీశ్వరభేదప్రత్యక్షము కలుగనేరదు. ఈశ్వరు డనధ్యక్షభావము కలవాడు. అనగా నీశ్వరునియందు ప్రత్యక్ష మగు ధర్మములేవియు లేనందున నీశ్వరుడు ప్రత్యక్షము కానిచో నీశ్వరభేదము మెట్లు ప్రత్యక్షమగునని శంకింపజనదు.

శ్లో॥ యత్సత్త్వం తర్కితం యత్రానుపలబ్ధివిరోధి చ,
త దభావః సదాధ్యక్షగోచర స్తత్ర సంమతః ॥ 18.

శ్లో॥ యస్మా దభావప్రత్యక్షే ప్రత్యక్షం ప్రతియోగినః,
అన్వయవ్యతిరేకాభ్యాం వ్యభిచారా న్న కారణమ్ ॥ 19.

(18, 19) అభావప్రత్యక్షమునుగూర్చి ప్రతియోగిప్రత్యక్షము అన్వయవ్యతిరేకవ్యభిచారముల వలన కారణము కాదు.

శ్లో॥ పృథివీత్వా ద్యభావస్య జలాణౌ నైవ దృశ్యతే.
ప్రత్యక్షత్వ మతో నాస్తి స్వతంత్రత్వస్య చాన్వయః ॥ 20.

(20) అది యెట్లనిన? అన్వయవ్యభిచారమనగ కారణమున్నను కార్యము జనింపకపోవుట. ప్రస్తుతము అభావప్రత్యక్షమునుగూర్చి ప్రతియోగిప్రత్యక్షము కారణమనినచో పృథివీత్వప్రత్యక్షరూప కారణముండినను జలపరమాణువునందు పృథివీత్వాభావప్రత్యక్షము కలుగుటలేదు. కాన నభావప్రత్యక్షమును గూర్చి ప్రతియోగిప్రత్యక్షము కారణమని చెప్పిన అన్వయవ్యభిచారము ప్రాప్తించును.

శ్లో॥ స్తంభః పిశాచో నాస్తీతి ప్రత్యక్షస్య చ దర్శనాత్,
అస్త్యేవం వ్యతిరేకేపి వ్యభిచార స్తయో ర్ద్వయోః ॥ 21.

(21) ఇట్లే వ్యతిరేకవ్యభిచారముకూడ ప్రాప్తించును. అదియెట్లనిన? కారణము లేకున్నను కార్యము సంభవించుట వ్యతిరేకవ్యభిచారము. ప్రస్తుతము అభావప్రత్యక్షమునుగూర్చి ప్రతియోగిప్రత్యక్షము కారణమన్నచో పిశాచరూప ప్రతియోగి ప్రత్యక్షరూప కారణములేకున్నను "స్తంభః పిశాచభిన్నః" స్తంభము పిశాచభిన్నము అని పిశాచభేదప్రత్యక్షము (ప్రతియోగిప్రత్యక్షరూప కారణము లేకున్నను) కలుగుచున్నది. కాన అన్వయవ్యతిరేకవ్యభిచారములవలన నభావప్రత్యక్షమునుగూర్చి ప్రతియోగిప్రత్యక్షము కారణము కానేరదు.

శాంకరభాష్యమ్:—

వివేకీ । తస్మా న్న విధిప్రతిషేధశాస్త్రం తావ త్ఫలహేతుభ్యా మాత్మనోఽవ్యత్వదర్శినో భవతి ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రకాశలు రెండును యొకటియే యని కాని యున్మత్తుడైనను తెలిసికొనడు, ఇక వివేకవంతుడు తెలిసికొనడని యేమి చెప్పవలయును? అందువలన విధిశాస్త్రము, ప్రతిషేధశాస్త్రము ఫలహేతువులకంటె నేను వేరుఅనెడి జ్ఞానముకలవానికి సంభవింపవు.

శ్లో॥ అతో భానానుసారేణ కల్ప్యం సద్భిః ప్రయోజకమ్,
అన్యథా జీవపరయో రభేదశ్రుతిసద్గిరామ్ ॥ 22.

(22) కాన భానానుసారముగ ప్రయోజకమును కల్పింపవలయును. ప్రతియోగ్యనుపలబ్ధివిరోధిగ దేనియొక్క సత్త్వము దేనియందు తర్కితమో దానియందు దానియొక్క యభావము అనుపలబ్ధి యను ప్రమాణముచే గ్రహింపబడును. ప్రస్తుతము జీవునియందు యీశ్వరాభేద మున్నచో జీవునివలె యీశ్వరుడును ఆభేదసంబంధముచే (జీవుడీశ్వరాభిన్న) డని ప్రత్యక్షమగును. అట్లీశ్వరాభేదము జీవునియందు లేదుకనుకనే "జీవః ఈశ్వరో న" అని జీవేశ్వరులకు భేదప్రత్యక్షమే అర్థాపత్తిప్రమాణమువలన కలుగుచున్నది. అట్లు కానిచో నీమతమునందు జీవేశ్వరుల కభేదమును యేశ్రుతులు బోధించునో ఆశ్రుతులు- జీవునియందు భేదమే ప్రసక్తము కానిచో భేదాభావరూపాభేదమును బోధించుటచే నప్రసక్తప్రతిషేధకము లగును. కాన ప్రతియోగియగు నీశ్వరునియొక్క ప్రత్యక్షము లేకున్నను జీవునియం దీశ్వరభేదప్రత్యక్షము కలుగును.

అప్రసక్తనిషేధస్య కర్తృత్వం భవతాం మతే,
కించ జీవేశసద్భేదబోధివేదగిరాం స్వతః ॥ 23.
ప్రమాణత్వా న్న శంక్యా స్యా దనువాదకతా త్వయా,
తత్రైవ వేదతాత్పర్యం న త్వైక్యే తవ సంమతే ॥ 24.

(23, 24) మరియు జీవేశ్వరుల సద్భేదమును బోధించు శ్రుతులు స్వతఃప్రమాణమగుటవలన నట్టి శ్రుతులు జీవేశ్వరులకు భేదము ననువదించుచున్నవని నీవు శంకింపరాదు. నీకు సంమతమైన జీవేశ్వరులయైక్యమునందు వేదమునకు సంమతిలేదు. మరేమనిన? జీవేశ్వరుల భేదమునందే వేదమునకు తాత్పర్యము.

నను బుద్ధివిశిష్టస్య భేద ఈశా త్ప్రతీయతే,
స మమా పీష్ట ఏవాస్తి వ్యవహారస్థలేకిల ॥ 25.
యశ్చ నేష్టో విశుద్ధస్య పరస్మా త్ప్రత్యగాత్మనః,
భేదస్సోత్ర న భాతీత్యాశంకాయా మభిధీయతే ॥ 26.

(25, 26) బుద్ధివిశిష్టమైనవా డీశ్వరునికంటె భిన్నుడు. వ్యవహారస్థలమునందు అట్టివారల భేదము నాకును యిష్టమే. విశుద్ధమైన వానికి పరమాత్మభేదము యిచట భాసించుననుట యిష్టముకాదని శంకింపజనదు.

సుప్తజ్ఞానాశ్రయస్యైవ భేద ఈశా త్ప్రతీయతే,
సుప్తజ్ఞానాశ్రయ స్తేస్తి ప్రత్యగాత్మా హి చిన్మయః ॥ 27.
యోఽధునాఽత్రాహ మస్వాప్సం యస్య మే జ్ఞాన మీదృశం,
సంసారీ సోహ మానందస్వరూపా త్పరమేశ్వరాత్ ॥ 28.
భిన్నోస్మీ త్యావృత్తే ర్భ్రాంతే స్సంసారస్యాశ్రయో హి సః,
స జీవో భిన్న ఏవాస్తి పరస్మా న్నిత్యముక్తతః ॥ 29.

(27—29) సుప్తజ్ఞానాశ్రయునికే యీశ్వరునికంటె భేదము ప్రతీత మగుచున్నది. నీమతమున సుప్తజ్ఞానాశ్రయుడే చిన్మయుడగు పరమాత్మ "యే నేను యిచట నిద్రించితినో, యే నా కిట్టి జ్ఞానముకలిగెనో

శాంకరభాష్యమ్:—

(12) నహి "దేవదత్త! త్వ మిదం కు"ర్వితి కస్మింశ్చిత్కర్మణి నియుక్తే, విష్ణుమిత్రః 'అహం నియుక్త' ఇతి తత్రస్థో నియోగం శృణ్వ న్నపి ప్రతిపద్యతే; నియోగవిషయవివేకా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(12) "ఓ దేవదత్త! నీవీ కార్యమును చేయుము" అని దేవదత్తు డొకానొక కార్యమునందు నియుక్తుడై యుండ ఆప్రదేశమునం దున్న విష్ణుమిత్రు డానియోగమును వినినను "నేనీ కర్మయందు నియుక్తుడను" అని తెలిసికొనడు. దేవదత్తుడు నియుక్తుడైనను యొకానొక ప్పుడు విష్ణుమిత్రుడు కూడ "నే నీకర్మయందు నియుక్తుడను" అని తెలిసికొను ననెదవా? సత్యమే "దేవదత్తా! నీవీకార్యమును చేయుము" అను నియోగముచే నియోజ్యు డగు దేవ

అట్టి సంసారియగు నేను ఆనందరూపమగు పరమేశ్వరునికంటె భిన్నుడనయితిని" అని అవృతిరూపమగు భ్రాన్తివలన సంసారాశ్రయుడగు జీవుడు నిత్యముక్తు డగు పరమాత్మకంటె భిన్నుడు. అజ్ఞాని, సంసారి యగు జీవునికంటె భేద మీశ్వరునికికూడ కలదు.

ఈశ్వరస్యాపి భేదోఽస్తి జీవా త్సంసారిణోఽజ్ఞతః,
మమైవాంశో జీవలోక ఇత్యాది తముదీరణాత్ ‖ 30.
తేనై వానుమితం తస్య ప్రత్యక్ష మపి సాధకమ్,
దుఃఖాననుభవిత్వత్వా దభ్రాంతత్వా త్సుఖత్వతః ‖ 31.
అసంసారితయా బ్రహ్మ జీవా ద్భిన్నం వినిశ్చితమ్,
అసర్వజ్ఞతయాఽసర్వశక్తిత్వా ద్భ్రాంతభావతః ‖ 32.
అస్వతంత్రతయా జీవో బ్రహ్మణో భిన్న ఈర్యతే,
ఇ త్యధ్యక్షానుమానాభ్యాం సిద్ధో భేద స్తయో ర్ద్వయోః ‖ 33.

(30, 33) ఈవిషయమును "మమైవాంశో జీవలోకే" అని శ్రీకృష్ణపరమాత్మ చెప్పియుండెను. దానిచే నూహించబడిన ప్రత్యక్షముకూడ భేదసాధకము. "దుఃఖముల ననుభవింపనివాడగుటవలనను, అభ్రాంతు డగుటవలనను, సుఖస్వరూపు డగుటవలనను, అసంసారి యగుటవలనను బ్రహ్మ జీవునికంటె భిన్నుడు." అని నిశ్చయింపబడెను. మరియు "సర్వజ్ఞుడు కానందునను, సర్వశక్తులు లేవందునను, భ్రాన్తభావమువలనను, స్వతన్త్రుడు కానందునను జీవుడు బ్రహ్మకంటె భిన్నుడు" అని చెప్పబడెను. ఇట్లు ప్రత్యక్షానుమానములచే జీవేశ్వరులకు భేదము సిద్ధమగుచున్నది.

ద్వా సుపర్ణేతి ముఖ్యాస్తి శ్రుతి ర్భేదైకతత్పరా,
శారీర శ్చోభయేపి హి భేదే నైన మధీయతే ‖ 34.
ఇత్యాదీ న్యపి సూత్రాణి భేదనిష్ఠాని సంతి చ,
న చ ప్రత్యక్షప్రాప్తస్యానువాదోయం శ్రుతేః స్మృతేః ‖ 35.
ప్రత్యక్షస్య ప్రమాణత్వే భేదసిద్ధి స్తతోపి చ,
ఆగమస్యానువాదత్వేఽపీష్టసిద్ధి ర్భవే న్మమ ‖ 36.
భేదప్రత్యక్షదార్ఢ్యస్య హేతుత్వా దేవ న క్షతిః,
అనభ్యస్త జలే పుంస స్తృషార్త స్యాదిత స్స్వయమ్ ‖ 37.

శాంకరభాష్యమ్:—

గ్రహణా త్తూపపద్యతే ప్రతిపత్తిః; తథా ఫలహేత్వో రపి । నను ప్రాకృతసంబంధాపేక్షయా యుక్తైవ ప్రతిపత్తి శ్శాస్త్రార్థవిషయా- ఫలహేతుభ్యా మన్యాత్మవిషయదర్శనేపి సతి ఇష్టఫల

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దత్తునకు విష్ణుమిత్రుడగు తనకు వివేకాగ్రహణమువలన నేనే నియోజ్యుడ నను భ్రాంతివలన విష్ణుమిత్రుడు నేను నియోజ్యుడ నని యాకర్మయందు ప్రవర్తించుట సత్యమే. అట్లే ఫలము నందు, హేతువునందు ఆత్మదృష్టికల యవిద్వాంసునకు విధినిషేధాధికారిత్వము సంభవించును.

ప్రవృత్తమానదార్ఢ్యాయ మానాంతరప్రవృత్తి వత్,
అగ్నే రౌష్ణ్యగతాధ్యక్షప్రామాణ్యనిశ్చయే సతి ॥ 38.
అగ్ని ర్హిమస్య చేత్యేవ మనువాదోపి సాధకః,
భేదప్రత్యక్షదార్ఢ్యాయ తథాఽత్రాపి స ఇష్యతామ్ ॥ 39.

(34, 39) జీవేశ్వరులకు భేదమును బోధించు “ద్వా సుపర్ణా” అను ముఖ్యమైన శ్రుతియు గలదు. “శారీర శ్చోభయేఽపి హి భేదే నైన మధీయతే” ఇత్యాదిబ్రహ్మసూత్రములు జీవేశ్వరులకు భేదమునే బోధించుచున్నవి. పైనుదహరించబడిన శ్రుతిస్మృతులు ప్రత్యక్షప్రాప్తమైన భేదమున కనువాదకము లని శంకింపజనదు. ప్రత్యక్షము ప్రమాణ మగుచో భేదము సిద్ధించును. అటుపిమ్మట ఆగమము (శ్రుతి) అనువాద మగుచో నాయభీష్టము సిద్ధించినదే. ఎందువలననిన? తృషార్తుడగు పురుషున కనభ్యస్తజలమునందు ప్రమాణాంతరము ప్రవృత్తమైనచో నది ప్రమాణదార్ఢ్యముకొఱకెట్లగునో అట్లే భేదప్రత్యయదార్ఢ్యమున కనువాద హేతువగుటవలన నాయభీష్టసిద్ధియే యగుచున్నది. కాన నాకేమియు క్షతి లేదు. అగ్నియం దుష్ణత్వము కలదు అను ప్రత్యక్షమునందు ప్రామాణ్యనిశ్చయ ముండినచో “అగ్ని ర్హిమస్య భేషజమ్” అను శ్రుతి యనువాదకమైనను అగ్నియం దౌష్ణ్యసాధకమే కాని, బాధకము కాదు. అట్లే భేదప్రత్యక్షదార్ఢ్యముకొఱకు పైనుదహరించబడిన “ద్వా సుపర్ణా” “శారీర శ్చోభయేఽపి హి భేదే నైన మధీయతే” అను శ్రుతిస్మృతులు సమర్థములై మాకిష్టములే యగును.

కించ భేదశ్రుతే ర్మానం మూర్ధన్యాయాః స్వతో యతః,
భేదాధ్యక్షానపేక్షత్వా న్న సాపేక్షానువాదతా ॥ 40.

(40 మరియు భేదప్రత్యక్షాపేక్ష లేని దగుటవలన ప్రధానము, స్వతఃప్రమాణము నగు భేదప్రతిపాదక శ్రుతికి సాపేక్షానువాదత్వము ప్రాప్తించదు.

నిరపేక్షానువాదత్వం నాప్రామాణ్యస్య సాధకమ్,
ధారావాహికబుద్ధేర్హి యథా ప్రామాణ్య మిష్యతే ॥ 41.

(41) నిరపేక్షానువాదత్వము ప్రాప్తించు ననెదవా? అట్టియనువాదత్వము అప్రామాణ్యసాధకము కాదు. ధారావాహికబుద్ధికి యెట్లు ప్రామాణ్యము స్వీకరించబడెనో యట్లే భేదశ్రుతికికూడ ప్రామాణ్య మిష్టమే.

నిరపేక్షానువాదత్వే తథాత్రాపీష్యతాం శ్రుతేః,
అపి చ ద్వా సుపర్ణేతి ముఖ్యాయాః శ్రుతిసద్గిరః ॥ 42.
అస్త్వనువాదమాత్రత్వే విచారాంతర మప్యథ,
నిరర్థకానువాదస్యాయోగాదేషా విచారణా ॥ 43.

శాంకరభాష్యమ్:—

హేతౌ ప్రవర్తితోఽస్మి, అనిష్టఫలహేతోశ్చ నివర్తితోఽస్మీతి; యథా పితృపుత్రాదీనా మిత రేతరాత్మాన్యత్వదర్శనే సత్యప్యన్యోన్యనియోగప్రతిషేధార్థప్రతిపత్తిః । న, వ్యతిరిక్తాత్మదర్శ నప్రతిపత్తేః ప్రాగేవ ఫలహేత్వో రాత్మాభిమానస్య సిద్ధత్వాత్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విధినిషేధశాస్త్ర మవిద్వద్విషయమని చెప్పువానిచే విధినిషేధశాస్త్రమున కర్థవత్త్వము చూపబడి శాస్త్రమున కానర్థక్యశంక తొలిగించబడెను. విద్వద్విషయముగ కూడ విధినిషేధ శాస్త్రమున కర్థవత్వము చెప్పనచ్చును. అది యెట్లనిన? ప్రకృతివలన జన్మించిన దేహాదుల యం దభిమానరూపమగు సంబంధము విద్యోదయమునకు పూర్వమునం దనుభూతము. దాని నపేక్షించి "విధిచే నేను ప్రవర్తించితిని. నిషేధముచే నివర్తించితిని" అని ఫలహేతువులకంటే యనాత్మవిషయక విద్య యున్నను విధినిషేధవిషయమైన బుద్ధి యుక్తమే. కాన పితృపుత్రా దులకు పరస్పరభేదజ్ఞాన మున్నను అన్యోన్యనియోగప్రతినిషేధార్థప్రతిపత్తి (జ్ఞానము) యెట్లో యట్లే విద్వాంసునకు కూడ ప్రాచీనమైన యావిద్యకసంబంధము నపేక్షించి విధినిషేధవిష యకజ్ఞానము యుక్తమే యని శంకింపజనదు. వ్యతిరిక్తాత్మదర్శనమునకు పూర్వమునందే ఫల హేతువులయం దాత్మాభిమానము సిద్ధమగుటవలన పూర్వోక్తాశంక కవకాశము లేదు.

విధిస్తుత్యర్థ మథవాఽన్యవిధానార్థ మేవ వా,
అనువాద్యనిషేధాయానువాదో శేష్యతే శ్రుతేః ॥ 44.

నాద్యోఽస్తి వాయుః క్షేపిష్ఠే త్యాదివత్ స్తుతయే మతిః,
విధ్యేకవాక్యతా నాస్తి నార్థవాదత్వ మస్త్యతః ॥ 45.

(42—45) మరియు "ద్వాసుపర్ణా" అను శ్రుతియందుగల ముఖ్యమైన శబ్దములకు అశ్రుతి యను వాదమాత్ర మైనను విచారాంతరము కలదు. నిరర్థకానువాదము సంభవింపనందున యావిచారణ చేయ నగును. అదియెట్లనిన? శ్రుతియొక్క అనువాదము (1) విధిస్తుత్యర్థము కాని, (2) అన్యవిధానార్థము కాని, (3) అనువాదనిషేధార్థము కాని సమ్మత మగును, "ద్వా సుపర్ణా" అను వాక్యమునకు విధ్యైకవాక్యత్వము కాని, అర్థవాదత్వము కాని "వాయుర్వై క్షేపిష్ఠా" అను శ్రుతికివలె లేనందున విధి స్తుత్యర్థ మను ప్రథమపక్షము సంభవింపదు.

ద్వితీయేఽన్యవిధానాయానువాదత్వే త్వయా తదా,
తాత్త్వికత్వ మనూద్యస్య వక్తవ్యం స్యాద్విచారతః ॥ 46.

మానే నాన్యవిధానాయానూదితస్య చ దృశ్యతే,
నియమస్తాత్త్వికత్వస్య యథా దధ్నా జుహోత్యపి ॥ 47.

(46, 47) "ద్వాసుపర్ణా" అనునది అన్యవిధానార్థ మనినచో విచారమువలన ననూద్యమానము యొక్క తాత్త్వికత్వమును నీవు చెప్పవగియున్నది. "దధ్నా జుహోతి" అను స్థలమునందువలె అన్యవిధానము కొరకు ప్రమాణముచే అనూదితమైన తాత్త్వికత్వముయొక్క నియమము చూడబడు చున్నది.

శాంకరభాష్యమ్:—

(13) ప్రతిపన్ననియోగప్రతిషేధార్థో హి ఫలహేతుభ్యా మాత్మనోఽన్యత్వం ప్రతిపద్యతే, న పూర్వమ్ । తస్మా ద్విధిప్రతిషేధశాస్త్ర మవిద్వద్విషయ మితి సిద్ధమ్ । నను

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(13) మరియు "సర్వాపేక్షాచ యజ్ఞాదిశ్రుతే రశ్వవత్" అను సర్వాపేక్షాధికరణమునందు సమ్యక్‌జ్ఞాన మదృష్టసాధ్యమని చెప్పబడుటవలన విధినిషేధార్థానుష్ఠానము సమ్యగ్‌జ్ఞానము ప్రాప్తించుటకు పూర్వమునందే ప్రాప్తించును. కాన విధినిషేధార్థములను తెలిసికొనినవాడు "తాను ఫలహేతువులకంటె వేరు" అని తెలిసికొనును. "అదృష్ట మున్నచో సమ్యగ్దృష్టి" అదృష్టము లేనిచో మలినాంతఃకరణముకలవానికి సమ్యగ్దృష్టి సంభవించదు" అను అన్వయవ్యతిరేకములచేతను, "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి" ఇత్యాది

నానువాద్య నిషేధాయానువాదోఽస్తీహ చ శ్రుతేః,
వాక్యేస్మి న్నేహ నానాస్తి కించనేతి నిషేధకే ॥ 48.
భేదస్య కించనే త్యత్రానూదితత్వా త్పృథ గ్వృథా,
అనువాదో మతోఽన్యత్ర ద్వా సుపర్ణేతి చ శ్రుతౌ ॥ 49.

(48, 49) "నేహ నానాస్తి కించన" అను నిషేధపరమైన యీవాక్యమునందే "కించన" అని భేద మనూదిత మగుటవలన తిరిగి వేరుగ అనువాదనిషేధార్థము "ద్వా సుపర్ణా" అనుస్థలమునందు భేద మనువదింపబడె నని చెప్పుట వ్యర్థము.

ద్వాసుపర్ణేతి వాక్యస్యాఽజ్ఞాతజ్ఞాపకలక్షణమ్,
అస్త్యేవ విధిశేషత్వ మనశ్న న్నితి సద్విధేః ॥ 50.

(50) ఇక "ద్వా సుపర్ణా" అనువాక్యమునకు అజ్ఞాతజ్ఞాపకత్వరూప మగు విధిశేషత్వము "అనశ్న న్నన్యోఽభి చాకశీతి" అను సద్విధివలన కలదు.

జీవసంఘా త్పరో భిన్నోఽచింత్య ఇత్యాదికశ్రుతేః,
నాన్యోఽతోఽస్తీతి వాక్యం స్యా త్ప్రత్యుతైక్యానువాదకమ్ ॥ 51.
అనాదిత్వాదిసంసిద్ధాభేదప్రాప్తి ర్యతః క్షితౌ.
తత్త్వమస్యాదివాక్యం తు నైవ భేదవిరోధ్యపి ॥ 52.
తదాశ్రయతయా యద్వా తజ్జన్యత్వేన తస్య చ,
తద్వ్యపదేశ ఇత్యేవం తత్త్వ మిత్యర్థనిర్ణయః ॥ 53.

(51—53) జీవసంఘముకంటె పరమాత్మ భిన్నుడు, అచిన్త్యుడు అను నిత్యాదికముయొక్క శ్రవణమువలన "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" ఇత్యాదివాక్యమే అనాదివాదిసంసిద్ధాభేదప్రాప్తివలన అనువాదక మగును. "తత్త్వ మసి" అను వాక్యము పరమాత్మ ఆశ్రయుడుగా కలవాడగుటచే కాని, లేక పరమాత్మజన్యమగుటచేగాని శ్వేతకేతువునకు (జీవునకు) తద్వ్యపదేశము (పరమాత్మస్వరూపము చెప్పుట) అని నిర్ణయము కలదగుటవలన "తత్త్వమసి" అను వాక్యము భేదవిరోధి కాదు.

దౌర్బల్యం విదితార్థత్వా ద్యది భేదశ్రుతే ర్మతం,
విరుద్ధార్థతయా తర్హి దౌర్బల్య మభిదాశ్రుతేః ॥ 54.

శాంకరభాష్యమ్:—

'స్వర్గకామో యజేత, న కలంజం భక్షయే' దిత్యాదా వాత్మవ్యతిరేకదర్శినా మప్రవృత్తా కేవలదేహాద్యాత్మదృష్టీనాం చ। అతః కర్తు రభావా చ్ఛాస్త్రానర్థక్య మితి చేన్న; యథా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వివిదిషావాక్యమువలనను విధినిషేధానుష్ఠానమునకు పూర్వము సమ్యగ్జ్ఞానము కలుగదు. అనగా నిషిద్ధకర్మలను పరిత్యజించి విధ్యుక్తకర్మలను పరమేశ్వరార్పణబుద్ధితో నాచరింపనిదే తత్త్వజ్ఞానము కావలె నను వివిదిషయే జనింపదు. వివిదిషయే లేనివానికి గురుసన్నిధి కేగుటయే సంభవింపదు. గురుసన్నిధి కేగనివానికి శ్రవణమే సంభవము కాదు. శ్రవణమే లేనివానికి మననము సంభవింపదు. మననము లేనివానికి నిధిధ్యాసము సంభవింపదు. నిధిధ్యాసనము లేనివానికి సర్వబంధవిచ్ఛేదకారి యగు తత్త్వజ్ఞానము సంభవింపదు. కాన విధిప్రతిషేధశాస్త్రము అవిద్వద్విషయ మని సిద్ధముగుచున్నది.

(54) "ద్వా సుపర్ణా" అను భేదశ్రుతి విదితార్థమగుటవలన దుర్బల మనెదవా? అభేదశ్రుతియు విరుద్ధార్థకమగుటవలన దుర్బలము.

యద్యధ్యక్షావిరుద్ధైక్యపరా చైక్యశ్రుతి ర్మతా,
తర్హి భేదశ్రుతి ర్లోకసిద్ధభేదపరాస్తు భోః ॥ 55.

(55) అభేదశ్రుతి ప్రత్యక్షావిరుద్ధైక్యపర మనెదవా? అట్లగుహో "ద్వా సుపర్ణా" ఇత్యాదిభేదశ్రుతియు లోకసిద్ధభేదపరమే యగును.

యది షడ్విధతాత్పర్యలింగవత్త్వేన సర్వతః,
ప్రబలైక్యశ్రుతి స్తర్హి తత్తుల్యా స్యా ద్భిదాశ్రుతిః ॥ 56.

(56) అభేదశ్రుతి ఆరువిధములగు తాత్పర్యలింగములు కల దగుటచే ప్రబల మనెదవా? భేదశ్రుతియు అట్టిదే యగుటచే ప్రబలమగును.

ఉపక్రమోపసంహారా వభ్యాసోఽపూర్వతా ఫలమ్,
అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే ॥ 57.
ఏతచ్చ షడ్విధం లింగం భేదే తాత్పర్యనిర్ణయే,
అస్త్యేవ తత్కథం చేత్యాకాంక్షాయా మభిధీయతే ॥ 58.

(57, 58) షడ్విధలింగము అనగ (1) ఉపక్రమోపసంహారములు, (2) అభ్యాసము, (3) అపూర్వతా (4) ఫలం, (5) అర్థవాద, (6) ఉపపత్తి అను నీయారును తాత్పర్యమును నిర్ణయించెడి లింగము లనబడును ఈయారువిధములగు లింగములు భేదశ్రుతికి భేదమునందు తాత్పర్యనిర్ణాయకములు.

ఆథర్వణశ్రుతౌ భేదే ద్వాసుపర్ణేత్యుపక్రమః,
పరం సామ్య ముపైతీత్య ముపసంహార ఇష్యతే ॥ 59.
భిన్నాశ్రయతయా లోకే సాదృశ్యస్య చ దర్శనమ్,
అతోఽస్త్యత్రోపసంహారో భేదమాత్రైకగోచరః ॥ 60.

(59, 60) ఈ షడ్విధలింగములు "ద్వా సుపర్ణా" అను భేదశ్రుతికి భేదమునందే తాత్పర్యము నెట్లు నిర్ణయించు ననెదవా? చెప్పెద వినుము.

ఉపక్రమలింగము:— ఆథర్వణశ్రుతి భేదప్రతిపాదకముగ "ద్వా సుపర్ణా" అని యుపక్రమించి "పరం సామ్య ముపైతి" అని యుపసంహరింపబడెను. లోకమునందు సాదృశ్య మనునది భిన్నాశ్రయము

శాంకరభాష్యమ్:—
ప్రతిసిద్ధిత ఏవ ప్రవృత్తినివృత్త్యుపపత్తేః । ఈశ్వర క్షేత్రజ్ఞైకత్వదర్శీ బ్రహ్మవి త్తావ న్న ప్రవర్తతే ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

—• పూర్వ పక్షము •—

దేహాదులకంటె నాత్మ వ్యతిరిక్తము, నిత్యము, నిస్సంగము, ఏకముఅనువారలకు "స్వర్గ కామో యజేత" అను శ్రుతివిహితయాగాదులయందు ప్రవృత్తి సంభవింపదు. "న కలంజం భక్షయేత్" అను నిషేధవాక్యమువలన నిషిద్ధకలంజభక్షణాదులనుండి నివృత్తి సంభవింపనందున విధినిషేధశాస్త్రము విద్వద్విషయమున సార్థకము కాదు. ఇక అవిద్వద్విషయమున సార్థక మనెదవా? దేహాదులే యాత్మ యను జ్ఞానము కలవారలకు పరలోక మున్నది. అచట కర్మ ఫల మనుభవింపవలయును అనెడి పారలౌకిక భోక్తృత్వజ్ఞానమే లేనందున నవిద్వద్విషయమున కూడ విధినిషేధశాస్త్రములకు సార్థక్యము లేనందున కర్తలేమింజేసి విధినిషేధశాస్త్రములకు వైయర్థ్యమే ప్రాప్తించును.

గనే ప్రసిద్ధము. ఇచట "సామ్య ముపైతి" పరమాత్మ సాదృశ్యమును పొందుచున్నాడు. అని చెప్పుటచే సాదృశ్యము భిన్నాశ్రయ మగుటంజేసి జీవపరమాత్మలు భిన్నులుగనే యాశ్రుతి యుపసంహరించి నందున యుపక్రమోపసంహారము లనెడి లింగములవలన జీవేశ్వరులకు భేదమే స్పష్టమగుచున్నది.

> తయో రన్య స్తథానశ్న న్నన్య ఇత్యాదికశ్రుతౌ,
> అభ్యాసోఽస్తి తథాన్యత్ర భిదా సత్య మితి శ్రుతౌ ॥ 61.

(61) అభ్యాసలింగము:— అథర్వణశ్రుతియందే "తయో రన్యః పిప్పలం స్వా ద్వత్తి" అని జీవేశ్వరు లిరువురిలో నొకడు స్వకృతకర్మఫలము ననుభవించుచున్నాడు. మరియొకడు (యీశ్వరుడు) సాక్షిగ చూచుచుండెను. అని జీవేశ్వరుల భేదమునే తిరిగి చెప్పుటయే యభ్యాసము. ఇట్టి యభ్యాసలింగముచేతను, మరియొకస్థలమునందుకూడ "భిదా సత్యం" జీవేశ్వరుల భేదము సత్యము అని భేదమునందే యభ్యాసలింగ ముండుటచేతను, జీవేశ్వరుల భేదమే స్పష్ట మగుచున్నది.

> శాస్త్రైకగమ్యో యో భేద ఈశ్వరప్రతియోగికః,
> కాలత్రయే ప్యబాధ్యోఽస్తి తథా తద్ధర్మకోపి యః ॥ 62.
> వినా ధర్మ్యాదివిజ్ఞానం భేదజ్ఞానం న జాయతే,
> ధర్మిణః పరమేశస్య యది వా ప్రతియోగినః ॥ 63.
> మానాన్తరాగోచరత్వా త్తద్భేదోపి తథేష్యతే,
> అత శ్శాస్త్రం వినా ప్రాప్తే రపూర్వత్వ మపీష్యతే ॥ 64.

(62—64) అపూర్వతాలింగము:— అపూర్వత్వ మనగ వేదముకంటె నితరమగు ప్రత్యక్షాదిప్రమాణముల కగోచరమగుట. ప్రకృతమున జీవునియందీశ్వరభేదము తెలియవలెను. అట్టి యీశ్వరభేదమునకు యీశ్వరుడు ప్రతియోగియగును. ప్రతియోగిజ్ఞానము లేనిదే యభావజ్ఞానము (అనగా: ప్రతియోగి యగునీశ్వరుడు తెలియబడనిదే) జీవునియందీశ్వరభేదము తెలియబడదు. అట్లే యీశ్వరునియందు జీవభేదజ్ఞానము కలుగవలె ననిన భేదాధికరణ మగు నీశ్వరునిజ్ఞానము లేనిదే "యీశ్వరుడు జీవభిన్నుడు" అని యీశ్వరునియందు జీవభేదజ్ఞానము కలుగనేరదు. అనగా "జీవు డీశ్వరభిన్నుడు" అను భేదజ్ఞానమునుగూర్చి ప్రతియోగీశ్వర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

—• సిద్ధాంతము •—

అని శంకింపఁజనదు. ప్రసిద్ధి ననుసరించి విధ్యుక్తకర్మలయందు ప్రవృత్తి, నిషిద్ధకర్మలయందు నివృత్తి సంభవించును. కాన విధినిషేధశాస్త్రములకు సార్థక్యము సంభవించును. అనగా విద్వద్విషయమున, శరీరాద్యాత్మదృష్టికలవారి విషయమున విధినిషేధశాస్త్రములకు ప్రవృత్తి లేకున్నను, ఈశ్వర క్షేత్రముల కేకత్వజ్ఞానములేనట్టిన్ని, 'శరీరాదులే యాత్మ కాదు. శరీరాదులకంటెు యాత్మ వేరు. అది పరలోకసంబంధము కలది. నిత్యము, కర్తృత్వభోక్తృత్వ

జ్ఞానము "ఈశ్వరుడు జీవభిన్నుడు" అను జ్ఞానమునుగూర్చి అధికరణ మగు యీశ్వరునియొక్క జ్ఞాన మపేక్షితము. ఈశ్వరుడు ప్రత్యక్షాదిప్రమాణగోచరుడు కాడు. అట్టి ప్రత్యక్షాదిప్రమాణాగోచర డగు నీశ్వరుని జ్ఞానము యీశ్రుతివలన కలుగుటచే నపూర్వతాలింగముగూడ జీవేశ్వరభేదవిషయమునే సిద్ధింపజేయుచున్నది.

పుణ్యపాపే విధూయేతి ఫలం సమ్య గుదాహృతమ్,
అస్య మహిమాన మితి వీతశోక ఇతి శ్రుతౌ ॥ 65.

(65) ఫలలింగము:— "పుణ్యపాపే విధూయ" ;అని జీవేశ్వరభేదజ్ఞానమునకు పుణ్యపాపవినిర్మోకము ఫలముగ చెప్పబడెను. కాన ఫల మనెడి లింగముకూడ జీవేశ్వరుల భేదమునే స్పష్టపరచుచున్నది.

స్తుతిరూపోఽర్థవాదోఽస్తి న ఫలం యత ఈశితుః,
మహిమా య స్స జీవస్య నైవ సంభవతీ త్యపి ॥ 66.

(66) అర్థవాదలింగము:— అర్థవాదమనగ స్తుతి:— "అస్య మహిమానమితి వీతశోకః" అను శ్రుతియందు స్తుతిరూపార్థవాద కలదు. ఈశ్రుతియందు ఈశ్వరుని మహిమ జీవునకు సంభవింపనందున ఫలము చెప్పబడలేదు. స్తుతియే చెప్పబడెను. కాన నీశ్రుతియందు స్తుతిరూపార్థవాదయే చెప్పబడె ననుట నిర్వివాదము.

అనశ్న న్నన్య ఇత్యేవ ముపపత్తి రపీరితా,
ఇత్థం హి షడ్విధం లింగం భేదే తాత్పర్యనిర్ణయే ॥ 67.

(67) ఉపపత్తిలింగము:— "అనశ్న న్నన్యోఽభిచాకశీతి" ఈశ్వరుడు కర్మఫలము ననుభవింపక సాక్షిగ చూచుచుండెను. అను యుపపత్తిలింగముచేగూడ జీవేశ్వరులకు భేదమే సిద్ధమగుచున్నది.

నిషేధవాక్యరూపత్వా త్ప్రబలై క్యశ్రుతే ర్యది,
అసద్వేత్యాదివాక్యం స్యా త్ప్రబలం తర్హి వైదికమ్ ॥ 68.
అతోఽప్యైక్యనిషేధాత్మా భేద ఏవ శ్రుతే ర్మతః,
కించ భేదశ్రుతిశ్చైవ ప్రబలైక్యశ్రుతే ర్భవేత్ ॥ 69.

(68, 69) ఇట్లు జీవేశ్వరుల భేద మున్నదనుటయందు ;శ్రుతికి తాత్పర్యనిర్ణయమునందు ఉపక్రమోపసంహారాదిషడ్విధలింగములు కలవు.

అభేదబోధకశ్రుతి భేదనిషేధబోధకవాక్యరూపమగుటవలన ప్రబల మనెదవా? అట్లగుచో "అస ద్వా ఇద మగ్ర ఆసీత్" అనుశ్రుతి సన్నిషేధబోధక వైదిక వాక్యమగుటవలన నదియు ప్రబలము కావలసివచ్చును. నిషేధవాక్యము ప్రబల మనినను భేద మైక్యనిషేధరూప మగుటవలన నది శ్రుతిసమ్మతమే యగుచున్నది.

ప్రత్యక్షాదికసంవాదా త్తథా నిరవకాశికా,
యత ఐక్యశ్రుతి ర్బ్రహ్మపదవాచ్యే పరేశ్వరే ॥ 70.

శాంకరభాష్యతత్త్వబోధిని:—
ములు కలది యను జ్ఞానముకల కొంద రవిద్వాంసులుకూడ కలరు. అట్టివారు "స్వర్గకామో యజేత" అను విధ్యుక్తకర్మల నాచరించెదరు. 'న కలంజం భక్షయేత్' అను నిషిద్ధకలంజభక్షణాదుల నాచరింపరు. అట్టివారి విషయమై విధినిషేధశాస్త్రములు సార్థక మగునుగావ విధినిషేధశాస్త్రముల కానర్థక్య మెన్నడును సంభవింపనేరదు. ఈశ్వర క్షేత్రము లొకటియే యని దృఢనిశ్చయము కల బ్రహ్మవిత్తులు మాత్ర మెన్నడును కర్మయందు ప్రవర్తింపరు.

(70) మరియు ప్రత్యక్షానుమానాదిసంవాదమువలనను, భేదశ్రుతియే ఐక్యశ్రుతికంటె ప్రబలము. అట్లు ఐక్యశ్రుతిబ్రహ్మపదవాచ్యమగు పరబ్రహ్మమునందు నిరవకాశమై లోకమున పరబ్రహ్మసజాతీయము లేనందున యభేదపరము కానేరదు.

తత్పరా న హి లోకేస్మి న్సజాతీయః పరేశితుః,
నహి భేదశ్రుతి స్తద్వ ద్భేదాభావేఽనవకాశగా ॥ 71.

(71) భేదశ్రుతి అభేదశ్రుతివలె భేదాభావమునం దవకాశము లేనిది.

న వ్యావహారికోఽయం చ భేదో ముక్తా వపి శ్రుతేః,
స కామా నశ్నుతే సర్వా న్బ్రహ్మణేతి భిదా శ్రుతా ॥ 72.

(72) ముక్తియందుకూడ "సోఽశ్నుతే సర్వా న్కామా న్సహ। బ్రహ్మణా విపశ్చితేతి ॥" అని జీవేశ్వరులకు భేదము శ్రుత మగుటవలన జీవేశ్వరభేదము వ్యావహారిక మని చెప్పవలనుపడదు.

నహి సావాంతరా ముక్తి ర్ముఖ్యేయం హరిణేరితా,
ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః ॥ 73.
సర్గేపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ,
ఇతి సర్గాద్యభావోక్తేః పరమా ముక్తి రేవ సా ॥ 74.

(73, 74) "ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః। సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ" అనియీముక్తి సర్గాదులు లేనందున ముఖ్యమైనదేయని శ్రీకృష్ణపరమాత్మ చెప్పుటవలన నవాన్తరముక్తి యనియు చెప్పనలవి కాదు.

భూమవిద్యాఫలం ప్రోక్తం ఛాందోగ్యేపి తథైవ చ,
తస్య సర్వేషు లోకేషు కామచారో భవ త్యథ ॥ 75.
ఏకధా భవతీత్యత్ర భేదస్యోక్తి శ్శ్రుతా శ్రుతా,
పరం జ్యోతి రుపేత్యాదౌ స్వేన రూపేణ తద్విదః ॥ 76.

(75, 76) ఛాన్దోగ్యమునందు భూమవిద్యాఫల మట్లే "సర్వేషు లోకేషు కామచారోభవతి" "ఏకధాభవతి" అనుస్థలమునందు భేదము చెప్పబడెను.

అవిర్భావోక్తితో ముక్తి స్తత్ర భేద శ్శ్రుత స్స్ఫుటమ్,
పుణ్యపాపే విధూయేతి సర్వకర్మక్షయశ్రుతేః ॥ 77.

(77) "పరం జ్యోతి రుపేత్యాదౌ స్వేన రూపేణ తద్విదః" పరబ్రహ్మవేత్తలు మొట్టమొదట పరబ్రహ్మమును పొంది స్వస్వరూపముచే నావిర్భవించెదరు. అని అవిర్భావోక్తివలన ముక్తి చెప్పబడెను. అచట జీవేశ్వరభేదము స్పష్టమే.

ముక్తి స్సా పరమా జ్ఞేయా నాత స్స్యాఽవాంతరా భవేత్,
ప్రేరితారం యదా జుష్టం పశ్య త్యన్యం మహేశ్వరమ్ ॥ 78.
తేనామృతత్వ మేతీతి భేదధీ ర్ముక్తిసాధనమ్,
ప్రత్యక్షైక్యే ప్రమాణం నో కించి దస్తీహ సాధకమ్ ॥ 79.

(78, 79) పుణ్యపాపే విధూయ" అని సర్వకర్మక్షయశ్రుతివలన నదియే పరమముక్తియని తెలిసికొన దగును. పుణ్యపాపకర్మవిధూననము అవాన్తరముక్తి కానేరదు. "ప్రేరితారం చ మత్వా" "జుష్టం యదా పశ్య త్యన్యం మహేశ్వరం తేనామృతత్వ మేతి" అని భేదజ్ఞానము ముక్తిసాధనముగ జెప్పబడెను.

ఆత్మత్వా న్నైవ భిద్యంతే జీవా హ్యై పరమాత్మనః,
పరమాత్మవదే వే త్యనుమానం మావ మత్ర చేత్ ॥ 80.
నైవం ప్రత్యక్షమానే నాపహృతో విషయో౽స్య భోః,
విజ్ఞాతృత్వాదిరూపస్య హ్యాత్మత్వస్య మతే తవ ॥ 81.

(80, 81) జీవు డాత్మస్వరూపముగుటవలన నాత్మస్వరూపముగు పరమేశ్వరుడువలె జీవుడు పరమేశ్వరాభిన్నుడు" అనుయనుమానప్రమాణము జీవేశ్వరుల కభేదమును సిద్ధింపజేయు ననెదవా? భేదగ్రాహి ప్రత్యక్షముచే జీవేశ్వరులకు భేదము సిద్ధించుచుండ నభేద మనుమానప్రమాణముచే సిద్ధింప నేరదు.

హేతో రసిద్దే స్తద్వ న్మే వేద్యత్వాదే రసిద్ధతా,
న చాప్యైక్యే శ్రుతి ర్మానం తస్యా అన్యపరత్వతః ॥ 82.
ప్రత్యక్షాదికసంసిద్ధభేదశ్రుతివిరోధతః,
తస్మా చ్ఛ్రుత్యాదిసిద్ధత్వా జ్జీవేశ్వరభిదా స్వతః ॥ 83.
పరమార్థస్వరూపాస్తీ త్యేవం భేదవయో జయీ,
అత స్స్వాభావికే భేదే సత్యతేశ్వరజీవయోః ॥ 84.
క్షేత్రజ్ఞ బ్రహ్మణో రైక్యం కథం భగవతో మతమ్,
సమ్మతం స్యా ద్యతోఽవాది త్వయైక్యం బ్రహ్మజీవయోః ॥ 85.

(82—85) అభేదవాదిమతమున ఆత్మత్వమనగ విజ్ఞాతృత్వము. అట్టి విజ్ఞాతృత్వ మనెడి యాత్మత్వము జీవునియందు లేమింజేసి హేతు వసిద్ధమగుటవలన జీవునియం దాత్మత్వము యీశ్వరాభేదసాధకము కానేరదు. అట్లే నామతమునందు కూడ (జీవేశ్వర భేదవాదిమతమునందు గూడ) వేద్యత్వహేతువు. జీవునియం దసిద్ధము. జీవేశ్వరుల కభేదమును శ్రుతి బోధించుచున్న దనెదవా? ఆశ్రుతియు ప్రత్యక్షాదికముచే సిద్ధించు భేదశ్రుతికి విరుద్ధ మగుటవలన అన్యపరమగుటచే జీవేశ్వరుల కభేదమును బోధింపనేరదు. కాన జీవేశ్వరభేదము శ్రుత్యాది సిద్ధమగుటవలన స్వతః పరమార్థస్వరూపము, కాన జీవేశ్వరభేదవాదియే జయముకలవాడగును. కాన జీవేశ్వరులకు స్వాభావికభేదముసిద్ధించుచుండ క్షేత్రజ్ఞునకు యీశ్వరునకు నభేదము శ్రీకృష్ణపరమాత్మ కభిమతమని చెప్పుట యెట్లుపొసగును? నీవు చెప్పిన యైక్యమే మతమగుచో శ్రీకృష్ణపరమాత్మ కదికూడ సంమతమగును. నీవు చెప్పిన జీవేశ్వరులకైక్యము మతము కానందున శ్రీకృష్ణపరమాత్మ కదియభిమతము కానేరదు.

తస్మాత్ క్షేత్రజ్ఞ మిత్యాదే రయ మర్థో హరే ర్మతః,
సర్వక్షేత్రేషు దేవాదిదేహేషు ఫలశాలిషు ॥ 86.
జ్ఞాతృత్వై కాంత్య మాత్మానం క్షేత్రజ్ఞం మాం మదాత్మకమ్,
విద్ధి చాపీ త్యపే ర్మాం త్వం విద్ధి క్షేత్ర మపీశ్వరమ్ 87.
క్షేత్రజ్ఞపరయో ర్దేహదేహిభావనిబంధనమ్,
సామానాధికరణ్యం మాం క్షేత్రజ్ఞ మితి యుజ్యతే ॥ 88.

(86—88) కాన "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అనుదానికి నేను చెప్పబోవు యర్థమే శ్రీకృష్ణపరమాత్మ కభిమతము. అది యెట్లనిన?

ఫలితాలులైన, దేవాదిదేహస్వరూపమైన సర్వక్షేత్రములయందు జ్ఞాతృత్వనియతము, ఆత్మయునగు క్షేత్రజ్ఞుని "మాం" మదాత్మకముగ (నేనే ఆత్మగా కలవానినిగ) "విద్ధి" తెలుసుకొనుము. "క్షేత్రజ్ఞం చాపి" అనుచోటనుండు "అపి" అనుశబ్దమువలన క్షేత్రములుగూడ "మాం" మదాత్మకముగ (నేనే యాత్మగా కలవానినిగ) తెలిసికొనుము. అని "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధిం" అను గీతావాక్యమున కర్థము చెప్పవలెను. ఇట్లున్నచో "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని 'క్షేత్రజ్ఞం' అను పదమునకు 'మాం' అనుపదమునకు అభిన్నార్థప్రతిపాదకత్వమనెడి సామానాధికరణ్యమెట్లు పొసగు ననెదవా? "క్షేత్రజ్ఞం మాం" అనుచోట క్షేత్రజ్ఞపరమాత్మలకు దేహదేహిభావనిబంధనమైన సామానాధికరణ్యము "క్షేత్రజ్ఞం మాం" అని సంభవించును.

జీవరూపశరీరేణ యుక్తాంతర్యామిణ శ్చితః,
త్వం మర్థస్య తదర్థేన సర్వజ్ఞేన పరాత్మనా ‖ 89.
అభేదబోధనం శ్రీమద్గరిణైవం నిరూప్యతే,
జీవ స్యేశశరీరత్వా చ్ఛరీరీ పరమేశ్వరః ‖ 90.
తయో రైక్యం స్వరూపేణ ప్రతిషిద్ధం పురైవచ,
తజ్జన్యత్వేన వా తస్య తద్వ్యపదేశ ఇష్యతే ‖ 91.

(89—91) జీవస్వరూపమగు శరీరముతో గూడిన అంతర్యామి, చిద్రూపము నగు "త్వం" అను పదార్థమునకు, తత్పదార్థము, సర్వజ్ఞుడు నగు పరమాత్మతో నభేదమును బోధించుటకే శ్రీకృష్ణపరమాత్మ చే "క్షేత్రజ్ఞం మాం విద్ధి" అని చెప్పబడెను. జీవు డీశ్వరుని శరీర మగుటవలన పరమేశ్వరుడు శరీరియగును. అట్టి శరీరశరీరులకు స్వరూపముచే నైక్యము సుతరాం సంభవముగాదని పూర్వమునందే నిషేధింపబడెను. ఈశ్వరజన్య మగుటవలన జీవుడు తత్స్వరూపుడని తద్వ్యపదేశము సంభవించును.

తదాశ్రియతయా వాస్తు క్షేత్రజ్ఞం విద్ధి మా మితి,
ఆత్మత్వజీవక్షేత్రజ్ఞశబ్దానాం హి నియంతరి ‖ 92.
సర్వాంతర్యామి ణీశేస్తి శక్తి రాగమసమ్మతా,
అంతర్యామిపరం మానం శ్రుతే ర్వాక్యం సహస్రశః ‖ 93.

(92-93) తదాశ్రియ మగుటచేతనైనను "క్షేత్రజ్ఞం మాం విద్ధి" అని చెప్పబడెను. ఆత్మత్వజీవక్షేత్రశబ్దములకు నియన్తయు, సర్వాంతర్యామియు నగు నీశ్వరునియందే యాగమము సంమతమైన శక్తి కలదు. శ్రుతివాక్యమంతర్యామిపరమై యనేక విధముల ప్రమాణము.

అత ఆహ స్మ భగవా న్క్షేత్రజ్ఞం విద్ధి మా మితి,
క్షేత్రక్షేత్రజ్ఞయో రేవం వివేకవిషయం తయోః ‖ 94.
మదాత్మకత్వవిషయం జ్ఞాన ముక్త మిహోత్తమమ్,
తదేవాదేయ మాదృత్య జ్ఞాన మిత్యేవ మే మతమ్ ‖ 95.

(94-95) అందువలననే శ్రీకృష్ణపరమాత్మ "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని చెప్పెను. అట్టి క్షేత్రక్షేత్రజ్ఞుల వివేకవిషయకము, మదాత్మకత్వవిషయకమైన, ఉత్తమమైన జ్ఞాన మీగీతయందు చెప్పబడెను. ఆదరించి యట్టి జ్ఞానమే స్వీకరింపదగినదని నామతము.

ఇత్థం స్వాభావికే భేదే సత్యే వేశ్వరజీవయోః,
ఉక్తరీత్యా స్త్వభేదోక్తి ర్నాన్యథాఽతివిరోధతః ॥ 96.
సార్వజ్ఞ్యాదిగుణానంతశక్త్యైశ్వర్యాదిశాలినా,
అనైశ్వర్యాదిదుష్టస్యాఽభేదో నైవాస్తి యుక్తిభాక్ ॥ 97.

(96-97) ఇట్లు జీవేశ్వరులకు భేదము స్వాభావికమైయుండ పైన చెప్పినవిధమున "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అను స్థలమున మేము చెప్పినవిధముననే గ్రహియింపనగును. మరియొకవిధమున చెప్పినచో ప్రత్యక్షాదిప్రమాణముల కతివిరుద్ధమగును. కాన మరియొక విధమున చెప్పరాదు. సర్వజ్ఞత్వ అనన్తశక్త్యైశ్వర్యాది గుణములుకల యీశ్వరునితో అనైశ్వర్యాదిదుష్టమైన జీవునకు అభేద మెప్పటికిని యుక్తిసమ్మతము కానేరదు.

ఉపదేశ్యోపదేశాదివ్యవహారోపి దుర్ఘటః,
ఐక్యవాదే తతోప్యేష భేదపక్షోఽతియుక్తిమాన్ ॥ 98.
ఏవం చిదచిదీశానాం స్వరూపేణ స్వభావతః,
భేదం సమ్యగ్వదంతీనాం శ్రుతీనా మవిరోధతః ॥ 99.

(98-99) జీవేశ్వరుల కభేదమే యగుచో ఉపదేశ్యోపదేశకవ్యవహారమే లోపించెడిని. కాన నిట్లు చిద్రూపులగు జీవులకు, అచిద్రూపమగు క్షేత్రమునకు, యీశ్వరునకు స్వరూపము చేతను, స్వభావము చేతను విరోధము లేకుండగ భేదమును లెస్సగ బోధించుచున్న శ్రుతుల ననుసరించిన భేదపక్షమే మిక్కిలి యుక్తియుక్తమైనది.

భిన్నోఽచింత్యో మహేశః స్థిరచరగణతః క్షేత్రవిత్క్షేత్రదేహః
శేషఽంతర్యామిగీర్భి స్స్మృతిభి రపి భిదా యస్య జీవా త్సదేష్టా,
ప్రత్యక్షాదిప్రమాణై రహమనుభవత స్సిద్ధభేదో వరిష్ఠః
కృష్ణః క్వ క్వాస్తి జీవో భ్రమశతవలితో భేదసిద్ధి ర్మతేత్థమ్ ॥ 100.

(100) అన్తర్యామి బ్రాహ్మణవాక్యములచేతను, స్మృతులచేతను యెవనికి జీవునికంటె భేదమెల్లపుడు యిష్టమో అట్టిఅచిన్త్యుడు, క్షేత్రక్షేత్రములు దేహముగాకల శేషియునగు పరమేశ్వరుడు జంగమస్థావరాత్మక సమూహముకంటె భిన్నుడు. ప్రత్యక్షాదిప్రమాణములచేతను, "అహం" అను అనుభవమువలనను సిద్ధమైన భేదముకల శ్రీకృష్ణపరమాత్మ యెక్కడ? భ్రమశతవలితుడైన జీవుడెక్కడ? ఇట్లు జీవేశ్వరులకు భేదసిద్ధి సమ్మతము. వైష్ణవులిట్లు జీవేశ్వరులకు భేదమే సిద్ధము. అభేదమెన్నటికిని సంభవింపదని గొప్ప పూర్వపక్షమును చేసిరి.

అత్రాభిధీయతే శ్రౌతసిద్ధాంతో హరిసంమతః,
స్యా దేవం యది సంసిద్ధ్యే ద్భేదో జీవేశయో ర్దృఢః ॥ 101.
మానశూన్యతయా నాస్తి పరమార్థా భిదాఽనయోః,
నాఽన్యోఽతోస్తీతి సద్వాక్యం భేద మేనం ప్రబాధతే ॥ 102.

—♦ అద్వైతసిద్ధాంతము ♦—

(101, 102) ఇట్లు ద్వైతులు "జీవేశ్వరులకు భేదమే కాని యభేదము సిద్ధింపదని చేసిన పూర్వపక్షముపై శ్రీకృష్ణపరమాత్మకు సంమతమైనదియు, శ్రౌత (శ్రుతిసమ్మత) మైనదియునగు సిద్ధాంతము చెప్పబడుచుండెను.

జీవేశ్వరులకు దృఢమైన భేదమే సిద్ధించినచో నీవు చెప్పిన (ద్వైతులు చెప్పినదే) సిద్ధాంతమగును. ప్రమాణము లేనందున జీవేశ్వరులకు పరమార్థభేదము లేదు. మరియు "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" అను శ్రుతివాక్యము జీవేశ్వరుల భేదమును బాధించుచున్నది.

జీవేశయో రభేదే తు ప్రమాణం శ్రుతయోఽఖిలాః,
సూత్రాణి స్మృతయో విద్వన్నిర్ణీతానుభవోఽనఘః ॥ 103.
పారమార్థికతా భేదే జాతి ర్గోత్వాదివ న్న హి,
సత్తా తిరిక్తాయా జాతే స్సత్తావ్యాప్యత్వసంభవాత్ ॥ 104.
పదార్థమాత్రే నైవాస్తి జాతిః కాచన సమ్మతా,
సామాన్యాదా యతో జాతి ర్నైవాంగీక్రియతే బుధైః ॥ 105.
పరాభిమతసత్తాఖ్యజాతే ర్ద్రవ్యాదికత్రయే,
వృత్తిత్వా న్నైవ సా భేదే భావధర్మతయేష్యతే ॥ 106.

103—106) మరియు జీవేశ్వరుల యభేదమునందే నిఖిలశ్రుతులు, సూత్రములు, స్మృతులు, నిరవద్యమైన విద్వదనుభవము ప్రమాణములు.

గోవునందు గోత్వమనెడి జాతి యుండినటుల జీవేశ్వరుల భేదమునందు పారమార్థికత్వమనెడి జాతి లేదు. ఎందువలననిన? ద్రవ్యగుణకర్మలయందే సత్త యనునది యుండును. అట్టి సత్తకు వ్యాప్యము జాతి, సత్తావ్యాప్యమనగ సత్త లేనిచోట యుండనిది. కాన సత్తలేని భేదమునందు జాతియు నుండదు. కాన పారమార్థికత్వరూపజాతి జీవేశ్వరభేదమునం దుండునని చెప్పుట పొసగదు.

నవా ప్రామాణికత్వం స్యా ద్భేదస్య శ్రుతిబాధనమ్,
ప్రత్యక్షాబాధ్యభేదస్య బాధికా శతశశ్శ్రుతిః ॥ 107.
ప్రత్యక్షాబాధ్యమాత్రేణ నహి సత్యా భిదా భవేత్,
చంద్రే ప్రాదేశికత్వం చ ప్రత్యక్షాబాధ్య మస్త్యపి ॥ 108.
శాస్త్రతో బాధ్య మస్త్యేవ తథా భేదోపి బాధ్యతే,
నాన్యోఽతోఽస్తీ త్యతో ద్రష్టా న శ్రోతాఽతో విలక్షణః ॥ 109.
ఇత్యాదిభేదబాధేన బ్రహ్మాత్మైక్యపరా శ్రుతిః,
న స్వన్యపరతాస్త్యస్యాః శ్రుతే రన్యవిరోధతః ॥ 110.

(107—110) శ్రుతికి విరోధమువలన జీవేశ్వరభేదము ప్రామాణికము కాదు.

ప్రత్యక్షముచే బాధింపబడని భేదమునకు శతశః (అనేకవిధముల) శ్రుతి బాధక మగుచున్నది. ప్రత్యక్ష ప్రమాణ మాత్రముచే బాధింపబడనిదగుటచే జీవేశ్వరభేదము సత్యము కాదు. చక్షురింద్రియముచే చంద్రునియందు ప్రాదేశికత్వము (లొడితుడు అను పరిమాణము) గృహీతమైనను శాస్త్రము "చంద్రుడు పెద్దపరిమాణము కలవా" డని బోధించుటవలన ప్రత్యక్షప్రమాణము అప్రమాణమైనటుల "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" ఇత్యాది బ్రహ్మాత్మైక్యపరశ్రుతులచే జీవేశ్వరులకు భేదము నిషేధింపబడుటవలన జీవేశ్వరుల భేదమునందుకూడ ప్రత్యక్షమప్రమాణము.

భిన్నోఽచింత్యో జీవసంఘా దిత్యస్యా స్సానువాదికా,
నైవం శ్రుతిత్వ మేవాస్య దుర్భణం వచసో యతః ॥ 111.

(111) "భిన్నోఽచిన్త్యో జీవసంఘాత్" అచిన్త్యుడగు పరమేశ్వరుడు జీవసంఘముకంటె భిన్నుడు అను శ్రుతివిరోధమువలన "నాన్యోఽతోఽస్తిద్రష్టా" అను శ్రుతి "భిన్నోఽచిన్త్యో జీవసంఘాత్" అను

శ్రుత్యర్థమగు భేదమునే యనువదించుచున్నది. ప్రత్యక్షప్రసిద్ధమగు జీవేశ్వరుల భేదమునే శ్రుతులు బోధించుటచే మాభేదవాదమే సిద్ధమగుచున్నదని శంకింపజనదు. "భిన్నోఽచిన్త్యో జీవసంఘాత్" అను వాక్యము ప్రసిద్ధమగు వేదశాఖలయం దెచ్చటను కానరానందున "భిన్నోఽచిన్త్యోజీవసంఘాత్" అను వాక్యము నకు శ్రుతిత్వమే సంభవము కాదు. అందువలన "భిన్నోఽచిన్త్యో జీవసంఘాత్" అను శ్రుతి జీవేశ్వరులకు భేదము బోధించుటచే నట్టి భేదమునే "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" అను శ్రుతి యనువదించుచున్నదనియు అందువలన భేదవాదమే ప్రమాణసిద్ధము అను శంకతొలగెను.

న ప్రసిద్ధాసు శాఖాసు పాఠః సతాఽపి దృశ్యతే,
శ్రుతిత్వే ప్యస్య నాఽభేదప్రతిషేధకతా భవేత్ ॥ 112.
ప్రత్యుతాస్యైవ వాక్యస్య భేదబాధకతేర్యతే.
జీవసంఘా న్న భిన్నోఽయం చిన్త్య ఇత్యర్థత స్స్ఫుటమ్ ॥ 113.
శబ్దతో వార్థతో వాక్యం నాభేదప్రతినిషేధకమ్,
కించాయం ప్రతిషేధోఽపి కస్యాఽభేదస్య బాధకః ॥ 114.

(112-114) మరియు "భిన్నోఽచిన్త్యో జీవసంఘాత్" అను శ్రుతివాక్య మున్నను యీవాక్య మభేదమును నిషేధించునది కాదు. మరేమనిన "జీవసంఘా న్న భిన్నోఽయం చిన్త్యః" పరమేశ్వరుడు జీవసంఘముకంటె భిన్నుడని చింతింపదగదు. అని యీశ్రుతి జీవేశ్వరుల భేదమునే నిషేధించుచున్నది. కాన శబ్దమువలనకాని, అర్థమువలనకాని "భిన్నోఽచిన్త్యో జీవసంఘాత్" అను శ్రుతివాక్యము అభేదమును నిషేధించునది కాదు.

ప్రాతీతికస్యాఽభేదస్య కిం వ్యావహారికస్య చ,
ఉతాహో వాస్తవస్యాస్తి నాద్య స్సంగచ్ఛతే శృణు ॥ 115.
శుక్తిరూప్యాదివ న్నాయ మపరోక్షప్రతీతిభాక్,
భేదప్రమావిరోధాచ్చ నాయం ప్రాతీతికో భవేత్ ॥ 116.

(115-116) మరియు "భిన్నోఽచిన్త్యో జీవసంఘాత్" అను శ్రుతివాక్యము జీవేశ్వరుల భేదమునే బోధించుననినచో (1) యట్టి భేదము ప్రాతిభాసికాఽభేదమునకు బాధకమా? (2) లేక వ్యావహారికాభేదమునకు బాధకమా? (3) వాస్తవాఽభేదమునకు బాధకమా? జీవేశ్వరుల యభేదము శుక్తిరూప్యమువలె అపరోక్షప్రతీతివిషయము కానందునను, భేదప్రమావిరోధమువలనను జీవేశ్వరుల యభేదము ప్రాతీతికము కాదు. (ప్రాతిభాసికము కాదు.) కాన "భిన్నోఽచిన్త్యో జీవసంఘాత్" అను శ్రుతిబోధితమైన జీవేశ్వరుల భేదము జీవేశ్వరుల ప్రాతీతికా (ప్రాతిభాసికా)భేదబాధక మను ప్రథమపక్షము నిరాకృతము.

న ద్వితీయోఽనయో ర్యస్మా త్తుల్యసత్తాకయో ర్ద్వయోః,
విరోధా దేకదైకత్ర విభేదాఽభేదయో స్స్వతః ॥ 117.

(117) భేదము వ్యావహారికసత్తాకము, అభేదము వ్యావహారిక సత్తాకమే. కాన తుల్యసత్తాకములగు జీవేశ్వరుల భేదము, అభేదములు ఒకచోట యొకేకాలమునందు పరస్పరవిరోధమువలన ప్రాప్తింపనందున జీవేశ్వరుల వ్యావహారికభేదము జీవేశ్వరుల వ్యావహారికాభేదబాధక మను ద్వితీయపక్షముకూడ నిరస్తము.

వాస్తవస్యా ప్యభేదస్య నిషేధో నోపపద్యతే,
న వ్యావహారికో భేదో హ్యభేదం పారమార్థికమ్ ॥ 118.

(118) వ్యావహారికభేదము వాస్తవ (పారమార్థిక) అభేదమునకు బాధకము కానందున శ్రుతిసమ్మతమైన పారమార్థికాభేదము వాస్తవికమగుటచే తృతీయపక్షము నిరస్తము.

బాధతేఽతో ప్యబాధ్యోస్తి హ్యభేద శ్శ్రుతిసమ్మతః,
ఏతేన భేదవాక్యేన జీవతాదాత్మ్య మీశ్వరే ॥ 119.
ప్రతిషిధ్యత ఇత్యేవం ప్రత్యుక్తం తత్కథం శృణు,
న జీవస్యావచ్ఛిన్నస్య యద్రూపం వ్యావహారికమ్ ॥ 120.
తదేవ బ్రహ్మణో రూపం వేదాంతిభి రితీష్యతే,
నాన్యోఽతోఽస్తీతి వాక్యార్థోఽ ప్యభేదః పరమార్థతః ॥ 121.

(119-121) ఈచెప్పబోవు యుక్తిచే పరమాత్మయందు జీవతాదాత్మ్యము కలదను పక్షముకూడ దూరతోఽపాస్తము. అది యెట్లనిన? అవచ్ఛిన్నుడగు జీవునకు వ్యావహారికమైన యేరూపము కలదో అరూపమే యీశ్వరునిది అని వేదాన్తులు చెప్పరు. ఇక నేమన; "నాన్యోఽతోఽస్తిద్రష్టా" అను శ్రుతిననుసరించి జీవేశ్వరులకు పారమార్థికాభేదమని చెప్పెదరు.

నను భేదోపి మానేన సిద్ధోస్తి శ్రుతివాక్యతః,
సత్య ఆత్మా సత్యో జీవో సత్యం భిదా సతీతి చేత్ ॥ 122.

(122) ప్రత్యక్షప్రమాణముచేతను, "సత్య ఆత్మా సత్యో జీవః సత్యం భిదా సతీ" అను శ్రుతివలనను జీవేశ్వరుల భేదముకూడ సిద్ధమే. కాన భేదాభేదములు రెండును శ్రుతిసమ్మతములే యగుటవలన జీవేశ్వరులకు తాదాత్మ్యము సిద్ధించునని శంకింపజనదు. (తాదాత్మ్య మనగ భేదసహిష్ణు వగు నభేదము.

నైవం ప్రసిద్ధశాఖాసు నేదం వాక్యం ప్రదృశ్యతే,
శ్రుతిత్వే ప్యస్య భేదాపవాదశ్రుతివిరోధతః ॥ 123.
న స్యా త్స్వార్థపరత్వం త ద్వాస్త్వభేదపరం వచః,
సత్య ఆత్మేతి చిద్ధాతో స్త్రికాలాబాధ్యతేరితా ॥ 124.
నన్వాత్మనో హి సత్యత్వే జీవత్వమపి వాస్తవమ్,
కిం న స్యాదితి శంకాయా మసత్యో జీవ ఉచ్యతే ॥ 125.
విశిష్టప్రతిషేధస్య సంక్రమ స్స్యా ద్విశేషణే,
విశేష్యబాధే సత్యేవం జీవత్వం నైవ వాస్తవమ్ ॥ 126.
బహుశ్రుత్యనురోధేన భేదోఽసత్య ఇతి శ్రుతేః,
అనేనేహ భిదా సత్యా సజాతీయా నిరాకృతా ॥ 127.
సత్యం భిదా సత్య మితి విజాతీయనిరాకృతిః,
పంచభూతాత్మకం విశ్వం సత్యశబ్దేన కీర్తితమ్ ॥ 128.
సచ్చ త్యచ్చాభవ త్సత్యం భిదా భిద్యత ఏవ తత్.
ఇత్యసత్య మనిర్వాచ్యం తద్వార్థ్యాయ పున ర్వచః ॥ 129.
భిదా సత్యం భిదేత్యేవ కాకాక్షిన్యాయతో భవేత్,
ఉభయత్రాన్వయీత్యేవం తద్వాక్యం భేదబోధకమ్ ॥ 130.

(123—130) చంద్రుడు ప్రాదేశమాత్రపరిమాణము కలవాడు అను ప్రత్యక్షము అప్రమాణమగుటచే శ్రుతి విరుద్ధార్థమును తెలుపుటయందు ప్రత్యక్షమప్రమాణమే యగును. పైనుదహరించిన "సత్య ఆత్మా సత్యో జీవ స్సత్యం భిదా సతీ" అను శ్రుతి ప్రసిద్ధశ్రుతులయం దెచ్చటను కానరానందున నది శ్రుతియే కాదు. అటులైనను (ప్రసిద్ధశ్రుతులయం దీవాక్యము కానరాకున్నను) "సత్య ఆత్మా సత్యో జీవ స్సత్యం భిదా సతీ" అనువాక్యము శ్రుతియే యన్నను భేదమున కపవాదక (నిషేధక) మగు "నాన్యోఽతోఽస్తి

దృష్టా'' అను శ్రుతికి విరోధము ప్రాప్తించును. కాన "సత్య ఆత్మా సత్యో జీవ స్సత్యం భిదా సతీ'' అనుశ్రుతికి స్వార్థ (భేద) పరత్వము సంభవింపదు. మరేమనిన? అభేదపరమే యీశ్రుతియని చెప్ప వలయును. అది యెట్లనిన? "సత్య ఆత్మా అనుదానిచే చిద్ధాతువునకు త్రికాలాబాధ్యత్వమర్థము చెప్పబ డెను. ఆత్మసత్యమనినచో జీవత్వముకూడ సత్యమే యగునను శంకను తొలిగించుటకు "అసత్యోజీవః'' అని చెప్పబడెను. "స విశేషణే హి విధినిషేధౌ సత్యపి విశేష్యబాధే విశేషణ ముపసంక్రామతః'' (విశే షణవిశిష్టమునందు విధి కాని, నిషేధము కాని చెప్పిన యావిధినిషేధములు విశేష్యమునందు బాధితములైననాడు విశేషణమునందు సంక్రమించును.) అను న్యాయముచే "అసత్యో జీవః'' అను వాక్యముచే జీవత్వవిశిష్ట చిద్ధాతువునం దసత్యత్వము బోధింప (విధింప) బడుటవలన నట్టి యసత్యత్వము చిద్ధాతువునందు బాధితమ గుటచే విశేషణమగు జీవత్వమునందు సంక్రమించును. అనగా జీవత్వ మసత్యము అని "అసత్యో జీవః'' అను వాక్యమున కర్థము. అనేక శ్రుతుల యవిరోధముచేతను, "ఖేదోఽ సత్యః'' అను శ్రుతిచేతను, సజాతీయభేదము నిరాకృతము. "సత్యం భిదా సత్యం'' అను దానిచే విజాతీయభేదము నిరాకృతము. ""సచ్చ త్యచ్చాభవత్'' అనుశ్రుతిచే పంచభూతాత్మకమగు విశ్వము చెప్పబడెను. అట్టి విశ్వమే 'సత్యం' అనుదానిచే చెప్పబడెను. "భిద్యత ఇతి భిదా'' అను విగ్రహముచే విశ్వము పరస్పరభేదము కలదనియు "భిదా'' అను శబ్దము బోధించుచున్నది. అట్టి విశ్వము అసత్యము, అనిర్వచనీయము. దానిదార్ఢ్యము కొఱకే 'అసత్యం' అని పునర్వచనము "భిదా సత్యం భిదా'' కాకాక్షిన్యాయముచే నన్వయించిన సావాక్య ముభ యత్ర అన్వయించుటవలన భేదబాధక మగుచున్నది.

> విభేదజనకేఽజ్ఞానే నాశ మాత్యన్తికం గతే.
> ఆత్మనో బ్రహ్మణో భేద మసంతం కః కరిష్యతి ॥ 131.
> ఇత్యేవం భేద మావ్యాత్య స్మృతి రేషా నిషేధతి,
> ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతి చ సజ్జనాః ॥ 132.
> ఇత్యాదీ న్యపి సూత్రాణి భేదం చాపవదం త్యలమ్,
> అభేదశ్రుతి రేవం హి తత్పరత్వేన హేతునా ॥ 133.
> స్వతో బలవతీ జ్ఞేయా హ్యజ్ఞాతజ్ఞాపకత్వతః.
> తదాత్మాన మేవావే దహం బ్రహ్మాస్మీతి వాక్యతః ॥ 134.
> బ్రహ్మాత్మైక్యధియా మోక్షః సర్వాత్మత్వాప్తిలక్షణః,
> ప్రతివేదాన్త మస్త్యేవ లింగ మాత్మైక్య నిర్ణయే ॥ 135.
> అత స్స్వార్థపరాఽభేదశ్రుతి ర్బలవతీ భవేత్,
> న చ భేదేస్తి తాత్పర్యం కస్యా అపి శ్రుతే స్స్మృతేః ॥ 136.

(131—136) మరియు "విభేదజనకేఽజ్ఞానే నాశ మాత్యన్తికం గతే। ఆత్మనో బ్రహ్మణో భేద మసన్తం కః కరిష్యతి'' (భేదజనకమగునట్టి యజ్ఞానము పూర్తిగ నశించినచో జీవపరమాత్మలకు లేని భేదము నెవడు కల్పించును? యెవడును కల్పించలేడు) అను స్మృతియు జీవేశ్వరుల భేదము ననువదించి నిషే ధించుచున్నది.

మరియు "ఆత్మేతి తూపగచ్ఛన్తి గ్రాహయన్తి చ'' అను నిత్యాదిసూత్రములుకూడ జీవేశ్వరుల భేదమునే నిషేధించుచున్నవి.

ఇట్లు జీవేశ్వరులకు భేదము నిషేధింపబడియుండ నభేదశ్రుతి యభేదపర మగుటచే అజ్ఞాతజ్ఞాపక మగుటవలన "తదాత్మాన మేవావేదహం బ్రహ్మాస్మీతి''అను వాక్యమువలన బలము కలది. ప్రతివేదాంతము నందు బ్రహ్మాత్మైక్యజ్ఞానముచే సర్వాత్మత్వప్రాప్తి రూపమోక్షము ప్రాప్తించు నని చెప్పబడెను. ఇదియు ఆత్మైక్యనిర్ణయమునందు లింగము(హేతువు) కాన అభేదశ్రుతి స్వార్థపరమై బలము కలది. మరియు యేశ్రుతికిని, స్మృతికిని జీవేశ్వరభేదమునందు తాత్పర్యము లేదు.

ననూక్తం ద్వాసుపర్ణేతి శ్రుతే ర్భేదపరత్వకమ్,
నైవం తస్యా హి భేదానువాదా త్తత్ప్రతిషేధతః ॥ 137.
అభేద ఏవ తాత్పర్యం న భేదే తత్కథం శృణు,
బ్రహ్మైవేద మమృతం పురస్తా దితి వాక్యతః ॥ 138.
సర్వాత్మత్వే వినిర్దిష్టే బ్రహ్మణః పరమాత్మనః,
భోక్తృభేదాచ్చ భోక్తృ స్యా ద్బ్రహ్మస్మితిర్హి తచ్చ న ॥ 139.
యుక్తం తస్మా న్న సర్వాత్మబ్రహ్మే త్యాశంక్య పఠ్యతే,
మంత్రోఽయం ద్వాసుపర్ణేతి తస్యార్థోఽయ ముదీర్యతే ॥ 140.

(137—140) "ద్వా సుపర్ణా సయుజా సఖాయా" అను శ్రుతి జీవేశ్వరభేదపర మని చెప్పియుంటి మిగదా! యని శంకింపజనదు. ఈశ్రుతియు జీవేశ్వరభేదము ననువదించి యట్టి భేదమును నిషేధించుటవలన నభేదమునందే తాత్పర్యము కలది. భేదమునం దాశ్రుతికి తాత్పర్యము లేదు. అది యెట్లనిన? చెప్పెద వినుము.

"బ్రహ్మైవేద మమృతం పురస్తాత్" అను వాక్యమువలన పరమాత్మస్వరూప మగు బ్రహ్మము నకు సర్వాత్మత్వము నిర్దేశింపబడియుండ నట్లగుచో భోక్తృభేదమువలన బ్రహ్మముకూడ భోక్త కావలసి వచ్చును. కాన బ్రహ్మమునకు సర్వాత్మత్వము యుక్తము కాదు. అను శంకపై "ద్వా సుపర్ణా సయుజా సఖాయా" అను మంత్రము పఠింపబడెను. దీని యర్థ మేమందువా? చెప్పెద వినుము.

యౌ ద్వౌ జీవేశ్వరౌ బింబప్రతిబింబస్వరూపిణౌ,
అస్మి న్నరీరే వర్తేతే తయో ర్మధ్యేఽన్య ఈశితుః ॥ 141.
ధీప్రతిబింబభూత స్తదభేదాధ్యాసతో భ్రమీ,
స తద్ధర్మాభిమానీ సన్ భుంక్తే కర్మఫలం తతః ॥ 142.
స ఏవాన్య స్స్వయం బింబభూత స్సాక్షీ చిదద్వయః,
బుద్ధితాదాత్మ్యశూన్య స్సం శ్చిదానందఘనాత్మనా ॥ 143.
అనశ్న న్భోగశూన్య స్స న్నుదాసీనః ప్రకాశతే,
అనశ్న న్నితి భోక్తృత్వనిషేధః ప్రత్యగాత్మనః ॥ 144.
సర్వథా తత్ర జీవస్య సాక్షా ద్భోగనిషేధతః,
కస్య స్యా త్త్వద్ధి భోక్తృత్వ మిత్యాశంక్యాహ వేదగీః ॥ 145.
స ఏవాధ్యస్తయా బుద్ధ్యా తాదాత్మ్యాధ్యాసతః ఫలం,
భుంక్త ఇత్థం న భోక్తృత్వధీవిరోధోఽపి చిద్ఘనే ॥ 146.

(141-146) బింబప్రతిబింబభూతు లగు జీవేశ్వరు లీశరీరమునందు కలరు. వారిరువురిలో యీశ్వరుని కంటె వేరగు జీవుడు బుద్ధిగతప్రతిబింబభూతుడు. అట్టి జీవుడు బుద్ధ్యభేదాధ్యాసవలన భ్రమ కలవాడు. అట్టి జీవుడు బుద్ధిధర్మాభిమానియై కర్మఫలము ననుభవించుచుండెను. అందువలన జీవు డన్యుడు. స్వయముగ చిత్స్వరూపము, అద్వయము, బింబభూతము, నగు సాక్షి బుద్ధితాదాత్మ్యశూన్యమై చిదానందఘనస్వరూప ముచే కర్మఫలము ననుభవింపనివాడై, భోగశూన్యుడై, ఉదాసీనుడై ప్రకాశించుచుండెను. "అనశ్నన్" అని ప్రత్యగాత్మకు భోక్తృత్వముయొక్క నిషేధము చెప్పబడెను. అన్నివిధములచేతను, జీవునకు సాక్షాత్తు భోగనిషేధముకలన నెవనికి భోక్తృత్వము అను శంకపై వేదవాక్య ముందువిధమున చెప్పుచుండెను. వాడె (చిదాత్మయే) అధ్యస్తమైన బుద్ధితో తాదాత్మ్యాసవలన ఫలమును అనుభవించుచుండెను. ఇట్లు చిద్ఘనుని యందు భోక్తృత్వజ్ఞానవిరోధముకూడ ప్రాప్తించదు.

అతః పైంగిరహస్యేఽస్య వ్యాఖ్యానం శుద్ధసత్త్వయోః,
సత్త్వం చిచ్ఛాయయా యుక్త మంతఃకరణ ముచ్యతే ॥ 147.
క్షేత్రజ్ఞ శ్శుద్ధ ఆత్మా చిద్ఘన స్సాక్షీ తథేరితః,
సత్త్వే భోక్తృత్వ మాపాద్య శుద్ధే తచ్చ నిషిధ్యతే ॥ 148.
భేదానువాదపూర్వేణ మంత్రోఽయం శుద్ధచిద్ఘనే,
తత్పరో నతు జీవేశభేద మప్యవగాహతే ॥ 149.
అత అవిద్యకం భోక్తృభావ మేవ మనూద్య సః,
ద్వాసుపర్ణేతి నిర్దిష్టచైతన్యాత్మైక్య తత్పరః ॥ 150.

(147-150) అందువలన పైంగిరహస్యమునం దీమంత్రమునకు శుద్ధసత్త్వపరముగ నర్థము చెప్పబడెను. (వ్యాఖ్యానింపబడెను.) చిచ్ఛాయతో గూడినట్టి యంతఃకరణము సత్త్వ మనబడును. క్షేత్రజ్ఞుడు, శుద్ధము నగు యాత్మచిద్ఘనుడు, సాక్షి అని చెప్పబడును. భోక్తృత్వాదికము చిచ్ఛాయాయుక్తమై సత్త్వమని చెప్పబడు నంతఃకరణమునందే యాపాదింపబడి శుద్ధమగు క్షేత్రజ్ఞునియందు భోక్తృత్వాదికము లేదని నిషేధింపబడెను. కాన "ద్వా సుపర్ణా" అను మంత్రము భేదానువాదపురస్సరముగ శుద్ధచిద్ఘనమునం దభేదపరమే యగుచున్నది. కాని జీవేశ్వరుల భేదమునుమాత్రము బోధింపదు. అందువలన నావిద్యకమగు భోక్తృత్వము ననువదించి "ద్వాసుపర్ణా" అనుశ్రుతి నిర్దిష్టముగ చైతన్యాత్మైక్యపరమే యగుచున్నది.

బ్రహ్మాత్మనో హి జీవస్య నిత్యముక్తస్య వస్తుతః,
బుద్ధితాదాత్మ్యమాత్రేణ సంసారిత్వం న వస్తునః ॥ 151.

(151) బ్రహ్మస్వరూపుడు, నిత్యముక్తుడు వస్తుస్వరూపమునగు జీవునకు బుద్ధితాదాత్మ్యమాత్రముచే సంసారిత్వము సంభవించుచున్నది. కాని వాస్తవముగ జీవునకు సంసారిత్వము లేదు.

ఉపక్రమాదితాత్పర్యలింగాభావా ద్భిదా శ్రుతేః,
న భేదపరతా సిద్ధ్యే ద్వృథా తత్సాధనశ్రమః ॥ 152.

(152) ఉపక్రమాదితాత్పర్యలింగములు లేనందున భేదశ్రుతికి భేదపరత్వము సిద్ధింపదు. కాన జీవేశ్వరులకు భేదమును సాధించుటయందు పొందెడి శ్రమ వ్యర్థము.

త్వన్మతే చ తయో ర్మధ్య ఏకోఽశ్నాతీ త్యుదీరితే,
అర్థాదీశో న చాశ్నాతీ త్యేవం సిద్ధే పృథగ్వచః ॥ 153.
వృథా స్యా దనువాదస్య గతౌ సత్యాం న సంభవః,
పశ్య త్యయం దేవదత్తో వామే నాక్ష్ణే త్యుదీరణాత్ ॥ 154.
న పశ్యతీతరే ణేతి నిషేధోఽర్థాద్ధి సిద్ధ్యతి,
ద్వా సుపర్ణేతి మంత్రోఽయం శుద్ధబ్రహ్మాత్మ తత్పరః ॥ 155.
అశనాయాదిరాహిత్యం వస్తుతః ప్రత్యగాత్మనః,
భోగస్య కల్పితత్వా త్తదధిష్ఠానే ప్యసంగతా ॥ 156.

(153-156)నీమతమున జీవేశ్వరులలో నొకడు కర్మఫలము ననుభవించుచుండెనని చెప్పినచో అర్థాత్తుయీశ్వరుడు దాని ననుభవించుట లేదని సిద్ధించుచుండ "అనశ్న న్నన్యోఽభిచాకశీతి" అని వేరుగ నీశ్వరు డనుభవించుటలేదని చెప్పుట వ్యర్థము. మరియొక గతి యీవాక్యమున కుండగ అనువాద యని చెప్పుటయు సంభవింపదు. దేవదత్తుడు యెడమకంటితో చూచుచుండెనని చెప్పినంతమాత్రముననే కుడికంటితో చూచుట

లేని అన్నాత్ము సిద్ధించుచుండ "కుడికంటితో చూచుటలేదు" అని తిరిగి చెప్పుట వ్యర్థము కదా! ఈ "ద క్షిణాక్షి" అను మంత్రము శుద్ధబ్రహ్మాత్మపరమై ప్రత్యగాత్మకు వస్తుగతిచే అశనాయాదిరాహిత్యము, దేహము కల్పితముకులవలన తదధిష్ఠానమునందు అసంగత్వమును బోధించుచున్నది.

యదా భుంక్తే తదైవాయం న భుంక్తే పరమార్థతః,
భాసమానేపి వర్ణే స్వే న స్వే వర్ణోస్తి వస్తుతః ॥ 157.

(157) ఎప్పు డనుభవించుచుండెనో అపుడే యీజీవుడు పరమార్థముగ ననుభవించుటలేదు. ఆ కము నందు వర్ణాత్మకశబ్దము లేదు.

జీవేశ్వరాశ్రయే దేహే సమానే పురుషో ప్యయమ్,
నిమగ్నో౽విద్యయా భాతి కర్తృత్వాద్యభిమానతః ॥ 158.

(158) జీవేశ్వరాశ్రయమైన దేహము జీవేశ్వరులకు సమానమైనను యీజీవు డవిద్యానిమగ్నుడై కర్తృత్వాద్యభిమానమువలన భాసించుచుండెను.

మోహావృతస్వరూపత్వా చ్ఛోచతీవ న వస్తుతః,
అతో బ్రహ్మాత్మనో రైక్యసాక్షాత్కారోదయా దయమ్ ॥ 159.
దేహత్రయా త్పృథగ్భూతం దేహత్రితయసాక్షిణమ్,
కార్యకరణసంఘాతై స్సేవితం జుష్ట ముచ్యతే ॥ 160.
శోధితం త్వంపదార్థం వా సంత మీశం చ పశ్యతి,
సాక్షాత్కరోతి స్వాత్మానం బ్రహ్మభూత మకల్మషమ్ ॥ 161.
తదా౽స్య మహిమానం స్వ మపరిచ్ఛిన్న మక్షయమ్,
ఏత్యానందం స్వయం వీతశోక ఇత్యర్థికా శ్రుతిః ॥ 162.

(159-162) మోహముచే నావరింపబడిన స్వస్వరూపముకలవాడగుటవలన దుఃఖించువాడువలె భాసించుచుండెను. వాస్తవికముగ దుఃఖించుటలేదు. అందుచే బ్రహ్మాత్మైక్యసాక్షాత్కారమువలన జీవుడు స్థూలసూక్ష్మకారణదేహములకంటె వేరయినట్టియు, దేహత్రయసాక్షియైనట్టియు, కార్యకరణసంఘాతముచే సేవింపబడునట్టియు, శోధితమైన త్వంపదార్థమును సద్రూపమైన యీశ్వరునిగ తెలిసికొనును. అనగా తనను అకల్మషమగు బ్రహ్మస్వరూపముగ సాక్షాత్కరింపజేసికొనును. అపుడు వీతశోకుడై అపరిచ్ఛిన్నము, అక్షయమునగు స్వస్వరూపమైన ఆనందమును పొందుచున్నాడు. అని "జుష్టం యదా పశ్యతి" ఇత్యాది శ్రుతి కర్థము.

స్యా త్తాత్పర్యవతీ భేదే కథం బ్రహ్మైక్యగోచరా,
యద్వా జుష్టం వివేకాద్యై శ్శోధితాశయకిల్బిషైః ॥ 163.
సనకాద్యై స్సదా సేవ్యమాన మాత్మతయాంతరం,
అన్యం దేహత్రయా ద్భిన్న మీదృశం యర్హి పశ్యతి 164.

(163-164) పైశ్రుతి జీవేశ్వరభేదతాత్పర్యకమే యగునా? బ్రహ్మాత్మైక్యగోచర మెట్లగును? కాన పైశ్రుతులు జీవబ్రహ్మభేదమునందు తాత్పర్యము లేనివేయని సిద్ధము. లేక, వివేకాదులచే శోధితమైన ఆశయగతకిల్బిషములు కల సనకాదులచే యెల్లపుడు ఆత్మగ సేవింపబడుచున్నట్టి దేహత్రయభిన్నుడైన యిట్టి యాత్మ నెవడు తెలిసికొనునో—

న త్వన్యం జీవతో భిన్నం పశ్యతీ త్యర్థ ఇష్యతే,
త్వయోక్తానాం వికల్పానాం నాస్త్యత్ర స్సావకాశతా ॥ 165.

(165) జీవునికంటె భిన్నమైన యితరుని తెలిసికొనఁడో అని "జుష్టం యదా పశ్య త్యన్య మీశః" ఇత్యాదిశ్రుతి కర్థము. కాన నీచే చెప్పబడిన వికల్పముల కవకాశము లేదు.

న హేతు ర్భేదధీ స్మ్రక్తే స్సాక్షా చ్ఛ్రుతివిరోధతః,
తం జ్ఞాత్వా మృత్యు మత్యేతి నాన్యః పంథా విముక్తయే ॥ 166.

(166) సాక్షాత్తు శ్రుతివిరోధ మందుటవలన జీవేశ్వరభేదజ్ఞానము మోక్షహేతువు కానేరదు. పరమాత్మను తెలిసికొని సుఖదుఃఖమోహాత్మకసంసారము నతిక్రమించుచున్నాడు. "నాన్యః పన్థా విద్యతేఽయనాయ" (మోక్షము కొరకు మరియొక మార్గము లేదు.)

భేదేఽస్య మహిమానం స యాతీత్యేత ద్విరుద్ధకమ్,
నాన్యోఽన్యదీయం ప్రాప్నోతి మహిమాన మిహాంజసా ॥ 167.

(167) జీవేశ్వరులకు భేదమే యున్నచో "అస్య మహిమానం స యాతి" (ఈశ్వరమహిమ నతఁడు పొందుచున్నాడు.) అని చెప్పుటయు విరుద్ధమగును. అన్యు డితరుని మహిమను లెస్సగ బొందఁడు.

తత్తుల్యం భజతీత్యేవం కల్పనాపి న యుజ్యతే,
నాపి స్తుతిపరత్వేన వ్యాఖ్యేయం ముఖ్యసంభవాత్ ॥ 168.

(168) పరమాత్మమహిమతో సమానమైన మహిమను పొందునని చెప్పుట (కల్పన)యు యుక్తము కాదు. ముఖ్యార్థము సంభవించుచుండ నతని మహిమను పొందునని చెప్పుట స్తుత్యర్థమని చెప్పుటయు యుక్తము కాదు.

బ్రహ్మ వేద స బ్రహ్మైవ భవతీతి శ్రుతే రపి,
నిరంజనపదేనాతోఽవిద్యారాహిత్య ముచ్యతే ॥ 169.
పరమం సామ్య మిత్యైక మాహాఽద్వైతామృతం పరమ్,
యస్మా దత్యంతసాదృశ్య మేకత్వే పర్యవస్యతి ॥ 170.

(169-170) "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" ఎవఁడు బ్రహ్మమును తెలిసికొనునో వాఁడు బ్రహ్మమే యగు నను శ్రుతివలనను, "నిరంజనః పరమం సామ్య ముపైతి" అను స్థలమునందు గల నిరంజనపదముచే అవిద్యారాహిత్యము చెప్పబడెను. "పరమం సామ్యం" అని దేనివలన నత్యంతసాదృశ్యము ఐక్యమునందు పర్యవసితమో యుత్కృష్టమైన అద్వైతామృతమగునట్టి ఐక్యమును చెప్పెను.

అల్ప మప్యంతరం కుర్వ న్భయం యాతీతి దోషతః,
మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి ॥ 171.
అన్యోసా వన్య ఏవాహ మితి దేవపశు శ్శ్రుతేః,
నాత్ర కాచిద్భిదేత్యేవం భేదనిందాశ్రుతి ర్బహు ॥ 172.
అత్ర కో మోహః క శ్శోక ఏకత్వ మనుపశ్యతః,
యస్మాదన్యం నచాస్తీహ తత్కస్మాన్ను బిభే మ్యహమ్ ॥ 173
య ఏవం వేద బ్రహ్మాహ మితి సర్వం భవత్యయం,
ఇత్యభేదధియా మోక్షభయప్రాప్తిప్రదర్శనాత్ ॥ 174.

(171-174) "ఏతస్మిన్నుదర మన్తరం కురుతే। అథ తస్య భయం భవతి" (ఈపరమాత్మయందు స్వల్పభేదమునైన చేసినచో నట్టి భేదదర్శికి భయము ప్రాప్తించును.) అని శ్రుతి వలనను "మృత్యోః స మృత్యు మాప్నోతి" య ఇహ నానేవ పశ్యతి" "అన్యోఽసా వన్యోఽహ మస్మీతి వేద స దేవానాం పశుః" అని భేదమును శ్రుతి నిందించుటవలనను "నాత్ర కాచి ద్భిదా" అని యనేక భేదనిందాశ్రుతులవలనను, "తత్ర

నో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః" "యస్మాదన్యం న చాస్తి తత్కస్మాన్ను బిభే మ్యహం" "య ఏవం వేదబ్రహ్మాహ మితి స ఇదం భవ త్యయం" అను శ్రుతులచే జీవేశ్వరాభేదబుద్ధిచే మోహాభయ ప్రాప్తిదర్శనముచేతను జీవేశ్వరుల కభేదమే కాని భేద మెన్నడును పొసగనేరదు.

యత్తు ముక్తా భిదా సత్త్వా త్పరమార్థా త్తద ప్యసత్,
సర్వాత్మత్వావబోధేన విముక్తో బ్రహ్మతా శ్రుతేః ॥ 175.

(175) విద్వాంసునకు సర్వాత్మత్వావబోధచే బ్రహ్మత్వము వేదముచే చెప్పబడుటవలన ముక్తియందు పరమార్థసత్త్వముకలదై భేదము జీవునకు కలదను కొందర మతి మసాస్త్రము.

విరోధా న్నాస్తి భేదస్య గంధోపి పరజీవయోః,
ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః ॥ 176.
ఇత్యభేదపరం వాక్యం వైధర్మ్యప్రతిషేధతః,
క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ॥ 177.
అవిభక్తం చ భూతేషు సమం సర్వే ష్వితి స్ఫుటమ్,
సాక్షా జ్జగద్గురు శ్శ్రీశః ప్రాహాఽభేదం స్వజీవయోః ॥ 178.
నామరూపా ద్విముక్త స్సన్నితి ముక్తౌ శ్రుతి స్స్వయమ్,
నామరూపాదిరాహిత్యం ప్రతిపాదయతి స్ఫుటమ్ ॥ 179.

(176–179) జీవేశ్వరులకు భేదలేశమైనను విరోధమువలన ప్రాప్తింపదు. "ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ" అను వాక్యము వైధర్మ్యమును నిషేధించుటవలన జీవేశ్వరుల కభేదపరము. "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" "జ్ఞానీ త్వాత్మైవ మే మతం" "అవిభక్తం చ భూతేషు" "సమం సర్వేషు భూతేషు" అను స్థలములయందు జగద్గురువగు శ్రీకృష్ణపరమాత్మ జీవేశ్వరుల కభేదమును స్పష్టముగ చెప్పెను.

"నామరూపా ద్విముక్తః" అను శ్రుతి స్వయముగ ముక్తియందు నామరూపరాహిత్యమును స్పష్టముగ చెప్పుచుండెను.

సాదృశ్యయోగత స్సామ్యం సర్వాత్మత్వ మితీష్యతే,
తస్మా త్త త్సర్వ మభవ దిత్యాదిశ్రుతిదర్శనాత్ ॥ 180.

(180) "తస్మా త్సర్వ మభవత్" అను శ్రుత్యుక్తరీతిని సాదృశ్యయోగమువలన సర్వాత్మత్వరూప సామ్య మిష్టము.

ఏతేన ద్వా సుపర్ణాదే ర్భేదే యస్తు పురా త్వయా,
ఉపక్రమాది రుద్దిష్ట స్స చ సమ్య జ్నిరాకృతః ॥ 181.

(181) ఈచెప్పుటచే పూర్వమునందు "ద్వా సుపర్ణా స యుజా సఖాయా" అనుస్థలమునం దేయుప క్రమోపసంహారాదిషడ్విధలింగములు చూపబడెనో యవి లెస్సగ నిరస్తములు. (నిరాకృతములు)

ఉపక్రమాదికం లింగం బ్రహ్మైక్యే సర్వత శ్శ్రుతౌ,
నిర్ణీతం తచ్చ వేదాంతభాష్యాదౌ సూరిభి ర్నయైః ॥ 182.

(182) ఉపక్రమోపసంహారాదిషడ్విధలింగములు శ్రుతియం దంతట బ్రహ్మైక్యమునందే వేదాన్త భాష్యాదులయందు విద్వాంసులచే న్యాయపూర్వకముగ నిర్ణీతములు.

యత్తూక్తం సకలా న్కామా నశ్నుతే బ్రహ్మణా సహ,
సహ త్వం బ్రహ్మణో భేదం వినా నేతి తదప్యసత్ ॥ 183.

(183) "సర్వా న్కామా న్సహ । బ్రహ్మణా విపశ్చితేతి" బ్రహ్మముతో సహత్వము జీవబ్రహ్మ లకు భేదము లేనిచో పొసగదని చెప్పుట యసంగతము.

కామభోగే హి విదుష స్సహత్వం బ్రహ్మణా కథమ్,
కింపుత్రేణ సహాయాతః పితేత్యత్ర యథా భవేత్ ॥ 184.
పితృగత్యనుకూలం హి పుత్రేఽపి గమనం తథా,
బ్రహ్మణ్యపి భవేద్భోగో విద్వద్భోగానుకూలతః ॥ 185.

(184-185) కామభోగమునందు విద్వాంసునకు బ్రహ్మముతో సహత్వమెట్లు పొసగును? "పుత్రేణ సహాయాతః పితా" తండ్రి కుమారునితో సహ వచ్చెను. అను చోట పితృగమనమున కనుకూలమైన గమనము కుమారునియందెట్లో అట్లే విద్వద్భోగానుకూలమైన భోగము బ్రహ్మమునందుకూడ కలదనెదవా?

తథా చ నిత్యతృప్తత్వవిరోధ స్స్యాన్మతే తవ,
భోగేఽనుజ్ఞాతృతేశస్య సర్వత్రా స్త్యవిశేషతః ॥ 186.
ముక్తౌ విశేషనిర్దేశ వైయర్థ్యం తవ సర్వథా,
కించ రాజా స్వభృత్యేన సహాభుంక్తే యథా తథా ॥ 187.

(186-87) అట్లగుచో నీమతమునందే బ్రహ్మ నిత్యతృప్తుడను సిద్ధాంతమునకు విరోధము ప్రాప్తించెడిని. భోగమునం దనుజ్ఞాతృత్వమీశ్వరునకు అని యనెదవా? ఈయనుజ్ఞాతృత్వము యీశ్వరునకు సర్వత్ర అవిశేషమే యయియుండ ముక్తియందు యీశ్వరున కనుజ్ఞాతృత్వము కలదని విశేషనిర్దేశము సర్వథా నీకు వ్యర్థము.

భుంక్తే విద్బ్రహ్మణా తర్హి ప్రాధాన్యం బ్రహ్మణో భవేత్,
బ్రహ్మణ స్సర్వశేషిత్వమపి భజ్యేత తే మతే ॥ 188.

(188) ఇక "రాజా స్వభృత్యేన సహ భుంక్తే" అనుస్థలమున రాజు తనభృత్యునితో సహ భుజించుచుండెను. అనునటుల బ్రహ్మవేత్త బ్రహ్మతో సర్వకామములను భుజించుచుండెను. అని చెప్పినచో భృత్యున కప్రాధాన్యము ప్రాప్తించునటుల బ్రహ్మమున కప్రాధాన్యము ప్రాప్తించును. బ్రహ్మకు నీమతసిద్ధమైన సర్వశేషిత్వముకూడ లేకపోయెడిని.

నను స్వామీ యథా దాసీబాలకస్యాపి పోషకః,
న తచ్ఛేష స్తథేశోఽపి ముక్తభోగానుకూలతః ॥ 189.

(189) ప్రభువు దాసీబాలకునకు పోషకుడై తచ్ఛేషు డెట్లు కాడో అట్లే యీశ్వరుడుకూడ ముక్తుల భోగముల కనుకూలు డనెదవా? అట్లు కాదు—

నైవం, స్వామిని మానుష్యే భావిభృత్యోపకారవత్,
ఈశ్వరే హ్యాప్తకామే నోపకారః కోఽపి తత్కృతః ॥ 190.

(190) ప్రభువు విషయమై కాబోవు భృత్యునియొక్క యుపకారమువలె ఆప్తకాముడైన యీశ్వరుని యందు ముక్తునిచే చేయతగిన యుపకార మేదియు లేనందున యీదృష్టాంతముకూడ సంభవింపదు.

తస్మాద్బ్రహ్మణ ఈశస్య సహత్వాయోగతో నహి,
సహయోగే తృతీయాస్తి న వా ముక్తౌ భిదాఽణ్వపి ॥ 191.

(191) కాన పరబ్రహ్మమునకు సహత్వయోగము సంభవింపనందున "సోఽశ్నుతే సర్వాన్ కామాన్సహ। బ్రహ్మణా విపశ్చితేతి" అను స్థలమున ముక్తియందు లేశమైన భేదములేనందున "సహ యోగే తృతీయా" అను యనుశాసనముచే ప్రాప్తించు తృతీయ రాదు.

కింతు పృథగ్జనానాం య త్సుఖం స్యాత్కామభోగజమ్,
క్రమేణ తద్విముక్తోఽయం యుగప త్సుఖ మశ్నుతే ॥ 192.

(192) మఱేమనిన? అజ్ఞానులకు కామభోగమువలన క్రమముగ జనించెడి యేసుఖము కలదో అట్టి దానితో విముక్తుడైన ముక్తుడు యొక్కమారుగ సుఖము ననుభవించును.

సర్వానందలవానాం హి బ్రహ్మానందార్ణవే లయః,
ఆప్తకామో భవే ద్విద్వా నిత్యభిప్రాయ ఆగమే ॥ 193.

(193) సర్వానందలవములకు బ్రహ్మానందమునందు లయము. విద్వాంసుడు ఆప్తకాము డగు నని ఉపనిషదభిప్రాయము.

సోఽశ్నుతే సకలా న్కామా నక్రమేణ సురర్షభాః,
విదితబ్రహ్మరూపేణ జీవన్ముక్తో న సంశయః ॥ 194.

(194) జీవన్ముక్తుడు తెలియబడిన బ్రహ్మస్వరూపముచే నొక్కమారుగ నిఖిల కామముల ననుభవించును, ఇట సంశయము లేదు.

ఇత్యేవం బ్రహ్మగీతాయా మత స్యా అర్థ ఈరితః,
సర్వే ష్విత్యాదివాక్యం యద్భూమప్రకరణే స్థితమ్ ॥ 195.
తత్సార్వజ్ఞ్యపరం యద్వా నిర్గుణోపాసనాస్తుతిః,
న తద్భేదపరం యస్మా న్నిందితా తత్ర భేదధీః ॥ 196.

(195-196) ఇట్లే బ్రహ్మగీతయందు "సోఽశ్నుతే సర్వా న్కామా న్సహ । బ్రహ్మణా విపశ్చితేతి" అను శ్రుతికర్థము వర్ణింపబడెను. భూమప్రకరణమునందు "సర్వేషు" ఇత్యాది యేవాక్యము కలదో ఆవాక్యము సర్వజ్ఞత్వపరము. లేక, నిర్గుణోపాసనాస్తుతిపరమనియైనను చెప్పనొప్పును. అచట భేదజ్ఞానము నిందితమగుట వలన నావాక్యము భేదపరము కాదు.

యదల్పం భిన్న మస్తీతి తన్మర్త్య మితి వాక్యతః,
తస్మా న్నాస్తి శ్రుతి ర్భేదే ప్రమాణ మితి సాధితమ్ ॥ 197.

(197) "యదల్పం తన్మర్త్యం" అనువాక్యముచే భేదజ్ఞానము నిందితము. కాన భేదమునందు శ్రుతిప్రమాణ్యము లేదని సాధింపబడెను.

నాప్యధ్యక్షం యత స్తద్ధి సత్తామాత్రైకగోచరమ్,
సాచాధిష్ఠానచిద్వ్యోమ న తతో వ్యతిరిచ్యతే ॥ 198.

(198) ప్రత్యక్షము సత్తామాత్రైకగోచరమగుటవలన భేదమునందు ప్రమాణము కాదు. ఆసత్త యన్ననో అధిష్ఠానచిద్వ్యోమస్వరూపమే. అధిష్ఠానచిద్వ్యోమకంటె సత్త వేరు కాదు.

ప్రత్యక్ష మస్త్యుదాసీనం భేదసత్తాప్రసాధనే,
అన్యస్య భేదసత్తాయాం ప్రమాణస్యా ప్యభావతః ॥ 199.

(199) భేదసత్తయం దితరమైన ప్రమాణమేదియు లేనందున ఉదాసీనమైన ప్రత్యక్షప్రమాణము కలదనెదవా?

నను ప్రతీయమానా భేదనిష్ఠతయా హి సా,
సత్తా కథం భవే దాత్మసత్తే త్యత్ర శృణూత్తరమ్ ॥ 200.

(200) భేదనిష్ఠముగ గోచరించుచున్నట్టి యాభేదసత్త ఆత్మసత్తాస్వరూప మెట్లగును? (కానేరదు.) (కాన భేదసత్త వేరుగనున్నదని పూర్వపక్షియాశయము.) దీనివిషయమై సమాధానము చెప్పెదవినుము.

అధిష్ఠానాత్మసత్తాతోఽధ్యస్తసత్తా న భిద్యతే,
తదాత్మానం స్వయం బ్రహ్మ కురుతేతి ప్రమాణతః ॥ 201.

(201) అధిష్ఠానసత్తకంటె యధ్యస్తసత్త భిన్నము కాదు. "తదాత్మానగ్ంస్వయ మకురుత" అను శ్రుతి యందు చెప్పబడుటవలన నధిష్ఠానసత్తకంటె యధ్యస్తసత్త భిన్నము కాదు.

పరబ్రహ్మవివర్తస్య జగతో బ్రహ్మతో న హి,
సత్తా భిన్నా తతోఽధ్యక్షం బ్రహ్మసత్తైకగోచరం ॥ 202.

(202) పరబ్రహ్మవివర్తమైన జగత్తునకు బ్రహ్మముకంటె వేరుగ (భిన్నముగ) సత్త లేదు. కాన ప్రత్యక్షమెల్ల బ్రహ్మసత్తైకగోచరమైనదే.

కార్యకారణభావోఽపి జగతో బ్రహ్మణోఽస్తి యః,
కల్పితో యత ఆత్మాయం న కార్యం నాపి కారణమ్ ॥ 203.

(203) జగత్తునకు, బ్రహ్మమునకు యే కార్యకారణభావముకలదో అదియు, ఆత్మ కార్యకారణవిలక్షణుఁ డగుటచే కల్పితమే.

ఇతోఽపి భేదసత్తాయాం గ్రాహి ప్రత్యక్ష మాత్రకమ్,
జలాదౌ గ్రంధప్రత్యక్షవ దన్యవిషయం భవేత్ ॥ 204.

(204) బ్రహ్మజగత్తుల కార్యకారణభావముకూడ కల్పితమగుటవలన భేదసత్తాగ్రాహి యగు ప్రత్యక్షమాత్రము జలాదికమునందు గంధప్రత్యక్షమువలె యన్యవిషయమే యగును.

మమై వాంశ ఇతీశస్య వాక్య మద్వైతబోధకమ్,
నాంశాంశిపర మద్వైతపరాగమవిరోధతః ॥ 205.

(205) "మమైవాంశో జీవలోకః" అను శ్రీకృష్ణపరమాత్మ వాక్యముకూడ నద్వైతబోధకము. ఇంతియే కాని, యద్వైతపరమైన యాగమ (వేద) విరోధము ప్రాప్తించునుగాన అంశాంశిపరము కాదు.

అధ్యస్త ఏవ భేదోఽత్ర బ్రహ్మాత్మైక్యేఽఖిలశ్రుతేః,
నాఽన్యోఽతోఽస్తీతి వాక్యేన తస్మా దైక్యనయో జయీ ॥ 206.

(206) "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" అను వాక్యముచే నిఖిలశ్రుతులు బ్రహ్మాత్మైక్యబోధకము లగుటవలన (జీవేశ్వరుల) భేదమసాధ్యమే. కాన నైక్యపక్షమే జయము కలది.

నాధ్యక్షవిషయో భేదః పరమార్థో న చ శ్రుతేః,
కల్పితో యో న తేనాస్తి క్షతి రద్వైతవాదినామ్ ॥ 207.

(207) జీవేశ్వరులకు పరమార్థభేదము ప్రత్యక్షవిషయము కాదు. శ్రుతిసిద్ధమూ కాదు. ఇక జీవేశ్వరభేదము కల్పితమనవలయును. అట్టి కల్పితభేదముచే నద్వైతవాదుల కెట్టి క్షతియు లేదు.

తస్మా దద్వైతసిద్ధాంతవిజయో దుందుభి శ్శ్రుతిః,
నాన్యోఽతోఽస్తీతి జయతి భేదవాదిశుగావహా ॥ 208.

(208) కాన నద్వైతసిద్ధాంతవిజయమునందు "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" అను శ్రుతి యనెడి దుందుభి (వాద్యవిశేషము) భేదవాదులకు దుఃఖమును పుట్టించునదై "జయతి" సర్వోత్కర్షగ నున్నది.

కించాధ్యక్షేణ భేదోఽపి గృహ్యతే న చిదాత్మనః,
శుద్ధస్య కిం తు జీవస్య ధీతాదాత్మ్యం గతస్య చ ॥ 209.

(209) మరియు ప్రత్యక్షప్రమాణముచే శుద్ధచిదాత్మయొక్క భేదము గ్రహింపబడదు. మరేమనిన? ధీతాదాత్మ్యమును పొందిన జీవునియొక్క భేదము గ్రహింపబడును.

అహ మిత్యనుభూతిర్హి భేద మత్రావగాహతే,
సా ధీతాదాత్మ్య మాపన్న మాత్మానం జీవశబ్దితం ॥ 210.
విషయీకురుతే నైషా శుద్ధ మానంద సాక్షిణం,
నను సంసారిణోఽజ్ఞానా ద్యాశ్రయస్యాత్మనః కిల ॥ 211.
సుప్తి సంబంధినో భేదోఽహం విజ్ఞానేఽనుభూయతే,
కథం బుధ్యవచ్ఛిన్న స్యైవైష భేదోఽనుభూయతే ॥ 212.
నైవ మజ్ఞానకాలే యోఽహ మిత్యనుభవే నృణామ్,
భాతి తస్మా ద్విభిన్నోస్తి సాక్షీ ప్రత్యక్చిదాత్మనః ॥ 213.

(210-213) "అహం అనునది అనుభవము. అట్టి యనుభవమునందు భేదము విషయమగును. ఆ యనుభవము ధీతాదాత్మ్యపన్నమైన జీవశబ్దితమైన యాత్మనే విషయ మొనరించుకొనును. ఈ "అహం" అను యనుభవము ఆనందసాక్షియగు శుద్ధమును విషయ మొనరించుకొనదు. (అనగా "అహం" అను అనుభవముతో ధీతాదాత్మ్యపన్న జీవశబ్దముచే చెప్పబడు యాత్మయే విషయ మగును కాని, ఆనందసాక్షియగు శుద్ధబ్రహ్మము విషయము కానేరదు. సంసారి, అజ్ఞానాద్యాశ్రయము, సుప్తిసంబంధముకల ఆత్మభేదము "అహం" అను విజ్ఞానమునం దనుభూయమాన మగుచుండ బుద్ధ్యవచ్ఛిన్నమైన యాత్మయొక్క భేదము 'అహం' అను విజ్ఞానమునం దనుభూతమగుచున్నదని చెప్పట యెట్లు పొసగునని శంకింపఁజనదు. అజ్ఞానకాలమునందు మనుజుల "అహం" అను అనుభవమునందు యెవడు భాసించుచుండెనో అట్టి వానికంటె భిన్నమైనట్టి ప్రత్యక్చిదాత్మకసాక్షి యొకడు కలడు.

యదజ్ఞానకృతా దేహాది ష్వహం ధీర్దృఢా నృణామ్,
భవే త్త్రేశభేదాదిభ్రాంతిధీ రపి తే దృఢా ॥ 214.

(214) అతనియొక్క యజ్ఞానమువలన దేహాదులయందు 'అహం' అను బుద్ధి యెట్లు దృఢమైనదో అట్లే యీశభేదాదిభ్రాంతిజ్ఞానముకూడ నీకు దృఢమగుచున్నది.

తద్విజ్ఞానదశాయాం తు నేశభేదోఽనుభూయతే,
ఈశ్వరా త్సాక్షిణో భేదః కేనచి న్నానుభూయతే ॥ 115.

(215) అట్టివానియొక్క విజ్ఞానదశయందు యీశ్వరభేదము శ్రూయమాణమగుటలేదు. ఈశ్వరునికంటె సాక్షికి భేద మెవనిచేతను అనుభూయమానమగుటలేదు.

బుద్ధ్యధిష్ఠానచిద్వ్యోమ్ను స్సుప్తాదేరపి ధర్మితా,
భాతు తేన క్షతి ర్నాస్తి శుద్ధ స్యాసంగినో విభోః ॥ 216.

(216) బుద్ధ్యవచ్ఛిన్నచిద్వ్యోమరూపులగు సుప్తాదులకుకూడ ధర్మిత్వము భాసించుగాక, అట్టి భావముచే అసంగి, విభువు అగు శుద్ధమున కెట్టి క్షతియు లేదు.

కేవలాజ్ఞానదోషేణ భా త్యజ్ఞోఽహ మితి భ్రమః,
నాహ మీశ ఇతి భ్రాంతి స్సత్యజ్ఞానేఽస్య దృశ్యతే ॥ 217.

(217) కేవలాజ్ఞానదోషముచే "అజ్ఞోఽహం" అను భ్రమ భాసించుచున్నది. "నాహ మీశః" అను భ్రాంతియు సత్యజ్ఞానమునం దితనికి కలుగుచున్నది.

తన్నివృత్త్యా న సా భ్రాంతి ర్దృశ్యతే విదుషః క్వచిత్,
కింత్వహం బ్రహ్మచిద్వ్యోమ స్వభావోస్మీతి ధీ రుదేత్ ॥ 218.

(218) విద్వాంసునకట్టి భ్రాంతి యజ్ఞాననివృత్తిచే నెచటను చూడబడుటలేదు. మరియెట్టిజ్ఞానము కలుగునని "నేను చిద్వ్యోమస్వభావమగు బ్రహ్మ నైతిని" అను జ్ఞానము కలుగును.

న తం విదాథ య ఇమా జజానేత్యాదివేదగీః,
అజ్ఞానహేతుకం భేదం వదతీశ్వరజీవయోః ॥ 219.

(219) "న తం విదాథ య ఇమా జజాన" ఇత్యాది వేదవాక్యము యీశ్వరజీవుల కజ్ఞానహేతుకమైన భేదమును చెప్పుచున్నది.

అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః,
ఇతి మోహో వినిర్దిష్టో హరిణా జ్ఞానహేతుకః ॥ 220.

(220) "అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః" అని శ్రీకృష్ణపరమాత్మచే అజ్ఞానము హేతువుగా కలది మోహమని నిర్దేశింపబడెను.

సార్వజ్ఞాల్పజ్ఞతాదే స్తు మాయయా కల్పితత్వతః,
న భేద స్తత్కృతి స్సత్యః పరమేశ్వరజీవయోః ॥ 221.

(221) సర్వజ్ఞత్వాల్పజ్ఞత్వములు మాయాకల్పితము లగుటచే సర్వజ్ఞత్వాల్పజ్ఞత్వకృతమైన జీవేశ్వర భేదము సత్యము కాదు.

వ్యావహారికభేదోస్తు పరమేశ్వరజీవయోః,
వ్యవహారస్థలేఽస్మాభి రపి స్వీక్రియతే స చ ॥ 222.

(222) ఇక జీవేశ్వరులకు వ్యావహారికభేద ముండుగాక. వ్యవహారస్థలమునందు జీవేశ్వరులకు వ్యావహారిక భేదము మాచేగూడ నంగీకరింపబడినదే.

వ్యవహారేఽస్తు సర్వజ్ఞ ఉపాస్యః పరమేశ్వరః,
ఉపాసకోఽస్తు జీవోఽయం శ్రుతిస్మృతిప్రమాణతః ॥ 223.

(223) వ్యవహారమునందు సర్వజ్ఞుడగు పరమేశ్వరు డుపాస్యుడు. శ్రుతిస్మృతిప్రమాణములవలన ఈజీవు డుపాసకుడు.

అత స్సార్వజ్ఞ్యమూఢత్వే నిరుపాధౌ చిదద్వయే,
మాయయా కల్పితే తత్ర లౌహిత్యం స్ఫటికే యథా ॥ 224.

(224) కాన సర్వజ్ఞత్వాల్పజ్ఞత్వములు నిరుపాధికమైన చిదద్వయమునందు స్ఫటికమునందు లౌహిత్యము వలె మాయచే గల్పితములు.

భేదధీ శ్చేద్యథార్థా స్యా త్తదా భేదదృశో భయం,
నైవ బ్రూయా చ్ఛ్రుతి స్తస్మా ద్భేదధీ ర్విభ్రమాత్మికా ॥ 225.

(225) భేదజ్ఞానమే యథార్థ మగుచో "ఏత స్మిన్ను దర మంతరం కురుతే। అథ తస్య భయం భవతి" ఇత్యాదిశ్రుతులు భేదజ్ఞానము కలవానికి భయమును చెప్పకబోయెడిని. అట్లుకాక భేదజ్ఞానముకలవానికి భయము ప్రాప్తించునని శ్రుతి బోధించుటవలన భేదజ్ఞానము భ్రమాత్మకమే యగుచున్నది.

అభేదో యది నేష్ట స్స్యాన్మోక్షం తద్భావతో న సా,
బ్రూయా ద్భ్రూతే తతో విద్మో హ్యభేద శ్శ్రుతిసమ్మతః ॥ 226.

(226) జీవేశ్వరుల కభేదమే యిష్టము కానిచో జీవు డీశ్వరాభిన్నుడను యభేదజ్ఞానము కలవానికి శ్రుతి మోక్షమును చెప్పకపోయెడిని. అట్లుకాక జీవేశ్వరాభేదజ్ఞానము కలవానికి శ్రుతి మోక్షమును చెప్పుటవలన నభేదము శ్రుతిసమ్మతమని మేము తెలిసికొనుచున్నాము.

యత్తు క్షేత్రజ్ఞ మిత్యత్ర వ్యాఖ్యాతం పరజీవయోః,
నాస్త్యైక్యం కింతు జీవస్య శరీరత్వా త్పరేశితుః ॥ 227.
తద్వ్యపదేశ ఇత్యాది తత్తుచ్ఛం తత్కథం శృణు,
తద్వ్యపదేశ ఇత్యత్ర కి మభిప్రేత మస్తి తే ॥ 228.

(227-28) కొందరు "క్షేత్రజ్ఞం చాపి" అనుస్థలమునజీవుడు ఈశ్వరశరీర మగుటవలనజీవేశ్వరుల కైక్యములేదు,అని "తద్వ్యపదేశః" ఇత్యాదినా పూర్వమునందు వ్యాఖ్యానించిరి. అట్టి వ్యాఖ్యానము తుచ్ఛమైనది. అది యెట్లనిన? చెప్పెదవినుము. "తద్వ్యపదేశః" అను చోట నీయభిప్రాయ మేమి?

కిం తదాశ్రియతా వస్తువృత్త్యా వా కల్పితాథ వా,
నాద్యో జీవపరాభేద శ్రుతి స్మృతిశతై ర్నయాత్ ॥ 229.

(229) జీవునకు పరమేశ్వరాశ్రియత్వము వాస్తవికమా? లేక కల్పితమా? శ్రుతిస్మృతిశతముల చేతను, న్యాయమువలనను జీవేశ్వరుల కభేదము సిద్ధమై యుండ. జీవునియందు వాస్తవికమైన పరమేశ్వరాశ్రియత్వము సంభవింపనందున ప్రథమపక్షము నిరస్తము.

సిద్ధోస్తి వస్తుతో జీవే న పరాశ్రియతా భవేత్,
న ద్వితీయో యత స్తస్యా కల్పితాయా అవిద్యయా ॥ 230.

(230) జీవునియం దీశ్వరాశ్రియత్వము అవిద్యచే కల్పిత మనెదవా? అట్టి కల్పితమైన యీశ్వరాశ్రియత్వము తత్త్వావేదక వేదాన్త ప్రమేయ(ప్రతిపాద్య)ము కానేరనందున రెండవపక్షముగూడ నపాస్తము.

తత్త్వావేదక వేదాంతప్రమేయత్వం న సంభవేత్,
అహం బ్రహ్మాస్మి తత్త్వం భో స్తత్త్వ మేవ త్వ మేవ తత్ ॥ 231.

ఆత్మా బ్రహ్మైవ బ్రహ్మాత్మైవే త్యాత్మబుభుత్సుభిః,
విచికిత్స్యం న హీత్యాదిమహావాక్యేషు బోధిషు ॥ 232.

త్వదుక్తకల్పనాయోగా న్న భేదోస్తి మనాగపి,
కిం చాత్మజీవక్షేత్రజ్ఞ శబ్దానాం హి నియంతరి ॥ 233.

లక్షణా తే మతా కిం వా ముఖ్యార్థత్వ మథీశ్వరే,
నాద్యోఽనుపపత్త్యభావా దీశ్వరే లక్షణాం వినా ॥ 234.

(231-234) "అహం బ్రహ్మాస్మి, తత్త్వం త త్త్వ మేవ, త్వ మేవతత్, ఆత్మా బ్రహ్మైవ, బ్రహ్మాత్మైవ" అను స్థలములయందు ఆత్మను తెలిసికొనవలెనని యిచ్ఛకలవారిచే "విచికిత్స్యం నహి" తెలిసికొన దగిన దేదియు లేదు. అని మహావాక్యములు బోధించుచుండ నీవు చేసిన కల్పన సంభవింపనందున జీవేశ్వరుల కీషత్తైన భేదముగూడ సంభవింపదు.

మరియు ఆత్మ, జీవ, క్షేత్రజ్ఞశబ్దములకు నియన్తయందు లక్షణ నీకభిమతమా? లేక ముఖ్యార్థత్వమా? (శక్తియా?) యీశ్వరునియందు పైశబ్దములకు లక్షణ లేనిదే యనుపపత్తి సంభవింపనందున (లక్షణాబీజమగు యనుపపత్తి లేనందున) ఆత్మ, జీవ, క్షేత్రజ్ఞశబ్దములకు యీశ్వరునియందు లక్షణ అను ప్రథమపక్షము నిరస్తము.

న ద్వితీయో యతో జీవో న శరీరం పరేశితుః,
న హి జీవః పరస్యాస్తి భోగాయతన మంజసా ॥ 235.

(235) ఈశ్వరునియందు ఆత్మ, జీవ, క్షేత్రజ్ఞశబ్దములకు ముఖ్యార్థత్వ మను రెండవపక్షము కూడ సంభవింపదు. ఎందువలననెదవా? జీవుడు పరమాత్మకు శరీరము కాదు. శరీర మనగ భోగాయతనము. జీవుడు యీశ్వరునకు లెస్సగ భోగాయతనము కాదు.

జీవస్యేశశరీరత్వే తద్వాచకపదస్య చ,
ప్రవృత్తి స్స్యా దనాయాసా త్తద్యుక్తేపి శరీరిణి ॥ 236.

(236) జీవు డీశ్వరశరీర మగుచో జీవవాచకపదముల కనాయాసముగ జీవరూపశరీరయుక్తమైన శరీరి యగు యీశ్వరునియందు ప్రవృత్తి సంభవించెడిని.

నైవ మస్తి యతో జీవే న శరీరస్య లక్షణమ్,
నను సాక్షా త్ప్రయత్నేన జన్యవ్యాపారవత్త్వకమ్ ॥ 237.
శరీరలక్షణం తచ్చ జీవేఽప్యస్తి తథేష్యతే,
సాక్షా త్తస్యేశయత్న స్యాధిష్ఠేయత్వా దిహేతి చేత్ ॥ 238.

(237-238) జీవునియందు శరీరలక్షణ మగు భోగాయతనత్వలక్షణము లేమింజేసి జీవు డీశ్వరశరీరము కాదు. భోగాయతనత్వము శరీరలక్షణము కాదు. మరేమనిన? సాక్షాత్తు ప్రయత్నజన్యవ్యాపారవత్త్వము శరీర లక్షణము. అట్టి శరీరలక్షణము జీవునియందు కలదు కాన జీవరూపశరీరముతో గూడిన యీశ్వరునియందు ఆత్మ, జీవ, క్షేత్రజ్ఞశబ్దములకు ముఖ్యార్థత్వము సంభవమే యని శంకింపజనదు.

అంగుల్యాదే రపీత్థం స్యా త్సాక్షాద్యత్నాశ్రయత్వతః,
శరీరత్వం న తద్యుక్తం సర్వలోకవిరోధతః ॥ 239.

(239) సాక్షాత్తు ప్రయత్నజన్యవ్యాపారవత్త్వము వ్రేళ్లు, పాదములు మొదలగువాటికికూడ సంభవించుచుగాన యవియు శరీరములే యని యనుపించుకొనవలసివచ్చును. వ్రేళ్లు, పాదములు శరీరావయవములు కాని, శరీరములు కావు. (అనగా సాక్షాత్తు ప్రయత్నజన్యవ్యాపారవత్త్వము శరీరలక్షణ మన్నచో యీలక్షణ మతివ్యాప్తిదోషగ్రస్త మని యాశయము) కాననీవుచెప్పినది సర్వానుభవవిరుద్ధము కాన శరీరలక్షణము కాదు.

సత్యంత్యావయవిత్వే చే చ్ఛరీరత్వం త దష్యహో,
జీవేఽన్త్యావయవిత్వ స్యాప్యభావా న్నైవ సాంప్రతం ॥ 240.

(240) సాక్షాత్తు ప్రయత్నజన్యవ్యాపారాశ్రయత్వముతోగూడిన అన్త్యావయవిత్వమే శరీరలక్షణము. వ్రేళ్లు, పాదములు మొదలగువాటియం దంత్యావయవిత్వము లేనందున పైజెప్పిన శరీరలక్షణమున కతివ్యాప్తి లేదు. అని శంకింపజనదు. జీవునియం దంత్యావయవిత్వము లేనందున పైన చెప్పిన శరీరలక్షణ మవ్యాప్తిదోష గ్రస్తము.

బ్రహ్మణ్యపి ప్రయత్న స్యాభావా చ్చైత న్న సాంప్రతమ్,
వేదాన్తవేద్యే చిద్ధాతౌ బ్రహ్మ ణ్యక్రియ ఆత్మని ॥ 241.
అనిత్యస్యాథ నిత్యస్య ప్రయత్నస్యా ప్యయోగ్యతా,
అతో జీవస్య నాస్త్యేత ద్యత్నాధిష్ఠేయతా కిల ॥ 242.

(241-242) వేదాన్తవేద్యుడు, చిద్ధాతువు, అక్రియుడు నగు ఆత్మస్వరూపమైన బ్రహ్మమునందు నిత్యమైనట్టి కాని, యనిత్యమైనట్టి కాని ప్రయత్నము సంభవింపనందున నీశ్వరయత్నాధిష్ఠేయత్వరూపశరీర లక్షణము జీవునకు సంభవింపనేరదు.

కించేశ్వరే శరీరిత్వం వక్తుమేవ న శక్యతే,
సశరీరస్య నాస్త్యేవ ప్రియాప్రియనివారణమ్ ॥ 243.

(243) మరియు, సశరీరునకు ప్రియాప్రియములు సంభవింపవని చెప్పుట పొసగదు. కాన నీశ్వరునకు శరీరిత్వము సంభవము కాదు.

నిష్కలస్యాతిశుద్ధస్య స్వతంత్రస్య మహేశితుః,
న సంభవే చ్ఛరీరిత్వం వాఙ్మనోఽతిగతస్యచ ॥ 244.

(244) వాఙ్మనస్సుల కగోచరుడు, నిష్కలుడు, అతిశుద్ధుడు, స్వతంత్రుడు నగు పరమేశ్వరునకు శరీరిత్వము యొంతమాత్రము సంభవింపదు.

శరీరిత్వం ప్రపంచేపి దుర్ఘటం నశ్వరే చలే,
అవిద్యాకల్పితం విశ్వం క్షేత్రరూపం పరే పదే ॥ 245,

(245) నశ్వరము, చలము నగు ప్రపంచమునందుగూడ శరీరిత్వము పొసగదు. పరమపదమునం దవిద్యచే క్షేత్రరూపమైన నిఖిలప్రపంచము కల్పితము.

కథం వా తచ్ఛరీరం స్యా ద్భోగాయతన మీశితుః,
భోక్తృత్వ మపి నాస్తీశే నిత్యతృప్తే నిరామయే ॥ 246.

(246) ఇట్టి ప్రపంచ మీశ్వరభోగాయతనమై యీశ్వరున కెట్లు శరీర మగును? నిత్యతృప్తుడు, నిరామయుడు నగు పరమేశ్వరునకు భోగములే లేనందున పరమేశ్వరభోగాయతనత్వరూపశరీరిత్వము జీవునకు సంభవింపదు.

భోక్తృత్వం చ శరీరిత్వం మాయయా ప్రత్యగాత్మని,
కల్పితం తేన సంసారీ ప్రత్యగాత్మాఽవభాసతే ॥ 247.

(247) భోక్తృత్వము, శరీరిత్వము ప్రత్యగాత్మయందు మాయచే గల్పితము. అందుచే ప్రత్యగాత్మ సంసారియై కన్పట్టుచుండెను.

తన్నిషేధేన శుద్ధత్వం ప్రత్యగాత్మని చిద్ఘనే,
అభోక్తృత్వ మదేహత్వ మసంసారిత్వ మిష్యతే ॥ 248.

(248) ప్రత్యగాత్మ యగు చిద్ఘనమునందు అట్టి భోక్తృత్వాదినిషేధముచే శుద్ధత్వము, అభోక్తృత్వము, అదేహత్వము, అసంసారిత్వము సమ్మతము (సిద్ధమగును.)

కథం వేదాంతవేద్యేఽస్మించ్ఛరీరిత్వం త్వయేరితమ్,
అంతర్యామిబ్రాహ్మణం తు సర్వం విశ్వం చరాచరం ॥ 249.
బ్రహ్మణా వ్యాప్త మిత్యేత త్పరం నాన్యత్ర తత్పరం,
చిత్సత్తాభ్యాం జగ త్సర్వం బ్రహ్మణా తత మన్యథా ॥ 250.

నచ స్యా న్న స్ఫురే న్నైవ చేష్టేతాన్యత మిత్యపి,
శ్రుత్యా ప్రదర్శితం చాంతర్యామిబ్రాహ్మణ ఉత్తమమ్ ॥ 251.

(249-250-251) వేదాన్తవేద్యునియందు నీచే చెప్పబడిన శరీరిత్వ మెట్లు సంభవించును? అంతర్యామిబ్రాహ్మణము యీశ్వరునకు శరీరిత్వము బోధించుచున్న దనెదవా? అంతర్యామిబ్రాహ్మణము "చరాచరాత్మక నిఖిలప్రపంచము బ్రహ్మముచే వ్యాప్తమని మాత్రమే బోధించుచున్నది. కాని, "యీశ్వరుడు చరాచరప్రపంచ శరీరుడు" అని బోధించుట లేదు. చిత్సత్తలద్వారమున బ్రహ్మచే నిఖిలజగత్తు వ్యాప్తమైనది. అట్లు కానిచో జగత్తు లేనిదే యగును; స్ఫురించకపోయెడిని; అనృతజగత్తు చలించకపోయెడిని. అంతర్యామిబ్రాహ్మమునందు శ్రుతిచే నుత్తమపక్షము చూపబడెను.

న జీవపరయో ర్దేహదేహిభావనిబంధనమ్,
సామానాధికరణ్యం మాం క్షేత్రజ్ఞ మిత్యత స్స్ఫుటం ॥ 252.

(252) కాన జీవేశ్వరులకు దేహదేహిభావనిబంధనమైన సామానాధికరణ్యము (అభేదము) "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అనుచోట స్పష్టమని చెప్పుట వీలుబడదు.

బ్రాహ్మణోఽస్య ముఖ మాసీ దితివ జ్జీవజన్మ చ,
అస్త్యేవే హేశ్వరా ద్దేహవిశిష్టత్వేన తత్త్వతః ॥ 253.
క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి త్యాహ విష్ణుః కిలేతిచేత్,
మైవం నాస్తీశ్వరా జ్జన్మ కేవలస్యాత్మనోఽజనేః ॥ 254.

(253-254) "బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్" అను శ్రుతిచొప్పున యీశ్వరునివలన జీవునకు జన్మ కలదు. కేవల జీవునకు జన్మ లేకున్నను దేహవిశిష్టునకు యీశ్వరునివలన జన్మ సంభవమే. అట్టి జన్యజనకభావము ననుసరించియే శ్రీకృష్ణపరమాత్మ "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని చెప్పెననియు శంకింపజనదు.

అనాదిత్వా ద్విశుద్ధత్వా న్నిత్యత్వా చ్చిద్ఘనత్వతః,
శరీరేణ విశిష్టస్య పృథక్త్వం శుద్ధజీవతః ॥ 255.
ఉత్పత్తి ర్దేహ మాత్రస్య శ్రుతౌ ప్రోక్తా నచాత్మనః,
అన్యథా సర్వవేదాంతవిరోధం కో నివారయేత్ ॥ 256.

(255-256) అనాది యగుటవలనను, విశుద్ధమగుటవలనను, నిత్యమగుటవలనను ఉత్పత్తిశూన్యుడగు కేవలాత్మకు యీశ్వరునివలన జన్మ సంభవింపనేరదు. కాన కేవలాత్మకు, యీశ్వరునకు జన్యజనకభావనిబంధనమైన సామానాధికరణ్యము సంభవింపనేరదు. ఇక శరీరవిశిష్టజీవుడు శుద్ధజీవునికంటె వేరు, అందు శరీరమే జన్యముఅని శ్రుతియందు చెప్పబడెను. అట్లుకాక యాత్మకూడ జన్యమే యన్నచో సర్వవేదాన్తవిరోధము నెవడు పరిహరింపగలడు?

సర్వభూతేషు గూఢోఽయం సాక్ష్యేకో దేవ ఉత్తమః,
స ఏషాత్ర ప్రవిష్టోస్తి సృష్ట్వా సర్వం చరాచరమ్ ॥ 257.

(257) సర్వభూతములయందు గూఢుడు, సాక్షి, ఒకడు, ఉత్తముడు దేవుడు. అట్టి దేవుడు జంగమస్థావరాత్మకమగు నిఖిలప్రపంచమును సృజించి అందు ప్రవేశించి యుండెను.

స వై ప్రవిష్ట స్సర్వేషు మాయయా బహురూపధృక్,
అమూఢో మూఢవ త్సోఽయం వ్యవహర్తాఽఽస్త అగ్రహాత్ ॥ 258.

(258)ఆట్టి దేవుడే జంగమస్థావరాత్మక నిఖిలప్రపంచమునందు ప్రవేశించినవాడై మాయచే ననేకరూపములను ధరియించి యమూఢుడైనను మూఢునివలె యాత్మసాక్షాత్కారపర్యంతము వ్యవహర్తయై యుండెను.

ఇత్యత్రానుప్రవిష్టస్య మూఢత్వవ్యవహర్తృతే,
శ్రూయతేఽనేన జీవేన ప్రవిష్ట ఇతి చ శ్రుతేః ॥ 259.

(259) కాన నిఖిలజగత్తునందును ప్రవిష్టుడైన యాత్మకు మూఢత్వము, వ్యవహర్తృత్వము "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య" అనుశ్రుతిచే చెప్పబడెను.

స్వప్రకాశస్య సత్యస్య శుద్ధస్య పరమాత్మనః,
జీవరూపేణ దేహేషు ప్రవేశ శ్శ్రూయతే శ్రుతౌ ॥ 260.

(260) స్వప్రకాశము, శుద్ధము, సత్యము నగు పరమాత్మకు జీవరూపముతో దేహములయందు ప్రవేశము శ్రుతియందు చెప్పబడెను.

వేదాఽవినాశినం నిత్యం య ఏన మజ మవ్యయం,
నిత్య స్సర్వగత స్స్థాణు రచలోఽయం సనాతనః ॥ 261.
అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే,
ఉత్పత్త్యసంభవా దిత్థం శ్రుతిసూత్రగణే ష్వపి ॥ 262.

(261–262) "వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్। నిత్య స్సర్వ గత స్స్థాణు రచలోఽయం సనాతనః ॥ అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే" "ఉత్పత్త్యసంభవాత్" అని శ్రుతిసూత్రములయందు—

శ్రీవిష్ణోః పరిపూర్ణస్య క్షేత్రజ్ఞత్వం హరే ర్మతమ్,
అత ఆహ హరి స్సాక్షాత్ క్షేత్రజ్ఞం విద్ధి మా మితి ॥ 263.

(263) పరిపూర్ణుడగు శ్రీవిష్ణువునకు క్షేత్రజ్ఞత్వము శ్రీకృష్ణపరమాత్మ కభిమతము. అందువలననే శ్రీకృష్ణపరమాత్మ "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని చెప్పెను.

శ్రీవిష్ణో ర్న పృథ గ్జీవో విభు ర్నాణు ర్న మధ్యమః,
కిం త్వాత్మా సర్వభూతానాం విష్ణురేవ న చాపరః ॥ 264.

(264) జీవుడు పరిపూర్ణు డగు శ్రీమహావిష్ణువుకంటె వేరు కాదు. మరియు విభువు (సర్వవ్యాపకుడు,) అణుస్వరూపుడును కాడు. మధ్యమపరిమాణకుడును కాడు, మరేమనిన? సర్వభూతములకు విష్ణువే యాత్మ. మరియొకడు కాడు.

క్షేత్రజ్ఞత్వం చ క్షేత్రిత్వం మాయయాఽధ్యస్త మీశ్వరే,
ఈశ్వరాత్మావబోధేన శిష్యతే విష్ణు రవ్యయః ॥ 265.

(265) క్షేత్రజ్ఞత్వము, క్షేత్రిత్వము మాయచే యీశ్వరునియం దధ్యస్తములు, ఈశ్వరాత్మావబోధచే నాశరహితు డగు శ్రీమహావిష్ణువే మిగులును.

ఉపదేశ్యోపదేశాదివ్యవహార స్తు కల్పితః,
బ్రహ్మాత్మైక్యమతే సమ్యక్ సిద్ధ్యత్యేవ నిరంకుశమ్ ॥ 266.

(266) ఉపదేశ్యోపదేశాదివ్యవహారము కల్పితము. అట్టి యుపదేశ్యోపదేశాదివ్యవహారము జీవబ్రహ్మైక్యమతమునందు నిరంకుశముగ సిద్ధించును.

స్వవశీకృతమాయత్వా ద్భగవా న్జగతాం గురుః,
ఉపదేష్టాస్తి సర్వత్రాచార్యదేహే ష్వపి స్వయం ॥ 267.

(267) జగద్గురువగు భగవంతుడు స్వవశీకృతమాయకలవాడగుటవలన ఆచార్యదేహముల యందంతటను స్వయముగ నుపదేష్టయై యుండెను.

స్వవర్ణాశ్రమసద్ధర్మై ర్నానాజన్మ స్వనుష్ఠితైః,
ఆరాధితో హరి స్తుష్టో విద్యా ముపదిశ త్యజః ॥ 268.

(268) నానాజన్మములయం దనుష్ఠితమైన స్వవర్ణాశ్రమసద్ధర్మములచే నారాధితుడై అజుడగు శ్రీహరి తుష్టుడై విద్య నుపదేశించును.

స్వతస్సిద్ధాత్మవిజ్ఞానః స్వసామ్రాజ్యపదే స్థితః,
జీవాజ్ఞానానుసారేణ తేభ్యోఽప్యుపదిశ త్యసౌ ॥ 269.

(269) స్వతస్సిద్ధాత్మవిజ్ఞానముకలవాడై, స్వసామ్రాజ్యపదమునం దుండినవాడై జీవుల యజ్ఞానానుసారము జీవులకొరకు పరమాత్మయే యుపదేశించుచుండును.

ఉపదేశ్యోపదేశాది ర్యావ దజ్ఞానభా వ్యయమ్,
భేదో ధ్వస్తే మహామోహే జ్ఞానే నాస్తి మనాగపి ॥ 270.

(270) ఎంతవరకజ్ఞాన ముండునో అంతవర కీయుపదేశ్యోపదేశాదికము సంభవించును. మహామోహము నశింప, జ్ఞానోదయమై యుండ భేదము లేదు.

తత్త్వజ్ఞానా త్పురైవాయం వ్యవహారో ప్యపేక్ష్యతే,
తత్సిద్ధౌ మాస్తు సర్వోయం వ్యవహారపరంపరా ॥ 271.

(271) తత్త్వజ్ఞానమునకు పూర్వమునం దీయుపదేశ్యోపదేశవ్యవహారము అపేక్షింపబడుచున్నది. తత్త్వజ్ఞానము కలిగినపిమ్మట నీయుపదేశ్యోపదేశవ్యవహారపరంపర లేకుండును.

య మేవ వృణుతే దేవః స వేత్త్యేనం న చాపరః,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే ॥ 272.
ఇత్యాదిమానసిద్ధ్యర్థే న వివాదోఽస్తి ధీమతాం.
కల్పితేనాపి భేదేనా ప్యుపదేశపరంపరా ॥ 273.

(272-273) ఈజీవుడు యెవనిని కోరుచుండెనో, ఆదేవుడే వీనిని తెలిసికొనుచున్నాడు. మరియొకడు తెలిసికొనుట లేదు. అను శ్రుతిసిద్ధము, "దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే" యేబుద్ధియోగముచే నన్ను పొందెదరో, అట్టి బుద్ధియోగమును యిచ్చెదను. అను గీతావచనముచే సిద్ధమైన వస్తువు విషయమై బుద్ధిమంతులకు వివాద లేదు. కల్పితమైన భేదముచేతనే యుపదేశపరంపర సంభవించును.

స్వప్నోపదిష్టమంత్రాదా వర్థసిద్ధి రిహేష్యతే,
యథా వర్ణేషు దీర్ఘత్వాదయో ధర్మా ధ్వనే రపి ॥ 274.
ఆరోపితా అపి హ్యేతే సంప్రతిపత్తి హేతవః,
తథాఽఽరోపితభేదోఽపి తత్త్వవిజ్ఞానకారణం ॥ 275.

(274-275) స్వప్నోపదిష్టమంత్రాదిక మర్థసిద్ధికొరకెట్లు సమర్థ మగుచున్నదో, ధ్వనియొక్క దీర్ఘత్వాదిధర్మములు కర్ణములయం దారోపితములైనను సమ్యక్ జ్ఞానహేతువు లెట్లగుచున్నవో, అట్లే యారోపిత భేదముకూడ తత్త్వవిజ్ఞాన కారణ మగుచున్నది.

సంభవంత్యేవ వేదాన్తాః ప్రమాణం సర్వదాత్ర నః,
ఏతేన స్వర్గనరకౌ బంధమోక్షౌ భవాభవౌ ॥ 276.

(276) అన్నివిధములచేతను మాకు యీవిషయమున వేదాన్తములు ప్రమాణము లగుచున్నవి. ఈచెప్పుటచే స్వర్గనరకములు, బన్ధమోక్షములు, సంసారాసంసారములు.

వ్యాఖ్యాతా మాతృనిష్ఠత్వా న్న తే సంతి పరే పదే,
నిర్దుష్టేపి మతే దోషోద్భావనం మందబుద్ధయః ॥ 277.
కుర్వంతి యది కుర్వంతు తేన కా క్షతి రస్తి నః,
న హి మందధియాం వేదసిద్ధాంతోద్ఘాటనే స్వయం ॥ 278.

(277-278) వ్యాఖ్యాతములు. ఇవన్నియు ప్రమాతృనిష్ఠము లగుటవలన పరమపదమునందు సంభవింపవు. ఈమతము (అద్వైతమతము) నిర్దుష్టమైనను మందబుద్ధికలవారలు దోషోద్భావనమును చేయుచుండిరి. చేయుదురుగాక. అంతమాత్రముచే మాకేమి క్షతికలదు? యేక్షతియు లేదు. మందబుద్ధి కలవారలకు స్వయముగ వేదసిద్ధాన్తోద్ఘాటనమందు సామర్థ్యము లేకుండును.

సామర్థ్యం కిం తు గోవిందకృపాసాంగనిరీక్షణాత్,
తత్తు సజ్జననిర్ణీతమార్గే శ్రద్ధావతాం భవేత్ ॥ 279.

(279) మరియెవరికి కలదనెదరా? గోవిందకృపాతరంగితాపాంగప్రసారమువలన సజ్జననిర్ణీతమార్గమునందు శ్రద్ధకలవారల కట్టి సామర్థ్యము సంభవించును.

సత్సు చే ద్దోషకాలుష్యం క్వ గతి స్త్విహ దుర్ధియామ్,
అతో నిర్దుష్ట మాలోచ్య మతం గ్రాహ్యం శ్రుతే ర్హరేః ॥ 280.

(280) సత్పురుషులయందే దోషకాలుష్యమున్నచో దుష్టబుద్ధికలవారలకు గతి యెట్లు? (యెక్కడను లేదు.) కాన నిర్దుష్టమైన శ్రీహరియొక్క శ్రుతిసమ్మతమైన మతము గ్రహింపదగినది.

క్షేత్రజ్ఞం మాం మదీయం త్వం విద్ధిత్యాది యదర్థః,
వ్యాఖ్యాన మసమీచీనతయైత త్ఖండితం బుధైః ॥ 281

"క్షేత్రజ్ఞం మాం=మదీయం త్వం విద్ధి" నీవు క్షేత్రజ్ఞుని నాసంబంధమైనవానినిగ తెలిసికొనుము. అని కొందరు వ్యాఖ్యానించిరి. అట్టి వ్యాఖ్యానము మంచిదికాదని విద్వాంసులచే ఖండింపబడెను.

భేదాభేదమతం తద్వ త్ఖండితం బహుసూరిభిః,
న యుక్తం బంధమోక్షాదే రప్యసంభవతో నయైః ॥ 282.
భేదాదాభేదమతే తత్త్వంపదార్థౌ బ్రహ్మజీవకౌ,
దుర్నిరూపౌ నయై స్తత్ర క స్తావ త్త్వంపదార్థకః ॥ 283.

(282-283) భేదాభేదమతము (జీవుడు ఈశ్వరునికంటె భిన్నుడు, అభిన్నుడును) అను మతముగూడ ననేకవిద్వాంసులచే పూర్వమతమువలె ఖండింపబడెను. న్యాయముచే బంధమోక్షాదుల యసంభవముచే భేదాభేదమతము యుక్తము కాదు. భేదాభేదమతమునందు తత్త్వంపదార్థములు బ్రహ్మజీవులు న్యాయములచే (యుక్తులచే) నిరూపించుటకు శక్యములు కావు. ఎట్లన; బ్రహ్మజీవులలో "త్వం" పదార్థమేది?

జీవ స్తే సమ్మతః కిం స భేదాభేదోభయాత్మకః,
భిదాభిదాభ్యా మంశాభ్యా మంశీ కిం వా నచాగ్రిమః ॥ 284.

(284) జీవుడనెదనా? ఆజీవుడు భేదాభేదోభయాత్మకమా? భేదాభేదము లనెడి యంశములచే నంశియా? అందు జీవుడు భేదాభేదోభయాత్మక మను ప్రథమ పక్షము సంభవింపదు.

జీవస్యావస్తుతా దోషా న్న హి జీవో భిదాభిదే ।
తయోస్తు పరతంత్రత్వా త్సముదాయో న సంభవేత్ ॥ 285.

(285) ఈ మొదటి పక్షమున జీవునకు అవస్తుతాదోషము ప్రాప్తించును గాన జీవుడు భేదాభేదోభయాత్మకమను పక్షము సంభవింపదు. మరియు భేదాభేదములు పారతంత్ర్యము లగుటవలన అనగా దేని భేదము, దేని యభేదము అని మరియొకదాని సాపేక్ష యుండుటవలన స్వతంత్రముగ భేదాభేదములు సంభవింపనందున భేదాభేదోభయాత్మకను జీవు డనుట సంభవము కాదు.

ద్వితీయే యద్యభేదాంశో బ్రహ్మ తర్హ్యస్తు తస్య చ,
జీవాంశత్వం హి జీవస్య సావయవత్వ మాప్నుయాత్ ॥ 286.

(286) భేదాభేదము లంశములు. అట్టియంశములు కలవాడు జీవుడను రెండవపక్షమున నభేదాంశ బ్రహ్మ మన్నచో బ్రహ్మమునకు జీవాంశత్వము, జీవునకు సావయవత్వము ప్రాప్తించును.

నాఽభేదాంశో యది బ్రహ్మ త ర్హ్యత్యంతాభిదాఽనయోః,
తథా చ జ్ఞానమోక్షాది వ్యవహారో న సంభవేత్ ॥ 287.
శాస్త్రోపదేశః కస్యాయం నాభేదాంశస్య సంభవేత్,
బ్రహ్మరూపతయా తస్య నోపదేశాద్యపేక్షతా ॥ 288.

(287–288) అభేదాంశ బ్రహ్మము కాదనినచో జీవబ్రహ్మముల కత్యంతభేదమే ప్రాప్తించును. అట్లగుచో (అత్యంతభేదము జీవబ్రహ్మలకు సమ్మతమే యన్నచో) జ్ఞానమోక్షాదివ్యవహారమే లేకపోయెడిని. ఈశాస్త్రోపదేశ మెవరికి? అభేదాంశము బ్రహ్మరూపమే యగుటవలన బ్రహ్మరూపమున కుపదేశాద్యపేక్ష లేనందున నభేదాంశకు శాస్త్రోపదేశ మనునది సంభవింపదు.

భేదాంశ స్యోపదేశో నాహం బ్రహ్మాస్మీ త్యయోగతః,
మోక్షేపి న భిదాంశస్య స్యా దభేదో విరోధతః ॥ 289.

(289) భేదాభేదాంశలలో యభేదాంశకు శాస్త్రోపదేశములు సంభవింపకున్నటుల భేదాంశకుకూడ "అహం బ్రహ్మాస్మి" అనెడిది సంభవింపనందున భేదాంశకు శాస్త్రోపదేశము పొసగదు. మోక్షమందుగూడ భేదాంశకు విరోధమువలన భేదము సంభవింపదు.

నచాఽవిద్యాదిదోషోఽ స్యాభేదాంశస్యాపి సంభవేత్,
బ్రహ్మణ్యపి ప్రసజ్యేత నాపి భేదాంశగ స్స చ ॥ 290.

(290) అవిద్యాదిదోషము లభేదాంశకుగూడ సంభవింపవు. అట్లగుచో నవిద్యాది దోషములు భేదాంశమునే పొందుట కాదు. అభేదాంశమగు బ్రహ్మమునందుకూడ ప్రాప్తించెడిని;

ఉపాధిజననాత్పూర్వం భేదాభావా దథాపి చ,
ఉపాధిమనపేక్ష్యైవ భిన్నోంశో జీవ ఉచ్యతే ॥ 291.

(291) ఉపాధి పుట్టుటకు పూర్వమునందు భేదము లేనందున నుపాధిజననానంతరము యుపాధి నపేక్షింపకుండగ భిన్నమగు యంశ జీవుడని చెప్పబడును.

తదంశనాశే జీవస్య నాశా త్కస్య విముక్తతా,
బ్రహ్మణ స్స్వాభిదాంశస్య నిత్యముక్తత్వ మేవ హి ॥ 292.

(292) అట్లగుచో ఆయంశ నశించినచో జీవనాశమే ప్రాప్తించుచుండ నెవనికి మోక్షము? (మోక్షము పొందువాడే లేకపోయెడిని.) అభేదాంశకు మోక్షమనెదవా? అ భే దాం శ బ్రహ్మస్వరూపమే. యది నిత్యముక్తమే.

మోక్షేపి భిన్నాఽభిన్న శ్చే తర్హి బ్రహ్మైవ తత్త్వవిత్,
ఇత్యేవకారస్వారస్యం న స్యా న్మోక్షేపి సంసృతేః ॥ 293.

అనేకదోషదుష్టత్వా ద్భేదాభేదమతం స్వతః,
ఖండితం సర్వదా హేయతయోపేక్ష్య మితీరితమ్ ॥ 294.
శాంకరే దిగ్జయేఽస్మాభి ర్బహుధే త్యుపరమ్యతే,
అత ఆవిద్యకో భేదః పరమేశ్వరజీవయోః ॥ 295.

(293-295) మోక్షమునందుగూడ భిన్నాభిన్నమే యగునో నపుడు సంసార ముండుటచే "బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి" అనుచోట ఏవకారస్వారస్యము లేకపోయెడిని. భేదాభేదమతము స్వతః అనేక దోషములచే దుష్టమగుటవలన ఖండితము. అన్నివిధములములచే హేయమగుటవలన నుపేక్ష్యమని శాంకరదిగ్విజయము నందు మాచే అనేకవిధములుగ చెప్పబడెను. గాన విరమించబడుచుండెను. కాన పరమేశ్వరజీవులకు భేద మావిద్యకము.

తాత్త్వికం త్వైక్య మేవాస్తి వేదాన్తై స్సిద్ధ మిత్యలమ్,
విస్తరేణేతి జయతి బ్రహ్మాత్మైక్యపరా శ్రుతిః ॥ 296.

(296) జీవబ్రహ్మలకు ఐక్యము తాత్త్వికమే యని వేదాంతములచే సిద్ధము. గాన ఇక విస్తరించి వ్రాయుటతో చాలును. బ్రహ్మాత్మైక్యపరమైన శ్రుతి సర్వోత్కృష్టగ నున్నది.

శ్రుతిరపి పరమార్థం బ్రహ్మభావం విశుద్ధం వదతి జడవికారా న్సంవ్యుదస్య ప్రతీచః,
విమలసుఖఘనైక్యం తత్త్వమస్యాదివాక్యైః, స్మృతిరపి శతశశ్చ ప్రాహ తత్త్వైక్యనిష్ఠామ్ ॥ 297.

(297) శ్రుతియు తత్త్వమస్యాదివాక్యములచే జడవికారములను తొలగించి విశుద్ధమైన పరమార్థమగు బ్రహ్మభావమును విమలసుఖఘనైక్యముగనే చెప్పుచున్నది. స్మృతియు అనేకవిధములుగ తత్త్వైక్యనిష్ఠను చెప్పెను.

నచాయం సంసారీ భవతి హరితో భిన్న ఉదితః, స ఏవాదౌ సృష్ట్వా ప్రవిశతి హరి ర్జీవవపుషా ।
నచాన్యోఽస్మా ద్ద్రష్టే త్యపవదతి భేదం శ్రుతిశిరః, ప్రవేశ స్సంబంధో భ్రమకలిత ఏవాస్య నియతః॥ 298.

(298) ఈసంసారి శ్రీహరికంటె భిన్నుడు కాడు. ఆశ్రీహరియే సృష్ట్యాదియందు నిఖిలప్రపంచమును సృష్టించి యాప్రపంచమునందు జీవస్వరూపముతో ప్రవేశించుచుండెను. వేదాన్తము లీశ్రీహరికంటె ద్రష్ట వేరు కాడని భేదము నపవదించుచున్నవి. (తొలగించుచున్నవి.) ప్రపంచమునందు శ్రీహరికి ప్రవేశ మనగ సంబంధము. అదియు నియతభ్రమ సిద్ధమే.

అహం కర్తేత్యాద్యా భ్రమవశత ఏవాస్య కలనా, భ్రమే నష్టే నశ్య త్యహమితి మమేత్యాద్యధ్యకలనా ।
అతః క్షేత్రజ్ఞం మా మితి వదతిజీవాత్మపదయో, ర్హరి శ్శుద్ధం తత్త్వం నిరవధిసుఖం చైక్యమమృతం॥ 299.

(299) "అహం కర్తా" ఈశ్రీహరికి "నేను కర్తను" అనునది మొదలగునవి భ్రమవశమువలన ప్రాప్తించుచున్నవి. భ్రమ నశింప "అహం" (నేను) "మమ" (నాది) ఇత్యాద్యధ్యకలన నశించుచున్నది. అందువలననే శ్రీకృష్ణపరమాత్మ "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి) అని జీవాత్మపరమాత్మలకు శుద్ధమైన, నిరవధిక సుఖస్వరూపమైన, అమృతరూపమగు నైక్యరూపతత్త్వమును చెప్పుచుండెను.

అతః పూర్వోక్త ఏవార్థ శ్శ్రీహరే స్సంమత శ్శ్రుతేః,
న తత్ర భేదకలనా న భేదాభేదవిభ్రమః ॥ 300.

(300) కాన పూర్వమునందు చెప్పబడిన జీవబ్రహ్మైక్యరూపార్థమే శ్రుత్యర్థమని శ్రీహరిసమ్మతము. దానియందు భేదము భాసించునని కాని, భేదాభేదవిభ్రమము కాని పొందవలదు.

జీవత్వం మాయయా శుద్ధే కల్పితం బోధతః క్షతమ్,
శుద్ధ మైక్యం తయో స్సిద్ధం భేద స్త్వాఽవిద్యకోఽనయోః ॥ 301.

(301) శుద్ధమునందు జీవత్వము మాయచే గల్పితము. అట్టి కల్పితమైన జీవత్వము జ్ఞానమువలన నశించును. జీవపరమాత్మలకు శుద్ధమైన యైక్యము సిద్ధమగుచున్నది. ఈజీవపరమాత్మలకు భేదమవిద్యవలన ప్రాప్తించుచున్నది.

న హ్యవిద్యాకృతో భేదః పరమార్థపదం స్పృశేత్,
అధ్యస్తగుణదోషాభ్యాం నాధిష్ఠానస్య సంగతా ॥ 302.

(302) అవిద్యాకృతమైన భేదము పరమార్థము కాదు. అధ్యస్తగుణదోషములతో యధిష్ఠానమునకు సంబంధము లేదు.

ఆకాశే కల్పితం నైల్య మూషరే నా జలం భ్రమాత్,
న రూపవత్కృతం వ్యోమ నైల్యేనేహ మనాగపి ॥ 303.

(303) ఆకాశమునందు భ్రమవలన నైల్యము కల్పితము. అట్లే ఊషరక్షేత్రమునందు భ్రమవలన జలము కల్పితము. అట్టి కల్పితమైన నైల్యముచే నాకాశము ఇంచుకైన రూపవత్తు కాదు.

న వా పంకీకృతో దేశః కల్పితేనాంభసోషరః,
తథాఽవిద్యాకృతం బ్రహ్మాఽధిష్ఠానం న స్పృశే న్మలమ్ ॥ 304.

(304) కల్పితమైన జలముచే నూషరక్షేత్రము పంకీకృతము (బురదకలదై) కాదు. అట్లే యవిద్యాకృతమైన మలము అధిష్ఠానమగు బ్రహ్మమును స్పృశింపనేరదు.

సంసారితా మహేశే వా జీవే సర్వజ్ఞతాఽథవా,
న శంక్యోపాధిభేదేన తయో ర్భేదో యతో మతః ॥ 305.

(305) జీవేశ్వరుల కైక్య మున్నచో జీవునకు సర్వజ్ఞత్వము, యీశ్వరునకు సంసారిత్వము ప్రాప్తింపవలయునని శంకింపజనదు. ఉపాధిభేదముచే జీవేశ్వరులకు భేదము సమ్మతము.

ఏవ మేవాద్వితీయం య ద్వస్తు బ్రహ్మాజరామరమ్,
స్వాఽవిద్యయా తదేవేహ ద్విధా భిన్న ముపాధితః ॥ 306.

(306) సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యము, జరామరణవర్జితము నగు యేబ్రహ్మవస్తువు కలదో కలదో అదియే స్వావిద్యచే నుపాధులననుసరించి రెండు విధములుగ భిన్నము.

అవిద్యాపి త్రిధా భిన్నా గుణత్రయవిభాగతః,
విశుద్ధసత్వం మాయేతి సర్వశక్తినియామికా ॥ 307.

(307) అవిద్యయు సత్త్వరజస్తమోగుణ విభాగమువలన మూడు విధములు. విశుద్ధసత్త్వప్రధానము మాయ యనబడును. అట్టి మాయ సర్వశక్తినియామకము.

రజస్తమోభ్యాం మలిన మవిద్యే త్యుచ్యతే బుధైః,
తమఃప్రధానా ప్రకృతి స్తృతీయా భూతకారిణీ ॥ 308.

(308) రజస్తమనస్సులచే మలినమైనది యవిద్య యని విద్వాంసులచే చెప్పబడుచున్నది. తమః ప్రధానమైన ప్రకృతి మూడవది. అదియే భూతకారిణి యగుచున్నది.

మాయాశక్త్యాశ్రయో బ్రహ్మ పరమేశ ఇతీరితః,
స సర్వజ్ఞ స్సర్వశక్తి ర్జగజ్జన్మాదికారణమ్ ॥ 309.

(309) మాయాశక్త్యాశ్రయ మగు బ్రహ్మము పరమేశ్వరుడని చెప్పబడుచున్నది. అపరమేశ్వరుడు సర్వశక్తిసమన్వితుడై జగజ్జన్మస్థితిలయ కారణు డగుచున్నాడు.

న తస్యావృతివిక్షేపౌ కర్తుం శక్తా మహేశ్వరీ,
స స్వప్రకాశచిత్సౌఖ్యసంవిదాలింగితో యతః ॥ 310.

(310) అపరమేశ్వరుడు స్వప్రకాశచిత్సౌఖ్యసంవిదాలింగితుడు గాన మహేశ్వరియగు మాయ యతనికి ఆవరణవిక్షేపములను కలుగజేయుటకు సమర్థమైనది కాదు.

నిత్యముక్తస్వభావత్వా త్స్వే మహిమ్న్యేవ తిష్ఠతి,
సృష్ట్యాదికరణే ప్యస్య న శ్రమ స్సర్వశక్తితః ॥ 311.

(311) నిత్యముక్తస్వభావు డగుటవలన తన మహిమయందే యుండియున్నాడు. సర్వశక్తులు కలవా డగుటవలన సృష్ట్యాదికరణమునం దీయీశ్వరునకు శ్రమ లేదు.

యదవిద్యాశ్రయో బ్రహ్మ స క్షేత్రజ్ఞ ఇతీరితః,
తస్యాఽఽవృతస్వరూపత్వా త్సంసారిత్వ మితీరితమ్ ॥ 312.

(312) యద్విషయకాజ్ఞానాశ్రయుడు బ్రహ్మమో అట్టివాడు క్షేత్రజ్ఞు డనబడును. అట్టి క్షేత్రజ్ఞు డావృతస్వరూపము కలవా డగుటవలన నతడు సంసారి యనిపించుకొనును.

స్వావిద్యాధ్యస్తకర్తృత్వభోక్తృత్వాద్యభిమానతః ।
వస్తుత శ్శుద్ధ ఏవాసౌ క్షేత్రజ్ఞః పురుషోత్తమః ॥ 313.

(313) స్వావిద్యచే నధ్యస్తమైన కర్తృత్వభోక్తృత్వాద్యభిమానమువలన నతనికి సంసారిత్వము చెప్పబడెను. ఈక్షేత్రజ్ఞుడు వాస్తవముగ శుద్ధమైన పురుషోత్తముడే.

తమఃప్రధానయా శక్త్యా బ్రహ్మాండం కల్పితం పరే,
సమష్టివ్యష్టిభేదేన ద్వివిధం త దుదీరితమ్ ॥ 314.

(314) తమఃప్రధానమైన శక్తిచే పరమేశ్వరునియందు బ్రహ్మాండము కల్పితము. ఆబ్రహ్మాండము సమష్టిరూపమని, వ్యష్టిరూపమని రెండు విధములుగ చెప్పబడుచున్నది.

జీవే త్వంపదవాచ్యార్థే వ్యష్ట్యాఖ్యం తత్ప్రకల్పితం,
ఈశే తత్పదవాచ్యార్థే సమష్ట్యాఖ్యం ప్రకల్పితమ్ ॥ 315.

(315) త్వంపదవాచ్యార్థ మగు జీవునియందు వ్యష్టిప్రపంచము కల్పితము. తత్పదవాచ్యార్థ మగు నీశ్వరునియందు సమష్టిప్రపంచము కల్పితము.

తద్ద్వయం క్షేత్రశబ్దేన సమష్టివ్యష్టిసంజ్ఞకమ్,
ఉక్తం భగవతా తత్ర క్షేత్రజ్ఞో భగవా నసౌ ॥ 316.

(316) అట్టి సమష్టివ్యష్టిప్రపంచద్వయము క్షేత్రమని శ్రీకృష్ణపరమాత్మచే చెప్పబడెను. అందు యీభగవంతుడే క్షేత్రజ్ఞుడు.

తద్ద్వయం భేదకం క్షేత్రం త్యక్త్వా మాయామయం జగత్,
శుద్ధం క్షేత్రజ్ఞ మాత్మానం ప్రత్యంచం బ్రహ్మ వేత్తి యః ॥ 317.

(317) మాయామయము, జడము, భేదకమునగు సమష్టివ్యష్ట్యాత్మకక్షేత్రమును విడచి క్షేత్రజ్ఞుడగు తనను, ప్రపంచమును శుద్ధబ్రహ్మస్వరూపముగ నెవడు తెలిసికొనునో,

స సమ్యగ్జ్ఞానవాన్ధీరో మతో భగవతో హరేః,
తదేవ మన్నృతం క్షేత్రం మాయయా కల్పితం పరే, 318

(318) అట్టివాడు సమ్యక్ జ్ఞానము కల ధీరుడని శ్రీకృష్ణపరమాత్మకు సంమతుడు. ఈయనృతమైన క్షేత్రము పరమాత్మయందు మాయచే గల్పితము.

సత్య క్షేత్రజ్ఞ ఏవైత ద్భ్రమాధిష్ఠాన మద్వయః,
క్షేత్రక్షేత్రజ్ఞయో రేవం య ద్జ్ఞానం వేద మానజమ్ ॥ 319.

(319) అద్వయమైన సత్యక్షేత్రజ్ఞుడే యీభ్రమాధిష్ఠానము. వేదప్రమాణమువలన జనించిన క్షేత్రక్షేత్రజ్ఞుల యీజ్ఞానమే-

తదేవ మోక్షహేతుత్వా ద్జ్ఞాన మజ్ఞానబాధకమ్,
మమ శ్రీవాసుదేవస్య మతం నాన్య ద్భ్రమాత్మకమ్ ॥ 329.

(320) మోక్షహేతువగుటవలన నజ్ఞానబాధకమై, వాసుదేవుడ నగు నాకు సంమ్మతము. భ్రమాత్మకమగు మరియొకజ్ఞానము సమ్మతము కాదు.

అత్రాయ మాశయో విష్ణో రాగమస్యాపి సమ్మతః,
వస్తుతో బ్రహ్మచిన్మాత్ర మేకమేవాద్వయం పరమ్ ॥ 321.

(321) ఈవిషయమున పరమేశ్వరునకు, వేదమునకు యీయాశయము సమ్మతము. (అది యేదనిన?) వాస్తవికముగ పరబ్రహ్మము చిన్మాత్రము, సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యము.

అసంగోదాసీనం కర్తృభోక్తృభావాదివర్జితమ్,
తదేవావిద్యయా స్వస్మి న్సంసారిత్వం ప్రకల్ప్య చ ॥ 322.

(322) మరియు అసంగతము, ఉదాసీనము, కర్తృత్వభోక్తృత్వాదివర్జితము. అట్టి పరబ్రహ్మమే తనయం దవిద్యచే సంసారిత్వమును కల్పించుకొని,

జీవేశ్వరభిదాం తద్వ దధ్యస్యావృతచిద్వపుః,
విస్మృత్యాత్మపదం శుద్ధం జీవోహ మితి మన్యతే ॥ 323.

(323) అట్లే జీవేశ్వరభేదము నధ్యసించి, ఆవృతమైన చిత్స్వరూపమైన శరీరముకలవాడై శుద్ధమైన యాత్మపదమును మరచి "నేను జీవుడను" అని (తనను) తలచుచున్నాడు.

స జీవో ప్యంధతమసి నిమగ్నో లింగసంవృతః,
జన్మమృత్యుమయీం ఘోరాం సంసృతిం భజతే భ్రమాత్ ॥ 324.

(324) ఆజీవుడుకూడ లింగదేహముతో గూడి యజ్ఞానతమస్సునందు మునిగినవాడై, భ్రమవలన ఘోరమైన జన్మమృత్యుస్వరూపమగు సంసారమును పొందుచున్నాడు.

ఉపాధౌ క్షేత్రరూపేస్మి న్నహ మిత్యభిమానవాన్,
క్షేత్రజ్ఞో జంతు రజ్ఞోసౌ జీవ ఇత్యభిశబ్దితః ॥ 325.

(325) యీక్షేత్రస్వరూపమైన యుపాధియందు "అహం" అను యభిమానము కలవాడై యితడు క్షేత్రజ్ఞుడు, జంతువు, అజ్ఞుడు, జీవుడు అని వ్యవహరింపబడుచుండెను.

పాపపుణ్యమయీ సంవి దుద్భూతాస్య దృఢాంతరా,
అవిద్యాకామకర్మాదిమలై రాచ్ఛాదితాంతరః ॥ 326.

(326) ఇట్టి జీవునకు దృఢమైన, అంతరమైన పుణ్యపాపరూపమైన సంవిత్తు (విజ్ఞానము) పుట్టుచున్నది. (ఇట్టి జీవుడు) అవిద్యాకామకర్మాదిమలముచే నాచ్ఛాదితమైన యంతఃకరణ కలవాడై.

పునర్జన్మ పునర్మృత్యుం ప్రయాత్యాకల్ప మాతురః,
కదాచిత్పుణ్యసంపత్త్యా త్యక్తపాపమలో నరః ॥ 327.
ఈశ్వరాభిముఖత్వైకహేతుం భక్తిం పరాం హరౌ,
కృత్వా శుద్ధిం తతః ప్రాప్య వైరాగ్యాదియుత స్సుధీః ॥ 328.
ఉపసృత్య గురుం తస్మాచ్ఛ్రుత్వా వేదాంతసద్వచః,
తత్త్వమస్యాదితజ్జన్యబోధే నాత్మాన మవ్యయః ॥ 329.
సాక్షాత్కృత్య స్వయం సాక్షాత్పురుషోత్తమ ఏవ చ,
అత ఆహ హరి స్సాక్షాత్క్షేత్రజ్ఞం విద్ధి మా మితి ॥ 330.

(327-28-29-30) ఆకల్పాంత మాతురుడై తిరిగి జన్మమును, తిరిగి మృత్యువును పొందుచున్నాడు. ఒకానొక సమయమున నరుడు పుణ్యసంపత్తిచే విడిచిపెట్టబడిన పాపమలము కలవాడై. ఈశ్వరానుగ్రహము వలన శ్రీహరియందు భక్తిని సంపాదించి దానివలన శుద్ధిని పొంది వైరాగ్యాదులతో గూడిన బుద్ధిమంతుడు గురువును జేరి యాసద్గురువువలన వేదాన్తశ్రవణ మొనరించి తత్త్వమస్యాదివాక్యజన్యబోధచే నద్వయమగు నాత్మను సాక్షాత్కరింపజేసుకొని స్వయముగ పురుషోత్తముడే యగుచున్నాడు. అందువలననే శ్రీకృష్ణపరమాత్మ "క్షేత్రజ్ఞం విద్ధి మాం" అని సాక్షాత్తు చెప్పెను. (330) ॥౨॥

భాష్యార్థదీపికా:— దృశ్యములకు దుఃఖాదుల కనాత్మధర్మత్వసిద్ధికొఱకు శరీరముకంటె భిన్నముగ ద్రష్టనుచూపి ప్రకృతి పురుషవిభాగజ్ఞానముచే మోక్షము సాంఖ్యుల కభిమతమగుటవలన నట్టి జ్ఞానముచేతనే క్షేత్రక్షేత్రజ్ఞులు తెలిసికొనదగినవారా? అను యాశంకను తొలగించుటకొరకు ఆత్మ సర్వదేహములయం దొకటేయని చెప్పుచు "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అనుదానిచే పరమార్థము, స్వస్వరూపము, అక్షరము నగు పరబ్రహ్మముతో క్షేత్రజ్ఞున కభేదమును చూపించుచుండెను.

దృశ్యము, క్షేత్రము నగు శరీరముకంటె భిన్నమై, క్షేత్రమును తెలిసికొనునట్టి ద్రష్టను ("చాపి మాం విద్ధి" "చ" "అపి" అను రెండు నిపాతలు జీవు డక్షరుడనియు, శరీరముకంటె భిన్నుడని బోధించును.) సాంఖ్యునివలె క్షేత్రజ్ఞుడు దృశ్యముకంటె వేరు అని యింతమాత్రమే తెలియవలదు. మరేమనిన? క్షేత్రజ్ఞుని మదభిన్నునిగ గూడ తెలియనగును. అనగా దృశ్యముకంటె వేరగు క్షేత్రజ్ఞుని మదభిన్నునిగ (పరమేశ్వరాభిన్నునిగ)ను తెలిసికొనుము.

(లేక "చ"కారము క్షేత్రజ్ఞజ్ఞానసముచ్చాయకము. "అపి" అనునది ఏవకారార్థకము. సర్వక్షేత్రములయందు ద్రష్ట యగు క్షేత్రజ్ఞుని క్షేత్రముకంటె వేరుగ తెలిసికొనుము. అట్టి క్షేత్రజ్ఞుని "మా మేవ" అసంసారి యగు పరమేశ్వరస్వరూపముగనే తెలిసికొనుము. నీవెట్లు భరతవంశోద్భవుడ నగుటవలన భారతుడవైతివో అట్లే నాయందు కల్పితమైన క్షేత్రజ్ఞుడును నేనే యని సూచించుచు "భారత" అని సంబోధించెను. నీవు ఉత్తమవంశజాతుడ వగుటవలన నీవీవిషయమును తెలిసికొనుటకు సమర్థుడ వని "భారత" అను సంబోధనచే సూచింపబడెను. ఇట్టితీరున తెలిసికొనుట యెందుల కనెదవా? ఇట్టి జ్ఞానము మోక్షానన్యసాధనసమ్యక్జ్ఞానముగ నా కభిప్రేత మని "క్షేత్రక్షేత్రజ్ఞయోః" అని యుత్తరార్థముచే చెప్పుచుండెను. దృశ్యద్రష్టృప్రత్యగభిన్నపరమాత్మవ్యతిరిక్తముగ జ్ఞానగోచరమైన దేదియు లేనందున జ్ఞేయము లగు క్షేత్రక్షేత్రజ్ఞుల యేజ్ఞానము కలదో, అనగా జ్ఞేయ మాత్మయందు కల్పితము. దృశ్యము, క్షేత్రజ్ఞుడు పరమాత్మాభిన్న మగు ప్రత్యగాత్మయే అని యాక్షేత్రక్షేత్రజ్ఞులు యేజ్ఞానగోచరముగ చేయబడెదరో యట్టి సమ్యక్జ్ఞానము శాస్త్రయోనియు, పరమేశ్వరస్వరూపుడు, వాసుదేవుడను అగు నా కభిప్రేతము.

జీవేశ్వరుల కేకత్వమే యంగీకరించినచో సర్వక్షేత్రములయం దొక్కడే యీశ్వరుడు. తద్భిన్నుడగు భోక్త లేకపోవలసివచ్చును. కాన జీవున కీశ్వరునియం దంతర్భావము సంభవింపనేరదు. సంసారా-

లంబనమైన జీవుడు యీశ్వరభిన్నుడుగ లేనిచో సంసారము నిరాలంబనము కావలసివచ్చును. సంసారమునకు నిరాలంబనత్వము యిష్టము కానందున పరమాత్మకే సంసారిత్వము ప్రాప్తింపవలసివచ్చును. కాన జీవునకు యీశ్వరునియందంతర్భావము పొసగనేరదు. మరియు మరియొక సంసారి లేమిం జేసి యీశ్వరు డపహతపాప్మత్వాదిగుణకు డగుటవలన విపరీతగుణములు కలవాడగుటవలన యీశ్వరునకు సంసారిత్వము పొసగనందున యీశ్వరునకు జీవునియందంతర్భావము సంభవింపదు. అందువలన సంసారమే లేకపోవలసివచ్చును. యీశ్వరున కసంసారిత్వము, సంసారాభావము యీరెండును యిష్టమే యని శంకింపజనదు. సంసారమే లేనిచో "తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి" అజీవేశ్వరులలో నొకడు తన కర్మఫలము ననుభవించుచుండెను. అనెడి బంధశాస్త్రమునకు, తద్ధేతువగు కర్మవిషయకకర్మకాండకు అనర్థక్యము ప్రాప్తించెడిని. సంసార మీశ్వరాశ్రిత మన్నచో "అనశ్న న్నన్యోఽభిచాకశీతి" మరియొకడు కర్మఫలము ననుభవింపక సాక్షిగ చూచుచుండెను. అనెడి యీశ్వరు నకసంసారిత్వమును బోధించెడి శాస్త్రమునకు, మోక్షహేతు జ్ఞానప్రతిపాదకజ్ఞానకాండక వైయర్థ్యము ప్రాప్తించెడిని.

మరియు సుఖదుఃఖహేతులక్షణమగు సంసారము ప్రత్యక్షముగ చూడబడుటవలన ప్రత్యక్షాదివిరోధముచే సంసారాభావప్రసంగ మనిష్టము. ప్రాసాదమువలె సంసారము విచిత్రకార్యమగుటవలన విచిత్రహేతుకము. అను యనుమానప్రమాణమువలనను సంసారాభావప్రసంగ మనిష్టము. కాన నాత్మేశ్వరైకత్వ మనుపపత్తిగ్రస్త మగుటవలన యుక్తము కాదు. మరియు పరోక్షత్వాపరోక్షత్వరూపవిరుద్ధధర్మములచే జీవేశ్వరుల కైక్యమే సంభవింపదు. నేను యీశ్వరునికంటె భిన్నుడను, కర్తను, భోక్తను, అనెడి సర్వప్రమాణోపజీవ్యము, జ్యేష్ఠమునగు ప్రత్యక్షప్రమాణముచే గృహీతమైన ప్రత్యయమునకు (జ్ఞానమునకు) శబ్దప్రమాణజన్యజ్ఞానముచే బాధ సంభవింపనందున జీవేశ్వరుల కైక్యమే సంభవింపదు. అందువలన "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని చెప్పెడి శ్రీకృష్ణపరమాత్మకు జీవేశ్వరైకత్వబోధయందు తాత్పర్యము లేదు. మరేమనిన? ప్రతిమాదులయందు విష్ణ్వాది దర్శనమువలె క్షేత్రజ్ఞునియందు నాదృష్టి చేయదగినది, అనగా క్షేత్రజ్ఞుడీశ్వరుడని యుపాసించవలె ననియే తాత్పర్యమని శంకింపజనదు.

జ్ఞానాజ్ఞానములకు స్వరూపమువలనను, ఫలమువలనను భేద ముపన్నమగుటచే జీవేశ్వరుల కైక్యముండినను, అజ్ఞానకృతము సంసారిత్వము, జ్ఞానకృత మసంసారిత్వ మను విభాగముచే అనుపపత్తి లేనందున విరుద్ధధర్మములు బ్రహ్మమునం దధ్యస్తమగుటవలన శుద్ధచైతన్యములకు అభేదము విరుద్ధము కానందున "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని శ్రీకృష్ణపరమాత్మ జీవేశ్వరుల కైక్యమునే బోధించెను. కాని ప్రతిమాదులయందు విష్ణ్వాదిదృష్టివలె జీవునియందు పరమాత్మదృష్టి యుంచి యుపాసించవలెనని బోధింపలేదు. "దూరమేతే విపరీతే విషూచీ అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా। విద్యాభీప్సినం నచికేతసం మన్యే నత్వా కామా బహవో లోలుపన్త । శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేతత్తౌ సంపరీత్య వివినక్తి ధీరః శ్రేయో హి ధీరోఽభిప్రేయసో వృణీతే ప్రేయో మన్దో యోగక్షేమా ద్వృణీతే॥" అను నీరెండు శ్రుతులచేతను స్వరూపమువలనను, ఫలమువలనను, విలక్షణములుగ విద్యావిద్యలు నిర్దిష్టములు. మరియు "ద్వా విమా వథ పంథానా" ఇత్యాదికమును చెప్పునదిట్టి వేదవ్యాసమహర్షిచే "ఇచట నిష్ఠాద్వయమును చూపుచుండిన శ్రీకృష్ణపరమాత్మచే నీకొరకు విలక్షణమగు జ్ఞాననిష్ఠ, కర్మనిష్ఠ చెప్పబడెను" అవిద్య సంసారహేతుభూతము. అట్టి యవిద్య కార్యముతోగూడ మోక్షహేతుభూతమగు విద్యచే నశింపజేయదగినదని శ్రుతిస్మృతిన్యాయములచే తెలియబడుచున్నది.

ఈవిషయమునవే "ఇహ చేదవేదీ దథసత్య మస్తి న థ నచేదిహా వేదీ న్మహతీ వినష్టిః" (జీవించియుండగనే పరమాత్మతత్త్వమును తెలిసికొనినచో అనగా "బ్రహ్మైవాహమస్మి" అని తెలిసికొ‌నిన‌చో అట్టి జ్ఞానా

నంతరమే అవితథము, అబాధ్యరూపము, నగు కైవల్యము కలుగు. జీవించియుండగ "బ్రహ్మైవాహ మస్మి" అని తెలిసికొననిచో జన్మమరణరూప మగు సంసారము తప్పదు.) "త మేవం విద్వా నమృత ఇహ భవతి" (ఇట్టిరీతిన పరమాత్మస్వరూపమును తెలిసికొనియే అమృతు డగును.) "తమేవం విదిత్వాఽతిమృత్యు మేతి" (పూర్వోక్తరీతిని తెలిసికొనియే జన్మమరణరూపమృత్యువు నతిక్రమించుచుండెను.) "నాన్యః పంథా విద్యతేఽనాయ" మోక్షముకొరకు జ్ఞానముకంటె మరియొక మార్గము లేదు.) "విద్వా న్న బిభేతి కుతశ్చన" భయ కారణము లేమింజేసి విద్వాంసుడు దేనివలనను భయపడడు.) "ఉదర మన్తరం కురుతే । అథ తస్య భయం భవతి" (పరమాత్మకు తనకు కొంచెమైనను భేదమును కల్పించినచో నట్టివానికి భయము ప్రాప్తించును ) "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" జీవించియుండగ నెవడు భేదమునే చూచునో ఆట్టివాడు జననమరణరూపసంసారమృత్యువునుండి యట్టిసంసారమృత్యువునే పొందును.) "అవిద్యాయా మన్తరే వర్తమానా స్స్వయం ధీరాః పండితంమన్యమానా దంద్రమ్యమాణాః పరియన్తి మూఢా అన్ధేనైవ నీయమానా యథాఽన్ధాః" ఘనీభూతతమస్సునందువలె యవిద్యయొక్క మధ్యభాగమునందుండి పుత్రధనాది తృష్ణా పాశశతములచే కట్టబడి, అత్యంతము కుటిలమైన అనేకరూపము లగు గతినిపొందినవారై స్వయాగ ధీరులై అపండితు లగు తమరిని పండితులుగ తలచువారై అంధునిచే తీసుకునివెళ్ళబడుచుండెడి యంధు లనర్థపరం పరను పొందునటుల జరామరణదుఃఖములనే పొందెదరు.) "అసుర్యా నామ తే లోకా అన్ధేన తమసాఽఽవృతాః । తాం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః" (ఆత్మస్వరూపజ్ఞానములేనివారు ఆత్మ హంత లనబడుదురు. అట్టివారు అంధతమస్సుతో వ్యాప్తమైనఅసుర్యము లనెడి లోకములను మరణించిన పిదప పొందెదరు.) "తరతి శోక మాత్మవిత్ (ఆత్మజ్ఞానముకలవాడు శోకమును తరించును.) "బ్రహ్మవి దాప్నోతి పరం" (బ్రహ్మవేత్త పరమాత్మను పొందును.) "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" బ్రహ్మమును తెలిసికొనినచో బ్రహ్మయే యగును.) "అన్యోఽసా వన్యోఽహ మస్మీతి న స వేద యథా పశు రేవ స దేవానామ్" (పరమాత్మ వేరు, నేను వేరు అని యెవడు తెలిసికొనునో అట్టివా డాత్మతత్త్వము తెలియనివాడు. మనచే నివ్వబడిన తృణాదులను భక్షించి పశువు మన కెటుల యుపకృతి జేయుచుండునో యట్లే యాత్మ తత్త్వమును తెలియనివాడు దేవతల కుపకృతిని జేయుచు వారి యనుగ్రహపాత్రుడై వారలచే నొసగబడిన భోగముల ననుభవించుచుండును.) "ఆత్మవి ద్యః స ఇదం సర్వం భవతి" (ఎవ డాత్మవేత్తయో వాడీసర్వ మగుచుండెను.) "భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః । క్షీయన్తే చాస్య కర్మాణి తస్మి న్దృష్టే పరావరే" (ఆపరమాత్మ యెవనిచేతెలియబడునో అట్టివానియొక్క హృదయగ్రన్థి భేదింపబడును. సర్వసంశ యములు భేదింపబడును; అట్టివానియొక్క సర్వకర్మలు నశించును.) "యదా చర్మవ దాకాశం వేష్టయిష్యన్తి మానవాః । తదా దేవ మవిజ్ఞాయ దుఃఖ స్యాన్తో భవిష్యతి" (మానవులు చర్మమువలె ఆకాశము నెపుడు చుట్టెదరో అపుడు పరమాత్మస్వరూపమును తెలిసికొనకయే దుఃఖముయొక్క యంతమును పొందెదరు. అట్టి రీతిన ఆకాశమును చర్మమును చుట్టునటుల చుట్టుటయు సంభవము కాదు. ఆత్మజ్ఞానము లేనిదే దుఃఖముల యంతము పొందుటయు సంభవము కాదని పై శ్రుత్యభిప్రాయము.) ఈమొదలగు సహస్రశ్రుతులు బోధించు చున్నది. "అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః । అన్యథా సన్త మాత్మానం యోఽన్యథా ప్రతిపద్యతే । కిం తేన న కృతం పాపం చోరే ణాత్మాపహారిణా । జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః । తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ ఇహైవ తై ర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః । సమం పశ్య న్హి సర్వత్ర" ఈమొదలగు స్మృతులు పూర్వోక్తవిషయమునే బోధించుచున్నవి. జ్ఞానఫల మనర్థనివృత్తి యనియు, అజ్ఞానఫల మనర్థప్రాప్తి యనియు అన్వయవ్యతిరేకములచేగూడ సిద్ధించు చున్నది. ఈవిషయమే పురాణమునందు "సర్వా న్కుశాగ్రాణి తథోదపానం జ్ఞాత్వా మనుష్యాః పరివర్జయన్తి ।

అజ్ఞానత స్తత్ర పతన్తి కేచి జ్జ్ఞానే ఫలం పశ్య యథా విశిష్టమ్'' సర్పములను, కుశాగ్రములను (పాదు) నూతిని మనుష్యులు తెలిసికొనినచో వాటిని విడిచెదరు. తెలిసికొననిచో వానియందు పడెదరు. కాన జ్ఞానమునందు విశేషఫలము కలదు. దీనివలన తేలిన యాశయ మేమనిన? దేహేంద్రియాద్యనాత్మలయం దాత్మజ్ఞానము కల యజ్ఞాని రాగద్వేషాదిప్రయుక్తుడై ధర్మాధర్మముల నాచరించువాడై జన్మమరణాదిసంసారమును పొందును. దేహేంద్రియాద్యతిరిక్తాత్మదర్శి రాగద్వేషాదిప్రహాణమువలన ధర్మాధర్మములయందు ప్రవృత్తిలేమింజేసి మోక్షమునుపొందును. అను విషయము శ్రుతిస్మృతి న్యాయావగతము. ఇట్టి విషయము నేవాదియు నేయుక్తిచేతను కాదనుటకు సమర్థుడు కాడు.

ఈచెప్పుటచే దేలిన యాశయమేమి? పైచెప్పిన విధమున జ్ఞానాజ్ఞానములు స్వరూపమువలనను, కార్యమువలనను, భిన్నములై యుండ వాస్తవికముగ క్షేత్రజ్ఞుడైన యీశ్వరునికే అవిద్యాకృతబుద్ధ్యాద్యుపాధిభేదమువలన నావిద్యకము, ఆభాసరూపము, ప్రాతిభాసికము నగు సంసారిత్వము సిద్ధించుచున్నది.

ఎట్లు పురస్థితమైన వాస్తవికమగు స్థాణువునందు అవిద్యాకృతమైన అతద్బుద్ధిరూపమైన (అది కాని దానియందు అది అనుబుద్ధిరూపమైన) "పురుషుడు'' అను నిశ్చయము కలిగినను, పురుషధర్మమగు శిరఃపాణ్యాదిమత్త్వము స్థాణువునందు సంభవింపదో, స్థాణుధర్మమగు వక్రత్వాదిమత్త్వము పురుషునకు చూడబడుటలేదో, అట్లే దేహాద్యనాత్మలయందు అవిద్యాకల్పితమైన సర్వజన్తుప్రసిద్ధమైన ఆత్మత్వనిశ్చయ ముండినను, చైతన్యము దేహాదిధర్మము కాదు. దేహధర్మమగు జాడ్యజరామరణాదికము చైతన్యధర్మమూ కాదు.

జాడ్యాదు లనాత్మధర్మము లైనను సుఖాదులాత్మధర్మము లెందులకు కావని శంకింపజనదు. "కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి రధృతి ర్హ్రీ ర్ధీ ర్భీ రి త్యేత త్సర్వం మన ఏవ'' ఇత్యాదిశ్రుతిచేతను, జరామరణాదులవలె నవిద్యాకృతము లగుటవలన సుఖదుఃఖమోహాదు లాత్మధర్మములు కావను అనుమానప్రమాణము చేతను, సుఖదుఃఖమోహాదుల కనాత్మధర్మత్వమే సిద్ధించుచుండ యవి యాత్మధర్మము లని చెప్పుట యసంగతము.

స్థాణువునందు "అయం పురుషః'' అను భ్రాంతిస్థలమున నిట్టి భ్రాంతికల చైత్రుడను మరియొకడు జ్ఞాత, స్థాణుపురుషులిరువురు జ్ఞేయములు. దేహమునం దాత్మభ్రాంతిస్థలమున జ్ఞేయమగు దేహమునకు జ్ఞాతయగు నాత్మకే యధ్యాస కాన దేహాత్మాధ్యాసస్థలమున జ్ఞేయజ్ఞాతలకే యధ్యాసమగుటవలన స్థాణుపురుషస్థలమున జ్ఞేయములగు స్థాణుపురుషులయెడ జ్ఞాతయగు మరియొక చైత్రున కధ్యాససంభవించుటచే దేహాదులయం దాత్మాధ్యాసకు స్థాణుపురుషాధ్యాసను దృష్టాంతముగ చెప్పుట సంభవము కాదని శంకింపజనదు. కాన స్థాణువునందు పురుషత్వమువలె దేహాదుల కావిద్యకత్వము చెప్పుట పొసగదు. యెచట యధ్యాసావిషయత్వమో యచటనే యుభయమునకు జ్ఞేయత్వముండును. దేహాత్మాధ్యాసస్థలమున ఆత్మ జ్ఞాతయే యగుటంజేసి యుభయమునకు జ్ఞేయత్వము లేమింజేసి వ్యాప్యమగునట్టి యధ్యాస సంభవింపదు. కాన దేహధర్మము జ్ఞేయమైనను, సుఖాదిక మాత్మధర్మమే యని శంకింపజనదు. ఇట స్థాణుపురుషాధ్యాసకు, శరీరాత్మాధ్యాసకు అవిద్యాధ్యాసమాత్రమే సామ్యముగ వివక్షితము. దృష్టాంతదార్ష్టాంతికముల కెచటను సర్వవిధముల సామ్యముండదు. సర్వాత్మనా సామ్యమే యున్నచో దృష్టాంతదార్ష్టాంతికములు ఒకటే యగును. అట్లగుచో దృష్టాంతదార్ష్టాంతికభావమే సంభవింపకుండును. కాన దృష్టాంతదార్ష్టాంతికముల కేకదేశముచేతనే సాధర్మ్యము చెప్పనగును. అట్టి ధర్మమిట అవిద్యాధ్యాసయే. దీనినిబట్టియే స్థాణుపురుషదృష్టాంతము ననుసరించి శరీరాత్మలకు స్థాణుపురుషులకు సాధర్మ్యము వివక్షితము. స్వప్నమునందు జ్ఞాతయందే జ్ఞేయాధ్యాసదర్శనమువలన యెచట యధ్యా

నయో యఃటనే రెండింటికి జ్ఞేయత్వ ముండవలెనను నియమములేదు. క్షేత్ర (దేహాదుల) ధర్మములగు సుఖదుఃఖమోహేచ్ఛాదు లాత్మధర్మములే యన్నచో "దేహధర్మములగు సుఖదుఃఖమోహేచ్ఛాదు లాత్మధర్మములు. అచైతన్యజరామరణాదు లాత్మధర్మములు కావు." అనుటలో విశేషహేతువు లేనందున దేహధర్మములగు యచైతన్యము, జరామరణాదికముగూడ నాత్మధర్మములు కావలసివచ్చును. సుఖాదికము అవిద్యారోపిత మగుటవలనను, ఆగమాపాయులగుటవలనను, దృశ్యమగుటవలనను, జడమగుటవలనను జరాదికమువలె నాత్మధర్మము కాదు. అని చెప్పుటయందు హేతువులు కలవు. కాన సుఖదుఃఖమోహేచ్ఛాదులు క్షేత్రధర్మములే. ఆత్మధర్మములు మాత్రము కావు. అని చెప్పుటయే యుక్తము.

ఇట్లగుటచే సర్వక్షేత్రములయందుండు క్షేత్రజ్ఞస్వరూపమగు పరమేశ్వరునకు సంసారగంధమాత్రము గూడ శంకింపజనదు. ఏమువలననినఁ? బాలురాకాశమునందు తలమలినత్వము నధ్యారోపించి, "శ్యామం నభః" ఆకాశము నల్లగ నున్నదని యారోపించుటమాత్రముచే నారోపితమైన నలుపుతో నాకాశమున కెట్లు సంబంధముండదో యట్లే జ్ఞేయస్థమైన కర్తృత్వభోక్తృత్వరూపమగు సంసారము జ్ఞాతయం దధ్యారోపితము. అట్టి యధ్యారోపితమైన సంసారముయొక్క సంబంధము జ్ఞాతకెట్లు సంభవించును? సంభవింపనేరదు. కాన జ్ఞాతయగు క్షేత్రజ్ఞస్వరూపమైన యీశ్వరునకు కర్తృత్వభోక్తృత్వరూపసంసారగంధము సంభవింపదు.

క్షేత్రజ్ఞు డవిద్యావంతుడుగాన నవిద్యచే నధ్యస్తమైన సంసారిత్వముకూడ స్వాభావికమే కావలవచ్చునని శంకింపజనదు.

తామసమైన, ఆవరణాత్మకమగు తిమిరాదిదోష ముండినపుడే అగ్రహణ, విపరీతగ్రహణ, సంశయరూపావిద్యాత్రయము కల్పట్టుటవలన వివేకప్రకాశాత్మకమగు క్షేత్రజ్ఞునియందు తామసమగు ఆవరణాత్మకమైన యవిద్య లేనందున అగ్రహణ, విపరీతగ్రహణ, సంశయరూపమగు నవిద్యాత్రయము సంభవింపకపోవుటచే క్షేత్రజ్ఞునకు స్వాభావికసంసారిత్వము సంభవింపదు.

"ఆత్మానం న జానామి" "మనుష్యోఽహం" (నన్ను నెరుగను, నేను మనుష్యుడను) అనెడి ప్రత్యయములవలన నవిద్య జ్ఞాతృధర్మమే. అట్టి యవిద్యకలవా డగుటయే సంసారము. అట్లగుచో నీశ్వరుడే క్షేత్రజ్ఞుడు, సంసారియని చెప్పుట విరుద్ధము కాదా? యని శంకింపజనదు. చక్షుస్సునందు తైమిరికత్వాదిదోషములు సంభవించినచో విపరీతగ్రహణము, అగ్రహణము, సంశయము నివి సంభవించుచున్నవి; తైమిరికత్వాదిదోషములు పోయిన తరి విపరీతగ్రహణాదులు సంభవించుటలేదు. కాన నన్వయవ్యతిరేకములచే నిమిత్తము, నైమిత్తికము కరణమైన చక్షుస్సంబంధమైన ధర్మములే గ్రహీతృధర్మములు కావు. అట్లే యంతటను అగ్రహణాదిప్రత్యయములు, తద్ధేతువులగు దోషములు నేదో యొకానొక కరణసంబంధమైనవే యగును. అట్లగుచో నావరణాత్మకమైన యవిద్య యంతఃకరణధర్మమే కాని క్షేత్రజ్ఞుని ధర్మము కానేరదు. తిమిరాదిదోషములు వలె దోషమగుటవలన నిమిత్తనైమిత్తికావిద్య యథార్థముగ జ్ఞాతృధర్మము కాదు. మరియు అవిద్యాజన్యవిపరీతగ్రహణము వలె నిత్యనైమిత్తికావిద్య తత్కార్య మగుటవలన జ్ఞాతృధర్మము కాదు. మరియు ప్రదీపమువలె జ్ఞేయమగుటవలన నగ్రహణాదికము తద్ధేతువగు దోషము యథార్థముగ జ్ఞాతృధర్మములు కావు. "ఏది జ్ఞేయమో యది ప్రదీపప్రకాశవలె స్వాతిరిక్తజ్ఞేయము" అను వ్యాప్తిచే నగ్రహణాదికముగూడ జ్ఞేయమగుటచే స్వాతిరిక్తజ్ఞేయమని యవశ్య మంగీకర్తవ్యము. ఎట్లు దేవదత్తుడు మోక్షమునందు యేకరణములు లేమిం జేసి యవిద్యాదిదోషములు లేనివాడు కాన స్వజ్ఞేయఘటాదిరూపాదిమంతుడు కాడని సర్వవాదు లంగీకరించిరో, అట్లే జ్ఞాత యగుటవలన జ్ఞాత జ్ఞేయధర్మము కలవాడు కాడు, స్థూలత్వకృశత్వాదులవలె వ్యభిచారి యగుటవలన నవిద్యాదికము జ్ఞాతృధర్మము కాదు.

మరియు, అవిద్యాదికమాత్మ (జ్ఞాత) ధర్మ మనెడివారి పక్షమునఆగ్నేయౌష్ణ్యమువలెయాత్మ కవిద్యాదికము స్వాభావికమా? ఆగన్తుకమా? స్వాభావిక మన్నచో స్వాభావికమగు ధర్మముతోయెన్నడును వియోగము సంభవింపనందున ననిర్మోక్షము ప్రాప్తింపవలసివచ్చును. కాన నవిద్యాదికము జ్ఞాతకు స్వాభావికమను ప్రథమపక్షము సంభవింపదు. క్షేత్రజ్ఞున కవిద్యాదిక మాగంతుకమనెడి ద్వితీయపక్షమునందు– స్వతఃఆగన్తుకమా? పరతః ఆగన్తుకమా! స్వతః ఆగన్తుకమనెదవా? ఆపక్షమునందుకూడ ననిర్మోక్షము ప్రాప్తించెడిని. ద్వితీయపక్షమున ఆత్మ విభువగుటవలనను, అవిక్రియ మగుటవలనను, నిరవయవ మగుటవలనను, అసంగ మగుటవలనను, అద్వయు ఆగుటవలనను ఆకాశమువలె దేనితోడను యెచటను సంయోగము సంభవింపనందున పరతః ఆత్మకుఆగన్తుకా దికము సంభవము అని చెప్పుట శక్యము కాదు. కాన క్షేత్రజ్ఞునకు కాలత్రయమునం దీశ్వరత్వము సిద్ధము. "అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః! శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే" అనాది యగుటవలనను, నిర్గుణు డగుటవలనను యీనాశరహితుడైన పరమాత్మ ఓయర్జున! శరీరమం దున్నవాడైనను, యేమియు చేయుటలేదు; దేనితోను సంబంధము కలవాడు కాడు. "యథా సర్వగతం సౌక్ష్మ్య దాకాశం నోపలిప్యతే। సర్వత్రావస్థితో దేహే తథాఽత్మా నోపలిప్యతే" ఆకాశము సర్వగతమైనను, సూక్ష్మమైన దగుటవలన నెట్లు దేనిసంబంధము లేనిదగుచున్నదో యట్లే యీపరమాత్మయు దేహమునం దంతట నుండినను దేనిసంబంధమును పొందడు. అను భగవద్వచనమువలనను, "స దేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మేవాద్వితీయమ్" "నేహ నానాస్తి కించన" "మృత్యో స్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అను శ్రుతులవలనను, బ్రహ్మమువలె చేతను డగుటవలన "అహం" అని ప్రతీయమానమైన అంతఃకరణవ్యతిరిక్త జీవుడు పరమాత్మ వ్యతిరిక్తుడు కాడు. అను యుక్తి వలనను జీవుడు పరమాత్మస్వరూపుడే యని సిద్ధము.

—• పూర్వపక్షము •—

సర్వప్రమాణోపజీవ్య మగుటచే శ్రేష్ఠము, జ్యేష్ఠము నగు "నేను యీశ్వరుడను కాను" అను ప్రత్యక్షముచే జీవేశ్వరుల భేదము తెలియబడుటవలన దీనికి విరుద్ధముగ క్షేత్రజ్ఞునకు యీశ్వరునకు ఐక్యమును శ్రుతి యుక్తులచే బోధించుట శక్యము కాదు.

ప్రత్యక్షము వ్యావహారిక భేదవిషయక మగుటచే శ్రుత్యాదిజన్యాభేదజ్ఞానముచే బాధింపబడును కాన విరోధములేదని శంకింపజనదు. "నేను యీశ్వరుడను కాను" అను భేదగ్రాహిప్రత్యక్షముకలవానికి "నేను యీశ్వరుడను" అను జీవేశ్వరాభేదావగాహిజ్ఞానము లేకపోవుటచే పైని చెప్పబడిన బాధ సంభవింపదు.

క్షేత్రజ్ఞేశ్వరప్రత్యక్షమును గూర్చి చక్షురాది బహిరింద్రియములు కారణమా? లేక మనస్సు కారణమా? చక్షురాదిబాహ్యేంద్రియములకు రూపాదిరహితాత్మగ్రహణసామర్థ్యము లేకపోవుటచే నాత్మనిష్ఠభేద గ్రహణమునందు సామర్థ్యము లేమింజేసి "క్షేత్రజ్ఞేశ్వరాభేదప్రత్యక్షమునందు చక్షురాదిబహిరింద్రియములు కారణము" అను ప్రథమపక్షము సంభవింపదు. ప్రమాణాంతరసహకారి యగు మనస్సునకు వేరుగ ప్రమాణత్వము సంభవింపనందున "క్షేత్రజ్ఞేశ్వరభేదప్రత్యక్షమునందు మనస్సు కారణము." అను రెండవపక్షము సంభవింపదు. కాన క్లుప్తకారణము లేనందున క్షేత్రజ్ఞేశ్వరభేదప్రత్యక్షము భ్రాంతిమాత్రమేయని శంకింపజనదు.

సుఖాదిప్రత్యక్షము చక్షురాదిప్రమాణాంతరములవలన జనింపనందున మనస్సే సుఖాదిప్రత్యక్షమునందు ప్రమాణమైయుండ, ఆత్మకు, నాత్మగతభేదమునకూడ మనస్సే ప్రమాణము. కాన కారణాంతరసమవహితమైన మనస్సువలననే ఆత్మభేదము ప్రత్యక్షమగును.

ఈశ్వరు డతీంద్రియుడు. (అనగా ఇంద్రియాగోచరుడు.) అట్టి ఈశ్వరభేదముగూడ యతీంద్రియమే యగును. అభావప్రత్యక్షము ప్రతియోగిప్రత్యక్షసాపేక్షితము కాన నతీంద్రియేశ్వరభేదము ప్రత్యక్షము కాదని శంకింపజనదు. ఘటత్వస్వరూపప్రతియోగిప్రత్యక్షముండినను, మనస్త్వమునందు ఘటత్వాభావము ప్రత్యక్షము కానందునను, మనస్త్వస్వరూపప్రతియోగిప్రత్యక్షము లేకున్నను ఘటత్వమునందు మనస్త్వాభావము ప్రత్యక్షమగుటవలనను అభావప్రత్యక్షమును గూర్చి ప్రతియోగిప్రత్యక్షము కారణమనుటయం దన్వయవ్యతిరేకవ్యభిచారములు ప్రాప్తించుచున్నందున నభావప్రత్యక్షమునుగూర్చి ప్రతియోగిప్రత్యక్షము కారణము కాదు. కాన, ఏఘటత్వమునం దేమనస్త్వముయొక్క సత్త్వ మనుపలబ్ధివిరోధి యగునో యట్టి ప్రతియోగిసత్త్వరూపవిరోధి లేనందున ప్రతియోగ్యనుపలబ్ధిసహకృతమనస్సువలననే యీశ్వరుడతీంద్రియుడైనను, తద్భేదప్రత్యక్షము కలుగును. ఘటత్వమునందు మనస్త్వాభావప్రత్యక్షమువలె “క్షేత్రజ్ఞునియం దీశ్వరాభేదముండినచో నది ప్రత్యక్షమయ్యెడిని. అట్టి యీశ్వరాభేదము క్షేత్రజ్ఞునియందు ప్రత్యక్ష మగుటలేదు. కాన క్షేత్రజ్ఞుడు యీశ్వరభిన్నుడే యను ప్రత్యక్షము సంభవించును.

“స్థూలో౽హం” ఇత్యాదిప్రత్యయగోచరమైన స్థౌల్యాదిక మెట్లు శరీరాద్యుపాధిక మగుటచే నాత్మయందు కల్పితమో, యట్లే శరీరవిశిష్టునకే యీశ్వరభేదానుభవమువలన యీశ్వరభేదానుభవముగూడ సోపాధిక మగుటవలన కల్పితమే యని శంకింపజనదు.

జాగ్రత్స్వప్నములయం దేశరీరము భాసింపకున్నను “యో౽హం స్వప్నే సో౽హమిదానీం మనుష్యః ఖట్వారూఢః” ఏ నేను స్వప్నమునం దుంటినో యట్టి మనుష్యుడనగు నేను మంచము నధిష్ఠించితిని.) అను నేకరూపమైన యహంప్రత్యయ మనువర్తించుటచే దేహాతిరిక్తమైన యాత్మ “అహం” అను ప్రత్యయగోచర మగుటవలన ప్రతీయమానమై “నాహ మీశ్వరః” అను యీశ్వరభేద ప్రత్యక్షమున కౌపాధికత్వము సంభవింపనందున నకల్పితమే కాన శ్రేష్ఠము, జ్యేష్ఠమునగు ప్రత్యక్షప్రమాణముచే జనించు భేదప్రత్యక్షముండ శ్రుతియుక్తులచే క్షేత్రజ్ఞేశ్వరైక్య మెటుల బోధింపబడును? బోధింపబడదని పూర్వపక్షము ప్రాప్తింప.—

—◆ సిద్ధాంతము ◆—

చెప్పెదవినుము:— మనస్సు కాలాదికమువలె కించిత్ప్రమాణసహకారి యగుటవలనను, అనన్యథాసిద్ధప్రమేయశూన్యమగుటవలనను ప్రమాణము కాదు. ఇందు వ్యతిరేకదృష్టాంతముగ చక్షురాదికమును గ్రహింపనగును. మరియు ప్రమాలవలె మనస్సు ప్రమాశ్రయ మగుటవలన ప్రమాకరణము కాదు. ఈవిషయమే “ప్రమాణసహకారిత్వా ద్విషయస్యా ప్యభావతః । న ప్రమాణం మనో౽స్మాకం ప్రమాదే రాశ్రయత్వతః” అని చెప్పబడెను.

సుఖాదిప్రత్యక్షము ప్రమాణాంతరాజన్య మగుటచే మనస్సే సుఖాదిప్రత్యక్షప్రమాణమైయుండ, ఆత్మసాక్షాత్కారమునందు, తద్గతభేదసాక్షాత్కారమునందుకూడ మనస్సే ప్రమాణమని చెప్పిరి. అట్లు చెప్పుటయు సంభవము కాదు. ‘సుఖాదివ్యవహారము అర్థజ్ఞాపనేచ్ఛాధీనజడవ్యవహార మగుటవలన సమ్మతమువలె స్వసుఖవిషయజ్ఞానజన్యము’ అను అనుమానప్రమాణమువలన పూర్వోక్తాశంక సంభవింపదు. మరియు మనస్సు సంమతమువలె అసన్నికృష్ట మగుటవలన నాత్మభేదమును గ్రహించుటయందు ప్రమాణము కాదు. అదియెట్లనిన? సంబంధములు సంయోగము, సమవాయము, తాదాత్మ్యము అని మూడు విధములు. వీటికంటె వేరుగ నింద్రియసంబంధము లేదు. పైమూడింటిలో ఏసంబంధముకూడ మనస్సునకు భేదముతో సంభవింపదు. సంబద్ధము కాని యింద్రియము విషయమును గ్రహింపనేరదు. ఈవిషయమే “సంయోగాదేరయుక్తత్వాత్తదన్య

శాంకరభాష్యమ్:—

(14) తథా నైరాత్మ్యవాద్యపి నాస్తి పరలోక ఇతి న ప్రవర్తతే । యథాప్రసిద్ధితస్తు విధిప్రతిషేధశాస్త్రశ్రవణాన్యథానుపపత్త్యాఽనుమితాత్మాస్తిత్వ ఆత్మవిశేషానభిజ్ఞః కర్మఫలసంజాతతృష్ణః శ్రద్ధధానతయా చ ప్రవర్తత ఇతి సర్వేషాం నః ప్రత్యక్ష మతో న శాస్త్రానర్థక్యమ్ । వివేకినా మప్రవృత్తిదర్శనా త్తదనుగామినా మప్రవృత్తౌ శాస్త్రానర్థక్యమితి చేత్

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(14) "స్వర్గకామో యజేత" అను విధివిహితయాగాదులయందు ప్రవృత్తి, "న కలంజం భక్షయేత్" అను శాస్త్రముచే నిషేధింపబడిన కలంజభక్షణాదులయందు నివృత్తి బ్రహ్మవేత్తకు వివక్ష చేసెదవా? నైరాత్మ్యవాదికి వివక్ష చేసెదవా? పరోక్షజ్ఞానికి వివక్ష జేసెదవా? ప్రథమ పక్షము సంభవింపదని "ఈశ్వరక్షేత్రజ్ఞైకత్వదర్శీ బ్రహ్మవి త్తావ న్న ప్రవర్తతే" అని పూర్వ గ్రంథముచేతనే తొలిగింపబడెను. నైరాత్మ్యవాది పరలోకము లేదని, విధినిషేధముల యందుప్రవర్తింపడు. కాన ద్వితీయపక్షము నిరస్తము. పరోక్షజ్ఞానియన్ననో యథాప్రసిద్ధివలన విధి ప్రతిషేధశాస్త్రశ్రవణాన్యథానుపపత్తిచే నూహింపబడిన యాత్మాస్తిత్వము కలవాడై, ఆత్మ విశేషానభిజ్ఞుడై కర్మఫలమునందు జనించిన తృష్ణకలవాడై, శ్రద్ధకలవాడగుటచే విధివిహిత కర్మలయందు ప్రవర్తించును. నిషిద్ధకర్మలయందు ప్రవర్తింపడు. యీవిషయముమన కందరకూ ప్రత్యక్షమే. అందువలన శాస్త్రమున కానర్థక్యము ప్రాప్తింపదు. బ్రహ్మవేత్తను, నైరాత్మ్య వాదిని (దేహేంద్రియాదులకంటె వేరుగ నాత్మ లేదని వాదించు వాదిని) విడచి దేహవ్యతిరిక్తమైన యాత్మను పరోక్షముగ కాని, అపరోక్షముగ కాని దేహాద్యాత్మత్వమును చూచువానికి విధినిషేధాధికారము సిద్ధించియుండ శాస్త్రానర్థక్యము లేదు.

స్యాప్రసిద్ధితః । సంన్నికర్షస్య తేనేదం భేదాసంగ్యేవ మానసమ్" అని చెప్పబడెను. కాన "సుఖాదిప్రత్యక్షమునందు మనస్సు ప్రమాణమైనటుల క్షేత్రజ్ఞేశ్వరభేదప్రత్యక్షమునందు మనస్సు ప్రమాణ" మనెడి యాశంక తొలగింపబడెను.

ప్రతియోగి యగు ఘటత్వముయొక్క ప్రత్యక్ష ముండినను, మనస్త్వమునందు ఘటత్వాభావ మప్రత్యక్ష మగుటవలనను, మనస్త్వరూపప్రతియోగిప్రత్యక్షము లేకున్నను, ఘటత్వమునందు మనస్త్వాభావము ప్రత్యక్ష మగుటవలనను, అన్వయవ్యతిరేకవ్యభిచారములవలన నభావప్రత్యక్షమునకు ప్రతియోగిప్రత్యక్షము కారణము కాదు. ఏఘటత్వమునం దేమనస్త్వముయొక్క సత్త్వము మనస్త్వరూపప్రతియోగ్యనుపలబ్ధికి విరోధి యగునో యచట యట్టి మనస్త్వాభావము ప్రత్యక్ష మగును. కాన క్షేత్రజ్ఞునియం దీశ్వరాభేద ముండినచో ప్రత్యక్ష మయ్యెడిని. అట్టి యీశ్వరాభేదము క్షేత్రజ్ఞునియందు ప్రత్యక్షము కానందున అనుపలబ్ధిప్రమాణసహకారముచే నీశ్వరుండతీంద్రియు డైనను క్షేత్రజ్ఞునియం దీశ్వరభేదము "నాహ మీశ్వరః" అని ప్రత్యక్ష మగును" అను పూర్వోక్తాశంక సంభవింపదు. ఏందువలననెదవా? యెచట ప్రతియోగిసత్త్వమున కనుపలబ్ధివిరోధిత్వము ప్రాప్తించునో యచట తత్ప్రతియోగ్యుపలబ్ధి సంభవించును. అని చెప్పవలయును. ఇట్లగుచో అన్యస్థలమునందు ప్రతియోగి సత్త్వము అభావస్థలీయప్రతియోగ్యుపలబ్ధికి వ్యాప్యము కానందున అభావస్థలీయానుపలబ్ధికి విరోధి కాదు. యత్రేత్యాదినా చెప్పినవానికి అభావాధికరణమునందే ప్రతియోగిసత్త్వతదుపలభ్యము చెప్పవలసివచ్చును.

శాంకరభాష్యమ్:—

న, కస్యచిదేవ వివేకోపపత్తేః । అనేకేషు హి ప్రాణిషు కశ్చిదేవ వివేకీ స్యా ద్యథేదానీమ్ । న చ వివేకిన మనువర్తన్తే మూఢా రాగాదిదోషతన్త్రిత్వా త్ప్రవృత్తేః । అభిచరణాదౌ చ ప్రవృత్తిదర్శనాత్ । స్వాభావ్యాచ్చ ప్రవృత్తేః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వివేకులకు విధినిషేధములయందు ప్రవృత్తి సంభవింపదు. అట్లే వివేకుల ననుసరించు వారలకు కూడ విధినిషేధములయందు ప్రవృత్తి సంభవింపనందున శాస్త్రమున కానర్థక్యము తప్పదని శంకింపజనదు.

అందరును వివేకు లగుటవలన నధికారియే లేనందున శాస్త్రమున కానర్థక్యము ప్రాప్తించు ననెదవా? లేక యొకానొకడు వివేకి యైనను యితరు లట్టి వివేకి ననుసరించుటవలన నధికారి లేమిం జేసి శాస్త్రమున కానర్థక్య మనెదవా? అనేకప్రాణులలో నొకానొకనికే ఇపుడువలె వివేక ముండును. అందరికి వివేకముండదు కాన నందరు వివేకులగుటవలన అధికారి కానందున శాస్త్రానర్థక్యమను ప్రథమపక్షము సంభవింపదు. ప్రవృత్తి రాగాదిదోషాధీనమగుటవలన మూఢు లందరును వివేకినే యనుసరింపరు. రాగాదిదోషాధీనమయియే శ్యేనాదియాగములయందు ప్రవృత్తి కన్పట్టుచున్నది. ప్రవృత్తియొక్క స్వభావ మట్టిది. కాన నొకానొకడు జ్ఞానియైనను మరికొందరతనిని యనుసరించినను యితరులకు విధినిషేధములయందు ప్రవృత్తి సంభవించును. కాన శాస్త్రమున కానర్థక్యము రెండవపక్షమున గూడ ప్రాప్తింపదు.

మరియు సహకారికారణమగు "అయం బ్రాహ్మణః" అను లౌకికోపదేశము లేనపుడు విప్రవ్యక్తిగతమైన బ్రాహ్మణత్వముయొక్క అనుపలబ్ధి బ్రాహ్మణత్వాభావము లేకున్నను యెట్లు సంభవించుచున్నదో, అట్లే క్షేత్రజ్ఞుని యందు బ్రహ్మభేదాభావము స్వతః లేకున్నను "ఆచార్యవా న్పురుషో వేద" "నాఽవేదవి న్మనుతే తం బృహన్తం" "శ్రోతవ్యో మన్తవ్యః" ఇత్యాదికముచే బోధితమైన సహకార్యన్తరము లేకపోవుటచే క్షేత్రజ్ఞునియందు బ్రహ్మభేదానుపలబ్ధి కలుగుచున్నది. మరియు, చీకటిచే నావృతమైన ఘటముయొక్క సత్త్వము ఘటానుపలబ్ధికి యెట్లు విరోధి కాదో, అట్లే "అజ్ఞానేన హి ప్రగూఢా" "అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః । భవ త్యభేదో భేదశ్చ తస్యాజ్ఞానకృతో భవేత్" ఇత్యాదిశ్రుతిస్మృతులవలన నజ్ఞానముచే నావరింపబడిన దని తెలియబడుటవలన జ్ఞాతృబ్రహ్మభేదసత్త్వ మట్టి జ్ఞాతృబ్రహ్మభేదానుపలబ్ధికి విరోధి కాదు. మరియు ధర్మాధర్మములు మనోగోచరములు కాకపోయినంతమాత్రమున ధర్మాధర్మాభావ మెటుల సిద్ధించదో అట్లే 'యన్మనసా న మనుతే'' "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" "సర్వే వేదా య త్పద మా మనన్తి" ఇత్యాదిశ్రుతులచే మనోఽగమ్యుడైన ప్రత్యగభిన్నబ్రహ్మము మనస్సునకు గోచరము కాకపోయినంతమాత్రమున ప్రత్యగభిన్నబ్రహ్మముయొక్క యభావము సిద్ధింపదు.

జాగ్రత్స్వప్నములయం దేకశరీరావభాస లేకున్నను "యోఽహం స్వప్నే సోఽహ మిదానీం మనుష్యః ఖట్వారూఢః" అని యేకరూపమగు "అహం" అను ప్రత్యయ మనువర్తమాన మగుటచే దేహాతిరిక్తమైన యాత్మ "అహం" అనెడి ప్రత్యక్షప్రత్యయగోచర మగుటవలన నచట ప్రతీయమానమైన యీశ్వరభేదమున కౌపాధికత్వము సంభవింపనందున నీశ్వరభేదము కల్పితము కాదని పూర్వమునందుడు చేయబడిన యాశంక

శాంకరభాష్యమ్:—

(15) స్వభావస్తు ప్రవర్తత ఇతి హ్యుక్తమ్ । తస్మా దవిద్యామాత్రం సంసారో యథా దృష్టవిషయ ఏవ । న క్షేత్రజ్ఞస్య కేవల స్యావిద్యా తత్కార్యం చ । న చ మిథ్యాజ్ఞానంపరమార్థ వస్తు దూషయితుం సమర్థమ్ । న హ్యూషరదేశం స్నేహేన పంకీకర్తుం శక్నోతి మరీచ్యుదకం తథాఽవిద్యా క్షేత్రజ్ఞస్య న కించి త్కర్తుం శక్నోతి । అత శ్చేద ముక్తం "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" "అజ్ఞానేనాఽఽవృతం జ్ఞానమ్" ఇతి చ ।

శాంకరభాష్యతత్త్వ బోధిని:—

(15) ప్రవృత్తి స్వభావ మనెడి యజ్ఞానకార్యమగుటయందు "స్వభావస్తు ప్రవర్తతే"అను భగవద్వాక్యమే ప్రమాణముగ పూర్వమునందే చెప్పబడెను. అందువలన నవిద్యామాత్రమేయగు సంసారము యథాదృష్టవిషయమే. కేవలక్షేత్రజ్ఞున కవిద్యకాని, తత్కార్యముకాని లేదు. శుద్ధ క్షేత్రజ్ఞునకు వాస్తవికముగ నవిద్యాదిసంబంధము లేకున్నను క్షేత్రజ్ఞునియం దారోపిత మైన యవిద్యాదికము క్షేత్రజ్ఞునే దుఃఖము కలవానినిగ జేయునని శంకింపజనదు. మిథ్యా జ్ఞానము పరమార్థవస్తువును దూషించుటకు సమర్థము కాదు. మరీచ్యుదకమూషరక్షేత్రమును బురదకలదానిగ జేయజాలదు. అట్లే యవిద్యయు క్షేత్రజ్ఞున కేమియు చేయుటకు సమర్థము కాదు. అందువలననే శ్రీకృష్ణపరమాత్మచే "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" "అజ్ఞానేనావృతం జ్ఞానం" అని చెప్పబడెను.

---

సంభవింపదు. ఎందువలననిన? "నాహ మీశ్వరః" అను యీశ్వరభేదానుభవము "అహమిహ" అని పరిచ్ఛిన్నముగ ననుభూయమానమైన జీవునియందే యనుభూయమానమగుటచే నిరుపాధ్యాత్మకు పరిచ్ఛేదము సంభవింపదు. కాన ఘటాకాశమువలె పరిచ్ఛేద మౌపాధిక మగుటచే తద్గతభేదముకూడ నౌపాధికమే యగును.

ప్రత్యక్షముయొక్క వ్యావహారికసత్తను ఉపజీవ్యముగ చేసుకొని ప్రవృత్తమైన శ్రుత్యాదికము ప్రత్యక్షముయొక్క పారమార్థికసత్తను నిరాకరించుచున్నది. కాన నుపజీవ్యవిరోధము ప్రాప్తింపదు.

ఆనంతరభావియగు శుక్తిజ్ఞానముచే ప్రథమోత్పన్నరజతప్రత్యక్షము బాధితమగుటచే రజతజ్ఞానమువలె ప్రత్యక్షము జ్యేష్ఠమగుటవలన శ్రుత్యాదికముచే భాధ్యమే యగును. కాన నీవొసగిన జ్యేష్ఠత్వహేతువు భేదప్రత్యక్షము శ్రుత్యాదిబాధ్యమగుటయందే హేతువగును. కాని, శ్రుత్యాదిబాధకము కానేరదు.

క్షేత్రజ్ఞు డీశ్వరరూపుడే యగుచో సంసారసంసారిత్వభావమే లేకపోయెడిని. సంసారసంసారిత్వభావమే లేనిచో శాస్త్రమునకు, ప్రత్యక్షాదిప్రమాణములకు నానర్థక్యము ప్రాప్తించెడిని. శాస్త్రమునకు, ప్రత్యక్షాదులకు అర్థవత్త్వసంపాదనకై క్షేత్రజ్ఞునకు సంసారసంసారిత్వభావము వాస్తవికమేయని యంగీకరింపవలయును. అట్లగుచో క్షేత్రజ్ఞేశ్వరుల కభేద మెట్లు పొసగునని శంకింపజనదు.

జీవేశ్వరుల కభేద మున్నచో విద్యావస్థయందు శాస్త్రాదుల కానర్థక్యమా? అవిద్యావస్థయం దానర్థక్యమా? విద్యావస్థయం దానర్థక్యమందువా? అత్మవాదు లందరు ముక్తాత్ములకు సంసారసంసారిత్వవ్యవహార మనిష్ట మగుటచే వారలు శాస్త్రానర్థక్యదోషము దోషము కాదని యెట్లు అంగీకరించిరో, అట్లే మాకును (అద్వైతులకును) ముక్తాత్మలవిషయమై సంసారసంసారిత్వభావ మనిష్టమగుటచే శాస్త్రాద్యానర్థక్యము దోషము కాదు. ఇక యవిద్యావస్థ యన్ననో యెట్లు ద్వైతులందరియొక్క మతమునందు బంధావస్థయందే శాస్త్రాదుల కర్థవత్త్వమో, యట్లే మాకును బంధావస్థయందే శాస్త్రాదుల కర్థవత్త్వము. వారలకు ముక్తావస్థయం దర్థవత్త్వము శాస్త్రాదులకు లేనటుల మాకును ముక్తావస్థయందు శాస్త్రాదుల కర్థవత్త్వములేదు.

శాంకరభాష్యమ్:—

(16) అథ కిమిదం సంసారిణా మివాహ మేవం మమైవేద మితి పణ్డితానామపి। శృణ్విదం తత్పాణ్డిత్యం యత్క్షేత్ర ఏవాఽఽత్మదర్శనమ్। యది పునః క్షేత్రజ్ఞ మవిక్రియం పశ్యేయు స్తతో న భోగం కర్మ వాఽఽకాంక్షేయు ర్మమ స్యాదితి। విక్రియైవ భోగకర్మణీ। అథైవం సతి ఫలార్థిత్వా దవిద్వా న్ప్రవర్తతే।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(16) వాస్తవికముగ నాత్మకు సంసారసంబంధమే లేనిచో సంసారులకువలె పండితులకు గూడ "నేనిట్టివాడను, ఇది నాసంబంధమైనది" అను నీయలుభవ మెట్లు పొసగును?

ఆపాండిత్య మెట్టిదో చెప్పెద వినుము— క్షేత్రమునందే యాత్మదర్శనము అపాండిత్యము. అవిక్రియుడై క్షేత్రజ్ఞునే తెలిసికొనినచో తదనంతరము "నా కిది ప్రాప్తించుగాక" అని భోగమునుకాని, కర్మనుకాని కోరరు. భోగకర్మలు రెండును విక్రియలే. విద్వాంసుడు ఫలార్థి కానందున విద్వాంసునకు కర్మయందు ప్రవృత్తి సంభవింపదు. అను నిర్ణయముండ ఫలార్థి యగుటవలన నవిద్వాంసుడు ఫలమున కుపాయమగు కర్మయందు ప్రవర్తించును కాన నట్టి యవిద్వాంసుడే శాస్త్రాధికారి యగుటం జేసి శాస్త్ర మర్థవత్తగును.

ద్వైతులమతమునం దాత్మకు బంధముక్తావస్థలు వాస్తవికములు. అట్టి బంధావస్థలను విడచిపెట్టుటకు మోక్షమును స్వీకరించుటకు సాధనములను శాస్త్రము బోధించుటచే శాస్త్రమున కానర్థక్యము లేదు. అర్థవత్త్వము ప్రాప్తించును. అద్వైతులకన్నో ద్వైతము పారమార్థికము కానందున నాత్మకు బన్ధావస్థ వాస్తవికము కాదు. కాన నది యవిద్యాకృతము. అందుచే శాస్త్రానర్థక్య మద్వైతులకు తప్పదందువా?

ద్వైతుల మతమునం దాత్మకు బంధముక్త్యవస్థలు వాస్తవములని యంగీకరింపబడెను. ఇచట వారినొకవిషయము ప్రశ్నించెదము. వాస్తవమైన బంధముక్తావస్థ లాత్మకు ఒకమారుగనే ప్రాప్తించియుండునా? లేక, నొకదానివెంబడి మరియొకటి ప్రాప్తించునా? స్థితిగతులు వానికొక్కసారిగ నెటుల ప్రాప్తింపవో యట్లే యత్యన్తవిరుద్ధములైన బంధముక్త్యవస్థ లాత్మకొకసారి ప్రాప్తింపనందున ప్రథమపక్షము తోలిగింపబడెను. క్రమముగ ప్రాప్తించునను రెండవపక్షమునందు గూడ నాత్మకు బంధముక్త్యవస్థలు అకారణముగ ప్రాప్తించు ననెదవా? కారణమువలననే ప్రాప్తించుననెదవా? అకారణముగ ప్రాప్తించుచో అనిర్మోక్షము ప్రాప్తించును. గాన ప్రథమపక్షము సంభవింపదు. కారణపురస్సరముగనే బంధమోక్షావస్థలు ప్రాప్తించునను రెండవపక్షమునందు బంధమోక్షావస్థలు స్వతః యాత్మకు లేనందున స్ఫటికలౌహిత్యమువలె అస్వాభావికము లగుటవలన బంధముక్త్యవస్థ లాత్మకు వాస్తవికములు కావు. అట్లగుచో బంధముక్త్యవస్థ లాత్మకు వాస్తవికము లని మీయంగీకారమునకు విరోధము ప్రాప్తించెడిని.

మరియు బంధముక్త్యవస్థలకు వాస్తవత్వ మంగీకరించిన ద్వైతుల మతమునందు బంధముక్త్యవస్థలు స్థితిగతులవలె పరస్పరము విరుద్ధములగుటచే నొకకాలమునందే ప్రాప్తించు నని చెప్పుట సంభవింపనందున క్రమముగ ప్రాప్తించు నని చెప్పవలెను. అట్టి క్రమ మేది యన బంధావస్థ అనాదిగాన ముందుగ ప్రాప్తించియే యుండును. తన్నివృత్తిసాధనానుష్ఠాన మొనరించుచో నది పోవు నని చెప్పవలెను. అట్లగుచో "అనాది యగు భావపదార్థము ఆత్మవలె నిత్యము" అను వ్యాప్తికి విరోధము ప్రాప్తించును. మరియు, శాస్త్రీయసాధనాను-

శాంకరభాష్యమ్:—

(17) విదుషః పున రవిక్రియాత్మదర్శినః ఫలార్థిత్వాభావా త్ప్రవృత్త్యనుపపత్తౌ కార్యకరణసంఘాతవ్యాపారోపరమే నివృత్తి రుపచర్యతే । ఇదం చాన్య త్పాణ్డిత్యం కస్యచి దస్తు, క్షేత్రజ్ఞ ఈశ్వర ఏవ క్షేత్రం చాన్య త్క్షేత్రజ్ఞస్య విషయః, అహం తు సంసారీ సుఖీ దుఃఖీ చ, సంసారోపరమశ్చ మమ కర్తవ్యః క్షేత్రక్షేత్రజ్ఞవిజ్ఞానేన ధ్యానేన చేశ్వరం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(17) అవిక్రియాత్మదర్శి యగు విద్వాంసునకు ఫలమును కోరుట లేనందున ప్రవృత్తి సంభవించనిదై యుండ కార్యకరణసంఘాతోపరమము ప్రాప్తించును. అట్టి కార్యకరణసంఘాతోపరమము నివృత్తి యని ఔపచారికముగ చెప్పబడును. "క్షేత్రజ్ఞు డీశ్వరుడే, క్షేత్రము వేరు. అట్టిక్షేత్రము క్షేత్రజ్ఞునకు విషయము. నేనైతే సంసారిని, సుఖముకలవాడను, దుఃఖముకల వాడను, ధ్యానముచే నీశ్వరరూపుడైన క్షేత్రజ్ఞుని సాక్షాత్కరింపజేసుకొని క్షేత్రక్షేత్రజ్ఞ విజ్ఞానముచే ఈశ్వరస్వరూపావస్థానముచేత నాకు సంసారోపరమము చేయదగినది" అను ఇట్టి

స్థానమువలన బంధావస్థ నశింప, ముక్త్యవస్థ ప్రాప్తించును. అది నిత్యమని చెప్పుటయు పొసగదు. కారణమేమన? ఘటమువలె సాది యగు భావపదార్థ మనిత్య మను వ్యాప్తికి విరోధము ప్రాప్తించును. అని గ్రహింపుము.

మఱియు బంధముక్త్యవస్థలు క్రమభావు లన్నచో నట్టి యవస్థలచే నాత్మ సంబంధించునా? సంబంధింపదా? సంబంధించు నన్న పక్షమున పూర్వావస్థతోగూడ నుత్తరావస్థ సంబంధించునా? పూర్వావస్థ(బంధావస్థ)ను విడిచి ముక్త్యవస్థ సంబంధించునా? బంధావస్థతోకూడనే ముక్త్యవస్థ యాత్మను సంబంధించుననుప్రథమ పక్షమున ననిర్మోక్షము ప్రాప్తించెడిని. పూర్వావస్థ (బంధావస్థ)ను విడిచియే ముక్త్యవస్థ ప్రాప్తించు నను రెండవపక్షమున నాత్మకు సాతిశయత్వము ప్రాప్తించెడిని. అట్లగుచో నేది సాతిశయమో యది యనిత్యము ను వ్యాప్తియుండ నాత్మకు నిత్యత్వమును చెప్పుట పొసగదు. బంధముక్త్యవస్థలచే నాత్మ సంబంధించబడదను ద్వితీయపక్షమున ద్వైతులకుకూడ శాస్త్రానర్థక్యదోష మపరిహార్యమే యగును. కాన నాత్మాస్తిత్వవాదులగు ద్వైతాద్వైతుల యుభయుల మతమునందు శాస్త్రానర్థక్యదోషము సమానమైయుండ నద్వైతవాదిచేతనే యీశాస్త్రానర్థక్యదోషము పరిహరింపబడవలయునని ఏమి నియమము? శాస్త్రాద్యానర్థక్యము ద్వైతాద్వైతమతములురెండింటియందు సమానమైయుండ నద్వైతిమతమునందే నీకింత పట్టుదల యెందులకనెదవా? అనాత్మలగు భోక్తృత్వకర్తృత్వములందు, దేహాదృష్టములయందు, ఫలహేతువులయందు "అహం కర్తా, అహం భోక్తా, అహం మనుష్యః" అని తనను తెలిసికొను యవిద్వాంసుడైన యధికారి యద్వైతులకు సంభవించును. కాన నట్టివానివిషయమై శాస్త్రమర్థవత్తగును. కాన నద్వైతమతమునందు శాస్త్రాద్యానర్థక్యదోషము ప్రాప్తింపనందున నద్వైతమతమునందే మాకు అభినివేశమని గ్రహించుము. శాస్త్రము విద్వద్విషయమై అర్థవత్తు యెందులకు కాదనెదవా? వినుము చెప్పెద— జలాగ్నులకుగాని, ఛాయాతపములకుగాని భేదమును తెలిసికొనని యత్యంతమూఢుడుకూడ జలాగ్ను లేకమే యని కాని, ఛాయాతపము లేకమే యని కాని తెలిసికొనడు. వివేకి వాట్ల కేకాత్మత్వమును తెలిసికొన డని వేరుగ చెప్పవలయునా? కాన విద్వాంసులకు "ఫలహేతువులకంటె యాత్మ వేరు" అను జ్ఞానము కలిగియుండ ఫలహేతువులయందు "అహం" అను యాత్మదర్శనము సంభవింపదు. అందువలన విధినిషేధశాస్త్రము విద్వద్విషయమై అర్థవత్తు కాదు. (మరేమనిన నవిద్వద్విషయమై యర్థవత్తగును) "దేవదత్తుడా! నీవీ కార్యమును చేయుము" అని దేవదత్తుడు నియోగింపబడి

శాంకరభాష్యమ్:—

క్షేత్రజ్ఞం సాక్షాత్కృత్వా తత్స్వరూపావస్థానేనేతి । యస్త్వేవం బుధ్యతే యశ్చ బోధయతి నాసౌ క్షేత్రజ్ఞ ఇతి । ఏవం మన్వానో యః స పణ్డితాపసదః సంసారమోక్షయోః శాస్త్రస్య చార్థవత్త్వం కరోమీతి । ఆత్మహా స్వయం మూఢోఽన్యాంశ్చ వ్యామోహయతి శాస్త్రార్థసంప్రదాయరహితత్వాచ్ఛ్రుతహాని మశ్రుతకల్పనాం చ కుర్వన్ । తస్మాదసంప్రదాయవిత్సర్వశాస్త్రవిదపి మూర్ఖవదేవోపేక్షణీయః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భిన్నపాండిత్య మొకానొకని కుండుగాక. ఇట్టి పాండిత్యము పాండిత్యము కాదు. పైన చెప్పిన విధమున నెవడు తెలిసికొనునో, ఎవడు బోధించునో వాడు క్షేత్రజ్ఞుడు కాదు. ఇట్టి తీరున తలచువాడు సంసారమోక్షములకు, శాస్త్రమునకు అర్థవత్త్వమును చేసెద నని తలచు పండితాపసదుడు. అట్టివా డాత్మహంత; స్వయంమూఢుడై శాస్త్రార్థసంప్రదాయరహితుడై, శ్రుతహానిని, అశ్రుతకల్పనను చేయువాడై యితరులను వ్యామోహపెట్టువా డగుచున్నాడు. కాన సర్వశాస్త్రవేత్త యైనను సంప్రదాయమును తెలియనివా డగుచో మూర్ఖునివలె అట్టివాడు ఉపేక్షణీయుడు.

యుండ, నచటనుండిన విష్ణుమిత్రుడు నియోగమును వినినను "నేను నియోగింపబడితిని" అని నియోగమును తెలిసికొనడు. దేవదత్తుడు నియుక్తుడైనను యొకానొకప్పుడు విష్ణుమిత్రుడు "నేను నియుక్తుడను" అని తెలిసికొను నసెదవా? సత్యమే, నియోగవిషయమైన నియోజ్యు డగు దేవదత్తునకు తనకు భేదగ్రహణము లేక భ్రాంతిచే నట్టి జ్ఞానము కలుగవచ్చును. అట్లే ఫలహేతువులకు, తనకు భేదాగ్రహణమువలన నవిద్వాంసుడు విధినిషేధశాస్త్రాధికారి యగుట సంభవించును. అట్టివానివిషయమై విధినిషేధశాస్త్రము అర్థవత్తు అగును. కాన నద్వైతవాదులకు తమ మతమునందు విధినిషేధశాస్త్రముల కానర్థక్యము ప్రాప్తింపదు.

పితృపుత్రభ్రాత్రాదులకు పరస్పరభేదదర్శన ముండినను, తండ్రి నుద్దేశించి విధి కాని, నిషేధము కాని ప్రాప్తించినచో తండ్రి తదనుష్ఠానమునం దశక్తుడైనచో కుమారునకు తద్విషయమైన జ్ఞాన మిష్టమగును. ఇట్లే కుమారునకు విధి కాని, నిషేధము కాని ప్రాప్తించినచో కుమారుడు తదనుష్ఠానమునం దశక్తుడగుచో తద్విషయక జ్ఞానము తండ్రికి యిష్టమగుచున్నది. కాన నెట్లు యన్యోన్యనియోగప్రతినిషేధార్థజ్ఞాన మిష్టమగుచున్నదో యట్లే యెవడు జ్ఞానోదయమునకు పూర్వ మనుభూతమైన యవిద్యోత్పన్న దేహాద్యభిమానసంబంధము కలవాడో, వాని ననుసరించి ఫలహేతువుల యందాత్మాన్యత్వదర్శన ముండినను, 'ఇష్టఫలహేతువులయందు ప్రవర్తితుడనైతిని, అనిష్టఫలహేతువులయందు నివృత్తుడనైతిని' అను శాస్త్రార్థవిషయప్రవృత్తి యతనికి యుక్తమే యని శంకింపజనదు. పిత్రాదులకు పరస్పరాభిమానమువలన పరస్పరము నియోగప్రతిపత్తి యున్నను వ్యతిరిక్తాత్మదర్శన ప్రతిపత్తికి పూర్వమునందే ఫలహేతువులయందు ఆత్మాభిమానము ప్రసిద్ధ మగుటచే విద్వాంసున కట్టి యభిమానము లేనందున పూర్వోక్తాశంక సంభవింపదు.

మరియు "సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేః" అను అధికరణమున సమ్యగ్జ్ఞానము అదృష్టసాధ్యమని చెప్పబడుటచే ననుష్ఠితవిధినిషేధార్థములు కలవాడే తాను ఫలహేతువులకంటె నన్యుడనని తెలిసికొనును. అదృష్ట ముండిన సమ్యగ్జ్ఞానముండును. అదృష్టము లేనిచో అశుద్ధచిత్తునకు సమ్యగ్జ్ఞానము సంభవింపదు. అను యన్వయ

శాంకరభాష్యమ్:—

(18) యత్తూక్తమీశ్వరస్య క్షేత్రజ్ఞైకత్వే సంసారిత్వం ప్రాప్నోతి, క్షేత్రజ్ఞానాం చేశ్వరైకత్వే సంసారిణోఽభావా త్సంసారాభావప్రసంగ ఇతి । ఏతౌ దోషౌ ప్రయుక్తౌ విద్యావిద్యయో ర్వైలక్షణ్యాఽభ్యుపగమా దితి । కథం— అవిద్యాపరికల్పితదోషేణ తద్విషయం వస్తు పారమార్థికం న దుష్యతీతి । తథా చ దృష్టాంతో దర్శితో మరీచ్యంభసోషర దేశో న పంకీక్రియత ఇతి । సంసారిణోఽభావా త్సంసారాభావప్రసంగదోషోఽపి సంసార సంసారిణో రవిద్యాకల్పితత్వోపపత్త్యా ప్రత్యుక్తః । నన్వవిద్యావత్త్వ మేవ క్షేత్రజ్ఞస్య సంసారిత్వదోష స్తత్కృతం చ దుఃఖిత్వాది ప్రత్యక్ష ముపలభ్యతే । న జ్ఞేయస్య క్షేత్రజ్ఞ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(18) ఈశ్వరుఁడు క్షేత్రజ్ఞస్వరూపుడగుచో నీశ్వరునకు సంసారిత్వము. క్షేత్రజ్ఞు లీశ్వరరూపు లగుచో సంసారిలేమిఁజేసి సంసారాభావము ప్రసక్తమయ్యెడిని. అను నీరెండు దోషములు విద్యావిద్యలకు వైలక్షణ్య మంగీకరించుటవలన తొలిగింపబడెను. అది యెట్లనిన? అవిద్యాపరికల్పితదోషముచే తద్విషయమైన వస్తువు దూషింపబడదని సమాధాన మీయబడెను. మరీచ్యుదకముచే నూషరప్రదేశము బురదగా చేయబడదని యీవిషయముననే దృష్టాంతము కూడ చెప్పబడెను. "సంసారి లేనందున సంసారాభావముప్రసక్తమయ్యెడిని." అను దోషముకూడ సంసారసంసారుల విద్యాకల్పితములను యుక్తిచే తొలగింపబడెను.

వ్యతిరేకములచే సమ్యగ్జ్ఞాన మదృష్టాధీనమని తెలియనగును. "త మేతం వేదానువచనేన, వివిదిషన్తి యజ్ఞేన, దానేన, తపసా, ఽనాశకేన" అని బోధించినరీతిని విధినిషేధానుష్ఠానమునకు పూర్వమునందు తాను ఫల హేతువులకంటె భిన్నుడనియే తెలిసికొనడు. కాన శాస్త్రము విద్వద్విషయమని సిద్ధించుచున్నది.

"స్వర్గకామో యజేత" "న కలంజం భక్షయేత్" అను శాస్త్రార్థపరిజ్ఞానము కలవారై యదేరీతి ననుష్ఠించిన వారలకు దేహాద్యభిమానరూపాధికారము లేమింజేసియు, దేహాదులే యాత్మయని నిశ్చయము కలవారలకు పరలోకజ్ఞానమే లేనందునను, వారలకు విధ్యుక్తకర్మయందు ప్రవృత్తియు, నిషిద్ధకర్మల యందు నివృత్తియు సంభవింపనందునను, యీయుభయులకంటె వేరుగ కర్తయే లేనందున శాస్త్రమునకు వైయర్థ్యము సంభవింపకతప్పదని శంకింపజనదు.

"బ్రహ్మైవాహమస్మి" అని ప్రత్యగభిన్నబ్రహ్మను తెలిసికొనినవానికి, పరలోకము లేదను జ్ఞానము కల యనాత్మజ్ఞునకు విధ్యుక్తకర్మలయందు ప్రవృత్తియు, నిషిద్ధకర్మలయందు నివృత్తియు సంభవింపకుండి నను, విధినిషేధశాస్త్రాన్యథానుపపత్తిచే ననుమితమైన యాత్మాస్తిత్వము కలిగి, నిర్విశేషాత్మస్వరూపమును తెలిసికొనునట్టియు కర్మఫలమైన స్వర్గాదులయందు తృష్ణ కలిగినట్టియు, నరకాదులయందు భయము కలిగి నట్టి శ్రద్ధకలవానికి విధియందు ప్రవృత్తియు, నిషిద్ధమునందు నివృత్తియు సర్వప్రత్యక్షసిద్ధ మగుటచే వాని విషయమై శాస్త్ర మర్థవత్తే యగుటచే పూర్వోక్తాశంక కవకాశములేదు.

దేహాదులకంటె భిన్నమైన యుత్కృష్టమైన యాత్మను తెలిసికొనిన వివేకులకు విధినిషేధలముయం దధికా రము లేమింజేసి విధినిషేధములయందు ప్రవృత్తినివృత్తులు సంభవింపవు. "యద్యదాచరతి శ్రేష్ఠః తత్త దేవేతరో జనః । స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే" అను న్యాయమున యితరులుకూడ నట్టి

శాంకరభాష్యమ్:—

ధర్మత్వాత్ జ్ఞాతుః క్షేత్రజ్ఞస్య తత్కృతదోషానుపపత్తేః। యావత్కించిత్ క్షేత్రజ్ఞస్య దోష జాత మవిద్యమానమాసంజయసి తస్య జ్ఞేయత్వోపపత్తేః క్షేత్రధర్మత్వ మేవ, న క్షేత్రజ్ఞధర్మత్వమ్। న చ తేన క్షేత్రజ్ఞో దుష్యతి, జ్ఞేయేన జ్ఞాతుః సంసర్గానుపపత్తేః। యది హి సంసర్గః స్యాత్ జ్ఞేయత్వమేవ నోపపద్యేత। య ద్యాత్మనో ధర్మోఽవిద్యావత్త్వం దుఃఖిత్వాది చ కథం భోః ప్రత్యక్ష ముపలభ్యతే? కథం వా క్షేత్రజ్ఞధర్మః? జ్ఞేయం చ సర్వం క్షేత్రం జ్ఞాతైవ క్షేత్రజ్ఞ, ఇత్యవధారితేఽవిద్యాదుఃఖిత్వాదేః క్షేత్రజ్ఞవిశేషణత్వం క్షేత్రజ్ఞధర్మత్వం తస్య చ ప్రత్యక్షోపలభ్యత్వ మితి విరుద్ధ ముచ్యతేఽవిద్యామాత్రావష్టభ్యత్వా త్కేవలమ్।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

క్షేత్రజ్ఞున కవిద్యావత్త్వమే సంసారిత్వదోషము. అట్టి సంసారకృతమైన దుఃఖిత్వాదికము ప్రత్యక్షముగ కన్పట్టుచున్నదని శంకింపజనదు. జ్ఞేయ మెల్లను క్షేత్రధర్మమే యగుటవలన జ్ఞాతయగు క్షేత్రజ్ఞునకు తత్కృతమైన దోషము సంభవింపదు. క్షేత్రజ్ఞునకు లేనట్టి యే యత్కించిద్దోషసమూహము నంటకట్టెదవో యట్టి దోషసమూహము జ్ఞేయమే యగుటవలన క్షేత్రధర్మమే యగును. కాని క్షేత్రజ్ఞధర్మముమాత్రము కాదు. జ్ఞాతకు జ్ఞేయముతో సంబంధము సంభవింపనందున నట్టి జ్ఞేయముతో క్షేత్రజ్ఞుడు దూషింపబడడు. ధర్మధర్ములగుటచే సంసర్గమందు జ్ఞేయత్వ ముండినను క్షతి యేమున్నదనెదవా? ఆత్మధర్మ మాత్మచే జ్ఞేయమగుచో నాత్మకుకూడ జ్ఞేయత్వము ప్రాప్తించెడిని అట్లగుచో నొకనికే కర్మత్వకర్తృత్వములు ప్రాప్తింపవలసివచ్చును. విరుద్ధములగు కర్మత్వకర్తృత్వము లొకనియం దెన్నడును ప్రాప్తింపవు. అవిద్యావత్త్వము, దుఃఖిత్వాదికము ఆత్మధర్మమనెదవా? ఓయి! ఈరెండుఆత్మధర్మములని ప్రత్యక్షముగ తెలిసికొంటివా? విమతమైన అవిద్యావత్త్వాదికము రూపాదులవలె క్షేత్రజ్ఞ జ్ఞేయమగుటవలన క్షేత్రజ్ఞాశ్రితము లెట్లగును? కాదు. మరియు "మహాభూతాని" ఇత్యాద్యికముచే జ్ఞేయమాత్రమెల్ల క్షేత్రాన్తర్భూతమే యగుటవలన నవిద్యాదికము జ్ఞాతృధర్మము కాదు. జ్ఞేయమైన సర్వము క్షేత్రమే, క్షేత్రజ్ఞుడు జ్ఞాతయే. అని నిశ్చయింపబడియుండ "అవిద్యాదుఃఖిత్వాదికములు క్షేత్రజ్ఞవిశేషములు, క్షేత్రజ్ఞధర్మములు, అవి ప్రత్యక్షోపలభ్యములు" అని కేవల మవిద్యామాత్రము ననుసరించియే విరుద్ధముగ చెప్పబడుచున్నది.

యాత్మజ్ఞానినే యనుసరించుటచే నితరులకుగూడ విధినిషేధములయందు ప్రవృత్తి సంభవింపనందున శాస్త్రమున కానర్థక్యమే సంభవించు నని శంకింపజనదు.

సర్వులు వివేకజ్ఞానము కలవారు కాన శాస్త్రమున కానర్థక్యమును చెప్పెదవా? లేక నొకడు వివేకజ్ఞానముకలవాడు కాన శాస్త్రమున కానర్థక్యమును చెప్పెదవా? "మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే। యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః" అను న్యాయముచే సర్వులకు వివేకవిజ్ఞానము సంభవింపనందున మొదటి పక్షము నిరస్తము. మూఢులకు ప్రవృత్తినివృత్తులు రాగాదిదోషాధీనములగుటవలన వివేకుల ననుసరించుటయు సంభవింపదు. శ్యేనాద్యభిచారకర్మలయందు వివేకులకు ప్రవృత్తి లేకున్నను యితరులకు ప్రవృత్తి కన్పట్టుటవలన వివేకి ప్రవర్తింపనిచో యితరులు ప్రవర్తింపరు. అని నియమించుటకు

శాంకరభాష్యమ్:—

(19) అత్రాఽఽహ సాఽవిద్యా కస్యేతి? యస్య దృశ్యతే తస్యైవ। కస్య దృశ్యత ఇతి। అత్రోచ్యతేఽవిద్యా కస్య దృశ్యత ఇతి ప్రశ్నో నిరర్థకః। కథం, దృశ్యతే చే దవిద్యా తద్వంత మపి పశ్యసి। న చ తద్వ త్యుపలభ్యమానే సా కస్యేతి ప్రశ్నో యుక్తః। న హి గోమ త్యుపలభ్యమానే గావః కస్యేతి ప్రశ్నోఽర్థవా న్భవేత్;

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(19) అయవిద్య యెవనికి? ఈప్రశ్న అవిద్యకాశ్రయమాత్రము నుద్దేశించియా? ఆశ్రయ విశేషము నుద్దేశించియా? ప్రథమపక్షమున ఇట్టి "అవిద్యాకస్య" అను ప్రశ్నయే సంభవింపదు. ఎందువలననెదవా? ఎవనికి యవిద్య చూడబడుచున్నదో వానికే యవిద్య. ఎవనికి చూడబడు చున్నది? ఈవిషయమున చెప్పెద వినుము. "అవిద్యాకస్య దృశ్యతే" (అవిద్య యెవనికి చూడ బడుచున్నది?) అను ప్రశ్న నిరర్థము, అది యెట్లనిన? అవిద్య చూడబడినచో నవిద్యావంతుని కూడ చూచుచుంటివి. అత్తరి అవిద్యయెవనికి అను ప్రశ్న యుక్తము కాదు. కావున నిరర్థకమే. గోస్వామి ప్రత్యక్షముగ కనుపించుచుండ "గావఃకస్య" గోవు లెవనివి? అను ప్రశ్న అర్థ వత్తు కాదు.

శక్యము కాదు. "స్వభావస్తు ప్రవర్తతే" అని ప్రవృత్తి స్వభావ రూప జ్ఞానకార్యమగుటవలన జ్ఞానులకు ప్రవృత్తి లేకున్నను అజ్ఞానులకు ప్రవృత్త్యభావము సంభవింపదు. కావున నజ్ఞానివిషయమై శాస్త్రము సార్థక మగుటంజేసి శాస్త్రమున కానర్థక్యము సంభవింపదు కావున రెండవపక్షము నిరస్తము. కావున విధినిషేధాధీనప్రవృత్తి నివృత్త్యాత్మకబంధము అవిద్యామాత్రము. యథాదృష్టావిద్యావిషయము. కేవలక్షేత్రజ్ఞున కవిద్య. అవిద్యా కార్యము లేదు. మిథ్యాభూతమైన మరీచ్యుదకము యూషరదేశమును బురదగ జేయుట కెట్లు సమర్థము కాదో అట్లే మిథ్యాజ్ఞానము పరమార్థవస్తువును దూషించుటయందసమర్థ మగుచున్నది. కనుకనే శ్రీకృష్ణపరమాత్మచే "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" అని చెప్పబడెను.

క్షేత్రజ్ఞు డీశ్వరస్వరూపు డగునో "నేనీశ్వరస్వరూపుడ నని యేల క్షేత్రజ్ఞుడు తెలిసికొనడనెదవా? జ్ఞాన మజ్ఞానముచే నావరింపబడుటచే నట్లు తెలిసికొనుట లేదు. యీవిషయమునే శ్రీకృష్ణపరమాత్మ "అజ్ఞానే నావృతం జ్ఞానం" అని చెప్పెను.

ఇది యిట్లుండ కొందరు "త్వం వా అహ మస్మి భగవో దేవతే అహం వై త్వ మసి అహం బ్రహ్మాస్మి తత్సత్యం స ఆత్మా తత్త్వమసి" ఇత్యాదిశ్రుతులచే నసకృదుపదేశమువలన ప్రతిమయందు విష్ణుబుద్ధివలె క్షేత్రజ్ఞునియం దీశ్వర బుద్ధియని (నే నీశ్వరస్వరూపుడనని) యుపాసనాపరమని చెప్పెదరు. అట్లు చెప్పి నచో నిరుక్తశ్రుతులకు గౌణత్వము ప్రాప్తింపవలసివచ్చును. కావున నట్లు చెప్పుట యజ్ఞానవిలసితమే. "అథ యోఽన్యాం దేవతా ముపాస్తేఽన్యోఽసా వన్యోఽహ మస్మీతి న స వేద, మృత్యో స్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి। సర్వం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః సర్వం వేద" ఇత్యాది శ్రుతులచే భేదదర్శనము నిషిద్ధ మగుటవలన క్షేత్రజ్ఞునియం దీశ్వరోపాసన సంభవింపదు.

క్షేత్రజ్ఞుడు, ఈశ్వరుడు విరుద్ధములైన కించిజ్ఞత్వ, సర్వజ్ఞత్వ ధర్మములు కలవారగుటవలన వారిరు వురికి ఐక్యము సంభవింపనేరదని శంకింపజనదు.

సర్వజ్ఞత్వ "కించిజ్ఞత్వరూపధర్మములు మిథ్యలగుటచే "సోఽయం దేవదత్తః" అను స్థలమున జహదజహల్లక్షణచే విరుద్ధమైన తద్దేశ కాలవృత్తిత్వ, ఏతద్దేశ కాలవృత్తిత్వరూప విరుద్ధధర్మపరిత్యాగపూర్వ

కముగ దేవదత్తబోధ కలిగినటుల సర్వజ్ఞత్వ, కించిజ్ఞత్వరూపవిరుద్ధమిథ్యాధర్మపరిత్యాగపూర్వకముగ జహదజహల్లక్షణచే క్షేత్రజ్ఞునకు, నీశ్వరునకు నైక్యబోధ సంభవించుటచే నైక్యబోధ సంభవింపదను శంక తొలగింపబడెను. కాన నీశ్వరాభిన్నుడగు క్షేత్రజ్ఞునకు యింతతైనను సంసారసంబంధము లేదు.

వాస్తవికముగ క్షేత్రజ్ఞునకు సంసారసంబంధమే లేనిచో సంసారులకువలె "నేను బ్రాహ్మణుడను" అను యాభిజాత్యాదివిశిష్టులైన పండితులకుకూడ "యీపుత్రక్షేత్రమాత్రాదికము నాది" అని సంసారము ప్రతీయమాన మగుటవలన నిట్టి విద్వదనుభవము విరుద్ధము కాదా? అని యనెదవా?

కూటస్థాసంసార్యాత్మదర్శనపాండిత్యమన నిది కాదు. మరేది యనిన? క్షేత్రజ్ఞునియందు దాత్మదర్శనము. అనగా క్షేత్రజ్ఞుని యాత్మగ దెలిసికొనుట. అట్టి యాత్మజ్ఞానము కలవారలకు ఈ "నేను కర్తను, నాకిది యనుభవింపదగినది, నా కీకర్మచే యీఫలము సిద్ధించును." అను జ్ఞానము కూటస్థాత్మజ్ఞానవిరుద్ధ మగుటవలన సంభవింపదు. అవిక్రియాత్మదర్శికి భోగమునందును, కర్మయందును ఆకాంక్షయే లేనిచో నెవడు శాస్త్రాధికారి యని యనెదవా? ఫలమును కోరువా డగుటవలన విద్వాంసు డధికారి యని గ్రహింపుము.

కూటస్థాత్మదర్శి యగు విద్వాంసుడు ఫలార్థి కానందున ప్రవృత్తి సంభవింపకుండినచో నిషేధాధీననివృత్తికూడ సంభవింపనందున నతనికి నివృత్తినిష్ఠత్వము సిద్ధింపదందువా? సత్యమే. అయినను కార్యకరణసంఘాతోపరమమే యతనికి నివృత్తి యని యౌపచారికముగ చెప్పబడును.

"క్షేత్రజ్ఞు డీశ్వరుడే; క్షేత్రజ్ఞునకు విషయమైన క్షేత్రము వేరు; నేనైతే వాస్తవికముగ సంసారిని; సుఖము కలవాడను; దుఃఖముకలవాడను" అని యొకానొక పండితమ్మన్యునకు కల్గుయొక విధమగు పాండిత్యము అందువా? అట్లుకాదు. అట్లగుచో సంసారిత్వము వాస్తవిక మగుచో దాని నివృత్తి సంభవింపకపోవుటచే పురుషార్థము సిద్ధింపకపోవలసివచ్చు ననెదవా? అట్లు కాదు. క్షేత్రమును తెలిసికొని, క్షేత్రముకంటె వేరైన క్షేత్రజ్ఞునియొక్క జ్ఞానముచే జీవునికి సంసారోపరమము ప్రాప్తించును.

క్షేత్రజ్ఞజ్ఞానము జీవుని కెట్లు సంసారోపరతికి కారణ మగు ననెదవా? ధ్యానముచే నీశ్వరరూపమగు క్షేత్రజ్ఞుని సాక్షాత్కరింపజేసుకొని, క్షేత్రజ్ఞస్వరూపమున నుండుటచే సంసారనివృత్తి యగు నని గ్రహింపుము. కాన 'నేనువాస్తవముగ సంసారిని. అసంసారియగుక్షేత్రజ్ఞస్వరూపమైన యీశ్వరునికంటె వేరు. కాన, సంసారి యగు నాకు అసంసారిత్వము చేయదగినది' అని తెలిసికొనువాడును, "నీవుక్షేత్రజ్ఞుడవు కావు. అందుచే నీచే క్షేత్రజ్ఞేశ్వరజ్ఞానము సంసారనివృత్తికి సంపాదనీయము. అట్లు కానిచో యుపదేశానర్థక్యము ప్రాప్తించును" అని బోధించునో ఇట్టివాడు పండితుడు కాడు. మరేమగు ననెదవా? పండితాపసదు డగును. ఇట్టి పండితాపసదునిచే పైవిధమున బోధింపబడిన విషయము "అయ మాత్మా బ్రహ్మ" అని ఆత్మకు బ్రహ్మస్వరూపత్వబోధకశ్రుతివిరుద్ధమగుటచేతను, పూర్వమునందు మాచే చెప్పబడిన ఉపపత్తులకు విరుద్ధమగుటచేతను నుపాదేయము కాదు.

సంసారమునకు వాస్తవత్వ మంగీకరించుటవలన సంసారావస్థయందు కర్మకాండ కర్తవ్యము సంసారనిరాసచే నాత్మకు బ్రహ్మత్వము, ధ్యానాదికముచే బ్రహ్మము సాధితమగుచో మోక్షావస్థయందు జ్ఞానకాండ కర్తవ్యము ప్రాప్తించుచుండ నెట్లుపైజ్ఞానముకలవాడు పండితాపసదు డగు ననెదవా? చెప్పెదవినుము.

సంసారమోక్షములకు, శాస్త్రమునకు అర్థవత్త్వమును సంపాదించెద నని తలచువాడు పండితాపసదుడే. ఎందువలననిన? కల్పితమైన సంసారము నుద్దేశించి సాధ్యసాధనసంబంధమును బోధించుచున్న

శాంకరభాష్యమ్:—

(20) నను విషమో దృష్టాంతో గవాం తద్వతశ్చ ప్రత్యక్షత్వాత్ సంబంధోపి ప్రత్యక్ష ఇతి ప్రశ్నో నిరర్థకో న తథాఽవిద్యా తద్వాంశ్చ ప్రత్యక్షౌ యతః ప్రశ్నో నిరర్థకః స్యాత్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(20) గోవులు, గోవులు కలవాడు ప్రత్యక్షమగుటవలన వాటిసంబంధముకూడ ప్రత్యక్షమే. అట్లే యవిద్యయు, అవిద్యకలవాడు వాటి సంబంధము ప్రత్యక్షమగుచో "అవిద్యా కస్య దృశ్యతే" అనుప్రశ్న నిరర్థకమగును. అట్లుకాక యవిద్య, అవిద్యకలవాడు ప్రత్యక్షము కారు. కాన నప్రత్యక్షములకు ప్రత్యక్షములగు గోవులను, గోవులుకలవానిని దృష్టాంతముగ చెప్పుట విషమదృష్టాంతము. ఇట్టి దృష్టాంతము సరియైనది కాదు. కనుక "అవిద్యా కస్య దృశ్యతే" అను ప్రశ్నము సార్థకమే యని శంకింపనగు. ప్రత్యక్షముకాని యవిద్యావంతునితోనైన

కర్మకాండను, కల్పితమైన సంసారమును తిరస్కరించి, అఖండైకరసస్వరూపుడైన ప్రత్యగ్బ్రహ్మము నందు పర్యవసానమొందు జ్ఞానకాండను అర్థవత్త్వమును, తనకు శాస్త్రసిద్ధమైన బ్రహ్మత్వమును విడచి, సంసారమునకు వాస్తవత్త్వమును, తనకు బ్రహ్మత్వమును కల్పించువాడైన, ఆత్మహంతయైన యట్టివాడు శాస్త్రార్థ సంప్రదాయరహితు డగుటవలనను, "తత్త్వమసి" అను మహావాక్యమువలె ప్రసిద్ధక్షేత్రజ్ఞానువాదముచే క్షేత్రజ్ఞునకు ప్రసిద్ధమైన యీశ్వరత్వమును "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అనుదానిచే నుపదేశించుచుండె ననుట. క్షేత్రజ్ఞునకు శ్రుతిసిద్ధమైన యీశ్వరత్వమును పరిత్యజించుట అశ్రుతమైన జీవేశ్వరుల భేదముయొక్క కల్పనను చేయువాడు స్వయముగ మూఢుడై" "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అను వాక్యముచే సర్వక్షేత్రాంతర్యామి జీవునికంటె భిన్నుడైన పరుడే నిరూపింపబడెననియు, దానిచే జీవునకీశ్వరత్వము బోధింపబడలేదనియు పరులను వ్యామోహపెట్టినవా డగుచున్నాడు కాన నట్టివాడు సంప్రదాయజ్ఞాన రహితుడై, పూర్వమునందు చెప్పబడిన పాండిత్యమును పురస్కరించుకొని సర్వశాస్త్రార్థవేత్త యయినను మూర్ఖునివలె యుపేక్షణీయుడు. ఈ చెప్పుటచే విద్యావిద్యలకు వైలక్షణ్య మంగీకరించుటచే "ఈశ్వరుడు క్షేత్రజ్ఞస్వరూప మగుచో సంసారి యగును; క్షేత్రజ్ఞు లీశ్వరస్వరూప మగుచో సంసారి యనువాడు లేనందున సంసారమే లేకపోవలసివచ్చును" అనెడి దోషములు తొలిగింపబడెను. అవిద్యాపరికల్పితదోషముచే నవిద్యావిషయమైనవస్తువు మరీచ్యుదకముచే యూషరక్షేత్రము బురదగజేయబడనట్లు దూషింపబడదని పూర్వమునందే చెప్పబడెను. కాన సంసారసంసారు లవిద్యాకల్పితు లగుటచే సర్వ ముపపన్నము.

సంసారసంసారులను కల్పించెడి యవిద్య యాశ్రయాంతరము లేకుండజేసి క్షేత్రజ్ఞుని యాశ్రయించియే యుండును. కాన నవిద్యావత్త్వమే క్షేత్రజ్ఞునకు సంసారిత్వము. క్షేత్రజ్ఞుని కవిద్యావత్త్వమే యవిద్యాకృత మని చెప్పుటయు అనవస్థానదోషమువలన సంభవింపదు. క్షేత్రజ్ఞు డవిద్యావంతుడగుగాక, యాయవిద్య కోరలుతీసిన సర్పమువలె యేమియుచేయనేరదు. అట్లగుట "అహం సుఖీ, అహం దుఃఖీ" అని యవిద్యాకృతమైన దుఃఖిత్వాదులు ప్రత్యక్షమగుటవలన నుత్థాతదంతోరగమువలె నవిద్య యేమియు చేయనేర దనుట తగదని తలుపరాదు.

క్షేత్రజ్ఞునియం దాపాదింపబడు దోషసముదాయము జ్ఞేయ మగుటవలన జ్ఞేయధర్మమే యగును కాని జ్ఞాత యగు క్షేత్రజ్ఞుని ధర్మము కాదు. క్షేత్రద్వారమున క్షేత్రజ్ఞుడు అవిద్యాకృతదోషములు కలవాడగుటచే దూషింపబడు నని శంకించెదవా? జ్ఞేయముతో జ్ఞాతకు సంబంధమే యున్నచో జ్ఞేయమునకు జ్ఞేయత్వమే లేకపోయెడిని. కాన జ్ఞేయముతో జ్ఞాతకు సంబంధము సంభవింపదు. ధర్మధర్మి రూపముగ సంసర్గ ముండినచో

శాంకరభాష్యమ్:—

అప్రత్యక్షేణాఽవిద్యావతాఽవిద్యాసంబంధే జ్ఞాతే కిం తవ స్యాత్ । అవిద్యాయా అనర్థహేతుత్వా త్పరిహర్తవ్యా స్యాత్ । యస్యాఽవిద్యా స తాం పరిహరిష్యతి । నను మమైవావిద్యా । జానాసి తర్హ్యవిద్యాం తద్వంతం చాఽఽత్మానమ్ । జానామి, నతు ప్రత్యక్షేణ । అనుమానేన చే జ్జానాసి కథం సంబంధగ్రహణమ్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యవిద్యాసంబంధము తెలిసినను నీకేమి ప్రయోజనము. అవిద్య అనర్థహేతువగుటవల్ల పరిహరింప దగినదని ప్రశ్న చేయుచుంటి ననెదవా? ఎవని కవిద్య కలదో వాడే యాయవిద్యను పరిహరించుకొనగలడు. "నాకే యవిద్యకల" దనెదవా? అట్లగుచో నవిద్యను అవిద్యకల,నిన్నును నీవు తెలిసికొనియే యుంటివి. "తెలుసునుకాని ప్రత్యక్షముగ తెలియ" దందువా? అగుచో అనుమాన ప్రమాణముచే తెలుసుకొనుచుంటివా? అట్లగుచో, నేను అవిద్యాకార్యము కలవాడనగుట వలన నవిద్యావంతుడను. వ్యతిరేకముగ నవిద్య లేదుకాన ముక్తు డవిద్యాకార్యము లేనివాడు అని చూడనగుననెదవా? అట్లగుచో నాత్మ కవిద్యాసంబంధ మెట్లు గృహీతము?

జ్ఞేయమునందు జ్ఞేయత్వ ముండుటయం దేమి హాని యనెదవా? అవిద్యావత్త్వదుఃఖిత్వాదు లాత్మధర్మములగుచో స్వధర్మము స్వజ్ఞేయమగుచో తనకుగూడ స్వజ్ఞేయత్వము ప్రాప్తించెడిని. అట్లగుచో తనే జ్ఞేయము, జ్ఞాతయునని యొకనియందే కర్మకర్తృవిరోధము ప్రాప్తించు నని గ్రహింపుము. మరియు సంశయ విషయమైన యవిద్య రూపాదికమువలె నాత్మచే జ్ఞేయమగుటవలన నాత్మ యాశ్రయముగా కలది కాదు. దుఃఖిత్వాదులు ప్రత్యక్షముగ తెలియబడుటచే జ్ఞేయము లగుటవలన నాత్మధర్మములును కావు. ఆత్మధర్మము లగుచో జ్ఞేయత్వము సంభవింపదు. "మహాభూతాని" ఇత్యాదికముచే జ్ఞేయమాత్రమున కెల్ల క్షేత్రమునం దంతర్భావము చెప్పుటవలన, "ఏత ద్యోవేత్తి" అను వాక్యముచే క్షేత్రజ్ఞునకు జ్ఞాతృత్వనిర్ణయమువలన జ్ఞేయ మగు సర్వము క్షేత్రమే, జ్ఞాతయే క్షేత్రజ్ఞు డని నిశ్చయింపబడుచున్నది. కాన ప్రమాణయుక్తి యనెడి యవష్టంభాంతరము లేనందున కేవలావిద్యావష్టంభమువలన నవిద్యాదుఃఖిత్వాదులు క్షేత్రజ్ఞధర్మములు, అవి ప్రత్యక్షోపలభ్యములు. అని విరుద్ధముగ చెప్పబడుచున్నది.

ఏయవిద్యచే విరుద్ధమైనదికూడ నిర్వహించుటకు శక్యమైనదో, యట్టి యవిద్యకు స్వాతంత్ర్యము లేనందున చిత్తుకంటె వేరుగ వాస్తవవస్తువు లేనందున, అవిద్యకమైనది యున్నను యట్టి యావిద్యకము అవిద్యాకార్యమగుటచే నవిద్యాశ్రయము కానందున అట్టి అవిద్య (యెవనిసంబంధమైనది?) కాశ్రయు మెవరు? అందురా?

—• పైప్రశ్నకు సమాధానము •—

అవిద్య కాశ్రయమాత్రమును యడుగుచుంటివా? ఆశ్రయవిశేషమును యడుగుచుంటివా? ఆశ్రయ మాత్రమునే యడుగుచుంటినందువా? అవిద్య దృశ్యమగుటచే పరతంత్రమగుటవలన, నేనో యొకదానియందుండియే చూడబడుచున్నది కాన నెవరి నాశ్రయించినదో వానిదే యాయవిద్య. అందువలన వానికే ప్రత్యక్షమగుటచే సామాన్యముగ నాశ్రయమాత్ర మడగదగినది కాదు. గోవులుకలవా డుపలభ్యమానమైనపుడు గోవు లెవనివి? అను ప్రశ్న సంభవింపనటుల యాశ్రయవిశేష ముపలభ్యమానమైయుండ నవిద్యాశ్రయవిశేషమైప్రశ్నయు సంభవింపదు. గోవులు. గోవులుకలవాడు ప్రత్యక్షమగుటవలన "గోవు లెవనివి?" అను ప్రశ్న యెట్లు

శాంకరభాష్యమ్:—

(21) న హి తవ జ్ఞాతుః జ్ఞేయభూతయాఽవిద్యయా తత్కాలే సంబన్ధో గ్రహీతుం శక్యతే। అవిద్యాయా విషయత్వేనైవ జ్ఞాతు రుపయుక్తత్వాత్। న చ జ్ఞాతు రవిద్యాయాశ్చ సంబన్ధస్య యో గ్రహీతా జ్ఞానంచాన్య త్తద్విషయం సంభవ త్యనవస్థాప్రాప్తేః। యది జ్ఞాతాఽపి జ్ఞేయసంబన్ధో జ్ఞాయేతాఽన్యో జ్ఞాతా కల్ప్యః స్యా త్తస్యా ప్యన్య స్తస్యా ప్యన్య ఇత్యనవస్థాఽపరిహార్యా। యది పునరవిద్యా జ్ఞేయాఽన్యద్వా జ్ఞేయం జ్ఞేయమేవ తథా జ్ఞాతాఽపి జ్ఞాతైవ న జ్ఞేయం భవతి। యదా చైవ మవిద్యాదుఃఖిత్వాద్యై ర్న జ్ఞాతుః క్షేత్రజ్ఞస్య కించి ద్దుష్యతి।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(21) ఆత్మ కవిద్యాసంబంధజ్ఞానము కలుగుటయం దను ప పత్తి యేమి యనెదవా? ఎవడు జ్ఞాతయో (తెలిసికొనువాడో) వాడే తన కవిద్యాసంబంధమును తెలిసికొనునా? మరి యొకడు తెలిసికొనునా? వాడే తెలిసికొనునను ప్రథమపక్షమువ జ్ఞాత యవిద్యకు విషయముగ నుపయుక్త మగుటవలన తత్కాలమునందు జ్ఞేయభూతమైన యవిద్యతో జ్ఞాతకు సంబంధము తెలియుటకు శక్యము కాదు. మరియొకడు తెలిసికొనినను ద్వితీయపక్షమునకూడ జ్ఞాతకు, అవిద్యతో సంబంధమును గ్రహించువాడు మరియొక డనెదవా? అట్లగుచో ఆమరియొకనికి, అవిద్యకు సంబంధమును గ్రహించువాడు మరియొకడు. అట్లే ఆమరియొకనిక అవిద్యాసంబంధము గ్రహించువాడు మరియొకడు. ఇట్లే చెప్పినచో అనవస్థాదోషము ప్రాప్తించుటచే ద్వితీయ పక్షము సంభవింపదు.

అవిద్య జ్ఞేయము. మరియు జ్ఞేయము జ్ఞేయమే. అట్లే జ్ఞాతయు జ్ఞాతయే: జ్ఞేయము కాదు. అను నీ నియమమే యంగీకరించిన అవిద్యాదుఃఖిత్వాదులచే జ్ఞాతయగు క్షేత్రజ్ఞునకు యేదోషముగూడ ప్రాప్తింపదు.

---

నిరర్థకమో, అట్లే అవిద్య, అవిద్యకలవాడు ప్రత్యక్షము కానందున "అవిద్య యెవనికి" అను ప్రశ్న నిరర్థకము కానందున దృష్టాంతదార్ష్టాంతికములకు వైషమ్యము కలదనెదవా? అప్రత్యక్షమైన యవిద్యావంతునితో నవిద్యాసంబంధము తెలియబడినచో నీకేమి ప్రయోజనము సంభవించును? అవిద్య యనర్థహేతువు కాన పరిహరింపదగినదనెదవా? అవిద్య యెవనికి కలదో వాడే దానిని పరిహరించుకొనును. నాకే యీయవిద్య కలదు, నేనే యీయవిద్యను పరిహరింపవలయు ననెదవా? అట్లగుచో నవిద్యను, అవిద్యావంతుడవగు నిన్నును నీవెరిగియుండ "అవిద్య యెవనికి" అను ప్రశ్న నిరర్థకమే. అవిద్యను తెలిసికొనినను యవిద్యావిషయకప్రత్యక్షము లేమింజేసి "అవిద్య యెవనికి" అని ప్రశ్నించుచుంటి నందువా? "నేనవిద్యాకార్యము కలవాడనగుటవలననవిద్యావంతుడను" వ్యతిరేకముగ ముక్తుడు చూడనగును. అనుయనుమాణప్రమాణముచే నెరుగుదునెదవా? అట్లయిన సంబంధగ్రహణ మెట్లు ప్రాప్తించినది? జ్ఞాత యగు యాత్మయే తన యవిద్యాసంబంధమును తెలిసికొనెనా? మరియొక జ్ఞాత తెలిసికొనెనా? తన కవిద్యనుగూర్చి జ్ఞాతృత్వకాలమున నవిద్యాశ్రయుడుగ గృహీతుడగుటవలన నవిద్యాజ్ఞాతగ నుపయుక్తుడైన తనకు కర్మకర్తృవిరోధమువలన నవిద్యకు తనయందు సంబంధజ్ఞానము

శాంకరభాష్యమ్:—

(22) నన్వయ మేవ దోషో యద్దోషవ త్క్షేత్రవిజ్ఞాతృత్వమ్ । న విజ్ఞానస్వరూపస్యైవావిక్రియస్య విజ్ఞాతృత్వోపచారాత్ । యథోష్ణతామాత్రేణాగ్నే స్తప్తిక్రియోపచార స్తద్వత్ । యథాఽత్ర భగవతా క్రియాకారకఫలాత్మత్వాభావ ఆత్మని స్వత ఏవ దర్శితోఽవిద్యాధ్యారోపితై రేవ క్రియాకారకా ద్యాత్మ న్యుపచర్యతే తథా తత్ర తత్ర "య ఏనం వేత్తి హంతారం" "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః" "నాఽదత్తే కస్యచి త్పాపం" ఇత్యాదిప్రకరణేషు దర్శిత స్తథైవ చ వ్యాఖ్యాత మస్మాభిః । ఉత్తరేషు చ ప్రకరణేషు దర్శయిష్యామః । హంత తర్హ్యాత్మని క్రియాకారకఫలాత్మతాయాః స్వతోఽభా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(22) దోషవత్క్షేత్రవిజ్ఞాతృత్వమే దోషమని శంకింపజనదు.

జ్ఞాతృత్వమనగ జ్ఞానక్రియాకర్తృత్వమా? జ్ఞానస్వరూపత్వమా? జ్ఞానక్రియాకర్తృత్వ మంగీకరింపబడనందున దానిచే ప్రాప్తించు దోషము సంభవముకాదు. కాన ప్రథమపక్షము నిరస్తము. జ్ఞాతృత్వము జ్ఞానస్వరూపమే యను ద్వితీయపక్షమునందు అవిక్రియుడైన విజ్ఞాన స్వరూపునకు ఉష్ణతామాత్రముచే నగ్నికి తప్తిక్రియోపచారమువలెనే విజ్ఞాతృత్వ మౌపచారిక మగుటవలన దోషము ప్రాప్తింపదు.

ఈశ్లోకమునందు శ్రీకృష్ణపరమాత్మచే నాత్మయందు క్రియాకారకఫలాత్మత్వాభావము స్వతః చూపబడియే, యవిద్యాధ్యారోపితములచేతనే క్రియాకారకాదు లెట్లుపచరింపబడు చున్నవో, యట్లే అచటచట "య ఏవం వేత్తి హంతారం" "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః" "నాదత్తే కస్యచి త్పాపం" ఇత్యాది ప్రకరణములయందు చూపబడిన విష యమే మాచే నట్లే వ్యాఖ్యానింపబడెను. ముందు రాబోవు ప్రకరణములయం దీవిషయమునే చూపించెదము. హన్త! అట్లగుచో నాత్మయందు క్రియాకారకఫలాత్మత్వము స్వతః లేనిచో, నవిద్యచే నధ్యారోపిత మగుచో, కర్మలు అవిద్వత్కర్తవ్యములే విద్వాంసులకు కర్తవ్యములు కావు. అని ప్రాప్తించినది. సత్యమే. కర్మ లవిద్వత్కర్తవ్యములే. విద్వాంసునిచే నాచరింప

సంభవింపనందున ప్రథమపక్షము తొలిగింపబడెను. ఒకనియవిద్యాసంబంధమును మరియొక జ్ఞాత తెలిసికొనును నంటివా? ఆమరియొకని యవిద్యాసంబంధమును మరియొక జ్ఞాత తెలిసికొనును. ఆమరియొకని యవిద్యా సంబంధమును మరియొకజ్ఞాత అని చెప్పిన యనవస్థ యను దోషము ప్రాప్తించును. కాన రెండవపక్షముకూడ సంభవింపనేరదు. కాన జ్ఞేయమగు నవిద్యాదికము జ్ఞేయమే, జ్ఞాత జ్ఞాతయే. అందువలన నవిద్యతోడను, దుఃఖి త్వాదులతోడను జ్ఞాత యగు క్షేత్రజ్ఞునకు యేమియు దోషము సంభవింపదు.

దోషవత్ క్షేత్రజ్ఞాతృత్వమే యాత్మకు దోష మంటివా? జ్ఞాతృత్వ మనగ జ్ఞానక్రియాకర్తృత్వమా? లేక, జ్ఞానస్వరూపత్వమా? జ్ఞానక్రియాకర్తృత్వము నంగీకరింపకపోవుటచే తత్ప్రయుక్తదోషము సంభవింప

శాంకరభాష్యమ్:—

వేఽవిద్యయా చాధ్యారోపితత్వే కర్మ ణ్యావిద్వత్కర్తవ్యా న్యేవ న విదుషా మితి ప్రాప్తమ్ । సత్య మేవం ప్రాప్తమ్ । ఏత దేవ చ న హి దేహభృతా శక్య మిత్యత్ర దర్శయిష్యామః । సర్వశాస్త్రార్థోపసంహారప్రకరణే చ "సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా" ఇత్యత్ర విశేషతో దర్శయిష్యామః । అల మిహ బహుప్రపంచే నేత్యుపసంహ్రియతే ॥　　॥౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జడవు. ఈవిషయమే "న హి దేహభృతా శక్యం" అను స్థలమున చూపగలము. మరియు సర్వశాస్త్రార్థోపసంహార ప్రకరణమునందును, (18 అధ్యాయమునందు) "సమాసేనైవ కౌన్తేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా" అను స్థలమునందు విశేషముగ చూపగలము. ఈస్థలమునందు బహువిస్తారముగ చెప్పుటచేనిక చాలునని యుపసంహరింపబడుచున్నది.　　॥౨॥

సందున ప్రథమపక్షము నిరస్తము. ద్వితీయపక్షమునందు వహ్నికి కటుల యుష్ణతామాత్రముచే తాపయితృత్వోపచారమో యట్లే విజ్ఞానస్వరూపమైన యవిక్రియాత్మకు విజ్ఞాతృత్వోపచారమువలన దోషము లేదు. ఇక విస్తారముగ వ్రాయుట చాలు.　　॥౨॥

సీలకంఠీయము:— పూర్వోక్తరీతిని యుపాధినుండి నిష్కృష్టమైన "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" క్షేత్రజ్ఞునిగూడ (ఇట "చ" కారముచే క్షేత్రమునుగూడ యనియర్థము.) పరమేశ్వరుని (నన్ను) గనే యుభయరూపముగనున్న వానిగ దెలిసికొనుము. "తత్త్వమస్యహం బ్రహ్మాస్మి సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుతియు నీవిషయమునే చెప్పుచున్నది. నేను క్షేత్రక్షేత్రజ్ఞోభయస్వరూపునిగాన "క్షేత్ర...యత్" క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క యేజ్ఞానముకలదో 'క్షేత్రము బాధ్యము, క్షేత్రజ్ఞుడు సర్వబాధావధిభూతుడై యబాధితుడు అను ఏజ్ఞానముకలదో' "తత్ జ్ఞానం మతం మమ" అట్టిఅపరోక్షతత్త్వజ్ఞానమే నేను విషయముగాకల సమ్యగ్జ్ఞానముగా(క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానమే బ్రహ్మజ్ఞానమని)బ్రహ్మవేత్తలచేనిశ్చయింపబడెను. 'నేహ నానాస్తి కించన" (ఇట నానారూపమైన దేదియు లేనిదే) అను శ్రుతి క్షేత్రమును బాధించుచున్నది— "నాన్యోతోఽస్తి ద్రష్టా" అను శ్రుతి క్షేత్రజ్ఞునికంటె వేరుగనేమియు ద్రష్ట లేదని చెప్పుటచే నీవిషయము శ్రుతిసమ్మతమే. ఇట సర్వము బ్రహ్మాభిన్నమే గాన లోకమున యేజ్ఞానమైనను బ్రహ్మవిషయకమే యగును. అట్లయ్యును రజ్జువు నొకడు సర్పరూపముగా దెలిసికొనినచో నాతనికి కల్గిన యాజ్ఞానము రజ్జువిషయకముగగాని, సర్పవిషయకముగ గాని కల్గిన సమ్యగ్జ్ఞానము కానేరదు. మరియు నాజ్ఞానములో రజ్జువుకంటె వేరుగ వాస్తవమగు విషయాంతరము లేదు. ఇక నేమన రజ్జుసర్పభ్రాంతికలవాడు సర్పబాధ(నిషేధ)ముతో రజ్జుతత్త్వము నెపుడు తెలిసికొనునో యపుడే సర్పమును మిథ్యగను, రజ్జువు నయథార్థముగను లెస్సగ దెలిసుకొనును. ఈవిధముగనే యిటగూడ క్షేత్రక్షేత్రజ్ఞుల రెంటియొక్క తత్త్వమును తెలిసికొనినవాడే సమ్యగ్జ్ఞాని యగునని యర్థము. ఇట్లుకాక ఆరెండింటిలో నొకదాని తత్త్వమును తెలిసికొనినచో నంతమాత్రముచే గృతకృత్యుడు కానేరడు. సాంఖ్యులు బ్రహ్మము నిర్విశేషమని తలతురు. ప్రపంచమును మిథ్యయనక సత్యమే యందురు. ఇక శూన్యవాదులు ప్రపంచము తుచ్ఛ (శూన్య) మని చెప్పుచు ప్రపంచాధిష్ఠానమగు బ్రహ్మము లేదందురు. ఇట్టి సాంఖ్యులుగాని, శూన్యవాదులుగాని క్షేత్రక్షేత్రజ్ఞోభయయాథార్థ్యజ్ఞానము లేనివారగుటచే కృతకృత్యుల్లు కానేరరు. కాన క్షేత్రక్షేత్రజ్ఞోభయతత్త్వము తెలిసికొనదగినదే　　॥౨॥

గీ॥ తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥ ॥౩॥

పదవిభాగము:— తత్- క్షేత్రం- యత్- చ- యాదృక్- చ- యద్వికారి- యతః- చ- యత్ ॥సః- చ- యః- యత్ప్రభావః- చ- తత్- సమాసేన- మేశృణు ॥ ॥౩॥

ప్రతిపదార్థము:— యత్="ఇదం శరీరం" అనుదానిచే నిర్దేశింపబడిన యే; క్షేత్రం=క్షేత్రమో; తత్=ఆక్షేత్రము; యాదృక్చ=తనధర్మములతో నెట్టిదో; యద్వికారి=ఏవికారముకలదో; యస్మాత్=దేనివలన; యత్=ఏకార్యము; ఉత్పద్యతే (ఇదిఅధ్యాహార్యము)=పుట్టుచున్నదో; యః=ఏక్షేత్రజ్ఞుడు పూర్వమువందు నిర్దిష్టుడో; సచ=ఆక్షేత్రజ్ఞుడు; యత్ప్రభావశ్చ=ఉపాధికృతమైన యేశక్తులుకలవాడో; తత్=ఆక్షేత్రక్షేత్రజ్ఞుల యాథాత్మ్యమును; సమాసేన=సంగ్రహముగ; మే=నాయొక్క; వాక్యతః=(ఈపదమధ్యాహార్యము) వాక్యమువలన; శృణు=వినుము. ॥౩॥

---

శాంకరభాష్యమ్:—

ఇదం శరీర మిత్యాదిశ్లోకోపదిష్టస్య క్షేత్రాధ్యాయార్థస్య సంగ్రహశ్లోకోయ ముపన్యస్యతే- తత్ క్షేత్రం య చ్చేత్యాది వ్యాచిఖ్యాసితస్య హ్యర్థస్య సంగ్రహోపన్యాసో న్యాయ్య ఇతి—యన్నిర్దిష్ట మిదం శరీర మితి త త్తచ్ఛబ్దేన పరామృశతి । యచ్చేదం నిర్దిష్టం క్షేత్రం తద్యా

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"ఇదం శరీర" మిత్యాదిశ్లోకముచే నుపదిష్టమైన క్షేత్రాధ్యాయార్థమునకు "తత్క్షేత్రం యచ్చ" ఇత్యాదిసంగ్రహశ్లోకమున— వ్యాఖ్యానింపదగిన యర్థముయొక్క సంగ్రహోపన్యాసము న్యాయమని యుపన్యసింపబడుచుండెను

---

—• ౧౩ వ అధ్యాయము ౩ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సంగ్రహముగ జెప్పబడిన విషయమును వివరించుటకై "తత్" అను శ్లోకముతో నారంభించుచుండెను—

"ఇదం శరీరం" అని పూర్వమునందు చెప్పబడిన జడవర్గరూపమైన క్షేత్రము "యచ్చ" ఏస్వరూపము చే. జడదృశ్యపరిచ్ఛిన్నాదిస్వభావముకలదో, యాదృక్చ" ఏఇచ్ఛాదిధర్మములు కలదో, "యద్వికారి" ఏయింద్రియాదివికారములతో కూడినదో, "యతశ్చ" ఏకారణమువలన "యత్" ఏకార్య ముత్పన్నమగుచున్నదో, లేక "యతః" ఏప్రకృతిపురుషసంయోగమువలన జనించుచున్నదో, "యత్" ఏస్థావరజంగమాదిభేదములచే భిన్నమో, ఇచట సర్వత్ర అనియమముగ చకారముయొక్క ప్రయోగమువలన సర్వసముచ్చయము చూపవగును. "సచ" ఆక్షేత్రజ్ఞుడు "యః" స్వప్రకాశచైతన్యానందస్వభావుడో, "యత్ప్రభావశ్చ" ఉపాధికృతమైన యేశక్తులు కలవాడో, "తత్" సర్వవిశేషణవిశిష్టమైన యాక్షేత్రక్షేత్రజ్ఞయాథాత్మ్యమును "సమాసేన" సంక్షేపముగ "మే" నాయొక్క "వచనాత్" (ఈపదమధ్యాహార్యము) వాక్యమువలన వినుము. విని నిశ్చయింపుము. ॥౩॥

శంకరానందీయము:— ఇట్లు "ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞః" అనుదానిచే

శాంకరభాష్యమ్:—

దృగ్వ్యాపృశం స్వకీయై ర్ధర్మైః । చ శబ్దః సముచ్చయార్థః । యద్వికారి యో వికారోఽస్య తద్వ్య ద్వికారి యతో యస్మాచ్చ యత్కార్య ముత్పద్యత ఇతి వాక్యశేషః । స చ యః క్షేత్రజ్ఞో నిర్దిష్టః స యత్ప్రభావో యే ప్రభావా ఉపాధికృతాః శక్తయో యస్య స యత్ప్రభావశ్చ త త్క్షేత్రక్షేత్రజ్ఞయో ర్యాథాత్మ్యం యథావిశేషితం సమాసేన సంక్షేపేణ మే మమ వాక్యతః శృణు శ్రుత్వాఽవధారయేత్యర్థః । ॥౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"ఇదం శరీరం" అను శ్లోకముచే నిర్దిష్టమైన యేక్షేత్రము కలదో ఆక్షేత్రము తన ధర్మములచే నెట్టిదో "చ" అను శబ్దము సముచ్చయార్థకము. ఏవికారము కలదో, దేనివలన నేకార్యము జనించుచున్నదో, "క్షేత్రజ్ఞ ఇతి" అనుదానిచే యేక్షేత్రజ్ఞుడు నిర్దిష్టుడో, అట్టి క్షేత్రజ్ఞుడుపాధికృతమైన యేశక్తులు కలవాడో, అట్టి క్షేత్రక్షేత్రజ్ఞుల యాథాత్మ్యమును సంగ్రహముగ నావాక్యమువలన వినుము. విని ధారణ చేయుము. ॥౩॥

క్షేత్రజ్ఞుడైన యాత్మకు జ్ఞత్వమే ధర్మము కాని, యహంకారము కారకర్తృత్వభోక్తృత్వస్వరూప మగు సంసారము క్షేత్రజ్ఞధర్మము కాదు. అట్టి యహంకారము కారకర్తృత్వభోక్తృత్వరూపసంసారము జ్ఞేయమగుటచే క్షేత్రధర్మమే యని సూచించి "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అనుదానిచే సర్వక్షేత్రములకంటె భిన్నమైన చిదేకరసస్వరూపమైన యాత్మకు పరిచ్ఛేదకము లేనందున పూర్ణ మగుటవలన "అయ మాత్మా బ్రహ్మ" అను న్యాయముచే బ్రహ్మత్వమును చెప్పి, యిపుడు శ్రుతియుక్తులచే క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క వివేకము లెస్సగ చేసినచో పురుషునకు సంసారిత్వభ్రమ నిశ్శేషముగ నివర్తించును. మరియొక తీరున నివర్తింపదు అని బోధించుటకు తిరిగి క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపమును విశేషముగ లెస్సగ విభజించి చూపుటకు "తత్" అని ప్రారంభించుచుండెను.

"ఇదం శరీరం" అనుదానిచే చెప్పబడిన క్షేత్రము స్వరూపముచే నెట్టిది? స్వాభావికరూపముచే నెట్టిది యగుచున్నదో, స్వకారణామాత్మకమైన మహదాదిస్వరూప మగు యేవికారములచే నవయవి యగుచున్నదో, ఏధర్మములచే తాను ధర్మి యగుచున్నదో, క్షేత్రశబ్దముచే చెప్పబడు యేకారణమువలన పురుషునకు కార్యము సంభవించుచున్నదో, క్షేత్రజ్ఞున కుపాధిభూతమై స్వయముగ నేకార్యమును పుట్టించుచున్నదో అట్టి క్షేత్రము క్షేత్రజ్ఞునకు సంసారకారణ కాన ఏక్షేత్రము తెలియబడినచో స్వయముగ సంసారి కాడో, అట్టిక్షేత్రము ముముక్షువుచే లెస్సగ తెలిసికొనదగినది. మరియు "ఏత ద్యో వేత్తి" అని చెప్పబడిన క్షేత్రజ్ఞుడు స్వరూపముచే నెట్టివాడగుచున్నాడో, (తనయాథాత్మ్యముచే నెట్టివాడగుచున్నాడో) ఉపాధిసంబంధమున నెట్టిస్వభావముకలవా డగునో, దేనివలన తెలిసికొనదగినవాడో, దేనిని తెలిసికొనినచో తాను ముక్తు డగునో, యట్టి క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపమును సంక్షేపముగ నేజెప్పుచుంటిని. దానిని వినుము. విని దాని యర్థమును లెస్సగ నిశ్చయించుకొనుము. తన్నిష్ఠుడ వగుము. అదియే శ్రవణమునకు ఫలము. మరచుట, యుపేక్షించుటయు ఫలము కాదు. ॥౩॥

గీ॥ ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః ॥ ॥౪॥

పదవిభాగము:—

ఋషిభిః- బహుధా- గీతం- ఛందోభిః- వివిధైః- పృథక్- బ్రహ్మసూత్రపదైః- చ- ఏవ- హేతుమద్భిః- వినిశ్చితైః ॥ ॥౪॥

ప్రతిపదార్థము:—

తత్= (ఈపదము పూర్వశ్లోకమునుండి యనువృత్తము) ఆక్షేత్రక్షేత్రజ్ఞ యాథాత్మ్యము; ఋషిభిః= వశిష్ఠాదిమహర్షులచే; బహుధా= అనేకప్రకారములుగ; గీతం= గానము చేయబడెను; (చెప్పబడెను) వివిధైః= అనేకవిధములైన; ఛందోభిః= ఋగాదిమంత్రములచే; పృథక్= స్పష్టముగ; గీతం= గానము చేయబడెను; హేతుమద్భిః=యుక్తియుక్తమైన; వినిశ్చితైః=నిశ్చయరూపమైన; బ్రహ్మసూత్రపదై శ్చైవ= (బ్రహ్మణః సూచకాని వాక్యాని బ్రహ్మసూత్రాణి) బ్రహ్మసూచకములగు వాక్యములు బ్రహ్మసూత్రము లనబడును. అట్టివాటిచే బ్రహ్మము (పద్యతే గమ్యతే జ్ఞాయత ఇతి) తెలియబడును గాన బ్రాహ్మణవాక్యములు బ్రహ్మసూత్రపదము లనబడును. అట్టి బ్రాహ్మణవాక్యములచేతను; గీతం= గానము చేయబడెను. ॥౪॥

శాంకరభాష్యమ్:—

తత్క్షేత్రక్షేత్రజ్ఞయో ర్యాథాత్మ్యం వివక్షితం స్తౌతి శ్రోతృబుద్ధిప్రరోచనార్థమ్— ఋషిభి ర్వసిష్ఠాదిభి ర్బహుధా బహుప్రకారం గీతం కథితం, ఛందోభి శ్ఛందాంసి ఋగాదీని తై శ్ఛందోభి ర్వివిధై ర్నానాప్రకారైః పృథ గ్వివేకతో గీతమ్ । కిం చ బ్రహ్మసూత్రపదై

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శ్రోతృబుద్ధిప్రరోచనము నిమిత్తము వివక్షితమైన యాక్షేత్రక్షేత్రజ్ఞయాథాత్మ్యమును స్తుతించుచుండెను. వసిష్ఠాదిమహర్షులచేతను అనేకవిధములుగ క్షేత్రక్షేత్రజ్ఞయాథాత్మ్యము చెప్పబడెను. అనేకవిధములైన ఋగాదిమంత్రములచే చెప్పబడెను. బ్రాహ్మణవా

—• ౧౩ వ అధ్యాయము ౪ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఎవరెవరిచే విస్తారముగ చెప్పబడినదానిని నీవు సంగ్రహముగ చెప్పెదవు అను యాశంకపై శ్రోతృబుద్ధిప్రరోచనార్థమై స్తుతి చేయుచు "ఋషిభిః" అని చెప్ప మొదలిడెను-

వసిష్ఠాదిమహర్షులచే యోగశాస్త్రములయం దనేకవిధములుగ ధారణధ్యానవిషయముగ పై విషయము నిరూపింపబడెను. ఈచెప్పుటచే నేజెప్పబోవు విషయము యోగశాస్త్రప్రతిపాదిత మని చెప్పబడెను. నిత్యనైమిత్తిక కామ్యకర్మలు విషయముగా గల ఋగ్వేదాదిమంత్రములచేతను, బ్రాహ్మణములచేతను వేర్వేరుగ స్పష్టముగ చెప్పబడెను. ఈచెప్పుటవలన నేను చెప్పబోవు విషయము కర్మకాండప్రతిపాదిత మని చెప్పబడెను. "బ్రహ్మ సూత్ర్యతే సూచ్యతే కించిద్వ్యవధానేన ప్రతిపాద్యతే ఏభి రితి బ్రహ్మసూత్రాణి" అని "యతో వా ఇమాని భూతాని జాయన్తే । యేన జాతాని జీవన్తి యత్ప్రయ న్త్యభిసంవిశన్తి" అను శ్రుతివాక్యములచే కించిద్వ్యవధానముగ బ్రహ్మము చెప్పబడును గాన తటస్థలక్షణపరమైన పైవాక్యములు బ్రహ్మసూత్రము లనబడును. అట్లే "పద్యతే బ్రహ్మ సాక్షా త్ప్రతిపాద్యత ఏభి రితి పదాని" వేటిచే బ్రహ్మము సాక్షాత్తు చెప్పబడునో యట్టి స్వరూపలక్షణపరమైన "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" ఇత్యాద్యుపనిషద్వాక్యములు పదము లనబడును. "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మేవాద్వితీయం" అని యుపక్రమించి

శాంకరభాష్యమ్:—

శ్చైవ బ్రహ్మణః సూచకాని వాక్యాని బ్రహ్మసూత్రాణి తైః పద్యతే గమ్యతే జ్ఞాయతే బ్రహ్మేతి తాని పదాన్యుచ్యంతే । తైరేవ చ క్షేత్రక్షేత్రజ్ఞయోర్యాథాత్మ్యం గీత మిత్యనువర్తతే । "ఆత్మేత్యేవోపాసీత" ఇత్యాదిభిర్హి బ్రహ్మసూత్రపదైరాత్మా జ్ఞాయతే । హేతుమద్భిర్యుక్తియుక్తైర్వినిశ్చితైర్న సంశయరూపైర్నిశ్చితప్రత్యయోత్పాదకైరిత్యర్థః । ॥౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

క్యములచేతను, యుక్తియుక్తమైన బ్రహ్మసూత్రములచేతను, అనేకవిధములుగ స్పష్టముగ చెప్పబడెను. "ఆత్మేత్యేవోపాసీత" ఇత్యాదిబ్రహ్మసూచకపదములచే నాత్మ తెలియబడుచున్నది. ఆవాక్యములు యుక్తియుక్తములు. కనుకనే నిశ్చితజ్ఞానజనకములు. సంశయోత్పాదకములు కావు. ॥౪॥

“తద్ధైక ఆహు రసదేవేద మగ్ర ఆసీ దేక మేవాద్వితీయం తస్మా దసతః స జ్జాయేత” అని నాస్తికమతము నుపన్యసించి “కుతస్తు ఖలు సోమ్యైవం స్యా దితి హోవాచ కథ మసతః స జ్జాయేత” ఇత్యాదియుక్తులను పైవాక్యములు బోధించుచున్నవి. కాన ఛాందోగ్యవాక్యములు హేతుమత్తు లనబడును. అవి యెట్టివనిన? ఉపక్రమోపసంహారైకవాక్యతలచే సందేహశూన్యార్థప్రతిపాదకములు. అట్టి వాక్యములచే ననేకవిధముల నీ (నాచే చెప్పబోవు) విషయము చెప్పబడెను. ఈచెప్పుటచే నాచే చెప్పబోవు విషయము జ్ఞానకాండచే ప్రతిపాదిత మని చెప్పబడెను.

వసిష్ఠాదిఋషులచేతను, కర్మకాండప్రతిపాదకమైన మంత్రములచేతను, బ్రాహ్మణవాక్యములచేతను, హేతుమత్తులై తటస్థలక్షణ, స్వరూపలక్షణ, ప్రతిపాదకములైన యుపనిషద్వాక్యములచేతను, అతివిస్తారముగ క్షేత్రక్షేత్రజ్ఞ యాథాత్మ్యము చెప్పబడెను. అట్టి యాథాత్మ్యమును సంక్షేపముగ నీకొఱకు చెప్పెద వినుము.

లేక “బ్రహ్మసూత్రాణి చ తాని పదాని” అని “బ్రహ్మసూత్రపదైః” అనుచోట కర్మధారయ ననుసరింపవలెను. అందు విద్యాసూత్రములు “ఆత్మేత్యేవోపాసీత” ఇత్యాదికములు. “న స వేద యథా పశుః” ఇత్యాదికము లవిద్యాసూత్రము లనబడును. ఇట్టి విద్యాఽవిద్యాసూత్రములచే ననేకవిధముల విస్తారముగ చెప్పబడినది. ॥౪॥

శంకరానందీయము:— శ్రుతులచేతను, సూత్రములచేతను, మహర్షులచేతను యీయర్థము సునిశ్చితము. అని వివక్షితార్థమునకు సర్వశాస్త్ర, తదర్థజ్ఞుల సంబంధముచే ప్రసిద్ధత్వమును శ్రోతకు శ్రద్ధావిషయములతో ప్రవృత్తి కల్గుటకై “ఋషిభిః” అను శ్లోకముచే చెప్పుచుండెను.

క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపము వాసిష్ఠవిష్ణుపురాణాదులయందు వసిష్ఠపరాశరాదులచే బహుప్రకారము చెప్పబడెను. శాఖాభేదములచే బహుప్రకారములైన ఋగ్వేదాదులచే “స ఈక్షతే । కథంన్విదం మద్ఋతే స్యాత్” “స వా ఏష పురుషోఽన్నరసమయః । అన్యోఽన్తర ఆత్మా ప్రాణమయః । ఏతస్మి న్నదృశ్యేఽనాత్మ్యే” ఇత్యాదికములచే క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపము వేరుపరచి చెప్పబడెను. తత్త్వనిశ్చాయకములైన అర్థసాధకయుక్తులతో గూడిన వాక్యములచే నిశ్చితార్థములు గల బ్రహ్మసూచకమైన తత్త్వమును తెలియజేయునట్టి “జన్మాద్యస్య యతః” ఇత్యాదివేదాంతసూత్రములచే క్షేత్రక్షేత్రజ్ఞ యాథాత్మ్యము వివిచ్య చెప్పగ ప్రకాశితము. ॥౪॥

గీ॥ మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవ చ ।
ఇన్ద్రియాణి దశైకం చ పంచ చేన్ద్రియగోచరాః ॥ ॥౫॥

పదవిభాగము:— మహాభూతాని- అహంకారః- బుద్ధిః- అవ్యక్తం- ఏవ- చ- ఇంద్రియాణి— దశ- ఏకం- చ- పంచ- చ- ఇంద్రియగోచరాః ॥ ॥౫॥

ప్రతిపదార్థము:— మహాభూతాని=పంచసూక్ష్మములు; అహంకారః=అహంకారము; బుద్ధిః= నిశ్చయాత్మకమైనవృత్తి; అవ్యక్తమేవచ=అవ్యాకృతము (ఈశ్వరశక్తి); దశ=పదియగు; ఇంద్రియాణి=పంచ కర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు; ఏకం చ=మనస్సు; ఇంద్రియగోచరాః=జ్ఞానేంద్రియగోచరములగు; పంచ=శబ్దస్పర్శరూపరసగంధములు, ॥౫॥

---

శాంకరభాష్యమ్:—

స్తుత్యాఽభిముఖీభూతాయాఽర్జునాయాఽఽహ— మహాభూతాని మహాంతి చ తాని సర్వవికారవ్యాపకత్వా ద్భూతాని చ సూక్ష్మాణి । స్థూలాని త్విందిన్ద్రియగోచరశబ్దేనాఽభిధాయిష్యంతే । అహంకారో మహాభూతకారణ మహంప్రత్యయలక్షణః । అహంకారకారణం

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

స్తుతిచే నభిముఖుడైన యర్జునునికొరకు "మహాభూతాని" అని చెప్పుచుండెను. సర్వ వికారకారణము లగుటవలన గొప్ప వగు మహాభూతములు సూక్ష్మములు, స్థూలములు ఇంద్రి గోచరశబ్దముచే ముందు చెప్పబడును గాన మహాభూతశబ్దముచే సూక్ష్మములనే గ్రహింపవల యును. మహాభూతకారణమైన అహంప్రత్యయమహంకారమనబడును తత్కారణమునిశ్చయాత్మక మైనది బుద్ధి, అట్టి బుద్ధికి కారణమైనది యవ్యక్తము(ఈశ్వరశక్తి).అది'మమ మాయా దురత్యయా'

---

—• ౧౩వ అధ్యాయము ౫ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు ప్రరోచితుడైన యర్జునునికొరకు "మహాభూతాని" అను శ్లోకము మొదలుకొని రెండుశ్లోకములచే క్షేత్రస్వరూపమును చెప్పుచుండెను—

పృథివ్యప్తేజోవాయ్వాకాశములను పంచభూతములు, వానికి కారణమైన యభిమానస్వరూపమగు యహం కారము, అహంకార కారణమైన- నిశ్చయాత్మకమైన- మహత్తత్త్వమునకు కారణమైన- సత్త్వరజస్తమోగుణా త్మకమైన ప్రధానము, (ఇది దేనికిని కార్యము కాదు. సర్వమునకీప్రధానమే కారణము.) ఇంతమాత్రమే ప్రకృతి యెనిమిదివిధములు. ఇట్లు సాంఖ్యులచే వ్యాఖ్యాతము. ఉపనిషన్మతస్థులకన్ననో, అవ్యాకృతము, అనిర్వచనీయము, మాయ యను పేరులుగల పరమేశ్వరశక్తియే అవ్యక్త మనబడును. ఈవిషయమే "మమ మాయా దురత్యయా" అని శ్రీకృష్ణపరమాత్మచే జెప్పబడెను. "బుద్ధిః" అనగా సృష్ట్యాదియందు తద్విషయక మైన యీక్షణము. "అహంకారః" అనగా ఈక్షణానంతరమున "నేన నేకవిధములుగ నయ్యెదను" అను సంకల్పము. అనంతరమున నాకాశాదిక్రమమున పంచభూతములయొక్క యుత్పత్తికి "ఈక్షతే ర్నాశబ్దం" అను సూత్రమున అశబ్దత్వహేతువుచే ప్రధానము నిరాకృతమగుటచే సాంఖ్యసిద్ధమైన యవ్యక్తమును మహ దహంకారములను ఔపనిషదు లంగీకరింపరు. "మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్" "తే ధ్యానయోగానుగతా అపశ్య న్దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢామ్" ఇత్యాదిశ్రుతిప్రతిపాదిత మవ్యక్తము..

"తదైక్షత" అను శ్రుతిసిద్ధమైన యీక్షణమే బుద్ధి. "బహు స్యాం ప్రజాయేయ" అనెడి శ్రుతిసిద్ధమైన బహుభవనసంకల్పమే అహంకారము. "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః। ఆకాశాద్వాయుః। వాయోరగ్నిః। అగ్నేరాపః। అద్భ్యః పృథివీ" అనుశ్రుతిసిద్ధమైనవి పంచభూతములు. ఈయుపనిషత్ప్రత్యక్షమే గ్రహింపదగినది. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడి పంచజ్ఞానేంద్రియములు, వాక్పాణిపాదపాయూపస్థ లనెడి పంచకర్మేంద్రియములు, సంకల్పవికల్పాత్మకమైనమనస్సు ఒకటి, శబ్దస్పర్శరూపరసగంధము లనెడి యయిదు విషయములు, (ఈయయిదువిషయములుజ్ఞానేంద్రియములకు జ్ఞేయములై, పంచకర్మేంద్రియములకు కార్యములై విషయములగుచున్నవి.) వీటినన్నిటిని సాంఖ్యులు యిరువదినాల్గు తత్త్వము లని చెప్పెదరు. ॥౫॥

శంకరానందీయము:— ఇట్లు క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క స్వరూపవివేచనకు సర్వవేదశాస్త్రతదర్థజ్ఞప్రసిద్ధత్వమును చెప్పి, అందు ప్రథమోద్దిష్టమైన క్షేత్రమును "మహాభూతాని" అనుశ్లోకము మొదలుకొని రెండు శ్లోకములచే జెప్పుచుండెను—

పుట్టునవి కాన భూతము లనబడును. అపంచీకృతమైన యాకాశాదిపంచమహాభూతములు, (సూక్ష్మములు). స్థూలములను "పంచచేంద్రియగోచరాః" అనుదానిచే చెప్పునుగాన "మహాభూతాని" అనుదానిచే భూతసూక్ష్మము లగు తన్మాత్రలనే గ్రహింపనగును. అట్టి భూతములు సర్వకార్యవ్యాపకము లగుటవలన మహాభూతము లనబడును. "అహంకారః" పంచతన్మాత్రకారణము. ఈవిషయమునే "అహంకారాత్పంచతన్మాత్రాణి" అను శ్రుతి బోధించుచున్నది. 'బుద్ధిః' అహంకారకారణమైన మహత్తత్త్వము. ఈవిషయమునే 'మహతో ఽహంకారః' అను శ్రుతి బోధించుచున్నది. మహత్తత్త్వమునకు కారణమైన మూలప్రకృతియే అవ్యక్తమనబడును. మహదాదులవలె వ్యక్తము కానందున నవ్యక్త మనబడును. అదియే యవ్యాకృతము, జగద్బీజము, త్రిగుణాత్మకమైన పరమేశ్వరశక్తియే "అపరాప్రకృతి" అనబడును. "అపరేయం" అని "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" అని చెప్పబడిన లక్షణములు కల్గి యెనిమిదివిధములుగ భిన్నమైనది అపరాప్రకృతియే అని చెప్పబడెను. ఇటప్రకృతిస్వరూపావధారణనిమిత్తము ఏవకారము ప్రయుక్తము. సముచ్చయార్థము చకారము ప్రయుక్తము. మహదాదు లేడింటితో క్షేత్రమునకు స్వాభావికరూప మవ్యక్తమే. "ఇన్ద్రియాణి దశైకం చ పంచ చేన్ద్రియగోచరాః" అనుదానిచే జెప్పబోవు పదునారు వికారములచే నేది వికారి యని చెప్పబడెనో అట్టి విశేషణము కల క్షేత్రముయొక్క వైకారిక రూపము. చక్షురాది పంచజ్ఞానేంద్రియములు, వాగాదిపంచకర్మేంద్రియములు, ఒకటియగుయంతరింద్రియమైన మనస్సు మొత్తము యీపదునొకండగునట్టి యింద్రియములు, అట్లే యింద్రియగోచరమైన శబ్దస్పర్శరూపరసగంధము లనెడి యయిదు విషయములు నివి యున్నియు పదునారు వికారములు, అయిదు మహాభూతములు, మహదహంకారములు రెండు, అవ్యక్త మొకటి. యీయిరువదినాలుగు పదార్థము లనబడును. యివి "మూలప్రకృతిరవికృతి ర్మహదాద్యాః ప్రకృతివికృతయ స్సప్త। షోడశకశ్చ వికారః" అని సాంఖ్యులకు యిరువదినాలుగు తత్త్వము లగుచున్నవి. ॥౫॥

పరమార్థప్రపా:— అందు మొట్టమొదట "మహాభూతాని" అను శ్లోకముమొదలుకొని రెండు శ్లోకములచే క్షేత్రస్వరూపమును చెప్పుచుండెను—

భూమ్యాదు లనుభవగోచరములగుటవలన వానిని మొట్టమొదట చెప్పుచుండెను. "మహాభూతాని" పృథివ్యప్తేజోవాయ్వాకాశములు(5), వాటికి కారణమైన యహంకారము(1), యీయహంకారము సత్త్వరజస్తమోగుణభేదముచే సాత్త్వికాహంకారమనియు, రాజసాహంకారమనియు, తామసాహంకార మనియు మూడువిధములు. అందు సాత్త్వికాహంకారము జ్ఞానశక్త్యుత్పాదకము. రాజసాహంకారము క్రియాశక్త్యుత్పాదకము. తామ

శాంకరభాష్యమ్:—

బుద్ధి రధ్యవసాయలక్షణా। తత్కారణ మవ్యక్త మేవ చ న వ్యక్త మవ్యక్త మవ్యాకృత మీశ్వరశక్తి ర్మమ మాయా దురత్యయే త్యుక్తమ్। ఏవశబ్దః ప్రకృ త్యవధారణార్థః। ఏతావ త్యేవాష్టధా భిన్నా ప్రకృతిః। చశబ్దో భేదసముచ్చయార్థః। ఇంద్రియాణి దశ శ్రోత్రాదీని పంచ బుద్ధ్యుత్పాదకత్వా ద్బుద్ధీంద్రియాణి, వాక్పాణ్యాదీని పంచ కర్మనిర్వర్తకత్వాత్కర్మేంద్రియాణి తాని దశ। ఏకం చ కిం త న్మన ఏకాదశం సంకల్పాద్యాత్మకమ్। పంచ చేంద్రియగోచరాః శబ్దాదయో విషయాః। తా న్యేతాని సాంఖ్యా శ్చతుర్వింశతితత్త్వా న్యాచక్షతే॥ ॥౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అనుదానిచే చెప్పబడినది. "ఏవ" అను శబ్దము ప్రకృత్యవధారణార్థకము. ఇంతమాత్రమే ప్రకృతి. ఇదియే యెనిమిది విధములుగ వేరయిన ప్రకృతి. 'చ' అను శబ్దము భేదసముచ్చయార్థకము. పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, సంకల్పవికల్పాత్మక మనస్సు ఒకటి యివి(౧౧) బుద్ధివృత్తి జనకము లగుటవలన శ్రోత్రాదులు, జ్ఞానేంద్రియములు, నివి కర్మనిర్వర్తకములగుటవలన వాక్పాణ్యాదులు కర్మేంద్రియము లని యనబడును. జ్ఞానేంద్రియగోచరము లగు శబ్దాదు లయిదు విషయములు. ఈ యిరువదినాల్గింటిని సాంఖ్యులు చతుర్వింశతితత్త్వము లని చెప్పెదరు. ॥౫॥

సాహంకారము ద్రవ్యశక్త్యుత్పాదకము. అందు తామససాహంకారమువలన నాకాశాదిద్రవ్యశక్తులగు శబ్దాది తన్మాత్రలు పుట్టుచున్నవి. అనంతరమున విజ్ఞానాత్మకమహత్తత్త్వము(1), మూలప్రకృతి(1), అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు(10), మనస్సు(1), ఇంద్రియగోచరమైన తన్మాత్రరూపమైన శబ్దాదులు ఆకాశముకంటె యవిశేషగుణములుగ వ్యక్తమైనవై ఇంద్రియవిషయములు(5), ఇట్లు ఇరువదినాలుగు తత్త్వములు చెప్పబడెను. ॥౫॥

గీ॥ ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః।
ఏత త్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్॥ ॥౬॥

పదవిభాగము:— ఇచ్ఛా- ద్వేషః- సుఖం- దుఃఖం- సంఘాతః- చేతనా- ధృతిః- ఏతత్- క్షేత్రం- సవికారం- ఉదాహృతమ్॥ ॥౬॥

ప్రతిపదార్థము:— ఇచ్ఛా=కోరికయు; ద్వేషః=ద్వేషము; సుఖం=సుఖము; దుఃఖం=దుఃఖము; సంఘాతః=దేహేంద్రియాదుల సంహతి; చేతనా=దేహేంద్రియసంఘాతమునం దభివ్యక్తమైన ఆత్మచైతన్యాభాసరసవిద్ధమైన యంతఃకరణవృత్తి; సవికారం=వికారముతోఁగూడిన; ఏతత్=ఈ; క్షేత్రం=క్షేత్రము; సమాసేన=సంగ్రహముగ; ఉదాహృతం=చెప్పబడెను. ॥౬॥

శాంకరభాష్యమ్:—

అథేదానీ మాత్మగుణా ఇతి యా న్వాచక్షతే వైశేషికా స్తేపి క్షేత్రధర్మా ఏవ, న తు క్షేత్రజ్ఞస్యే త్యాహ భగవాన్— ఇచ్ఛా యజ్జాతీయం సుఖహేతు మర్థ ముపలబ్ధవా న్పూర్వం పున స్తజ్జాతీయ ముపలభమాన స్త మాదాతు మిచ్ఛతి సుఖహేతు రితి సేయ మిచ్ఛాంతఃకరణ ధర్మో జ్ఞేయత్వాత్ క్షేత్రమ్। తథా ద్వేషో యజ్జాతీయ మర్థం దుఃఖహేతుత్వేనానుభూత వా న్పున స్తజ్జాతీయ ముపలభమాన స్తం ద్వేష్టి సోఽయం ద్వేషో జ్ఞేయత్వాత్ క్షేత్రమేవ। తథా సుఖ మనుకూలం ప్రసన్నం సత్త్వాత్మకం జ్ఞేయత్వాత్ క్షేత్రమేవ। దుఃఖం ప్రతికూ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏగుణము లాత్మగుణములని వైశేషికులు చెప్పుచుండిరో ఆగుణములు క్షేత్రధర్మములే కాని క్షేత్రజ్ఞధర్మములు కావని శ్రీకృష్ణపరమాత్మ "ఇచ్ఛా" అను శ్లోకముచే చెప్పుచుండెను. పూర్వమునం దేజాతీయమైన సుఖహేతువగు పదార్థమును పొందెనో తిరిగి ఆజాతీయమైన పదార్థమును చూచుచు అది సుఖహేతువని దానిని స్వీకరించుటకు యిచ్ఛయించును. ఈ యిచ్ఛ జ్ఞేయ మగుటవలన నంతఃకరణ ధర్మము. క్షేత్రము. అట్లే సుఖము అనుకూలము, ప్రసన్నము. సత్త్వాత్మకము. అదియు జ్ఞేయమగుటవలన క్షేత్రమే. దుఃఖము ప్రతికూలాత్మకము. అదియు జ్ఞేయమగుటవలన క్షేత్రమే. దేహేన్ద్రియాదుల సంహతి సంఘాత మనబడును. తప్తమైన

—• ౧౩ వ అధ్యాయము ౬ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇచ్ఛయనగ సుఖమునందు, తత్సాధనమునందు "ఇదం మే భూయాత్" ఇది నాకు ప్రాప్తించుగాక యనెడి స్పృహారూపమైన చిత్తవృత్తి. అదియే కామమని, రాగమని యనబడును. ద్వేషమనగ దుఃఖమునందు, తత్సాధనమునందు "ఇదం మే మా భూత్" ఇది నాకు ప్రాప్తించకపోవుగాక అనెడి స్పృహావిరోధి యగు చిత్తవృత్తి. ఇట్టి చిత్తవృత్తియే క్రోధమని, ఈర్ష్య యని చెప్పబడును. సుఖ మనగ నిరుపాధీచ్ఛావిషయము, ధర్మమే యసాధారణకారణముగా గల చిత్తవృత్తి. ఇది పరమాత్మసుఖవ్యంజకము. దుఃఖ మనగ నిరుపాధిద్వేషవిషయమైన చిత్తవృత్తి. ఇది అధర్మ మసాధారణ కారణముగా గలది. సంఘాత మనగ నింద్రియములతోఁగూడిన పంచమహాభూతముల పరిణామ మగు శరీరము. చేతన యన ఆత్మస్వరూపజ్ఞానవ్యంజకము, ప్రమాణములే యసాధారణకారణముగా కల, జ్ఞాన మనెడి చిత్తవృత్తి. ధృతి యనగ అవసన్నమైన దేహేంద్రియముల యవష్టంభనమునకు హేతువైన ప్రయత్నము. ఈచ్ఛాది పదములు సర్వాంతఃకరణధర్మముల కుపలక్షణము. అనగా ఈఇచ్ఛాదిపదములవలననే నిఖిలయంతఃకరణ ధర్మములు గ్రహింపనగును. యీవిషయమునే "కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి ర్హ్రీర్ధీర్భీ రిత్యేత త్సర్వం మనఏవ" అను శ్రుతియు తెలుపుచున్నది. "మృద్ఘటః" ఘటము మట్టిస్వరూపమే అనునటుల కార్యములగు కామాదుల కుపాదానాభేదముచే మనోధర్మత్వమునే "ఏతత్" అను దానిచే చెప్పుచుండెను. ఈ పరిదృశ్యమానమైన మహాభూతము మొదలు ధృత్యంతమైన నిఖిలజడవర్గము సాక్షి యగు క్షేత్రజ్ఞునిచే నవభాస్యమానమగుటవలన క్షేత్రజ్ఞస్వరూపము కాక క్షేత్రస్వరూపము, భాస్యము, అచేతనము నగును. ఇట్టి క్షేత్రము సంగ్రహముగ నీకొరకు నాచే చెప్పబడెను.

శరీరేంద్రియసంఘాతమే చేతనము, క్షేత్రజ్ఞుడు నని లోకాయతికులు (చార్వాకులు)ను, చేతన యన క్షణిక విజ్ఞానమే యాత్మ యని సౌగతులు (బౌద్ధులు)ను, ఇచ్ఛాద్వేషప్రయత్నసుఖదుఃఖజ్ఞానము లాత్మధర్మములని నైయ్యాయికులును చెప్పుచుండ యీసర్వ మెట్లు క్షేత్రస్వరూప మనెదవా? వినుము చెప్పెద:— సవికార ముదాహృతం'' వికార మనగ జన్మాదినాశాన్తమైన పరిణామము. అవి "జాయతే, అస్తి, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, నశ్యతి'' అని షడ్భావవికారములు అని నైరుక్తులచే చెప్పబడెను. వాటితో గూడినది "సవికార'' మనబడును. అది యేదనిన మహాభూతములు మొదలుకొని ధృత్యంతము. కాన వికారసాక్షిచే తన యుత్పత్తి వినాశములు చూచుటకు శక్యము కానందున వికారసాక్షి వికారములకంటె వేరని తప్పక చెప్పవలయును. మరియు యితరమైన స్వధర్మములకు తన దర్శనములేనిదే దర్శనము సంభవింపదు. తనచేతనే తాను చూడ బడునందువా? అట్లగుచో కర్తృకర్మవిరోధము ప్రాప్తించును. కాన సర్వకార్య (వికార) సాక్షి నిర్వికారుడే యగును. ఈవిషయమే "ఏతే స్యాద్విక్రియాం దుఃఖీ సాక్షితా కా వికారిణః । ధీవిక్రియాసహస్రాణాం సాక్ష్యతోఽహ మవిక్రియః'' అని చెప్పబడెను. ఈచెప్పుటచే వికారిత్వమే క్షేత్రచిహ్నము. పరిగణ నము కాదు. ||౬||

శంకరానందీయము:— "యాదృక్చ'' అనుదానిచే చెప్పబడిన విశేషణమును "ఇచ్ఛా'' అను శ్లోకముచే స్పష్టపరచుచుండెను.

"భోగ్యా నీచ్ఛ త్యనయే తీచ్ఛా'' భోగ్యములను దీనిచే కోరునుగాన యిచ్ఛ యనబడును. ఇచ్ఛ యనగ రాగము. విషయములయందు ప్రీతి అని యనెదరు. ద్వేషమన విషయముల యందప్రీతి. "ఇచ్ఛా'' అనుశబ్దము సత్త్వగుణములైన శమదమదయాక్షాంత్యాదుల కుపలక్షణము. అనగా ఇచ్ఛాశబ్దముచేతనే శమదమదయా క్షాంత్యాదులను గ్రహింపవలయును. అట్లే ద్వేషశబ్దముచే తమోగుణములైన నిద్రాలస్యమోహాదులను గ్రహిం చుకొనవలయును. ఇచ్ఛాద్వేషాదులే నిఖిలరాజసతామసాదులు "క్షేత్రాంతఃపాతియగు. అంతఃకరణధర్మము లగుటవలన క్షేత్రమే యగును. ఆక్షేత్రమంతఃకరణము యీయిచ్ఛాద్వేషాదులచేతను, జన్మాదులచేతను ధర్మి యగును. ఇచ్ఛాద్వేషాదులచే పుణ్యపాపకర్మహేతువగుటవలన కర్మియునగుచున్నది. ఇచ్ఛాదులు, పుణ్యాది కర్మలు క్షేత్రధర్మము లగుటచేతను, జ్ఞేయము లగుటచేతను, ఇచ్ఛాదులకు, పుణ్యపాపకర్మలకు క్షేత్రత్వమే. ఇష్టవస్తుసాన్నిధ్యమాత్రముచే ప్రతీయమానమగు సుఖము, అనిష్టవస్తుసాన్నిధ్యముచే ప్రతీయమానమగు దుఃఖము అతఃకరణపరిణామవిశేషమగుటవలన అంతఃకరణధర్మములే యగును. ఆత్మధర్మములు కావు. మరియు సుఖ దుఃఖేచ్ఛాద్వేషప్రయత్నధర్మాధర్మము లాత్మధర్మములే యగుచో "అయం రాగః, అయం ద్వేషః, ఇదం సుఖం, ఇదం దుఃఖం'' అని సుఖదుఃఖేచ్ఛాద్వేషాదులకు జ్ఞేయత్వము సంభవింపకపోయెడిని. ఘటాదులవలె సుఖదుఃఖేచ్ఛాది ధర్మములు తెలియబడుచున్నవి. కాన జ్ఞేయమగు సుఖదుఃఖాదులు రూపమువలె యనాత్మధర్మములే యగును. విచారింప తార్కికులుచే సుఖదుఃఖాదు లాత్మధర్మములుగ నంగీకరింపబడెను. అయినను యవి యంతఃకరణధర్మములే కాని యాత్మధర్మములు కానేరవు. నిరవయవసావయవములకు సంయో గము కాని, సమవాయము కాని సంభవింపనందునను, ఆత్మ- సుఖదుఃఖాదుల కయుతసిద్ధత్వము లేనందునను, సుఖదుఃఖాదు లాత్మధర్మములు కావు. "కేవలో నిర్గుణశ్చ'' అను శ్రుతివలన యాత్మ గుణియుగాదు. "నిష్కలం నిష్క్రియం'' అను శ్రుతివలన నాత్మ క్రియావత్తును కాదు. నిష్కల మగుటవలన నవయవియుగాదు. ఆత్మ అసంగ మగుటవలన ఆత్మకు దేనితోటియు సంయోగము కాని, సమవాయసంబంధము కాని సంభవింపదు. సుఖ దుఃఖాదు లాత్మధర్మములే యగుచో నిత్యత్వము, చైతన్యమువలె నెల్లప్పుడుపలభ్యమానత్వము యుండవలసి వచ్చును. కాన రాగద్వేషసుఖదుఃఖాదిధర్మములు కలది జన్మజరాదిధర్మములుకలది క్షేత్రమే యని సిద్ధము. కనుకనే శ్రీకృష్ణపరమాత్మయు "ఇచ్ఛా ద్వేష స్సుఖం'' అని యిచ్ఛాదులు క్షేత్రాంతర్గతములుగనే చెప్పెను.

భూతదుఃఖహేతుసజాతీయహేతువు ఉపలభ్యమానమైనచో "ఇదం మే మాఽభూత్" (ఇది నాకు ప్రాప్తింపకుండుగాక) అను చిత్తవృత్తి ద్వేష మనబడును. అట్లే ప్రసన్నత్వాత్మకమై యనుకూలమైనది సుఖమనబడును. ప్రతికూలాత్మకమైనది దుఃఖ మనబడును. దేహేంద్రియముల సంహతి సంఘాత మనబడును. అట్టి సంఘాతమునం దభివ్యక్తమైన యంతఃకరణవృత్తి యాత్మచైతన్యాభాసవిద్ధమై "చేతనా" అని అనబడును. ఏవృత్తిచే నవసాదప్రాప్తమైన దేహేంద్రియములు ధరింపబడునో అవృత్తి "ధృతి" అని యనబడును. ఇచ్ఛాదిగ్రహణము సంకల్పవికల్పాద్యంతఃకరణధర్మముల కుపలక్షణము. "కామ సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి రధృతి ర్హ్రీ ర్ధీ ర్భీ రిత్యేత త్సర్వం మన ఏవ" అనుశ్రుతి కామాదులు మనోవృత్తులే కాన మనస్స్వరూపములే యని బోధించుచున్నది. దీనివలన దేలిన యాశయమేమి? ఇచ్ఛాదులు జ్ఞేయములగుటవలనను, జ్ఞేయమైన యంతఃకరణముయొక్క ధర్మములుగ శ్రుతి ప్రతిపాదించుటచేతను, సర్వజ్ఞుడైన శ్రీకృష్ణపరమాత్మచే వైశేషికమతమహేయము (పరిత్యజింపదగినది) అని చెప్పబడెను. క్షేత్రనిరూపణమును "ఏత త్క్షేత్రం" అనుదానిచే నుపసంహరించుచుండెను. మహదాదివికారములతోడను, తద్వికారములైన యిచ్ఛాదులతోడను గూడిన యీక్షేత్రము సంక్షేపముగ చెప్పబడెను. ఏక్షేత్రభేదజాతముయొక్క సంహతి యీశరీరరూపమైన క్షేత్రమో, అట్టి మహదాదిభేదభిన్నమైన ధృత్యంత మగు క్షేత్రము విరక్తునకు జ్ఞానాధికారమునకైన వైరాగ్యము నిమిత్తము వ్యాఖ్యానింపబడెను. ॥౬॥

నీలకంఠీయము:— వికారజన్యమగు క్షేత్రము నీశ్లోకమున జెప్పుచుండెను— "ఇచ్ఛా" సుఖమునందుగాని, సుఖసాధనమునందుగాని కలుగు స్పృహారూపచిత్తవృత్తి. (ఇది నాకు కావలె నను చిత్తవృత్తి) ఇచ్ఛ యనబడును. ఇదియే కామమనియు, రాగమనియుగూడ చెప్పబడును. "ద్వేషః" దుఃఖము విషయమైగాని, దుఃఖహేతువు విషయమైగాని స్పృహావిరోధి యగు చిత్తవృత్తి ద్వేష మనబడును. సుఖదుఃఖములు ప్రసిద్ధములు. "సంఘాతః" "ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహు ర్మనీషిణః" అను శ్రుత్యుక్తరీతిని ఇంద్రియమనశ్చిదాత్మ లొకే విధముగనైన కలయికచే నైన భోక్త సంఘాత మనబడును. "చేతనా" నిరుక్తమగు బుద్ధియే "చేతన" యనబడును. ఇయ్యది శుద్ధమై సత్త్వమయమైనదిగాన దర్పణమువలె చిత్ప్రతిబింబమును గ్రహించును. తప్తాయోగోళకము స్వయముగ వహ్నిరూపము గాకపోయినను ఔపచారికముగ వహ్నిత్వము కలదిగా వ్యవహరింపబడుచున్నది. అట్లే యీచేతనయు స్వయముగ నచేతనమయ్యు చిత్ప్రతిబింబగ్రాహిణి యయి ఔపచారికచేతనాత్వమును పొందుచున్నది. ఈచేతనచే వ్యాప్తమగు స్థూలపిండముగూడ చేతనముగనే ప్రతీయమానమగుచున్నది. అట్టి యీచేతన మస్సంజ్ఞితమై యిచ్ఛాదిరూపముగ పరిణమించుచున్నది. ఈవిషయముననే "కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి రధృతి ర్హ్రీ ర్ధీ ర్భీ రిత్యేత త్సర్వం మన ఏవ" అను శ్రుతి కామాదులు మనోవృత్తిరూపము లని చెప్పుచున్నది. "ఏతత్......ఉదాహృతం" ఈయవ్యక్తమను క్షేత్రము మహదాదివికారముతోటియు, తద్వికారి యగు యిచ్ఛాదికముతోడను చెప్పబడెను.

అహంప్రత్యయములో విషయ మగు ఆత్మయే ఇచ్ఛాదిధర్మములు కలదని కాణాదు లందురు. సత్యమే. అట్టి యహంప్రత్యయవిషయమగు దానిని ముఖ్యాత్మగ మేము భావింపము; అట్టిది శుద్ధచిత్తునందు అభేదముగ నధ్యస్తమగుటచే ముఖ్యాత్మ కానేరదు. కాన క్షేత్రాంతర్గతమగు నట్టి యహమర్థము దృశ్యమగుటచే దాని ధర్మము లగు ఇచ్ఛాదులుగూడ దృశ్యములే యగును. అంతమాత్రమున మా కేమియు హాని లేదు. "అసంగో హ్యయం పురుషః" అనియు, "అన్యత్రేన హి ప్రత్యూఢా" అనియు నీశ్రుతులుగూడ శుద్ధచిదాత్మకు అసంగత్వమును, అహంకారమునకు అన్యతత్వమును చెప్పుచునే యున్నవి. ॥౬॥

గీ॥ అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః ॥ ॥౭॥

పదవిభాగము:— అమానిత్వం- అదంభిత్వం- అహింసా- క్షాన్తిః- ఆర్జవం- ఆచార్యోపాసనం- శౌచం- స్థైర్యం- ఆత్మవినిగ్రహః ॥ ॥౭॥

ప్రతిపదార్థము:— అమానిత్వం=మానియొక్క ధర్మము మానిత్వమనబడును. తనను కొనియాడుకొనుట, అది లేకపోవుట అమానిత్వము (1); అదంభిత్వం=తన ధర్మమును ప్రకటన జేయుట దంభిత్వము. అది లేకపోవుట అదంభిత్వము; (2); అహింసా=ప్రాణులను హింసించకపోవుట (3); క్షాన్తిః=పరునివలన నపరాధము ప్రాప్తించునపుడు వికారము లేకుండుట (4); ఆర్జవం=వక్రస్వభావము లేకుండుట (5); ఆచార్యోపాసనం=మోక్షసాధనముల నుపదేశించు గురువులను శుశ్రూషాదులచే సేవించుట (6); శౌచం=శరీరమలాదులను మృజ్జలములచే ప్రక్షాలనము, లోపల ప్రతిపక్షభావనచే మనస్సుయొక్క రాగాదులను పోగొట్టుకొనుట. (7); స్థైర్యం=స్థిరభావము (8); ఆత్మవినిగ్రహః=కార్యకరణసంఘాతముయొక్క వినిగ్రహము (9); ॥౭॥

శాంకరభాష్యమ్:—

క్షేత్రజ్ఞో వక్ష్యమాణవిశేషణో యస్య సప్రభావస్య క్షేత్రజ్ఞస్య పరిజ్ఞానా దమృతత్వం భవతి తం 'జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యా' మిత్యాదినా సవిశేషణం స్వయ మేవ వక్ష్యతి భగవా నధునా తు తద్జ్ఞానసాధనగణ మమానిత్వాదిలక్షణం యస్మి న్సతి తజ్జ్ఞేయవిజ్ఞానే యోగ్యోఽధికృతో భవతి యత్పర స్సంన్యాసీ జ్ఞాననిష్ఠ ఉచ్యతే, త మమానిత్వాదిగణం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

క్షేత్రజ్ఞుడు చెప్పబోవు విశేషణములు కలవాడు. ప్రభావముతోగూడిన యే క్షేత్రజ్ఞుని యొక్క పరిజ్ఞానమువలన అమృతత్వము సంభవించునో ఆ క్షేత్రజ్ఞుని "జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి" అనుదానిచే సవిశేషణముగ స్వయముగనే శ్రీకృష్ణపరమాత్మ చెప్పగలడు. ఇపుడు ఆ క్షేత్రజ్ఞజ్ఞానసాధనసముదాయముగు అమానిత్వాదికము యెవనియందుండునో యట్టివాడు జ్ఞేయ

—• ౧౩వ అధ్యాయము ౭ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు క్షేత్రమును చెప్పి తత్సాక్షి యగు క్షేత్రజ్ఞుని క్షేత్రముకంటె భిన్నునిగ విస్తారముగ చెప్పుటకొరకు, క్షేత్రజ్ఞజ్ఞానయోగ్యత్వముకొరకు అమానిత్వాది సాధనములను "జ్ఞేయం యత్తత్" అను శ్లోకమునకు పూర్వమునందున్నట్టి "అమానిత్వం" అను శ్లోకము మొదలుకొని అయిదుశ్లోకములచే జెప్పుచున్నాడు—

తనకున్నవిగాని, లేనివిగాని యగు గుణములచే తనను పొగడుకొనుట "మానిత్వము" అని అనబడును. తనను పొగడుకొనకపోవుట అమానిత్వ మనబడును. లాభనిమిత్తము, పూజానిమిత్తము, ఖ్యాతినిమిత్తము స్వధర్మ ప్రకటీకరణము "దంభిత్వము" అనబడును. అట్టి దంభిత్వము లేకపోవుట "అదంభిత్వము" అని అనబడును. వాక్కాయమనస్సులచే ప్రాణులను పీడించుట హింస యనబడును. అట్టి హింస లేకపోవుట "అహింస"

శాంకరభాష్యమ్:—

జ్ఞానసాధనత్వా జ్జ్ఞానశబ్దవాచ్యం విదధాతి భగవాన్— అమానిత్వం మానినో భావో మానిత్వమాత్మనః శ్లాఘనం తదభావోఽమానిత్వమ్ । అదంభిత్వం స్వధర్మప్రకటీకరణం దంభిత్వం తదభావోఽదంభిత్వమ్ । అహింసాఽహింసనం ప్రాణినా మపీడనమ్ । క్షాంతిః పరాపరాధప్రాప్తా వవిక్రియా । ఆర్జవ మృజుభావోఽవక్రత్వమ్ । ఆచార్యోపాసనం మోక్షసాధనో

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విజ్ఞానమునందు యోగ్యుడై యధికారి యగును. యత్నపరుడై, సంన్యాసియై జ్ఞాననిష్ఠుడని చెప్పబడునో అట్టి యమానిత్వాదిగణము జ్ఞానసాధన మగుటవలన జ్ఞానశబ్దవాచ్యముగ శ్రీకృష్ణపరమాత్మ నిర్దేశించుచుండెను. మానవంతుని ధర్మము మానిత్వ మనబడును. మానిత్వ మనగ ఆత్మశ్లాఘనము. అది లేకపోవుటయే అమానిత్వము. (1), నేనిట్టివాడను, గొప్పకార్యములను చేసినవాడను అని తన ధర్మములను ప్రకటించుటయే దంభిత్వము. అట్టి దంభిత్వము లేకపోవుటయే అదంభిత్వము. (2), ప్రాణులను పీడించకపోవుటయే అహింస. (3), పరునివలన నపరాధము ప్రాప్తించునపుడు విక్రియలేకపోవుటయే క్షాన్తి. (4), కుటిలస్వభావము లేక లేకపోవుటయే ఆర్జవము. (5), మోక్షసాధనముల నుపదేశించు యాచార్యునకు శుశ్రూషాదుల నొనరించుటచే సేవనము ఆచార్యోపాసనము (6), బాహ్యశరీరమునందుండు మలాదులను

అని యనబడును. చిత్తవికారహేతు వగు పరాపరాధము ప్రాప్తించినను "నిర్వికారచిత్తముకలవాడై, సహించుట 'క్షాంతి' యనబడును. కౌటిల్యము లేకపోవుట, అనగా మనస్సునందున్నది యున్నట్లు వ్యవహరించుట. అనగా పరులను వంచింపకపోవుటయే 'ఆర్జవము' అని చెప్పబడును. మోక్షసాధనము నుపదేశించువాడాచార్య డనిపించుకొనును. ఇంతియేకాని మనువు చెప్పినటుల యుపనయన మొనరించి వేదాధ్యయనము నొనరించినవాడు కాడు. అట్టి యాచార్యునకు శుశ్రూష, నమస్కారము చేయుచు సేవించుట "ఆచార్యోపాసనము" అని అనబడును, శరీరమలములను మృత్తుచేతను, జలముచేతను క్షాలన మొనరించుట "బాహ్యశౌచము" అని అనబడును. మనోమలము లగు రాగాదులను విషయదోషదర్శనరూపమైన ప్రతిపక్షముయొక్క భావనచే తొలగించుట "అభ్యంతరశౌచము" అని అనబడును. మొత్తము పై రెండును "శౌచ" మనబడును. మోక్షసాధనమునందు ప్రవృత్తునకు అనేకవిధములైన విఘ్నములు ప్రాప్తించినను, మోక్షసాధనమైన శ్రవణాదులను పరిత్యజింపక మాటిమాటికి మోక్షసాధనశ్రవణాదులయందు యత్నాధిక్యము "స్థైర్య" మనబడును. మోక్షప్రతిబంధియందు స్వభావప్రాప్తమైన దేహేంద్రియసంఘాతముయొక్క ప్రవృత్తిని నిరోధించి మోక్షసాధనమునందే వ్యవస్థాపనము "ఆత్మవినిగ్రహ" మనబడును. ॥౭॥

శంకరానందీయము:— ఇట్లు మహాభూతా న్యహంకారః" ఇత్యాదికముచే క్షేత్రస్వరూపమును నిరూపించి, క్షేత్రజ్ఞుని నిరూపింపవలసియుండ, క్షేత్రజ్ఞజ్ఞానము జ్ఞానసాధనములు లేనిదే సిద్ధింపదుగాన జిజ్ఞాసు వగు జ్ఞాననియతసాధనసంపత్తి కలవానికి క్షేత్రజ్ఞానము సులభమని తలచి మొదటనే ఆత్మజ్ఞానోత్పత్తిసాధనములను "అమానిత్వం" అను శ్లోకము మొదలుకొని అయిదుశ్లోకములచే చెప్పుచుండెను— ప్రతిష్ఠనిమిత్తమై తనయం దుత్కర్షారోపణహేతు వగు యుత్కృష్టత్వబుద్ధి "మాన" మనబడును. అట్టిది కలవాడు "మానీ" అనబడును. వాని ధర్మము, మానిత్వము. అట్టి మానిత్వము లేకపోవుటయే "అమానిత్వ" మనబడును. పైమానము జ్ఞానోత్పత్తి హేతు వగు చిత్తశుద్ధికి ప్రతిబంధకము. ఇట్లే దంభిత్వాదులుకూడ జ్ఞానోత్పత్తి

గీ॥ ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥ ॥౮॥

పదవిభాగము:— ఇన్ద్రియార్థేషు- వైరాగ్యం- అనహంకారః- ఏవ- చ- జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥

ప్రతిపదార్థము:— ఇన్ద్రియార్థేషు=శబ్దస్పర్శరూపరసగంధములయందు; దృష్టాదృష్టభోగములయందు; వైరాగ్యం=విరాగభావము(10); అనహంకారః=అహంకారము లేకపోవుట (11); జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనం=జన్మమృత్యుజరావ్యాధిదుఃఖములయందు దోషమును చూచుట. (12); ॥౮॥

శాంకరభాష్యమ్:—

పదేష్టు రాచార్యస్య శుశ్రూషాదిప్రయోగేణ సేవనమ్ । శౌచం కాయమలానాం మృజ్జలాభ్యాం ప్రక్షాలన మంతశ్చ మనసః ప్రతిపక్షభావనయా రాగాదిమలానా మపనయనం శౌచమ్ । స్థైర్యం స్థిరభావో మోక్షమార్గ ఏవ కృతాధ్యవసాయత్వమ్ । ఆత్మవినిగ్రహ ఆత్మనోఽపకారకస్యాఽఽత్మశబ్దవాచ్యస్య కార్యకరణసంఘాతస్య వినిగ్రహః స్వభావేన సర్వతః ప్రవృత్తస్య సన్మార్గ ఏవ నిరోధ ఆత్మవినిగ్రహః ॥ ॥౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మట్టి, జలము మొదలగు వాటిచే ప్రక్షాళనము, లోపల ప్రతిపక్షభావనచే ప్రాప్తించుమనస్సు యొక్క రాగాదిమలములను పోంగొట్టుకొనుటయే శౌచము (7), మోక్షమార్గమునందే చేయబడిన నిశ్చయము కలిగియుండుట స్థైర్యము (8), తన కపకారకమైన ఆత్మశబ్దవాచ్యమైన కార్యకరణసంఘాతము (శరీరేంద్రియసముదాయము) యొక్క వినిగ్రహము. అనగా స్వభావముచే నంతటప్రవృత్తమైన శరీరేంద్రియాదులను సన్మార్గమునందు నిరోధించుట ఆత్మవినిగ్రహము (9). ॥౭॥

హేతు వను చిత్తశుద్ధికి ప్రతిబంధకములు. కాన ముముక్షువు మానదంభిత్వాదులను విడువవలయును. వేష, భాషా, క్రియా, చాతుర్యాదులచే తన మహత్త్వప్రకటనము "దంభ" మనబడును. అట్టిది కలవాడై యుండుటయే "దంభిత్వ" మనబడును. అట్టిదంభము లేకపోవుట "అదంభిత్వ" మనబడును. మనోవాక్కాయకర్మలచే ప్రాణిపీడన మాచరింపకుండుట "అహింస" అనబడును. అట్టియహింస భూతదయైకలభ్యము. ఇది బ్రహ్మచర్యాదుల కుపలక్షణము. చింతావిలాపములు లేకుండగ ఆధ్యాత్మికాద్యుపద్రవములను సహించుట "క్షాంతి" యనబడును. స్వధర్మమునందు మనోవాక్కాయప్రవృత్తివలన నెల్లపు డేకరూపత్వము "ఆర్జవ" మనబడును. శ్రద్ధాభక్తులతో శుశ్రూషాదిక్రియచే జ్ఞానోపదేష్ట యగు నాచార్యునియొక్క యారాధనము "ఆచార్యోపాసన" మనబడును. శౌచము (శుద్ధి) బాహ్యమనియు, ఆభ్యంతరమనియు రెండు విధములు. మృజ్జలములచేతను, అస్పృశ్యస్పర్శనాదిపరిత్యాగముచేతను, అభక్ష్యభక్షణపరిత్యాగముచేతను, అగ్రాహ్యగ్రహణపరిత్యాగముచేతను, అగమ్యగమనపరిత్యాగముచేతను బాహ్యశౌచము ప్రాప్తించును. రాగ, ద్వేష, లోభ, మోహ, గర్వ, కాఠిన్యాదులకు ప్రతికూలములగు గుణముల నాశ్రయించుటచేనైన క్షాళనము "అభ్యంతరశౌచ" మనబడును. విషయధ్యానశ్రవణదర్శనాదులయందు విషయభోగవాసనాగ్రస్తమైన యంతఃకరణము యొక్క అత్యంతప్రవృత్తినిరోధము "ఆత్మవినిగ్రహ" మనబడును. నిగృహీతమైన మనస్సును నిశ్చలత్వముతో మోక్షేచ్ఛచేత శ్రవణాదులయందు స్థాపనము "స్థైర్య" మనబడును. ॥౭॥

శాంకరభాష్యమ్:—

కించ— ఇంద్రియార్థేషు శబ్దాదిషు దృష్టాదృష్టేషు భోగేషు విరాగభావో వైరాగ్యమ్ । అనహంకారోఽహంకారాభావ ఏవ చ । జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనం జన్మ చ మృత్యుశ్చ జరా చ వ్యాధయశ్చ దుఃఖాని చ తేషు జన్మాదిదుఃఖాంతేషు ప్రత్యేకం దోషానుదర్శనం, జన్మని గర్భవాసయోనిద్వారా నిఃసరణం దోషస్తస్యానుదర్శనమాలోచనం, తథా మృత్యౌ దోషానుదర్శనం, తథా జరాయాం ప్రజ్ఞాశక్తితేజోనిరోధదోషాను

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శబ్దస్పర్శరూపరసగంధరూపదృష్టాదృష్టభోగములయందు వైరాగ్యము (10), అహంకారము లేక పోవుట (11), జన్మమృత్యుజరావ్యాధిదుఃఖములయందు దోషానుదర్శనము. అనగా జన్మమునందు గర్భవాసముచే యోనిద్వారమున బయటపడుట దోషము. ఇట్టి దోషము కలది జన్మయని యాలోచనము, అట్లే మరణమునందు సర్వమర్మనికృన్తనము దోషము. అట్టి దోషముకలది మరణమని యాలోచనము. అట్లే ముదిమియందు ప్రజ్ఞాశక్తినిరోధము, తేజోనిరోధము, పరులు పరిభవించుట దోషములు. ముదిమియం దిట్టి దోషములు కలవని యాలోచిం

—• ౧౩ వ అధ్యాయము ౮ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "ఇన్ద్రియార్థేషు" దృష్టమైనవిగాని, శ్రుతములైనవిగాని యగు శబ్దాదిభోగములయందు అనురాగవిరోధి యగు అస్పృహాత్మకమైన చిత్తవృత్తియే వైరాగ్య మనబడును. ఆత్మశ్లాఘనము లేకున్నను మనస్సునందు ప్రాదుర్భూతమైన "నేను సర్వోత్కృష్టుడ" నను భావము గర్వము. (అహంకారము.) అట్టి యహంకారము లేకపోవుట "అనహంకార" మనబడును. ఏవకారము అన్యయోగవ్యవచ్ఛేదార్థకము. సముచ్చయార్థమున చకారమీ శ్లోకమునందు ప్రయుక్తము. ఈ చెప్పుటచే వింశతిసంఖ్యాకమైన అమానిత్వాదులచే సముచ్చితమైన యోగమే జ్ఞాన మని చెప్పబడెను. ఏదో యొకదానియొక్క యభావము కాదు. "జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్" గర్భవాస, యోనిద్వారనిస్సరణరూపమైన జన్మయొక్కయు, సర్వమర్మచ్ఛేదనరూపమైన మృత్యువుయొక్కయు, ప్రజ్ఞా, శక్తి, తేజోనిరోధస్వరూపము, పరపరిభవాదిరూపము నగు ముదిమియొక్కయు, జ్వర, అతిసారాదిరూపవ్యాధులయొక్కయు, ఇష్టవియోగ, అనిష్టసంయోగమువలన జనించినట్టియు, ఆధ్యాత్మ, ఆధిదైవ, ఆధిభూతనిమిత్తమైనట్టియు, దుఃఖములయొక్కయు వాతపిత్తశ్లేష్మములమూత్రాదులచే పరిపూర్ణమగుటచే శరీరజుగుప్సితత్వముయొక్కయు "అనుదర్శనం" తిరిగి తిరిగి యాలోచనము. లేక జన్మాదిదుఃఖాంతములయందు దోషానుదర్శనము. అనగా జన్మాదిదుఃఖాంతములు దోషములు అని తెలిసికొనుట. లేక జన్మాదివ్యాధ్యంతములయందు, ఇవి దుఃఖరూపదోషములు అని తెలిసికొనుట. ఇది విషయవైరాగ్యహేతువగుటచే నాత్మదర్శనమున కుపకరించును. ॥౮॥

శంకరానందీయము:— స్థైర్యసిద్ధికి సాధనమును "ఇన్ద్రియార్థేషు" అనువానిచే చెప్పుచుండెను— భోగ్యపదార్థములైన శబ్దాదులయందు, అట్టి శబ్దాదులు శ్రుతములైనను, దృష్టములైనను వానియందంతటను నిశ్శేషముగ నగు రాగపరిత్యాగమే వైరాగ్య మనబడును. ఇట్టి వైరాగ్యము మనోనిగ్రహమునందు, మనోనైశ్చల్యమునందు కారణము. యతి కిదియే లెస్సగ సంపాదింపదగినది. అట్లే "అనహంకార ఏవ చ" జాతివర్ణాశ్రమాచారవిద్యాకులశీలాదులచే "నేను శ్రేష్ఠుడను" అను అభిమాన మహంకార మనబడును. అహంకారహేతువులగు జాత్యాదు లున్నను "అవి బంధకములు" అను బుద్ధిచే తద్రహితత్వము అనహంకార మనబడును. ఇట్టి యనహంకారమే జ్ఞానసిద్ధియందు ముఖ్యకారణము. ఏవకారము నిశ్చయార్థకము. చకారము సముచ్చయార్థము. అంతటను వైరాగ్యము పుట్టుటయందును, వైరాగ్యకార్యము పుట్టుటయందును అనహం

శాంకరభాష్యమ్:—

దర్శనం పరిభూతతా చేతి। తథా వ్యాధిషు శిరోరోగాదిషు దోషానుదర్శనం, తథా దుఃఖేష్వధ్యాత్మాధిభూతాధిదైవనిమిత్తేషు। అథవా దుఃఖాన్యేవ దోషో దుఃఖదోష స్తస్య జన్మాదిషు పూర్వవదనుదర్శనమ్। దుఃఖం జన్మ దుఃఖం మృత్యుర్దుఃఖం జరా దుఃఖం వ్యాధయః। దుఃఖనిమిత్తత్వా జ్జన్మాదయో దుఃఖం న పునః స్వరూపేణైవ దుఃఖమితి। ఏవం జన్మాదిషు దుఃఖదోషానుదర్శనా ద్దేహేంద్రియవిషయభోగేషు వైరాగ్య ముపజాయతే, తతః ప్రత్యగాత్మని ప్రవృత్తిః కరణానా మాత్మదర్శనాయ। ఏవం జ్ఞానహేతుత్వా జ్జ్ఞాన ముచ్యతే జన్మాదిదుఃఖదోషానుదర్శనమ్॥ ॥౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చుట, అట్లే శిరోరోగాదులయందు దోషానుదర్శనము. అట్లే అధ్యాత్మాధిభూతాధిదైవనిమిత్తములైన దుఃఖములయందు దోషానుదర్శనము. లేక:— దుఃఖములనెడిదోషము. జన్మమృత్యుజరావ్యాధులయందు దుఃఖరూపమగు దోషముయొక్క సమాలోచనము. అనగా జన్మ దుఃఖము, మృత్యువుదుఃఖము, ముసలితనముదుఃఖము, వ్యాధులు దుఃఖము అని సమాలోచనము. జన్మాదులు స్వరూపముచే దుఃఖములు కావు. అయినను దుఃఖనిమిత్తము లగుటవలన దుఃఖరూపము లనబడును (12), ఇట్లు జన్మాదులయందు దుఃఖదోషానుదర్శనమువలన దేహేంద్రియ విషయభోగములయందు వైరాగ్యము జనించును. అట్టి వైరాగ్యమువలన ఆత్మదర్శనము కొరకు కరణములకు (ఇంద్రియములకు) ప్రత్యగాత్మయందు ప్రవృత్తి కలుగును. ఇట్లు జ్ఞానహేతువు లగుటవలన పైగుణములు జ్ఞాన మనబడును. ॥౮॥

కారము పరమ కారణము. "జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్" జన్మమునందు, మరణమునందు, ముదిమియందు, వ్యాధులయందు శాస్త్రమును, స్వానుభవమును అనుసరించి దుఃఖముయొక్క, దోషముయొక్క సమాలోచనము. జన్మపదముచే జన్మకు సన్నిహితమైన గర్భవాసముకూడ గ్రహింపనగును. మాతృగర్భమునందు తొమ్మిదిమాసములు ముద్దయై యుండుట, మలమందుండు కృములచే కొరకబడుట, మాతృజఠరాగ్ని దాహము, తల్లి సంబంధమైన విషమశయనగమనాదులచే సంఘట్టనము, సుదృఢజరాయువేష్టనము, వీటిచే మహద్దుఃఖము, మలమూత్రమధ్యయందుండుట, తద్రసపానమున దోషము. జన్మయందు ప్రబలవాయువుచే కర్షణము (లాగబడుట) యోనియంత్రనిష్పీడనము మహద్దుఃఖము. యోనియంత్రద్వారమున బయలువెడలుట దోషము, మరణమునందు సర్వనాడులయాకర్షణము, మర్మకృంతనము (మర్మచ్ఛేదనము) ప్రాణములుముడుచుకొనుట, ఊర్ధ్వశ్వాస, మరణతాపముమహద్దుఃఖము, యామ్యాకర్షణచేతనగు వ్యథచే మలజలపాతాదికము దోషము. మృత్యుపదముచే తత్సన్నికృష్టమైన నరకవాసము గ్రహింపనగును. కుంభీపాక, కౌరవ, అసిపత్రవన, వైతరణ్యాదులయందు యమభటులు పారవేయుట మహద్దుఃఖము. శ్లేష్మ, రక్త, పూయ, రేతో, మల, మూత్రహ్రదములయందు వాసము మహద్దుఃఖము. శ్లేష్మాదిపానము దోషము. ముదిమియందు సర్వగాత్రశైథిల్యము, మాంద్యము, బాధిర్యము, గద్గదవాక్కు, కంపాదికము, లేచునపుడు పతనముచే. నగుస్వజనపరిభవము మహద్దుఃఖము. మలజలలాలాపాతము దోషము. వ్యాధులయందు దౌర్బల్యము, శీతజ్వరాదివేగపరితాపాదికము, కషాయపానాదికము మహద్దుఃఖము. దేహదౌర్గంధ్యము, స్వేదాదికము దోషము. ఇట్లే జన్మాదులయందు మాటిమాటికి దుఃఖ, దోషానుదర్శనముచే పుణ్యశీలుడైన వివేకికి అంతటను తీవ్రముగ వైరాగ్యము, మోక్షేచ్ఛ, కల్గి తత్సిద్ధికై ప్రవృత్తి సిద్ధించును. కాన నేతద్దర్శనము ముముక్షువునకు లెస్సగ చేయదగినది. ॥౮॥

గీ॥ అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు ॥ ॥౯॥

ప ద వి భా గ ము:— అసక్తిః- అనభిష్వంగః- పుత్రదారగృహాదిషు- నిత్యం- చ- సమచిత్తత్వం- ఇష్టానిష్టోపపత్తిషు ॥ ॥౯॥

ప్ర తి ప దా ర్థ ము:— పుత్రదారగృహాదిషు=పుత్రదారగృహాదులయందు; అసక్తిః=సంగనిమిత్తమైన విషయములయందు ప్రీతిమాత్రము లేకుండుట(13); అనభిష్వంగః=అనన్యాత్మభావనారూపమైన సక్తివిశేషము లేకుండుట(14); ఇష్టానిష్టోపపత్తిషు=ఇష్టానిష్టములు ప్రాప్తించుటయందు; నిత్యం=నిత్యము; సమచిత్త్వం చ=సమానమైన చిత్తముకలవాడై యుండుట (15). ॥౯॥

శాంకరభాష్యమ్.—

కించ—అసక్తిః సక్తిః సంగనిమిత్తేషు విషయేషు ప్రీతిమాత్రం తదభావోఽసక్తిః। అనభిష్వంగోఽభిష్వంగాభావోఽభిష్వంగో నామ సక్తివిశేష ఏవానన్యాత్మభావనాలక్షణః। యథాఽన్యస్మిన్ సుఖిని దుఃఖిని వాఽహమేవ సుఖీ దుఃఖీ చ; జీవతి మృతే వాఽహమేవ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సంగనిమిత్తమైన విషయములయందు ప్రీతిమాత్రము సక్తి యనబడును. పుత్రదారగృహాదులయం దట్టి సక్తి లేకపోవుట(16). అనన్యాత్మభావనారూపమైన సక్తివిశేషమే అభిష్వంగమనబడును. అదియెట్లనిన? పుత్రదారగృహాదులు సుఖవంతులైనచో నేనే సుఖవంతుడను,

—• ౧౩ వ అధ్యాయము ౯ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మ ధు సూ ద న స ర స్వ తీ య ము:— మరియు "ఇది నాది" అని యింతమాత్రముచే నగు ప్రీతి సక్తి యని యనుపించుకొనును. అట్టి ప్రీతి లేకపోవుటయే అసక్తి యని యనుపించుకొనును. "ఇది, నేను" యని యనన్యత్వభావనచే ప్రీత్యతిశయము "అభిష్వంగ" మనబడును. లేక, ఇతరుడు సుఖము కలవాడైనను, దుఃఖము కలవాడైనను "నేనే సుఖిని, నేనే దుఃఖిని" అను భావన "అభిష్వంగ" మనబడును. తద్రాహిత్య మనభిష్వంగ" మనబడును. యెచట సక్త్యభిష్వంగములు విడవవలయు ననెదవా? "పుత్రదారగృహాదిషు" పుత్రులయందు, భార్యయందు, గృహాదులయందు ఆదిపదవముల స్నేహపాత్రులైన యితరులగు నిఖిలభృత్యాదుల యందును అసక్తి, అనభిష్వంగము చేయదగును. ఇష్టము ప్రాప్తించినపుడు హర్షము లేకుండుట, అనిష్టము ప్రాప్తించినపుడు విషాదము లేకుండుటయే సమచిత్తత్వము. ఇట్టి సమచిత్తత్వము ముముక్షువుచే సంపాదనీయము. చకారము సముచ్చాయకము. ॥౯॥

శ ం క రా న ం దీ య ము:— జన్మాదులయందు దుఃఖదోషదర్శనమునకు ఫలమును "అసక్తిః" అనుదానిచే జెప్పుచుండెను.

భోగములయం దంతఃకరణమునకగు రాగము సక్తి యనబడును. అట్టి సక్తి లేకపోవుట "అసక్తి" అనబడును. అనగా భోగములయం దంతఃకరణ కనురాగము లేకుండుట. అప్రాప్తమైనదానియందువలె ప్రాప్తమైన విషయమునందెల్ల ప్రీతిరాహిత్యము "అసక్తిః" అను శబ్దముయొక్క యర్థము. "ఇది మంచిది" అను బుద్ధిచేతను, మమత్వముచేతను యెల్లపుడు ఇష్టమైన విషయము నాలింగనము చేసుకొను చిత్తముయొక్క యవస్థానము "అభిష్వంగము" అని అనబడును. అది లేకపోవుట "అనభిష్వంగ" మనబడును. ముముక్షువులు

శాంకరభాష్యమ్:—

జీవామి మరిష్యామి చేతి । క్వేత్యాహ- పుత్రదారగృహాదిషు । పుత్రేషు దారేషు గృహేష్వాదిగ్రహణా దన్యేష్వ ప్యత్యంతేషు దాసవర్గాదిషు । తచ్చోభయం జ్ఞానార్థత్వాత్ జ్ఞాన

శాంకరభాష్యతత్త్వబోధని:—

దుఃఖము కలవారగుచో నేనే దుఃఖముకలవాడను, జీవించినచో నేనే జీవించినవాడను, మృతులైనచో నేనే మృతుడనుఅనునదియే అనన్యభావనారూపమైన సక్తివిశేషము. ఇట్టి సక్తివిశేషము లేకుండుట. ఆదిపదమువలన నత్యంతప్రియమైన దాసవర్గాములయందు సక్తిలేక

దీనిని తప్పక సంపాదింపవలయును. ఈయనభిష్వంగ మెచట సంపాదింపదగిన దనెదవా? "పుత్రదారగృహాదిషు" పుత్రదారగృహాదులయం దివి మంచివి యను సమీచీనత్వబుద్ధిచే నగు మమ కారముతో నెల్లపుడు వాటిని కౌగలించుకొని మనస్సునుస్థాపనచేయుట యను యభిష్వంగమును ముముక్షువు విడువవలెను.

"పుత్రదారగృహాదులయం నభిష్వంగము" అనిచెప్పుటచే గృహస్థులకే శ్రవణాదులయం దధికారము; యతులకు కాని, యితరులకు కాని శ్రవణాదులయం దధికారము లేదు. యతులే యధికారు లగువో పుత్రాదులయం దభిష్వంగము కలదని వ్యతిరేకముగ నిషేధించుట సంభవింపదు. ప్రసక్తమైనదానినే నిషేధింపవలయును. అప్రసక్తమైనదానికి నిషేధము సంభవింపదు. అగ్నిపానము యెచటను ప్రసక్తము కాదు. అట్టి యప్రసక్తాగ్నిపానమును "నాగ్నిం పిబేత్" అగ్నిని పానము చేయరా దని నిషేధము ప్రాప్తింపదు. అట్లగువో నప్రసక్తప్రతిషేధరూపదోషము ప్రాప్తించును. ప్రస్తుతము యతులకు పుత్రదారగృహాదులే లేనపుడు యతులు పుత్రదారగృహాదులయం దభిష్వంగము చేయరాదని నిషేధము సంభవింపదు. మరి యీనిషేధ మెవరి కనిన? యెవరికి పుత్రదారగృహాదులయం దభిష్వంగము ప్రాప్తించునో వారికేయీనిషేధము. ఎవరికి పుత్రదారగృహాదులయం దభిష్వంగము ప్రాప్తించు నందువా? గృహస్థులకు పుత్రదారగృహాదు లుండుటవలన వారలకే పుత్రదారగృహాదులయందభిష్వంగము ప్రాప్తించును. కాన జిజ్ఞాసువులైన వారలకే పుత్రదారగృహాదులయం దభిష్వంగమును విడువవలయు నని నిషేధము సంభవము. ప్రసక్తప్రతిషేధబలము వలన గృహస్థులకే శ్రవణాధికారము. యతులకు కాని, యితరులకు కాని శ్రవణాధికారము లేదు. అని శంకింప జనదు.

ఈవిషయమున నీవడవదగినవాడవు. ఏమనిన? గృహస్థులకు వేదాంతశ్రవణము మోక్షముకొరకా! లేక, అక్షరలాభముకొరకా? లేక విలాసార్థమా? "సంన్యస్య శ్రవణం కుర్యాత్" అను శ్రుతి సంన్యాసమునకు శ్రవణాంగత్వమును బోధించుచున్నది. "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను బ్రహ్మసూత్రమునందుండు "అథ" అను శబ్దము సంన్యాసాదిసాధనసిద్ధ్యనంతరమునందే బ్రహ్మజిజ్ఞాస చేయ నగు నని బోధించుచున్నది. అందువలన సంన్యాసాద్యంతరంగసాధనములు లేని గృహస్థులకే శ్రవణమునం దనధికారము. మోక్షేచ్ఛచే సన్న్యస్తసర్వకర్మతత్సాధనములు కలవారగు యతులకు శ్రవణానధికారము కాదు. బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము వేదాంతశ్రవణాదులచే గలుగును. పరమహంస యను యతి సంన్యాసరూపాంతరంగసాధనము కలవాడు కాన నట్టి యతికే శ్రవణమునందు ముఖ్యాధికారము. గార్హస్థ్యనిష్ఠునకు కాదు. సంన్యాసాద్యంతరంగాంగశూన్యులచే వేదాంతశ్రవణము చేయబడినను, అట్టివారలకు జ్ఞానము జనింపదు. అందువలన పరమహంసలగు యతులకే శ్రవణాధికారము, జ్ఞాన, తత్ఫలప్రాప్త్యధికారము అని సిద్ధించుచున్నది. "వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః సంన్యాసయోగా ద్యతయః శుద్ధసత్త్వాః । తే బ్రహ్మలోకే తు పరాన్తకాలే పరామృతాః పరి-

గీ॥ మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ ।
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది ॥ ॥౧౦॥

పదవిభాగము:— మయి- చ- అనన్యయోగేన- భక్తిః- అవ్యభిచారిణీ- వివిక్తదేశసేవిత్వం- అరతిః- జనసంసది. ॥౧౦॥

ప్రతిపదార్థము:— మయిచ=ఈశ్వరునియందు; అనన్యయోగేన= భగవంతుడగు వాసుదేవుని కంటె యితరమైన వారెవరునులేరు. ఆవాసుదేవుడే నాకు గతియనెడి నిశ్చితమైన యవ్యభిచారియగు బుద్ధియే అనన్యయోగ మనబడును. అట్టి యనన్యయోగముచే; అవ్యభిచారిణీ=వ్యభిచారి కాని; భక్తిః=భజనము; (19). వివిక్తదేశసేవిత్వం=స్వభావమువలన కాని, సంస్కారము వలన కాని అపవిత్రవస్తువులతోటి, సర్పవ్యాఘ్రములతోటి రహితమైన ప్రదేశమును సేవించుట. (20), జనసంసది=సంస్కారము లేనట్టి యవినీతులైన ప్రాకృత జనుల సమావేశమునందు: అరతిః=ప్రీతిలేకపోవుట (21). ॥౧౦॥

శాంకరభాష్యమ్:—

పత్తిషు న హృష్యతి న కుప్యతి చాఽనిష్టోపపత్తిషు । త చ్చైత న్నిత్యం సమచిత్తత్వం జ్ఞానమ్ ॥ ॥౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మింపకుండుట, అనిష్టము ప్రాప్తించినపుడు కోపింపకుండుట. ఇట్టి సమచిత్తత్వము జ్ఞాన మనబడును, (18). ॥౯॥

శ్రవణము జన్మాంతరాధికారసంపాదనద్వారా సార్థక మగును గాన గృహస్థులుగూడ యనధికారులైనను వేదాంతశ్రవణము సద్గురువలన నొనరించి జన్మాంతరమునం దధికారు లగుదురు గాక. ॥౯॥

పరమార్థప్రపః:— పుత్రాదులయందు ప్రీతిపరిత్యాగము, పుత్రదారగృహాదిగతసుఖదుఃఖములను తనయం దారోపించుకొనుట "అభిష్వంగ" మనబడును. అట్టి యభిష్వంగము లేకుండుట. ఈవిషయమునే శతపథశ్రుతియు "ఆత్మైవేద మగ్ర ఆసీ దేక ఏవ సోఽకామయత జాయా మే స్యా దథ ప్రజాయేయాథ విత్తం మే స్యా దథ కర్మ కుర్వీయే త్యేతావా న్వై కామో నేచ్ఛంశ్చ నాతో భూయో విన్దేత్" "అగ్రే" పరోవస్థను పూర్వమునందు "ఇదం" ఈయాత్మ "ఆత్మైవాసీత్" దేహమాత్రముగ "ఏక ఏవ" ఒక్కటియే, "ఆసీత్" ఆయెను. "సః" ఆఆత్మ "జాయామేస్యాదితి" నాకు భార్య ప్రాప్తించుగాక యని "అకామయత" కోరెను. "అథ" అనంతరమున "ప్రజాయేయ" సంతతిరూపమున "స్యామితి" కాగలనని "అకామయత" కోరెను. "అథ" అనంతరమున "మే విత్తం స్యా దిత్యకామయత" నాకు ద్రవ్యము ప్రాప్తించుగాక యని కోరెను. అందునిమిత్తము "కర్మ కుర్వీయేతి" కర్మను చేయగల నని కోరెను. "ఏతావాన్వై" ఇంతమాత్రమైన "కామః" కోరిక "నేచ్ఛన్" పరిణామమునందు దుఃఖరూపమగుటవలన మంచిది కాదు. "నాతో భూయో విన్దేత్" జాయాదిప్రపంచముకంటె గొప్పదైన మరియొకదానిని బాహ్య గార్హస్థ్యముచే మోహితుడగుటవలన యెరుగడు. అనంతరము ఏతదపేక్షచే గార్హస్థ్యము శ్రేయస్సు అని శ్రుతి చెప్పినది. అట్టి గార్హస్థ్యమునం దభిష్వంగము లేకపోవుట. అట్లే ఇష్టానిష్టోపపత్తులయందు సర్వదా సమచిత్తత్వము. ॥౯॥

శాంకరభాష్యమ్:—

ముచ్యతే । నిత్యం చ సమచిత్తత్వం తుల్యచిత్తతా, క్వ? ఇష్టానిష్టోపపత్తిషు, ఇష్టానా మనిష్టానాం చోపపత్తయః సంప్రాప్తయ స్తా స్విష్టానిష్టోపపత్తిషు నిత్యమేవ తుల్యచిత్తతా, ఇష్టోప

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పోవుట(17). పైరెండుగుణములు జ్ఞానార్థములగుటవలన జ్ఞాన మనబడును. ఇష్టానిష్టములు ప్రాప్తించినపుడు సమమైన చిత్తము కలిగియుండుట అనగా ఇష్టము ప్రాప్తించినపుడు సంతో

ముచ్యన్తి సర్వే" అను శ్రుతియు బోధించుచున్నది. కాన మోక్షముకొరకు గృహస్థులకు వేదాంతశ్రవణమను మొదటి పక్షము నిరస్తము. నిరంతరము చిత్తవిక్షేపము కల సంసారులకు యథాశక్తిగ నక్షరలాభము సిద్ధింపనందున గృహస్థుల కక్షరలాభార్థము వేదాంతశ్రవణ మను రెండవపక్షము నిరస్తము. కావ్యనాటకాదులవలె వేదాంతములయందు చమత్కారము లేనందున గృహస్థులకు వేదాంతశ్రవణము విలాసార్థము" అను మూడవ పక్షము తొలిగింపబడెను. అందువలన యతులకే శ్రవణమునం దధికార మని సిద్ధము.

మోక్షేచ్ఛచే సంన్యస్తసర్వకర్ములు కల యతులే శ్రవణాధికారు లగుచో "పుత్రదారగృహాదులయం దభిష్వంగము చేయరాదు" అను నిషేధవచనమున కానర్థక్యము ప్రాప్తించు నని శంకింపజనదు. యతులకు కూడ పూర్వవాసనచే పుత్రదారగృహాదులు విడువబడినను అభిష్వంగము జనించును. అట్టి యభిష్వంగమును వారలు చేయరాదని నిషేధము ప్రాప్తించును. కాన నావాక్యమున కానర్థక్యము లేదు. "మనసో వశే సర్వమిదం బభూవ" "భీష్మో హి దేవ స్సహసా సహీయాన్" "బన్ధాయ విషయాసక్తమ్" "ప్రమాథి బలవద్దృఢం" "ధ్యాయతో విషయా న్పుంస స్సంగ స్తేషూపజాయతే" "విద్ధ్యేన మిహ వైరిణం" "జ్ఞానినో నిత్యవైరిణా" అని కామసంకల్పాదులు కల యనాదిదుర్వాసనావాసితాంతఃకరణ కల వానికి దుర్ధర్షత్వము, దుర్నిగ్రహత్వము, బంధకత్వము, విషయస్మృతిమాత్రముచే అనర్థకారిత్వము జ్ఞానులయందు బద్ధవైరిత్వము శ్రుతిస్మృతిసిద్ధము. కాన పుత్రదారగృహాదులు పరిత్యక్తములైనను సంన్యాసులకుకూడ పూర్వవాసనచే పుత్రదారాదిశ్రవణాదులచే యొకానొకప్పుడు పుత్రదారాదులయం దభిష్వంగము ప్రాప్తింపవచ్చును. తుచ్ఛము లున్నను కౌపీనకంథాదులయం దిది మంచిది. ఇది చెడుది అనుసక్తి సంభవించినట్లు పుత్రదారగృహాదులయందు సక్తి సంభవింపవచ్చును. కాన నోయతులారా! మీరట్టి యభిష్వంగమును ప్రమాదముచేనైన చేయరాదని వ్యతిరేకముఖమున "అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు" అని శ్రీకృష్ణపరమాత్మ యుపదేశించుచుండెను. గృహస్థులే శ్రవణాధికారు లగుచో నీవిశేషణము వ్యర్థ మగును. అవిశేషణ మేది యనిన? "నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు" అను విశేషణ మని గ్రహింపుము. ఎందువలననిన? ఇష్టము సుఖము తత్సాధనము, అనిష్టము, దుఃఖము, తత్సాధనము, అవి ప్రాప్తించినపుడు యెల్లపుడు అవిక్రియాత్మస్వరూపముచే స్థితి సంసారులకు సంభవింపదు. పుత్రు డుత్పన్నమైనపుడు సంతోషము, తన్మరణమునందు విషాదము యెవరిచే వారించుటకు శక్యము? యెవరికిని శక్యము కాదు. కాన గృహస్థులకు శ్రవణమునం దధికారము లేదని సిద్ధము. ॥౯॥

స్వాభిప్రాయము—

పైవ్యాఖ్యవలన సంసారులకు శ్రవణాధికారము లేదని సిద్ధమైనను "అనధికారికృతవేదాన్తశ్రవణం జన్మాంతరేఽధికారిత్వసంపాదనా యోపయుజ్యతే" అనధికారిచే నొనరింపబడిన వేదాంతశ్రవణము జన్మాంతరమునందధికారిత్వసంపాదక మగు నను యప్పయ్యదీక్షితవాక్యానుసారము అనధికారికృతవేదాంత

శాంకరభాష్యమ్:—

కించ. — మయి చేశ్వరేఽనన్యయోగే నాపృథక్సమాధినా నాన్యో భగవతో వాసుదేవా త్పరోఽ స్త్యతః స ఏవ నో గతి రిత్యేవం నిశ్చితాఽవ్యభిచారిణీ బుద్ధి రనన్యయోగ స్తేన భజనం భక్తి ర్న వ్యభిచరణశీలాఽవ్యభిచారిణీ । సా చ జ్ఞానమ్ । వివిక్తదేశసేవిత్వం వివిక్తః స్వభావతః సంస్కారేణ వాఽశుచ్యాదిభిః సర్పవ్యాఘ్రాదిభిశ్చ రహితోఽరణ్యనదీపులినదేవగృహాదిభి ర్వివిక్తో దేశ స్తం సేవితుం శీల మస్యేతి వివిక్తదేశసేవీ తద్భావో వివిక్తదేశసేవిత్వమ్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు ఈశ్వరునియందు "భగవంతుడగు వాసుదేవునికంటె యితరదైవ మెవడును లేడు. అందువలన ఆ వాసుదేవుడే నాకు గతి" అను నిట్టి నిశ్చితమైన యవ్యభిచారియగు బుద్ధిచే నవ్యభిచారియగు భక్తియు (భజనము (19), స్వభావముచేతను గాని, సంస్కారముచేతను గాని అపవిత్రవస్తువులతో. రహితము, సర్పవ్యాఘ్రభల్లూకాది రహితము నగు ప్రదేశమును సేవించుట (20). వివిక్తదేశములయందు చిత్తము ప్రసన్నమగును. అందువలన ఆత్మాదిభావన

— • ౧౩ వ అధ్యాయము ౧౦ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు • —

మధుసూదనసరస్వతీయము:— భగవత్స్వరూపమైన, వాసుదేవుడనగు, పరమేశ్వర స్వరూపమునందు 'భగవంతుడగు వాసుదేవునికంటె మరియొకడు లేడు. కాన వాసుదేవుడే నాకు గతి' యను నిశ్చయముచే యేప్రతికూలమైన కారణముచే మరలించుట కశక్యమైన భగవంతుడగు వాసుదేవుడే సర్వోత్కృష్టుడను జ్ఞానపూర్వకమైన భక్తియు, (ప్రీతియు) జ్ఞాన హేతువు. ఈవిషయమునే "ప్రీతి ర్న యావన్మయి వాసుదేవే న ముచ్యతే దేహయోగేన తావత్" అను వాక్యము బోధించుచున్నది. స్వభావమువలన కాని, సంస్కారమువలన కాని శుద్ధమైన సర్పవ్యాఘ్రాదివిరహితమైన గంగాదిపులినాదికము చిత్తప్రసాదకరమైన దేశము. అట్టి దేశమును సేవించియుండుట, ఈవిషయమునే "సమే శుచౌ శర్కరావహ్నివాలుకావివర్జితే శబ్దజలాశ్రయాదిభిః । మనోనుకూలే న తు చక్షుపీడనే గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్" అను శ్రుతియు బోధించుచున్నది. విషయభోగలంపటత్వము నుపదేశించు యాత్మజ్ఞానవిముఖులగు జనముయొక్క తత్త్వజ్ఞానప్రతికూల సమూహమునందు అరతియు, తత్త్వజ్ఞానానుకూలసభయందు రతి యుచితమే. ఈవిషయమే "సంగ స్సర్వాత్మనా హేయ స్స చేత్త్యక్తుం న శక్యతే । స సద్భి స్సహ కర్తవ్య స్సతాం సంగో హి భేషజమ్" సర్వాత్మనా యెవరితోడను సాంగత్యము చేయరాదు. అట్లు సాంగత్యము విడుచుటకు శక్యము కానిచో సత్పురుషులతోడనే సాంగత్యము చేయవలెను. సత్సాంగత్యము మానవులకు భవరోగ భేషజము అని చెప్పబడెను. ॥౧౦॥

శంకరానందీయము:— మరియు నాకు పరమేశ్వరునికంటె వేరే శరణ లేదను భక్తియోగముచే సర్వాత్మ, సర్వలోకశరణ్యము, సర్వేశ్వరుడనగు నాయందు భక్తి (నియతమైన భజనము) జ్ఞానసాధనము. మత్ప్రసాదనము. జ్ఞానము మత్ప్రసాదైకలభ్యమగుటవలన నట్టి భక్తివలన నా యనుగ్రహము కలుగును. అట్టి యనుగ్రహమువలన జ్ఞానము కలుగును. కాన భక్తి జ్ఞానసాధన మగుటవలన ముముక్షువు మదేకశరణుడై, యెల్లపుడు నాభజనమునే చేయతగును.

గీ॥ అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।
ఏత జ్జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా ॥ ॥౧౧॥

పదవిభాగము:— అధ్యాత్మజ్ఞాననిత్యత్వం- తత్త్వజ్ఞానార్థదర్శనమ్- ఏతత్- జ్ఞానం- ఇతి- ప్రోక్తం- అజ్ఞానం- యత్- అతః- అన్యథా ॥ ॥౧౧॥

ప్రతిపదార్థము:— అధ్యాత్మజ్ఞాననిత్యత్వం=ఆత్మాదివిషయకజ్ఞానమునందు నిత్యముండుట (22); తత్త్వజ్ఞానార్థదర్శనం=జ్ఞానసాధనములగు అమానిత్వాదుల భావనాపరిపాకమువలన జనించిన తత్త్వజ్ఞానమునకు ప్రయోజనమైన సంసారోపరమముయొక్క సమాలోచనము. (23); ఏతత్=ఈఅమానిత్వము మొదలు తత్త్వజ్ఞానార్థదర్శనాంత మిరువది గుణములు; జ్ఞానం=జ్ఞానమని; ప్రోక్తం=చెప్పబడును.; అతః=ఈయమానిత్వాదులకంటె; అన్యథా=యితరమైన; యత్=ఏమానిత్వము, దంభిత్వము, హింసమొదలుగునవి కలవో; తత్=అవన్నియు; అజ్ఞానం=అజ్ఞానమనబడును. ॥౧౧॥

శాంకరభాష్యమ్:—

వివిక్తేషు హి దేశేషు చిత్తం ప్రసీదతి యత స్తత ఆత్మాదిభావనా వివిక్త ఉపజాయతేఽతో వివిక్తదేశసేవిత్వం జ్ఞాన ముచ్యతే । అరతి రరమణం జనసంసది జనానాం ప్రాకృతానాం సంస్కారశూన్యానా మవినీతానాం సంస త్సమవాయో జనసంప న్న సంస్కారవతాం వినీతానాం సంస త్తస్యా జ్ఞానోపకారకత్వా దతః ప్రాకృతజనసంస ద్యరతి ర్జ్ఞానార్థత్వా జ్జ్ఞానమ్ ॥ ॥౧౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వివిక్తదేశమునందు జనించును. కాన వివిక్తదేశసేవిత్వము జ్ఞానమని చెప్పబడుచున్నది. సత్సంస్కారములేని యవినీతులైన ప్రాకృతజనుల సమావేశములందు ప్రీతి లేకపోవుట. (21), సత్సంస్కారవంతులగు వినీతుల సభయం దరతికాదు. వినీతులగు సంస్కారవంతుల సమావేశములు జ్ఞానోపకారకములు. అందువలన ప్రాకృతజనసభయం దరతి (ప్రీతి లేకపోవుట) జ్ఞాన నిమిత్తమగుటవలన జ్ఞానమనబడును. ॥౧౦॥

టీక:— "వివిక్తదేశసేవిత్వం" అను వాక్యసామర్థ్యమువలన "అనన్యయోగేన" విజాతీయప్రత్యయశూన్యమైన, సజాతీయప్రత్యయప్రవాహరూపమైన, ధ్యానముచే నిర్విశేషపరబ్రహ్మమును విషయముగ జేసుకొని "బ్రహ్మైవాహం, అహ మేవ బ్రహ్మ" అను అనుసంధానము సర్వదా చేయుదగినది. అట్టి యనుసంధానము జీవబ్రహ్మైక్యజ్ఞానమునకు అప్రతిబంధకత్వసిద్ధి కారణ మగుటవలన జ్ఞాన మనబడును. మరియు:— జన్మసమ్మర్దాదిరహితమైన నదీపులిన, గిరిగుహార, ఆరామ, అరణ్యాదిరూపమైన యేకాంతప్రదేశములను నిజధ్యానసిద్ధినిమిత్తము సేవించు స్వభావముకలవా డగుట. ఈవిషయమునే "శూన్యాగార, దేవతాగృహ, తృణకూట, వల్మీక, వృక్షమూల, కులాలశాల, అగ్నిహోత్ర, నదీపులిన, గిరిగుహార, కర్దర, కోటర, నిర్ఝర, స్థండిలేషు, తేష్వనికేతవాసీ" అను శ్రుతియు బోధించుచున్నది. అట్టి వివిక్తదేశసేవిత్వము, బహిర్ముఖులైన జనుల సభయం దరతి (అప్రీతి)యు. ॥౧౦॥

శాంకరభాష్యమ్:—

కించ — అధ్యాత్మజ్ఞాననిత్యత్వ మాత్మాదివిషయం జ్ఞాన మధ్యాత్మజ్ఞానం, తస్మి న్నిత్యభావో నిత్యత్వ మమానిత్వాదీనాం జ్ఞానసాధనానాం భావనాపరిపాకనిమిత్తం తత్త్వజ్ఞానం,

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు ఆత్మవిషయకమైన జ్ఞానము అధ్యాత్మజ్ఞాన మనబడును. అట్టి జ్ఞానమునందు నిత్యముండుట నిత్యత్వము. (22) జ్ఞానసాధనములైన అమానిత్వాదులయొక్క భావనా పరిపాకమువలన జనించిన తత్త్వజ్ఞానముయొక్క ప్రయోజనమగు సంసారోపరమవిషయక సమాలోచనము. * (20), తత్త్వజ్ఞానము నాలోచించుచో తత్సాధనానుష్ఠానమునందు ప్రవృత్తి

—• ౧౩ వ అధ్యాయము ౧౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మరియు ఆత్మ నుద్దేశించి ప్రవృత్తమైన ఆత్మానాత్మ వివేకజ్ఞాన "మధ్యాత్మజ్ఞాన" మనబడును. అట్టి యాత్మానాత్మవివేకమునందు నిష్ఠ కలిగియుండుట "అధ్యాత్మ జ్ఞాననిత్యత్వ" మనబడును. వివేకనిష్ఠయే వాక్యార్థజ్ఞాన హేతువగును. "అహం బ్రహ్మాస్మి" అను సాక్షాత్కారరూపమైన తత్త్వజ్ఞానమునకు వేదాంతవాక్యములు కరణములు. అట్టి తత్త్వజ్ఞానము అమానిత్వాదిసర్వసాధనపరిపాకఫలము. దానికి ప్రయోజనము అవిద్యాతత్కార్యాత్మకనిఖిలదుఃఖనివృత్తి • పరమానందాత్మావాప్తిరూపమోక్షము. అట్టి మోక్షముయొక్క సమాలోచనమే "తత్త్వజ్ఞానార్థదర్శనం" అని అనబడును. తత్త్వజ్ఞానఫలాలోచన యుండినచో తత్సాధనమునందు ప్రవృత్తి సంభవించును. ఈ అమానిత్వాదులు మొదలుకొని తత్త్వజ్ఞానార్థదర్శనాంతము యిరువదియు జ్ఞానార్థము లగుటవలన జ్ఞానము లనబడును.

ఈయమానిత్వాదికముకంటె వేరగు మానిత్వాదికము జ్ఞానవిరోధి యగుటవలన నజ్ఞాన మనబడును. కాన నజ్ఞానపరిత్యాగపురస్సరముగ జ్ఞానమే యుపాదేయ (స్వీకార్య)ము అనిభావము. ॥౧౧॥

శంకరానందీయము:— మరియు "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్। ఆత్మైవేద మగ్ర ఆసీ త్పురుషవిధః। ఆత్మా వా అరే ద్రష్టవ్యః" ఇత్యాదికముచే "ఆత్మాన మధికృత్య ప్రవృత్త మధ్యాత్మం, జ్ఞాయతే ఆత్మతత్త్వ మనేనేతి జ్ఞానం, అధ్యాత్మం చ తత్ జ్ఞానంచ అధ్యాత్మజ్ఞానం" ఆత్మ నుద్దేశించి ప్రవృత్తమైనది అధ్యాత్మ మనబడును. దేనిచే ఆత్మతత్త్వము తెలియబడునో యది జ్ఞాన మనబడును. అధ్యాత్మ మనెడి జ్ఞానము యేదనిన? వేదాంతశాస్త్రమే. అట్టి శాస్త్రమునందు "నిత్యత్వం" నిరతత్వము (ఆసక్తి కలిగియుండుట) వేదాంతశాస్త్రైకప్రవణత్వమే జ్ఞానోత్పత్తికి ముఖ్యసాధనము. దాని వలననే జ్ఞానము కలుగును. "తత్త్వజ్ఞానార్థదర్శనం" తత్త్వజ్ఞానమునకు ఫలరూపమైన మోక్షముయొక్క సిద్ధిప్రక్రియయొక్క యాలోచనము. బ్రహ్మస్వరూపముగ నవస్థానమే మోక్ష మనబడును. అది శ్రవణముచేగాని, శ్రావణముచేగాని, మననముచేగాని, నిదిధ్యాసచేగాని, సమాధిచేగాని, నిఖిలకామపరిత్యాగముచేగాని మరియొకతీరునగాని సిద్ధించును. యుక్తిచేతను, స్వానుభూతిచేతను జ్ఞానసిద్ధికి పుష్కలమైన సాధనసంపత్తి నియాలోచించి తన యధికారమునకు తగునటుల జ్ఞానసాధనము ననుష్ఠింపవలయును. అని శ్రీకృష్ణపరమాత్మ తత్త్వజ్ఞానార్థదర్శనమ్" అని బోధించుచుండెను.

కాన మోక్షైకకాముడైన యతి జ్ఞానసాధనమైన అమానిత్వాదికమును సంపాదింపవలయును. అమానిత్వాదిజ్ఞానసాధనము సిద్ధించినచో జ్ఞానము సిద్ధించును. జ్ఞానసిద్ధిచేతనే మోక్షము సిద్ధించును. నిరుక్తమైన

* సూచన:— పైగుణములు 20 గా లెక్కింపదగినవి. కాని అంకములు పొరపాటున యెక్కువగా విన్యసింపబడెను. కాన వీటినన్నిటిని 20గుణములుగా అయావిరామచిహ్నముల సహకారమున తెలుసుకొనదగును.

శాంకరభాష్యమ్:—

తస్యార్థో మోక్షః సంసారోపరమ స్తస్యాఽఽలోచనం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ । తత్త్వజ్ఞాన ఫలాలోచనే హి తత్సాధనానుష్ఠానే ప్రవృత్తిః స్యా దితి । ఏత దమానిత్వాదితత్త్వజ్ఞానార్థ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జనించును. కాన నీయమానిత్వము (1), అదంభిత్వము (2), అహింస (3), క్షాన్తి (4), ఆర్జవము (5), ఆచార్యోపాసనము (6), శౌచము (7), స్థైర్యము (8), ఆత్మవినిగ్రహము (9), ఇన్ద్రియార్థములయందు వైరాగ్యము (10), అహంకారము లేకుండుట (11), జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనము (12), పుత్రదారగృహాదులయం దసక్తి (13), వాటియం

జ్ఞానమున కంతరంగసాధనమును "ఏత జ్జ్ఞానం" అనుదానిచే నుపసంహరించుచుండెను. అమానిత్వము మొదలుకొని తత్త్వజ్ఞానార్థదర్శనం అనునంతవరకు యిరువది జ్ఞానోత్పత్తికిసాధనము లగుటవలన జ్ఞాన మని మహర్షులు చెప్పిరి.

ఇట్టి జ్ఞానసాధనములైన అమానిత్వాదులకంటె వేరయిన (విపరీతమైన) మానిత్వము, దంభిత్వత్వము, హింస, అక్షాంతి, అనార్జవము మొదలగునవి రజస్తమోగుణజాతము కాన నవంతయు అజ్ఞానము అజ్ఞానవృద్ధిసాధనము, సంసారకారణము, జ్ఞానప్రతిబంధకము నగును. కాన మానిత్వాదికము లెస్సగ తెలిసికొనదగినది. తెలిసికొని ముముక్షువులు లెస్సగ పరిత్యజింపవలెను. ॥౧౧॥

భాష్యార్థదీపిక:— మరియు ఆత్మ నుద్దేశించి ప్రవృత్తమైన యాత్మానాత్మవివేక మధ్యాత్మజ్ఞాన మనబడును. యెల్లపుడు దానియందే నిష్ఠ గలిగియుండుట యధ్యాత్మజ్ఞాననిత్యత్వ మనబడును. ప్రయత్నసాధితమైన అమానిత్వాదిసాధనములకు అదియే ప్రకర్షపర్యంతత్వము. "తత్త్వజ్ఞానార్థదర్శనమ్" "తత్" అనునది సర్వనామము. సర్వము బ్రహ్మమే. అట్టి బ్రహ్మముయొక్క నామము "తత్" అనునది. అట్టిబ్రహ్మముయొక్క యాథాత్మ్యము "తత్త్వం" అని అనబడును. అట్టిబ్రహ్మయాథాత్మ్యజ్ఞానమే "తత్త్వజ్ఞాన" మనబడును. లేక:— "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, ఏక మేవాద్వితీయం, నేహ నానాఽస్తి కించన । వాచారమ్భణం వికారో నామధేయం" అను శ్రుత్యుక్తమైన బ్రహ్మజగత్తుల. యాథాత్మ్యముయొక్క జ్ఞానమైనను తత్త్వజ్ఞాన మనబడును. అట్టి తత్త్వజ్ఞానముయొక్క ప్రయోజనము సర్వానర్థనివృత్తిపూర్వకమైన పరమానందముయొక్క ప్రాప్తిరూపమైన మోక్షము. అట్టి మోక్షముయొక్క "దర్శనం" అనగా "న స పున రావర్తతే" అనుశ్రుతిచేతను, "యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ" అను స్మృతిచేతను, మోక్షమునకే నిత్యత్వము బోధించుటవలన "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవ మేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" ఇత్యాదిశ్రుతులచేతను, ప్రత్యక్షాదులచేతను ధర్మార్థకామముల కనిత్యత్వము తెలియబడుటవలనను, మోక్షమే సర్వోత్కృష్టమగుటవలన పరమపురుషార్థము. అట్టి మోక్షము తత్త్వజ్ఞానమునకు ఫలము. ఇతరమైనదానికి కాదు. ఈవిషయమునే "తరతి శోక మాత్మవిత్" "తమేవం విదిత్వాఽతి మృత్యు మేతి" "నాన్యః పన్థా విద్యతేఽయనాయ" ఇత్యాదిశ్రుతులు బోధించుచున్నవి. ఇట్టి తత్త్వజ్ఞానార్థాలోచన యుండుచో తత్సాధనానుష్ఠానమునందు ప్రవృత్తి సంభవించును. ఈ "యమానిత్వము మొదలుకొని తత్త్వజ్ఞానార్థదర్శనం" అనునంతవరకు యిరువది చెప్పబడెను. ఈయిరువదియు జ్ఞానసాధనము లగుటవలన జ్ఞాన మనబడును. ఈవిషయమే శ్రుతిస్మృతీతిహాసపురాణాదులయం దుత్కృష్టముగ చెప్పబడెను.

గీ॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే ।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥ ॥౧౨॥

పదవిభాగము:— జ్ఞేయం- యత్- తత్- ప్రవక్ష్యామి- యత్- జ్ఞాత్వా- అమృతం- అశ్నుతే- అనాదిమత్- పరం- బ్రహ్మ- న- సత్ న- అసత్- ఉచ్యతే ॥ ॥౧౨॥

ప్రతిపదార్థము:— జ్ఞేయం=తెలిసికొనదగినది; యత్=ఏదియో; తత్=దానిని; ప్రవక్ష్యామి=ప్రకర్షగ చెప్పగలను; యత్=ఏజ్ఞేయమును; జ్ఞాత్వా=తెలిసికొని; అమృతం=అమృతత్వమును; అశ్నుతే=పొందుచున్నాడో; అనాదిమత్=ఆదిమత్తుకాని; పరం=నిరతిశయమైన, బ్రహ్మ=బ్రహ్మము; జ్ఞేయం=తెలిసికొనదగినది; తత్=అపరబ్రహ్మము; సత్=సత్తు; న=కాదు; అసత్=అసత్తు; న=కాదు. ॥౧౨॥

---

శాంకరభాష్యమ్:—

దర్శనాంతముక్తం జ్ఞానమితి ప్రోక్తం జ్ఞానార్థత్వాత్ । అజ్ఞానం యదతోఽస్మాద్యథోక్తాదన్యథా విపర్యయేణ మానిత్వం దంభిత్వం హింసాఽక్షాంతిరనార్జవమిత్యాద్యజ్ఞానం విజ్ఞేయం పరిహరణాయ సంసారప్రవృత్తికారణత్వాదితి ॥ ॥౧౧॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దనభిష్వంగము (14), ఇష్టానిష్టోపపత్తులయందు నిత్యము సమచిత్తము కలిగియుండుట (15), పరమేశ్వరునియందనన్యయోగముచే నవ్యభిచారియగు భక్తి. (16), వివిక్తదేశసేవిత్వము.(17), ప్రాకృతజనసభయందసక్తి (18), అధ్యాత్మజ్ఞాననిత్యత్వము (19), తత్త్వజ్ఞానార్థదర్శనము(20), ఈయిరువది జ్ఞానార్థము లగుటవలన జ్ఞానములని చెప్పబడెను. వీటికంటె వేరగు మానిత్వము, దంభిత్వము, హింస, అక్షాంతి, అనార్జవము మొదలగునవి సంసారప్రవృత్తి కారణము లగుటవలన పరిహరించుటకై అజ్ఞానములని తెలిసికొనవలయును. ॥౧౧॥

---

వీటికంటె విపరీతమైన "హింసా, మానిత్వ, దంభిత్వ మక్షమానార్జవం తథా । ఆచార్యాసేవనాశౌచాస్థైర్యమాత్మావినిగ్రహః । ఇన్ద్రియార్థే ష్వవైరాగ్య మహంకార స్తథైవచ । జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషప్రదర్శనమ్ । తదాసక్తి రభిష్వంగః పుత్రదారగృహాదిషు । నిత్యం చాసమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు" "మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ । వికీర్ణదేశసేవిత్వమారతిర్జనసంసది । నాధ్యాత్మజ్ఞాననిత్యత్వం జ్ఞానార్థాదర్శనం తథా । ఇత్యేతత్ జ్ఞేయ మజ్ఞానం హేయం సంసారకారణం" హింస, మానిత్వము, దంభము, అక్షమ, అనార్జవము, ఆచార్యుని సేవించకపోవుట, అశౌచము, అస్థైర్యము, ఆత్మనిగ్రహము లేకపోవుట, ఇంద్రియార్థములయందు వైరాగ్యము లేకపోవుట, అహంకారము, జన్మమృత్యుజరావ్యాధులయందు దుఃఖదోషానుదర్శనము లేకుండుట, పుత్రదారగృహాదులయందు సక్తి, అభిష్వంగము, ఇష్టానిష్టోపపత్తులయందు నిత్యము అసమచిత్తము కలిగియుండుట, నాయందు, (పరమేశ్వరునియందు) అవ్యభిచారిణియగు భక్తి లేకుండుట, మశకదంశశర్కరావాలుకాదులచే వ్యాప్తమైన దేశమును సేవించుట, జనసమూహమునందంతట యాసక్తి కలిగియుండుట, తత్త్వజ్ఞానప్రయోజనము నాలోచింపకుండుట, అధ్యాత్మజ్ఞాననిత్యత్వము లేకుండుట యీయిరువదియు సంసారకారణమై అజ్ఞాన మనబడును. కాన పైవాటిని పరిత్యజించి సంసారనివృత్తి కొరకు అమానిత్వాదికమగు యిరువదిధర్మములను గ్రహింపవలయును. అనిభావము. ॥౧౧॥

శాంకరభాష్యమ్:—

(1) యథోక్తేన జ్ఞానేన జ్ఞాతవ్యం కి మిత్యాకాంక్షాయా మాహ- జ్ఞేయం యత్త దిత్యాది। నను యమానియమా శ్చాఽమానిత్వాదయో న తైః జ్ఞేయం జ్ఞాయతే। న హ్యమానిత్వాది కస్యచి ద్వస్తునః పరిచ్ఛేదకం దృష్టమ్। సర్వత్రైవ చ యద్విషయం జ్ఞానం తదేవ తస్య జ్ఞేయస్య పరిచ్ఛేదకం దృశ్యతే। న హ్యన్యవిషయేణ జ్ఞానే నాన్య దుపలభ్యతే। యథా ఘటవిషయేణ జ్ఞానే నాగ్నిః। నైష దోషో జ్ఞాననిమిత్తత్వాత్ జ్ఞాన ముచ్యత ఇతి హ్యవోచామ। జ్ఞానసహకారికారణత్వా చ్చ— జ్ఞేయం జ్ఞాతవ్యం యత్త త్ప్రవక్ష్యామి ప్రకర్షేణ యథావ ద్వక్ష్యామి। కిం ఫలం త దితి ప్రరోచనేన శ్రోతు రభిముఖీకరణా యాహ- యత్ జ్ఞేయం జ్ఞాత్వాఽమృత మమృతత్వ మశ్నుతే న పునః మ్రియత ఇత్యర్థః। అనాదిమ దాది రస్యాఽస్తీ త్యాదిమ న్నాఽఽదిమ దనాదిమత్। కిం తత్పరం నిరతిశయం బ్రహ్మ జ్ఞేయ మితి ప్రకృతమ్।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) పూర్వమునందు చెప్పబడిన జ్ఞానముచే దెలిసికొనదగిన దేది? అను యాశంకపై శ్రీకృష్ణపరమాత్మ "జ్ఞేయం యత్తత్" ఇత్యాదికముచే చెప్పుచుండెను.

యమములచేతను, అమానిత్వాది నియమములచేతను జ్ఞేయము తెలియబడదు. అమానిత్వాదికము లేవస్తువుకిని పరిచ్ఛేదకములుగ చూడబడుటలేదు. ఎచట చూచిన ఏవస్తువిషయకమైన జ్ఞానము కలుగునో యాజ్ఞాన మావస్తువునకు పరిచ్ఛేదముగ గన్పట్టుచున్నది. అన్యవిషయకజ్ఞానముచే మరియొకటి ప్రత్యక్షము కాదు (తెలియబడదు) ఎన్నడైనను ఘటవిషయకజ్ఞానముచే నగ్ని తెలియబడునా? తెలియబడదు. అని శంకింపజనదు— అమానిత్వాదికములు జ్ఞాననిమిత్తము లగుటవలనను, జ్ఞానసహకారికారణములగుటవలనను (గౌణీవృత్తిచే) జ్ఞానమని చెప్పియేయుంటిమి.

తెలిసికొనదగిన దేదియో దానిని యథావత్తుగ ప్రకర్షగ చెప్పగలను. ఆజ్ఞేయము ఏమి ఫలము కలది? అనగా ఆజ్ఞేయమును తెలిసికొనుటవలన ఏమిఫలము ప్రాప్తించును? అనుశంకపై ప్రయోజనద్వారా శ్రోతయొక్క యభిముఖీకరణముకొరకై ఫలమును 'య జ్జ్ఞాత్వా' అనుదానిచే చెప్పుచుండెను. ఆజ్ఞేయమును తెలిసికొని యమృతత్వమును పొందుచున్నాడు. అనగా తిరిగి మరణమును పొందడని యర్థము. అనాదిమత్— ఆదిః అస్యాస్తీతి ఆదిమత్=కారణము కలది అనగా పుట్టునదిఅని యర్థము. ఆదిమత్, అనాదిమత్ కారణము కలది కానిది. అనగా పుట్టునది కాదు అని యర్థము. అది యేది అనిన? పరం, బ్రహ్మ=పరబ్రహ్మము. అట్టి పరబ్రహ్మము జ్ఞేయము. ఇదియే ప్రకృతము.

—• ౧౩ వ అధ్యాయము ౧౨ వ శ్లోక వ్యాఖ్యా విశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— జ్ఞాన మనెడి శబ్దముచే వాడబడెడి నియుక్తములగు యమానిత్వాది సాధనములచే నేది తెలిసికొనదగినదో దానిని "జ్ఞేయం యత్తత్" అనుశ్లోకము మొదలుకొని యారు శ్లోకములచే జెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

(2) అత్ర కేచి దనాదిమత్పర మితి పదం ఛిందంతి బహువ్రీహిణోక్తేఽర్థే మతుప ఆనర్థక్య మనిష్టం స్యాదితి । అర్థవిశేషం చ దర్శయంతి అహం వాసుదేవాఖ్యా పరా శక్తి ర్యస్య త న్మత్పర మితి । సత్య మేవ మపునరుక్తం స్యా దర్థ శ్చే త్సంభవతి, న త్వర్థ స్సంభవతి । బ్రహ్మణః సర్వవిశేషప్రతిషేధే నైవ విజిజ్ఞాపయిషితత్వా న్న స త్త న్నాస దుచ్యత ఇతి । విశిష్టశక్తిమత్త్వప్రదర్శనం విశేషప్రతిషేధ శ్చేతి విప్రతిషిద్ధమ్ । తస్మా న్మతుపో బహువ్రీహిణా సమానార్థత్వేపి ప్రయోగః శ్లోకపూరణార్థః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(2) కొందరు "అనాదిమత్—పరం' అని పదవిభాగ మొనరించిన "అనాదిమత్" అని మతుపునకు అనిష్టమైన యానర్థక్యము ప్రాప్తించునని "అనాదిమత్పరం" అను స్థలమున "అనాది—మత్పరం" అని పదవిభాగము చేయుచుండిరి. "అహం=వాసుదేవాఖ్యా, పరా=శక్తిః యస్య తన్మత్పరం" వాసుదేవుడనే పరాశక్తి యెవనికో అట్టివాడని యర్థవిశేషమునుగూడ మత్పరం' అను పదమునకు చూపుచుండిరి. ఇట్టి యర్థము సంభవించినచో నపౌనరుక్త్యమే సంభవించెడిని. 'న స త్తన్నా స దుచ్యతే" అని బ్రహ్మము సర్వవిశేష నిషేధపూర్వకముగనే చెప్ప దలచియుండ ఇట్టి యర్థమే సంభవింపదు. విశిష్టశక్తికలవా డయియుండువాడని చూపుట, విశేషములు లేవని చెప్పుట విరుద్ధము. అందువలన మతుపు బహువ్రీహితో సమానమైన యర్థము కలదైనను శ్లోకపూరణార్థమై ప్రయోగింపబడెను.

ముముక్షువుచే నేది తెలిసికొనదగినదో దానిని ప్రకర్షగ స్పష్టమగునటుల చెప్పగలను. అని శ్రోత యొక్క యభిముఖీకరణముకొఱకు ఫలముచే స్తుతించుచు చెప్పుచుండెను. చెప్పబోవు యేజ్ఞేయమును తెలిసికొని సంసారమునుండి ముక్తు డగునో అట్టి జ్ఞేయము "అనాదిమత్" ఆదిమత్తు కానిది. అనాదిమత్తు "పరం" నిరతిశయము. "బ్రహ్మ" సర్వతః అనవచ్ఛిన్నమైన బ్రహ్మము పరమాత్మవస్తువు. ఇచట "న, ఆదిః యస్య సః" అని బహువ్రీహివలననే ఆదిరహితమని యర్థము లభించుచుండ "అనాదిమత్" అని మతుపుయొక్క ప్రయోగము వ్యర్థము కాదా యని శంకింపరాదు. అతిశయమునందు కాని, నిత్యయోగమునందు కాని "అనాదిమత్" అని మతుబంతప్రయోగము చేయబడెను.

కొందరు అనాది-మత్పరం" అనికూడ పదవిభాగమును చేయుదురు. అట్టి పదవిభాగమున "మత్" సగుణబ్రహ్మముకంటె "పరం" నిరతిశయరూపము బ్రహ్మము అని యర్థమును గ్రహింపవలయును. కొందరు "అహం పరం యస్య సః" వాసుదేవుడను పరాశక్తి ఎవనికి కలదో అట్టివాడు అని యర్థమును చెప్పెదరు. యిట్టి యర్థము:— ప్రకృతమునందు నిర్విశేషబ్రహ్మమును చెప్పవలసియుండ బ్రహ్మమునందు శక్తిమత్త్వము చెప్పదగినది కానందున యుపేక్షణీయము. బ్రహ్మ కట్టి నిర్విశేషత్వమునే "న స త్త న్నాసత్" అనుదానిచే చెప్పుచుండెను. విధిముఖముచే ప్రమాణవిషయమైనది "సత్" అనబడును. నిషేధముఖముచే ప్రమాణవిషయమైనది "అసత్" అను శబ్దముచే చెప్పబడును. ఈబ్రహ్మ మున్ననో నిర్విశేషమగుటవలనను, స్వప్రకాశచైతన్యరూపమగుటవలనను సదసద్విలక్షణము. ఈవిషయమునే "యతో వాచో నివర్తన్తే । అప్రాప్య మనసా సహ" అనుశ్రుతి బ్రహ్మ మవాఙ్మానసగోచరమని బోధించుచున్నది. బ్రహ్మము సద్భావత్వాశ్రయము అసద్భావత్వాశ్రయముగూడ కానందున నేశబ్దముచేగూడ చెప్పబడదు.

శాంకరభాష్యమ్:—

(౨) అమృతత్వఫలం జ్ఞేయం మయోచ్యత ఇతి ప్రరోచనేనాభిముఖీకృత్యాహ — న సత్తజ్జ్ఞేయ ముచ్యత ఇతి నాప్యసత్తదుచ్యతే। నను మహతా పరికరబంధేన కంఠరవేణోద్ఘుష్య జ్ఞేయం ప్రవక్ష్యామీ త్యననురూప ముక్తం న సత్తన్నాస దుచ్యత ఇతి। న, అనురూప మేవోక్తమ్। కథం? సర్వాసు హ్యుపనిషత్సు జ్ఞేయం బ్రహ్మ "నేతి నే త్యస్థూల మనణు" ఇత్యాది విశేషప్రతిషేధే నైవ నిర్దిశ్యతే। నేదం తదితి వాచోఽగోచరత్వాత్। నను న తదస్తి యద్వస్త్వస్తిశబ్దేన నోచ్యతే। అథాస్తిశబ్దేన నోచ్యతే నాస్తి తజ్జ్ఞేయమ్। విప్రతిషిద్ధం చ జ్ఞేయం తదస్తిశబ్దేన నోచ్యత ఇతి చ। న తావన్నాస్తి నాస్తిబుద్ధ్యవిషయత్వాత్।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(౨) గొప్ప పరికరసంబంధముచే "జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి" (ఏది తెలిసికొనదగినదో దానిని చెప్పెద) అని కంఠరవముగ నుద్ఘోషించి "న సత్తన్నాస దుచ్యతే" అని అననురూపముగ చెప్పబడెనని శకింపజనదు. ఇట అనురూపముగనే చెప్పబడెను. అది యెట్లనిన? జ్ఞేయమైన బ్రహ్మము వాక్కుల కగోచర మగుటవలన సర్వోపనిషత్తులయందు "నేతనేత్యస్థూలమనణు" ఇత్యాదివిశేషప్రతిషేధద్వారముననే "నేదం తత్" జ్ఞేయబ్రహ్మ మిది కాదు. అని నిర్దేశింపబడుచున్నది.

ఏవస్తువు "అస్తి" అను శబ్దముచే చెప్పబడదో ఆవస్తువు లేనిదే. కాన "అస్తి" అను శబ్దముచే చెప్పబడనిచో జ్ఞేయమగు బ్రహ్మము లేనిదే యగునుకదా! "జ్ఞేయము, 'అస్తి' అను శబ్దముచే చెప్పబడదు." అని చెప్పుట విరుద్ధము కాదా? అని శంకింపజనదు. జ్ఞేయము నాస్తి అను బుద్ధ్యవిషయమగుటవలన 'నాస్తి' అని చెప్పుటకుకూడ వీలుపడదు.

"గౌః, అశ్వః" ఇత్యాదిశబ్దములు జాతివలనను, "పచతి, పఠతి" ఇత్యాదిశబ్దములు క్రియవలనను, "శుక్లః, కృష్ణః" ఇత్యాదిశబ్దములు గుణమువలనను "ధనీ, గోమాన్" ఇత్యాదిశబ్దములు ధనాదిసంబంధమువలన నర్థమును బోధించును. ఇచట క్రియాగుణసంబంధములకంటె విలక్షణమైన నిఖిలధర్మములు జాతిరూపముకాని, యుపాధిరూపముకాని జాతిపదముచే గ్రహింపనగును. "డిత్థః, డవిత్థః" ఇత్యాదిశబ్దములుకూడ యత్కించిద్ధర్మమును కాని, స్వాత్మను కాని నిమిత్తముగ జేసుకొని ప్రవర్తించును. కాన నదియు జాతివాచకశబ్దమే. ఇట్లే "ఆకాశః" అను శబ్దముకూడ తార్కికమతమున శబ్దాశ్రయత్వరూపమైన యేదో యొక ధర్మమును పురస్కరించుకొనియే ప్రవర్తించును. వేదాంతిమతమునందన్నో పృథివ్యాదులవలె ఆకాశవ్యక్తులుకూడ జన్యములగుటంజేసి యనేకము లగుటవలన తద్గతమైన ఆకాశత్వము జాతియే యగును. కాన "ఆకాశః" అను శబ్దముకూడ జాతివాచకమే. ఆకాశముకంటె యతిరిక్తమైన దిక్కు అనునది లేదు. కాలముకూడ ఈశ్వరునికంటె వేరు కాదు. దిక్కాలములు యతిరిక్తములన్నను అవికూడ ఉపాధివిశేషప్రవృత్తినిమిత్తకములై జాతివాచకములే యగును. కాన ప్రవృత్తినిమిత్తములు జాతిగుణక్రియాసంబంధములు నాలుగే యగుటవలన శబ్దములు నాలుగే విధములు. కాన బ్రహ్మమునందు పైనాలుగింటియందు యేదియు లేకపోవుటచే ముఖ్యవృత్తిచే బ్రహ్మమును బోధించు శబ్దమే లేదు. "ఏక మేవాఽద్వితీయం" అనుదానిచే బ్రహ్మమునకు జాతినిషేధము చేయబడెను. జాతి యనునది యనేకవృత్తి. బ్రహ్మము యేకవ్యక్తియే. కాన బ్రహ్మమునందు జాతి లేదు. "నిర్గుణం నిష్క్రియం శాంతం" అనుశ్రుతివలన క్రమముగ గుణక్రియాసంబంధములు

శాంకరభాష్యమ్:—

(4) నను సర్వా బుద్ధయోఽస్తినాస్తిబుద్ధ్యనుగతా ఏవ । తత్రైవం సతి జ్ఞేయమప్యస్తిబుద్ధ్యనుగతప్రత్యయవిషయం వా స్యా న్నాస్తిబుద్ధ్యనుగతప్రత్యయవిషయం వా స్యాత్ । నాఽతీంద్రియత్వే నోభయబుద్ధ్యనుగతప్రత్యయావిషయత్వాత్ । య ద్ధీంద్రియగమ్యం వస్తు ఘటాదికం తదస్తిబుద్ధ్యనుగతప్రత్యయవిషయం వా స్యా న్నాస్తిబుద్ధ్యనుగతప్రత్యయవిషయం వా స్యాత్ । ఇదం తు జ్ఞేయ మతీంద్రియత్వేన శబ్దైకప్రమాణగమ్యత్వా న్న ఘటాదివ దుభయబుద్ధ్యనుగతప్రత్యయవిషయ మిత్యతో న సత్త న్నాస దిత్యుచ్యతే ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(4) నిఖిలబుద్ధులు "అస్తి, నాస్తి" అను బుద్ధ్యనుగతములేకదా! ఇట్లుండ జ్ఞేయముకూడ "అస్తి" అను బుద్ధ్యనుగతప్రత్యయవిషయమైన కావలయును. (లేదా) 'నాస్తి' అను బుద్ధ్యనుగతప్రత్యయవిషయమైనను కావలయును. అని శంకింపజనదు. జ్ఞేయమతీంద్రియమగుటవలన 'అస్తి, నాస్తి" అనునట్టి యుభయబుద్ధ్యనుగతప్రత్యయవిషయముగూడ కాదు. (లోకమున) ఏవస్తువు ఘటాదికము ఇంద్రియములచే తెలియబడునో అట్టి ఘటాదికము "అస్తి" అను బుద్ధ్యనుగతప్రత్యయవిషయమైనది యగును. లేక, 'నాస్తి' అను బుద్ధ్యనుగతప్రత్యయ (జ్ఞాన) విషయమైనను యగును. ఈజ్ఞేయమన్ననో అతీంద్రియమగుటచే (ఇంద్రియములచే గ్రహింపబడనిదగుటచే) శబ్దైకప్రమాణగమ్య మగుటవలన ఘటాదులువలె "అస్తి, నాస్తి" అను బుద్ధ్యనుగతప్రత్యయవిషయముకాదు. అని "న సత్త న్నాస దుచ్యతే" జ్ఞేయము సత్తుకాదు, అసత్తును కాదని చెప్పబడుచున్నది.

నిషేధము "అసంగో హ్యయం పురుషః" అనుదానిచే "అథాత ఆదేశో నేతి నేతి" అనుదానిచేతను సర్వనిషేధము చేయబడెను. కాన బ్రహ్మము యేశబ్దముచేతను ముఖ్యవృత్తిచే చెప్పబడదు. అట్లగునో "వక్ష్యామి" అని శ్రీకృష్ణునిచే నెట్లు చెప్పబడెనందువా? "శాస్త్రయోనిత్వాత్" అనుసూత్రముచేనపపన్న మగును. యేదో యొక తీరున లక్షణచే శబ్దముచేత బ్రహ్మ చెప్పబడు నని గ్రహింపుము. అట్టి ప్రతిపాదనప్రకారము అశ్చర్యవత్పశ్యతి కశ్చి దేనం" అనుచోట మాచే చూపబడెను. విస్తారముగ భాష్యమునందు చూడ నగును. ॥౧౨॥

శంకరానందీయము:— ఇట్లు జ్ఞానోత్పత్తికి సహకారికారణసామగ్రి యగు అమానిత్వాదికమును నిరూపించి, చెప్పబడిన అమానిత్వాదిసాధనసంపత్తిచేతను, క్లుప్తమైన శ్రవణాదికముచేతను సముత్పన్నమైన జ్ఞానము కల యతికి తెలిసికొనదగిన వస్తువును "జ్ఞేయం" అనుదానిచే నిరూపించుచుండెను.

శ్రవణ మొనరించినట్టియు, శ్రవణమువలన జనించినజ్ఞానము కల యతికి యేది తెలిసికొనదగినదో శ్రీగురువుయొక్క ముఖమునుండి తెలిసికొనదగిన యావస్తువును చెప్పెదను.

అజ్ఞానముచే మాకేమి ప్రయోజన మను శంకపై "యత్" అని చెప్పుచుండెను. "తత్త్వ మసి" అను వాక్యార్థమును విచారించిన పిదప అట్టివిచారమువలన జనించిన జ్ఞానముచే యేవస్తువును తెలిసికొని చెప్పబోవులక్షణములు కల పరబ్రహ్మమును అనుభవించునో, "ఏత దమృత మభయ మేత ద్బ్రహ్మ" అనుశ్రుతివలన నమృతస్వభావరూపమైన బ్రహ్మమును "బ్రహ్మవిదాప్నోతి పరం" అను శ్రుతిచొప్పున పొందును.

శాంకరభాష్యమ్:—

(5) యత్తూక్తం విరుద్ధ ముచ్యతే జ్ఞేయం తన్న సత్తన్నాస దుచ్యత ఇతి। న విరుద్ధమ్- "అన్య దేవ తద్విదితా దథో అవిదితా దధి" ఇతి శ్రుతేః । శ్రుతి రపి విరుద్ధార్థేతి చే ద్యథా యజ్ఞాయ శాలా మారభ్య కో హి తద్వేద య ద్యముష్మిఀల్లోకేఽస్తి వా న వేతీ త్యేవ మితి చేత్ న, విదితాఽవిదితాభ్యా మన్యత్వశ్రుతే రవశ్యవిజ్ఞేయార్థప్రతిపాదనపరత్వాత్ । య ద్య

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(5) జ్ఞేయమైనయది "న సత్తన్నాస దుచ్యతే" అని విరుద్ధముగ చెప్పబడెనని చెప్పియుంటిమికదా! అనిశంకింపఁజనదు. "అన్య దేవ తద్విదితా దథో అవిదితా దధి" అను శ్రుతివలన "న స త్తన్నాస దుచ్యతే" అని చెప్పబడెను. కాన విరుద్ధము కాదు. యజ్ఞము కొఱకు శాల నారంభించి "కో హి తద్వేద యద్యముష్మిఀల్లోకేఽస్తి వా న వా" "ప్రాచీన వంశం కరోతి" అని పారలౌకికఫలముకల యజ్ఞానుష్ఠానార్థము శాలానిర్మాణమును ప్రస్తుతముగ చేసుకొని

ఇట్లు ఫలవాదముచే శ్రోత నభిముఖు మొనరించుకొని "ప్రవక్ష్యామి" అని ప్రతిజ్ఞాతమైన అర్థమును "అనాది మత్" అనుదానిచే చెప్పుచుండెను.

ముముక్షువుచే తెలిసికొనదగిన బ్రహ్మము "అనాదిమత్" కారణము కాని, జన్మ కాని దేనికి కలదో అది "ఆదిమత్" అని అనబడును. అది మహదాదిస్థూలాంత కార్యము. బ్రహ్మము అట్టి మహదాదిస్థూలాంత కార్యజాతముకంటె విలక్షణముగాన "అనాదిమత్" అని అనబడును. నిఖిలవికారములకంటె భిన్నమైనది. అవ్యాకృతము, అవికృతము నగు మూలప్రకృతికూడ నక్షరమగుటవలన ననాదిమత్తు యగును. కాన తద్వ్యా వృత్తినిమిత్తము "పరం" అను విశేషణము చెప్పబడెను. నిరవయవ మగుటచేతను, నిత్యకూటస్థాసంగచిద్రూప మగుటచేతను, జ్ఞానస్వరూపమగుటచేతను, ఆంతరమగుటచేతను, పరమమహత్తగుటచేతను బ్రహ్మము అవ్యక్తముకంటె పరము. అవ్యక్తముకంటె వేరు. "అప్రాణో హ్యమనా శ్శుభ్రో హ్యక్షరా త్పరతః పరః" అనుశ్రుతివలన అనాదిమత్తు యగుటవలన, పరమగుటవలన బ్రహ్మము వ్యక్తావ్యక్తము లగు కార్య కారణములకంటె భిన్నము (వేరు) అని సిద్ధించుచున్నది. మరియు యీవిషయమునే "అన్యదేవ తద్విదితా దథో అవిదితా దధి" అను శ్రుతియు బోధించుచున్నది.

"త త్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ । స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు" ఇత్యాదికముచే క్షేత్రక్షేత్రజ్ఞుల యాథాత్మ్యప్రతిపాదన ముపక్రమించి "మహాభూతాని" ఇత్యాదికముచే క్షేత్రస్వరూపము చెప్పబడెను. అనంతరమున క్షేత్రజ్ఞస్వరూపమును చెప్పవలసియుండ నద్దానిని చెప్పక "అనాదిమ త్పరం బ్రహ్మ" అని అనుపక్రాంతమైన బ్రహ్మస్వరూప మెట్లు చెప్పబడెను? అట్లగుచో నుపక్రమవిరోధము ప్రాప్తించదా యని శంకింపఁజనదు. క్షేత్రజ్ఞుడు, బ్రహ్మము యొకటియే కాన నైవిరోధము ప్రాప్తించదు. అదియెట్లనిన? "నాయం హన్తి న హన్యతే" అని క్షేత్రజ్ఞుడైన యాత్మ కవి క్రియత్వమును బోధించుట కుపక్రమించి దానినే "న జాయతే మ్రియతే వా" అను దానిచే విపులముగ జెప్పి "నిత్య స్సర్వగతః" అనుదానిచే నిత్యకూటస్థాసంగచిద్రూపత్వమును, వ్యాపకత్వమును బోధించి "యేన భూతా న్యశేషేణ" అనుదానిచే బ్రహ్మభిన్నత్వమును సూచించి, "భోక్తారం యజ్ఞతపసాం" అను దానిచేతను, "సర్వభూతస్థ మాత్మానం" "యో మాం పశ్యతి సర్వత్ర" అనుదానిచేతను క్షేత్రజ్ఞబ్రహ్మల కేకత్వమును తలచి "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అనుదానిచే కంఠరవముగ క్షేత్రజ్ఞేశ్వరుల కేకత్వమునే చెప్పి శ్రుతిస్మృతికోటిప్రసిద్ధమైన చెప్పబడిన బ్రహ్మాత్మైక్యమునే "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అను

శాంకరభాష్యమ్:—

ముష్మి న్నిత్యాది తు విధిశేషోఽర్థవాదః । ఉపపత్తేశ్చ సదసదాదిశబ్దైః బ్రహ్మ నోచ్యత ఇతి । సర్వో హి శబ్దోఽర్థప్రకాశనాయ ప్రయుక్తః శ్రూయమాణశ్చ శ్రోతృభి ర్జాతిక్రియాగుణసంబంధద్వారేణ సంకేతగ్రహణం సవ్యపేక్షోఽర్థం ప్రత్యాయయతి । నాఽన్యథాఽదృష్ట

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"కో హి తద్వేద" ఇత్యాది శ్రుతి పరలోక ముండుటయందు సందేహము కలదై విరుద్ధార్థము కల యాశ్రుతి యప్రమాణమో అట్లే "అన్యదేవ తద్విదితా దథో అవిదితా దధి" అను శ్రుతియు విరుద్ధార్థము కలదగుటచే నప్రమాణమే యని శంకింపజనదు. విదితావిదితములకంటె యన్యత్వమును చెప్పు శ్రుతి అవశ్యము విజ్ఞేయార్థప్రతిపాదనపరమగుటవలన "అన్య దేవ తద్వి

దానిచే సువిస్పష్టతరముగ చెప్పి, భగవంతు డగు శ్రీకృష్ణపరమాత్మచే క్షేత్రజ్ఞుడే బ్రహ్మము, బ్రహ్మమే క్షేత్రజ్ఞు డని బ్రహ్మక్షేత్రజ్ఞులకు అభేదమే మూఢులచేతను, అమూఢులచేతను, సర్వులచేతను తెలిసికొనదగినదని "స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు" అని జ్ఞేయముగ నుపక్రాంతమైన క్షేత్రజ్ఞునే విధేయ ప్రాధాన్యముచే నపుంసకలింగముచే "జ్ఞేయం య త్తత్ప్రవక్ష్యామి" అని పరామృశించి ఆయాథాత్మ్యమును బోధించుటకొరకై "అనాదిమ త్పరం బ్రహ్మ" అని చెప్పబడెను. ఈ చెప్పుటచే క్షేత్రజ్ఞ బ్రహ్మశబ్దముల కర్థము ఒక్కటియే యని ఉపక్రాంతోపపాదితవాక్యార్థవివేకజ్ఞాననిపుణులైన విద్వాంసులచే తెలిసికొనదగిన దని సిద్ధమగుచున్నది. ఇట్లు "అనాదిమ త్పరం బ్రహ్మ" అని బ్రహ్మముకు నిఖిలదృశ్యవైలక్షణ్యమును సూచించి "స చ యో యత్ప్రభావశ్చ" అను స్థలమునందు యచ్ఛబ్దవివక్షితమైన బ్రహ్మయాథాత్మ్యమును "నేతినేతీ త్యాత్మాఽగృహ్యోనహి గృహ్యతే" "అథాత ఆదేశో నేతి నేతి" ఇత్యాదిశ్రుత్యర్థమునను సరించి అతన్నిషేధద్వారమున బోధించుటకై "న స త్త న్నా స దుచ్యతే" అని చెప్పెను. ఏది, అది, ఇది అని నామరూపజాతిగుణక్రియావిశేషములచే నిర్దేశించుటకు తగినదో అభివ్యక్తనామరూపాదివిశేషములు గల యామహదాదినిఖిలకార్యజాతము "సత్" అని చెప్పబడును. తద్విలక్షణమగుటవలన తత్కారణమైన అవ్యక్తము "అసత్" అని చెప్పబడును. పైన చెప్పబడిన సద్రూపమైన మహదాదికార్యజాతము ఉత్పత్తికల దగుట వలనను, దృశ్యమగుటవలనను, బ్రహ్మముకంటె విలక్షణమగుటవలనను, బ్రహ్మస్వరూపము కాదు. "అజోనిత్యః" అను శ్రుతివలన బ్రహ్మమునకు జాతి లేదు. "అగ్రాహ్య మగోత్ర మశబ్ద మస్పర్శ మరూపం" అను శ్రుతివలన బ్రహ్మమునకు నామరూపాదికము లేదు. "అదృష్ట మవ్యవహార్యం" అను శ్రుతివలన బ్రహ్మము దృశ్యము కాదు. కాన బ్రహ్మము మహదాదిసర్వవికారములకంటె భిన్నము (వేరు.) ఇట్లు "న స త్తత్" అని కార్యమునకు బ్రహ్మత్వమును నిషేధించి కారణమునకుకూడ బ్రహ్మత్వమును "నాస దుచ్యతే" అనుదానిచే నిషేధించుచుండెను. సద్విలక్షణము, సర్వజగత్కారణము నగు అవ్యాకృతము సావయవ మగుటవలనను, జ్ఞేయమగుటవలనను, జడమగుటవలనను బ్రహ్మస్వరూపము కాదు. "కారణగుణములు కార్యగుణారంభకములు" అనున్యాయమువలన మృదాదులయం దుండు గుణములు ఘటాదులయందు సజాతీయ గుణారంభకము లగుచున్నవి. కారణమునందు గుణములు లేనిదే కార్యమునందు గుణములు సంభవింపవు కాన కార్యమునందు గుణము లుండిన యవి కారణమునందుండిన గుణములవలననే జనించిన వని తెలిసికొనవలయును. కాన మృదాదులువలె బీజవత్తైన కార్యము సావయవత్వాదిధర్మములు కలదగుటవలన కార్యకారణములుకూడ అట్టి ధర్మములుకలవియే యగును. ఏది అవయవములు కలదో అది వికారి యగును. ఏది వికారియో యది యనిత్యము. అనిత్యమగుటవలనను, జ్ఞేయ మగుటవలనను, అట్టి కారణము జడము "అహమజ్ఞః" అను

శాంకరభాష్యమ్:—

శబ్దవాచ్యం, నాపి గుణవ ద్యేన గుణశబ్దే నోచ్యేత నిర్గుణత్వా న్నాపి క్రియాశబ్దవాచ్యం నిష్క్రియత్వాత్ "నిష్కలం నిష్క్రియం శాంతమ్" ఇతి శ్రుతేః । న చ సంబం ధ్యేకత్వా దద్వ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ధము లేనిదే యేశబ్దము అర్థమును బోధించుట యెచటను, యెన్నడును చూడబడలేదు. అది యెట్లనిన? "గౌః అశ్వః" ఈశబ్దములు జాతివలన నర్థబోధకములు. "పచతి, పఠతి" ఇత్యాది శబ్దములు క్రియవలన నర్థబోధకములు. "శుక్లః, కృష్ణః" ఇత్యాదిశబ్దములు గుణమువలన నర్థబోధకములు. 'ధనీ, గోమాన్' ఇత్యాదిశబ్దములు సంబంధమువలన నర్థబోధకములు. బ్రహ్మమన్ననో జాతిమత్తు కాదు. కాన సదాదిశబ్దములచే చెప్పబడదు. బ్రహ్మము నిర్గుణము. కాన

"అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మాత్" అను శ్రుతియు, "న ప్రకృతి ర్న వికృతిః" "సుషుప్తవ త్స్వాన్యవ దప్రతర్క్యం తన్మూలభూతం పద మామనన్తి" అను స్మృతులు ప్రమాణము. అదృశ్యేఽనాత్మ్యే" "అస్థూల మనణు" ఇత్యాదిశ్రుతులచే అధ్యస్తాశేషవిశేషనిషేధముచేతనే బ్రహ్మ బోధింపబడుటవలన నీనిఖిల జ్ఞేయమైన ప్రపంచము సర్వశ్రుతిప్రసిద్ధము, ప్రామాణికము. కాన సదసత్తులకంటె భిన్నము, తన్నిషేధావధిభూతము, తదభావభాసకము, నిర్విశేషము, నిత్యశుద్ధబుద్ధముక్తసత్యపరమానందాద్వితీయము నగుపరబ్రహ్మము ముముక్షువులచే "ఇద మేవాహ మస్మి" అని స్వాత్మగ తెలియదగిన వస్తువు. ఇంతియే కాని సత్తు కాదు అసత్తును కాదు. అనగా బ్రహ్మము సదసద్విలక్షణమని సిద్ధము. ॥౧౨॥

భాష్యోత్కర్ష దీపిక:— జ్ఞానశబ్దముచే చెప్పబడునట్టి పూర్వోక్తజ్ఞానసాధనములచే తెలిసికొనదగిన వస్తువేవి? యను యాకాంక్షపై "జ్ఞేయం" అని చెప్పుచుండెను.

పైచెప్పబడిన జ్ఞానసాధనములయొక్క పరిపాకముచే సంప్రాప్తమైన సాక్షాత్కారవృత్తికివిషయమైనదేదియో దానిని చెప్పెద. ఇట్లు బ్రహ్మము వృత్తివిషయమగుచో బ్రహ్మమునకు దృశ్యత్వము ప్రాప్తింపవలసివచ్చు నని శంకింపజనదు. దృశ్యత్వ మనగ ఫలవ్యాప్యత్వము. (వృత్త్యవచ్ఛిన్నచైతన్యవిషయత్వము) బ్రహ్మమునకు వృత్తివిషయత్వముండినను వృత్త్యవచ్ఛిన్నచైతన్యవిషయత్వరూపఫలవ్యాప్యత్వము లేనందున దృశ్యత్వము బ్రహ్మమునకు ప్రాప్తింపదు. ఈవిషయమునే "స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా, విజ్ఞాతార మరే కేన విజానీయాత్" ఇత్యాదిశ్రుతులు బోధించుచున్నవి.

ఫలప్రదర్శనముచే శ్రోతను ప్రరోచన చేయుచు అభిముఖముగ జేసుకొనుచుండెను. ఏజ్ఞేయమును తెలిసికొనినచో అపునరావృత్తిరూపమైన మోక్షమును పొందునో (ముక్తుడగునో) అట్టి జ్ఞేయము "అనాదిమత్" "ఆది రస్యాస్తీతి" ఆదిమత్, న ఆదిమత్", అనాదిమత్" అని విగ్రహము. జ్ఞేయమైన బ్రహ్మ ఆదిమత్తు కానిది. నిరతిశయమైనది. అట్టి బ్రహ్మమే జ్ఞేయము. కొందరు, ఆదిరస్యాస్తీతి ఆదిమత్ 'న ఆదిమత్ అనాదిమత్" అని విగ్రహముచెప్పెదరు "అనాదిమత్" అని పదవిభాగ మొనరించుట "ఉక్తార్థానా మప్రయోగాత్" అను న్యాయమున మతుపుకు అనర్థక్యము ప్రాప్తించును. కాన "అనాది-మత్పరం" అని పదవిభాగ మొనరింపవలయు నని శంకించుచుండిరి. "న విద్యతే ఆదిః యస్య సః అనాది" అని విగ్రహము చెప్పి దేనికి ఆది లేదో యది యనాది అని యర్థమును చెప్పుచుండిరి. మరియు "మత్పరం" అనుదాని వాసుదేవుడనే పరాశక్తి యెవనికి కలదో వాడు "మత్పరం" అని చెప్పబడును. అని వ్యాఖ్యానించిరి. ఇట్టి వ్యాఖ్యాన మసంగతము. ఏలయన "న సత్త న్నాస దుచ్యతే" అనుదానిచే సర్వవిశేషప్రతిషేధముచే

శాంకరభాష్యమ్.—

త్వాత్ । తద్యథా గౌ రశ్వ ఇతి వా జాతితః, పచతి పఠతీతి వా క్రియాతః, శుక్లః కృష్ణ ఇతి వా గుణతః, ధనీ, గోమా నితి వా సంబంధతః । న తు బ్రహ్మ జాతిమ దతో న సదాది

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దితా దథో అవిదితా దధి" అను శ్రుతి యప్రమాణముకాదు. యద్వా ముష్మి న్నితి" అనుశ్రుతి విధిశేషమగు నర్థవాద ఉపపత్తివలన కూడ సదసదాదిశబ్దములచే బ్రహ్మము చెప్పబడదు. ప్రతి శబ్దము అర్థప్రకాశనముకొఱకు ప్రయోగింపబడి శ్రోతలచే శ్రూయమాణమై జాతిగుణక్రియా సంబంధద్వారముననే శక్తిగ్రహసవ్యపేక్షమై అర్థమును బోధించును. జాతిగుణక్రియాసంబం

యనుభవముచే అవ్యక్తమునకు జ్ఞేయత్వము స్పష్టమే యగుచున్నది. కాన తద్విలక్షణమే పరబ్రహ్మము. "నిష్కలం నిష్క్రియం" అను శ్రుతివలన బ్రహ్మకు సావయవత్వము లేదు. "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అను శ్రుతివలన బ్రహ్మకు జడత్వము లేదు. "స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా" అను శ్రుతివలన బ్రహ్మకు జ్ఞేయత్వము లేదు.

సదసచ్ఛబ్దవాచ్యములు, వ్యక్తావ్యక్తములు నగు కార్యకారణములయందు బ్రహ్మత్వము నిషేధింపబడు చుండ తన్నిషేధావధిగ బ్రహ్మత్వాభావముగాక మరియొక వస్తువేదియు కానరాదు. అట్టి జ్ఞేయశబ్దార్థమగు బ్రహ్మత్వాభావ మప్రామాణికము కాదని శంకించు వానిని యొకవిషయ మడుగదగియున్నది. కార్య కారణములయందు నిషేధావధిభూతమగు బ్రహ్మత్వాభావము సత్త, లేక అసత్త, లేక సదసత్త? అట్టి యభావము స్వయముగ భాసించునా? లేక మరియొకదానిచే భాసింపజేయుబడునా? సత్తను మొదటిపక్షమున తానుకూడ సత్తే యగుటవలన "న సత్" అని తనయందు ప్రసక్తమగు నిషేధావధిత్వము తనకే సంభవింప నందున అట్టి యభావము "సత్తు" అను ప్రథమపక్షము తొలిగింపబడెను. అట్టి యభావము అసత్తను ద్వితీయ పక్షమునందు స్వతః సత్తారహితమైన యట్టి యభావము శశవిషాణమువలె శూన్యమగుటవలన కార్యకారణముల యందు చెప్పు నిషేధమున కవధి కాజాలదు. సదసత్తను మూడవ పక్షమునందు సత్త్వాసత్త్వములు పరస్పర విరుద్ధములు కాన నారెండింటికి ఏకాధికరణత్వము సంభవింపనందున సత్త్వాసత్త్వములలో నొకటగు సత్త్వము కలదగుచో "అభావోఽస్తి" అని అభావమునకు అస్తిమత్త్వమే యున్నచో సత్తావత్తే యగుటవలన భావమే యగును. కాన భావమున "అభావో ఽస్తి" అని నిర్దేశము సంభవింపదు "అయమస్తి" అను ప్రత్యక్షనిర్దేశము భావమునకేకాని విషయవిషయుల కన్యోన్యావయవసంయోగము లేనందున యభావమునకు లేదు. అన్యోన్యావయవసంయోగ ముండినపుడే ఘటాదులకు విషయత్వము దృష్టము. అసత్తునకు లేదు. ఏది అస్తిమత్తయి చక్షుర్విషయమగునో అది భావమే యగును. అస్తిమత్త్వాభావత్వముల కేకాధికరణత్వము యభావము కానందున మూడవ పక్షము నిరస్తము. అభావమునకు సత్త్వాసత్త్వము లంగీకరించినను "అభావము జ్ఞేయమగుటచే జడమగుటవలన ఘటమువలె స్వతః భావము సంభవింపనందున నిషేధావధిభూతమైన బ్రహ్మత్వా భావము స్వతః భాసించున్" నను నాల్గవపక్షము నిరస్తము. అట్లగుచో నిషేధావధి యగు బ్రహ్మము పరతః (మరియొకదానివలన) భాసించుననెదవా? అట్టి యభావభాసకమైన వస్తువు కలదా? లేదా? లేదనెదవా? సూర్యుడు లేనిదే ఘటాదులు భాసింపనటుల అభావభాసకమైన వస్తువే లేనిచో నభావమునకు భాసయే లేకపోయెడిని. అభావభాసకమైన వస్తువు కలదందువా? ఏవస్తువు అభావభాసకమో యావస్తువే బ్రహ్మమని మేము చెప్పెదము. అది యుండుటలో కలదని చెప్పెడి నీవే మాకు ప్రమాణము. "అన్యదేవ విదితా"

శాంకరభాష్యమ్:—

యత్వా దవిషయత్వా దాత్మత్వా చ్చ న కేనచి చ్ఛబ్దే నోచ్యత ఇతి యుక్తం "యతో వాచో నివర్తంతే" ఇత్యాది శ్రుతిభ్యశ్చ । ॥౧౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

గుణవాచకశబ్దముచే చెప్పబడదు. బ్రహ్మము నిష్క్రియ మగుటవలన క్రియావాచకశబ్దముచే చెప్పబడదు. ఈవిషయమున 'నిష్కలం నిష్క్రియం శాన్తం' అను శ్రుతి ప్రమాణము. ఏకమే యగుటవలన, అద్వయమగుటవలన, అవిషయమగుటవలన, ఆత్మయగుటవలన నేశబ్దముచేతను చెప్పబడదనుట యుక్తమే. మరియు బ్రహ్మము శబ్దముచే చెప్పబడదను విషయమున "యతో వాచో నివర్తంతే" అను శ్రుతియు ప్రమాణము. ॥౧౨॥

చెప్పదలచినచో యుండ వాసుదేవాఖ్యపరాశక్తిమత్త్వప్రదర్శనము విప్రతిషిద్ధ మగుటచే పైన చెప్పిన యర్థము సంభవింపదు. కాన "అనాదిమత్" అని మతుబంతకము అతిశయమునందు కాని, నిత్యయోగమునందు కాని, పాదపూరణార్థము కానిప్రయోగింపబడె నని గ్రహింపవలయును.

"మత్పరం–" "మమ విష్ణోః పరం" విష్ణుస్వరూప మగు నాకు "పరం" నిర్విశేషరూపము, లేక "మత్తః" సగుణబ్రహ్మముకంటె "పరం" పరమైనది. లేక, "ఆదిమచ్చ తత్ః పరం చ ఆదిమత్పరే, తాభ్యా మన్యత్ అనాదిమత్పరం" "ఆదిమత్" కార్యము "పరం" కారణము. "ఆదిమత్పరే" కార్యకారణములు "తాభ్యా మన్యత్" కార్యకారణభిన్నము. అది "పరం" పరబ్రహ్మము. అని యిట్టిరీతిన మతు ప్ప్రత్యయమునకు సార్థక్యము సంభవించుచుండ నెందువలన భగవత్పాదులు పూర్వమునందు చెప్పబడిన మార్గము ననుసరించిరని శంకింపజనదు. "పరం" అను విశేషణమువలననే సగుణముకంటె పరమగు నిర్విశేషము లభించుచుండ మత్పదమునకు వైయర్థ్యము ప్రాప్తించుననియు, "మత్తః పరతరం నాన్యత్" అనుదానితో విరోధము ప్రాప్తించుననియు, పరపదమునకు పూర్వనిపాతాపత్తిని, కార్యకారణాన్యత్వము "న సత్తన్నాస దుచ్యతే" అను విశేషణమునందే యంతర్భవించుననియు యభిప్రాయముచే భగవత్పాదు లట్లు చెప్పలేదని గ్రహింపుము. కొందరు "అనాది మత్పరం" అనునది ఒకటియే పదము. అనాదియనగ మాయ యని యర్థము. "అనాదిమత్" మాయావిశిష్టమైన అనాద్యజ్ఞానవంతుడగు జీవునికంటె "పరం" నిర్మాయము, అజ్ఞానకృతజీవత్వోపాధిరహితము అని ఇత్యాదికల్పనము "పరం" అను విశేషణముచేతనే యట్టి యర్థము లభించుచుండ "అనాదిమత్" అను పదమునకు వైయర్థ్యము లభించుటచే పరిత్యాజ్యము.

అనాదిమత్పరంబ్రహ్మ జ్ఞేయమైనది. అది యమృతత్వము ఫలముగా కలది. దానిని నేను చెప్పెదనని ప్రరోచనచే నర్జునుని యభిముఖముగ జేసుకొని 'న సత్తన్నాస దుచ్యతే' అని చెప్పెను. అభివ్యక్తనామరూప మగుటవలన కార్యము "సత్" అని చెప్పబడును. అనభివ్యక్తనామరూపములు కదగుటచే కారణము "అసత్" అని చెప్పబడును. కాన జ్ఞేయమైన యది "సత్" అను పదముచేత కాని, "అసత్" అను పదముచేత కాని చెప్పబడదు.

"జ్ఞేయం" ప్రవక్ష్యామి"అని గొప్పధ్వనితో నుద్ఘోషించి "న సత్తన్నాస దుచ్యతే" అనియననురూపముగ చెప్పబడెనని శకింపజనదు. స్వయంజ్యోతిస్వరూపమైన పరబ్రహ్మమునకు "ఇదం బ్రహ్మ" అని విధిముఖముగ నుపదేశము సంభవింపనందున అధ్యస్తాతద్ధర్మనివృత్తి కొరకు నిషేధద్వారమున ఉపదేశము శ్రుతులయందు ప్రసిద్ధ మగుటవలన ఆరోపితవిశేషనిషేధరూపమైన ప్రవచనము ప్రతిజ్ఞానురూప మగుటవలన పూర్వో

క్తాశంక సంభవింపదు. ఈవిషయమునే "అథాత ఆదేశో నేతినేతి" "అస్థూల మనణు" "అపూర్వ మనపరం" ఇత్యాదిశ్రుతు లుద్ఘోషించుచున్నవి. తేలినయాశయ మేమనిన? జ్ఞేయమైన బ్రహ్మము వాక్కులకు గోచరము కానందున శ్రుత్యాదులయందు నిషేధముఖముగనే యుపదేశము. "ఇదం తత్" అజ్ఞేయబ్రహ్మ మిదియని విధిముఖమున నుపదేశము లేదని యాశయము. శశశృంగమువలె బ్రహ్మమునకు నాస్తిధీవిషయత్వము లేనందున "బ్రహ్మము అస్తిశబ్దావాచ్యము, నాస్తిశబ్దావాచ్యముగూడ నగుచో శశవిషాణమువలె నాస్తిత్వము ప్రసక్తమయ్యెడిని." అను శంక తొలగించబడెను.

సర్వబుద్ధులు అస్తినాస్తిత్వానుగతము లగుటచే బ్రహ్మము అస్తినాస్తిబుద్ధులలో నేదోయొక బుద్ధివిషయమగుటచే బ్రహ్మమున కనిర్వాచ్యత్వము తప్పదని శంకింపజనదు. అస్తినాస్తిబుద్ధివిషయమైన ఇన్ద్రియగ్రాహ్యఘటాదులకంటె విలక్షణమైన, అతీంద్రియమైన బ్రహ్మము అస్తినాస్తిబుద్ధ్యవిషయమైనను, శబ్దైకప్రమాణగమ్య మగుటచే జ్ఞేయమే బ్రహ్మమగును. కాన బ్రహ్మమున కనిర్వచనీయత్వము సంభవింపదు.

"గా రశ్వః" ఇత్యాదిశబ్దములు జాతిచేతను "పచతి పఠతి" ఇత్యాదిశబ్దములు క్రియచేతను, "శుక్లః కృష్ణః" ఇత్యాదిశబ్దములుగుణమువలన, "ధనీ, గోమాన్" ఇత్యాదిశబ్దములుసంబంధమువలన నర్థమునుబోధించును. అనగా జాతిగుణక్రియల సంబంధములలో నేదో యొకానొకదాని నవలంబనముగ చేసుకొనియే శబ్దము అర్థమును బోధించును. కాన పైజాతిగుణక్రియాసంబంధములనెడి నాలుగింటిలో నేదియు బ్రహ్మము నందు లేనందున బ్రహ్మము సదాదిశబ్దవాచ్యము కాదు. ఈవిషయమునే "అగోత్ర మవర్ణం, నిష్క్రియం శాన్తం, కేవలో నిర్గుణశ్చ, ఏక మేవా ద్వితీయం" ఇత్యాది శ్రుతులు బోధించుచున్నవి. కాన అవిషయ మగుటవలనను, ఆత్మయగుటవలనను యేశబ్దముచేతను ముఖ్యవృత్తిచే బ్రహ్మము చెప్పబడదని చెప్పుట యుక్తమే. "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" ఇత్యాదిశ్రుతు లవాఙ్మనసగోచరత్వమును బ్రహ్మమునకు చెప్పుచున్నవి. అట్లగుచో "త్వం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" అను శ్రుతి బ్రహ్మ ముపనిషద్గమ్య మని చెప్పుట యెట్లు పొసగుననెదవా? నిషేధముఖముచే నుపనిషత్ప్రతిపాద్యము బ్రహ్మమని యర్థము. కాన విరోధము ప్రాప్తింపదు.

కొందరు:— "పూరణార్థాత్పౄ" పూరణ మర్థముగాగల "పౄ" అను ధాతువువలన "పరం" అను శబ్దము నిష్పన్న మగుచున్నది. అనగా పరంఅను శబ్దమునకు పూర్ణము అని యర్థము. పూర్ణమనగా దేశము వలన, కాలమువలన, వస్తువువలన పరిచ్ఛేదరహితమని యర్థము. దేశకాలవస్తువు లద్వైతమతమున లేమింజేసి దేశకాలవస్తురూపత్రివిధపరిచ్ఛేదశూన్యత్వము బ్రహ్మమున కెటుల ప్రాప్తించునని యాశంకించి దేశకాలవస్తువు లవిద్యావిలాసములని చెప్పుటకు "అనాదిమత్" అని బ్రహ్మకు విశేషణము చెప్పబడెను. "అనాది" యన యజ్ఞానము. అట్టి యజ్ఞానసంబంధముకలది "అనాదిమత్" అని చెప్పబడును. కాన నట్టి యజ్ఞానముచే దేహాదులు సంభవించును. కాన త్రివిధపరిచ్ఛేదరాహిత్యము బ్రహ్మమునకు చెప్పుట పొసగును. అనాదియగు నజ్ఞానము రెండవదిగ యంగీకరించుట శాంతికర్మయందు భేతాళుడు జనించినట్లున్నదను శంకను తొలగించుటకు అజ్ఞానమును "న సత్తన్నాస దుచ్యతే" అను విశేషణయుక్తముగ జేసెను. వాచ్యముగ సత్తుగ అనిరూపణమువలన నాయజ్ఞానము సత్తుకాదు. అపరోక్షముగ ప్రతీతి సంభవించుటవలన అసత్తును కాదు. కాన నజ్ఞాన మనిర్వచనీయము. త్రాచుచే త్రాడు సద్వితీయము కానటుల అజ్ఞానముచే బ్రహ్మము సద్వితీయము కాదు. అని యాశయము.

లేక:— ఈవ్యాఖ్యయందు "న సత్తన్నాస దుచ్యతే" అనుచోట రెండవ నకారమునకు వైయర్థ్యము ప్రాప్తించునుకాన "న సత్తన్నాస దుచ్యతే" అను విశేషణము బ్రహ్మమునకే యని గ్రహింప నగును.

గీ॥ సర్వతః పాణిపాదం సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి ॥　　॥౧౩॥

పదవిభాగము:— సర్వతః- పాణిపాదం- తత్- సర్వతః- అక్షిశిరోముఖం- సర్వతః- శ్రుతిమత్- లోకే- సర్వం- ఆవృత్య- తిష్ఠతి ॥

ప్రతిపదార్థము:— తత్=అజ్ఞేయమైన బ్రహ్మము; సర్వతః=అంతట; పాణిపాదము=హస్తములు, పాదములు కలది; సర్వతః=అంతట; అక్షిశిరోముఖం=నేత్రములు, శిరస్సులు, ముఖములు కలది; సర్వతః=అంతట; శ్రుతిమత్=శ్రోత్రేంద్రియములు కలది; లోకే=ప్రాణిసమూహమునందు; సర్వం=సర్వమును ఆవృత్య=వ్యాపించి; తిష్ఠతి=ఉంటున్నది.

"త ద్బ్రహ్మ న స న్నాస దితి నోచ్యతే" ఆ బ్రహ్మము సత్తు కాదు, అసత్తు కాదని చెప్పబడదు. అనగా అనిర్వచనీయము కాదు. ఎందువల ననిన? సత్తు నిరూపించబడుటవలన అని గ్రహింపుము. కాన ఆర్థాత్తు అనాది యగు యజ్ఞానమే యనిర్వచనీయ మని యర్థము. అని చెప్పెదరు. ఇట్టి వ్యాఖ్యానము చింత్యము. ఎందువలననిన? "జ్ఞేయం ప్రవక్ష్యామి" అని జ్ఞేయప్రవచనమును ప్రతిజ్ఞ చేసి యజ్ఞానమును నిరూపించుట యెట్లుచిత మగును? ఉచితము కాదు. కాన పూర్వోక్తవ్యాఖ్యానము చింత్యము. మరియు అజ్ఞానవంతు డగు జీవుడు జ్ఞాత యగుటచే జ్ఞేయము కానందున బ్రహ్మము విశేషణీయమను పక్షమునందు "తత్సత్" బ్రహ్మము సత్తు యింతమాత్రముచేతనే నిర్వాహ మగుచుండ మిగిలిన యంశమునకు వైయర్థ్యము ప్రాప్తించును. "నాస దాసీ న్నో సదాసీత్" ఇత్యాదిశ్రుతులకు విరోధము ప్రాప్తించును. కాన పూర్వవ్యాఖ్యాన ముపేక్షణీయ మని తేలిన యాశయము.　　॥౧-౨॥

నీలకంఠీయము:— ఈవిధముగ క్షేత్రమును వివరించి, "స చ యో యత్ప్రభావశ్చ" అను దానిచే ప్రతిజ్ఞాతమైన క్షేత్రజ్ఞస్వరూపమును, దాని మాయికప్రభావమును వివరించుచుండెను— "జ్ఞేయం ...అశ్నుతే" జ్ఞానసాధనములచే నెయ్యది తెలిసికొనదగినదో, దేనిని తెలిసికొని మోక్షమును పొందగలడో, అట్టిదాని స్వరూపమును చెప్పుచుండెను— "అనాదిమత్" అవ్యక్తము ఆదిమత్తు. 'తస్మా దవ్యక్త ముత్పన్నం' అను స్మృతి చొప్పున యవ్యక్తముగూడ సాదియే యగును. దానికంటె నితరమగునదియు, ఇట "అనాది" అనునంతమాత్రమే చెప్పినచో ప్రవాహనిత్యత్వమవ్యక్తాములకుగూడకలదు గాన వాటికిఅనాదిత్వము ప్రాప్తింప అట్టి అనాదిత్వమిట వివక్షితము గాదని తెల్పుటకై "అనాదిమత్" అనిచెప్పఁబడెను. లేక, "ఆదిమచ్చ తతః పరం చ ఆదిమ త్పరే తాభ్యా మన్య దనాదిమత్పరం" అను విగ్రహము నాశ్రయించిన ఆదిమత్పరము అనగా కార్యకారణము అని యర్థము. వానికంటె వేరగునది పరబ్రహ్మమను యర్థము సిద్ధించును. కనుక నే "పరం" నిర్విశేషమైనదియు, "బ్రహ్మ" త్రివిధపరిచ్ఛేదశూన్యము నగు బ్రహ్మము "న సత్త న్నాస దుచ్యతే" ప్రధానమువలెగాని, పరమాణువులవలెగాని, సత్తు అని గాని, శూన్యమువలె యసత్తు యని గాని చెప్పబడదు. ఈవిషయమే "నాఽస దాసీ న్నోస దాసీత్తదానీం. నాసీ ద్రజో నో వ్యోమాపరో ఽయమ్" అనుశ్రుతి తెల్పుచున్నది. ఈ శ్రుతి- అసచ్ఛబ్దవాచ్యమగు శూన్యము, సచ్ఛబ్దవాచ్యమగు ప్రధానము, రజశ్శబ్దితములగు పరమాణువులు, పరవ్యోమవాచ్యమగు అస్మదభిమతావ్యక్తము సృష్టికి పూర్వము లేవని నిషేధించుచున్నది.　　॥౧-౨॥

శాంకరభాష్యమ్:—

సచ్ఛబ్దప్రత్యయావిషయత్వాదసత్త్వాశంకాయాం జ్ఞేయస్య సర్వప్రాణికరణోపాధిద్వారేణ తదస్తిత్వం ప్రతిపాదయన్ తదాశంకానివృత్త్యర్థ మాహ— సర్వతః పాణిపాదం సర్వతః పాణయః పాదాశ్చాస్యేతి సర్వతః పాణిపాదం తజ్జ్ఞేయమ్ । సర్వప్రాణికరణోపా-

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సర్వవిశేషరహితము, అవాఙ్మానసగోచరము, దృష్టాదృష్టములకు విపరీతమునైన బ్రహ్మము సచ్ఛబ్దప్రత్యయావిషయమగుటవలన నట్టి బ్రహ్మము లేదను శంకపై సర్వప్రాణికరణరూపమైన యుపాధిద్వారా జ్ఞేయ బ్రహ్మముయొక్క అస్తిత్వమును ప్రతిపాదన చేయుచు పూర్వమునందు చెప్పబడిన యాశంకను తొలగించుటకు "సర్వతఃపాణిపాదం" అని చెప్ప మొదలిడెను.

—• ౧౩ వ అధ్యాయము ౧౩ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు నిరుపాధికమైన బ్రహ్మము సచ్ఛబ్దప్రత్యయావిషయమగుటవలన నసత్తను శంక "నాసత్" అనుదానిచే తొలిగించబడినను, విస్తారముగ నా యాశంకానివృత్తికొరకై, నిఖిలప్రాణికరణోపాధిద్వారముగ చేతనక్షేత్రజ్ఞస్వరూపత్వముచే బ్రహ్మాస్తిత్వమును 'సర్వతః' అను శ్లోకముచే జెప్పుచుండెను.

సర్వదేహములయందుండు అచేతనములైన హస్తములు, పాదములు తమతమ వ్యాపారములయందు యేచేతనస్వరూపమైన క్షేత్రజ్ఞసంబంధము కలవై ప్రవర్తింపదగిన వగుచున్నవో అట్టివాడు "సర్వతః పాణిపాదం" అనిచెప్పబడుచున్నాడు. అది జ్ఞేయమైన బ్రహ్మము. అనగా యేచేతనస్వరూపమైన క్షేత్రజ్ఞసంబంధమై యచేతనమైన పాణిపాదములు తమ తమ వ్యాపారమ లయందు ప్రవర్తించుచున్నవో అట్టి చేతనమే జ్ఞేయమైన బ్రహ్మము. నిఖిలాచేతనప్రవృత్తులు చేతనాధిష్ఠానపూర్వకము లగుటవలన నట్టి క్షేత్రజ్ఞస్వరూపమైన చేతనమైన సర్వాచేతనవర్గప్రవృత్తిహేతువైన బ్రహ్మము జ్ఞేయమై యుండ "నాస్తి" అను శంకయే లేదు.

ఇట్లే యెవనికి నిఖిలనేత్రేంద్రియములు, శిరస్సులు సర్వతః ప్రవర్తనీయములగుచున్నవో యట్టిబ్రహ్మము "సర్వతోఽక్షిశిరోముఖం" అని చెప్పబడును. అట్లే యెవనికి నిఖిలశ్రవణేంద్రియములు ప్రవర్తనీయములో యట్టి బ్రహ్మము "సర్వత శ్శ్రుతిమత్" అని చెప్పబడును. లోకమున సర్వప్రాణులయందు ఏకము, నిత్యము, విభువు అగు బ్రహ్మమే నిఖిలాచేతనవర్గము నావరించి తన సత్తచేతను, తన స్ఫూర్తిచేతను అధ్యాసిక సంబంధద్వారమున వ్యాపించి యున్నది. అట్లుండి నిర్వికారస్థితిని పొందుచున్నది. తనయం దధ్యస్తమైన జడప్రపంచముయొక్క దోషముచేగాని, గుణముచేగాని యణుమాత్రమైన తాను సంబంధించుటలేదు. ఎట్లు సర్వదేహములయందు చేతనము, విభువు, ఆత్మ యొక్కటే కాని యనేకము కాదో యట్లు మాచే పూర్వమునందే విస్తారముగ చూపబడెను. ॥౧౩॥

శంకరానందీయము:— ఇట్లు "సచ యో యత్ప్రభావశ్చ" అను స్థలమునందు యచ్ఛబ్దవివక్షితమైన క్షేత్రజ్ఞస్వరూపమైన యాత్మయొక్క ప్రకృతి ప్రాకృతవిలక్షణమైన నైజమైనట్టి తత్త్వము యతులచే విదేహముక్తికొరకు స్వాత్మస్వరూపముగ తెలిసికొనదగిన దని నిరూపించి, యిపుడు బ్రహ్మము

శాంకరభాష్యమ్:—

ధీభిః క్షేత్రజ్ఞాస్తిత్వం విభావ్యతే । క్షేత్రజ్ఞశ్చ క్షేత్రోపాధిత ఉచ్యతే । క్షేత్రం చ పాణిపాదాదిభి రనేకధా భిన్నమ్ । క్షేత్రోపాధిభేదకృతం విశేషజాతం మిథ్యైవ క్షేత్రజ్ఞస్యేతి తదపనయనేన జ్ఞేయత్వముక్తం 'న సత్తన్నాసదుచ్యత' ఇతి । ఉపాధికృతం మిథ్యారూప

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆజ్ఞేయబ్రహ్మము అంతట హస్తములు, పాదములు కలది. ఈచెప్పుటవలన నిఖిల ప్రాణికరణములగు పాణిపాదాదిరూపమైన యుపాధులచే క్షేత్రజ్ఞున కస్తిత్వము తెలవబడుచుండెను. క్షేత్రమనెడి యుపాధివలన క్షేత్రజ్ఞుడని చెప్పబడుచుండెను. పాణిపాదాదులచే క్షేత్ర మనేకము. క్షేత్రోపాధిభేదకృతమైన విశేషజాతమంతయు క్షేత్రజ్ఞునకు మిథ్యయే

సర్వశ్రుతిప్రసిద్ధమైనను, అట్టి బ్రహ్మము విదితావిదితములకంటె వేరగుటచే పరోక్షమగుటవలన బ్రహ్మము కలదా? లేదా యను సంశయము సంభవించుచుండ "దేని సన్నిధిమాత్రముచే దేహేంద్రియాదులు స్వస్వవ్యాపారములు కలవగుచున్నవో అట్టి చేష్టాకారణము బ్రహ్మమే" అను యనుమానప్రమాణముచే బ్రహ్మసత్త్వము తెలిసికొనుటకు శక్యమైనది. అని బోధించుటకు క్షేత్రజ్ఞునకు "యత్ప్రభావశ్చ" అను విశేషణవివక్షితమైన సర్వప్రాణికరణోపాధిమత్త్వరూపమైన శ్రుతిప్రసిద్ధమైన విశేషితరూపమును "సర్వతః" అను శ్లోకముచే జెప్పుచుండెను—

ఏది జ్ఞేయముగ నుపక్రాంతమై యనాదిమత్త్వాదిలక్షణములు కలదో యట్టి బ్రహ్మము "సర్వతః పాణిపాదం" సర్వప్రాణిసంబంధమైన సర్వపాణిపాదములు యేబ్రహ్మమునకో అట్టి బ్రహ్మము "సర్వతః పాణిపాదం" అని చెప్పబడును. "పాణిపాదం" అను శబ్ద మనుక్తకర్మేంద్రియముల కుపలక్షణము. అనగా వక్తవ్యవిషయమున యేకదేశకథనము. అనగా "పాణిపాదం" అనుశబ్దముచే కర్మేంద్రియములగు వాక్పాణిపాదపాయూపస్థలను గ్రహింపవలయును. నిఖిలప్రాణిసంబంధమైన నిఖిల నేత్రములు, శిరస్సులు,ముఖములు యెవనికో అట్టి బ్రహ్మము "సర్వతోఽక్షిశిరోముఖం" అని చెప్పబడుచున్నది. అక్షిపద మనుక్తమైన జ్ఞానేంద్రియముల కుపలక్షణము. అనగా అక్షిపదముచే మనోబుద్ధులను, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణరూపమైన పంచజ్ఞానేంద్రియములను గ్రహింపవలయును. సర్వతః శిరోగ్రహణము దేహానేకత్వమును సూచించుచున్నది. ఘటమఠాదివిశేషణములచే ఆకాశ మెట్లు ఘటాకాశమని, మఠాకాశమని వ్యవహరింపబడుచుండెనో యట్లే బ్రహ్మాది (హిరణ్యగర్భాది) పిపీలికాంత దేహవిశేషణముల చేతను,నామరూపముల చేతను స్వయముగ బ్రహ్మము విశేషింపబడుచుండెను. అని యర్థము. సర్వతః శ్రోత్రము లెవనికో వాడు "సర్వతః శ్రుతిమత్" అని చెప్పబడును. "లోక్యత ఇతి లోకః ప్రాణివర్గః తస్మిన్ లోకే" ఈ"లోకే" అనుశబ్దము సప్తమ్యంతము. ద్వితీయార్థముగ తెలిసికొనదగును. అనగా లోకశబ్దార్థమగు ప్రాణివర్గమును, ప్రకృతిని, ప్రాకృతమును, సర్వమును బహిరంతశ్చ అంతటను స్వరూపమైన చైతన్యముచే ఆకాశము ఘటమఠాదులను వ్యాపించియున్నటుల వ్యాపించి యుండెను. అట్టి యాత్మ తనచే వ్యాపింపబడిన దేహేంద్రియాదికమును ఇనుమును అయస్కాంతమువలె చేష్ట కలదానినిగ జేయుచున్నది. స్వయముగ చలించుటలేదు. నిర్విశేషబ్రహ్మమునకు యీపాణిపాదాదివిశేషణ విశేషితరూపము ఔపాధికము, మాయికము. స్వాభావికము మాత్రము కాదు. స్వాభావికమే యగుచో నిషేధము సంభవింపదు. బ్రహ్మమునకు వైశేషికరూపము "



శాంకరభాష్యమ్:—

మప్యస్తిత్వాధిగమాయ జ్ఞేయధర్మవ త్పరికల్ప్యోచ్యతే 'సర్వతః పాణిపాద' మిత్యాది। తథాహి సంప్రదాయవిదాం వచనమ్— "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యని అట్టి విశేషాపనయనముద్వారా జ్ఞేయత్వము "న సత్త న్నాస దుచ్యతే" అని చెప్పబడెను. ఉపాధికృతమైన మిథ్యారూపము కలదని తెలిసికొనుటకై జ్ఞేయధర్మముగ పరికల్పించి "సర్వతః పాణిపాదం" అని చెప్పెను. ఇది న్యాయమే. సంప్రదాయమును తెలిసినవారు

దుచ్యతే" అని నిషేధింపబడుచుండెను. కాన నీరూపము స్వాభావికము కాదు. అట్లగుచో నిట్టి రూపమప్రామాణిక మనెదవా? అప్రామాణికమును కాదు. "సర్వతః పాణిపాదం త త్సర్వతో౽క్షిశిరోముఖం। సర్వత శ్శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి॥ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్। సర్వస్య ప్రభు మీశానం సర్వస్య శరణం సుహృత్" ఇత్యాదిశ్రుతుల ప్రామాణ్యమువలన యీశ్వరసంబంధమైన ఆరూపము వ్యవహారమునందు సత్యమే. ఈరూపము నారాధించియే ముముక్షువు పరమేశ్వరానుగ్రహముచే ముక్తిని పొందుచున్నాడు. ఈవిషయమునే "మత్కర్మకృ న్మత్పరమః" అను గీతావాక్యము బోధించుచున్నది. నిర్విశేషము, క్షేత్రజ్ఞస్వరూపము నగు ఆత్మకు సవిశేషస్వరూపోపన్యాసము నిర్విశేషబ్రహ్మసద్భావద్యోతనార్థ మని గ్రహింపుడు. ప్రతిపాదితమైన సర్వతః పాణిపాదాదిస్వరూప మగు క్షేత్రమును తెలిసికొనువాడు క్షేత్రజ్ఞు డనబడును. లేక క్షేత్రధర్మములచే తెలియబడువాడు కాన క్షేత్రజ్ఞు డనబడును. "చర్మదారుప్రతిమలువలె స్వతః జడము అగుటవలన పాణిపాదబుద్ధీంద్రియాదులు చేతనశక్తి నిమిత్తముగా కల స్వవ్యాపారములు కలవి." అను యనుమానప్రమాణముచే చేతనుడు నిర్విశేషుడు తెలియ నగును. మరియు రథాదులవలె చేతనాధిష్ఠాతృతంత్రబుద్ధిపూర్వకముగ ప్రవృత్తి కలవి కాన దేహేంద్రియాదులు స్వతః జడము అని గ్రహింపవలయును. ఇట్లు సర్వప్రాణిదేహేంద్రియాద్యుపాధులచే జ్ఞేయమైన బ్రహ్మమున కస్తిత్వము తెలియబడుచున్నది. ఇందునిమిత్తమే క్షేత్రజ్ఞు డగు యాత్మ యసంగమైనను ఔపాధికమగు పాణిపాదాదిమత్త్వము మిథ్యాభూతమైనను యంగీకరించి ముముక్షువులకు తన తత్త్వము తెలియుటకొరకు "శాఖాఽగ్రచంద్రః" అను న్యాయము ననుసరించి శ్రీకృష్ణపరమాత్మచే చెప్పబడెను. అందువలన "న సత్త న్నాస దుచ్యతే" అనునదియే పారమార్థికరూప మని చెప్పబడెను. ఈచెప్పుటచే పరస్పరము భిన్నమైన సర్వక్షేత్రములయందు క్షేత్రజ్ఞస్వరూపమైన యాత్మ కేకత్వము, స్వసన్నిధిమాత్రముచే తత్తద్దేహేంద్రియాది వ్యాపారనిమిత్తత్వము, దేహేంద్రియాదిప్రవర్తకు డగుటచే దేహేంద్రియాదిభిన్నత్వము, నిరవయవత్వము, నిత్యత్వము, చేతనత్వము, అసంసారిత్వము, పూర్ణత్వము చెప్పబడినవి. ॥౧౩॥

భాష్యార్థదీపిక:— సర్వవిశేషరహితము, వాగాదీంద్రియాగోచరము నగునది సచ్ఛబ్దావిషయమగుటవలన నట్టిది అసత్తే యను శంకను "నాస దుచ్యతే" అనుదానిచే సంక్షేపముగ తొలగించినను ప్రత్యగ్రూపమగుటచేతను, నింద్రియప్రవృత్త్యాదిహేతువగుటవలనను, కల్పితద్వైతప్రపంచమునకు సత్తను, స్ఫూర్తిని యిచ్చునదగుటచేతను జ్ఞేయమున కస్తిత్వమును ప్రతిపాదన చేయుచు ముందుగ అచేతనములగు రథాదులకు ప్రవృత్తి యెట్లు చేతనాధీనమో యట్లే యచేతనములగు సర్వప్రాణికరణముల ప్రవృత్తి చేతనాధీనము. అచేతనము ప్రత్యక్చైతన్యమైన బ్రహ్మమే యని విస్తారముగ పూర్వోక్తమైన యాశంకయొక్క నివారణనిమిత్తమై "సర్వతః" అని చెప్పమొదలిడెను.

శాంకరభాష్యమ్:—

చ్యతే" ఇతి। సర్వత్ర సర్వదేహావయవత్వేన గమ్యమానాః పాణిపాదాదయో జ్ఞేయశక్తి సద్భావనిమిత్తస్వకార్యా ఇతి జ్ఞేయసద్భావే లింగాని జ్ఞేయస్యేత్యుపచారత ఉచ్యంతే। తథా వ్యాఖ్యేయ మన్య త్సర్వతః పాణిపాదం త జ్జ్ఞేయమ్। సర్వతోఽక్షిశిరోముఖం సర్వతాఽక్షిణి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే" అధ్యారోపముచేతను, అపవాదము చేతను నిష్ప్రపంచమగు బ్రహ్మము తెలుపబడుచుండెనని పలుకుచుండిరి. అంతట సకల దేహావయవములుగ తెలియబడుచుండిన పాణిపాదాదులు జ్ఞేయమగు బ్రహ్మముయొక్క శక్తి యుండుటవలననే తమ కార్యములగు ఆదానగమనాదులు కలవై యున్నవి. కాన పాణి

సర్వత్ర హస్తములు, పాదములు యెవనికి కలవో వాడు జ్ఞేయమైన బ్రహ్మము. విచారింప హస్తాదులు దేహస్థములగుటచే నాత్మధర్మములు కావు. అయినను 'రథాదిప్రవృత్తి వలె కరణప్రవృత్తి చేతనాపూర్వకప్రవృత్తి యగుటవలనచేతనాధిష్ఠానపూర్వకమైనది.' అను యనుమానప్రమాణముచే సర్వప్రాణికరణోపాధులచేతను క్షేత్రజ్ఞాన కస్తిత్వ మూహింప నగును.

పూర్వపక్షము:—

పైనిచెప్పిన విధమున చేతనాస్తిత్వము సిద్ధించును కాని క్షేత్రజ్ఞున కస్తిత్వ మెటుల సిద్ధించును?

సిద్ధాంతము:—

చేతనుడే క్షేత్రోపాధివలన క్షేత్రజ్ఞుడని చెప్పబడును. కాన చేతనాస్తిత్వము క్షేత్రజ్ఞాస్తిత్వమే యగును.

పూర్వపక్షము:—

క్షేత్రోపాధివలన చైతన్యము క్షేత్రజ్ఞస్వరూపమైనను క్షేత్రజ్ఞునకు పాణ్యాదిమత్త్వ మెటుల సంభవించును?

సిద్ధాంతము:—

క్షేత్రము పాణ్యాదులచే ననేకముగ భిన్నమగుటచే తదుపాధివలన క్షేత్రజ్ఞునకు పాణ్యాదిమత్త్వము సువచమే. "న సత్త న్నాస దుచ్యతే" అని నిర్విశేషముగ జ్ఞేయ మని చెప్పుట క్షేత్రోపాధికృతమైన విశేషజాతము మిథ్య యగుటవలన క్షేత్రజ్ఞునకు అట్టి విశేషజాతముయొక్క యపనయనద్వారా సువచమే యగును.

పూర్వపక్షము:—

ఉపాధికృతమైన పాణ్యాదిమత్త్వము మిథ్య యగుటవలన "యత్త జ్ఞేయం ప్రవక్ష్యామి" అని జ్ఞేయప్రవచనాధికారమునందు (ప్రకరణమునందు) పాణ్యాదిమత్త్వమును చెప్పుట యపార్థము కాదా?

సిద్ధాంతము:—

జ్ఞేయాస్తిత్వబోధకొరకు జ్ఞేయధర్మములు కలవిగ కల్పన చేసి అట్టి పాణ్యాదిప్రతిపాదనము సార్థకమే యగును కాని నిరర్థకము కాదు. సంప్రదాయవేత్త లీవిషయమునే "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం

శాంకరభాష్యమ్:—

శిరాంసి ముఖాని చ యస్య త త్సర్వతోఽక్షిశిరోముఖమ్ । సర్వతః శ్రుతిమ చ్ఛ్రుతిః శ్రవణేంద్రియం త ద్యస్య తచ్ఛ్రుతిమ ల్లోకే ప్రాణినికాయే సర్వ మావృత్య సంవ్యాప్య తిష్ఠతి స్థితిం లభతే ॥ ॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పాదాదుల కార్యములవలన జ్ఞేయమగు బ్రహ్మము సిద్ధించుచున్నది. అందువలననే పాణిపాదాదుల కార్యములు జ్ఞేయమునం దుపచారమువలననే జ్ఞేయనిష్ఠములే యని చెప్పబడుచున్నవి. ఇట్లే మిగిలినచోట్లగూడ వ్యాఖ్యానింపదగును. ఆజ్ఞేయమంతటను పాణిపాదములు కలది. అంతటను నేత్రములు, శిరస్సులు కలది. అంతటను శ్రవణేంద్రియములుకలది. అంతటను ప్రాణిసమూహమునందు సర్వము నావరించి యుంటున్నది. ॥౧౩॥

ప్రపంచ్యతే" అధ్యారోపాపవాదములచే నిష్ప్రపంచము చెప్పబడుచున్న దని చెప్పియుండిరి. (మూలార్థము పూర్వోక్తవ్యాఖ్యారీతినే తెలిసికొనదగును.) ॥౧౩॥

నీలకంఠీయము:— ద్వైవిధముగ "స చ యః" అనుదానిచే ప్రతిజ్ఞాతమైన నిర్విశేషమగు క్షేత్రజ్ఞస్వరూపమును వివరించి, "యత్ప్రభావః" అనుదానిచే ప్రతిజ్ఞాతమైన విశ్వరూపస్వరూప మగు క్షేత్రజ్ఞస్వరూపము నుపపాదించుచుండెను— "సర్వతః పాణిపాదం తత్" ఆక్షేత్రజ్ఞస్వరూపము సర్వదిక్కులయందును, లోపలను, వెలుపలను హస్తములు, పాదములు కలది. "సర్వతోఽక్షిశిరోముఖం" ఇట్లే యంతటను నేత్రములు, శిరస్సులు, ముఖములు కలది. "సర్వతః...తిష్ఠతి" అంతటను శ్రోత్రములు కలది. లోకమునంతను వ్యాపించియున్నది. స్వప్నద్రష్టయగు తైజసుడు వాసనామయమైన పాణిపాదాదికముతో స్వాప్నికప్రపంచము ననుభవించును. వానికే జాగ్రదవస్థయందు ఉపాధిభూత మగు పిండగతమైన పాదాదికమే స్థూలప్రపంచానుభవసంస్కారాధానద్వారమున వాసనామయప్రపంచమునకు కారణ మగుచున్నది. ఇట్లే వాసనామయప్రపంచము స్థూలప్రపంచమునకు కారణ మగుచున్నది. కాన బీజాంకురన్యాయముచే వాసనామయప్రపంచ, స్థూలప్రపంచములు రెండును పరస్పరసద్భావమునందును పరస్పరోత్పత్తియందును కారణము లగుచున్నవి. ఈవిధముగనే సకలప్రాణిధీవాసనోపరక్త మగు యజ్ఞానము ఉపాధిగా కల చైతన్యము సకలప్రాణిధీవాసనామయ మగు సమష్టిసూక్ష్మప్రపంచమును భాసింపజేయుచున్నది. అట్టి చైతన్యమునకు బ్రహ్మాండగతసకలపాణిపాదాదికమే యుపాధి యగుచున్నది. ఇంతకును పర్యవసిత మేమన: తైజసస్థలము నందువలె స్థూలసమష్టిప్రపంచము, సూక్ష్మసమష్టిప్రపంచము నీరెంటికి పరస్పరమునందు పరపరస్పరసద్భావము, పరస్పరకారణత్వము బీజాంకురన్యాయమున యంగీకరింపబడెను. ఇది భగవద్భాష్యకారుల యభిప్రాయము. సకలప్రాణికరణరూపోపాధిద్వారమున జ్ఞేయబ్రహ్మమున కస్తిత్వము ప్రతిపాదింపబడుచున్నది కనుక కార్యద్వారమున కారణాస్తిత్వము సిద్ధింప "అనాదిమత్పరం బ్రహ్మ న స త్తన్నాస దుచ్యతే" అను కారణాభావము నిషేధింపబడెను. ఇట "ప్రక్షాళనాద్ధి పంచకస్య దూరా దస్పర్శనం వరం" అను న్యాయమున కారణోపన్యాసము వ్యర్థ మని శంకింపవలదు. అట్టి కారణోపన్యాసము లేనిచో శుద్ధబ్రహ్మాధిగమమే సంభవింపనేరదు. శాఖాచంద్రన్యాయమున సగుణబ్రహ్మము నిర్గుణబ్రహ్మమునకు జ్ఞాపక మగుచున్నది. ఈవిషయమే భాష్యమునం దిట్లు చెప్పబడెను— "ఉపాధికృతమిథ్యారూప మస్తిత్వాధిగమాయ జ్ఞేయధర్మవత్ పరికల్ప్యోచ్యతే సర్వతః పాణిపాద మిత్యాది । తథా హి సంప్రదాయవిదాం వచనం— "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే" అని. ॥౧౩॥

గీ॥ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ ॥౧౪॥

పదవిభాగము:— సర్వేన్ద్రియగుణాభాసం- సర్వేన్ద్రియ వివర్జితం- అసక్తం- సర్వభృత్- చ- ఏవ- నిర్గుణం- గుణభోక్తృ- చ ॥ ॥౧౪॥

ప్రతిపదార్థము:— సర్వేన్ద్రియగుణాభాసం= సర్వేన్ద్రియ = వాక్పాదపాణిపాయూపస్థలనెడి పంచ కర్మేంద్రియములు; త్వక్ చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడి పంచజ్ఞానేన్ద్రియములు, మనోబుద్ధులు వీటియొక్క; గుణ=గుణములచే అనగా అధ్యవసాయ (నిశ్చయ) సంకల్ప శ్రవణవచనాదులచే ఆభాసం=ప్రకాశించునది; సర్వేన్ద్రియవివర్జితం=సర్వకరణరహితము: అసక్తం= దేనితోటినియు సంబంధము లేనిది; సర్వభృచ్చైవ=సర్వమును భరించునది; నిర్గుణం=సత్త్వరజస్తమోరూపమైన గుణములు లేనిది; గుణ భోక్తృ చ=శబ్దాదిద్వారమున సుఖదుఃఖమోహాకారముగ పరిణమించిన సత్త్వరజస్తమోరూపమైన గుణములను సాక్షాత్కరింప చేసుకొనునది. ॥౧౪॥

---

శాంకరభాష్యమ్:—

ఉపాధిభూతపాణిపాదాదీన్ద్రియాధ్యారోపణా జ్ఞేయస్య తద్వత్తాశంకా మా భూది త్యేవ మర్థః శ్లోకారంభః — సర్వేంద్రియగుణాభాసం సర్వాణి చ తానీంద్రియాణి శ్రోత్రాది దీని బుద్ధీంద్రియకర్మేంద్రియాఖ్యా న్యంతఃకరణే చ బుద్ధిమనసీ జ్ఞేయోపాధిత్వస్య తుల్యత్వా

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

'ఉపాధులగు పాణిపాదాదీంద్రియముల యధ్యారోపమువలన జ్ఞేయమగు బ్రహ్మము నకు పాణిపాదాదీంద్రియసత్త్వము సంభవించెడిని' అను యాశంక సంభవింపకుండుటకై "సర్వేన్ద్రియగుణాభాసం" అను శ్లోకమును ప్రారంభించుచుండెను—

---

—• ౧౩ వ అధ్యాయము ౧౪ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— 'అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే' అను న్యాయము ననుసరించి సర్వప్రపంచాధ్యారోపముచే "అనాదిమత్పరం బ్రహ్మ" అని వ్యాఖ్యానించి యిపుడు తదపవాదముచే "న సత్త న్నాస దుచ్యతే" అని నిరుపాధిస్వరూపజ్ఞానము కొరకువ్యాఖ్యానించుటకు "సర్వేన్ద్రియగుణాభాసం" అని ప్రారంభించెను.

అబ్రహ్మము పరమార్థతః సర్వేంద్రియవివర్జితమైనను మాయచే సర్వేంద్రియగుణాభాస మగుచున్నది. నిఖిలబహిఃకరణములైన శ్రోత్రాదులయొక్క, అంతఃకరణములైన బుద్ధిమనస్సులయొక్క గుణములైన అధ్యవ సాయసంకల్పశ్రవణవచనాదులచే తత్తద్విషయస్వరూపముగ భాసించుచున్నదివలె, సర్వేంద్రియవ్యాపారము లచే వ్యాపృతమైనదివలె నున్నది యాజ్ఞేయమైన బ్రహ్మము. ఈవిషయమునే "ధ్యాయతీవ లేలాయతీవ" అను బృహదారణ్యకశ్రుతిబోధించుచున్నది. ఇచట ధ్యానము బుద్ధీంద్రియవ్యాపారముల కుపలక్షణము. లేలాయనమనగ చలనము. ఇది కర్మేంద్రియవ్యాపారముల కుపలక్షణము. అట్టి బ్రహ్మ మసక్తము. అనగా

శాంకరభాష్యమ్:—

త్సర్వేంద్రియగ్రహణేన గృహ్యంతే। అపి చాంతఃకరణోపాధిద్వారేణైవ శ్రోత్రాదీనా మప్యుపాధిత్వ మిత్యతోఽన్తః కరణబహిష్కరణోపాధిభూతైః సర్వేంద్రియగుణై రధ్యవసాయ సంకల్పశ్రవణవచనాదిభి రవభాసత ఇతి సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవ్యాపారై

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జ్ఞేయమగు బ్రహ్మముయొక్క యుపాధిత్వము పాణిపాదాదులకువలె బుద్ధిమనస్సులకుకూడ సమానమగుటవలన సర్వేంద్రియముల గ్రహణముచే బుద్ధి మనస్సులుకూడ గ్రహింపనగును. కాన నిఖిలమైన వాక్పాదపాణిపాయూపస్థలనెడి పంచకర్మేంద్రియములు, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడి పంచజ్ఞానేంద్రియములు, మనోబుద్ధులు వీటిచేతను, మరియు

సర్వసంబంధశూన్యమే. అయినను మాయచే "సర్వభృచ్చ" నిరధిష్ఠానభ్రమ సంభవము కాదు కాన సదాత్మచే కల్పితమైన సర్వమును ధరించుచున్నది. అట్లే పరమార్థమువలన నిర్గుణమైనను అనగా సత్త్వరజస్తమోగుణరహితమైనను "గుణభోక్తృ చ" శబ్దాదిద్వారమున సుఖదుఃఖమోహాకారమున పరిణతములైన సత్త్వరజస్తమోగుణములను సాక్షాత్కరింపజేసుకొనునదియే అజ్ఞేయమైన బ్రహ్మము. ॥౧౪॥

శంకరానందీయము:— అట్లగువో క్షేత్రజ్ఞునకే యీశ్వరత్వము ప్రాప్తమగుననెదవా? అందు నిమిత్తమేకదా గీతాశాస్త్రారంభము. కనుకనే "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని శ్రీకృష్ణపరమాత్మ బోధించుచుండెను. "సర్వేన్ద్రియగుణాభాసం" అను శ్లోకము మొదలుకొని నాలుగుశ్లోకములచే క్షేత్రజ్ఞలక్షణమునే చెప్పుచుండెను. "ఇన్దయన్తి=బోధయన్తీ తీన్ద్రియాణి" తమతమ విషయము లగు శబ్దాదులను బోధించునవి (తెలుపునవి) కాన బాహ్యములగు శ్రోత్రాదులు, వాగాదులు, అంతరింద్రియమగుమనస్సు ఇంద్రియము అనబడును. మరియు ఆత్మోపాధియగుటవలన నిశ్చయాత్మకమగు బుద్ధియు యింద్రియశబ్దముచే గ్రహింపనగును. ఇట్టి యింద్రియములయొక్క గుణములు స్పష్టత్వాస్పష్టత్వదుష్టత్వాదుష్టత్వాదులు, శ్రవణస్పర్శనవచనాదానసంకల్పాధ్యవసాయాదులు యెవనిచే ప్రకాశింపబడుచుండెనో వాడు "సర్వేన్ద్రియగుణాభాసం" అని చెప్పబడును. బుద్ధ్యాదులు కాలిన యినపగుండువలె స్వతః జడము లగుటవలన తమకంటె భిన్నమైన దానివలన ప్రాప్తమైన ప్రకాశ కలవి. బుద్ధ్యాదులు ఘటాదికమువలె జ్ఞేయమగుటవలన జడములు కాన బుద్ధ్యాదులకు, తద్గుణములకు యేది ప్రకాశకమో అజ్ఞాతయే బ్రహ్మమని తెలిసికొనుపగును.

లేక:— సర్వేంద్రియగుణము లగు శ్రవణాదులచే ప్రకాశించువాడు కాన "సర్వేన్ద్రియగుణాభాసం" అని చెప్పబడును. 'వాస్యాదులు (ఉలి, చేబాడితి) వలె యింద్రియములు ప్రయోజ్యకరణము లగుటవలన నధిష్ఠాతృప్రయోజ్యములు' అను యనుమానప్రమాణమువలన కరణము లగు యింద్రియముల క్రియచే క్షేత్రజ్ఞునియొక్క సద్భావము తెలియబడు నని "సర్వేన్ద్రియగుణాభాసం" అని చెప్పబడెను. అసంగుడు, క్రియారహితుడు నగు నాత్మకు కరణము లగు యింద్రియముల ప్రయోక్తృత్వ మెట్లు సంభవించు ననెదవా? కరణప్రయోక్తృత్వ మాత్మయం దారోపితమగుటవలన విరోధము ప్రాప్తింపదని గ్రహింపుము. అది యెట్లనిన? పద్మవికాసము పద్మధర్మము. అది "పద్మమును వికసింపజేయుచుండెను సూర్యుడు" అని సూర్యునియం దారోపింపబడునటుల ఉపాధిధర్మమగు శ్రవణాదికము "ఆత్మ కరణములనుప్రవర్తింపచేయుచుండెను" అని యాత్మసద్భావాధిగమమునిమిత్తమై యాత్మయం దధ్యసింపబడుచుండెను. అందుచే కరణము

శాంకరభాష్యమ్:—

ర్వ్యాపృతమివ తజ్జ్ఞేయ మిత్యర్థః । "ధ్యాయతీవ లేలాయతీవ" ఇతి శ్రుతేః । కస్మా త్పునః కారణా న్న వ్యాపృత మేవేతి గృహ్యత ఇత్యత ఆహ— సర్వేంద్రియవివర్జితం సర్వకరణ రహిత మిత్యర్థః । అతో న కరణవ్యాపారై ర్వ్యాపృతం త జ్జ్ఞేయమ్ । య స్త్వయం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అంతఃకరణ యనెడి యుపాధిద్వారముననే శ్రోత్రాదీంద్రియముల కుపాధిత్వము కాన యంతఃకరణరూపోపాధియొక్క బహిష్కరణోపాధులయొక్క గుణములైన అధ్యవసాయ, సంకల్ప, శ్రవణ, వచనాదులచే భాసించునది యాజ్ఞేయ బ్రహ్మము. ఈవిషయమునే "ధ్యాయ తీవ లేలాయతీవ'' అను శ్రుతియు బోధించుచున్నది. ఏ కారణమువలన వ్యాపృతమువలె

అగు శ్రోత్రాదులవ్యాపారములచే వ్యాపారివలె వృక్షచలనముచే నాకాశము చలించుచున్నది అన్నటుల బ్రహ్మము భాసించుచుండెను. ఈవిషయమునే ''ధ్యాయతీవ లేలాయతీవ'' అను శ్రుతిబోధించుచున్నది.

''పశ్య త్యచక్షు స్స శృణో త్యకర్ణః'' అనుశ్రుతి యాత్మ చక్షురాదీంద్రియములు లేనివాడైనను ఉపాధి ద్వారా చూచువాడు, వినువాడు అని బోధించుచుండ నాత్మ శ్రవణాదివ్యాపారశూన్య డని చెప్పుట యెటుల పొసగు నని శంకింపజనదు. పైశ్రుతికి పైనచెప్పిన యర్థమునందు తాత్పర్యము కాదు మరేమనిన? ''వశీ సర్వస్య లోకస్య స్థావరస్య చరస్య చ'' యీశ్వరుడు జంగమస్థావరాత్మకమైన నిఖిలప్రపంచమునకు వశీ కాన నీశ్వరునకు వశిత్వము, సర్వలోకనిగ్రహానుగ్రహకారిత్వము ప్రాప్తము. అందుచేనీశ్వరునకు దేహేం ద్రియాదివైశిష్ట్యము ప్రాప్తించియుండ తాదాత్మ్యరాహిత్యమును శ్రుతి బోధించుచుండెను. పరమాత్మకు క్రియా వత్త్వము సంభవింపదు, అట్లగునో ''నిష్కలం నిష్క్రియం'' ''వృక్ష ఇవ స్తబ్ధోదివి తిష్ఠతి'' ''స్థాణు రచలోఽయం సనాతనః'' ''సర్వ మావృత్య తిష్ఠతి'' ఇత్యాదిశ్రుతిస్మృతివిరోధము ప్రాప్తించును. అందు వలన వృక్షము చలించుచుండ ఆకాశము చలించుచున్నది అనునటుల యుపాధి చలించుచుండ నాత్మ చలించున్నదివలె భాసించుచున్నది. ఆత్మ నిరవయవ మగుటవలనను, పూర్ణ మగుటవలనను, నిరాకారమగుట వలనను, నిరింద్రియ మగుటవలనను స్వయముగ చలింపదు. అందువలననే ఆత్మసద్భావాధిగమముకొరకు అంగీకృతమైన యుపాధిసంబంధముయొక్క రాహిత్యముచే బోధించుటకొరకు ''సర్వేంద్రియవివర్జితం'' అని చెప్పెను. చెప్పబడిన సర్వేంద్రియములతోటి తదాశ్రయములతోటి, ఇంద్రియకృతమైన పుణ్య పాపాదికర్మలతోటి వివర్జిత (రహిత) మాత్మ యని యర్థము. ఆత్మకు దేహేంద్రియాదిసంబంధము సిద్ధింప దనుటలో హేతువును ''అసక్తం'' అనుదానిచే చెప్పుచుండెను. ఆత్మనిరవయవమగుటవలన దేనితోడను సంయోగాదిసంబంధము లేనిది. అని ''అసక్తం'' అను పదమున కర్థము. ''అసంగో హ్యయం పురుషః'' అను శ్రుతియు ఆత్మ యసంగమని బోధించుచున్నది. ''సర్వేన్ద్రియవివర్జితం'' అని చెప్పుటచే నాత్మకు దేహేంద్రియాదులు కలవా? లేక ఆత్మ యసంగు డగుటవలన దేహేంద్రియాదివర్జితుడా? అని సంశయము ప్రాప్తింప దేహేంద్రియాదు లాత్మకు లేవని ''నిర్గుణం'' అనుదానిచే బోధించుచుండెను. గుణములనగ సత్త్వరజస్తమోగుణకార్యములగు దేహేంద్రియాదులు. ఆత్మ అట్టి దేహేంద్రియాదులు లేనివాడగుటవలన నిర్గుణము. ''యత్త ద్రదేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం । నిత్యం విభుం

శాంకరభాష్యమ్:—

మంత్రః— "అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షు స్స శృణో త్యకర్ణః" ఇత్యాదిః స సర్వేంద్రియోపాధిగుణానుగుణ్యభజనశక్తిమ త్త జ్ఞేయ మిత్యేవంప్రదర్శనార్థో న తు సాక్షా దేవ జవనాదిక్రియావత్త్వప్రదర్శనార్థః । "అంధో మణి మవిందత్" ఇత్యాదిమంత్రార్థవ త్తస్య

శాంకరభాష్యతత్త్వబోధిని:—

గ్రహింపబడుచున్నది? అనుయాశంకపై "సర్వేంద్రియవివర్జితం" అని చెప్పబడెను. ఆ జ్ఞేయ బ్రహ్మము సర్వకరణరహితము. కాన నా జ్ఞేయబ్రహ్మము కరణవ్యాపారములచే వ్యాప్త తము (కూడుకొనినది) కాదు. 'అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షు స్స శృణో త్యకర్ణః' అను మంత్రము సర్వేంద్రియోపాధి గుణానుగుణ్య భజనశక్తి కలది జ్ఞేయ మను యర్థప్రదర్శ

సర్వగతం సుసూక్ష్మం" "అశరీరం శరీరేషు" "అశరీరో నిరింద్రియోఽ ప్రాణోఽ మనాః సచ్చిదానంద మాత్రః" ఇత్యాదిశ్రుతులు పైవిషయమునే బోధించుచున్నవి. ఈ చెప్పుటచే "సర్వతః పాణిపాదం"అని బ్రహ్మయొక్క సత్త్వాధిగమముకొరకే పాణిపాదాద్యుపన్యాసము కాని, బ్రహ్మస్వరూపాధిగమముకొరకు కాదని సూచితము. పాణిపాదాద్యుపన్యాసము బ్రహ్మస్వరూపాధిగమముకొరకే యనినచో "నిర్గుణం" అని నిషేధమున కనుపపత్తి ప్రాప్తించును.

లేక:— "నిర్గుణం" కేవలసద్రూపమునకు గుణము లంగీకరింపనందున యాత్మ గుణరహిత మని యర్థము. బ్రహ్మమునకు సత్త్వాదిగుణములు కాని, రూపాదులు కాని, సుఖాదులు కాని లేవు. వేటిసంబంధము వలన స్వయముగ గుణి యగునో అట్టి గుణములు లేవు. సత్త్వాదులచే గుణియే బ్రహ్మ మగుచో గుణనాశము వలన గుణికూడ నశింపవలయును. అను న్యాయమున బ్రహ్మకుకూడ నాశము ప్రసక్త మయ్యెడిని.

గుణి నిత్యమగుచో తద్గుణములుకూడ నిత్యములే యగును. అని శంకింపజనదు. గుణములు నిత్య మనుట యందు ప్రమాణము లేమింజేసి గుణములు నిత్య మని చెప్పుట నీలు కాదు. "సత్యకామ స్సత్యసంకల్పః" అనుశ్రుతియే గుణములు నిత్యములని చెప్పుటయందు ప్రమాణ మని శంకింపజనదు. "సత్యకామ స్సత్య సంకల్పః" అను స్థలమునందు గల సత్యశబ్దమునకు "అమోఘము" అని యర్థము చెప్పవలయును. నిత్యమని యర్థము కాదు. నిత్యమే యనినచో సృష్టికామము నిత్యమగుటచే సర్వదా (యెల్లపుడు) సృష్టియే సంభ వింపవలసివచ్చును. "వికల్పో న హి వస్తుని" అని గుణములను, గుణకార్యములకు అవస్తుత్వమే శ్రూయమాణ మగుచున్నది. "అశబ్ద మస్పర్శం" అని బ్రహ్మకు రూపాద్యభావము శ్రూయమాణ మగుటవలన బ్రహ్మకు రూపాదులు సంభవింపవు. బ్రహ్మము రూపాదిమత్తే యగుచో సావయవత్వము ప్రాప్తించెడిని. సావయవత్వ మంగీకరించినచో "య త్సావయవం త దనిత్యం యథా ఘటః" అను అనుమానప్రమాణమువలన ననిత్యత్వము బ్రహ్మకు ప్రాప్తించెడిని. కాన బ్రహ్మము రూపాదిశూన్యము. సుఖాదులు జ్ఞేయములు కాన క్షేత్రధర్మము లగుటంజేసి నాత్మధర్మములు కావు. "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అను శ్రుతిచే బ్రహ్మము నిర్గుణ మని చెప్పబడుటచే గుణరహితమే బ్రహ్మము.

విచారింప బ్రహ్మము స్వయముగ సత్త్వాదిగుణతత్కార్యరహితమే. అయినను "గుణభోక్తృ చ" సత్త్వ రజస్తమోగుణములను, గుణకార్యములగు దేహేంద్రియాదులను, శబ్దాదులను, సుఖాదులను "భోక్తృ"

శాంకరభాష్యమ్:—

మంత్రస్యార్థః। యస్మా త్సర్వకరణవర్జితం జ్ఞేయం తస్మా దసక్తం సర్వసంశ్లేషవర్జితమ్। యద్య ప్యేవం తథాఽపి సర్వభృచ్చైవ। సదాస్పదం హి సర్వం- సర్వత్ర సద్బుద్ధ్యనుగమాత్। న హి మృగతృష్ణికాదయోఽపి నిరాస్పదా భవంతి। అతః సర్వభృ త్సర్వం బిభర్తీతి। స్యా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నార్థమే కాని, సాక్షాత్తు జవనాదిక్రియలు కలది జ్ఞేయబ్రహ్మమని చెప్పుటకు కాదు. "అస్థోమణి మవిన్దత్" ఇత్యాది మంత్రార్థమువలె పైమంత్రమునకు కూడ యర్థము గ్రహింప నగును. జ్ఞేయమగు బ్రహ్మము సర్వకరణవివర్జిత మగుటవలననే దేనితోడను సంబంధము లేనిది. ఇట్టి దైనను సర్వమును భరించునది. "స న్ఘటః, స న్పటః" ఇత్యాది సద్బుద్ధులను సర్వము అనుస రించుటవలన సర్వము సత్తే ఆశ్రయముగా కలది. మృగతృష్ణికాదులు కూడ నిరాస్పదములు

బుద్ధ్యాదిసాన్నిధ్యమువలన నిఖిలజ్ఞేయజాతమును తెలిసికొనుచున్నది. ఉపలబ్ధ బ్రహ్మము అని చెప్పుటచే బ్రహ్మకు పరిచ్ఛిన్నత్వము, సద్వితీయత్వము ప్రాప్తించుచున్నది. అట్టిపరిచ్ఛిన్నత్వ, సద్వితీయత్వములను 'సర్వభృ చ్చ' అనుదానిచే తొలగించుచుండెను. తనయం దారోపితమైన అవ్యక్తాదిస్థూలాంతసర్వమును తనసత్తాస్ఫూర్తులచే సత్తావత్తుగను, స్ఫూర్తిమత్తుగను చేసి తన స్వరూపముగనే భరించువాడు కాన "సర్వభృత్" అని చెప్పఁబడు చున్నాడు. ప్రపంచమునందు సర్వత్ర సదన్వయమువలనను, చిదన్వయమువలనను, "సదిదం సర్వం, చిదిదం సర్వం" అను శ్రుతివలనను సర్వము బ్రహ్మమే. "సత్యం చానృతం చ సత్య మభవత్" అను శ్రుతియు సర్వము బ్రహ్మమే యని బోధించుచున్నది. కాన బ్రహ్మవ్యతిరిక్తమైన వస్తువే లేనందున బ్రహ్మమునకు పరిచ్ఛిన్నత్వము, సద్వితీయత్వము సంభవింపనేరవు. ॥౧౪॥

నీలకంఠీయము:— యూపాహవనీయాదులవలె పరబ్రహ్మము అలౌకికమయ్యును, కార్య కారణరూపప్రపంచముతో గూడినదై విచిత్రముగనే యున్నదని "సర్వతః పాణిపాదం తత్" అను మొదలగు శాస్త్రముతో గార్యశేషముగ సమర్థింపబడుచున్నది— శాస్త్ర ముపాసనాపరము. ఇంతియే గాని పరబ్రహ్మకు వైచిత్ర్యమును ప్రతిపాదించుటకు సమర్థము కాదందువా? అట్లుగాదు: దేవతాధికరణ న్యాయముచే దేవతావిగ్రహాదికమువలె నట్టి వైచిత్ర్యముగూడ నవాంతరతాత్పర్యవిషయముగనే సిద్ధించును కాన సర్వతః పాణిపాదత్వాదిధర్మములు కల్గుట వాస్తవమే గాన యపవాదము తగదను యాశంకపై జెప్పు చుండెను— "సర్వేంద్రియగుణాభాసం" అంతరములగు మనోబుద్ధ్యాదులు, బాహ్యములగు శ్రోత్రా దులునగు సర్వేంద్రియములు, (ఈచెప్పుటచే గ్రాహకమాత్రమెల్ల సంగృహీతమైనది) గుణము అను విషయ ములు (ఈచెప్పుటచే గ్రాహ్యమాత్రమెల్ల సంగృహీతమైనది) ఇట్టి గ్రాహ్య-గ్రాహకజాతమువలె భాసించు నది బ్రహ్మమని యర్థము. ఇంతియేగాని బ్రహ్మము గ్రాహ్యగ్రాహకస్వరూపమైనది విచిత్రమైనది కాదు. జల సూర్యుడుఅధోభాగమందున్నట్లును, చలించుచున్నట్లును కన్పట్టునేకాని వస్తుతఃఅధస్థుడునుకంపమానుడును గాడు. అట్లే యాత్మకు గ్రాహ్యగ్రాహకాకారత్వము మిథ్యయే యని యర్థము. కారణ మేమందువా? ఆత్మ "సర్వేం ద్రియవివర్జితం" (ఇట ఇంద్రియపదము గుణములకుగూడ నుపలక్షణము) బ్రహ్మమునందు గ్రాహ్య రూపమగు రూపాదికముగాని, గ్రాహకరూపమగు మన ఆదికముగాని యేదియు లేదు. కాన పరబ్రహ్మము సర్వేంద్రియ, విషయరహితము. "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం, అప్రాణో హ్యమనా శ్శుభ్రః,

శాంకరభాష్యమ్:—

దిదం చాన్యజ్జ్ఞేయస్య సత్త్వాధిగమద్వారం నిర్గుణం సత్త్వరజస్తమాంసి గుణాస్తై ర్వర్జితం తజ్జ్ఞేయం తథాపి గుణభోక్తృ చ గుణానాం సత్త్వరజస్తమసాం శబ్దాదిద్వారేణ సుఖదుఃఖమోహాకారపరిణతానాం భోక్తృ చోపలబ్ధృ తజ్జ్ఞేయ మిత్యర్థః ॥ ॥౧౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కావు. అందువలన జ్ఞేయబ్రహ్మము సర్వమును భరించుచున్నది. జ్ఞేయబ్రహ్మము కలదని తెలిసికొనుటయందు దిదొకటి యుండుగాక. అట్టి నిర్గుణబ్రహ్మము సత్వరజస్తమోగుణవివర్జితము. అట్టిదైనను సుఖదుఃఖమోహాకారముగ పరిణమించిన సత్త్వరజస్తమోగుణములను శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ ద్వారమున నాజ్ఞేయబ్రహ్మము సాక్షాత్కార మొనరించుకొనదగినది. ॥౧౪॥

---

యత్త దద్రేశ్య మగ్రాహ్య మచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం" ఇత్యాదిశ్రుత్యనుసారము బ్రహ్మము కార్యకారణరూపప్రపంచవిశిష్టమై చిత్రమైనది కాదని పర్యవసితార్థము. బ్రహ్మము ప్రపంచస్వరూపమే కానిచో, "సర్వం బ్రహ్మ" (సర్వము బ్రహ్మస్వరూపమే) అను శాస్త్ర మెట్లుపపన్నమగు నను యాశంకపై జెప్పుచుండెను. "సర్వభృచ్చైవ" పరబ్రహ్మము సర్వమునకు ఆధారమైనది యని యర్థము. ఇట పరబ్రహ్మము సర్వాధార మని చెప్పుటచే బ్రహ్మము సర్వముకంటెను పృథగ్భూత మని చెప్పినట్లగుచున్నది. సర్వమునకు బ్రహ్మతో నా యాధారాధేయభావము- ఘటమునకు- ఘటరూపమునకువలె సమవాయసంబంధముచే నగుచున్నదా? లేక, కుండమునకు-బదరమునకువలె సంయోగసంబంధముచే నగుచున్నదా? అను యాశంకపై సంబంధము లేకుండగనే బ్రహ్మమునకు సర్వభృత్త్వ ముపపన్నమగు నని చెప్పుచుండెను— "అసక్తం" (బ్రహ్మము సంబంధములేనిది అని యర్థము) ఇట బ్రహ్మము సంబంధరహిత మనియు, సర్వాధారమనియు చెప్పుట పరస్పరవిరుద్ధ కాదా? కాన నీదోష మపరిహార్య మందువా? అట్లు కాదు. ఏమన: ఊషరక్షేత్రము మరీచికోదకముతో సంసక్తము కాకపోయినను, మరీచికోదకమున కాధార మగుచున్నది. అట్లే బ్రహ్మము గూడ సంసక్తము కాకపోయినను సర్వాధార మగుచున్నదిగాన పైదోషము వాటిల్లనేరదు.

ఇట్లగుచో నీప్రపంచము మిథ్యయేగాన కర్మోపాసనావిధు లుపరుద్ధము (వ్యర్థము) అగునందువా? అట్లు కాదు— ఈద్వైతము బ్రహ్మైకత్వజ్ఞానముచే నెంతవరకు బాధింపబడకుండునో యంతవరకు క్రియాకారకకాదిసర్వవ్యవహారము సత్యమే యని యంగీకరించెదము. "ప్రాణా వై సత్యం తేషా మేష సత్యం" అను శ్రుతియు ప్రాణోపలక్షిత మగు సర్వప్రపంచమునకు వ్యావహారికసత్యత్వమునే చెప్పుచు, దానికంటె గూడ నధిక మగు పరమార్థసత్యమగు పరబ్రహ్మమును తెలుపుచున్నది. సత్యత్వ మన యబాధ్యత్వము. అట్టి సత్యత్వము ప్రాణముల కల్పకాలికము, బ్రహ్మమునకు సార్వకాలికము నగుచున్నది. ఎట్లనిన: "ఈతడు

గీ॥ బహి రన్తశ్చ భూతానా మచరం చర మేవ చ ।
సూక్ష్మత్వా త్త దవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥ ॥౧౫॥

పదవిభాగము:— బహిః-అన్తః- చ- భూతానాం- అచరం- చరం- ఏవ- చ- సూక్ష్మత్వాత్- తత్- అవిజ్ఞేయం- దూరస్థం- చ- అన్తికే- చ- తత్ ॥ ॥౧౫॥

ప్రతిపదార్థము:— బహిః=ఈశరీరము వెలుపల; అంతశ్చ=ఈశరీరములోన; అచరం=స్థిరమైన దేహాభాసమును; చరమేవ=చలమైన దేహాభాసమును; సూక్ష్మత్వాత్=సూక్ష్మమైన దగుటవలన; అవిజ్ఞేయం=అజ్ఞానులకు తెలియదగనిది; దూరస్థం=అనేక వేలకోట్లసంవత్సరములకైనను నవిద్వాంసుల కవిజ్ఞాతమగుటచే దూరమునందుండునది: అన్తికేచ=విద్వాంసుల కాత్మస్వరూపమే యగుటవలన సమీపమునందే; స్థితం=(ఈపద ముత్తరశ్లోకమునుంచి యపకృష్టము) వున్నది; తత్=అజ్ఞేయమగు బ్రహ్మము. ॥౧౫॥

---

భూపతుఃకు భూఃతి" అనుస్థలమున యైశ్వర్యాపకృష్ట్వ, భూయస్త్వములచే నైన భేదము స్పష్టమగుచున్నది. ఈవిధముగనే ప్రాణములకును- బ్రహ్మమునకు గల వ్యావహారికసత్యత్వ, పారమార్థికసత్యత్వములచేనైన అపకృష్టత్వ-ఉత్కృష్టత్వాపాదకభేదమును గ్రహింపనగును. కనుకనే నిష్కలాత్మజ్ఞానము కలుగనంత కాలమే బ్రహ్మము సవిశేష మగును గాని, యాత్మజ్ఞానసూర్యోదయానంతరము బ్రహ్మము నిర్విశేషమే యగును. కాన తత్త్వజ్ఞానముచే సోపాధికమగునదే బాధింపబడును. అట్లగుటచే నిరుపాధికబ్రహ్మమునకు కార్యశేషత్వమును పొందించుట కేరకిని శక్యము కానేరదు. అట్టి నిర్విశేషబ్రహ్మజ్ఞానము కల్గినచో క్రియాకారకాదిసర్వద్వైతోపమర్ద మగుటవలన యుపాస్యోపాసకోపాసనాభేదము బాధిత మగును. కాన యుపాధికృత మగున దెల్ల మిథ్యయే యని యిట లెస్సగ జెప్పబడెను. మరియు, "నిర్గుణం గుణభోక్తృచ" (బ్రహ్మము గుణరహితమయ్యు గుణభోక్తయు నగు చున్నదని యర్థము) పరబ్రహ్మము గ్రాహ్యగ్రాహక సంబంధము లేనిదయ్యును, గ్రాహకములగు బుద్ధ్యాదులు గ్రాహ్యసంబంధముచే సుఖాద్యాకారముగ పరిణమింప, కేవలము వానిని ప్రకాశింపజేయుట అను ధర్మముచేతనే చిదాభాసరూపమగు యీబ్రహ్మమునకు గుణభోక్తృత్వముగూడ నుపపన్న మగుచున్నది. ప్రతిబింబరూపుడగు సూర్యునియందు జలాద్యుపాధిగతమైన చలనాదికము నిట దృష్టాంతముగ జూడనగును. ఈవిషయమునే "ధ్యాయతీవ లేలాయతీవ" అను శ్రుతి బోధించుచున్నది. బుద్ధి ధ్యానించుచుండ యట ప్రవిష్టుడైన చిదాభాసుడు విషయములను ధ్యానించువాడు వలె కన్పట్టును. బుద్ధి విషయదేశమునుగూర్చి వెళ్ళియుండ చిదాభాసుడు వెళ్ళినవాడువలె కన్పట్టుచుండును. ఇంతియే గాని యాతడు ధ్యానమునుగాని, గమనమును గాని చేయుటలేదు. అని శ్రుతి ప్రతిపాదించుచున్నది. ఈచెప్పుటచే "అపాణిపాదో జవనో గ్రహీతా పశ్య త్యచక్షు స్స శృణో త్యకర్ణః" అనుశ్రుతిచెప్పిన బ్రహ్మము ఉపాధిగుణానుగుణ్యాభిజనశక్తి కలదనియే వ్యాఖ్యానింప దగును. ఈబ్రహ్మము పాదములు లేనిదయ్యును, పాదము వేగము కలది యగుచో వేగము కలదిగా యగుచున్నది. అని శ్రుత్యర్థము. ఈస్థలమున "అంధో మణి మవిందత్" ఇత్యాదివచనజాతమునుగూడ ననుసంధింపదగును. కాన పరబ్రహ్మము గుణరహితము, గుణభోక్తయుగూడ నగు నని లెస్సగ చెప్పబడెను. ॥౧౪॥

శాంకరభాష్యమ్:—

కించ— బహి స్త్వక్పర్యంతం దేహ మాత్మత్వే నావిద్యాకల్పిత మపేక్ష్య త మేవావధిం కృత్వా బహి రుచ్యతే। తథా ప్రత్యగాత్మాన మపేక్ష్య దేహ మేవావధిం కృత్వాఽంత రుచ్యతే।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మఱియు నాత్మగ నవిద్యచే కల్పితమైన త్వక్పర్యంత దేహము నపేక్షించి యాదేహమునే యవధిగ జేసుకొని వెలుపల అని చెప్పబడెను. అనగా నీశరీరము వెలుపల, అట్లే ప్రత్యగాత్మ నపేక్షించుకొని దేహమునే యవధిగ జేసుకొని లోపల అని చెప్పబడెను. అనగా యీశరీరము లోపల, "బహి రన్తశ్చ" అని చెప్పుటచే లోపల, వెలుపలేగాని, మధ్యయందు జ్ఞేయబ్రహ్మము

—• ౧౩ వ అధ్యాయము ౧౫ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— తనయందు కల్పితమైన సర్పధారాదులకు సర్వాత్మనా వ్యాపకమై యున్న రజ్జువు (త్రాడు) వలె కల్పితములైన సర్వకార్యములకు బహిః, అంతః కల్పితమైనయధిష్ఠాన మొక్కటియే సర్వాత్మనా వ్యాపకము. కనుకనే స్థావరజంగమాత్మకమైన భూతసముదాయము అధిష్ఠానాత్మకమగుటవలన బ్రహ్మస్వరూపమే. కల్పితములు అధిష్ఠానముకంటె వేరు కావు. ఇట్లు బ్రహ్మము సర్వాత్మకమైనను సూక్ష్మమగుటవలనను, రూపాదిహీన మగుటవలనను, ఇదియే బ్రహ్మ మని స్పష్టముగ జ్ఞానార్హము కానేరదు. అనగా ఇదియే బ్రహ్మ మని స్పష్టముగ తెలియబడదు. కనుకనే ఆత్మ జ్ఞానసాధనములు లేనివారలకు అనేక వేలకోటిసంవత్సరములకైనను అప్రాప్యము (పొందుటకు శక్యము కానిది) అగుటవలన ఆబ్రహ్మము "దూరస్థం" అనేకలక్షలకోట్లయోజనములయం దున్నదివలె యున్నది. జ్ఞానసాధనసంపన్నుల కన్ననో "అంతికే చ తత్" ఆబ్రహ్మ మాత్మస్వరూపమే యగుటవలన అత్యంతావ్యవహితమే (అతి సమీపస్థమే). "దూరా త్సుదూరే త దిహాన్తికే చ పశ్య త్స్విహైవ నిహితం గుహాయామ్" ఇత్యాదిశ్రుతులు పై విషయమునే బోధించుచున్నవి. ॥౧౫॥

శంకరానందీయము:— నామరూపాత్మకమైన ద్వైతప్రపంచము సద్రూపముకంటె వేరుగ ప్రత్యక్షవిషయ మగుటవలన సర్వము బ్రహ్మస్వరూప మెట్లగు నని శంకింపజనదు. లోపల వెలుపల యగ్నిచే తప్తమైన అయఃపిండమునకు వేరుగ సత్త లేమింజేసి యగ్నిస్వరూపమే యెట్లగునో యట్లే లోపల వెలుపల బ్రహ్మచే వ్యాప్తమైన జగత్తునకు కూడ స్వతః సత్త లేనందున సర్వము బ్రహ్మమాత్రస్వరూపమే అని "బహిః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ముముక్షువునకు జ్ఞేయముగ నుపక్రాంతమైన బ్రహ్మము అవ్యక్తాదిస్థూలాంతభూతములయొక్క లోపల వెలుపల అగ్ని అయఃపిండమును వలె అంతట వ్యాపించి యున్నది. అట్టి బ్రహ్మము నిరవయవ మగుటవలనను, అతిసూక్ష్మ మగుటవలనను దేనిచేతను పరిచ్ఛిన్నము కానేరదు. ఆకాశమువలె దేనిచేతను పరిచ్ఛిన్నమగుటకు శక్యము కాదు. నిరవయవము, అతిసూక్ష్మము నగు ఆకాశము ఘటాదులచే పరిచ్ఛిన్న మని చెప్పుట శక్యము కాదు. పరమసూక్ష్మ మగుటవలన ఘటాదుల కవిషయము. మరేమనిన? బ్రహ్మముకూడ లోపల వెలుపల సర్వమును వ్యాపించియున్నది. అని యర్థము. ఈవిషయమునే "త దంతరస్య సర్వస్య త దు సర్వస్యాస్య

శాంకరభాష్యమ్:—

బహి రంత శ్చే త్యుక్తే మధ్యేఽభావే ప్రాప్త ఇద ముచ్యతేఽచరం చర మేవ చ య చ్చరాఽచరం దేహాభాస మపి తదేవ జ్ఞేయం యథా రజ్జుసర్పాభాసః । య ద్యచరం చర మేవ చ వ్యవహారవిషయం సర్వం జ్ఞేయం కి మర్థ మిద మితి సర్వై ర్న విజ్ఞేయ మితి । ఉచ్యతే,

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లేదు అని ప్రాప్తించుచుండ "అచరం చర మేవ చ" అని చెప్పబడెను. దేహాభాసరూపమైన చరాచరములు రజ్జుసర్పాభాసవలె ఆ జ్ఞేయ మగు బ్రహ్మమే. వ్యవహారవిషయమైన చరాచర రూపమగు సర్వము జ్ఞేయబ్రహ్మస్వరూపమే యగుచో జ్ఞేయ మిదియే యని సర్వులచే నెందులకు తెలియబడ దని శంకింపజనదు. నిఖిలవస్తుస్వరూపముగ భాసించునది యాజ్ఞేయ

భావ్యాత్మ:" అను శ్రుతియు బోధించుచున్నది. ఈవిషయమునే శ్రీకృష్ణపరమాత్మయు "మయా తత మిదం సర్వం" అని చెప్పియుండెను.

అయఃపిండమును వహ్నివలె భూతములయొక్క లోపల వెలుపల వ్యాపించియుండుటచే బ్రహ్మమపరిచ్ఛిన్నమైనను, వహ్నికి అయఃపిండమువలె బ్రహ్మమునకు వ్యాప్యాంశమైన ద్వైతభావ ముండియే యున్నది. ఇట్లు ద్వైతభావమే యుండినచో నద్వైతసిద్ధి యెట్లు ప్రాప్తించు నని శంకింపజనదు.

"ప్రాణో హ్యేష సర్వభూతై ర్విభాతి" (ప్రాణస్వరూపమైన యీబ్రహ్మమే సర్వభూతములచే ప్రకాశించుచుండెను.) అని చెప్పుటచే జగత్తు బ్రహ్మవివర్త మగుటవలన జగత్తునకు వేరుగ సత్త లేమింజేసి ప్రత్యగ్దృష్టిచే పరిశీలించిన సర్వము బ్రహ్మమే యని "అచరం" ఇత్యాదికముచే బోధించుచుండెను. ఏది క్రియ కలదో యది చర మనబడును. క్రియ లేని దచర మనబడును. స్థావరజంగమాత్మకమైన నిఖిల భూతాభాసము రజతాభాస శుక్తిస్వరూపమైనటుల బ్రహ్మమే. ఈవిషయమునే "సర్వం హ్యేత ద్బ్రహ్మ" (ఈనిఖిలప్రపంచము బ్రహ్మమే) యని శ్రుతి బోధించుచున్నది.

సర్వాత్మకము, పరిపూర్ణము, అద్వితీయము బ్రహ్మ మగుచో సర్వులచేతను "ఇదియే బ్రహ్మము" అని యెందులకు గ్రహింపబడ దను శంకను "సూక్ష్మత్వా త్త దవిజ్ఞేయం" అనుదానిచే తొలగించుచుండెను.

విచారింప పరబ్రహ్మము సర్వస్వరూపము, పరిపూర్ణము, అద్వితీయమే అయినను అపరబ్రహ్మమా కాశముకంటె సూక్ష్మమైనది. ఈవిషయమునే "సూక్ష్మా త్సూక్ష్మతరం నిత్యం" (బ్రహ్మము సూక్ష్మమగు నా కాశముకంటె సూక్ష్మమైనది) అను శ్రుతి బోధించుచున్నది. కాన అబ్రహ్మము స్వాత్మభూతమైనను మహదవ్యక్తాదులకంటె సూక్ష్మమగుటవలన దుర్విజ్ఞేయము. ఎవరికి దుర్విజ్ఞేయము? శ్రుతి, ఆచార్య, ఈశ్వరాత్మప్రసాదము లేనట్టి యవిశుద్ధబుద్ధి కలవారలకు అంధునకు స్వరూపజ్ఞానము కలుగనటుల దుర్విజ్ఞేయమే. (తెలిసికొనుటకు శక్యము కానిదే.) ఈవిషయమునే "దూరస్థం" అనుదానిచే స్పష్టపరచుచుండెను. వివేక, వైరాగ్య, శమ, దమాదినియతసాధనములు లేనట్టియు, వేదాంతశ్రవణమొనరింపనట్టియు, మలినాంతఃకరణకలవారలకు తమ స్వరూపమైనను యాబ్రహ్మము "దూరస్థం" చక్రవాలముకంటె అతిదూరమునం దుండినదే యగుచున్నది. అనగా శతకోటిజన్మలకైన పొందుటకు శక్యమైనది కాదు. శుద్ధము కాని బుద్ధికలవారల

శాంకరభాష్యమ్:—

సత్యం సర్వావభాసం తత్తథాపి వ్యోమవత్సూక్ష్మమతః సూక్ష్మత్వాత్స్వేన రూపేణ తజ్జ్ఞేయమప్యవిజ్ఞేయమవిదుషామ్ । విదుషాం త్వాత్మైవేదం సర్వం బ్రహ్మైవేదం సర్వమిత్యాదిప్రమాణతో నిత్యం విజ్ఞాతమవిజ్ఞాతతయా దూరస్థం వర్షసహస్రకోట్యాఽప్యవిదుషామప్రాప్యత్వాదంతికే చ తదాత్మత్వాద్విదుషామ్ ॥ ॥౧౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

బ్రహ్మమే అయినను, ఆకాశమువలె యాజ్ఞేయము సూక్ష్మమగుటవలన స్వస్వరూపముచే జ్ఞేయమైనను యవిద్వాంసులకు అవిజ్ఞేయము (తెలియబడనిది.) విద్వాంసుల కన్ననో "ఆత్మైవేదం సర్వం" "బ్రహ్మైవేదం సర్వం" ఇత్యాదిప్రమాణములవలన నిత్యము విజ్ఞాతము. అవిజ్ఞాతమగుటచే నవిద్వాంసులకు "దూరస్థం" అనేకవేలకోట్లసంవత్సరములకైన నవిద్వాంసుల కప్రాప్యమగుటవలన వారలకు దూరస్థము. విద్వాంసులు ఆజ్ఞేయస్వరూపమే యగుటవలన వారలకు సమీపమునందే యున్నది. ॥౧౫॥

ఏబ్రహ్మము దూరమునందుండినదో ఆబ్రహ్మమే విద్వదనుగ్రహము కల ప్రశాంతమైన యంతఃకరణ కలవారికు "అన్తికే చ తత్" (చకారమవధారణార్థకము.) సమీపమునందే హృదయమునందే స్వాత్మచే తెలిసికొనుటకు శక్యమైనది. "దూరాత్సుదూరే తదిహాన్తికే చ । పశ్యత్స్విహైవ నిహితం గుహాయాం" అను శ్రుతి పైవిషయమునే బోధించుచున్నది. ॥౧౫॥

పరమార్థప్రపా:— మరియు, కుండలాదులకు అంతః, బహిః సువర్ణముండినట్లు చరాచరాత్మక జగత్తునకంతః, బహిః ఆబ్రహ్మమే కలదు. కార్యము కారణస్వరూపమే యగుటవలన చరాచరాత్మకనిఖిల కార్యము కారణమైన బ్రహ్మమే. ఇట్లైనను సూక్ష్మమగుటవలనను, రూపాదిగుణాతీతమగుటవలనను అబ్రహ్మ మవిజ్ఞేయము (తెలిసికొనుటకు శక్యమైనదికాదు). కనుకనే యవిద్వాంసులకతిదూరమునందుండినది. విద్వాంసుల కన్ననో ప్రత్యగాత్మస్వరూపమగుటవలన నిత్యము సన్నిహితము. ॥౧౫॥

నీలకంఠీయము:—

ఆబ్రహ్మము అసక్తము, సంబంధరహితము నగుచో నెట్లుపలబ్ధమగును? అను యాశంకకు పై జెప్పుచున్నాడు— "బహిరంతశ్చ భూతానాం" భూతము (ప్రాణు)ల ఏకాదశేంద్రియములు, స్థూలభూతములు నివి వికారులగుటచే నాత్మకు వ్యవహితములైనవగుట బహిశ్శబ్దముచే చెప్పబడును. మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, అవ్యక్తము నివి ప్రకృతిరూపమగుటచే నాత్మకు సన్నిహితమగుట వలన పైయెనిమిదియు అంతశ్శబ్దముచే జెప్పబడును. బ్రహ్మము పై వికృతి, ప్రకృతుల సంబంధముకలది యని భావము. "అచరం చరమేవ చ" ప్రకృతి, వికృతులకంటె నికృష్టములు, చరాచరోపాధ్యుపలక్షితములు, అవధిభూతములు నగు పురుషులు (జీవులు) చరాచరశబ్దములచే జెప్పబడుదురు. ఇట "చరా-

గీ॥ అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।
భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ ॥౧౬॥

పదవిభాగము:— అవిభక్తం- చ- భూతేషు- విభక్తం- ఇవ- చ- స్థితం- భూతభర్తృ- చ- తత్- జ్ఞేయం- గ్రసిష్ణు- ప్రభవిష్ణు- చ ॥ ॥౧౬॥

ప్రతిపదార్థము:— తత్=ఆ; జ్ఞేయం=తెలిసికొనదగిన బ్రహ్మము; అవిభక్తంచ=ప్రతిదేహము నందా కాశమువలె యవిభక్తము; (ఏకము) భూతేషు=సర్వప్రాణులయందు; విభక్తమివచ=వేఱుగనున్నదివలె; స్థితం=ఉన్నది; భూతభర్తృచ=(స్థితి కాలమునందు) భూతములను భరించునది; గ్రసిష్ణు=(ప్రళయ కాలమునందు) భూతములను లయింపజేయు స్వభావము కలది; ప్రభవిష్ణుచ=(ఉత్పత్తి కాలమునందు) భూతములను పుట్టించు స్వభావము కలది. ॥౧౬॥

---

చరం జ్ఞేయం" అని సామానాధికరణ్యముచే బహుప్రకార జ్ఞేయబ్రహ్మభావము చెప్పబడెను. "బహి రంతశ్చ జ్ఞేయం" అనుదానిచే షోడశవికారములయందును, అష్టప్రకృతులయందును జ్ఞేయబ్రహ్మముయొక్క సంబంధము చెప్పబడెను. అధ్యస్తము లగు ప్రకృతి, వికృతులచే నిరూపింపబడిన దగుటచే నాసంబంధము గూడ యక్షానురూపబలిన్యాయమున యధ్యస్తమైనదే యగును. పర్యవసిత మేమన: ఉపలబ్ధిమాత్రశరీరు డగు పురుషునకు గుణములతోగూడ నాధ్యాసికసంబంధ ముండుటచే గుణోపలబ్ధృత్వ మీశ్వరునకు తగును. ఎట్లన: ప్రకాశమాత్రశరీరు డగు సూర్యున కున్న ప్రకాశయితృత్వము ప్రకాశ్యసంబంధాపేక్ష కలది యగును. ఇట్లే ఉపలబ్ధిమాత్రశరీరుడగు బ్రహ్మమున కున్న గుణోపలబ్ధృత్వము గుణములతోనైన యాధ్యాసికసంబంధాపేక్షమే యగుచున్నది. బ్రహ్మము నిత్యాపరోక్షము, పురుషప్రకృతి, వికారసంబద్ధముగూడ నగుచో నందరకు నేల కానరాదు? అను శంకపై జెప్పుచుండెను— "సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం" అజ్ఞేయమగు బ్రహ్మము సూక్ష్మమగుటచే దుర్విజ్ఞేయ మగుచున్నది. శుద్ధస్ఫటికమునందు శుక్లరూపము నిత్యసన్నిహితమైయ్యును, ఆస్ఫటికము జపాకుసుమోపహితమగుచో నాశుక్లరూపము జపాకుసుమసంబంధమగు రక్తరూపముచేనైన నిక్షేపముచే తిరోహితమై తెలియబడుటలేదు. అట్లే బ్రహ్మము నిత్యాపరోక్షమైనదైనను, ఉపాధ్యుపధానముచే దిరోహితమై స్పష్టముగ తెలియబడుట లేదు. ఇకనేమన: ఔపాధికధర్మోపేత మయినయే మూఢులచే తెలియబడుచున్నది. బ్రహ్మజ్ఞానుల కన్ననో యుపాధిప్రవిలాపనముచే శుద్ధబ్రహ్మము సుఖముగనే తెలియబడుచున్నది. ఈవిషయమునే స్పష్టము చేయుచుండెను— "దూరస్థం చాంతికే చ తత్" మూఢుడు జలమందున్న ప్రతిబింబసూర్యుని యాకాశమునందున్న బింబసూర్యునికంటె దూరమందున్న వేరొక సూర్యునిగ తలచును. ఇక వివేకవంతుడు ఉపాధిప్రతిహత (పరావర్తిత) ములైన చాక్షుషకిరణములను పైభాగమునకు మరలింపగా నవి బింబమును గ్రహించు ననియు, పూర్వమునందు ప్రవృత్తమైన యధోముఖవృత్తిసంస్కారముచే ప్రతిబింబము కన్పట్టుచున్నదనియు తెలిసుకొని బింబదేశమునందే ప్రతిబింబమునుగూడ జూచును. బింబమునందే జలస్థత్వము నధ్యసించి, యాయధ్యాసచే జలమునందు బింబము కలదని యుపాధియందు ధర్మ్యధ్యాసను కల్పించుటకంటె పైవిధముగ విషయమునకే యుపాధిసంబంధమాత్రాధ్యాసను కల్పించుట లాఘవము. ఈవిధముగ బింబభూతమగు బ్రహ్మము ప్రతిబింబరూపమగు జీవునికంటె విప్రకృష్ట (దూరస్థ) మైనదని మూఢులు తెలిసికొందురు. బ్రహ్మవేత్తలన్ననో సన్నికృష్ట (సమీపస్థ) మనియే తెలిసికొందురు. ॥౧౫॥

శాంకరభాష్యమ్:—

కించ— అవిభక్తం చ ప్రతిదేహం వ్యోమవ త్తదేకం భూతేషు సర్వప్రాణిషు విభక్త మివ చ స్థితం దేహే ష్వేవ విభావ్యమానత్వా ద్భూతభర్తృ చ భూతాని బిభర్తీతి తః

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు ఆజ్ఞేయబ్రహ్మము ప్రతిదేహమునందు ఒక్కటే. దేహములయందే తలవబడుచుండుటవలన విభక్తమువలె నున్నది. స్థితికాలమునందు నిఖిలభూతములను భరించుచున్నది.

—• ౧౩ వ అధ్యాయము ౧౬ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఒక్కొక్క దేహమున కొక్కొక్క యాత్మ కల దను యాత్మభేదవాదుల మతనిరాసముకొరకై "ఏకమైనబ్రహ్మమే సర్వము నావరించియున్నది" అని పూర్వమునందు చెప్పిన విషయమునే "అవిభక్తం" అను దానిచే వివరించుచుండెను.

ఆయాత్మ సర్వప్రాణులయం దభిన్నమే, ఏకమే యయి యున్నది. ఆకాశమువలె సర్వవ్యాపక మగుటవలన ప్రతిదేహమున వేరు కాదు. అట్లైనను దేహతాదాత్మ్యముచే ప్రతీయమాన మగుటవలన ప్రతిదేహమున విభక్తమైనదివలె నున్నది. ఆకాశమునందు ఘటమఠాద్యుపాధులచే ఘటాకాశమని, మఠాకాశమని యెటుల భేదావభాసయో యట్లే ఆత్మయందుగూడ భేదావభాస శరీరాద్యుపాధులచేతనే కలుగుచున్నది. అట్టిభేదావభాస ఔపాధికమగుటచే పారమార్థికము కానేరదు.

క్షేత్రజ్ఞుడు సర్వవ్యాపకుడై ఒకడే యగుగాక, జగత్కారణ మగు బ్రహ్మముమాత్రము క్షేత్రజ్ఞుని కంటె వేరు. అను శంకను "భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ" అనుదానిచే తొలిగించుచుండెను— స్థితికాలమునందు సర్వభూతములను భరించువాడు, అట్లే లయకాలమునందు సర్వభూతములను లయ మొనరించుస్వభావము కలవాడు. ఉత్పత్తికాలమునందు నిఖిలభూతములను పుట్టించు స్వభావము కలవాడు. అది యెట్లనిన: మాయాకల్పితసర్పాదులకు రజ్జ్వాదు లెటులో యటులనే యని తెలిసికొనుము" కాన నేది జగత్తుయొక్క స్థితిలయోత్పత్తులకు కారణమో ఆబ్రహ్మమే క్షేత్రజ్ఞుడు. ప్రతిదేహమునందు ఒక్కడే జ్ఞేయము. అతని కంటె వేరు లేదు. ॥౧౬॥

శంకరానందీయము:— "అచరం చరమేవ చ" అనుదానిచే బ్రహ్మమునకు సర్వాత్మకత్వము చెప్పబడెను. అంతటను బ్రహ్మలక్షణము లేనందున యట్టి సర్వాత్మకత్వము బ్రహ్మమునకు సంభవింపదు. జంగమములైన ప్రాణిశరీరములయందే "అహం, మమేదం" (నేను, ఇది నాసంబంధమైనది.) ఇత్యాది వేదనస్వరూపమైన చేతనత్వము కనబడుచున్నది. స్థావరదేహములయం దిట్టి చైతన్యము కన్పట్టుటలేదు. అందువలన బ్రహ్మము పరిచ్ఛిన్నమే యని శంకింపజనదు.

ఆకాశము సర్వగతమైనను నిర్మలమైన జలాదులయందే ప్రతిబింబించుటయెట్లో, అతపాగ్నులు సర్వగతమైనను సూర్యకాంతమణులయందే స్ఫురణ మెటులో, రూపము సర్వగతమైనను చక్షుస్సునందే ఉపలంభ మెటులో అన్యత్ర ఉపలంభ మెటుల లేదో యట్లే బ్రహ్మము సర్వగతమైనను అతి నిర్మలమైన ప్రాణులయంతఃకరణలయందే స్ఫూర్తి సంభవించును. అతిరిక్తములయందు సంభవింపదు. ఆకాశాదులకు అంతః

శాంకరభాష్యమ్:—

జ్ఞేయం భూతభర్తృ చ స్థితికాలే । ప్రలయకాలే గ్రసిష్ణు గ్రసనశీలమ్ । ఉత్పత్తికాలే ప్రభవిష్ణు చ ప్రభవనశీలం యథా రజ్జ్వాదిః సర్పాదే ర్మిథ్యాకల్పితస్య ॥ ॥౧౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రలయకాలమునందు నిఖిలభూతములను లయమొనరించు స్వభావము కలది. ఉత్పత్తికాలమున మిథ్యాకల్పితమైన సర్పాదులకు రజ్జ్వాదులువలె ఉత్పాదన చేయు స్వభావము కలది. ॥౧౮॥

మాత్రముచే పరిచ్ఛిన్నత్వము యెట్లు సంభవింపదో అట్లే బ్రహ్మము పరిచ్ఛిన్నమనుటలో ప్రమాణము లేనందున బ్రహ్మమునకుగూడ పరిచ్ఛిన్నత్వవిధానము ప్రామాణికము కాదు. "బ్రహ్మము పరిచ్ఛిన్నము" అని యనుటయందు ప్రత్యక్షప్రమాణము కలదందువా? అట్లుగాదు. "ప్రాదేశమాత్ర శ్చంద్రః" "నీలం నభః" ఇత్యాదికమునందు ప్రత్యక్షప్రమాణ మప్రమాణమే యగుటవలన బ్రహ్మము పరిచ్ఛిన్నమనుటయందు ప్రత్యక్షము ప్రమాణము కాదు. "ఏది యల్పమో యది నశించుచున్నది" అను న్యాయముచే బ్రహ్మము పరిచ్ఛిన్నమే యగుచో యనిత్యము కావలసివచ్చును. అందువలన "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" అను శ్రుతివలన బ్రహ్మము పూర్ణమే యని "అవిభక్తం" అనుదానిచే చెప్పుచుండెను— నామరూపగుణక్రియాజాతిస్వాభావవిశేషములచే పరస్పరము భిన్నములైన బ్రహ్మాదిస్తంబాంతమగు ప్రాణులయందు 'అహ మహం' అని యహంపదార్థముగ ప్రతీయమానమగుటవలన విభక్తములైన బ్రహ్మాదిస్తంబపర్యంతప్రాణిశరీరములచే విభక్తమైనదివలె బ్రహ్మ మున్నది. అందుచేతనే సాంఖ్యులాత్మకు అసంగచిద్రూపత్వమును, పరస్పరభిన్నత్వమును, అనేకత్వమును చెప్పుచుండిరి. కాని శ్రుతిన్యాయవిరోధము ప్రాప్తించును కాన నట్లు చెప్పుట యసంగతము. ఘటాదులచే నాకాశమువలె భ్రాంతులకు బ్రహ్మము పరిచ్ఛిన్నమువలె ప్రతీయమానమైనను (తోచినను) స్వయముగ స్వరూపముచే నవిభక్తమే. బ్రహ్మము నిరవయవమగుటవలనను, అతిసూక్ష్మమగుటవలనను, అవిషయ మగుటవలనను భూతములచే విభక్తముగ జేయుటకు శక్యమైనది కాదు. బ్రహ్మము భూతములచే విభక్తమే యగుచో సావయవత్వానిత్యత్వాదిదోషములు సంభవించెడిని. మరియు సర్వప్రపంచస్ఫూర్తి లేకపోయెడిని. మరియు శ్రుతివిరోధము ప్రాప్తించెడిని. "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః । ఆకాశవ త్సర్వగతశ్చ నిత్యః । పూర్ణం పురుషేణ సర్వం తదేత ద్బ్రహ్మాపూర్వం" ఇత్యాది శ్రుతులు బ్రహ్మమున కేకత్వమును, సర్వగతత్వమును, నిత్యత్వమును, అద్వితీయత్వమును నియమముగ బోధించుచున్నవి. అందువలన బ్రహ్మ మవిభక్తమే. సర్వప్రకాశక మగుటచేగూడ బ్రహ్మ మవిభక్తమే యగుచున్నది. అవిభక్తమైన సూర్యసంబంధమగు ఆలోకముచేతనే కదా విభక్తము, భాస్యము నగు ఘటపటాదిస్వరూప మగు సర్వబ్రహ్మాండము ప్రకాశింపజేయబడుచున్నది. విభక్తమైన సౌరప్రకాశచేత బ్రహ్మాండము ప్రకాశింపబడుటలేదు. విభక్తమైన సౌరప్రకాశచేతనే బ్రహ్మాండము ప్రకాశింపబడుచో అంతట అందరికి సర్వపదార్థస్ఫురణ లేకపోవలసివచ్చును. అట్లే యవిభక్తమైన అంతటను ప్రాప్తమైన బ్రహ్మముచేతనే స్థూలము, సూక్ష్మము నగు అవ్యక్తమహదాదిదృశ్య మంతయు ప్రకాశింపజేయబడుచున్నది. బ్రహ్మము పరిచ్ఛిన్నమే యగుచో బాహ్యపదార్థములు భాసింపకపోవలసివచ్చును. [illegible] అంతట అన్నియు భాసించుచునేయున్నవి. ఈవిషయమునే "తస్య భాసా సర్వ మిదం విభాతి" అను శ్రుతియు బోధించుచున్నది. బ్రహ్మ మవిభక్త మగుటవలననే శ్రీకృష్ణపరమాత్మ "విభక్త మివ చ స్థితమ్" బ్రహ్మము విభక్తమువలె నున్నది అని చెప్పెను. ఈచెప్పుటచే బ్రహ్మ మపరిచ్ఛిన్న మని [illegible] అందువలననే బ్రహ్మకు అపరిచ్ఛిన్నత్వాద్వితీయత్వసిద్ధికొరకు జగత్తునకు బ్రహ్మవివర్తత్వమును "ప్రభవిష్ణు" అనుదానిచే సూచించుచుండెను— అజ్ఞేయబ్రహ్మమే అజ్ఞానదశయందు రజ్జువువలె అధ్యాత్మాదిరూపము నారోపితాకారముగ తెలిసికొనుటకు తగిన స్వభావము కలదికాన "ప్రభవిష్ణు" అని చెప్పబడుచున్నది. అనగా

గీ॥ జ్యోతిషా మపి త జ్జ్యోతి స్తమసః పర ముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥ ॥౧౭॥

పదవిభాగము:— జ్యోతిషాం- అపి- తత్- జ్యోతిః- తమసః- పరం- ఉచ్యతే- జ్ఞానం- జ్ఞేయం- జ్ఞానగమ్యం- హృది- సర్వస్య- విష్ఠితమ్ ॥ ॥౧౭॥

ప్రతిపదార్థము:— తత్=అజ్ఞేయబ్రహ్మము; జ్యోతిషామపి=ఆదిత్యాదిజ్యోతిస్సులకు కూడా; జ్యోతిః=జ్యోతిస్సు; తమసః=అజ్ఞానము వలన; పరం=అసంస్పృష్టమని; ఉచ్యతే=చెప్పబడుచున్నది; జ్ఞానం=అమానిత్వాదిస్వరూపము; జ్ఞేయం="జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి" ఇత్యాదికముచే చెప్పబడిన జ్ఞేయస్వరూపము; జ్ఞానగమ్యం=జ్ఞానముచే తెలియబడునది; ఏతత్త్రయం=ఈజ్ఞాన, జ్ఞేయ, జ్ఞానగమ్యములనెడి మూడున్ను; సర్వస్య=ప్రతిప్రాణియొక్క; హృది=హృదయమునందు; విష్ఠితం=విశేషముగ నున్నది. ॥౧౭॥

---

భ్రాంతులకు ప్రపంచాకారముగ బ్రహ్మమే భాసించుచున్నదని యర్థము. ఈవిషయమునే "సత్యం చానృతం చ సత్య మభవత్" అను తైత్తిరీయశ్రుతియు బోధించుచున్నది. ఆబ్రహ్మమే తనయం దారోపితమైన ఆకాశాదిభూతములకు సత్తాస్ఫూర్తుల నిచ్చుటచే పోషణను చేయుచున్నది కాన "భూతభర్తృ" అని యనిపించుకొనుచున్నది. తనయం దారోపితమైన సర్వమును మూఢవ్యవహారార్థము భరించుచున్న దని యర్థము. ఈవిషయమునే "వ్యక్తావ్యక్తం భరతే విశ్వ మీశః" అను శ్రుతియు బోధించుచున్నది. ఆబ్రహ్మమే ప్రబోధదశయందు (అధిష్ఠానయాథాత్మ్యదర్శనకాలమునందు) తనయం దారోపితమైన సర్వమును తనయందే తిరోభావమును పొందించు స్వభావముకలదికాన "గ్రసిష్ణు" యని యనిపించుకొనుచున్నది. "పరే ఽవ్యయే సర్వ ఏకీభవన్తి" "సర్వే వేదా యత్రైకం భవన్తి" ఇత్యాదిశ్రుతులవలన రజ్జువువలె యారోపితమైన సర్వమును స్వాత్మచే నుపసంహరించుకొని విపరీతభావమును విడచి బోధస్వరూపమైన అవికారి యగు కేవలమైన నద్వైతమైన తన సత్తనే పొందుచున్నది. ॥౧౬॥

నీలకంఠీయము:— పూర్వోక్తాభిప్రాయమునే "అవిభక్తంచ——స్థితం" అను నీశ్లోకపూర్వార్థముచే నుపపాదించుచుండెను— "ఏక ఏవ తు భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః । ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్" అను శ్రుత్యనుసారము జలపాత్రములయందు చంద్రుని ప్రతిబింబములు చంద్రునికంటె నన్యములే గాన తద్రూపముగ జలపాత్రములయందు చంద్రు డవిభక్తుడే యయ్యు మూఢదృష్టికి విభక్తుడువలెను, దూరస్థుడువలెను విభిన్నుడువలెను కన్పట్టును. ఇట్లే కార్యకరణసంఘాతముగ పరిణమించిన భూతములయందు బ్రహ్మప్రతిబింబములగు జీవులుగూడ బింబభూతబ్రహ్మముకంటె నన్యులే గాన నీవిధముగనే జ్ఞేయమగు బ్రహ్మము భూతములయం దవిభక్త (విభాగమును పొందనిది) మయ్యు, మూఢదృష్టికి విభక్తమైనదివలెను, దూరస్థమైనదివలెను, నానావిధములైనదివలెను కన్పట్టుచున్నది.

పైవిధముగనే యగుచో చంద్రునికంటె నుదకపాత్రలు వేరయినట్లు బ్రహముకంటె వేరగ భూతములున్నవను భూతపృథక్సత్తాపత్తి కలుగుచున్నదను యాశంకపై జెప్పుచున్నాడు— "భూతభర్తృ చ తజ్జ్ఞేయం" రజ్జువునం దధ్యస్తములగు సర్పము, దండము మొదలగువానికి ఆరజ్జువుకంటె వేరే సత్త్వము లేమిగాన ఆదండసర్పాదులను అధిష్ఠానమై ఆరజ్జువే ధరించుచున్నది. ఇట్లే బ్రహ్మమునం దధ్యస్తములైన సర్వభూతములకు బ్రహ్మముకంటె పృథక్సత్త్వము లేనందున సర్వభూతములను అధిష్ఠానరూపముగ బ్రహ్మమే ధరించుచున్నది. "గ్రసిష్ణు ప్రభవిష్ణు చ" రజ్జుతత్త్వము తెలియబడినచో నజ్ఞానాధ్యస్తము లగు దండ, సర్పాదికము భాసింపకుండును— అట్టికాలమున రజ్జువు ఆదండసర్పాదికమును మ్రింగుచున్నదందుము. రజ్జ్వజ్ఞానకాలమున రజ్జువునందు అధ్యాసచే దండసర్పాదికము భాసించును. అట్టికాలమున రజ్జువునుండి ఈదండసర్పాదిక ముత్పన్నమగుచున్న దందుము. అట్లే బ్రహ్మము తెలియబడినచో నది యజ్ఞానాధ్యస్తములగు సర్వభూతములను మ్రింగునది యగుచున్నది. బ్రహ్మము తెలియబడనిచో నజ్ఞానాధ్యస్తములగు సర్వభూతములకు నుత్పాదకము నగుచున్నది. ॥౧౬॥

శాంకరభాష్యమ్:—

కించ సర్వత్ర విద్యమానం స న్నోపలభ్యతే చేత్ జ్ఞేయం తమ స్తర్హి । న, కిం తర్హి— జ్యోతిషా మాదిత్యాదీనా మపి తజ్జ్ఞేయం జ్యోతిః । ఆత్మచైతన్యజ్యోతిషేద్ధాని హ్యాదిత్యాదీని జ్యోతీంషి దీప్యంతే "యేన సూర్య స్తపతి తేజసేద్ధః, తస్య భాసా సర్వ మిదం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆ జ్ఞేయ మాదిత్యాదిజ్యోతిస్సులకు కూడ జ్యోతిస్సు (ప్రకాశకము). ఆత్మచైతన్య జ్యోతిస్సుచేతనే వ్యాప్తమై ఆదిత్యాదిజ్యోతిస్సులు ప్రకాశించుచున్నవి. ఈవిషయమునే "యేన సూర్య స్తపతి తేజ సేద్ధః" "తస్య భాసా సర్వ మిదం విభాతి" ఇత్యాదిశ్రుతులు,

—• ౧౩ వ అధ్యాయము ౧౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఆబ్రహ్మము అంతట నుండినను ప్రత్యక్షము కానిచో జడమే కావలసివచ్చు నని శంకింపజనదు. ఆబ్రహ్మము స్వయంజ్యోతిస్స్వరూపమైనను రూపాదులు లేని దగుటచే చక్షురాదీంద్రియగ్రాహ్యము కానేరదు. అని "జ్యోతిషాం" అనుదానిచే జెప్పుచుండెను.

అజ్ఞేయమైన బ్రహము అవభాసకములగు బాహ్యములైన ఆదిత్యాదులకు, అంతరములైన బుద్ధ్యాదులకు "జ్యోతిః" అవభాసకము. చైతన్యజ్యోతిస్సువలననే జడజ్యోతిస్సున కవభాసకత్వము. ఈవిషయమునే "యేన సూర్య స్తపతి తేజసేద్ధః" (ఏతేజస్సుచే వ్యాప్తమైనవాడై సూర్యుడు తపించుచుండెనో) "తస్య భాసా సర్వ మిదం విభాతి" (అతని యొక్క తేజస్సుచేతనే యీసర్వము ప్రకాశించుచున్నది.) అని శ్రుతులు బోధించుచున్నవి. ఈవిషయమునే "య దాదిత్యగతం తేజః" అని చెప్పగలడు. బ్రహ్మమునకు స్వయముగ జడత్వము లేకున్నను జడసంస్పృష్టము బ్రహ్మము కావచ్చు నను శంకను తొలిగించుటకు "తమసః పరం" అని చెప్పబడెను. సదసత్తులకు సంబంధము సంభవింపనందున నపారమార్థికమైన యవిద్యా తత్కార్యములతో బ్రహ్మము సంస్పృష్టకాదు. ఈవిషయమే "అక్షరా త్పరతః పరః" అను శ్రుతిచే చెప్పబడెను. బ్రహ్మవాదులుకూడ "నిస్సంగస్య ససంగేన కూటస్థస్య వికారిణా । ఆత్మనోఽనాత్మనా యోగో వాస్తవో నోపపద్యతే" నిస్సంగుడు, కూటస్థుడు నగు ఆత్మకు ససంగి, వికారి యగు అనాత్మతో వాస్తవసంబంధము కుదరదు అని చెప్పిరి. పైవిషయమునే "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అను శ్రుతియు బోధించుచున్నది. "ఆదిత్యవర్ణం" అనగా తాను భాసించుటయందు ప్రకాశాంతరాపేక్షలేనిది అని యర్థము. అనగా సర్వమునకు ప్రకాశక మని యర్థము. ఆబ్రహ్మము స్వయంజ్యోతీరూపముకనుకనే, జడాసంస్పృష్టము కనుకనే ఆబ్రహ్మస్వరూపజ్ఞానము ప్రమాణజన్యచేతోవృత్త్యభివ్యక్తసంవిద్రూపము. కనుకనే అజ్ఞేయమే అజ్ఞాత మగుటవలన తెలిసికొనుటకు తగినది. జడమున కజ్ఞాతత్వము లేనందున తెలిసికొనుట కనర్హము. అట్లగుచో నాబ్రహ్మ మందరిచే నేకారణముచే తెలియబడుటలేదు? అను శంకపై "జ్ఞానగమ్యం" అని చెప్పబడెను. పూర్వమునందు చెప్పబడిన, జ్ఞానహేతువగుటచే జ్ఞానశబ్దితములైన, అమానిత్వాదితత్త్వజ్ఞానార్థ దర్శనపర్యంతమైన సాధనకలాపముచే "గమ్యం" పొందదగినది. అట్టి సాధనకలాపములేనిచే పొందుటకు శక్యమైనది కాదు. ఆబ్రహ్మము సాధనముచే పొందదగినచో దేశాంతరవ్యవహితమా? కాదని "హృది సర్వస్య విష్ఠితం" అనుదానిచే చెప్పుచుండెను. సర్వప్రాణిజాతముయొక్క బుద్ధియందున్నది. అంతట సామాన్యముగ నున్నను విశేషరూపముచే బుద్ధియందుండి జీవరూపముగను, అంతర్యామిరూపముగను ఆబ్రహ్మము సూర్యతేజస్సు అద్దమునందు, సూర్యకాంతమణియందువలె నభివ్యక్తము. ఆబ్రహ్మము

శాంకరభాష్యమ్:—

విభాతి" ఇత్యాది శ్రుతిభ్యః । స్మృతే శ్చేహైవ "యదాఽఽదిత్యగతం తేజః" ఇత్యాదేః । తమసో౽జ్ఞానాత్పర మస్పృష్ట ముచ్యతే । జ్ఞానాదే ర్దుస్సంపాదనబుద్ధ్యా ప్రాప్తావసాద

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"యదాఽఽదిత్యగతం తేజః" ఇత్యాది స్మృతులు బోధించుచున్నవి. మరియు అజ్ఞానముచే నసంస్పృష్టము (అజ్ఞానసంస్పర్శలేనిది.) అని చెప్పబడుచున్నది. జ్ఞానము దుస్సంపాద మను బుద్ధిచే ప్రాప్తావసాదనము యొక్క ప్రకటీకరణార్థము కరణవ్యుత్పత్తిచే జ్ఞానశబ్దమునకు

వస్తుతః అవ్యవహితమ. భ్రాంతిచే వ్యవహితమువలె నుండి సర్వభ్రమకారణాజ్ఞానము నివర్తింప బ్రహ్మము పొందబడినదివలె నున్నది. ॥౧౭॥

శంకరానందీయము:— బ్రహ్మలక్షణమైన ప్రభవిష్ణుత్వాదికము అవ్యాకృతమైన ప్రకృతికి గూడ సంభవించుటచే ప్రకృతియే బ్రహ్మమే యను శంకను పరత్వాదివిశేషణములచే పరిహరించుచు, బ్రహ్మమును తెలిసికొనుటకై బ్రహ్మస్వరూపమును, బ్రహ్మప్రాప్తికి నియతమైన సాధనమును, బ్రహ్మోప లబ్ధిస్థానమును "జ్యోతిషాం" అను శ్లోకముచే బోధించుచుండెను—

జ్ఞేయమైన బ్రహ్మము జగద్బీజము, అజ్ఞానాత్మకము నగు ప్రకృతికంటె భిన్నము (వేరు.) కనుకనే "నేను అజ్ఞుడను" అని తనయం దధ్యస్తమైన యజ్ఞానము ప్రత్యక్స్వరూప మగు బ్రహ్మముచే ననుభవింప బడుచున్నది. అందువలన జ్ఞాత జ్ఞేయముకంటె భిన్నము. కనుకనే "అక్షరా త్పరతః పరః" "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" "అవ్యక్తా త్తు పరః పురుషః" ఇత్యాదిశ్రుతులు జగద్బీజము, అజ్ఞానరూపము నగు అవ్యాకృతముకంటె బ్రహ్మము భిన్నము (వేరు) అని బోధించుచున్నవి. బ్రహ్మము తమస్సు (ప్రకృతి) కంటె భిన్న మగుటయందు బ్రహ్మమునకు మరియొక విశేషణమును "జ్యోతిః" అనుదానిచే జెప్పుచుండెను. ఈవిశేషణము హేతుగర్భితము. బ్రహ్మము జ్యోతీరూపమగుటవలన తమోరూపమైన ప్రకృతికంటె భిన్నము. ప్రకృతిరూపముకంటె భిన్నము కానిచో జ్యోతీరూపము ఘటమువలె కాదు. ఇట్టి యుక్తిచే బ్రహ్మమునం దవ్యాకృతప్రకృతిభేదము సిద్ధించుచున్నది. జ్యోతిష్ట్వ మనగ ప్రకాశస్వరూపత్వము. లేదా ప్రకాశకత్వ మనియు అనవచ్చును. "యో జాగర మన్వభూవం య స్స్వప్న మదాక్షం య స్సుఖ మస్వాప్సం సోఽహ మస్మి" (ఏనేను జాగ్రదవస్థ ననుభవించితినో, ఏనేను స్వప్నమును చూచితినో, ఏనేను సుఖముగ నిద్రించితినో ఆనేను అయితిని) వ్యక్తావ్యక్తప్రకాశక మగుటచే నాత్మ వ్యక్తావ్యక్తభిన్న మగుటయందు ప్రత్యక్షము ప్రమాణము. ఆత్మ కార్యకారణరూపమైన వ్యక్తావ్యక్తసాక్షి యగుటవలన వ్యక్తావ్యక్తరూపమైన కార్యకారణములకంటె భిన్నము అను అనుమానముకూడ వ్యక్తావ్యక్తములకంటె యాత్మ వేరనుట యందు ప్రమాణము. "అన్య దేవ త ద్విదితా దథో అవిదితా దధి" (విదితావిదితరూపములైన కార్యకారణములకంటె యాత్మ వేరు) అను శ్రుతియు ప్రమాణము.

సూర్యాదులకు, బుద్ధ్యాదులకు అంతః, బహిః, జ్యోతిష్ట్వము (ఇతరప్రకాశకత్వము యుండియుండ బ్రహ్మమునకు మాత్రమే జ్యోతిష్ట్వము యెటుల సంభవించును? అనగా బ్రహ్మమునకు చెప్పిన జ్యోతిష్ట్వ లక్షణము సూర్యునియందు, బుద్ధియందుగూడ నుండుటచే యీలక్షణ మతివ్యాప్తిదోషగ్రస్త మను శంకను బ్రహ్మము సూర్యాదులకుగూడ ప్రకాశక మగుటచే నియుక్తలక్షణ మతివ్యాప్తిదోషగ్రస్తము కాదని 'జ్యోతిషాం'

శాంకరభాష్యమ్:—

నోత్పత్స్యమానార్థ మాహ జ్ఞాన మమానిత్వాది । జ్ఞేయం "జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి" ఇత్యాదినోక్తమ్ । జ్ఞానగమ్యం జ్ఞేయ మేవ జ్ఞాతం సద్జ్ఞానఫల మితి జ్ఞానగమ్య ముచ్యతే । జ్ఞాయ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జ్ఞానసాధనమైన అమానిత్వాదిక మర్థము. అమానిత్వాదికము, జ్ఞానగమ్యము. జ్ఞేయమే కాన జ్ఞేయమని జ్ఞానగమ్యమని చెప్పుట పునరుక్తి కాదా యని శంకింపజనదు. జ్ఞేయము జ్ఞాతమై

అని చెప్పెను. అనగా పరప్రకాశక మగు జ్యోతిస్సులకుగూడ ప్రకాశకము బ్రహ్మ మని యర్థము. అనగా జ్యోతిస్స్వరూపమైన సూర్యాదిస్వేతరప్రకాశకత్వము బ్రహ్మలక్షణము. సూర్యాదిప్రకాశకత్వము బ్రహ్మమునకే కాని సూర్యాదులకు లేనందున లక్షణమున కతివ్యాప్తి లేదు. పరప్రకాశకమైన ఆదిత్యాది జ్యోతిస్సులకు, బుద్ధ్యాదులకు ఆత్మ ప్రకాశక మగుచున్నది. చైతన్యస్వరూపమైన ఆత్మజ్యోతిస్సు చేతనే కదా సూర్యాదులు, బుద్ధ్యాదులు ప్రకాశ కలవై తప్తాయఃపిండమువలె స్వాతిరిక్తమును ప్రకాశింపజేయుచున్నవి. స్వతః ప్రకాశింపజేయుటలేదు. "యేనాదిత్య స్తపతి తేజసా భ్రాజసా చ" "శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనః" "తస్య భాసా సర్వ మిదం విభాతి" ఇత్యాదిశ్రుతులు పైవిషయమునే బోధించుచున్నవి. ఈచెప్పుటచే బహిరంతః అర్థప్రకాశకములైన భౌతికజ్యోతిస్స్వరూపమైన ఆదిత్యాదులకు, మనోబుద్ధ్యాదులకు ప్రకాశకము, ఆవిర్భావతిరోభావవృద్ధిక్షయపరిచ్ఛేదాదిరహితము, నిత్యము, నిరతిశయము, స్వప్రకాశము, అప్రాకృతజ్యోతిస్స్వరూపము బ్రహ్మ మని యుపదిష్టము.

ఇట్లు ముముక్షువులకు జ్ఞాతవ్యమైన బ్రహ్మస్వరూపము "న సత్త న్నాస దుచ్యతే" అని అతన్నిషేధ ద్వారమున బోధించి, యాబ్రహ్మమునే సాకల్యముగ "జ్యోతిషా మపి త జ్జ్యోతిః" అని అప్రాకృత జ్యోతిస్స్వరూపము బ్రహ్మ మని యుపదేశించి, విశేషోపదేశము లేనిదే యింతమాత్రమగు యుపదేశముచే బ్రహ్మసాక్షాత్కారము కలుగదని తలచి అస్మత్ప్రత్యయార్థముగ విద్వాంసులచే ననుభూయమానము, బుద్ధిగుహాయందైన యవ్యాకృతాకాశమునందు దేదీప్యమానము, బుద్ధ్యాదిసాక్షిస్వరూపము, సర్వాంతరము, సర్వప్రకాశకము, కాలత్రయాబాధ్యము, అసంగము, అవిక్రియము, ప్రత్యగ్రూపము నగు యే యఖండ చైతన్యము కలదో అదియే బ్రహ్మము అని సాక్షాత్తు విధిముఖముగ బోధించుటకు శ్రీకృష్ణపరమాత్మ "జ్ఞానం" అని చెప్పెను. బహిరంతః సర్వత్ర పరిపూర్ణము, స్వప్రకాశము, సర్వప్రకాశకము, అనాధారము (ఆధారములేనిది) అనాధేయము (ఒకదానియందుండనిది) అఖండము, అవాఙ్మానసగోచరము, ఆద్యంత రహితము, నిత్యకూటస్థము, నిర్విశేషము, నిత్యము, శుద్ధము, నిరాభాసము, నగు కేవలజ్ఞానము కలదో అదియే బ్రహ్మము. ఆబ్రహ్మమే ముముక్షు వగు యతికి స్వాత్మస్వరూపముగ తెలిసికొనదగిన దని యర్థము. "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" "విజ్ఞాన మానన్దం బ్రహ్మ" ఇత్యాదిశ్రుతులు, "జ్ఞానం విశుద్ధం విమలం విశోకం" ఇత్యాదిస్మృతులు పై విజ్ఞానమే బ్రహ్మమని బోధించుచున్నవి.

ఇట్లు యేది సర్వేంద్రియగుణాభాసమో, ఏది సర్వభృత్తో, ఏది గుణభోక్తయో, ఏది ప్రభవిష్ణువో, ఏది భూతభర్తయో, ఏది గ్రసిష్ణువో, ఏది తమస్సునకు పరమో, ఏది జ్యోతిస్సులకుగూడ జ్యోతిస్సో, అది బ్రహ్మ మని తటస్థలక్షణముచే పరోక్షముగ నుపదిష్టమైన వస్తువునకే అపరోక్షత్వసిద్ధికొరకై "జ్ఞానం బ్రహ్మ" అని స్వరూపలక్షణముచే జ్ఞాతవ్యమైన బ్రహ్మ నుపదేశించి, యిపుడు యట్టి బ్రహ్మసాక్షాత్కా—

శాంకరభాష్యమ్:—

మానం తు జ్ఞేయమ్। తదేత త్త్రియ మపి హృది బుద్ధౌ సర్వస్య ప్రాణిజాతస్య విష్ఠితం వి శేషేణ స్థితమ్। తత్రైవ హి త్రియం విభావ్యతే॥ ॥౧౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జ్ఞానఫల మని జ్ఞానగమ్య మనబడును. అట్టి జ్ఞానగమ్యము, జ్ఞాయమానము జ్ఞేయ మనబడును. అట్టి జ్ఞేయము యీమూడున్ను ప్రతిప్రాణియొక్క బుద్ధియందు విశేషముగ నున్నవి. బుద్ధియందే యీమూడును తలవబడుచున్నవి. ॥౧౭॥

రముకొరకు నియతమైన సాధనమును సూచించుటకొరకు "జ్ఞానగమ్యం" అని చెప్పెను. సదసద్వివేకము, వైరాగ్యము, శమము, దమము, సంన్యాసము, అమానిత్వము మొదలగు అంతరంగసాధనసంపత్తిచే బ్రహ్మవేత్త యగు గురువు యొక్క సన్నిధియందు అనాద్యవిద్యావాసనను సంక్షేపింపజేసుకొని నిత్యనిరంతరసమనుష్ఠితశ్రవణమనననిధిధ్యాసాద్యనుష్ఠానముచే పుట్టిన సర్వవికల్పనిర్ముక్తమైన యేజ్ఞానము కలదో శ్రుతి, ఆచార్య, ఈశ్వరప్రసాదసంజాతమైన యొక యాజ్ఞానముచేతనే (బ్రహ్మము) తెలిసికొనదగినది. కాన జ్ఞానముచేతనే అధిగమ్యము (తెలిసికొనదగినది) కాని సాంఖ్యముచేత కాని, యోగముచేత కాని, కర్మచేతను కాని, ఉపాసనచేతను కాని తెలిసికొనదగినది కాదు. మరేమనిన సర్వావయవసంబంధమైన తన యారోగ్య సుఖ మెట్లు తనచేతనే తెలిసికొనదగినదో యట్లే బ్రహ్మముకూడ స్వస్వరూపమైన స్వజ్ఞానముచేతనే తెలిసికొనదగినది. "మనసైవానుద్రష్టవ్యం" "మనసైవేద మాప్తవ్యం" అను శ్రుతులు పైవిషయమునే బోధించుచున్నవి. ఇట్లు వస్తుస్వరూపమును, తత్ప్రాప్తిసాధనమును చెప్పి బ్రహ్మోపలబ్ధిస్థానమును "హృది" అనుదానిచే జెప్పుచుండెను.

బ్రహ్మాదిస్తంబపర్యంతనిఖిలప్రాణుల బుద్ధిగుహాయం దవ్యాకృతాకాశమునం దున్నట్టియు, సర్వప్రాణులచేతను బుద్ధి. తద్వ్యాపార, తదవస్థాసాక్షిగ "అహ మహం" అని అహంపదప్రత్యయార్థముగ విశిష్య యున్నట్టియు, అట్టి దహరాకాశమునందు విశేషముగ ప్రత్యక్ష మగు ప్రత్యగ్రూపమైన బ్రహ్మము తెలిసికొనదగినది. అని యర్థము.

విచారింప బ్రహ్మము ఆకాశమువలె సర్వగతము, పరిపూర్ణము అయినను నిరవయవ మగుటవలన, నిరాకారమగుటవలన, అతిసూక్ష్మమగుటవలనను అంతటను ప్రత్యక్షము కానేరదు. మరేమనిన? సర్వగతమైనను బ్రహ్మము అతస్వచ్ఛ శుద్ధస్ఫటికమునందువలె నిర్మలమైన బుద్ధియందే ప్రత్యక్ష మగుచున్నది. "గుహాహితం ప్రాణిభి ర్గహ్యమాన మావిస్సన్నిహితం గహేయాం" అను శ్రుతివలన బుద్ధిగుహయందే బ్రహ్మము తెలిసికొనదగినది. "హృది సర్వస్య విష్ఠితమ్" అను స్థలమున హృచ్ఛబ్దవాచ్యము బుద్ధియే. బ్రహ్మోపలబ్ధిస్థాన మని యర్థము. ॥౧౭॥

నీలకంఠీయము:— ఈవిధముగ జ్ఞేయబ్రహ్మమునకు తటస్థలక్షణమును జెప్పి ఈశ్లోకమున స్వరూపలక్షణమును చెప్పుచుండెను— "జ్యోతిషా మపి తజ్జ్యోతిః" బాహ్యములగు ఆదిత్యాదిజ్యోతిస్సులు, అంతరము లగు బుద్ధ్యాదులు గూడ నితరాభాసకము లగుటచే జ్యోతిశ్శబ్దవాచ్యము లగును. ఇట్టి బాహ్యాభ్యంతరజడజ్యోతిస్సులకుగూడ ఆజ్ఞేయబ్రహ్మరూపజ్యోతిస్సు అవభాసక మగుచున్నది. చైతన్యరూప

గీ॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే ॥ ॥౧౮॥

పదవిభాగము:— ఇతి- క్షేత్రం- తథా- జ్ఞానం- జ్ఞేయం- చ- ఉక్తం- సమాసతః- మద్భక్తః- ఏతత్- విజ్ఞాయ- మద్భావాయ- ఉపపద్యతే ॥ ॥౧౮॥

ప్రతిపదార్థము:— ఇతి=ఇట్లు; క్షేత్రం=మహదాదిధృత్యంతము; తథా=అట్లే; జ్ఞానం=అమానిత్వాదికము; జ్ఞేయంచ=జ్ఞేయము; సమాసతః=సంక్షేపముగ; ఉక్తం=చెప్పబడెను; మద్భక్తః=నాయందు భక్తికలవాడు; ఏతత్=ఈసమ్యగ్దర్శనమును, విజ్ఞాయ=తెలిసికొని; మద్భావాయ=పరమాత్మభావముకొరకు; ఉపపద్యతే=సమర్థు డగుచున్నాడు. ॥౧౮॥

---

శాంకరభాష్యమ్:—

యథోక్తార్థోపసంహారార్థోఽయం శ్లోక ఆరభ్యతే— ఇత్యేవం క్షేత్రం మహాభూతాది ధృత్యంతం తథా జ్ఞాన మమానిత్వాది తత్త్వజ్ఞానార్థదర్శనపర్యంతం జ్ఞేయం చ "జ్ఞేయం య

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

త్వంపదార్థశుద్ధ్యర్థము వికారములతో గూడిన క్షేత్రమును, పదవాక్యార్థవివేకసాధనమైన అమానిత్వాదికమును, తత్పదార్థమైన శుద్ధమును, తద్భావమును చెప్పుటకొరకు వాటిఫలము యొక్క ఉపసంహారార్థమై యీశ్లోకము ప్రారంభింపబడుచుండెను.

---

జ్యోతిస్సు జడజ్యోతిస్సులను ప్రకాశింపజేయు ననుటకు 'యేన సూర్య స్తపతి తేజసేద్ధః, తస్య భాసా సర్వ మిదం విభాతి' అను మొదలగు శ్రుతులు ప్రమాణములు. ఈవిషయమునే గీతలయందుగూడ ముందు "యదాదిత్యగతం తేజః" అని చెప్పగలడు:— "తమసః పర ముచ్యతే" భూతగ్రాసమునకు, భూతప్రభవమునకు హేతు వగు యజ్ఞానముకంటె నాజ్ఞేయబ్రహ్మము దూరస్థ (అతీత) మైనది.

చంద్రసంబంధి యగు జ్యోతిస్సును తత్సజాతీయ మగు సౌరతేజస్సు ప్రకాశింపజేయుచున్న దని జ్యోతిశ్శాస్త్రమునందు ప్రసిద్ధము. పైవిధముగనే యాసౌరాదిజ్యోతిరవభాసక మగు తత్సజాతీయ మగు వేరొండు జ్యోతి స్సుండవలెనుగదా? అను యాశంకపై జెప్పుచున్నాడు— "జ్ఞానం జ్ఞేయం" ఆజ్ఞేయబ్రహ్మము కేవలజ్ఞప్తిమాత్రశరీరకము. ఇంతియేగాని భౌతికము కాదు. అట్టి బ్రహ్మమే యజ్ఞానావృతమగుటచే తెలియబడకుండెను. కాన దానినే జ్ఞానముచే దెలిసికొనుటకు ప్రయత్నింపదగును. ఆజ్ఞాన మెట్లు కల్గునందువా? "జ్ఞానగమ్యం" (ఇట జ్ఞానశబ్దము జ్ఞానసాధనపరము) అమానిత్వాదిజ్ఞానసాధనములచే నాజ్ఞానము (జ్ఞప్తిరూపబ్రహ్మము) పొందదగును. అట్లగుచో నాజ్ఞప్తిరూపబ్రహ్మము గ్రామాంతరమువలె దేశవ్యవహితమా? లేక: బాల్యయౌవనాద్యవస్థాంతరమువలె కాలవ్యవహితమా? అను యాశంకపై జెప్పుచున్నాడు— "హృది సర్వస్య విష్ఠితమ్" ఆజ్ఞప్తిరూపమగు బ్రహ్మము సర్వప్రాణుల హృదయమునందును సన్నిహితమే. కాన నయ్యది స్వాత్మభూతమే యగును. (కాన యంతర్దృష్టికలవారల కందరకును లెస్సగ ప్రకాశించు నని యర్థము.) ॥౧౪॥

—• ౧౩ వ అధ్యాయము ౧౮ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— క్షేత్రాదికము, అధికారిఫలము చెప్పబడె నని చెప్పుచు "ఇతి" అనుశ్లోకముచే నుపసంహరించుచుండెను— ఈపూర్వోక్తరీతిని మహదాదిధృత్యంతక్షేత్రము,

శాంకరభాష్యమ్:—

త్తత్" ఇత్యాది "తమసః పర ముచ్యతే" ఇత్యేవ మంత ముక్తం సమాసతః సంక్షేపతః । ఏతావా న్సర్వో హి వేదార్థో గీతార్థ శ్చోపసంహృత్యోక్తః । అస్మి న్సమ్యగ్దర్శనే కోఽధికారీత్యత ఇత్యుచ్యతే మద్భక్తో మయీశ్వరే సర్వజ్ఞే పరమగురౌ వాసుదేవే సమర్పితసర్వాత్మభావో య-

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మహాభూతములు మొదలుకొని ధృత్యంతమగు పూర్వమునందు చెప్పబడిన క్షేత్రము, అట్లే అమానిత్వము మొదలుకొని తత్త్వజ్ఞానార్థదర్శనపర్యంతమైన జ్ఞానము, "జ్ఞేయం యత్తత్" అనునది మొదలుకొని "తమసః పర ముచ్యతే" అనునంతవరకు చెప్పబడిన జ్ఞేయము సంక్షేపముగ చెప్పబడెను.

అమానిత్వాదితత్త్వజ్ఞానార్థ దర్శనాంతమగు మగు జ్ఞానము (జ్ఞానసాధనములు) "అనాదిమత్పరం బ్రహ్మ" అనునది మొదలుకొని "విష్ఠితం" అనునంతవరకు జ్ఞేయము, శ్రుతులవలనను, స్మృతులవలనను ఆకర్షించి క్షేత్ర, జ్ఞాన, జ్ఞేయములు మూడును మందబుద్ధ్యనుగ్రహముకొఱకై నాచే సంక్షేపముగ చెప్పబడెను. నిఖిల వేదార్థము, గీతార్థము ఇంతమాత్రమే. ఇట్లు గీతార్థమునందు పూర్వాధ్యాయమునందు చెప్పబడిన లక్షణములు కల నాభక్తుడే యధికారి యని చెప్పుచుండెను. పరమగురువు, భగవంతుడు నగు వాసుదేవునియందు సమర్పితసర్వాత్మభావముకల మదేకశరణుడు యీచెప్పబడిన క్షేత్రమును, జ్ఞానమును, (జ్ఞానసాధనములను) జ్ఞేయమును (బ్రహ్మమును) వివేకముతో తెలిసికొని సర్వానర్థశూన్యపరమానందభావరూపమైన మోక్షముకొరకై సమర్థ డగుచున్నాడు. అనగా మోక్షమును పొందుటకు యోగ్యు డగుచున్నాడు. "యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ । తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః" ఎవనికి దేవునియందుత్కృష్టమైన భక్తియో, దేవునియందెట్టి భక్తి కలదో, యట్టి భక్తి గురువునందుకూడ కలదో, యట్టి మహాత్మునకు యీచెప్పబడిన యర్థములు ప్రకాశించును. అనెడి శ్రుతియు ఘోషించుచున్నది. కాన నెల్లపుడు మదేకశరణుడై ఆత్మజ్ఞానసాధనములనే పరమపురుషార్థలిప్స కలవాడై, యనువర్తింపవలయును. తుచ్ఛవిషయభోగస్పృహను విడనాడవలెను. ॥౧౮॥

శంకరానందీయము:— ఉపక్రాంతవిషయమును "ఇతి" అనుశ్లోకముచే నుపసంహరించుచుండెను.

ఇట్లు సంగ్రహముగ ఆత్మస్వరూప మగు క్షేత్రజ్ఞునకు క్షేత్ర, తద్వికార, తద్ధర్మ, తత్కార్మ, తదవస్థాసంబంధాపవాదముచే విశుద్ధత్వసిద్ధ్యైకప్రయోజనముగాకల మహాభూతాది ధృత్యంతమైన హేయవస్తుస్వరూపమును, అట్లే శ్రవణమననాదిద్వారమున ఆత్మజ్ఞానసిద్ధియే ముఖ్యప్రయోజనముగా కల అమానిత్వాదిస్వరూపమును "జ్ఞేయం" "అనాది మత్పరం బ్రహ్మ" అనునది మొదలుకొని "జ్ఞానం" అనునంతవరకైన గ్రంథముచే తటస్థస్వరూపలక్షణములచే ప్రత్యగభిన్నబ్రహ్మము యొక్క స్వరూపమును జిజ్ఞాసువగు ముముక్షువునకు స్వస్వరూపము తెలియుటకొఱకు లెస్సగ చెప్పబడె నని చెప్పి, ఇట్టి విశేషణములతో గూడిన వాడే యీవిషయమునం దధికారి యని యిచట యధికారిలక్షణమును చెప్పుచు, చెప్పబడిన లక్షణలక్షితమైన బ్రహ్మమును స్వాత్మస్వరూపముగ తెలిసికొనిన కల్గు ఫలమును "మద్భక్తః" అనుదానిచే చెప్పుచుండెను. "మత్కర్మకృ న్మత్పరమః" అని "యే తు సర్వాణి కర్మాణి" ఇత్యాద్యుక్తలక్షణలక్షితుడైన

గీ॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥ ॥౧౯॥

పదవిభాగము:— ప్రకృతిం- పురుషం- చ- ఏవ- విద్ధి- అనాదీ- ఉభౌ- అపి- వికారాన్- చ- గుణాన్- చ- ఏవ- విద్ధి- ప్రకృతిసంభవాన్ ॥ ॥౧౯॥

ప్రతిపదార్థము:— ప్రకృతిం=ప్రకృతి; పురుషంచైవ=పురుషుడు అనెడి; ఉభావపి= రెండింటిని, అనాదీ=(న+విద్యతే+ఆదిర్యయోస్తావనాదీ) వేటికి మొదలు (కారణము) లేదో యవి యనాదులనబడును. అనగా కారణములేని వాటినిగ; విద్ధి=తెలిసికొనుము; వికారాంశ్చ=చెప్పబోవు బుద్ధ్యాదిదేహేంద్రియాంతములైన వికారములను; గుణాంశ్చైవ=సుఖదుఃఖమోహప్రత్యయాకార పరిణత మైన గుణములను; ప్రకృతిసంభవాన్=ప్రకృతి=త్రిగుణాత్మకమైన మాయవలన; సంభవాన్=పుట్టినవాటినిగ; విద్ధి=తెలుసుకొనుము. ॥౧౯॥

శాంకరభాష్యమ్:—

త్పశ్యతి శృణోతి స్పృశతి వా సర్వమేవ భగవాన్వాసుదేవ ఇత్యేవంగ్రహావిష్టబుద్ధి ర్మద్భక్తః స ఏత ద్యథోక్తం సమ్యగ్దర్శనం విజ్ఞాయ మద్భావాయ మమ భావో మద్భావః పరమాత్మభావ స్తస్మై మద్భావా యోపపద్యతే మోక్షం గచ్ఛతి ॥ ॥౧౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇంతమాత్రము నిఖలవేదార్థము, గీతార్థము ఉపసంహరింపబడి చెప్పబడెను. ఈసమ్యగ్దర్శనమునం నెవడధికారి? అనిన చెప్పెద (వినుము!) సర్వజ్ఞుడు, పరమగురువు ఈశ్వరుడు అగు వాసుదేవునియందు సమర్పింపబడిన సర్వాత్మభావముకలవాడై దేనిని చూచునో, వినునో, స్పృశించునో ఆసర్వము భగవంతుడగు వాసుదేవుడే యను జ్ఞానావిష్టమైన బుద్ధికల నాభక్తుడే పూర్వమునందు చెప్పబడిన సమ్యగ్దర్శనమును తెలిసికొని పరమాత్మభావము కొరకు సమర్థుడగుచున్నాడు. అనగా మోక్షమును పొందుచున్నాడు. ॥౧౮॥

వాడు నాభజనచేతనే శుద్ధాంతఃకరణ కలవాడై సదసద్వివేక, సంన్యాస, శమ, దమామానిత్వాదిసాధన సంపన్నుడై, బ్రహ్మవిదనుగ్రహమువలన క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపమును లెస్సగ తెలిసికొని, (వివేచన చేసుకొని) క్షేత్రతద్ధర్మములను పరిత్యజించి, విశుద్ధము, కేవలచిన్మాత్రము, క్షేత్రజ్ఞస్వరూపమునగు నిర్విశేషపరబ్రహ్మమును "ఈపరబ్రహ్మమే నేను" అని స్వాత్మస్వరూపముగ తెలిసికొని పరమేశ్వరతాదాత్మ్యప్రతిపత్తిచే పరమాత్మయందే "అహం" అనుబుద్ధిని స్థాపన చేసి, బ్రహ్మవేత్త యగు యతి బ్రహ్మభావముకొరకు నిర్విశేషబ్రహ్మస్వరూపముగ నవస్థానరూపమైన మోక్షముకొరకు సమర్థుడగుచున్నాడు. ఈయుపాధి పతితమైనతోడనే పూర్ణస్వరూపముతో నుండును. ॥౧౮॥

—॥ ౧౩ వ అధ్యాయము ౧౯ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ॥—

మధుసూదనసరస్వతీయము:— ఈపూర్వోక్తగ్రంథముచే "తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ" అనునది వ్యాఖ్యాతము. ఇపుడు "యద్వికారి యతశ్చ యత్" అనుదానిని "ప్రకృతిం" అనుశ్లోకము

శాంకరభాష్యమ్:—

తత్ర సప్తమ ఈశ్వరస్య ద్వే ప్రకృతీ ఉపన్యస్తే పరాపరే క్షేత్రక్షేత్రజ్ఞలక్షణే । ఏత ద్యోనీని భూతా నీతి చోక్తమ్ । క్షేత్రక్షేత్రజ్ఞప్రకృతిద్వయయోనిత్వం కథం భూతానా మిత్యయ మర్థో౽ధునోచ్యతే — ప్రకృతిం పురుషం చైవేశ్వరస్య ప్రకృతీ తౌ ప్రకృతిపురుషౌ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సప్తమాధ్యాయమునందు యీశ్వరునకు క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపములైన పరాపర ప్రకృతులు రెండుపన్యసింపబడెను. మరియు భూతము లీపరాపరప్రకృతులే కారణముగా కలవనియు చెప్పబడెను. భూతములకు క్షేత్రక్షేత్రజ్ఞరూపమైన ప్రకృతిద్వయ మెటుల కారణమో ఆవిషయ మిపుడు చెప్పబడుచుండెను.

మొదలుకొని రెండుశ్లోకములచే వ్యాఖ్యానించుచుండెను. "స చ యో యత్ప్రభావశ్చ" అనుదానిని "పురుషః" అను ౨౧వశ్లోకము మొదలుకొని రెండుశ్లోకములచే వ్యాఖ్యానించు నని వివేకము.

అందు సప్తమాధ్యాయమునందు యీశ్వరునికి క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపమైన పరాపరప్రకృతులను రెంటిని యుపన్యసించి, "ఏతద్యోనీని భూతాని" ఈపరాపరప్రకృతులే కారణముగా కల వని చెప్ప బడెను. అందు అపరాప్రకృతి క్షేత్రస్వరూపము. పరాప్రకృతి జీవస్వరూపము. అని యాపరాపర ప్రకృతులకు అనాదిత్వమును చెప్పి, భూతములకు అపరాపరప్రకృతిద్వయము కారణ మని "ప్రకృతిం" అనుదానిచే చెప్పుచుండెను—

పూర్వమునం దపరాప్రకృతి యని చెప్పబడిన దేదియో యాప్రకృతియే మాయ యని పేరు కలది. యది త్రిగుణాత్మకము, పరమేశ్వరసంబంధమైన శక్తి. క్షేత్రస్వరూపము. జీవు డను పేరు గల యేపర ప్రకృతి పూర్వమునందు చెప్పబడెనో యదియే యిచట పురుషు డని చెప్పబడెను. కాన పూర్వాపర విరోధము లేదు. ప్రకృతిని, పురుషుని యుభయులను అనాదులుగనే (కారణములేనివాటిగనే) తెలిసి కొనుము. ప్రకృతి సర్వజగత్కారణ మగుటవలన యనాది యగును. ప్రకృతికూడ కారణాంతరమువలననే జనించుచున్న దనిన, ఆకారణాంతరముకూడ మరియొక కారణాంతరమువలన జనించుచున్నది అని కల్పన చేయుచో అనవస్థ యను దోషము ప్రాప్తించును. కానప్రకృతికి కారణములేనందున ప్రకృతి యనాదియగును.

పురుషుడు తద్ధర్మాధర్మప్రయుక్తు డగుటవలనను, జాతమైననిఖిలజగత్తునకు హర్షశోకభయసంప్రతిపత్తి వలనను అనాదియగును. అట్లుకాక పురుష డాది కలవాడే యగుచో కృతహాన్యకృత్యాభాగమను సంభ వించెడిని. అనగా ఆదిమత్తు శినంచును కాన తానీజన్మమునందు చేసిన సుకృతము తనతో నశింపవలసి వచ్చును. తానీజన్మకు పూర్వమునందు లేదు కాన జన్మమును పొందినతోడనే అగర్భశ్రీమంతుడై యుండుటచే చేయని సుకృతము ప్రాప్తించవలసివచ్చును. ఆరెండును అనిష్టములే. అందువలన పురుషు డనాది యని యొప్పుకొనవలయును. ప్రకృతి యనాది కనుకనే యది భూతములకు కారణ మని పూర్వము నందు చెప్పబడిన విషయ ముపపన్నమే యని "వికారాంశ్చ" అనుదానిచే చెప్పుచుండెను. పదునారు వికారములు (పంచమహాభూతములు, పదునొకయింద్రియములు) ఈపదునారింటిని, సత్త్వరజస్తమోరూప మైన సుఖదుఃఖమోహములను ప్రకృతివలన జనించినవాటినిగ దెలిసికొనుము. ॥౧౯॥

శాంకరభాష్యమ్:—

వుభా వప్యనాదీ విద్ధి। న విద్యత ఆది ర్యయో స్తా వనాదీ। నిత్యేశ్వరత్వా దీశ్వరస్య తత్ప్రకృత్యోరపి యుక్తం నిత్యత్వేన భవితుమ్। ప్రకృతిద్వయవత్త్వమేవ హీశ్వర స్యేశ్వ రత్వమ్। యాభ్యాం ప్రకృతిభ్యా మీశ్వరో జగదుత్పత్తిస్థితిప్రలయహేతు స్తే ద్వే అనాదీ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రకృతి, పురుషుడు యీశ్వరునియొక్క ప్రకృతులు. అట్టి యీశ్వరప్రకృతులను "అనాదీ న విద్యత ఆది ర్యయో స్తా వనాదీ" అని బహువ్రీహిసమాసము. వేటికి కారణము లేదో అవి యనాదులు. అనగా నిత్యములు అని యర్థము. ఈశ్వరుడు నిత్యేశ్వరుడగుటవలన నీశ్వరప్రకృతులు కూడ నిత్యములయియే యుండుట న్యాయము. ఈశ్వరున కీశ్వరత్వ మనగ

శంకరానందీయము:— నిఖిలవేదాంతములయొక్కయు, గీతాశాస్త్రముయొక్కయు యర్థ మిచట పర్యవసితము. అయినను సప్తమాధ్యాయమునందలి "ఏతద్యోనీని భూతాని" అని యేపరాపర ప్రకృతులకు సంసారకారణత్వము, జన్మాది, తత్కారణత్వము సూచితమో దానిని యిపుడు "కార్య కారణకర్తృత్వే" అని "యావ త్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజంగమం" అని విస్పష్టపరచుటకు క్షేత్రక్షేత్రజ్ఞుల వివేకము చేయబడిన దైనప్పటికి అవిదితమైన ప్రకృతిపురుషుల యనాదిత్వమును, వికారము లకు గుణములకు ప్రకృతికార్యత్వమును, క్షేత్రమునకు క్షేత్రజ్ఞునియందు ప్రతీయమానమై సంసారమునకు గుణాధ్యాసమూలకత్వమును, సంసారమునకు ప్రకృతిధర్మత్వమును, ఆత్మకు నిర్వికారత్వమును, అసంగ త్వమును, అకర్తృత్వమును, అభోక్తృత్వమును, అసంసారిత్వమును స్పష్టపరచుటకై "ప్రకృతిం" అనునది మొదలు యుత్తరగ్రంథ మారంభింపబడుచుండెను.

"భిన్నా ప్రకృతి రష్టధా। అపరేయం" అని సర్వవికారకారణము, యీశ్వరశక్తిస్వరూపము, త్రిగు ణాత్మకమునైన మాయాస్వరూపమైన యే యపరాప్రకృతి చెప్పబడెనో ఆప్రకృతిని, "పురుషం" పురుషు డనగ అవిద్యోపాధికుడు "ప్రకృతిం విద్ధి మే పరాం" అని చెప్పబడిన లక్షణములు కల క్షేత్రజ్ఞుడు రాజ్యసంబంధమువలన మనుష్యునకు రాజత్వమువలె ప్రభుత్వమువలె ప్రకృతిసంబంధమువలన క్షేత్రజ్ఞునకు గూడ ప్రకృతిత్వము, జీవత్వము, ప్రత్యగ్రూపము, చేతనము, ప్రకాశకము అగుటచే మూలప్రకృతి కంటె యుత్కృష్టమగుటవలన "పరప్రకృతి" అను సంజ్ఞను పొందిన పురుషుం ఈప్రకృతిపురుషరూప మైన యిద్దరిని యనాదులుగ తెలిసికొనుము. అనాదు లనగ కారణముకాని, ఉత్పత్తిమత్త్వముకాని, ప్రాక్కాలపరిచ్ఛేదముకాని వేటికి లేదో యవి యనాదు లనబడును. సర్వమున కీప్రకృతిపురుషు లాదిభూతులు. స్వయముగ నీప్రకృతిపురుషు లాదిరహితములే. అని ఏవకారము యీప్రకృతిపురుషులు యీశ్వరుని వలె నిత్యము అని యవధారణార్థకము. ఈశ్వరున కీశ్వరత్వము నిత్యముకదా! అయీశ్వరత్వము యీశితవ్యా పేక్షము. ఈశితవ్యయములు నిత్యములై యుండిననే ఈశ్వరునకు యీశ్వరత్వము నిత్యమైయుండును. యీశి తవ్యములు నిత్యములుకానిచో యీశ్వరున కీశ్వరత్వము సత్యము కాకపోయెడిని.

మార్యునకు నక్షత్రాంతరయోగమువలన నక్షత్రత్వమువలె ప్రకృతి యనిత్యమైనను, యీశ్వరునకు ప్రతిక్షణ జాయమానప్రకృత్యంతరసంబంధ ముండ యీశ్వరునకు నిత్యత్వము సంభవించుటవలన నెందులకు

శాంకరభాష్యమ్:—

సత్యౌ సంసారస్య కారణమ్। నాఽఽదీ అనాదీ ఇతి తత్పురుషసమాసం కేచి ద్వర్ణయన్తి। తేన హి కిలేశ్వరస్య కారణత్వం సిధ్యతి। యది పునః ప్రకృతిపురుషావేవ నిత్యౌ స్యాతాం తత్కృత మేవ జగ న్నేశ్వరస్య జగతః కర్తృత్వమ్। తదసత్, ప్రాక్ప్రకృతిపురుషయో

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రకృతిద్వయము కలిగియుండుటే కదా. ఏప్రకృతిద్వయముచేతనే యీశ్వరుడు జగదుత్పత్తి స్థితిప్రలయహేతు వగుచుండెనో అట్టి రెండు ప్రకృతులు "అనాదీ" సత్యములై సంసారమునకు కారణము లగుచున్నవి.

ప్రకృతిపురుషులకు నిత్యత్వ మంగీకరింపవలయును? అని శంకింపజనదు. "అజా మేకాం" అని మూలప్రకృతికి అజాత్వము, ఏకత్వము శ్రూయమాణముగుటవలన మరియొక ప్రకృతి సంభవింపనందున "ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః" అని పరమాత్మకు ప్రకృతిద్వయేశ్వరత్వము శ్రూయమాణ మగుటవలన నీశ్వరత్వనిమిత్తములైన ప్రకృతిపురులకు గూడ నీశ్వరుడువలె నిత్యత్వము తప్పదు. పరాపరప్రకృతిరూపములైన ప్రకృతిపురుషు లనిత్యములే యగుచో నీశ్వరునకు యొకానొకప్పుడు యీశితవ్యము (పరిపాలింపదగినది) లేమింజేసి యీశ్వరత్వమునకే భంగము కలిగెడిని. సృష్ట్యాదియందు పుణ్యపాపాద్యపేక్ష లేకుండగనే నిర్నిమిత్తముగ జీవులకు నానాయోనులయం దుద్భవించుట ప్రాప్తించెడిని. అట్లే నిర్నిమిత్తముగ సుఖదుఃఖాదికల్పనయు ప్రాప్తించెడిని. అట్లే యగుచో జగత్స్రష్ట యగు నీశ్వరునకు వైషమ్యనైర్ఘృణ్యములు ప్రాప్తించెడిని. మరియు "ప్రకృతిచే బద్ధుడైన బద్ధుడగుచుండెను, ప్రకృతిచే విడవబడిన వాడైన ముక్తుడగుచుండెను." అని నియతమైన బంధమోక్షముల కవ్యవస్థ ప్రాప్తించెడిని. అట్లే యగుచో బద్ధులకుగూడ ముక్తియు, ముక్తులకు జన్మాదిబంధము ప్రాప్తించెడిని. బంధమోక్షప్రతిపాదక శాస్త్రమున కానర్థక్యముగూడ ప్రాప్తించెడిని. పరాపరప్రకృతిరూపమైన ప్రకృతిపురుషు లనిత్యులే యగుచో నిట్టి యనర్థపరంపర ప్రాప్తించును.

పురుషశబ్దవాచ్యమైన జీవు డాధునికు డగుటవలన పైన చెప్పబడిన యనర్థపరంపర ప్రాప్తింప దని శంకింపజనదు.

అట్లగుచో ప్రత్యక్షాదిప్రమాణములకు విరోధము ప్రాప్తించును. అది యెట్లనిన? జీవులకు ప్రత్యక్షముగ సుఖదుఃఖాదివైచిత్ర్య ముపలభ్యమానమగుచున్నది. అట్టి సుఖదుఃఖాదివైచిత్ర్యము కర్మనిబంధనమే కాని, పురుషునియొక్క స్వాతంత్ర్యము నిబంధనముగా కలదికాదు. ఆసుఖదుఃఖాదివైచిత్ర్యము పురుషస్వాతంత్ర్యనిబంధనమే యగుచో నందరకు సుఖదుఃఖాదులు సమానముగనే యుండవలసివచ్చును. కాన సుఖదుఃఖాదివైచిత్ర్యాన్యథానుపపత్తిచే సంసారము ధర్మాధర్మనిబంధన మని యూహింపబడుచున్నది. అందువలన యనుమానప్రమాణముచేతను, "యత్కర్మ కురుతే త దభిసంపద్యతే" ఇత్యాదిశ్రుతులచేతను, సుఖదుఃఖాదులకు కర్మైకనిబంధనత్వ మంగీకరింపవలయును. అనగా స్వకృతకర్మానురూపముగ సుఖదుఃఖాదులు ప్రాప్తించునని యంగీకరింపవలయును. దానికిగూడ జన్మాంతరీయమైన కర్మయే కారణము. తర్ణకాదుల యందు కర్మాదర్శనముచే ఈజన్మచే నాచరింపబడిన కర్మ కాదు. కర్మ లనాధునికములే యగుచో తత్కర్త యగు జీవునకు నిత్యత్వమే సిద్ధమగుచున్నది. "న జీవో మ్రియతే" అనుశ్రుతివలన గూడ జీవునకు నిత్యత్వమే సిద్ధము. "అజా మేకాం" "న జీవో మ్రియతే" ఇత్యాదిశ్రుతులచే ప్రకృతిపురుషులు నిత్య మనుటయం దేయనుపపత్తియును లేదు.

శాంకరభాష్యమ్:—

రుత్పత్తే రీశితవ్యాభావా దీశ్వర స్యానీశ్వరత్వప్రసంగాత్ । సంసారస్య నిర్నిమిత్తత్వేఽని ర్మోక్షత్వప్రసంగా చ్ఛాస్త్రానర్థక్యప్రసంగా ద్బంధమోక్షాభావప్రసంగాచ్చ । నిత్యత్వే పునరీశ్వరస్య ప్రకృత్యోః సర్వ మేత దుపపన్నం భవేత్ । కథం, వికారాంశ్చ గుణాంశ్చైవ వక్ష్యమాణా న్వికారా న్బుద్ధ్యాదిదేహేన్ద్రియాన్తా న్గుణాంశ్చ సుఖదుఃఖమోహప్రత్య

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కొందరు "అనాదీ" అను స్థలమున "న + ఆది అనాదీ" అని తత్పురుషసమాసమును వర్ణించుచుండిరి. ఈవర్ణనవలన ప్రకృతిద్వయము కారణము కాదు. అని చెప్పినట్లగును. ఈచెప్పుటచే నీశ్వరునకు కారణత్వము సిద్ధించుచున్నది. ప్రకృతిపురుషులే నిత్యము లగుచో జగత్సృష్టి ప్రకృతిపురుషకృతమే యగును కాని యీశ్వరునకు జగత్కర్తృత్వము సంభవింపదు. అనికొందరు వర్ణించిరి. ఈవర్ణన మసంగతము. ప్రకృతి పురుషులయొక్క ఉత్పత్తికి పూర్వము నందు ఈశితవ్యమే (పరిపాలింపదగినదే) లేనందున నీశ్వరునకు యీశ్వరత్వమే లేకపోవలసి వచ్చును. సంసారము నిర్నిమిత్తమే యగుచో ముక్తులకుగూడ నిర్నిమిత్తముగ సంసారము

ఈశ్వరునివలె పరాపరప్రకృతులుకూడ నిత్యమే యగుచో ప్రకృతితోగూడిన యాత్మ కెన్నడును మోక్షమే లేకపోవలసివచ్చును. బ్రహ్మకుగూడ నద్వితీయత్వము సిద్ధింపనేరదు. బ్రహ్మ కద్వితీయత్వమును, అట్టి బ్రహ్మమును తెలిసికొనినవానికి మోక్షమును బోధించుచున్న శాస్త్రమున కప్రామాణ్యము ప్రాప్తించ వలసివచ్చునని శంకింపజనదు.

ఈసర్వము మాయాకార్య మగుటవలన సమ్యగ్జ్ఞానదశయందు స్వాప్నికపదార్థములవలె మిథ్యయే యగుచున్నది. ప్రబోధదశయందు నిద్రకు కాని, తత్కార్యమునకు కాని సత్యత్వము చూడబడుటలేదు. అట్లే "న సత్తన్నా సదుచ్యతే" అని చెప్పిన రీతిని యాత్మయాథాత్మ్యవిజ్ఞానదశయందు మాయకు, మాయాకార్యముకు అసత్యత్వమే. "జీవేశావాభాసేన కరోతి మాయా చావిద్యా చ స్వయ మేవ భవతి" "మాయామాత్ర మిదం ద్వైతం" "వికల్పో న హి వస్తునః" ఇత్యాదిశ్రుతులవలన మాయకు, మాయాకార్యములకు అసత్యత్వము బోధింపబడుచున్నది. కాన బ్రహ్మమున కద్వితీయత్వము, బ్రహ్మజ్ఞానము కలవానికి మోక్షమును, తత్ప్రతిపాదకశాస్త్రమునకు ప్రామాణ్యము సిద్ధించుచున్నది. "యత్ర హిం ద్వైత మివ భవతి తదితర ఇతరం పశ్యతి" ఏయవస్థయందు మిథ్యాభూతద్వైతము భాసించునో యాయవస్థయం దితరుడు యితరమును చూచును. అను న్యాయముచే నజ్ఞానదశయందు సర్వము అర్థవత్తే యగుచున్నది. వివేకదశయందన్ననో విచారింపగ "సర్వము మిథ్యయే" అని బోధించుటకు శ్రీకృష్ణపరమాత్మచే ప్రకృతిపురుషవివేక మారంభింపబడి "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి" అని చెప్పుచుండెను. ప్రకృతిపురుషు లిరువురు అనాదులు, నిత్యులు నని తెలిసికొనుము. మరియు "వికారాః" దేహేన్ద్రియములో మధ్యహంకారాదులు, శబ్దస్పర్శ రూపరసగంధము లనెడి తన్మాత్రలు ఇవన్నియు వికారము లనబడును. ఇట్టి వికారములును, (గుణములును) సుఖదుఃఖేచ్ఛాద్వేషలోభమోహకామసంకల్పాదులు, శమదమాదులు। భ్రమప్రమాదాదులు పుణ్యాపాపానురూపమైన యింద్రియవ్యాపారాదులు ఈసర్వము బీజమునుండి యంకురస్కంధశాఖాపత్రపుష్ప ఫలాదులవలె త్రిగుణాత్మకము, అవ్యక్తశబ్దవాచ్యము నగు ప్రకృతివలన పుట్టినవాటిగ తెలిసికొనుము. నిరవ.

గీ॥ కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతి ర్యుచ్యతే ।
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే ॥ ॥౨౦॥

పదవిభాగము:— కార్యకరణకర్తృత్వే- హేతుః- ప్రకృతిః- ఉచ్యతే- పురుషః- సుఖదుః ఖానాం- భోక్తృత్వే- హేతుః- ఉచ్యతే ॥ ॥౨౦॥

ప్రతిపదార్థము:— కార్యకరణకర్తృత్వే- కార్య=దేహముయొక్క, దేహారంభకములగు భూతములయొక్క, శబ్దస్పర్శరూపరసగంధములయొక్క; కరణ=పంచకర్మేంద్రియ పంచజ్ఞానేంద్రియ మనోబుద్ధ్యహంకారరూపమైన పదమూటియొక్క సుఖదుఃఖమోహాత్మక మగు గుణములయొక్క; కర్తృత్వే=పుట్టించుట యందు; ప్రకృతిః=ఈశ్వరశక్తిరూపమైన మాయ; హేతుః=కారణమని; ఉచ్యతే=చెప్పబడుచున్నది: సుఖదుఃఖానాం=సుఖదుఃఖముల యొక్క; భోక్తృత్వే=భోక్తృత్వమునందు, (ప్రత్యక్షమును కలుగజేసుకొనుటయందు) పురుషః=క్షేత్రజ్ఞుడగు జీవుడు; హేతుః=కారణముగ; ఉచ్యతే=చెప్పబడుచున్నాడు. ॥౨౦॥

శాంకరభాష్యమ్:—

యాకారపరిణతా న్విద్ధి జానీహి ప్రకృతిసంభవా న్ప్రకృతి రీశ్వరస్య వికారకారణశక్తి స్త్రిగుణాత్మికా మాయా సా సంభవో యేషాం వికారాణాం గుణానాం చ తా న్వికారా న్గుణాంశ్చ విద్ధి ప్రకృతిసంభవా న్ప్రకృతిపరిణామా౯ ॥ ॥౧౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రాప్తింపవలసివచ్చును. అట్లు నిర్నిమిత్తముగ ముక్తులకుగూడ సంసారము ప్రాప్తించుచో అనిర్మోక్షము ప్రాప్తించెడిని. అట్లే యగుచో శాస్త్రమున కానర్థక్యము ప్రాప్తించెడిని. మరియు బంధమోక్షములు లేకపోవలసివచ్చును. ఈశ్వరుడు, ప్రకృతిపురుషులు నిత్యములే యగుచో సర్వము సమంజస మగును. అది యెట్లనిన? చెప్పబోవు బుద్ధ్యాదిదేహేంద్రియాంత వికారములను, సుఖదుఃఖమోహప్రత్యయాకారపరిణతములైన గుణములను, త్రిగుణాత్మకమైన వికారకారణ మగు శక్తి యనబడు ఈశ్వరమాయవలన జనించిన వాటినిగ తెలిసికొనుము. వికారములను, గుణములను మాయాపరిణామములుగ తెలిసికొనుము. ॥౧౯॥

యవము, నిస్సంగము, అవిక్రియము అగుటవలన, ఆత్మవలన పుట్టినవని తెలిసికొనవలదు. ఆత్మవలన నేవియు పుట్టుటలేదు. మరేమనిన? భోక్తయొక్క యదృష్టవశమువలన ప్రకృతియే స్వయముగ గుణవైషమ్యమును పొంది మహదాదివికారస్వరూపముగను, గుణస్వరూపముగను పరిణమించుచునని తెలిసికొనుము. వికారములకు, గుణములకు ప్రకృతికార్యత్వము సిద్ధించియుండ పురుషుడగు యాత్మకు అకర్తృత్వము, అవికారిత్వము, నిర్గుణత్వము సిద్ధమని సూచింపబడెను. ॥౧౯॥

—• ౧౩ వ అధ్యాయము ౨౦ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— వికారములు ప్రకృతి సంభవము అని స్పష్టపరచుచు పురుషునకు సంసారహేతుత్వమును "కార్యకారణ" అను శ్లోకముచే జూపుచుండెను—

శాంకరభాష్యమ్:—

కే పునస్తే వికారా గుణాశ్చ ప్రకృతిసంభవాః— కార్యకరణకర్తృత్వే కార్యం శరీరం కరణాని తత్స్థాని త్రయోదశ। దేహస్యాఽఽరమ్భకాణి భూతాని విషయాశ్చ ప్రకృతిసంభవా వికారాః పూర్వోక్తా ఇహ కార్యగ్రహణేన గృహ్యన్తే గుణాశ్చ ప్రకృతిసంభవాః

శాంకరభాష్యతత్త్వబోధిని:—

1. ప్రకృతివలన జనించెడి కార్యములు, గుణములు, యేవి? శరీరము, శరీరారంభకమైన పంచభూతములు, శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములు ప్రకృతి వలన జనించెడి పూర్వోక్తమైన వికారములు కార్యపదముచేతనే గ్రహింప నగును. అట్టి కార్యములయొక్కయు, ప్రకృతివలన జనించెడి సుఖదుఃఖమోహాత్మకమైన గుణములు కరణముల నాశ్రయించి

"కార్యం" శరీరము "కారణాని" పంచకర్మేన్ద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, మనోబుద్ధ్యహంకారములు యీపదమూడును, పంచభూతములు (ఇచట కార్యపదముచే శబ్దస్పర్శరూపరసగంధాత్మకపంచవిషయములు గ్రహింపనగును. సుఖదుఃఖమోహములు కారణాశ్రయము లగుటవలన కారణగ్రహణముచే గ్రహింపబడుచున్నవి.) అట్టి కార్యకారణముల కర్తృత్వమునందు (తదాకారముగ పరిణామమునందు) ప్రకృతి కారణమని మహర్షులచే చెప్పబడుచున్నది. "కార్యకారణానాం" అని దీర్ఘపాఠమునందు కూడ నీయర్థమునే గ్రహింపవలయును. ఇట్లు ప్రకృతి సంసారకారణ మని వ్యాఖ్యానించి, పురుషున కెట్టి కారణత్వము కలదో దానిని "పురుషః" అనుదానిచే జెప్పుచుండెను. పురుషు డనగ క్షేత్రజ్ఞుడు, అతడే పరాప్రకృతి యని వ్యాఖ్యానింపబడెను. అట్టి పురుషుడు సుఖదుఃఖమోహములకు భోగ్యములైన యన్నిటికి "భోక్తృత్వే" వృత్త్యుపరక్తోపలమ్భమునందు హేతు వని చెప్పబడుచుండెను. ॥౨౦॥

శంకరానందీయము:— వికారములు, గుణములు ప్రకృతికార్యములే యని స్పష్టపరచుచు ప్రకృతి హేతుఫలోత్పాదక మగుటచేతను, పురుషుడు తత్ఫలభోక్త యగుటచేతను ప్రకృతిపురుషు లుభయులు సంసారకారణము లని "కార్యకరణకర్తృత్వే" అను శ్లోకముచే సూచించుచుండెను. కార్య మనగ శరీరము. కార్యము కారణానురూప మగుటవలన నిచట కార్యపదముచే, శరీరకారణములైన మహదహంకారపంచతన్మాత్రరూప, శబ్దస్పర్శరూపరసగంధములనెడి యేడు వికృతులు గ్రహింపబడుచున్నవి. కరణము లనగ దశేంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అనెడి పదునాలుగును కరణపదముచేతనే దర్శనాములు, కామసంకల్పాహంకరణ సుఖదుఃఖమోహాత్మకమైన ప్రకృతివలన జనించెడి నిఖిలబుద్ధిప్రత్యయములు గ్రహింపనగును. ఈపై చెప్పబడినవాటి కుపాదానకారణము ప్రకృతియే యని తత్త్వజ్ఞులచే చెప్పబడుచున్నది. అనగా అగ్నిసాన్నిధ్యమువలన ఇనుమువలె ఆత్మసాన్నిధ్యమువలన జీవాదృష్టానుసారముగ ప్రకృతియే కార్యకరణస్వరూపముగను, విషయరూపముగను, సుఖదుఃఖాదిప్రత్యయరూపముగను, హేతుఫలస్వరూపముగను పరిణమించుచున్న దని మునులు చెప్పుచుండి రని యర్థము.

"కార్యకారణకర్తృత్వే" అను పాఠమునందు కార్యపదముచే దశేంద్రియములు, మనస్సు, శబ్దస్పర్శరూపరసగంధములైదు యీపదునారు వికారములుగ గ్రహింపనగును. కారణపదముచే మహదాదిసప్తవికృతులు గ్రహింపనగును. అట్టి కార్యకారణముల యారంభకత్వమునందు మూలప్రకృతియే హేతు వని చెప్పబడెను. లేక:— "కార్యకరణకర్తృత్వే" దేహేంద్రియమనోబుద్ధ్యాదుల నియోక్తృభావమునందు విషయ

శాంకరభాష్యమ్:—

సుఖదుఃఖమోహాత్మకాః కారణాశ్రయత్వా త్కరణగ్రహణేన గృహ్యంతే। తేషాం కార్యకరణానాం కర్తృత్వ ముత్పాదకత్వం య త్తత్కార్యకరణకర్తృత్వం తస్మి న్కార్యకరణకర్తృత్వే హేతుః కారణ మారమ్భకత్వేన ప్రకృతి రుచ్యతే। ఏవం కార్యకరణకర్తృత్వేన

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లుండుటవలన కరణపదముచే గ్రహింపనగును. కరణములు పంచ కర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, మనోబుద్ధ్యహంకారములు పదమూడు. ఇట్టి కరణముల యొక్కయు పుట్టించుటయందు ప్రకృతి యగు యీశ్వరమాయ కారణ (ఆరంభక) ము. అని చెప్పబడుచున్నది. ఇట్లు కార్యకరణకర్తృత్వముచే ప్రకృతి సాంసారకారణ మగుచున్నది.

భోగవాసనారూపము, కర్మరూపమునగు ప్రకృతియే కారణము. ఆత్మ నిరవయవమగుటవలన కారణము కాదు. "స్వభావస్తు ప్రవర్తతే" అని చెప్పబడుటవలన నిట్లు ప్రకృతికి సంసారకారణత్వమును చెప్పి, యాత్మ యవికారి అయినను సంసారకారణ మని "పురుషః" అను నుత్తరార్థముచే చెప్పుచుండెను. పురమునందు శయనము వలనకాని, పూర్వమునందు యెల్లపుడు యేకరూపమున నుండువాడగుటవలనకాని, స్వాజ్ఞానమువలన పురమును అధిష్ఠించువాడగుటవలనకాని పురుషు డనబడును. బుద్ధికోశమునందు సర్వసాక్షిగ నుండు ప్రత్యగాత్మయే పురుషు డనబడును. అట్టి పురుషుడు "సుఖదుఃఖానాం" భోగ్యములగు సుఖదుఃఖాది ప్రత్యయముల భోక్తృత్వమునందు హేతువు. అనగా చైతన్యాభాసానువిద్ధాంతఃకరణద్వారా సుఖదుఃఖాది ప్రత్యయానుభూతికి కారణ మని చెప్పబడుచున్నాడు. దేహేన్ద్రియాద్యాకారముగను, విషయాకారముగను, సుఖదుఃఖాదిప్రత్యయాకారముగను ప్రకృతి పరిణమించినదై యుండ స్వావిద్యచే చేయబడిన యనాత్మాధ్యాసచే నాత్మకుగూడ స్వాభాసద్వారా వాటి యుపలబ్ధి సంభవింప "అహం, మమ" అను సంసారము సంభవించుచున్నది. అట్లు ప్రకృతికి పరిణామము లేకున్నను, క్షేత్రజ్ఞున కుపలబ్ధృత్వము లేకున్నను సంసారము సంభవింపదు. ఈసర్వము జాగ్రదాదులయందు, సుషుప్తియందు ప్రత్యక్షము. అందువలన యెంతవరకు దేహేంద్రియవిషయసుఖదుఃఖాది ప్రత్యయసంబంధ మాత్మకుండునో అంతవరకు సంసారోపరమము సిద్ధింపదని యర్థము. ॥౨౦॥

భాష్యోత్కర్ష దీపిక:— (ఈవ్యాఖ్యయందు చెప్పబడు విషయము పూర్వవ్యాఖ్యలచే గతార్థము. అందుచే భాష్యోత్కర్ష దీపికాకారుని స్వీయవ్యాఖ్య యిచట వివరింపబడలేదు. అన్యవ్యాఖ్య వివరింపబడి భాష్యోత్కర్ష దీపికయందు విమర్శింపబడెను. దానినిమాత్ర మనువదించుచుంటిని.)

కొందరు భాష్యమునం దున్నట్లు చెప్పి, మరియొక తీరున వర్ణించిరి. అది యెట్లనిన? పురుషునకు కార్యత్వమునందు, కారణత్వమునందు, కర్తృత్వమునందు ప్రకృతియే పురుషతాదాత్మ్యమును పొందినదై హేతువగుచున్నది. అట్లే ప్రకృతికి సుఖదుఃఖహేతుత్వమునందు, స్వచ్ఛాయాప్రదానమునందు, పురుషుడు కారణము. కార్యత్వాదులు ప్రకృతిసంబంధమైన దేహేంద్రియబుద్ధుల ధర్మములు అయి చిదాత్మయందు "గౌరోఽహం, అముష్య పుత్రోఽహం, కాణోఽహం, ఖంజోఽహం, కరోమ్యహం" అని చిదాత్మయం దారోపింపబడుచున్నవి. అట్లే చిచ్ఛాయాపన్నబుద్ధియు "చేతయామ్యహం, సుఖదుఃఖానుపలభే" అని తలచుచున్నది. ఈప్రకృతిపురుషుల యన్యోన్యాధ్యాస సంసారమునకు కారణ మని యుపపాదితము.

శాంకరభాష్యమ్:—

సంసారస్య కారణం ప్రకృతిః । కార్యకారణకర్తృత్వ ఇత్యస్మిన్నపి పాఠే కార్యం యద్యస్య విపరిణామ స్తత్తస్య కార్యం వికారో వికారి కారణం తయో ర్వికారవికారిణోః కార్యకరణయోః కర్తృత్వ ఇతి । అథవా షోడశ వికారాః కార్యం, సప్త ప్రకృతివికృతయః కారణం తాన్యేవ కార్యకరణా న్యుచ్యన్తే । తేషాం కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యత ఆరమ్భకత్వేనైవ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కొన్ని పుస్తకములయందు "కార్యకారణకర్తృత్వే" అని పాఠము కలదు. ఈపాఠమునందు కార్య మనగ: నేది దేనియొక్క విపరిణామమో యదియెల్ల దానియొక్క కార్యమనబడును. అనగ వికారము లన్నియు కార్యము లనబడును. వికారములు కలది వికారి యనబడును. అట్టి వికారవికారిరూపమైన కార్యకారణములయొక్క కర్తృత్వమునందు లేక:—షోడశవికారము లు కార్యములు. అనగా పంచ కర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, పంచ ప్రాణవాయువులు, మనస్సు యీపదునారు వికారములు కార్యములనబడును. ఇట్టి కార్యములయొక్కయు, ఏడు ప్రకృతివికృతులు. అనగా మహత్తత్వము, అహంకారము, పంచమహాభూతములు, తన్మాత్రలు యీయేడున్ను ప్రకృతివికృతు లనబడును. ఇట్టి ప్రకృతివికృతిరూపములగు కారణములయొక్కయు వీటి కారంభకమగుటచే మూల ప్రకృతి హేతు వని చెప్పబడుచున్నది.

ఈచెప్పుటవలన సాంఖ్యాభిమతమైన, పురుషునకు భోక్తృత్వము నిరస్తము. అట్లు కానిచో "ప్రకృతిః కర్త్రీ పురుషో భోక్తా" అని ప్రకృతికి కర్తృత్వము, పురుషునకు భోక్తృత్వమే చెప్పినచో కర్తృత్వభోక్తృత్వములకు సామానాధికరణ్యము లేక వైయ్యధికరణ్యమే ప్రాప్తింపవలసివచ్చును. భోక్తకు నిర్వికారిత్వముకూడ చెప్పుటకు శక్యము కాకపోయెడిని. కొందరీతీరున యీశ్లోకమున కర్థము వర్ణించిరి.

ఇచట తెలిసికొనదగిన విషయమిది: మూలము నతిక్రమింపకుండగ వ్యాఖ్యానమును రచయించిన సర్వజ్ఞమూర్తులగు భాష్యకారుల వ్యాఖ్యానమునందు "ఈశ్వరానధిష్ఠితమైన, జడమగు ప్రధానము కర్తయని, చేతనుడు భోక్త యను నట్టి సాంఖ్యమతమునకు ప్రవేశము యెంతమాత్రము లేదు. ప్రకృతి యనగ యీశ్వరుని యొక్క వికారకారణశక్తి. అదియే త్రిగుణాత్మకమాయ. పురుషు డనగ జీవుడు. క్షేత్రజ్ఞుడు. ఇంతమాత్రమే భాష్యకారులు నుడివిరి. ఉత్తరశ్లోకమున "పురుషుడు భోక్త ప్రకృతిస్థుడు. అవిద్యాస్వరూపమైన ప్రకృతియందున్నవాడు" అని చెప్పబడును. కాన నవిద్యకృతాధ్యాసమువలన నాత్మ భోక్త యగుటచే సంసారిత్వము, వాస్తవికముగ నిర్వికారత్వము తొలగించుటకు శక్యము కాదు. విచారింప ప్రకృతియం దున్నవానికి కర్తృత్వభోక్తృత్వములు కలవు. అయినను కర్తృత్వమునం దుపాధి ప్రధానమగుటవలన యుపాధి యగు ప్రకృతికే కర్తృత్వము చెప్పబడుచున్నది. భోక్తృత్వమునందైతే ఉపాధ్యుపహితమే ప్రధాన మగుటవలన ఉపహితమగు జీవునకే భోక్తృత్వము. కాన కర్తృత్వభోక్తృత్వములకు వైయధికరణ్యదోషము ప్రాప్తించదను నిత్యాదిసర్వము భాష్యమునందే స్పష్టము. అందువలన కొన్నిపదముల నధ్యాహారము చేసి క్లిష్టకల్పనచే భాష్యాతిరిక్తవ్యాఖ్యానప్రదర్శనము ఉచితము కాదు. ఈచెప్పుటచే "కార్యమనగ యజ్ఞము, బ్రహ్మ

శాంకరభాష్యమ్:—

౭. పురుషశ్చ సంసారస్య కారణం యథా స్యాత్తదుచ్యతే—పురుషో జీవః క్షేత్రజ్ఞో భోక్తేతి పర్యాయః సుఖదుఃఖానాం భోగ్యానాం భోక్తృత్వ ఉపలబ్ధృత్వే హేతు రుచ్యతే। కథం పున రనేన కార్యకరణకర్తృత్వేన సుఖదుఃఖభోక్తృత్వేన చ ప్రకృతిపురుషయోః సంసారకారణత్వ ముచ్యత, ఇతి। అత్రోచ్యతే, కార్యకరణసుఖదుఃఖరూపేణ హేతుఫలాత్మనా ప్రకృతేః పరిణామాభావే పురుషస్య చేతనస్యాసతి తదుపలబ్ధృత్వే కుతః సంసారః స్యాత్। యదా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

౭. పురుషుడు సంసారమునకు కారణ మెట్లగుచుండెనో, ఆవిషయము (ఇటుపైని) చెప్పబడుచుండెను. పురుషుడు, జీవుడు, క్షేత్రజ్ఞుడు, భోక్త యీపదములన్నియు యేకార్థకములే. క్షేత్రజ్ఞు డగు పురుషుడు భోగ్యము లగు సుఖదుఃఖములను సాక్షాత్కరింపజేసుకొనుటయందు హేతువని చెప్పబడుచుండెను. ఈకార్యకరణకర్తృత్వముచేతను, సుఖదుఃఖభోక్తృత్వముచేతను ప్రకృతిపురుషులకు సంసారకారణత్వ మెట్లు చెప్పబడుచుండెను? ఈవిషయమునచెప్పెద (వినుము.) హేతుఫలరూపములైన కార్యకరణసుఖదుఃఖస్వరూపముగ ప్రకృతి పరిణమింపకుండినచో చేతనుడైన పురుషునకు అట్టి కార్యకరణోపలబ్ధృత్వమే లేనిచో సంసారమెచట?

హత్యమొదలగునవి. "కారణ" మనగ పురోడాశము, ఖడ్గాదికము. "కర్తృత్వ" మనగ సాధనప్రయోక్తృత్వము. కాని "తచ్చ, తచ్చ, తచ్చేతి" అని ద్వంద్వసమాసమున ఏకవద్భావముచేసిన "కార్యకారణకర్తృత్వే" అనురూప మగును. ఇట్టి కార్యములయందు, కారణములయందు, కర్తృత్వమునందు హేతువు ప్రకృతియని చెప్పబడుచున్నది. ఇట్లగుచో ప్రకృతికే స్వర్గనరకాదిప్రాప్తి. పురుషునకు లేదు. అట్లగునో బంధము లేనందున మోక్షమునందు జీవులకు ప్రయత్నమే లేకపోవలసి వచ్చునను శంకను తొలగించుటకు "పురుషః" ఇత్యాదికము చెప్పబడెను. అను కల్పనలు పూర్వోత్తరప్రకరణానురోధివిరోధులగుటవలనను, భాష్యబహిర్భూతము లగుటవలనను నిరాకృతములు. ॥౨౦॥

నిఃశంకక్రియము:— ప్రకృతిపురుషు లిద్దరును సంసారకారణ మగుటలో ద్వారము నీశ్లోకమున జెప్పుచుండెను.— "కార్య...రుచ్యతే" శరీరము, శరీరారంభకము లగు పంచభూతములు, విషయములివి కార్యములనబడును. త్రయోదశేంద్రియములు, వాని నాశ్రయించిన సుఖదుఃఖమోహరూపగుణములు కారణమనబడును. ఇటి కార్యకారణముల కర్తృత్వము నిమిత్తమై యుండ (అనగా) కార్యకారణములకు కర్తృత్వరూపధర్మముతో ప్రకృతి సంసారకారణముగా చెప్పబడుచున్నది. ఇట్లే "పురుషః...ఉచ్యతే" సుఖదుఃఖములయొక్క భోక్తృత్వము నిమిత్తమై యుండ అనగా సుఖదుఃఖములయొక్క భోక్తృత్వధర్మముతో పురుషుడు సంసారకారణముగా చెప్పబడుచుండెను. ప్రకృతి కార్య, కారణ, సుఖ, దుఃఖ, రూపహేతు, ఫల స్వరూపముగ పరిణమింపనిచో బురుషు డిక దేని ననుభవించును? పురుషు డేనినీ పొందకుండనుండి సంసారి యెట్లగును? అట్టి యుపలబ్ధి లేనిదియై ప్రకృతియు నిక నెట్లుపయోగించును? కాన నుపలభ్యోపలబ్ధృసంయోగమే సంసారకారణ మగుచున్న దని భాష్యానుసృతముగ వ్యాఖ్యానింపబడెను. లేక నీశ్లోకమును మరియొక విధముగగూడ వ్యాఖ్యానింపదగును. ఎట్లన: "ద్వంద్వాంతే శ్రూయమాణం

గీ॥ పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజా న్గుణాన్ ।
కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు ॥ ॥౨౧॥

పదవిభాగము:— పురుషః- ప్రకృతిస్థః- హి- భుంక్తే- ప్రకృతిజాన్- గుణాన్- కారణం- గుణసంగః- అస్యసదసద్యోనిజన్మసు ॥ ॥౨౧॥

ప్రతిపదార్థము:— హి=ఏకారణమువలన; పురుషః=భోక్త యగు క్షేత్రజ్ఞుడు; ప్రకృతిస్థః= ప్రకృతి=కార్యకారణరూపముగ పరిణమించిన యవిద్యారూపమైన ప్రకృతియందు; స్థః=ఉన్నవాడగుచున్నాడో; (అనగా ప్రకృతినే తన స్వరూపముగ పొందినవాడగుచున్నాడో) తతః= (ఈపదమధ్యాహారము) ఆకారణమువలన; ప్రకృతిజాన్=ప్రకృతివలన జనించిన; గుణాన్=సుఖదుఃఖమోహాకారముగ నభివ్యక్తమైన, గుణాన్=సుఖదుఃఖాదులను; భుంక్తే=అనుభవించుచున్నాడు; (అనగా నేను సుఖిని, నేను దుఃఖిని, నేను మూఢుడను, నేను పండితుడను అని యనుభవము కలవాడగుచున్నాడు.) అస్య=ఈపురుషునకు; సదసద్యోని జన్మసు=దేవజన్మములయందు; పశుజన్మలయందు; మనుష్యజన్మలయందు; గుణసంగః=గుణములయందు సక్తియే; కారణం=కారణము. ॥౨౧॥

శాంకరభాష్యమ్:—

పునః కార్యకరణ (సుఖదుఃఖ) రూపేణ హేతుఫలాత్మనా పరిణతయా ప్రకృత్యా భోగ్యయా పురుషస్య తద్విపరీతస్య భోక్తృత్వే నావిద్యారూపః సంయోగః స్యాత్ తదా సంసారః స్యాదితి । అతో యత్ప్రకృతిపురుషయోః కార్యకరణకర్తృత్వేన సుఖదుఃఖభోక్తృత్వేన చ సంసారకారణత్వ ముక్తం తద్యుక్తమ్ । కః పునరయం సంసారో నామ, సుఖదుఃఖసంభోగః సంసారః పురుషస్య చ సుఖదుఃఖానాం సంభోక్తృత్వం సంసారిత్వ మితి ॥ ॥౨౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(సంసారమే లేకుండును) ఎపుడు హేతుఫలస్వరూపమైన కార్యకరణసుఖదుఃఖరూపముగ పరిణమించిన భోగ్య మగు ప్రకృతితో ప్రకృతివిలక్షణుడైన పురుషునకు భోక్తృత్వముచే అవిద్యారూపసంయోగ మేర్పడునో అపుడే సంసారము సంభవించును. అందువలన ప్రకృతిపురుషులకు కార్యకరణకర్తృత్వముచేతను, సుఖదుఃఖభోక్తృత్వముచేతను చెప్పబడిన సంసారకారణత్వము యుక్తమే. ఈసంసార మనగ నెట్టిది? (అనెదవా?) సుఖదుఃఖసంభోగమే సంసారము. పురుషునకు సుఖదుఃఖముల సంభోక్తృత్వమే సంసారిత్వము. ఈభాష్యముచివర నున్న "ఇతి" అను శబ్దము యీశ్లోకభాష్యసమాప్త్యర్థకము. ॥౨౦॥

పదం ప్రత్యేక మభిసంబధ్యతే" అనున్యాయమున "కార్య, కారణ, కర్తృత్వే" అను స్థలమునందున్న "త్వ" ప్రత్యయము కార్యత్వ, కారణత్వ, కర్తృత్వ పరముగ సంబంధించుచున్నది. ప్రకృతియే పురుషతాదాత్మ్యపన్నమై, పురుషుడు, కార్యము, కారణము కర్తయు నగుటలో హేతు వగుచున్నది. వహ్నితాదాత్మ్యపన్నమైన లోహము వహ్నికి చతుష్కోణత్వాదికమునందు హేతు వగుచున్నది. వహ్ని స్వచ్ఛాయాప్రదానముచే లోహము యొక్క దగ్ధృత్వమునకు కారణమైనట్లు పురుషుడు స్వచ్ఛాయాప్రదానముచే ప్రకృతికి సుఖదుఃఖభోక్తృత్వములో కారణ మగుచుండెను. ప్రాకృతదేహేంద్రియబుద్ధిధర్మములైన కార్శ్యాదులు "నేను గౌరవర్ణుడను, నేను మనుష్యుడను, నేను గ్రుడ్డివానిని, నేను కుంటివానిని, నేను చేయు

శాంకరభాష్యమ్:—

1. య త్పురుషస్య సుఖదుఃఖానాం భోక్తృత్వం సంసారిత్వ మి త్యుక్తం తస్య త త్కిం నిమిత్త మిత్యుచ్యతే— పురుషో భోక్తా ప్రకృతిస్థః ప్రకృతా వవిద్యాలక్షణాయాం కార్యకారణరూపేణ పరిణతాయాం స్థితః ప్రకృతిస్థః ప్రకృతి మాత్మత్వేన గత ఇత్యేత ద్ధి యస్మా త్తస్మా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

1. పురుషునకు సుఖదుఃఖాది భోక్తృత్వరూపమైన సంసారము యేది కారముణముగా కలది? అను యాశంకపైని చెప్పుచుండెను.

భోక్త యగు పురుషుడు అవిద్యాస్వరూపమైన కార్యకారణరూపమున పరిణతమైన ప్రకృతియందున్నవాడై, అనగా ప్రకృతిని యాత్మగ పొందినవాడై, ప్రకృతివలన జనించిన సుఖదుఃఖ మోహాకారాభివ్యక్తమైన గుణములను "నేను సుఖిని, నేను దుఃఖిని, నేను

చుంటిని." అను నీవిధముగ చిదాత్మయం దారోపింపబడుచున్నవి. ఇట్లే చిచ్ఛాయాసన్నమైన బుద్ధియు "నేను చేతన కల్గియుంటిని, నేను సుఖదుఃఖముల ననుభవించుచుంటిని" అను నీవిధముగ తలచుచున్నది. ఇట్టి ప్రకృతిపురుషుల కగు నన్యోన్యధర్మాధ్యాసయే సంసారమునకు కారణ మగుచున్న దని పర్యవసన్నము. ఈచెప్పుటచే ఇట సాంఖ్యాభిమతమగు భోక్తృత్వముగూడ నిరసింపబడెను. అట్లు కానిచో "ప్రకృతి కర్త్రి, పురుషుడు భోక్త" యని కర్తృత్వ, భోక్తృత్వములకు వైయ్యధికరణ్యాపత్తి సంభవింవించును. మరియు భోక్త యగు పురుషునకు నిర్వికారత్వముగూడ చెప్పశక్యము గాకుండెడిది. ॥౨౦॥

—• ౧౩ వ అధ్యాయము ౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పురుషునకు యేసుఖదుఃఖభోక్తృత్వ రూపమైన సంసారిత్వము కలదని చెప్పబడెనో ఆసంసారిత్వమునకు కారణ మేది? యను శంకపై "పురుషః" అని చెప్పుచుండెను.

ప్రకృతి యనగ మాయ. అట్టి మాయను మిథ్యగ తాదాత్మ్యముచే పొందినవాడు ప్రకృతిస్థు డనబడును. అట్టి ప్రకృతిస్థుడై పురుషుడు ప్రకృతిజ గుణములననుభవించుచుండెను. కాన వాటియుపలంభ (ప్రత్యక్ష) మునకు హేతువులైన సదసద్యోని జన్మలయందు (అనగా సద్యోనులు దేవాదులు. వాటియందు సాత్త్వికము, ఇష్టము నగు ఫలము అనుభవింపబడుచున్నది. అసద్యోనులు పశ్వాదులు. వాటియందు తామసము, అనిష్టమునగు ఫలమనుభవింపబడుచున్నది. సదసద్యోనులు ధర్మాధర్మమిశ్రము మగుటవలన బ్రాహ్మణాది మనుష్యులు. వాటియందు రాజసమైన మిశ్రఫల మనుభవింపబడుచున్నది. కాన నీపురుషునకు సదసద్యోనిజన్మలయందు సత్త్వరజస్తమోగుణాత్మక ప్రకృతితాదాత్మ్యభిమానమే కారణము. స్వతః అసంగుడైన పురుషునకు సంసారము లేదు.

లేక "గుణసంగః" సుఖదుఃఖమోహాత్మకములైన శబ్దాదులయందు అభిలాషయే కామము. ఆ కామమే సదసద్యోని జన్మలయందు కారణము. "స యథా కామో భవతి తత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే తదభిసంపద్యతే" అను శ్రుతి పైన చెప్పబడిన విషయమునే బోధించుచున్నది. ఈపక్షమునందుగూడ మూల కారణము ప్రకృతితాదాత్మ్యభిమానమే యని తెలిసికొనవలయును. ॥౨౧॥

శాంకరభాష్యమ్:—

ద్భుంక్తే ఉపలభత ఇత్యర్థః । ప్రకృతిజా న్ప్రకృతితో జాతా న్సుఖదుఃఖమోహాకారాభివ్యక్తా న్గుణాన్ సుఖీ దుఃఖీ మూఢః పండితోఽహ మిత్యేవమ్ । సత్యా మప్యవిద్యాయాం సుఖదుఃఖమోహేషు గుణేషు భుజ్యమానేషు యః సంగ ఆత్మభావః సంసారస్య చ ప్రధానం కారణం జన్మనః "స యథాకామో భవతి త త్క్రతు ర్భవతి" ఇత్యాదిశ్రుతేః ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మూఢుడను, నేను పండితుడను, అని అనుభవించుచున్నాడు (సాక్షాత్కరింపజేసుకొనుచున్నాడు.) అవిద్య యుండగ సుఖదుఃఖమోహరూపమైన గుణము లనుభవింపబడుచుండ నేసంగము (ఆత్మభావము) కలదో యట్టిసంగమె సంసారమునకు ప్రధానకారణము. జన్మమునకు ప్రధానకారణము. ఈవిషయమునే "స యథాకామో భవతి తత్క్రతు ర్భవతి" అను శ్రుతియు బోధించుచున్నది.

శంకరానందీయము:— ప్రకృతి పురుషులు నిత్యులగుటవలన తత్సంబంధముగూడ నాత్మకు నిత్యమే యగుచున్నది. అందుచే సంసారముగూడ నిత్యమే కావలసి వచ్చును. ఎప్పుడు యెట్లు ఆత్మకు సంసారమోక్షము సిద్ధించును? అను యాశంక్పై నిరవయవసావయవములకు సంయోగసమవాయాది సంబంధము సంభవింపనందున ఆత్మకు బుద్ధ్యాదిసంబంధము నిత్యము కాదు. మరేసంబంధము సంభవించునందువా? ఆధ్యాసికసంబంధము సంభవించును. ఈయాధ్యాసికసంబంధము తన యజ్ఞానైకనిబంధనము. వివేకజ్ఞాన మున్నచో నివర్తించునని బోధించుటకు ఆత్మకు ప్రకృతిసంబంధమువలన సంసారమును, సంసారకారణమును "పురుషః" అను శ్లోకముచే స్పష్టపరచుచుండెను.

"పురుషః" చెప్పబడిన లక్షణములు కల యాత్మ స్వయముగ కూటస్థాసంగచిద్రూపుడైనను "ప్రకృతిస్థః" ప్రకృతి యనగ కార్యకరణసంఘాతము (శరీరేంద్రియసమూహము) తన యజ్ఞానముచే "ఈశరీరేంద్రియసంఘాతమే నేను" అని శరీరేంద్రియస్వరూపముగ నుండును. కాన ప్రకృతిస్థు డని యనిపించుకొనును. శరీరతాదాత్మ్యమును పొందినవాడు స్వస్థుడు (ఆత్మనిష్ఠుడు) కాడు. కనుకనే శరీరధర్మ, శరీరకర్మలు కలవాడై బుద్ధ్యాదిస్థూలాంతస్వరూపమైన ప్రకృతియొక్క సాన్నిధ్యమువలన జనించిన గుణములను అనగా దేహగుణములగు బాల్యస్థౌల్యాదులను, ఇన్ద్రియగుణములగు కాణత్వ, ఖంజత్వాదులను, ప్రాణగుణములగు క్షుధితత్వాదులను, మనోగుణములగు సమీచీనత్వాదులను, బుద్ధిగుణములగు కర్తృత్వభోక్తృత్వాదులను ఈసర్వగుణములను స్థూలసూక్ష్మకారణధర్మములను, సుఖదుఃఖాదిప్రత్యయములను స్వయముగ ననుభవించుచుండెను. "నేను మనుష్యుడను, బ్రాహ్మణుడను. గృహస్థుడను, యతిని, మూఢుడను, పండితుడను, శిష్టుడను, భ్రష్టుడను, కర్తను, భోక్తను, సుఖిని, దుఃఖిని" అనియు, "ఇది నాది" అనియు, స్వయంప్రకృత్యాత్మకుడై ప్రకృతిధర్మములైన జన్మ, జరా, జాతి, వర్ణ, ఆశ్రమములను, పుణ్యాపాపాదులను స్వధర్మములుగ ననుభవించుచున్నాడు. ఈవిషయము "ఆత్మేన్ద్రియమనోయుక్తం భోక్తేత్యాహు ర్మనీషిణః" అను శ్రుతిప్రసిద్ధమే యని ద్యోతన చేయుటకు "హి" అను శబ్దము ప్రయోగింపబడెను. ఇదియే క్షేత్రజ్ఞ స్వరూపమైన యాత్మకు:- స్వయముగ తానన్యస్వరూపుడైనను,, లేనిపోని యన్యధర్మములను ఆత్మీయములుగ (తనవిగ) తలచుటయే సంసారము.

శాంకరభాష్యమ్:—

౭. తదేత దాహ కారణం హేతు ర్గుణసంగో గుణేషు సంగోఽస్య పురుషస్య భోక్తుః. సదసద్యోనిజన్మసు సత్య శ్చాసత్యశ్చ యోనయః సదసద్యోనయ స్తాసు సదసద్యోనిషు జన్మాని సదసద్యోనిజన్మాని తేషు సదసద్యోనిజన్మసు విషయభూతేషు కారణం గుణసంగః। అథవా-

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(౭) "కారణం" అనుదానిచే పైవిషయమునే చెప్పుచుండెను. ఈభోక్త యగు పురుషునకు గుణములయందు సంగతియే విషయములైన సద్యోనులయందు (దేవతలయందు) అసద్యోనులయందు (పశుపక్ష్యాదులయందు) సదసద్యోనులయందు (మనుష్యులయందు) పుట్టుటయందు కారణము.

అవిక్రియము, అసంగము నగు ఆత్మకు ప్రకృతితాదాత్మ్యప్రాప్తియందు, ప్రకృతిధర్మకర్మలయాథాత్మ్యత్వానుభూతియందు ఏది హేతువు? అను యాశంకపై "కారణం" అని చెప్పెను.

సాక్షాత్తు విద్వాంసులచే నాత్మగ ననుభూయమానమైన కూటస్థాసంగచిద్రూపమగు నాత్మకు "సదసద్యోనిజన్మసు" సద్యోనులు దేవఋషిబ్రాహ్మణాదిపుణ్యయోనులు, అసద్యోనులు, రక్షఃపిశాచస్వపాకపశ్వాదిపాపయోనులు. వాటియందు జన్మలయందు "అహం. మమ" ఇత్యాదిసంసారమునకు కారణము "గుణసంగః" దేనిచే దృష్టాదృష్టభోగ్యములయందు పురుషుడు సక్తుడగునో యది గుణసంగ మనబడును. అది కామమే. అవిద్య యుండగ కామమేకదా పురుషునకు బంధకము. పురుషుడు కామము చేతనే ఉచ్చావచమైన కర్మలను చేయును. ఆకర్మ ఫలమగు సుఖదుఃఖాదులను యనేకజన్మలచే పొందుచున్నాడు. ఈవిషయమునే "స యథా కామో భవతి" కామా న్యః కామయతే మన్యమానః" ఇత్యాదిశ్రుతులు బోధించుచున్నవి. కాన స్వావిద్యయే ప్రధానకారణముగా కల కాముడే నానాయోనులయందు జన్మజరామరణాది దుఃఖానుభూతికి కారణమని సిద్ధము.

లేక "గుణసంగః" దీనిచే గుణములయందు బంధింపబడును గాన గుణసంగ మనబడును. దేహేంద్రియాదులయం దహంత్వాభినివేశము, శబ్దాదులయం దిది భోగ్యమని సంభోగ్యాభినివేశము, తత్స్వరూపమైన అధ్యాససంబంధమే గుణసంగము. దీనినే పండితులు అవిద్య యని చెప్పెదరు. అవిద్యావంతుడగు పురుషునకే కామము, కర్మయు సదసద్యోనులయందు జన్మాదిదుఃఖకారణము లగుచున్నవి. తన్నివృత్తి కారణము ఆత్మయాథాత్మ్యజ్ఞానమే. అది "న సత్త న్నాస దుచ్యతే" అని యాత్మకు ప్రకృతి. తద్వికార, తద్ధర్మ, తత్కర్మసంబంధలేశశూన్యత్వసిద్ధికొరకే ఆయాత్మజ్ఞానము అతన్నిషేధద్వారమున సద్భావసిద్ధికొరకు "జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం" అని స్వరూపనిరూపణద్వారా లెస్సగ ప్రతిపాదితము. ॥౨౧॥

భాష్యతత్త్వదీపిక:— పురుషునకు సుఖదుఃఖభోక్తృత్వరూపసంసారము దేనివలన ప్రాప్తించిన దనెదవా? అవివేకాధ్యాసవలన ప్రాప్తించిన దని "పురుషః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"పురుషః" భోక్త యవిద్యాస్వరూపమైన ప్రకృతియం దున్నవాడై యవివేకాధ్యాసను పొందుటవలన "సుఖీ, దుఃఖీ, మూఢః, పండితోఽహం" ఇత్యాదిస్వరూపమైన ప్రకృతిజాతమైన సుఖదుఃఖమోహాకారముగ నభివ్యక్తమైన సత్త్వాదిగుణములను "భుంక్తే" అనుభవించుచున్నాడు. "ప్రకృతిస్థుడై ప్రకృతికార్యమైన దేహమునందు తాదాత్మ్యముచే నున్నవాడై" అని "దేహతాదాత్మ్యముగూడ నవిద్యాత-

శాంకరభాష్యమ్:—

సదసద్యోనిజన్మ స్వస్య సంసారస్య కారణం గుణసంగ ఇతి సంసారపద మధ్యాహార్యమ్ । సద్యో నయో దేవాదియోనయోఽసద్యోనయః పశ్వాదియోనయః సామర్థ్యాత్సదసద్యోనయో మనుష్యయోనయోఽప్యవిరుద్ధా ద్రష్టవ్యాః । ఏతదుక్తం భవతి ప్రకృతిస్థత్వాఖ్యాఽవిద్యా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లేక, యీపురుషునకు గుణసంగము సదసద్యోనిజన్మలయందు సంసారమునకు కారణము అని "సంసారస్య" అను పదము అధ్యాహారము చేసుకొని వర్ణింపదగును. సద్యోనులు దేవాదియోనులు. అసద్యోనులు పశ్వాదియోనులు. సామర్థ్యమువలన సదసద్యోనులు అవిరుద్ధములైన మనుష్యయోనులని గ్రహింపనగును. ఈవిషయము ప్రకృతిస్థత్వ మనెడి యవిద్య గుణములయందాసక్తి (కామము) సంసారమునకు కారణమని చెప్పబడెను. ఆకారణము విడువవలె నని

దాత్మ్యభ్యాసాధీనమే యనియు, ముఖ్యార్థమునకు పరిత్యాగము ప్రాప్తించును." అని ఆచార్యులవారట్లు వ్యాఖ్యానింపలేదు.

భోక్తృత్వరూపమైన సంసారిత్వమునందు ప్రకృతిస్థత్వము కారణమని చెప్పి జన్మకు ప్రధానకారణమును "కారణం" అనుదానిచే చెప్పుచుండెను.

ఈభోక్తకు సదసద్యోని జన్మలయందు "గుణసంగః" సుఖదుఃఖమోహాత్మకమైన భుజ్యమానమైన విషయములయందు యేతాదాత్మ్యభావము, లేక ఆసక్తికలదో అదియే అవిద్య యున్నను ప్రధానకారణము. సదసద్యోనులు దేవాదియోనులు. అసద్యోనులు పశ్వాదియోనులు. యోనిద్వయనిర్దేశసామర్థ్యమువలన మధ్యవర్తులగు సదసద్యోనులు మనుష్యయోనులని తెలిసికొనదగును. అనగా దేవ, పశ్వాది, మనుష్యజన్మలయందు గుణసంగము ప్రధానకారణమని యర్థము. "స యథా కామో భవతి తత్క్రతు ర్భవతి యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే యత్కర్మ కురుతే త దభిసంపద్యతే" అను శ్రుతి యీవిషయమునే బోధించుచున్నది. సదసద్యోనిజన్మలయందు గుణసంగము యీసంసారమునకు కారణమని యైనను "సంసారస్య" అనుపద మధ్యాహారము చేసి యైనను వ్యాఖ్యానింపదగును. "గుణసంగః" సత్త్వరజస్తమోగుణాత్మకప్రకృతి తాదాత్మ్యభిమానము అని ప్రకృతిని యాత్మగ పొందినవాడు "ప్రకృతిస్థః" అని చెప్పబడును. అనెడి గ్రంథముతో పౌనరుక్త్యము ప్రాప్తించు నని యట్లు భగవత్పాదులు వ్యాఖ్యానింపలేదు. "ఇన్ద్రియేభ్యః పరాహ్యర్థాః" అను శ్రుతివలన శుభాశుభకర్మకారులగు యింద్రియములతో సంగము గుణసంగమను విషయసంగాధీనమను యభిప్రాయముచే నట్లు వ్యాఖ్యానింపలేదు.

కొందరు:— "పశ్వాదిభి శ్చావిశేషాత్" వ్యుత్పన్నచిత్తులుగూడ పశువులతో సమానులను న్యాయమున విద్వాంసుడైనను, అవిద్వాంసుడైనను ప్రకృతిస్థుడై గుణముల ననుభవించుచుండెను. విద్వాంసుడు ప్రకృతిస్థుడై గుణముల ననుభవించుచున్నను ముక్తుడైనటుల యవిద్వాంసు డెందులకు ముక్తుడు కాడు. అవిద్వాంసుడు బద్ధుడైనటుల గుణానుభవము సమానమైనపుడు విద్వాంసు డెందులకు బద్ధుడు కాడు? అను యాశంకను తొలగించుటకు "కారణం" అని చెప్పుచుండెను. దేహేంద్రియాదులయందు "ఇది, నేను, ఇది నాది" అను యభినివేశమే జన్మకు కారణము. విద్వాంసునకట్టి యభినివేశము లేనందున జన్మము లేదు. దేహసంబంధము సమానమైనను యెపుడు యజ్ఞుడు దేహాభిమానమును పొందునో అపుడాయజ్ఞుడే దేహపీడచే పీడను పొందును. ఆదేహపతియగు జీవుడు పీడను పొందడు. ఎపుడితడు యేదేహాభిమానమును

శాంకరభాష్యమ్:—

గుణేషు చ సంగః కామః సంసారస్య కారణ మితి। తచ్చ పరివర్జనా యోచ్యతే। అస్య చ నివృత్తికారణం జ్ఞానవైరాగ్యే ససంన్యాసే గీతాశాస్త్రే ప్రసిద్ధమ్। తచ్చ జ్ఞానం పురస్తా ద్యుపన్యస్తం క్షేత్రక్షేత్రజ్ఞవిషయమ్। య జ్జ్ఞాత్వాఽమృత మశ్నుత ఇత్యుక్తం చాన్యాపోహే నాతద్ధర్మాధ్యారోపేణ చ ॥ ॥౨౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(యిచట) చెప్పబడెను. ఇట్టి సంసారకారణముయొక్క నివృత్తికి కారణము సంన్యాసముతో గూడిన జ్ఞానవైరాగ్యములు. అవియే గీతాశాస్త్రమునందు ప్రసిద్ధములు. క్షేత్రక్షేత్రజ్ఞ విషయమైన ఆజ్ఞానము ఇంతకు పూర్వమునందే యుపన్యసింపబడెను. ఆజ్ఞానమే "య జ్జ్ఞాత్వా" అనునది మొదలుకొని "న స త్త న్నాస దుచ్యతే" అను నంతవరకగు గ్రంథముచే అన్య నిషేధపురస్సరముగ 'సర్వతః పాణిపాదం' ఇత్యాదికముచే అతద్ధర్మాధ్యాసపురస్సరముగ చెప్ప బడెను. ॥౨౧॥

పొందునో అపుడితరు డాదేహమునం దభిమానమును పొందడు. అని లోకప్రసిద్ధి. సంగమునకు బంధక త్వముకాని సాన్నిధ్యముమాత్రము బంధకముకాదు. కాన విద్వాంసునకు, అవిద్వాంసునకు దేహసంబం ధము సమానమైనను సంగతదభావకృతమైన గొప్పవిశేషము కలదు. అని వర్ణించుచుండిరి. "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి" అను యుపక్రమానురోధముచేతను, పురుషశబ్దార్థప్రదర్శన సామంజస్యాభి ప్రాయముచేతను పైయర్థమును శ్రీభగవత్పాదులు వర్ణించలేదు. ॥౨౧॥

నీలకంఠీయము:— బుద్ధికి సంబంధించిన కర్తృత్వము పురుషునియం దెట్లారోపింపబడునున్నదో యట్లే పురుషసంబంధమగు భోక్తృత్వమును బుద్ధియం దారోపింపరాదా? యను భ్రమను తొలగించుటకై యీశ్లోకమును జెప్పుచుండెను.— "పురుషః...గుణాన్" పురుషుడు దేహేంద్రియమనస్సంఘాతము నధి ష్ఠించినవాడై, (అట్టి ప్రకృతితాదాత్మ్యమును పొందినవాడై) ప్రకృతిజములగు సుఖదుఃఖమోహరూ పము లగు గుణముల ననుభవించుచుండెను. ఏకాలమున సుప్తిసుఖమూర్ఛాదులయందు పురుషుడు ప్రకృతి స్థుడు కాడో ఆట్టికాలమునందు సుఖదుఃఖమోహాదుల ననుభవింపకుండును. ఈకారణముచే సుఖాదులు ఉపాధిగతములే యనియు, నట్టి యుపాధులు లేనిచో ప్రతీయమానములు గావనియు సిద్ధించుచున్నది. "ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః" అను శ్రుతియు ఆత్మకు యింద్రియమనోయోగము చేతనే భోక్తృత్వమని తెలుపుతూ కేవల శుద్ధాత్మకు భోక్తృత్వము లేదని తెల్పుచున్నది. అట్లగుచో నాత్మ భోక్త కాకపోయినను ఆతనికి యీప్రాకృతమగు బంధ మెట్లు కలుగుచున్నది? అను యాశంకపై జెప్పు చుండెను. "కారణం...జన్మసు" సద్యోనిజన్మలు దేవతలు. అసద్యోని జన్మలు తిర్యగ్జంతువులు. స్థావర ములు నగును. సదసద్యోని జన్మలు మానవులు నగుదురు. ఈపురుషునకగు మూడువిధము లగు జన్మముల విష యమై గుణసంగ (సుఖదుఃఖాద్యభిష్వంగ)ము హేతు వగుచున్నది. సత్త్వగుణాభిష్వంగముచే దేవతలు సాత్త్వికు లగుచుండిరి. రజోగుణాభిష్వంగముచే మానవులు రాజసులగుచుండిరి. తమోగుణాభిష్వంగముచే బశువులు తామసు లగుచుండిరి. కాన యాయా జన్మల ప్రాప్తియెడ నాయాగుణములు కారణములుగ ప్రాధాన్యతను వహించుచున్నవి. ఈవిషమునే గీతలయందు "ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థాః" అనుదానిచే ముందు చెప్పగలడు.

గీ॥ ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్పురుషః పరః ॥ ॥౨౨॥

ప ద వి భా గ ము:— ఉపద్రష్టా- అనుమన్తా- చ- భర్తా- భోక్తా- మహేశ్వరః- పరమాత్మా- ఇతి- చ- అపి- ఉక్తః- దేహే- అస్మిన్- పురుషః- పరః ॥ ॥౨౨॥

ప్ర తి ప దా ర్థ ము:— అస్మిన్= ఈ; దేహే=దేహమునందు: పరఃపురుషః = ఉత్కృష్టమైన పురుషుడు; ఉపద్రష్టా=ఉపద్రష్టయని; (అనగా కార్యకరణ శరీరేంద్రియ) వ్యాపారములయం దవ్యాపృతుడై, విలక్షణుడై, వ్యాపారములతోగూడిన శరీరేంద్రియములయొక్క సామీప్యముచే చూచువాడు "ఉపద్రష్ట" అని యనబడును. అనుమన్తాచ=కార్యకరణములు క్రియల నాచరించుచుండ సంతోషించువాడనియు, లేక కార్యకరణములు తమవ్యాపారములయందు ప్రవృత్తములై యుండ తత్సాక్షిభూతుడై యెన్నడును విచారింపనివాడనియు; భర్తా=పోషించువాడనియు; భోక్తా=భోక్త యనియు; మహేశ్వరః=మహేశ్వరుడనియు; పరమాత్మేతి=పరమాత్మ యనియు; శ్రుతౌ=(ఈపదమధ్యాహార్యము) శ్రుతియందు; ఉక్తః=చెప్పబడెను. ॥౨౨॥

---

శాంకరభాష్యమ్:—

తస్యైవ పునః సాక్షాన్నిర్దేశః క్రియతే— ఉపద్రష్టా సమీపస్థః సన్ద్రష్టా స్వయమవ్యాపృతో యథాఽర్త్విగ్యజమానేషు యజ్ఞకర్మవ్యాపృతేషు తటస్థోఽన్యోఽవ్యాపృతో

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రకృతము మోక్షహేతు వగు జ్ఞానముయొక్క సాక్షాన్నిర్దేశముకొరకు జ్ఞేయ బ్రహ్మమునకే సాక్షాత్తు నిర్దేశము చేయబడుచుండెను.

---

లేక, "పురుషః...గుణాన్" విద్వాంసుడుగాని, యవిద్వాంసుడు గాని ప్రకృతిస్థుడై ప్రకృతిజము లగు గుణముల ననుభవించును. అని యన్వయింపదగును. ఇట "పశ్వాదిభిశ్చావిశేషాత్" అను న్యాయము ననుసరింపదగును. "అట్లగుచో విద్వాంసునివలె నవిద్వాంసుడుగూడ నెందుచే ముక్తుడు కాకుండెను? అట్లే యవిద్వాంసునివలె విద్వాంసు డెందుచే బద్ధుడు కాకుండెను?" అను యాశంకపై జెప్పుచున్నాడు.— 'కారణం...జన్మసు' దేహేంద్రియ విషయరూపము లగు గుణములయందు "నేను, ఇదినాది" అను అభినివేశ రూపమైన సంగమే జన్మమునకు కారణము. విద్వాంసు (ఆత్మజ్ఞాను) లకు, అజ్ఞానులకు దేహసంబంధము సమానమైనను, విద్వాంసులకు అట్టి గుణసంగ ముండదుగాన పునర్జన్మము లేకుండును. పిశాచము దేహము నావేశించి ఆదేహాభిమానముతో నుండునపుడు దేహపీడచే బాధింపబడుచున్నది. ఇంతియేకాని యాదేహాధిపతి యగు జీవుడు బాధింపబడకుండును. దేహపతి దేహాభిమానమును కల్గియున్న సమయమున యాపిశాచము బాధింపబడకుండును. ఈవిధముగనే గుణసంగమే బంధకమగునుగాని కేవలగుణసాన్నిధ్యము బంధకము గానేరదని పర్యవసితము. కాన విద్వదవిద్వాంసులకు దేహవత్త్వము సమానమైనను, సంబంధముండుట, లేకపోవుట అను విశేషముచే నెంతయో భేదము కలదని యాశయము. ॥౨౧॥

—• ౧౩ వ అధ్యాయము ౨౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మ ధు సూ ద న స ర స్వ తీ య ము:— ఇట్లు ప్రకృతి మిథ్యాదాతాత్మ్యమువలన పురుషునకు సంసా

గీ॥ ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్పురుషః పరః ॥ ॥౨౨॥

పదవిభాగము:— ఉపద్రష్టా- అనుమన్తా- చ- భర్తా- భోక్తా- మహేశ్వరః- పరమాత్మా- ఇతి- చ- అపి- ఉక్తః- దేహే- అస్మిన్- పురుషః- పరః ॥ ॥౨౨॥

ప్రతిపదార్థము:— అస్మిన్= ఈ; దేహే=దేహమునందు; పరఃపురుషః = ఉత్కృష్టమైన పురుషుడు; ఉపద్రష్టా=ఉపద్రష్టయని; (అనగా కార్యకరణ శరీరేంద్రియ) వ్యాపారములయం దవ్యాపృతుడై, విలక్షణుడై, వ్యాపారములతోగూడిన శరీరేంద్రియములయొక్క సామీప్యముచే చూచువాడు "ఉపద్రష్ట" అని యనబడును. అనుమన్తాచ=కార్యకరణములు క్రియల నాచరించుచుండ సంతోషించువాడనియు, లేక కార్యకరణములు తమవ్యాపారములయందు ప్రవృత్తములై యుండ తత్సాక్షిభూతుడై యెన్నడును విచారింపనివాడనియు; భర్తా=పోషించువాడనియు; భోక్తా=భోక్త యనియు; మహేశ్వరః= మహేశ్వరుడనియు; పరమాత్మేతి=పరమాత్మ యనియు; శ్రుతౌ=(ఈపదమధ్యాహార్యము) శ్రుతియందు; ఉక్తః=చెప్పబడెను. ॥౨౨॥

శాంకరభాష్యమ్:—

తస్యైవ పునః సాక్షాన్నిర్దేశః క్రియతే— ఉపద్రష్టా సమీపస్థః సన్ద్రష్టా స్వయమవ్యాపృతో యథాఽర్త్విగ్యజమానేషు యజ్ఞకర్మవ్యాపృతేషు తటస్థోఽన్యోఽవ్యాపృతో

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రకృతము మోక్షహేతు వగు జ్ఞానముయొక్క సాక్షాన్నిర్దేశముకొరకు ఆజ్ఞేయ బ్రహ్మమునకే సాక్షాత్తు నిర్దేశము చేయబడుచుండెను.

లేక, "పురుషః...గుణాన్" విద్వాంసుడుగాని, యవిద్వాంసుడు గాని ప్రకృతిస్థుడై ప్రకృతిజము లగు గుణముల ననుభవించును. అని యన్వయింపదగును. ఇట "పశ్వాదిభి శ్చావిశేషాత్" అను న్యాయము ననుసరింపదగును. "అట్లగుచో విద్వాంసుడువలె నవిద్వాంసుడుగూడ నెందుచే ముక్తుడు కాకుండెను? అట్లే యవిద్వాంసుడువలె విద్వాంసు డెందుచే బద్ధుడు కాకుండెను?" అను యాశంకపై జెప్పుచున్నాడు.— 'కారణం...జన్మసు' దేహేంద్రియ విషయరూపము లగు గుణములయందు "నేను, ఇదినాది" అను అభినివేశరూపమైన సంగమే జన్మమునకు కారణము. విద్వాంసు (ఆత్మజ్ఞాను) లకు, అజ్ఞానులకు దేహసంబంధము సమానమైనను, విద్వాంసులకు అట్టి గుణసంగ ముండదుగాన పునర్జన్మము లేకుండును. పిశాచము దేహము నావేశించి ఆదేహాభిమానముతో నుండునపుడు దేహపీడచే బాధింపబడుచున్నది. ఇంతియేకాని యాదేహాధిపతి యగు జీవుడు బాధింపబడకుండును. దేహపతి దేహాభిమానమును కల్గియున్న సమయమున యాపిశాచము బాధింపబడకుండును. ఈవిధముగనే గుణసంగమే బంధకమగునుగాని కేవలగుణసాన్నిధ్యము బంధకముగానేరదని పర్యవసితము. కాన విద్వదవిద్వాంసులకు దేహవత్త్వము సమానమైనను, సంబంధముండుట, లేకపోవుట అను విశేషముచే నెంతయో భేదము కలదని యాశయము. ॥౨౧॥

—• ౧౩ వ అధ్యాయము ౨౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు ప్రకృతి మిథ్యాదాత్మ్యమువలన పురుషునకు సంసా

శాంకరభాష్యమ్:—

యజ్ఞవిద్యాకుశల ఋత్విగ్యజమానవ్యాపారగుణదోషాణా మీక్షితా తద్వ త్కార్యకరణవ్యాపారే ష్వవ్యాపృతోఽన్యో విలక్షణ స్తేషాం కార్యకరణానాం సవ్యాపారాణాం సామీప్యేన ద్రష్టోపద్రష్టా। అథ వా దేహచక్షుర్మనోబుద్ధ్యాత్మనో ద్రష్టార స్తేషాం బాహ్యో ద్రష్టా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈదేహమునం దుండాపరమపురుషుడు ఉపద్రష్ట. స్వయముగ అవ్యాపృతుడు. అనగా ఋత్విక్కులు, యజమాని యజ్ఞకర్మవ్యాపృతులై యుండ యజ్ఞవిద్యాకుశలుడై యజ్ఞకర్మయందవ్యాపృతుడై. ఋత్విగ్యజమానవ్యాపారగుణదోషములను కనుపెట్టి చూచు మరియొకడు ఉపద్రష్ట అని యనబడును. అట్లే కార్యకరణవ్యాపారములయం దవ్యాపృతుడై, కార్యకరణవిలక్షణుడై. వ్యాపారములతో గూడిన కార్యకరణములను సమీపమునందుండి

రముగాని స్వరూపముచే సంసారము లేదు. అని చెప్పబడెను. యేస్వరూపమునందు సంసారము సంభవింపదో అట్టి పురుషునియొక్క స్వరూపమెట్టిది? అను యాశంకపై యట్టి పురుషునియొక్క స్వరూపమును సాక్షాత్తు నిర్దేశించుచు “ఉపద్రష్టా” అని చెప్పుచుండెను—

ఈప్రకృతిపరిణామమైన దేహమునందు పరమపురుషుడు ప్రకృతిగుణసంస్పృష్టుడై జీవరూపముననుండినను స్వస్వరూపముచే పరమార్థముగ అసంసారియే. యజ్ఞకర్మయందు వ్యాపృతులైన ఋత్విగ్యజమానులలో తత్సమీపస్థుడైన ఉపద్రష్ట స్వయముగ నవ్యాపృతుడై ఋత్విగ్యజమానభిన్నుడై యజ్ఞవిద్యాకుశలుడు కాన ఋత్విగ్యజమాన వ్యాపారగుణదోషములకు ద్రష్టయైయెట్లుండునో అట్లే కార్యకరణవ్యాపారములయందు స్వయముగ నవ్యాపృతుడై, విలక్షణుడై వ్యాపారముతోగూడిన కార్యకరణములకు సమీపమునందున్నవాడై పురుషుడు ద్రష్ట యగుచుండెనుగాని, కర్త కాడు. ఈవిషయమునే “స యత్తత్ర కించి త్పశ్య త్యనన్వాగత స్తేన భవ త్యసంగో హ్యయం పురుషః” అను శ్రుతియు బోధించుచున్నది.

లేక:— దేహచక్షుర్మనోబుద్ధ్యాత్మలు ద్రష్టలు. వీటి మధ్యయందు బాహ్యామైన దేహాదుల నపేక్షించి అవ్యవహితుడై ద్రష్టయగు ఆత్మయే (పురుషుడు) ఉపద్రష్ట. “ఉప” అను శబ్దము సామీప్యార్థకమగుటచేత అవ్యవధానరూపమైన సామీప్యము ప్రత్యగాత్మయందే పర్యవసితమగుటవలన ఉపద్రష్ట పురుషుడే. “అనుమన్తా” కార్యకరణప్రవృత్తులయందు స్వయముగ అప్రవృత్తుడైనను ప్రవృత్తుడువలె సన్నిధిమాత్రముచే కార్యకరణానుకూలుడగుటవలన అనుమన్త యగుచున్నాడు.

లేక:— తమ వ్యాపారములయందు ప్రవృత్తమైన దేహేన్ద్రియాదులను యెపుడును నివారింపక తత్సాక్షిభూతుడగును కాన పురుషుడు “అనుమన్తా” అని యనబడును. ఈవిషయమునే “సాక్షీ చేతా” అను శ్రుతి బోధించుచున్నది. “భర్తా” చైతన్యాభాసవిశిష్టమైన, సంహతమైన దేహేన్ద్రియమనోబుద్ధులకు స్వసత్తచేతను, స్వస్ఫురణచేతను, ధరించువాడు, పోషించువాడు. “భోక్తా” బుద్ధియొక్క సుఖదుఃఖమోహాత్మకమైన ప్రత్యయములను స్వరూపచైతన్యముచే ప్రకాశింపజేయువాడు. కాన నిర్వికారుడయియే యుపలబ్ధ యనుపించుకొనుచున్నాడు. “మహేశ్వరః” సర్వాత్మ యగుటవలనను, స్వతన్త్రుడగుటవలనను గొప్ప యీశ్వరుడు పరమాత్మ, అవిద్యచే ఆత్మగ కల్పితమైన దేహాదిబుద్ధ్యన్తములకు “పరమాత్మా” ఉత్కృష్టమైన ఉపద్రష్ట్రిత్యాది పూర్వోక్తవిశేషణవిశిష్టుడు పరమాత్మ యని యీశబ్దముచేతనే శ్రుతి

శాంకరభాష్యమ్:—

దేహ స్తత్ర ఆరభ్యాంతరతమశ్చ ప్రత్య క్సమీప ఆత్మా ద్రష్టా । యతః పరోఽంతరో నాస్తి ద్రష్టా సోఽతిశయసామీప్యేన ద్రష్టృత్వా దుపద్రష్టా స్యాత్ । యజ్ఞోపద్రష్టృవ ద్వా । సర్వవిషయీకరణా దుపద్రష్టా । అనుమంతా చానుమోదన మనుమననం కుర్వత్సు త త్క్రి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చూచు మరియొక డుపద్రష్ట అని యనబడును. అట్టివాడు జ్ఞేయబ్రహ్మ మనియు, లేక:— దేహము, చక్షుస్సు, మనస్సు, బుద్ధి, ఆత్మ, ఇవి ద్రష్టలు. వీటిలో దేహము బాహ్యద్రష్ట. ఆదేహముమొదలుకొని అంతరతమము ప్రత్యక్సమీపమున కల ఆత్మ ద్రష్ట యగుచున్నది. దేనికంటె అంతరమైన మరియొక ద్రష్ట లేదో అది అతిశయసామీప్యముచే ద్రష్ట యగుట వలన ఉపద్రష్ట యగును. లేక యజ్ఞోపద్రష్టవలె సర్వమును విషయమొనరించుకొనుటవలన

యందు "పరమాత్మా" అని చెప్పబడెను. చకారమువలన ఉపద్రష్టృత్వాది శబ్దములచే గూడ పురుషుడే పరుడు. "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః" అని ముందు శ్రీ కృష్ణ పరమాత్మ చెప్ప గలడు.

॥౨౨॥

శంకరానందీయము:— తిరిగి ఆపరతత్త్వమును ముముక్షువులకు బాగుగ తెలియజేయుట కొరకు ఆత్మకు ప్రకృతి, తత్కార్యసంబంధరాహిత్యమును, ప్రకృతి, తత్కార్యరహితమగుటచే శుద్ధము, చిదేకరసమునగుదానికి బహ్మభిన్నత్వమును "ఉపద్రష్టా" అనుదానిచే బోధించుచుండెను.

కార్యకరణసంఘాతరూపమైన యీదేహమునందు అస్మత్పదప్రత్యయార్థమై యేపురుషరూపమైన యాత్మకలదో ఆపురుషుడు దేహేన్ద్రియాదులకంటె భిన్నుడు. ఎందువలననిన? ఉపద్రష్ట యగుట వలన అని గ్రహింపనగును. సర్వమునకు ద్రష్ట చిదాభాసుడు. అట్టి చిదాభాసుని, చిదాభాసునియొక్క వ్యాపారమును సాక్షిగ నుపరిభాగమునందు చూచువాడు కాన ఉపద్రష్ట అని యనిపించుకొనును. లేక "ఉప" సమీపమునందు బుద్ధికికూడ నంతరుడై ప్రత్యగ్రూపముగ నుండినవాడై బుద్ధిని, బుద్ధివ్యాపార మును, నిఖిలదృశ్యజాతమును సాక్షాత్తు అవిక్రియుడై చూచువాడు కాన "ఉపద్రష్ట" అని యనిపించుకొనును. ఇది హేతుగర్భిత విశేషణము. యజ్ఞోపద్రష్టవలె యాత్మ యుపద్రష్టయగుటవలన బుద్ధ్యాదులకంటె వేరు. అని యూహింపదగును. యజ్ఞోపద్రష్ట యజమానఋత్విగ్గణములో యెవడోయొకడు కాడు. అట్లగుచో ఉపద్రష్టృత్వమే లేకపోయెడిని. ఉపద్రష్టృత్వమనగ వ్యాపారము కలవానికంటె భిన్నుడై, అవ్యాపృతుడై, తటస్థ ముగనుండి వ్యాపారము కలవారివలె నితరుల వ్యాపారమును చూచుటయందుమాత్రము శ్రద్ధకలవాడై యుండు టయే. కాన నుపద్రష్ట ద్రష్టవ్యులగు (చూడతగినవారగు) యజమానఋత్విక్కులకంటె యెట్లు వేరగుచుండెనో అట్లే యీయాత్మగూడ నుపద్రష్ట యగుటవలన బుద్ధ్యాదులకంటె వేరు యగుచున్నాడు. (ఆత్మ యుప ద్రష్టయని చెప్పుటచే ఆత్మకు అవికారిత్వము, నిత్యత్వము, అకర్తృత్వము, అభోక్తృత్వము సూచింపబడెను.)

మరియు "అనుమన్తా" తమతమ విషయములయందు ప్రవృత్తములు, నివృత్తములు నగు బుద్ధ్యా దులను వెనుకనుండి తెలిసికొనువాడు కాన "అనుమన్తా" అని యనిపించుకొనును. బుద్ధ్యాదులయొక్క ప్రవృ త్తిని, నివృత్తిని, తత్ఫలమును తద్భిన్నుడయే తెలిసికొనుచున్నాడు. ఈవిషయమునే 'ఉపద్రష్టానుమన్తైష ఆత్మా' అను శ్రుతి బోధించుచున్నది. 'తటస్థుడువలె యనుమన్త యగుటవలన దేహాదులకంటె యాత్మ వేరు." అని

శాంకరభాష్యమ్:—

యాసు పరితోష స్తత్కర్తాఽనుమంతా చ । అథ వాఽనుమంతా కార్యకరణప్రవృత్తిషు స్వయ మప్రవృత్తోపి ప్రవృత్త ఇవ తదనుకూలో విభావ్యతే తేనాఽనుమంతా । అథ వా ప్రవృత్తా న్స్వవ్యాపారేషు తత్సాక్షిభూతః కదాచి దపి న నివారయతీ త్యనుమంతా । భర్తా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఉపద్రష్ట యనబడును. జ్ఞేయబ్రహ్మ మట్టివాడనియు, "అనుమన్తా చ" క్రియలను చేయువారు తమ క్రియలను చేయుచుండగ పార్శ్వస్థుడై యెవడు సంతసించునో అట్టికర్త "అనుమన్త" అని యనిపించుకొనును. లేక:— కార్యకరణప్రవృత్తులయందు స్వయముగ నప్రవృత్తుడైనను ప్రవృత్తుడువలె తదనుకూలుడై తలవబడువాడగుటచే అట్టివా "డనుమన్త" అని యనిపించుకొనును. లేక;— తమ వ్యాపారములయందు ప్రవృత్తమైనవాటికి సాక్షి

ఆత్మకు ప్రకృతి ప్రాకృతములకంటె భిన్నత్వమును సాధించు యనుమానప్రమాణము సూచింపబడెను. "అనుమన్తాచ" అను స్థలమునందు గల 'చ' అను శబ్దమునకు సముచ్చయమర్థము.

మరియు "భర్తా" స్వాజ్ఞానముచే తనయం దధ్యస్తములైన మహదాది సర్వవికారములను సత్తాస్ఫూర్తుల నిచ్చుటచే భరించువాడు కాన 'భర్తా' అని యనిపించు కొనును. జలతరంగ బుద్బుదాదులకు మరుప్రదేశమువలె తనయం దారోపితమైన దేహాదిశబ్దాదిప్రత్యయములకు స్వయముగనే (తానే) అర్థమై సత్తను, స్ఫూర్తిని చేయువా డాత్మయని యర్థము. భరణీయములు (పోషింపదగిన) వాటికంటె భర్త (పోషించువాడు) వేరు అని భర్తృత్వముకూడ నాత్మకు దేహేన్ద్రియాదులకంటె భిన్నత్వమునందు పూర్వము వలె వ్యావర్తకవిశేషణము.

మరియు "భోక్తా" చీకటిని సూర్యునివలె తనయం దధ్యస్తమైన అవ్యక్తాది స్థూలాంతనిఖిలప్రపంచమును చైతన్యస్వరూపమైన తన తేజస్సుచే తనే యనుభవించుచున్నాడు. అనగా తనయందే తిరోభావమును పొందించుచున్నాడు. కాన ఆత్మ భోక్త అని యనబడును. భ్రాంతిదశయందు అనేక స్వరూపములుగ స్వయముగ కనుబడినను సమ్యగ్బోధదశయందు తాను మాత్రమే మిగిలియుండును. భోక్త భోజ్యమునకంటె భిన్నుడు అని భోక్తృత్వముకూడ ఆత్మ దేహాదిభిన్న మగుటయందు పూర్వమువలె వ్యావర్తక విశేషణము.

మరియు "మహేశ్వరః" అవ్యక్తముకంటె స్థూలమగుటవలన "మహాన్" అని యాత్మ చెప్పబడుచున్నది. "మహతో మహీయాన్" అను శ్రుతియు పైవిషయమునే బోధించుచున్నది. మహత్త్వముకూడ ఆత్మ దేహాదిభిన్నమగుటయందు హేతువు. ఆకాశమువలె యాత్మ మహత్త్వము కలదగుటవలన దేహాదులకంటె భిన్నము అను యనుమానప్రమాణమువలన నాత్మకు దేహాదిభిన్నత్వము సిద్ధించుచున్నది. మహత్త్వమనగ అపరిచ్ఛిన్నత్వము. పరిపూర్ణమైన యాత్మకు పరిచ్ఛిన్నత్వముకల దేహాదులలో నేదో యొకటి యగుట సంభవింపదు. అట్లగుచో సర్వప్రమాణములకు విరోధము ప్రాప్తించును. మరియు "ఈశ్వరః" అయస్కాంతసన్నిధియందు ఇనుమువలె ఏ యాత్మసన్నిధిమాత్రముచే బుద్ధ్యాదిసర్వజడము చేష్టకలదగుచున్నదో ఆయాత్మ యీశ్వరుడు (ఈశనశీలుడు.) సర్వప్రవృత్తులకు హేతువు. ఈవిషయమునే "ఈశానో భూతభవ్యస్య" అను శ్రుతి బోధించుచున్నది. రాజువలె యాత్మ యీశ్వరు డగుటవలన ప్రకృతితత్కార్యములకంటె భిన్నుడు (వేరు) అని యీశ్వరత్వము కూడ ఆత్మ ఇతరభిన్నమగుటయందు హేతువు. ఈ చెప్పుటచే

శాంకరభాష్యమ్:—

భరణం నామ దేహేంద్రియమనోబుద్ధీనాం సంహతానాం చైతన్యాత్మపారార్థ్యేన నిమిత్తభూతేన చైతన్యాభాసానాం యత్స్వరూపధారణం తచ్చైతన్యాత్మకృతమేవేతి భర్తాఽఽత్మేత్యుచ్యతే। భోక్తాఽగ్నిరుష్ణవన్నిత్యచైతన్యస్వరూపేణ బుద్ధేః సుఖదుఃఖమోహాత్మకాః ప్రత్య

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భూతుడై యెన్నడును నివర్తింపనివా "డనుమన్త" అని యనిపించుకొనును. పరమేశ్వరుడు అట్టి "యనుమన్త" అనియు, "భర్తా" భరణమనగ సంహతమైన దేహేన్ద్రియమనోబుద్ధ్యాదులకు నిమిత్తభూతమైన చైతన్యస్వరూపమైన పారార్థ్యముచే చైతన్యాభాసలకు యేస్వరూపధారణము కలదో అది చైతన్యాత్మకృతమే గాన యాత్మ భర్త యని చెప్పబడును. అట్టి

ప్రకృతి, తద్వికార, తద్ధర్మ, తత్కర్మ, తదవస్థాలేశరాహిత్య మాత్మకు సిద్ధము. "ఆత్మ— పరిపూర్ణుడు, కూటస్థుడు, అసంగుడు చిదేకరసుడు" అని, మహేశ్వరుడు, ఉపద్రష్టా, అనుమంత, భర్త, భోక్త, పరమాత్మ యను యారు విశేషణములచే స్థాపించబడెను.

ప్రత్యగాత్మ, పరమాత్మ యని రెండు యాత్మలుండ అద్వైత మెటుల సిద్ధించు నని శంకింపజనదు. పరిపూర్ణమైన బ్రహ్మమునకే ఆరోపితావిద్యా కార్యములచే పరిచ్ఛిత్తిభావమువలన పరిచ్ఛిన్నత్వము, క్షేత్రజ్ఞత్వము కల్పితము. ఒకటియగు నాకాశమునకు కల్పితఘటోపాధిచే నెటుల పరిచ్ఛిన్నత్వము, ఘటాకాశత్వము కల్పితమో యట్లే ప్రకృతి, ప్రకృతికార్యములు నివి సర్వము అవిద్యచే కల్పితమై మిథ్యయే యగుచున్నవి. సత్యము కాదు. "త్రయ మప్యేత త్సుషుప్తం" "స్వప్నం మాయామాత్రం" "చిదేకరసో హ్యయమాత్మా" "వికల్పో న హి వస్తునః" "అసత్యా దన్యస్య" ఇత్యాది శ్రుతులచేతను, ఐన్ద్రజాలికమువలె మాయాకార్యమగుటవలన నీసర్వము మిథ్యయే యను యుక్తిచేతను విచారింప దేహాదిద్వైతప్రపంచము సర్వము మాయాకార్యమగుటచే మిథ్య యగుటవలన ద్వైతకారణమే లేమింజేసి బ్రహ్మాత్మలకు భేదము మహాకాశఘటాకాశములకువలె యుపాధిపరికల్పితమగుటవలన నుపాధియు అవిద్యాకార్యమగుటచే మిథ్యయగుటవలన నుపాధియు లేమింజేసి జీవేశ్వరుల కభేదమే సిద్ధమగుచున్నది. అందుచే బ్రహ్మమున కద్వితీయత్వము నిరంకుశ మని బోధించుటకు బ్రహ్మాత్మల కేకత్వమును "పరమాత్మేతి చాప్యుక్తః" అను దానిచే చెప్పెను.

ఏపురుషు డీదేహమునందు అస్మత్ప్రత్యయార్థమై బుద్ధి, తద్వృత్తి సాక్షియై యుండునో. ఏపురుషుని యందు ప్రకృతిసాన్నిధ్యమువలన కర్తృత్వభోక్తృత్వాది సంసారము కల్పితమో, ఉపద్రష్టృత్వాది లక్షణములచే విచారింప నెవడు ప్రకృతి, తద్వికార, తద్ధర్మ, తత్కర్మసంబంధలేశశూన్యుడో, అసంసారియో, నిత్యకూటస్థాసంగచిద్రూపుడో యట్టి యాత్మ పరమాత్మయే (బ్రహ్మమే) అని సర్వశ్రుతులచే చెప్పబడెను. "యదేత దాత్మానమో మిత్ర్య పశ్యన్తః పశ్యత తదేత త్సత్య మాత్మా బ్రహ్మైవ బ్రహ్మాత్మైవ నాత్ర హ్యేవ న విచికిత్స్యమ్" "స ఆత్మా తత్త్వ మసి శ్వేతకేతో" అయ మాత్మా బ్రహ్మ" ఇత్యాది శ్రుతులచే బ్రహ్మాత్మల కభేదమే తెల్లగ చెప్పబడెను. అందువలన క్షేత్రజ్ఞునకు బ్రహ్మభావము స్వాభావికము గాని కల్పితము కాదు. సర్వజ్ఞస్వరూపిణి, సత్యవాదిని, ప్రమాణశిరోమణి యగు "తదేతత్సత్య మాత్మా బ్రహ్మైవ బ్రహ్మాత్మైవ" అను శ్రుతిచే క్షేత్రజ్ఞేశ్వరుల కేకత్వము చెప్పబడుచున్నది. అట్లే శ్రీకృష్ణపరమాత్మచే

**శాంకరభాష్యమ్:—**

యాః సర్వవిషయవిషయా శ్చైతన్యాత్మగ్రస్తా ఇవ జాయమానా విభక్తా విభావ్యంత ఇతి భోక్తాఽఽత్మోచ్యతే। మహేశ్వరః సర్వాత్మత్వా త్స్వతంత్రత్వా చ్చ మహా నీశ్వర శ్చేతి మహేశ్వరః। పరమాత్మా దేహాదీనాం బుద్ధ్యంతానాం ప్రత్యగాత్మత్వేన కల్పితానా మవిద్యయా పరమ ఉపద్రష్టృత్వాదిలక్షణ ఆత్మేతి పరమాత్మా "సోఽన్తః పరమాత్మా" ఇత్యనేన

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

భర్త యనియు. "భోక్తా" అగ్నియొక్క ఔష్ణ్యమువలె నిత్యచైతన్యస్వరూపముచే బుద్ధి యొక్క సుఖదుఃఖమోహాత్మకమైన, సర్వవిషయవిషయకమైన ప్రత్యయములు చైతన్యాత్మగ్రస్తములువలె పుట్టుచు విభక్తములుగ తలవబడుచున్నవి. అందువలన నాత్మ భోక్త యని యనబడును. అట్టిభోక్త యనియు, "మహేశ్వరః" సర్వమున కాత్మ యగుటవలనను, స్వతంత్రుడగుటవలనను, గొప్పయీశ్వరుడగుటవలన మహేశ్వరు డనియు, "పరమాత్మా" అవిద్యచే కల్పితమైన దేహాదిబుద్ధ్యంతములకు ప్రత్యగాత్మ యగుటచే నుత్కృష్టమైన ఉపద్రష్టృత్వాదిలక్షణము కల యాత్మ యగుటంజేసి పరమాత్మయనబడును. అట్టి యాత్మ అంతఃపరమాత్మ అను శబ్దముచేతను శ్రుతియందు చెప్పబడెను. అత డెచట నుండెనుశ్రీ

గూడ "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అనియు, "దేహేఽస్మి న్పురుషః పరః" అనియు క్షేత్రజ్ఞేశ్వరుల కభేదమే చెప్పబడెను. కాన బ్రహ్మాత్మల కేకత్వము సిద్ధించుచుండ మరియొక ద్వైతహేతు వేదియు లేనందున బ్రహ్మమున కద్వితీయత్వము నిర్విచికిత్స్యమని సిద్ధము. ॥౨౨॥

నీలకంఠీయము:— "స చ యో యత్ప్రభావశ్చ" అను శ్లోకముచే క్షేత్రజ్ఞుడు, క్షేత్రజ్ఞ ప్రభావము వివరింపదగినదిగా ప్రతిజ్ఞాత మయ్యెను. అందు క్షేత్రజ్ఞుడు పూర్వము నిరూపింపబడెను. ఇక క్షేత్రజ్ఞుని ప్రభావము నీశ్లోకమున జెప్పుచున్నాడు— జన్మకు కారణముగా చెప్పబడిన యాగుణసంగము నాల్గు విధము లగుచున్నది. అందు- పురుషు- (జీవు) డనువాడు లేడని భావించి, కేవలగుణములకే ప్రాధాన్య మిచ్చినచో నపుడు దేహేంద్రియమనఆదిరూప మగు గుణసంఘాతమునే యాత్మనుగ తెలిసికొనిన వాడు భోక్త యగును. చార్వాకు డిట్టివాడే యగును. ఇక జీవుడు వేరొక డుండె నని తలచి గుణములకే ప్రాధాన్య మిచ్చినచో నాత్మకు వాస్తవికకర్తృత్వాద్యభిమానముచే కర్మఫలముల భర్త (సంచితకర్మలు కలవాడు) యగును. తార్కికు డిట్టివా డగును. పురుషుడు వేరొక డుండె నని తలచి గుణములకు సమప్రాధాన్య మిచ్చినచో నపుడు భోక్తృత్వము గుణగతమైనదైనను దానిని యసంగాత్మయందు శుభ్రవస్త్రము నందు భల్లాతకచిహ్నమునువలె తలచును. సాంఖ్యు డిట్టివాడు. ఏవిధముగ నైనను యాత్మయందు గుణధర్మముల సంక్రమము లేదని తెలిసికొని, ఉదాసీనబోధరూపుడగుటచే నాతడు గుణప్రచారదర్శియై యుపద్రష్ట యగును. అద్వైతుల మతమున సాక్షి యిట్టివాడే యగును. పైగుణసంగులు నల్గురిలో ద్రష్ట యుత్తముడు; అనుమంత మధ్యముడు; భర్త యధముడు; భోక్త యధమాధముడు. అట్టి పురుషుడు గుణములను స్వవశముజేసుకొని యాడుకొనుచున్నచో మహేశ్వరు డనబడును. సృష్టిస్థితిసంహారకర్తయై, ప్రభువై, జగదంతర్యామియై ఎవ డుండునో అట్టిపరమేశ్వరుడే సర్వగుణములను విడిచియున్నచో బరమాత్మగా జెప్పబడును. ఉపద్రష్ట గూడ గుణములను విడిచి, సాక్షి రూపముగ నున్నను, సంఘాతోపహితుడగునట్టివానికే మరియొక సంఘాతము

గీ॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥ ॥౨౩॥

పదవిభాగము:— యః- ఏవం- వేత్తి- పురుషం- ప్రకృతిం- చ- గుణైః- సహ- సర్వథా- వర్తమానః- అపి- న- సః- భూయః- అభిజాయతే ॥ ॥౨౩॥

ప్రతిపదార్థము:— యః=ఎవడు; ఏవం=ఈ చెప్పిన విధమున; పురుషం=పరమపురుషుని; వేత్తి=తెలిసికొనునో (నేను సాక్షాత్తు ఆపరమాత్మనే యని తెలిసికొనునో) గుణైస్సహ=ప్రకృతి వికారములతోగూడ; ప్రకృతిం చ=ప్రకృతిని; వేత్తి=తెలిసికొనునో; (విద్యచే నవిద్యాస్వరూప మగు ప్రకృతి స్వవికారములతో గూడ తొలగింపబడెను, అని తెలిసికొనునో) సః=వాడు; సర్వథా=అనేక విధముల; వర్తమానోఽపి=ఉండినవాడైనను; భూయః=తిరిగి; నాభిజాయతే=పుట్టడు. ॥౨౩॥

శాంకరభాష్యమ్:—

శబ్దేన చాప్యుక్తః కథితః శ్రుతౌ । క్వాఽసావస్మిన్దేహే పురుషః పరోఽవ్యక్తాత్ । 'ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః' ఇతి యో వక్ష్యమాణః 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' ఇత్యుపన్యస్తో వ్యాఖ్యాయోపసంహృతశ్చ ॥ ౨౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"అస్మిన్దేహే" ఈదేహమునందే యుండెను. అట్టి పురుషుడవ్యక్తముకంటె పరుడు. "ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" అని ముందిగీతాశాస్త్రమునందే చెప్పబడును. "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని యుపన్యస్తవిషయము వ్యాఖ్యానింపబడి యుపసంహరింపబడెను. ॥౨౨॥

నందు ప్రచారమును మానుటలేదుగాన నీపరమాత్మ సకలసంఘాతప్రచారదర్శి యగుటచే నుత్కృష్టుడు. కనుక పరశబ్దవాచ్యుడు. ఈవిషయమునే "ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" అని ముందు గీతలలో జెప్పగలడు. ఈదేహమునందుండు యొకే యాత్మ గుణసంగముచే రెండువిధములుగ భాసించుచున్నది. కాన దేహస్థుడగు పరమాత్మ గుణాతీతుడై, తనయందు గుణములను ప్రవిలాపన మొనరించుకొని యఖండైకరసుడై యుండును. గుణసంగముచే పూర్వోక్తవిధముగ నాలు విధములుగ నగుచుండెను. ఇదియే ఈక్షేత్రజ్ఞుని ప్రభావము. అందు క్షేత్రజ్ఞుడు- అనుమంత, భర్త, భోక్త అను నీమూడువిధములచే బద్ధుడగును. ఇక ఉపద్రష్ట, మహేశ్వరుడు, పరమాత్మ, అను నీమూడువిధములుగ నిత్యముక్తుడే యగు నని తెలిసికొనదగును. ఇట భాష్యార్థముగూడ చూడదగును. ॥౨౨॥

—• ౧౩ వ అధ్యాయము ౨౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు "స చ యో యత్ప్రభావశ్చ" అనునది వ్యాఖ్యానింపబడెను. ఇపుడు "యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే" అనుదానిని "య ఏవం" అను శ్లోకముచే నుపసంహరించుచుండెను—

శాంకరభాష్యమ్:—

(1) త మేవం యథోక్త లక్షణ మాత్మానమ్— య ఏవం యథోక్తప్రకారేణ వేత్తి పురుషం సాక్షా దహ మితి ప్రకృతిం చ యథోక్త మవిద్యాలక్షణాం గుణైః స్వవికారైః సహ నివర్తితా మభావ మాపాదితాం విద్యయా సర్వథా సర్వప్రకారేణ వర్తమానోపి స భూయః పునః పతితేఽస్మి న్విద్వచ్ఛరీరే దేహాంతరాయ నాఽభిజాయతే నోత్పద్యతే దేహాంతరం న గృహ్ణాతీత్యర్థః । అపిశబ్దా త్కిము వక్తవ్యం స్వవృత్తస్థో న జాయత ఇత్యభిప్రాయః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) పూర్వమునందు చెప్పబడిన లక్షణములు కల యాత్మ నెవడు చెప్పబడినరీతిని తెలిసికొనునో (నేను సాక్షాత్తు ఆపరమాత్మనే అని తెలిసికొనునో) మరియు అవిద్యాస్వరూపమను ప్రకృతిని తన వికారములతోగూడ విద్యచే నశింపజేయబడినదానినిగ తెలిసికొనునో అట్టివాడు అనేకవిధములుగ సంచరించినను యీవిద్వద్దేహము పడిపోయినతరువాత తిరిగి దేహాంతరమును గ్రహింపడు. ఈశ్లోకమునందు గల "అపి" అనుశబ్దమువలన తన సద్వ్యాపారమునందున్నవాడు తిరిగి జనించ డని చెప్ప నవసరములేదను యభిప్రాయము ప్రకటితము.

ఎవడు పూర్వమునందు చెప్పబడిన విధమున పురుషుని "అయ మహ మస్మి" నేనీపురుషుడనే యని సాక్షాత్కరింప జేసుకొనునో, తన వికారములతో గూడ మిథ్యాభూతమైన యవిద్యను విద్యచే బాధితమైన దానినిగ దెలిసికొనునో, యవిద్యాతత్కార్యములు నివృత్తములైనవని తెలిసికొనునో అట్టివాడు ప్రారబ్ధకర్మవశమున నింద్రుడువలె విధి నతిక్రమించి యుండినను యీవిద్వద్దేహము పతితమైనచో తిరిగి దేహమును ధరింపడు. ఎందువలననిన? విద్యచే నవిద్య నశించియుండ నవిద్యాకార్యములు సంభవింప వని గ్రహింపుము. ఈవిషయ మనేకసార్లు చెప్పబడెను. "తదధిగమ ఉత్తరపూర్వాఽఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్" అను బ్రహ్మసూత్రము గూడ బ్రహ్మజ్ఞానము కలిగియుండ ఉత్తరాఘము (ఆగామి) బ్రహ్మజ్ఞానిని సంబంధించదు. పూర్వాఘము బ్రహ్మజ్ఞానముచే నశించునని బోధించుచున్నది. ఈశ్లోకమునందుగల "అపి" అను శబ్దము విధి నతిక్రమించకుండగ సంచరించునట్టి స్వవృత్తస్థుడైన విద్వాంసుడు తిరిగి శరీరమును పొందడని వేరుగ చెప్పనవసరము లేదను యర్థమును బోధించుచున్నది. ||౨౩||

శంకరానందీయము:— ఇట్లు ప్రకృతిపురుషుల విభాగమును, పురుషునకు ప్రకృతిసంబంధరాహిత్యమును, బ్రహ్మాభిన్నత్వమును చెప్పి, ఇట్టిలక్షణములు కల యాత్మ నెవడు తెలిసికొనునో వాడు విదేహకైవల్యమును పొందునని "య ఏవం" అను శ్లోకముచే జెప్పుచుండెను.—

అనేకవేల జన్మములయందు లెస్సగ నారాధింపబడిన పరమేశ్వరుని యొక్క యనుగ్రహముతో గూడినట్టియు, పరిశుద్ధమైన యంతఃకరణకలిగినట్టియు, సాధనచతుష్టయసంపన్నుడైన బ్రాహ్మణుడు స్వయముగ సదసద్వివేక, తీవ్రవైరాగ్య, శమదమసంన్యాసాద్యంతరంగసాధనసంపన్నుడై బ్రహ్మవేత్త యగు గురువు యొక్క సన్నిధియందు లెస్సగ ననుష్ఠింపబడిన శ్రవణాదులవలన జనించిన జ్ఞానముచే పూర్వమునందు చెప్పిన విధముగ అధిష్ఠానాజ్ఞానమువలన కార్యకరణకర్తృకర్మఫలరూపమున విజృంభించిన అనాద్యవిద్యానిర్వాహ్యమగు సర్వానర్థమూలభూతమైన యవిద్యను, మహదాదిస్థూలాంతమైన గుణములతోను భోక్తృభోగ్యస్వరూపమున నున్న గుణకార్యములతోను గూడ మరు (ఊషర) ప్రదేశదర్శనముచే జలప్రవాహమును

శాంకరభాష్యమ్:—

(2) నను యద్యపి జ్ఞానోత్పత్త్యనంతరం పునర్జన్మాభావ ఉక్త స్తథాపి ప్రాగ్జ్ఞానోత్పత్తేః కృతానాం కర్మణా ముత్తరకాలభావినాం చ యాని చాతిక్రాంతానేకజన్మకృతాని తేషాం ఫల మదత్వా నాశో న యుక్త ఇతి స్యు స్త్రీణి జన్మాని । కృతవిప్రణాశో హి న యుక్త ఇతి । యథా ఫలే ప్రవృత్తానా మారబ్ధజన్మనాం కర్మణామ్ । న చ కర్మణాం విశేషోఽవగమ్యతే । తస్మాత్ త్రిప్రకారా ణ్యపి కర్మాణి త్రీణి జన్మా న్యారభేర న్సంహతాని వా సర్వా ణ్యేకం జన్మాఽఽరభేరన్ । అన్యథా కృతవినాశే సతి సర్వత్రానాశ్వాసప్రసంగః, శాస్త్రానర్థక్యం చ స్యా దిత్యత ఇద మయుక్త ముక్తం న స భూయోఽభిజాయత ఇతి ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(2) విచారింప ఈశ్లోకమునందు జ్ఞానోత్పత్త్యనంతరమున తిరిగి జన్మ లేదని చెప్పబడెను. అయినను జ్ఞానోత్పత్తికి పూర్వమునందు, ఈజన్మమునందు చేయబడిన (సంచిత) కర్మలు, జ్ఞానము కలిగినపిదప చేయబడు (ఆగామి) కర్మలు, అతిక్రాంతానేకజన్మముల యందు చేయబడిన (సంచిత) కర్మలు ఫలము నివ్వకుండగ నశించు నని చెప్పుట యయుక్తము. కాన నీజన్మమునందు జ్ఞానోత్పత్తికి పూర్వమునందు చేయబడిన కర్మలవలన నొకజన్మము, అతీతానేకజన్మలయందాచరించబడిన కర్మలవలన రెండవ జన్మము, జ్ఞానోత్పత్త్యనంతరము చేసిన కర్మలవలన మూడవజన్మము మొత్తము జ్ఞానము కలిగినను మూడు జన్మలు జ్ఞానికి తప్పవు. తనచే నాచరింపబడిన కర్మలకు ఫలము లేనిదే వినాశము యుక్తము కాదు. ప్రారబ్ధ కర్మ లెటుల ఫలము నిచ్చుచున్నవో అట్లే ఆమూడువిధములైన కర్మలుగూడ ఫలము నిచ్చి తీరవలెను. ప్రారబ్ధకర్మలకు, ఆగామిసంచితకర్మలకు విశేష మేమి కలదు? ఏమియు లేదు. కాన పైని చెప్పబడిన మూడువిధములగు కర్మలు మూడుజన్మలను కలుగజేయును. లేక:— అన్నికర్మలు కలసి యొకజన్మమునైన కలుగజేయును. అట్లుకానిచో చేసిన కర్మలు ఫలము నివ్వక నశించుచో అంతటను అనాశ్వాసము ప్రాప్తింపవలసివచ్చును. అట్లగుచో శాస్త్రమున కానర్థక్యముగూడ ప్రాప్తింపవలసివచ్చును. అందువలన "న స భూయోఽభిజాయతే" అని చెప్పుట యసంగతము.

మిథ్యయని తెలిసికొనునటుల అధిష్ఠానసందర్శనముచే మిథ్యాభూతముగ నెవడు తెలిసికొనునో, అట్లే క్షేత్రజ్ఞుని చిదాభాసకర్తృకకర్తృత్వభోక్తృత్వాదిధర్మాధ్యాసోపాధిష్ఠానభూతముగ విద్యచే లెస్సగ నిరస్తాశేషవిశేషములు కల సర్వోపాధివినిర్ముక్తుడు, ఉపద్రష్టృత్వాదిలక్షణలక్షితుడు, అద్యంతరహితుడు, ఆకాశమువలె అత్యంతవిశుద్ధుడు, అనన్దఘనుడు, చిదేకరసస్వరూపుడు నగు పరబ్రహ్మస్వరూపముగ నెవడు "నేనే పరబ్రహ్మస్వరూపము" అని తెలిసికొనునో అనగా నేను కర్తను కాను, భోక్తను కాను, సంసారిని కాను, అను కర్తృత్వాది నిరసనపూర్వకముగ ప్రత్యగభిన్నమైన పరబ్రహ్మమును ప్రత్యగ్దృష్టిచే స్వస్వరూపముగ నెవడు తెలిసికొనునో అట్టి బ్రహ్మవిద్యతి యేవిధముగ నుండినను విదేహముక్తుడగును. విచారింప రాగాదులు కల భేదదర్శికే ప్రవృత్తి సంభవించును. సర్వాత్మదర్శియగు పరిశుద్ధమైన యంతఃకరణకల విద్వాంసునకు తనకంటె భిన్నముగ యితరమైన గ్రహింపదగిన దేదియు లేనందున ప్రవృత్తియే సంభవింపనేరదు. అయి

శాంకరభాష్యమ్:—

(౮) న, "క్షీయంతే చాస్య కర్మాణి ।, బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి ।, తస్య తావ దేవ చిర మిషీకాతూలవ త్సర్వకర్మాణి ప్రదూయంతే" ఇత్యాదిశ్రుతిశతేభ్య ఉక్తో విదుషః సర్వకర్మదాహః ।

ఇహాపి చోక్తో యథైధాంసీత్యాదినా సర్వకర్మదాహః । వక్ష్యతి చోపపత్తేశ్చ । అవిద్యాకామక్లేశబీజనిమిత్తాని హి కర్మాణి జన్మాంతరాంకుర మారభన్తే । ఇహాపి చ సాహం కారాభిసంధీని కర్మాణి ఫలారమ్భకాణి నేతరాణీతి తత్ర తత్ర భగవతోక్తమ్ । "బీజా న్యగ్న్యుపదగ్ధాని న రోహన్తి యథా పునః । జ్ఞానదగ్ధై స్తథా క్లేశై ర్నాఽఽత్మా సంపద్యతే పునః" ఇతి చ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(౮) పైన చెప్పిన విధమున పూర్వపక్షము చేయరాదు. "క్షీయన్తే చాఽస్య కర్మాణి" "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" "తస్య తావదేవ చిర మిషీకాతూలవ త్సర్వకర్మాణి ప్రదూయన్తే" ఇత్యాదిశ్రుతిశతములవలన విద్వాంసునకు సర్వకర్మదాహము చెప్పబడెను. ఈగీతా శాస్త్రమునందుగూడ విద్వాంసునకు సర్వకర్మప్రదాహము "యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున । జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా" ఇత్యాదికముచే చెప్పబడెను. ఉపపత్తివలనగూడ విద్వాంసునకు సర్వకర్మప్రదాహమును చెప్పగలదు. అవిద్యాకామక్లేశబీజనిమిత్తములు గదా కర్మలు. అట్టి కర్మలు జన్మాంతరాంకురము నారంభించును. ఈగీతాశాస్త్రమునందుగూడ శ్రీకృష్ణపరమాత్మచే అహంకారాభిసంధితో గూడిన కర్మలు ఫలారంభకములు. ఇతరకర్మలు (అహంకారాభిసంధివర్జితమైన కర్మలు) ఫలారంభకములు కావని యచటచట చెప్పబడెను. (మరియు) "బీజా న్యగ్న్యుపదగ్ధాని న రోహన్తి యథా పునః । జ్ఞానదగ్ధై స్తథా క్లేశై ర్నాత్మా సంపద్యతే పునః" అగ్నిదగ్ధమైన బీజము లెటుల మొలకలెత్తవో, అట్లే జ్ఞానాగ్నిదగ్ధమైన కర్మలచేగూడ జీవుడు మరి తిరిగి శరీరమును పొందడు. అనియు చెప్పబడెను.

నను మహాపురుష ప్రారబ్ధవశమున దేహమునందు ప్రారబ్ధకర్మానురూపముగ ప్రవృత్తుడైయుండ పరదృష్టిచే ననేకవిధములుగ ప్రవర్తించువాడువలె భాసించును. అయినను నిష్క్రియుడు, నిత్యముక్తుడు, నిర్లేపుడు నగుట వలనను, నిర్మూలితాశేషకర్మలు కలవాడగుటవలనను తన దృష్టిచే స్వయముగ ప్రవృత్తుడు కానివాడై ప్రారబ్ధ కర్మక్షయమువలన నీవిద్వద్దేహము నశింప (పతితమైయుండ) తిరిగి జన్మింపడు. అనగా తిరిగి జన్మకు కారణమైన అవిద్యాకామాదులు సమ్యగ్జ్ఞానాగ్నినిర్దగ్ధము లగుటవలన కారణము లేమింజేసి కేవలభావమును (కేవలాత్మస్వరూపమును) పొందుచున్నాడు. అని యర్థము. ఈశ్లోకమునందు గల 'అపి' అనుదానికి సద్వృత్తుడు తిరిగి జన్మమును పొందడని వేరె జెప్పవలయునా? చెప్పనవసరము లేదని యర్థము. ప్రకృతిపురుషుల స్వరూపమును క్షీరనీరములవలె లెస్సగ వేరుపరచి (తెలిసికొని) గుణములతో గూడ ప్రకృతిని విద్యచే లయము పొందించి "బ్రహ్మైవాహ మస్మి" అని అవిక్రియబ్రహ్మస్వరూపమున నున్న యతికి యథేష్టాచరణము అనాత్మయం దహంమమాభిమానము లేనందున సంభవింపదు. అనాత్మలగు దేహేన్ద్రియాదుల యందు "అహం మమ" అను అభినివేశ ముండినపుడే "ఇది చేయదగినది, ఇది యనుభవింపదగినది" అను

శాంకరభాష్యమ్:—

(4) అస్తు తావజ్జ్ఞానోత్పత్త్యుత్తరకాలకృతానాం కర్మణాం జ్ఞానేన దాహో జ్ఞానసహభావిత్వాత్ । న త్విహ జన్మని జ్ఞానోత్పత్తేః ప్రాక్కృతానా మతీతానేకజన్మాన్తరకృతానాం చ దాహో యుక్తః । న, సర్వకర్మాణీతి విశేషణాత్ । జ్ఞానోత్తరకాలభావినా మేవ సర్వకర్మణా మితి చేత్ న, సంకోచే కారణానుపపత్తేః । యత్తూక్తం యథా వర్తమానజన్మారమ్భకాణి కర్మాణి న క్షీయన్తే ఫలదానాయ ప్రవృత్తాన్యేవ సత్యపి జ్ఞానే తథాఽనారబ్ధఫలానా మపి కర్మణాం క్షయో న యుక్త ఇతి । తదసత్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(4 జ్ఞానోత్పత్త్యనంతరమునందు చేయబడిన కర్మలు జ్ఞానసహభావులగుటవలన వానికి జ్ఞానముచే దాహము యుక్తమే. కాని యీజన్మమునందు జ్ఞానోత్పత్తికి పూర్వమునందాచరింపబడిన కర్మలకు, అతీతానేకజన్మాంతరకృతములైన కర్మలకు నాశము యుక్తము కాదు అని శంకింపజనదు. "సర్వకర్మాణి" అను విశేషణమువలన సర్వకర్మదాహమే యుక్తము. జ్ఞానికి జ్ఞానోత్తరకాలభావిసర్వకర్మలయొక్క దాహమే సంభవించును. అని శంకింపజనదు. "సర్వకర్మాణి" అనునది సర్వకర్మల దాహమును బోధించుచుండ జ్ఞానోత్తరకాలభావి సర్వకర్మలను జ్ఞానాగ్ని దాహ మొనరించు నని సంకోచింపచేయుటయందు కారణ మేమియు లేనందున జ్ఞానోత్తరకాలభావిసర్వకర్మలు అని చెప్పుట యుక్తము కాదు. జ్ఞానము కలిగినను ఫలదానముకొరకు ప్రవృత్తమైన వర్తమానజన్మారంభకమైన కర్మలు జ్ఞానముచే నెట్లు నశింపవో అట్లే యనారబ్ధఫలము కల కర్మలుకుగూడ జ్ఞానముచే క్షయము యుక్తము కాదు. అను యాశంకయు మంచిదికాదు.

---

యిచ్ఛావేగము సంభవించును. అట్టి యిచ్ఛావేగ ముండినపుడే పురుషునకు దుష్టాదుష్టకర్మలయందు ప్రవృత్తి సంభవించును. కాని యట్టి యిచ్ఛావేగము లేనపుడు దుష్టాదుష్టకర్మలయందు ప్రవృత్తి సంభవించుటలేదు. అందువలన దేహేంద్రియాదులయందు "అహం మమ" అనెడి యభినివేశము లేనట్టి సర్వమును బ్రహ్మముగ దెలిసికొనినట్టి బ్రహ్మవేత్తకు బ్రహ్మదర్శన ప్రపంచదర్శనములు విరుద్ధము లగుటవలన దుష్టాదుష్టములయందు ప్రవృత్తి సంభవింపదు. అట్లగుచో "సర్వథా వర్తమానోఽపి" అను వాక్యము వ్యర్థము కావలని వచ్చుననెదవా? చెప్పెదవినుము. బ్రహ్మవేత్తయైనను బ్రహ్మాత్మనా యుండినవానికి దేహప్రారబ్ధవశమున నొకానొక సమయమునం దాహారాదులయందు నియమోల్లంఘనము ప్రాప్తించును. దానిచే యీబ్రహ్మవేత్తయొక్క జ్ఞానము, జ్ఞానఫలము నశించునని మూఢులయాశయము. అట్టి యాశయమును తొలగించుటకు శ్రీకృష్ణపరమాత్మ "సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే" అని చెప్పెను. కాన నీవాక్య మసంగతము కాదు. ॥౨౩॥

భాష్యోత్కర్షదీపిక:— "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి", అనుదానిచే నుపన్యస్తమైన యాత్మతత్త్వమును యింతవరకు వ్యాఖ్యానించి యుపసంహరించెను. ఇపుడు పూర్వమునందు చెప్పబడిన శుద్ధార్థములయొక్క ఐక్యరూపమైన యాత్మతత్త్వముయొక్క జ్ఞానమును ఫలప్రదర్శనద్వారమున "య ఏవం" అను శ్లోకముచే స్తుతించుచుండెను.

శాంకరభాష్యమ్:—

(5) కథం, తేషాం ముక్తేషువత్ప్రవృత్తఫలత్వాత్ । యథా పూర్వం లక్ష్యవేధాయ ముక్త ఇషు ర్ధనుషో లక్ష్యవేధోత్తరకాల మప్యారబ్ధవేగక్షయా త్పతనేనైవ నివర్తత ఏవం శరీరారమ్భకం కర్మ శరీరస్థితిప్రయోజనే నివృత్తేఽప్యాసంస్కార వేగక్షయా త్పూర్వవ ద్వర్తత

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(5) లక్ష్యవేధముకొరకు ధనుస్సునుండి విడువబడిన బాణము లక్ష్యమును కొట్టి యంతటితో నాగక లక్ష్యవేధోత్తరకాలమునందుగూడ ఆరబ్ధవేగక్షయమువలన పతనముచేతనే నివర్తించును. అట్లే శరీరారంభకకర్మయు శరీరస్థితిప్రయోజనము నివృత్తమైనను సంస్కారవేగక్షయపర్యంతము పూర్వమునందువలె నుండును. ఆబాణమే ప్రవృత్తి

పూర్వమునందు చెప్పిన విధమున జీవేశ్వరాదిసర్వకల్పనాధిష్ఠానమైన పురుషుని యెవడు తెలిసికొనునో అనగా పైని చెప్పబడిన లక్షణములు కల పురుషుడను నేనే యని సాక్షాత్తు తెలిసికొనునో, అనాద్యనిర్వచనీయము, సర్వానర్థోపాధిభూతము నగు ప్రకృతిని పూర్వోక్తమైన స్వవికారములతోగూడ ఏకత్వవిషయక విద్యచే నశింపజేయబడినదానినిగ నెవడు తెలిసికొనునో, అట్టివాడు వర్ణాశ్రమధర్మముల నతిక్రమించి యుండినను యీవిద్వచ్ఛరీరము పతితమైయుండ మరియొక దేహముకొఱకు జనింపడు. “క్షీయన్తే చాస్య కర్మాణి తస్మి న్దృష్టే పరావరే” పరావరరూపమైన యాపరమాత్మను తెలిసికొనినచో వీని కర్మలన్నియు నశించుచున్నవి. “బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి” బ్రహ్మమును తెలిసికొనినచో బ్రహ్మమే యగుచున్నాడు. “తస్య తావదేవ చిరం యావ న్న విమోక్ష్యే” ఎంతవరకు ప్రారబ్ధకర్మక్షయము కాదో అంతవరకే విదేహకైవల్యప్రాప్తికి యాలస్యము. “ఇషీకాతూలవత్సర్వకర్మాణి ప్రదహ్యన్తే” ఇషికాతూలము (వరిపెన్నుపూవారము) వలె సర్వకర్మలు దహింపబడుచున్నవి. “య థైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున । జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥” ఓయర్జునా! లెస్సగ ప్రజ్వలింపజేయబడిన యగ్ని కట్టెల నెట్లు భస్మముగ నొనరించునో యట్లే జ్ఞానమనెడి యగ్నియు సర్వకర్మలను భస్మముగ నొనరించును. “బీజా న్యగ్న్యుపదగ్ధాని నరోహన్తి యథా పునః । జ్ఞానదగ్ధై స్తథా క్లేశై ర్నాత్మా సంపద్యతే పునః” అగ్నిచే దగ్ధమైన బీజములెటుల తిరిగి మొలక లెత్తవో యట్లే జ్ఞానదగ్ధమై క్లేశములచే నాత్మ తిరిగి శరీరమును పొందదు. అవిద్యాకామక్లేశబీజనిమిత్తకములు, ఫలారంభకములు, జన్మాన్తరాంకురారంభసమర్థములునగు కర్మలకు జ్ఞానాగ్నిచే చెప్పబడిన బీజము దగ్ధమైయుండ జన్మాంకురారంభసామర్థ్యము సంభవింపనేరదని శ్రుతిస్మృతియుక్తులచే జెప్పబడెను. విద్వాంసునకు జన్మ లేదను యభిప్రాయముచేతనే శ్రీకృష్ణపరమాత్మ “న స భూయో ఽభిజాయతే” అని చెప్పెను.

ఈచెప్పుటచే:— కొందరు జ్ఞానోత్పత్తికి ప్రాక్కృతమైన కర్మలు, జ్ఞానోత్పత్త్యుత్తరకాలభావికర్మలు, అతిక్రాన్తానేకజన్మకృతమైన కర్మలు అనగా ఆగామి సంచితప్రారబ్ధకర్మ సమకాలకర్మలు “నాఽభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి” అనేకకోట్లకల్పములు గడచినను అనుభవింపనిదే కర్మ నశింపదు. అను న్యాయముచే ఫలము నివ్వనిదే ప్రారబ్ధకర్మవలె కర్మలు నశింపనేరవు. కాన మూడు విధములగు కర్మలు మూడు జన్మలనైనను, లేక మూడు విధములగు కర్మలు కలసి యొకజన్మమునైన తప్పక కలుగజేయును. అట్లు కానిచో కృతమైన కర్మలకు విప్రణాశము సంభవించును. అట్లగుచో సర్వత్ర అనాశ్వాసము, శాస్త్ర

గీ॥ ధ్యానే నాత్మని పశ్యన్తి కేచి దాత్మాన మాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ ॥౨౪॥

పదవిభాగము:— ధ్యానేన- ఆత్మని- పశ్యన్తి- కేచిత్- ఆత్మానం- ఆత్మనా- అన్యే- సాంఖ్యేన- యోగేన- కర్మయోగేన- చ- అపరే ॥ ॥౨౪॥

ప్రతిపదార్థము:— కేచిత్=కొందరు యోగులు; ధ్యానేన=ధ్యానముచేత; ఆత్మని=బుద్ధియందు; ఆత్మానం=ప్రత్యగాత్మను; ఆత్మనా=ధ్యానసంస్కృతాంతఃకరణముచే; పశ్యన్తి=చూచుచుండిరి; అన్యే=మరికొందరు; సాంఖ్యేనయోగేన=సాంఖ్యయోగముచే; ఆత్మానం=ప్రత్యగాత్మను; ఆత్మనా=ధ్యానసంస్కృతాంతఃకరణముచే; పశ్యన్తి=చూచుచుండిరి; అపరేచ=మరికొందరు (కర్మయోగులు); కర్మయోగేన=ఈశ్వరార్పణబుద్ధిచే ననుష్ఠింపబడిన కర్మయోగముచే; ఆత్మానం=ప్రత్యగాత్మను; ఆత్మనా=సంస్కృతాంతఃకరణముచే; పశ్యన్తి=తెలిసికొనుచున్నారు. ॥౨౪॥

---

శాంకరభాష్యమ్:—

ఏవ । స ఏవేషుః ప్రవృత్తినిమిత్తానారబ్ధవేగ స్త్వముక్తో ధనుషి ప్రయుక్తోఽప్యుపసంహ్రియతే తథాఽనారబ్ధఫలాని కర్మాణి స్వాశ్రయస్థా న్యేవ జ్ఞానేన నిర్బీజీక్రియన్త ఇతి పతితేఽస్మిన్విద్వచ్ఛరీరే "న స భూయోఽభిజాయతే" ఇతి యుక్త మేవోక్త మితి సిద్ధమ్ ॥ ॥౨౩॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నిమిత్తానారబ్ధవేగముకలదై ధనస్సునందు సంధింపబడినను విడువబడనిదై యుపసంహరింపబడుచున్నది. అట్లే అనారబ్ధఫలముకల కర్మలు స్వాశ్రయమునందే యుండినవై జ్ఞానముచే నిర్బీజములు చేయబడును. కాన నీవిద్వచ్ఛరీరము పతితమైనపిదప "న స భూయోఽభిజాయతే" అని యుక్తముగనే చెప్పబడెను. అని సిద్ధము. ॥౨౩॥

---

నర్థక్యము ప్రాప్తించెడిని. అను యాశంక తొలగించబడెను. "సర్వకర్మాణి" అను విశేషణమువలన సర్వకర్మల దాహమే యుక్తము. జ్ఞానోత్పత్త్యుత్తరకాలకృతమైన సర్వకర్మలకే జ్ఞానసహభావులగుటవలన జ్ఞానముచే నాశము సంభవించుగాక, ఇతరకర్మలకు నాశము సంభవింపదు. అని చెప్పిన "సర్వకర్మాణి" అను విశేషణమునకు వైయర్థ్యము సంభవింపదని శంకింపజనదు. ప్రారబ్ధకర్మలు, ముక్తేషువువలె ప్రవృత్తఫలము కలవగుటవలన వాటికి జ్ఞానాగ్నివలన నాశము సంభవింపదు. అనిర్ముక్తేషువువలె అనారంభఫలముకల ఆగామిసంచితకర్మలకు ప్రారబ్ధకర్మసామ్యము చెప్పి ప్రారబ్ధకర్మ నశించనటుల ఆగామిసంచితకర్మలుగూడ జ్ఞానాగ్నిచే నశింపవని చెప్పుట యుక్తముకాదు. కాన నీవిద్వచ్ఛరీరము పతితమైయుండ "న స భూయోఽభిజాయతే" తిరిగి జ్ఞాని శరీరమును పొందడని చెప్పుటయుక్తమే. ॥౨౩॥

—• ౧౩ వ అధ్యాయము ౨౪ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈశ్లోకమునం దాత్మదర్శనవిషయమై సాధనవికల్పములు చూపబడుచుండెను. బ్రహ్మవిద్యయం దధికారులు నాలుగు విధములు. అందు కొందరుత్తములు, కొందరు మధ్యములు, కొందరు మందులు, కొందరు మందతరులు. అందుత్తముల కాత్మజ్ఞానసాధనమును "ధ్యానేన" అనుదానిచే జెప్పుచుండెను.—

శాంకరభాష్యమ్:—

అథాఽఽత్మదర్శన ఉపాయవికల్పా ఇమే ధ్యానాదయ ఉచ్యన్తే— ధ్యానేన: ధ్యానం నామ శబ్దాదిభ్యో విషయేభ్యః శ్రోత్రాదీని కరణాని మన స్యుపసంహృత్య మనశ్చ ప్రత్యక్చేతయిత ర్యేకాగ్రతయా య చ్చిన్తనం త ద్ధ్యానమ్ । తథా ధ్యాయతీవ బకో ధ్యాయ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈయాత్మదర్శనవిషయమై ధ్యానాదిరూపమైన ఉపాయవికల్పములు చెప్పబడుచున్నవి.

ధ్యాన మనగ శబ్దాదివిషయములనుండి శ్రోత్రాదికరణములను మనస్సునం దుపసంహరించి మనస్సును ప్రత్యగూపమునందు నిలిపి ఏకాగ్రతతో చింతించుటయే. అట్లే "ధ్యాయ

ధ్యాన మనగ విజాతీయప్రత్యయానన్తరితసజాతీయప్రత్యయప్రవాహము. అట్టి ధ్యానము శ్రవణమనన ఫలభూతము. నిదిధ్యాసశబ్దప్రతిపాదితము. అట్టి ధ్యానద్వారమున బుద్ధియందు ఆయాత్మను ధ్యానసంస్కృతమగు మనస్సుచే సాక్షాత్కరింప జేసుకొనువారు యోగులు. మధ్యముల కాత్మజ్ఞానసాధనమును "అన్యే సాంఖ్యేన" అనుదానిచే జెప్పుచుండెను. కొందరు మధ్యములు నిదిధ్యాసనపూర్వభావియగు శ్రవణమనన రూపమైన యోగముచే "ఈగుణత్రయపరిణామము లనాత్మలు, మిథ్యాభూతములు, తత్సాక్షిభూతుడు నిత్యుడు, విభువు, నిర్వికారుడు, సత్యుడు, సమస్తజడసంబంధశూన్యుడు అగు యాత్మస్వరూపుడను నేను" అని వేదాన్తవాక్యవిచారజన్యచిన్తనచే ధ్యానోత్పత్తిద్వారమున యాత్మయం దాత్మను చూచుచున్నారు. "కర్మయోగేన" అనుదానిచే మందులకు జ్ఞానసాధనమును జెప్పుచుండెను.

కొందరు మధ్యమాధికారులు ఆయావర్ణాశ్రమముల కుచితమైనట్టియు, వేదవిహితమైనట్టియు, ఫలాభిసంధిరహితముగ నీశ్వరార్పణబుద్ధిచే ననుష్ఠింపబడు కర్మకలాపముచే నంతఃకరణమునందు సత్త్వశుద్ధిని కలిగింప జేసుకొని శ్రవణమనన ధ్యానోత్పత్తిద్వారమున నంతఃకరణమునం దాత్మను తెలిసికొనుచున్నారు. ॥౨౪॥

శంకరానందీయము:— ఇట్లు "జ్ఞేయం య త్త త్ప్రవక్ష్యామి" ఇత్యాదికముచే నిరూపితమైన బ్రహ్మముయొక్క స్వరూపమును తెలిసికొని ప్రకృతిని ప్రవిలాపనచేసి, యీనిఖిలప్రపంచము, నేను బ్రహ్మమే. యనిసర్వమును బ్రహ్మస్వరూపముగ చూచు యతికి బ్రహ్మవిజ్ఞానముయొక్క ఫలమగు విదేహకైవల్యమును చెప్పి, యిపుడు ఉత్తమ, మధ్య, మాధమాధికారు లగు ముముక్షువులకు నిర్విశేషబ్రహ్మప్రాప్తికొరకు ఆయాయధికారానురూపమైన సాధనములను "ధ్యానేన" అనుశ్లోకము మొదలుకొని రెండు శ్లోకములచే జెప్పుచుండెను.

కొందరుత్తమాధికారులగు యతులు "వివిక్తదేశే చ సుఖాసనస్థ శ్శుచి స్సమగ్రీవశిరశ్శరీరః" (వివిక్తదేశమునందు సుఖాసనము నందు కూర్చున్నవాడై, పవిత్రుడై కంఠమును, శిరస్సును, శరీరమును సమముగ నుంచుకొని) ఇత్యాదికముచే చెప్పబడినరీతిని "ఏకాన్తే సుఖ మాస్యతాం పరతరే చేత స్సమాధీయతామ్" (ఏకాంతమునందు సుఖముగ కూర్చుండుము. పరమాత్మయం దంతఃకరణమును లెస్సగనుంచుము.) అనురీతిని తీవ్రమైన మోక్షేచ్ఛావైరాగ్యములచే నిఖిలవిషయములనుండి యింద్రియములను మరలించి మనస్సును ప్రత్యగాత్మయం దేకాగ్రతను పొందించి, శ్రవణాదిసంస్కారజన్యజ్ఞానసాధ్యమైన విజాతీయప్రత్యయ

శాంకరభాష్యమ్:—

తీవ పృథివీ ధ్యాయన్తీవ పర్వతా ఇత్యుపమోపాదానాత్ తైలధారావత్సంతతోఽవిచ్ఛిన్న ప్రత్యయో ధ్యానం, తేన ధ్యానేనాఽఽత్మని బుద్ధౌ పశ్యన్త్యాత్మానం ప్రత్యక్చేతన మాత్మనా ధ్యానసంస్కృతేనాన్తఃకరణేన కేచి ద్యోగినః । అన్యే సాంఖ్యేన యోగేన సాంఖ్యం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

తీవ బకః" కొంగ ధ్యానించునదివలె నున్నది. "ధ్యాయతీవ పృథివీ" భూమి ధ్యానించునదివలె నున్నది "ధ్యాయన్తీవ పర్వతాః" పర్వతములు ధ్యానించునవివలె నున్నవి. అని ధ్యానమున కుపమాన మీయబడెను. తైలధారవలె సంతతమై యెడతెగని ప్రత్యయము ధ్యానమనబడును. కొందరు ఇట్టి ధ్యానముచే బుద్ధియందు ప్రత్యగాత్మను ధ్యానసంస్కృతాంతః శూన్యమైన సజాతీయప్రత్యయప్రవాహీకరణరూపమైన ధ్యానముచే బుద్ధియందే సర్వదృశ్యమైన ప్రపంచమునకు ప్రకాశకముగ నున్న నిర్విశేషమైన, నిరాకారము, ఆకాశమువలె పరిపూర్ణము. చిదేకరస రూపమునగు పరమాత్మను తన స్వరూపముగ "పశ్యన్తి" చూచుచున్నారు. అనగా భేదవాసనానివృత్తి కొరకు శ్రవణాదులచే తెలియబడిన "బ్రహ్మమే నేను, నేనే బ్రహ్మము" అని తనను యెల్లపుడు బ్రహ్మముగనే భావన చేయుచుందురు.

లేక:— "సన్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠాః" అను శ్రుత్యుక్తరీతిని మాయా కార్యమగు సర్వమునకు సదాస్పదత్వము శ్రుతిప్రమాణమగుటవలన భ్రాన్తిచే గల్పితమైన అవ్యక్తాది స్థూలాంతసర్వమును సర్వాధిష్ఠానమైన పరమాత్మయందు తల్లక్రిందుగ ప్రవిలాపన జేసి, అట్టి ప్రవిలాపనచే ప్రత్యస్తమితాశేషవిశేషములుగల సద్ఘనము, చిద్ఘనము, ఆనందఘనము నగు పరమాత్మను ధ్యానముచే అనగా నితరవృత్తి నిర్ముక్తమైన తైలధారవలె అవిచ్ఛిన్నమైన, బ్రహ్మాకారాకారితాంతఃకరణవృత్తిచే "బ్రహ్మైవాహం" అని స్వస్వరూపముగ చూచుచుండిరి. ఎల్లపుడు తననే బ్రహ్మస్వరూపముగ భావించుచుండిరి.

మధ్యమాధికారు లగు కొందరు పైన చెప్పబడిన ధ్యానయోగమునం దసమర్థులైన యతులు సాంఖ్యముచే (సాంఖ్య మనగ సర్వావస్థలయందు "నేను కూటస్థము, అసంగము నగు చిద్రూపము అయియుంటిని. ఇట్టి బుద్ధినుండి నేనెప్పుడును చలింపను. నేను కర్మలను చేయను. నేను భుజించువాడను కాను." అను చైతన్యాకారమాత్రముయొక్క ప్రత్యగ్వృత్తిచే నెల్లపుడు ప్రకృతి, ప్రకృతిగుణ, ప్రకృతివికార, ప్రకృతిధర్మ, ప్రకృత్యవస్థల సంబంధముల రాహిత్యముయొక్క దర్శనమే. ఇదియే సంసారమోక్షోపాయ మగుటచే సాంఖ్య మనబడును.) బుద్ధియం దాత్మను చూచుచున్నారు. (అనగా) తనను అకర్తగను, అభోక్తగను, సాక్షి యముగను యెల్లపుడు భావించుచుండిరని యర్థము. మరికొందరు అనగా సదసద్వివేకవైరాగ్యసంన్యాసైక సాధనసమధిగమ్యమైన ధ్యాన, సాంఖ్యయోగములయం దనధికారులైన కొందరు గృహస్థులుగూడ "మత్కర్మకృన్మత్పరమః" అని చెప్పినరీతిని కర్మయోగముచే ననగా పరమేశ్వరార్థము సకలకర్మానుష్ఠానము కర్మయోగము. ఇట్టి కర్మానుష్ఠానము మోక్షోపాయ మగుటవలన యోగ మనబడును. చిత్తశుద్ధి సంపాదనకారణమైన ఇట్టి కర్మయోగముచే బరమేశ్వరుని యారాధించువారలై విశ్వరూపుడగు పరమాత్మను బుద్ధియందు చూచుచుండిరి. "వాసుదేవ స్సర్వం" అనుబుద్ధిచే సర్వమును విష్ణుస్వరూపముగ

శాంకరభాష్యమ్:—

నామ— ఇమే సత్త్వరజస్తమాంసి గుణామయా దృశ్యా అహం తేభ్యోఽన్య స్తద్వ్యాపార సాక్షిభూతో నిత్యో గుణవిలక్షణ ఆత్మేతి చిన్తన మేష సాంఖ్యో యోగ స్తేన పశ్యన్త్యాత్మాన మాత్మనేతి వర్తతే। కర్మయోగేన కర్మైవ యోగ ఈశ్వరార్పణబుద్ధ్యాఽనుష్ఠీయమానం ఘటనరూపం యోగార్థత్వా ద్యోగ ఉచ్యతే। గుణత స్తేన సత్త్వశుద్ధిజ్ఞానోత్పత్తిద్వారేణ చాపరే। ॥౨౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కరణముచే చూచుచుండిరి. సాంఖ్య మనగ ఈసత్వరజస్తమోగుణములు నాచే చూడదగినవి. నేనాగుణములకంటె భిన్నుడను. సత్త్వరజస్తమోగుణవ్యాపారసాక్షిభూతుడను. నిత్యుడను. గుణవిలక్షణుడగు యాత్మను అను చింతనమే సాంఖ్యయోగము. అట్టి సాంఖ్యయోగముచే ప్రత్యగాత్మను సంస్కృతాంతఃకరణముచే చూచుచుండిరి. ఈశ్వరార్పణబుద్ధిచే ననుష్ఠీయమానమైన కర్మయే యోగ మనబడును. ఘటనరూపము యోగార్థ మగుటవలన యోగ మనబడును. గుణమువలన అట్టి కర్మయోగముచే సత్త్వశుద్ధి జ్ఞానోత్పత్తిద్వారమున కొందరు ప్రత్యగాత్మను సంస్కృతాంతఃకరణముచే జూచుచుండిరి. ॥౨౪॥

భావించుచుండిరి. లేక:— పరమేశ్వరార్పణబుద్ధితో శ్రద్ధాభక్తులతో లెస్సగ ననుష్ఠింపబడిన కర్మయోగముచే చిత్తశుద్ధిని పొంది, యట్టి చిత్తశుద్ధిచే సంపాదింపబడిన శ్రవణాదులవలన జనించిన జ్ఞానముచే బుద్ధియందు పరమాత్మస్వరూపము నాత్మచే క్రమముగ దెలిసికొనుచున్నాడు. ॥౨౪॥

పరమార్థప్రపః— ఇట్టి వివేకముచే నాత్మజ్ఞానవిషయమై సాధనవికల్పములను “ధ్యానేన” అను శ్లోకము మొదలుకొని, రెండు శ్లోకములచే జెప్పుచుండెను.

ఆత్మాకారప్రత్యయావృత్తిచే దేహమునందే మనస్సుచేతనే పరమాత్మను కొందరు చూచుచుండిరి. ఈవిషయమునే “శ్రద్ధావిత్తో భూత్వాఽఽత్మన్యే వాత్మానం పశ్యతి సర్వ స్యాత్మా భవతి” అను శ్రుతియు ఘోషించుచున్నది. అట్లే మరికొంద రధికారులు ప్రకృతిపురుషవైలక్షణ్యాలోచన మనెడి సాంఖ్యమను యోగముచే దెలిసికొనుచుండిరి. ఈవిషయమునే “పతంగ మక్త మసురస్య మాయయా హృదా పశ్యన్తి మనసా విపశ్చితః సముద్రే అన్తః కవయో విచక్షతే మరీచీనాం పద మిచ్ఛన్తి వేధసః” “అసురస్య” బలవంతుడగు పరమేశ్వరునియొక్క “మాయయా” మాయచే “అక్తం” వ్యాప్తమైన కనుకనే “పతంగం” అనేక దేహములయందు ప్రవేశించు స్వభావముకల క్షేత్రజ్ఞుని “విపశ్చితః” జ్ఞానవంతులు “మనసా” ప్రథమసంకల్పాత్మకమైన మనస్సుచేతను అనంతరము “హృదా” నిశ్చయాత్మకమైన బుద్ధిరూపమగు నాత్మచేతను, ఆత్మస్వరూపమును తెలిసికొనుచున్నారు. ఆ ఆత్మస్వరూపమునే “కవయః” క్రాన్తదర్శులు “సముద్రే” సముద్రియతి+వ్యాప్నోతీతి సముద్రః తస్మిన్” వ్యాపించునది సంసారముకాన సముద్ర మనగ ప్రపంచ మనబడును. అట్టి ప్రపంచమునందు “అంతః” లోపల “విచక్షతే” క్షీరాంతర్గతనవనీతమునువలె చూచుచుండిరి. “వేధసః” హిరణ్యగర్భునియొక్క “మరీచీనాం” ప్రకాశలయొక్క ‘పదం’ స్థానమును “ఇచ్ఛన్తి” పదార్థప్రతీతిరూపముగ వెదుకుచుండిరి. మరికొందరు కర్మయోగముచే చిత్తశుద్ధిద్వారా తెలిసికొనుచుండిరి. ఇట్లు అధికారతారతమ్యముచే వికల్పములు చెప్పబడెను. ॥౨౫॥

గీ॥ అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ ॥౨౫॥

పదవిభాగము:— అన్యే- తు- ఏవం- అజానన్తః- శ్రుత్వా- అన్యేభ్యః- ఉపాసతే- తే- అపి- చ- అతితరన్తి- ఏవ- మృత్యుం- శ్రుతిపరాయణాః ॥ ॥౨౫॥

ప్రతిపదార్థము:— అన్యే తు=మరికొందరైతే; ఏవం=ఈ చెప్పబడిన యాత్మను; అజానన్తః= తెలియనివారై; అన్యేభ్యః=ఇతరులైన యాచార్యులవలన; శ్రుత్వా=విని, దీనినే చింతించుము అని పలుకబడిన వారై; ఉపాసతే=ఉపాసించుచుండిరి; (చింతించుచుండిరి) తేఽపిచ=అట్టివారును; శ్రుతిపరాయణాః= శ్రవణమే యుత్కృష్టమైన మోక్షసాధనముగా కలవారై; మృత్యుం=మృత్యుయుక్తమైన సంసారమును; అతితరన్త్యేవ=అతిక్రమించుచున్నారు. (దాటుచున్నారు) ॥౨౫॥

శాంకరభాష్యమ్:—

అన్యే త్వితి । అన్యే త్వేషు వికల్పే ష్వన్యతరేణా ప్యేవం యథోక్త మాత్మాన మజానన్తోఽన్యేభ్య ఆచార్యేభ్యః శ్రుత్వేద మేవ చిన్తయతే త్యుక్తా ఉపాసతే శ్రద్ధధానా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరికొందరు పూర్వమునందు చెప్పబడిన వికల్పములలో దేనిచేతనుగూడ పూర్వమునందు చెప్పబడిన యాత్మను తెలిసికొననివారై, గురువులవలన "దీనినే చింతించుము" అని పలుక

నీలకంఠీయము:— ఇట్టి యాత్మను తెలిసికొనుటకై యధికారభేదమునుబట్టి యుపాయములను జెప్పుచుండెను— "ధ్యానేన...చాపరే" ఆత్మను తెలుసుకొనదలచినవారై యెవరు నిష్కామకర్మానుష్ఠానముతో బరమేశ్వరు నారాధించెదరో వారు కర్మయోగు లనబడుదురు. అట్టి నిష్కామకర్మానుష్ఠానమువలననే యాత్మను తెలిసుకొని తీవ్రేచ్ఛ కలవారై వేదాంతశ్రవణమునందు ప్రవర్తించెదరు. అనంతరము ప్రమాణగతాసంభావనము నివర్తింపమిచే ఆత్మవస్తువుయొక్క మననమునందు ప్రవర్తించెదరు. ఇట్టివారికి ప్రమాణగతాసంభావనయు, తదధీన మగు ప్రమేయగతాసంభావనయు నివర్తించును. ఇట్టివారు సాంఖ్యు లనబడుదురు. తన్నివృత్త్యనంతరము దేహాద్యాత్మబుద్ధిరూప మగు విపరీతభావన నివర్తించుటకై విజాతీయప్రత్యయతిరస్కారపూర్వకసజాతీయప్రత్యయప్రవాహీకరణరూప మగు నిదిధ్యాసనమును జేయుటకై ప్రవర్తించెదరు. ఆనిదిధ్యాసనము పరిపక్వమైనతరువాత బుద్ధివృత్తియందు పరమేశ్వరుని చూచెదరు. అట్టివారు ధ్యానయోగు లనబడుదురు. ఎవరు కర్మ, సాంఖ్యములయందు నిష్ణాతులో అట్టివారు "ధ్యానేనాత్మని పశ్యంతి ఆత్మానం" ధ్యానముచే దేహమునందే పరమేశ్వరుని బుద్ధిచే జూచెదరు. ఇతరు లన్ననో విచారాత్మక మగు యోగముచే ధ్యానద్వారా చూచెదరు. మరికొందరు నిష్కామ కర్మయోగముచే ధ్యానద్వారా చూచెదరు. ఈవిధముగ పైసాధనత్రయమునకు సముచ్చయమేగాని వికల్పము గాదు. అనగా అధికారభేదముచే సాధకులు ఆయాసాధనము నవలంబించెదరుగాని వికల్పముచే నేదో యొక్కటియే ప్రాధాన్యతగల సాధనము గాదు. కాన వికల్పము గాదని యాశయము. ॥౨౪॥

—• ౧౩ వ అధ్యాయము ౨౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మందతరులకు జ్ఞానసాధనమును 'అన్యే' అను శ్లోకముచే జెప్పుచుండెను.—

శాంకరభాష్యమ్:—

స్సన్తశ్చిన్తయన్తి తేఽపి చాతితరన్త్యేవాతిక్రామన్త్యేవ మృత్యుం మృత్యుయుక్తం సంసార మిత్యేతత్। శ్రుతిపరాయణాః శ్రుతిః శ్రవణం పర మయనం గమనం మోక్షమార్గప్రవృత్తౌ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

బడినవారై, శ్రద్ధకలవారై, యుపాసించుచుండిరి. అట్టివారుకూడ శ్రవణమే యుత్కృష్ట మైన మోక్షసాధనముగాకలవారై మృత్యుయుక్తమైన సంసారమును అతిక్రమించు చుండిరి. (దాటుచుండిరి.) కేవలము పరోపదేశమే ప్రమాణముగా కలవారై, స్వయ

కొందరు మన్దతరులు (ఈశ్లోకమునందు గల "తు" అను శబ్దము పూర్వమునందు చెప్పబడిన ఉత్తమ మధ్యమాధమాధికారుల కంటె భిన్నులగు "అన్యే" అను శబ్దముచే చెప్పబడు మన్దతరులు అని బోధించు చున్నది.) పైనచెప్పబడిన యుపాయములలో నేదోయొక యుపాయముచేనైనను పూర్వోక్తమైన యాత్మను తెలిసికొననివారై పరమదయ కల యాచార్యపురుషులవలన "దీని నిట్లు చింతించుము." అని బోధింపబడినవారై, శ్రద్ధ కలవారై యాత్మ నుపాసించు (చింతించు) చుండిరి. అట్టివారు స్వయముగ నసమర్థులైనను, శ్రద్ధ కల వారగుటచే గురూపదేశశ్రవణపరాయణులై సంసారసాగరమును దాటుచుండిరి. "తేఽపి" అను స్థలమునందు గల "అపి" అను శబ్దస్వారస్యమువలన ఎవరు స్వయముగ విచారసమర్థులో అట్టివారు సంసారసాగరమును దాటుదురని చెప్ప నవసరములేదు. అను యభిప్రాయము సూచితము. ‖౨౫‖

శంకరానందీయము:— ఇట్లు ధ్యానసాంఖ్యయోగములయందు అధికారులగు యతులకు, కర్మయోగమునందు అధికారులైన గృహస్థులగు బ్రాహ్మణాదులకు యథాధికారము మోక్షసాధనము నుపదేశించి, బరమదయాలు డగుటచే శ్రీకృష్ణపరమాత్మ కర్మలయందు నధికారము లేనివారలకుగూడ మోక్షసాధనమును "అన్యే తు" అనుదానిచే నుపదేశించుచుండెను.

కర్మాధికారులగు త్రైవర్ణికులైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకంటె యితరులు కర్మలయం దనధికారులైన కేవలపామరులైన స్త్రీశూద్రాదులు పైన చెప్పబడిన సాధనములలో నేదోయొకసాధనము నైనను యెరుగనివారై శాస్త్రాధ్యయన, తదర్థవిజ్ఞానయోగ్యత లేనివారగుటవలన చెప్పబడిన సాధనములలో నేదోయొక సాధనమును యథావత్తుగ తెలిసికొనుటకు, చేయుటకు అసమర్థులగువారగుటవలన యితరులగు బ్రాహ్మణాదులగు గురువులవలన "నీవు దీని నిట్లు యుపాసింపుము." అని "దీని నిట్లను సంధానము చేయుము." అని తెలిసికొని శ్రద్ధాభక్తులచే శ్రుతార్థపరాయణులై, తదేకపరాయణులై శ్రుతమైన మార్గమును లెస్సగ ననుష్ఠించుచుండిరి. పరోపదేశానువర్తులైన యట్టివారుగూడ యీశ్వరప్రసాద, చిత్తశుద్ధి, తత్ఫలసిద్ధ్యాదిక్రమముచే మృత్యుముఖప్రధానమైన సంసారమును అతిక్రమించుచున్నారు. క్రమముగ ముక్తిని పొందుచున్నారు. అని యర్థము. ‖౨౫‖

నీలకంఠీయము:— ఆత్మదర్శనమునకై మరియొక పద్ధతినిగూడ జెప్పుచున్నాడు— "అన్యే తు" ఊహాపోహానైపుణీరహితులగు కొందరు (ఇట 'తు' అనుదానిచే బూర్వోక్తు లగువారికంటె విలక్షణులు అను అర్థము ప్రాప్తించును.) "ఏవ మజానన్తః" పూర్వోక్తవిధముగ దెలిసికొనినవారై "శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే" ఆచార్యులనుండి తాను నిర్విశేషపరబ్రహ్మరూపుడనియు, అట్టి ఆత్మోపాసనామార్గమును తెలిసికొని యుపాసించెదరు. "తేఽపి చాతితరంత్యేవ మృత్యుం" అట్టివారుగూడ సంసారమును తప్పక దాటుచుండిరి. (ఇట "అపి" శబ్దప్రయోగమువలన పూర్వశ్లోకనిర్దిష్టులు సంసారము దాటుదు రను

గీ॥ యావ త్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజంగమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్త ద్విద్ధి భరతర్షభ! ॥ ॥౨౭॥

పదవిభాగము:— యావత్ - సంజాయతే - కించిత్ - సత్త్వం - స్థావరజంగమం - క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ - తత్ - విద్ధి - భరతర్షభ ॥ ॥౨౭॥

ప్రతిపదార్థము:— యావత్=ఎంత; కించిత్=కొంచమైనను; స్థావరజంగమం=స్థావరజంగమరూపమైన; సత్త్వం=వస్తువు; సంజాయతే=జనించుచున్నదో; హేభరతర్షభ!=ఓభరతవంశశ్రేష్ఠుడా; తత్=ఆవస్తువు; క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్=క్షేత్రక్షేత్రజ్ఞసంయోగమువలన; సంజాయతే=జనించుచున్నదని; విద్ధి=తెలిసికొనుము. ॥౨౭॥

శాంకరభాష్యమ్:—

పరం సాధనం యేషాం తే శ్రుతిపరాయణాః కేవలపరోపదేశప్రమాణాః స్వయం వివేకరహితా ఇత్యభిప్రాయః । కిము వక్తవ్యం ప్రమాణం ప్రతి స్వతంత్రా వివేకినో మృత్యు మతితరంతీత్యభిప్రాయః ॥ ॥౨౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ముగ వివేకరహితులై మృత్యుయుక్తమైన సంసారము నతిక్రమించుచుండి రని యభిప్రాయము. ప్రమాణమునుగూర్చి స్వతంత్రులైన వివేకులు మృత్యురూప మగు సంసారము నతిక్రమించెద రని చెప్పవలయునా? చెప్పనవసరములేదు. అని యభిప్రాయము. ॥౨౫॥

టలో నాశ్చర్యము లేదని సూచితమయ్యెను. మరియు 'ఏవ' శబ్దమువలన నిట్టివారికి ముఖ్యక్రమము లేకున్నను, సంసారమును తరించెదరనుటలో సంశయము లేదని సూచిత మయ్యెను.) కారణ మేమందువా? "శ్రుతి పరాయణాః" అట్టివారు శ్రవణమే మోక్షమునకు సాధనముగా కలవారు. అట్టివారికి ధ్యానమునందు మిక్కుటమగు ప్రవృత్తియుండును గాన వారు చిత్తనైర్మల్యమునకై కర్మ నపేక్షింప నవసరములేదు. ఇక వేదోక్తతత్త్వమునందు దృఢనిశ్చయముండుటవలన శ్రవణమననాపేక్షయు నుండదు. ఇట్టి బ్రహ్మసాక్షాత్కారము సంవాదిభ్రమరూపమని కొందరందురు. మరికొందరు ప్రమాణరూపమే యందురు. ఎట్లన: ఒకానొకడు మణిప్రభను మణిగా దెలిసికొనె ననుకొనుడు. ఆసమయమున నతనికి గల్గిన యాజ్ఞానము భ్రమరూపమేయైనను ఆమణిప్రభాగ్రహణకాలమునవే మణినిగూడ దెలిసుకొను. ఇయ్యదిసంవాదిభ్రమయనబడును.(అనగా ప్రమాజననపర్యవసాయియగు భ్రమ సంవాదిభ్రమ యనబడును.) తత్పదార్థమును మణికి ప్రభాస్థానీయమైన త్వంపదార్థమును తత్పదార్థబుద్ధితో భావించువాడు వ్యవహారమును బట్టి భ్రాంతుడే యగును. అట్లయ్యును అట్టి సాక్షాత్కారసమయమున తదనన్యమగు తత్పదార్థముగూడ (సంవాదిభ్రమన్యాయమున) సాక్షాత్కరించును. ఈవిషయమునే వసిష్ఠులుగూడ "అసత్యే సత్యతా సాధో! శాశ్వతీ పరిదృశ్యతే। శూన్యేన ధ్యానయోగేన శాశ్వతం ప్రాప్యతే పదం॥" (లోకవ్యవహారమున ఏవిశేషములు లేనిది యసత్య మనబడును గాన వ్యవహారరూపమును బట్టి నిర్విశేషబ్రహ్మము అసత్యమగును. అట్టి నిర్విశేషపరబ్రహ్మభావనరూప మగు ధ్యానయోగముగూడ శూన్యమనబడును. అట్లయ్యును అట్టి ధ్యానయోగముచే శాశ్వతమగు సత్యత్వము పొందబడుచున్నది. అని పై వసిష్ఠోక్తికి యర్థము . ॥౨౫॥

శాంకరభాష్యమ్:—

క్షేత్రక్షేత్రజ్ఞైకత్వవిషయం జ్ఞానం మోక్షసాధనం య జ్జ్ఞాత్వాఽమృత మశ్నుత ఇత్యుక్తం త త్కస్మా ద్ధేతో రితి తద్ధేతుప్రదర్శనార్థం శ్లోక ఆరభ్యతే— యావ ద్యత్కించి త్సంజాయతే సముత్పద్యతే సత్త్వం వస్తు కి మవిశేషే ణేత్యాహా స్థావరజంగమం స్థావరం జంగ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

క్షేత్రక్షేత్రజ్ఞైకత్వవిజ్ఞానము మోక్షసాధన మని "య జ్జ్ఞాత్వాఽమృత మశ్నుతే" అనుదానిచే జెప్పబడెను. అది యేకారణమువలన కల్గుచున్నదో తద్ధేతుప్రదర్శనముకొరకై యీశ్లోకము ప్రారంభింపబడుచున్నది.

స్థావరజంగమాత్మకమైన యేయత్కించిద్వస్తువు జనించుచున్నదో ఆవస్తువెల్ల ఓభరత వంశర్షభ! క్షేత్రక్షేత్రజ్ఞసంయోగమువలన జనించుచున్న దని తెలిసికొనుము.

—• ౧౩ వ అధ్యాయము ౨౬ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సంసార మావిద్యక మగుటవలన విద్యచే మోక్ష ముప పన్నమే యను యీయర్థముయొక్క అవధారణ నిమిత్తమై సంసారముయొక్క, తన్నివర్తకజ్ఞానముయొక్క విస్తారము యీయధ్యాయపరిసమాప్తి పర్యంతము చేయబడుచున్నది. అందు "కారణం గుణసంగోఽస్య సద సద్యోనిజన్మసు" అని పూర్వమునందు చెప్పబడిన విషయమునే "యావత్" అను దానిచే వివరించుచుండెను.

స్థావరము కాని, జంగమము కాని యేవస్తువు జనించుచున్నదో అసర్వము "క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్" అవిద్యాతత్కార్యాత్మకము, జడము, అనిర్వచనీయము, సదసత్త్వాత్మకము నగు దృశ్యసమూహము క్షేత్రమన బడును. దానికంటె విలక్షణము, క్షేత్రభాసకము, స్వప్రకాశపరమార్థసచ్చైతన్యము, అసంగోదాసీనము, నిర్ధర్మ కము, అద్వితీయమునగు యాత్మచే క్షేత్రజ్ఞుడు "తయోస్సంయోగః" మాయావశమున ఇతరేతరావివేకము నిమిత్తముగా కల సత్యానృతమిథునీకరణాత్మకమైన మిథ్యాతాదాత్మ్యధ్యాసవలన అనిఖిలజంగమస్థావరాత్మక మైన నిఖిలకార్యసమూహము జనించుచున్నదని ఓభరతర్షభ నీవు తెలిసికొనుము. అందువలన స్వరూపా జ్ఞానమునిబంధనముగా కలది సంసారము. స్వప్నాదులువలె స్వరూపజ్ఞానమువలన నశించుటకు తగినది, అని యాశయము. ॥౨౬॥

శంకరానందీయము:— "ఏత ద్యోనీని భూతాని" అనుదానిచే భూతముల సంసారకార ణము క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపమైన ప్రకృతిద్వయసంబంధ మని పూర్వమునందు చెప్పబడినదానినే మోక్షైక కాములైన పండితులు ప్రకృతిద్వయసంబంధమును ప్రయత్నపూర్వకముగ పరిహరింపవలయు నని సూచించు టకు "యావత్" అను శ్లోకముచే స్పష్టపరచుచుండెను.

స్థావర జంగమస్వరూపములైన యేయేప్రాణులు ముల్లోకములయందు జనించుచున్నవో అసర్వము క్షేత్రక్షేత్రజ్ఞుల సంబంధమువలననే జనించుచున్నది. "యత్కించిత్" అనుటచే అవిశేషము గ్రహింప నగును. (అనగా) దేవమనుష్యాదులయందు సర్వత్ర ఉత్పత్తి సాధారణమే యని సూచించుట కని గ్రహింప నగును. క్షేత్రక్షేత్రజ్ఞస్వరూప మగు ప్రకృతిపురుషుల సంబంధముండినపుడే నిఖిలప్రాణిసమూహము

**శాంకరభాష్యమ్:—**

మం చ క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తజ్జాయత ఇత్యేవం విద్ధి జానీహి హే భరతర్షభ! । కః పున రయం క్షేత్రక్షేత్రజ్ఞయోః సంయోగోఽభిప్రేతః । న తావ ద్రజ్జ్వేవ ఘటస్యావయవసంశ్లేషద్వారకః సమ్బంధవిశేషః సంయోగః క్షేత్రేణ క్షేత్రజ్ఞస్య సంభవ త్యాకాశవ న్నిరవయవత్వాత్ । నాపి సమవాయలక్షణ స్తన్తుపటయో రివ క్షేత్రక్షేత్రజ్ఞయో రితరేతరకార్య

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

ఈ క్షేత్రక్షేత్రజ్ఞసంయోగ మనునది యెట్టిదని యభిప్రేతమందువా?

క్షేత్రజ్ఞునకు క్షేత్రముతో సంయోగసంబంధమా? సమవాయసంబంధమా? క్షేత్రజ్ఞుడాకాశమువలె నిరవయవు డగుటవలన ఘటమునకు త్రాటితోవలె అవయవసంశ్లేషరూపసంబంధవిశేషమగు సంయోగము క్షేత్రముతో క్షేత్రజ్ఞునకు సంభవింపదు. ఇతరేతరకార్యకారణభావానభ్యుపగమమువలన తంతు-పటములకువలె సమవాయసంబంధము సంభవింపదు. ఈయుభయసంబంధములు సంభవింపవు కదా! ఇక క్షేత్రక్షేత్రజ్ఞులకు కల సంబంధ మేమి?

జనించుచున్నది. హద్దులేని జననాదిదుఃఖముల ననుభవించుచున్నది. ప్రకృతిపురుషసంబంధము లేనిచో జననాదిదుఃఖము లేవని ఓ భరతవంశసంభూతుడ వగు యర్జునా! నీవు తెలిసికొనుము.

ప్రకృతిపురుషుల సంబంధ ముండినపుడే జన్మాదిదుఃఖహేతువు లగు అవిద్య, అస్మిత మొదలగునవి విజృంభించును. దానివలన జన్మబీజములైన కర్మలు సంభవించును. ప్రకృతిపురుషసంబంధము లేనిచో జన్మాదిదుఃఖహేతువులగు అవిద్య, అస్మితాదులు ప్రాప్తింపవు. అందువలన మోక్షసుఖమును కోరెడి తత్త్వజ్ఞు లగు యతులు ప్రయత్నపూర్వకముగ ప్రకృతిపురుషసంబంధమును పరిహరింపదగును.

ఏ ప్రకృతిపురుషసంబంధ ముండినచో పురుషునకు సంసారము ప్రాప్తించుచున్నదో, ఏ ప్రకృతిపురుషసంబంధము లేనిచో పురుషునకు సంసారము ప్రాప్తించుటలేదో ఆ ప్రకృతిపురుషసంబంధ మెట్టిది? అని శంకింపజనను. సావయవనిరవయవములకు సంయోగము సంభవింపనందున "నిష్కలం నిష్క్రియం" అని పురుషుడగు యాత్మకు నిష్క్రియత్వము శ్రుతిసిద్ధ మగుటవలన ప్రకృతిపురుషులకు పరస్పరావయవసంశ్లేషనిబంధనమైన సంబంధము సంభవింపనేరదు.

నిరవయవమగు నాకాశమునకు విభుత్వసిద్ధికొరకు "సర్వమూర్తద్రవ్యసంయోగిత్వం విభుత్వం" అను నియమానుసారము సర్వమూర్తద్రవ్యములతో సంయోగమంగీకృతమే. అట్లే నిరవయవమగు పురుషునకు ప్రకృతికి సంయోగ ముండవచ్చునెదవా? అట్లగుచో నాకాశమునకు సావయవత్వము, వర్షవాయ్వాగ్న్యాది సంయోగమువలన క్లేదశోషప్లోషాద్యనర్థమును సంభవించెడిని. సావయవత్వప్రాప్తిచే ననిత్యత్వముగూడ నాకాశమునకు ప్రాప్తించవలసివచ్చును. ఆకాశము సూక్ష్మమగుటవలన స్థూలములతో సంబంధింపదని చెప్పుటయు పొసగదు. సూక్ష్మమైన ఆకాశమునకు జలాదులసూక్ష్మావయవములతో సంయోగమున్నచో పైన చెప్పబడిన యనర్థము ప్రాప్తింపవలసివచ్చును. అందువలన విభువునకు మూర్తద్రవ్యసంయోగిత్వకల్పనము భ్రమ మాత్రమే. మరేమనిన? నిరవయవమగు నాకాశము సర్వమూర్తద్రవ్యవ్యాపక మగుటనే సర్వమూర్తద్రవ్యసంయోగిత్వమునుగ వ్యపదేశించుచుండిరి (చెప్పుచుండిరి). ఆకాశము నిరవయవ మగుటచే

శాంకరభాష్యమ్:—

కారణాభావానభ్యుపగమాదితి । ఉచ్యతే, క్షేత్రక్షేత్రజ్ఞయో ర్విషయవిషయిణో ర్భిన్నస్వభావయో రితరేతరతద్ధర్మాధ్యాసలక్షణః సంయోగః క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపవివేకాభావనిబంధనో రజ్జుశుక్తికాదీనాం తద్వివేకజ్ఞానాభావా దధ్యారోపితసర్పరజతాదిసంయోగవత్ । సోఽయ మధ్యాసస్వరూపః క్షేత్రక్షేత్రజ్ఞసంయోగో మిథ్యాజ్ఞానలక్షణః । యథాశాస్త్రం క్షేత్ర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అనెదవా? చెప్పెదవినుము. విషయవిషయిరూపములు, భిన్నస్వభావములు కల క్షేత్రక్షేత్రజ్ఞులకు ఇతరేతరతద్ధర్మాధ్యాసస్వరూపమైన సంయోగము క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపవివేకాభావనింబంధనమైనది. రజ్జువునకు రజ్జువివేకజ్ఞానాభావమువలన నధ్యారోపితసర్పసంయోగమువలెను, శుక్తికకు తద్వివేకజ్ఞానాభావమువలన నధ్యారోపితరజతసంయోగమువలెను సంభవించును. ఈయధ్యాసరూపమైన క్షేత్రక్షేత్రజ్ఞసంయోగము మిథ్యాజ్ఞానరూపము. శాస్త్రము నతిక్ర

మూర్తసంయోగిత్వము సంభవింపనందున సాక్షాత్తు అవయవసంశ్లేష సంభవింపదు. అట్లే క్షేత్రజ్ఞునకు క్షేత్రముతో సంయోగము సంభవింపదు. క్షేత్రక్షేత్రజ్ఞుల కయుతసిద్ధత్వము లేనందున సమవాయముగూడ సంభవింపదు. (అయుతసిద్ధము లనగ నేరెండింటిలో యొకటి తాను నశించువరకు ఏ రెండవదాని నాశ్రయించి యుండునో ఆరెండును అయుతసిద్ధములు. ఘటకపాలములు రెండింటిలో ఘటము తాను నశించువరకు కపాలముల నాశ్రయించి యుండును కాన ఘటకపాలము లయుతసిద్ధము లనబడును. అట్టి అయుతసిద్ధత్వము క్షేత్రక్షేత్రజ్ఞులకు లేనందున ఘటకపాలములువలె క్షేత్రక్షేత్రజ్ఞులకు సమవాయము సంభవింపదు. సంయోగసమవాయములు సంభవింపనిచో వాటికంటె వేరుగ సబంధమే లేనందున క్షేత్రక్షేత్రజ్ఞులకు సంశ్లేష సంభవింపదు.

సంయోగ, సమవాయములకంటె వేరుగ సంబంధమే లేదు. సంయోగ, సమవాయములు పురుషుడు నిరవయవ మగుటవలన ప్రకృతిపురుషులు అయుతసిద్ధములు కానందున సంభవించనందున ప్రకృతిపురుషుల కిక నేసంబంధము కలద నెదవా? చెప్పెదవినుము. యుష్మదస్మత్ప్రత్యయార్థములు, విషయవిషయులు, పరస్పరవిరుద్ధస్వభావముకల విపరీతగృహీతులు నగు ప్రకృతిపురుషులకు శుక్తిరూప్యములకువలె తద్వివేకజ్ఞానాభావనిబంధనమైన అన్యోన్యమునం ధన్యోన్యధర్మాధ్యాసయే సంబంధము. ఇట్టి యధ్యాస అనాదిసంస్కారజన్యము. తత్స్వరూపాజ్ఞానము కారణముగా కలది. మిథ్యాజ్ఞానరూపము. ఇట్టి సంబంధమే పురుషునకు సంసారకారణము. ప్రకృతిపురుషుల స్వరూపవివేచనమే సంసారనివృత్తికారణము. ఘటమునకు ఘటద్రష్టకువలె విషయస్వరూపమైన ప్రకృతి, విషయియగు పురుషుడు పరస్పరవిలక్షణులు. ఇట్టి ప్రకృతిపురుషుల స్వరూపములలో ప్రకృతిస్వరూపము జ్ఞేయము, ప్రకాశ్యము, వికారి, అనిత్యము, సావయవము, అనేకము నగుటవలన పురుషుడు జ్ఞాత, ప్రకాశకము, అవికారి, నిత్యము, నిరవయవము, ఏకమునగుటవలన, ప్రకృతిపురుషుల స్వరూపములు పరస్పరము విలక్షణములు. ఇట్లు విలక్షణమైన యీశరీరమే క్షేత్రమనబడును. దీనిని తెలిసికొనువాడే క్షేత్రజ్ఞు డనబడును. కాన "సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితం" "జ్యోతిషామపి తజ్జ్యోతిః" "తమసః పరం" "జ్ఞానం" "హృది సర్వస్య విష్ఠితం" అని చెప్పబడిన రీతిచే క్షేత్రజ్ఞుడు జ్ఞాత యగుటవలన క్షేత్రముకంటె వేరు. ఘటజ్ఞాతవలె ఇత్యాది యుక్తులచే తిలతండులములవలె వేరుపరచి క్షేత్రముకంటె విభక్తము, చిదేకరసము నగు క్షేత్రజ్ఞుని "నేనీచిదేకరసమే" అని స్వాత్మచే

గీ॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ ॥౨౭॥

పదవిభాగము:— సమం- సర్వేషు- భూతేషు- తిష్ఠన్తం- పరమేశ్వరమ్- వినశ్యత్సు- అవినశ్యన్తం- యః- పశ్యతి- సః- పశ్యతి ॥ ॥౨౭॥

ప్రతిపదార్థము:— సర్వేషుభూతేషు=బ్రహ్మాదిస్తంబపర్యంత నిఖిలభూతములయందు; సమం=నిర్విశేషముగ; తిష్ఠంతం=ఉండినట్టియు; సర్వేషుభూతేషు=నిఖిల భూతములు; వినశ్యత్సు=నశించుచుండ; అవినశ్యంతం = నశింపనట్టియు; పరమేశ్వరం = పరమేశ్వరుని; యః=ఎవడు; పశ్యతి = తెలిసికొనునో; సః=వాడు; పశ్యతి= తెలిసికొనుచున్నాడు. ॥౨౭॥

శాంకరభాష్యమ్:—

క్షేత్రక్షేత్రజ్ఞలక్షణభేదపరిజ్ఞానపూర్వకం ప్రాగ్దర్శితరూపాత్ క్షేత్రాన్ముంజాదివేషీకాం యథోక్తలక్షణం క్షేత్రజ్ఞం ప్రవిభజ్య న సత్తన్నాసదుచ్యత ఇత్యనేన నిరస్తసర్వోపాధివిశేషం జ్ఞేయం బ్రహ్మ స్వరూపేణ యః పశ్యతి క్షేత్రం చ మాయానిర్మితహస్తిస్వప్నదృష్టవస్తుగన్ధర్వనగరాదివ దసదేవ సదివావభాసత ఇత్యేవం నిశ్చితవిజ్ఞానో యస్తస్య యథోక్తసమ్యగ్దర్శనవిరోధాదపగచ్ఛతి మిథ్యాజ్ఞానం తస్య జన్మహేతో రపగమాత్ । "య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ" ఇత్యనేన విద్వాన్ భూయో నాభిజాయత ఇతి య దుక్తం త దుపపన్నముక్తమ్ ॥ ॥౨౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మింపకుండగ క్షేత్రక్షేత్రజ్ఞలక్షణభేదపరిజ్ఞానపూర్వకముగ పూర్వమునందు చూపబడిన క్షేత్రమునుండి వరిపొట్టనుండివరివెన్నును వలె చెప్పబడినలక్షణము కల క్షేత్రజ్ఞుని వేరుపరచి "న సత్తన్నాసదుచ్యతే" అనుదానిచే నిరస్తసర్వోపాధివిశేషములు కల జ్ఞేయబ్రహ్మస్వరూపునిగ నెవడు తెలిసికొనునో. క్షేత్రము మాయానిర్మిత గజమువలె, స్వప్నదృష్టవస్తువువలె, గంధర్వనగరమువలె యసద్రూపమై సద్రూపమువలె భాసించుచున్న దని యెవడు నిశ్చితవిజ్ఞానము కలవాడగునో, అట్టివానికి యథోక్తసమ్యగ్దర్శనవిరోధమువలన మిథ్యాజ్ఞానము జన్మహేతువు నివృత్తముగుటవలన తొలగును. "య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ" అను దానిచే విద్వాంసుడు తిరిగి జనింపడను విషయ ముపపన్నముగనే చెప్పబడెను. ॥౨౮॥

తెలిసికొని అనంతరము ప్రకృతిని "న సత్తన్నాస దుచ్యతే" అని చెప్పిన విధమున ఆత్మయందు ప్రవిలాపన మొనరించి, తిరిగి ఆభాసరూపముగ ప్రకృతికి తద్ధర్మతత్కార్యములకు అహోరాత్రములయందు సంశ్లేష ప్రాప్తింపకుండగ సదాత్మనిష్ఠయందే యున్న బ్రహ్మవేత్త యగు యతికి దుఃఖహేతువులగు అవిద్యాదిక్లేశాదులు, జన్మాంతరహేతువులగు కర్మలు సంభవింపనేరవు. విదేహకైవల్యము కరస్థమే యగుచున్నది. అందువలన క్షేత్రక్షేత్రజ్ఞులకు సంయోగము ప్రాప్తింపకుండగ బ్రహ్మవేత్తలు బ్రహ్మనిష్ఠచేతనే యుండవలెనని సూచించుటకు శ్రీకృష్ణపరమాత్మ జ్ఞానులకు, అజ్ఞానులకు క్షేత్రక్షేత్రజ్ఞసంయోగము జన్మాదిదుఃఖకారణమని "యావత్సంజాయతే కించిత్" ఇత్యాదికముచే చెప్పెను. కాన నెల్లపుడు సదాత్మస్వరూపముగ నుండవలెనని సిద్ధమగుచున్నది. ॥౨౮॥

శాంకరభాష్యమ్:—

న స భూయోఽభిజాయత ఇతి సమ్యగ్దర్శనఫల మవిద్యాదిసంసారబీజనివృత్తి ద్వారేణ జన్మాభావ ఉక్తః। జన్మకారణం చావిద్యానిమిత్తకః క్షేత్రక్షేత్రజ్ఞసంయోగ ఉక్తః। అత స్తస్యా అవిద్యాయా నివర్తకం సమ్యగ్దర్శన ముక్తమపి పునః శబ్దాన్తరేణో చ్యతే— సమం నిర్విశేషం తిష్ఠన్తం స్థితిం కుర్వన్తం క్వ సర్వేషు భూతేషు బ్రహ్మాదిస్థావ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"న స భూయోఽభిజాయతే" అని సమగ్యగ్దర్శనఫలముగ అవిద్యాదిసంసారబీజనివృత్తి ద్వారమున జన్మాభావము చెప్పబడెను. జన్మకారణమైన అవిద్యానిమిత్తక మగు క్షేత్ర క్షేత్రజ్ఞసంయోగము చెప్పబడెను గాన నట్టి యవిద్యానివర్తక మగు సమ్యగ్దర్శనము పూర్వము చెప్పబడినను తిరిగి శబ్దాంతరముచే జెప్పబడుచుండెను—

బ్రహ్మాది స్తంబపర్యంత నిఖిలప్రాణులయందు నిర్విశేషముగ నుండినట్టియు, నిఖిల భూతములు నశించినను తాను నశించనట్టియు, దేహేంద్రియమనోబుద్ధ్యవ్యక్తాత్మల కంటె

—• ౧౩ వ అధ్యాయము ౨౭ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:—

ఈవిధముగ సంసారము నవిద్యాప్రయుక్తముగా జెప్పి, ఆసంసారనివృత్తికారణమగు విద్యను తెల్పుటకై "యః ఏవం వేత్తి పురుషం" ఇత్యాదికమును పూర్వమున చెప్పినదానినే ఈశ్లోకమున వివరించుచుండెను— "సమం...పశ్యతి" భిన్నధర్మకములగు సర్వ భూతములు (స్థావరజంగమరూపములగు ప్రాణులు) అనేకవివిధజన్మాదిపరిణామశీలములగుటచేతను, గుణప్రధానభావాపత్తిచేతను విషమములైనవి. కనుకనే చంచలములైనవి. కారణమేమన: ప్రతిక్షణము పరిణమించు స్వభావముకల యీభావములు పరిణమింపకుండ నొకక్షణముకూడ నుండజాలవు. కనుకనే పరస్పరబాధ్యబాధకభావము నొందినవియై యుండును. మరియు నివి మాయాగంధర్వనగరాదులవలె దృష్టనష్టస్వభావముకలవి. ఇట్టి భూతములయందు "సమం" అంతటను యొకేరూపుడై, ప్రతిదేహమునందును జన్మాదిపరిణామశూన్యుడై యుండునట్టి పరమేశ్వరుని (ఆత్మను) సర్వజడవర్గమునకు సత్తాస్ఫూర్తిప్రదు డగుటచే బాధ్యబాధకభావశూన్యునిగను, నిఖిలదోషాఽనాస్కందితునిగను, దృష్టనష్టప్రాయమగు సర్వద్వైతప్రపంచము బాధితమయిన బాధితుడు కానట్టివానిగను పైవిధముగ నన్నివిధములుగను జడప్రపంచవిలక్షణునిగ వివేకముతో శాస్త్రచక్షుస్సుచే నెవడు తెలిసికొనునో "యః పశ్యతి స పశ్యతి" అట్టివాడే యాత్మను తెలిసికొనును. నిద్రనుండి మేల్కొన్నవాడు జాగ్రద్బోధచే స్వప్నభ్రమను తొలగించుకొనునట్లు పరమార్థదర్శి ద్వైతప్రపంచభ్రమను తొలగించుకొనును. అజ్ఞాని స్వప్నదర్శివలె భ్రాంతిచే విపరీతముగ జూచువాడై పరమార్థమును జూడనివాడే యగును. కారణమేమన: వానికి గల్గిన భ్రమ యదర్శనరూపమే యగును. రజ్జువును జూచి సర్పముగా భ్రమించినవాడు చూచినవాడుగ భావింపబడడు. అట్టిభ్రమయు అదర్శనరూపమే యగును. ఈవిధముగనే భూతాన్యానుపరక్తశుద్ధచిదాత్మమాత్రసందర్శనముచే తదర్శనరూపమగు యవిద్య నివృత్త మగును. దానివలన నాయవిద్యాకార్యమగు సంసారము నివృత్త మగు నని యభిప్రాయము. ॥౨౭॥

శాంకరభాష్యమ్:—

రాన్తేషు ప్రాణిషు కం పరమేశ్వరం దేహేంద్రియమనోబుద్ధ్యవ్యక్తాత్మనోఽపేక్ష్య పరమేశ్వర స్తం సర్వేషు భూతేషు సమం తిష్ఠన్తమ్। తాని విశినష్టి వినశ్యత్స్వితి। తం చ పరమేశ్వర మవినశ్యన్తమితి భూతానాం పరమేశ్వరస్య చాత్యన్తవైలక్షణ్యప్రదర్శనార్థమ్। కథం సర్వేషాం హి భావవికారాణాం జనిలక్షణో భావవికారో మూలం జన్మోత్తరభావినోఽన్యే సర్వే భావ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పరుడైన యీశ్వరుని ఇట "అవినశ్యన్తం" అని నశించు భూతములకంటె పరమేశ్వరు డత్యంత విలక్షణుడని పరమేశ్వరునకు నశింపనివాడని విశేషణ మీయబడెను. అది యెట్లనిన? "జాయతే, అస్తి, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, నశ్యతి" అనునవి షడ్భావవికారములు. అందు "ఉత్పత్తి" అనుభావవికారము యితర భావవికారములకు మొదలు. ఎందువలననిన? "అస్తి" రూపభావ వికారము మొదలుకొని వినాశాంతమగు భావవికారములు జన్మోత్తరభావులు. అందువలన యితరమైన భావవికారములు జన్మరూపమైన భావవికారము మూలముగా కలవి. వినాశా

శంకరానందీయము:— క్షేత్రక్షేత్రజ్ఞవివేచనము నింతవఱకుండే చేసియున్నను యాక్షేత్ర క్షేత్రజ్ఞ వివేకదార్ఢ్యమునకై యాయానియతవిశేషణములతో తిరిగి యావివేచనము చేయుచు, నీవిధమున వివేచిత మైన యాత్మ నెవడు సాక్షాత్తు తెలిసికొనునో యట్టి యతియే జీవన్ముక్తు డని సూచించుటకై చెప్పుచుండెను— "భవంతీతి భూతాని" జన్మరూపమగు వికారములను బొందునవి గాన బ్రహ్మాదిస్థావరాంత మగునవెల్ల భూతము లనబడును. (ఇట భూతశబ్దప్రయోగముచే భూతములకే భవనధర్మముగాని, యాత్మ కట్టి భవన (జని) ధర్మము లేనందున నిత్యమగు ఆత్మకు జన్మరాహిత్యము, తన్నిబంధితమగు అస్తిత్వము లేదని సూచిత మయ్యెను.) "సర్వేషు భూతేషు" నామరూపజాతిక్రియాగుణవిశేషములచే బరస్పరమువిభక్తములై విషమములగు సర్వప్రాణిశరీరములయందును ఆత్మ (పరమేశ్వరుడు) "సమం" అవిభక్తమై యేకరూపమై (ఉత్కర్షాపకర్ష వర్జితమై) సమరసమై, నిర్విశేషమైనదియు నగును. (ఆత్మయం దారోపితము లగు భూతములయందే నామ రూపజాతిగుణాదికృత మగు విశేషము కన్పట్టునుగాని. యధిష్ఠాన మగు యాత్మయందట్టి విశేష ముండనేరదు. ఏమన: ఆత్మ నిరవయవము, నిర్గుణము నగుట కేవలాత్మకు ఉత్కర్షాపకర్షలు కలుగనేరవు. ("సమం" అని చెప్పుటచే వృద్ధ్యపక్షయరూపములగు భావవికారము లాత్మకు లేవని సూచితమయ్యెను.) మరియు, "తిష్ఠంతం" "క్షర స్సర్వాణి భూతాని" అనున్యాయమున క్షరస్వభావముగల భూతములు ప్రతిక్షణము విపరిణామమును బొందుచుండ, ఆత్మ స్వయముగ నట్టి విపరిణామము లేకుండగ సర్వదా యొకే రూపముతో నుండునది. ఆయా దేహేంద్రియాదులు శైశవ మారభ్య వినిపాతపర్యంతము విపరీతములై యుండ, "అహ మస్మి" అను యాత్మసత్త యెల్లపుడు నొకే విధముగ నుండుటచే నక్షరపరబ్రహ్మము నిరవయవ మగుట నెల్లపు డొకే విధముగ నుండునది యని యర్థము. "అశరీరం శరీరే ష్వనవస్థే ష్వవస్థితం" అను శ్రుతిచొప్పున భూతము లకే విపరిణామముగాని, యాత్మకు లేదని, యాత్మకు విపరిణామాభావము సూచితమయ్యెను. మరియు "వినశ్య త్స్వవినశ్యంతం" పుట్టినవగుటచే భూతములు నశించుచున్నను, యాత్మ స్వయముగ నశించునది కాదు. అనగా పుట్టునది కాదుగాన గిట్టునదియు గాదు. సుషుప్తికాలమున సర్వభూతప్రలయమయినను "సుఖ మహ మస్వాప్సం" (నేను సుఖముగ నిద్రించితిని) అని యాత్మసద్భావము తెలియబడుటచే నాత్మ నిత్య మనుటలో ప్రత్యక్షము ప్రమాణము. "ఆత్మా నిత్యః అజత్వాత్" (ఆత్మ నిత్యము: పుట్టుకలేనిది కాన) అను

శాంకరభాష్యమ్:—

వికారా వినాశాన్తాః । వినాశాత్పరో న కశ్చిదస్తి భావవికారో భావాభావాత్ । సతి హి ధర్మిణి ధర్మా భవన్త్యతోఽన్త్యభావవికారాభావానువాదేన పూర్వభావినః సర్వే భావవికారాః ప్రతిషిద్ధా భవన్తి సహ కార్యైః । తస్మాత్సర్వభూతైర్వైలక్షణ్యమత్యన్తమేవ పరమేశ్వరస్య సిద్ధం నిర్విశేషత్వమేకత్వం చ । య ఏవం యథోక్తం పరమేశ్వరం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నంతరము భావమే లేనందున యేభావవికారము నుండదు. ధర్మి యుండినపుడుకదా ధర్మము లుండుట. అందువలన నత్యంత మగు భావవికార మగు నాశము పరమేశ్వరునకు లేదని చెప్పుటవలన పూర్వభావు లగు నుత్పత్త్యాదిభావవికారములు లేవని చెప్పినట్లే యగును. అందువలన షడ్భావవికారశూన్యమైన పరమేశ్వరునకు షడ్భావవికారములు కల సర్వభూతములతో వైలక్షణ్యము, నిర్విశేషత్వము, ఏకత్వము సిద్ధమగుచున్నది. ఎవడు యథోక్తమైన పరమేశ్వరుని తెలిసికొనునో వాడు పరమేశ్వరుని సాక్షాత్కరింప జేసుకొనుచున్నాడు.

అనుమానము ప్రమాణము. "అవినాశీ వా అరేఽయ మాత్మా" అను శ్రుతియు ప్రమాణము. కనుకనే "పరమేశ్వరం-పరమ" ఆత్మ దేహేంద్రియప్రాణమనోబుద్ధ్యవ్యక్తములకంటె, నిత్యత్వ, అతిసూక్ష్మత్వ, అంతరత్వ, వ్యాపకత్వ, చేతనత్వ, ప్రకాశకత్వ. అధిష్ఠానత్వ, ఆనందత్వరూపహేతువులచే నుత్కృష్టుడు. "ఇంద్రియేభ్యః పరా హ్యర్థా హ్యర్థేభ్యశ్చ" అను శ్రుతియు నీవిషయమునే చెప్పుచున్నది. మరియు "ఈశ్వరం" ఈశనస్వభావుడు. అనగా నినుమునకు అయస్కాంతమువలె నాత్మ స్వసన్నిధిమాత్రముచేతనే ప్రకృతియొక్క ప్రవృత్తికి హేతువగుచున్నది. ఇదియే ఆత్మయందున్న యీశ్వరత్వము. ఇంతియేగాని రాజాదులకుండు నియంతృత్వము గాదు. "నైవ కుర్వన్న కారయన్" అనియు, "స్వభావస్తు ప్రవర్తతే" అను నీవాక్యము లీవిషయమునే నిరూపించినవి. ఈవిధముగ సమత్వ, కూటస్థత్వ, నిత్యత్వ, చేతనత్వాది స్వధర్మములచే విషమత్వ, సవిక్రియత్వ, వినాశిత్వ,జడత్వాదిధర్మములు గల క్షేత్రముకంటె విలక్షణముగనుపలభ్యమానము, నిర్విశేషము, అస్మత్పదప్రత్యయార్థము, ఆత్మరూపము నగు క్షేత్రజ్ఞుని క్షేత్ర, తద్ధర్మ, తత్కర్మలచే నసంస్పృష్టునిగ "యః పశ్యతి స పశ్యతి" ఎవడు తెలిసికొనునో, అనగా శ్రవణ, మనన, నిదిధ్యాసనములను నిత్యము, నిరంతరము సక్రమముగా ననుష్ఠింపగా గల్గిన సమ్యగ్జ్ఞానముచే "నిత్యకూటస్థాసంగచిద్రూపుడనయితిని. గాని యెపుడును సంసారిని కాను" అనితనను సంసారివిలక్షణునిగ నెవడు సాక్షాత్తు తెలిసికొనునో అట్టి బ్రహ్మవేత్త యగు యతి పరమార్థస్వరూపునిగను, కర్తృత్వభోక్తృత్వాదిసర్వసంసారధర్మవర్జితునిగను, సర్వోపాధివినిర్ముక్తునిగను, ఆకాశమువలె నత్యంతనిర్మలునిగను, పరిపూర్ణాత్మస్వరూపునిగను తనను తెలిసికొని సర్వావస్థలయందును సర్వదా తనను ముక్తునిగనే తెలిసికొనును. శ్రవణమాత్రముచే కృతార్థుడుగ తలచువాడు తనను ముక్తునిగా తెలుసుకొననేరడు. (ఈచెప్పుటచే ఘటమఠాదులనేకములైనను వానియందుడు ఆకాశమువలె బ్రహ్మాదిస్తంబపర్యంతశరీరముల యందుండు యాత్మ వ్యాపకము, సమము, అసంగము, నిత్యము, నిష్క్రియము, పూర్ణము నని తెలిసికొని, ప్రారబ్ధానుసారముగ దేహేంద్రియాదులు ప్రవర్తించినను నివర్తించినను తనకు (ఆత్మకు) అప్రవృత్తినివృత్తులు రెండును లేవని యెవడు తెలిసికొని, స్వయముగ నవికారరూపముతో బూర్ణవృత్తితో నుండునో యట్టివాడే జీవన్ముక్తుడని సూచిత మయ్యెను. ॥౨౭॥

గీ॥ సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥ ॥౨౮॥

ప ద వి భా గ ము:— సమం- పశ్యన్- హి- సర్వత్ర- సమవస్థితం- ఈశ్వరం- న- హినస్తి- ఆత్మనా- ఆత్మానం- తతః- యాతి- పరాం- గతిమ్ ॥ ॥౨౮॥

ప్ర తి ప దా ర్థ ము:— హి=ఏ కారణమువలన; సర్వత్ర=అంతటను; సమం=నిర్విశేషముగ; సమవస్థితం=ఉండియున్న; ఈశ్వరం=పరమేశ్వరుని; పశ్యన్=చూచువాడో; తతః=ఆ కారణమువలన; ఆత్మనా=తన చే; ఆత్మానం=తనను; న హినస్తి=హింసించుకొనుటలేదు; పరాంగతిం=మోక్షమును; యాతి=పొందు చున్నాడు. ॥౨౮॥

శాంకరభాష్యమ్:—

పశ్యతి స పశ్యతి । నను సర్వోఽపి లోకః పశ్యతి కిం విశేషణేనేతి? సత్యం, పశ్యతి కిన్తు విపరీతం పశ్యత్యతో విశినష్టి స ఏవ పశ్యతీతి । యథా తిమిరదృష్టి రనేకం చన్ద్రం పశ్యతి త మపేక్ష్యైకచన్ద్రదర్శీ విశిష్యతే స ఏవ పశ్యతీతి తథైవేహాప్యేక మవిభక్తం యథోక్త మాత్మానం యః పశ్యతి స విభక్తానేకాత్మవిపరీతదర్శిభ్యో విశిష్యతే స ఏవ పశ్యతీతి । ఇతరే పశ్యన్తోఽపి న పశ్యన్తి విపరీతదర్శిత్వా దనేకచన్ద్రదర్శివదిత్యర్థః ॥ ॥౨౭॥

యథోక్తస్య సమ్యగ్దర్శనస్య ఫలవచనేన స్తుతిః కర్తవ్యేతి శ్లోక ఆరభ్యతే— సమం పశ్య న్నుపలభమానో హి యస్మా త్సర్వత్ర సర్వభూతేషు సమవస్థితం తుల్యతయాఽవ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అందరును పరమేశ్వరుని చూచుచుండిరి కదా! "స పశ్యతి" అనువిశేషణముచే నేమి ప్రయోజన మనెదవా? అందరును చూచుచుండిరి. సత్యమే. కాని విపరీతముగ జూచుచుండిరి. అందువలన "స ఏవ పశ్యతి" అను విశేషణ మీయబడెను. తిమిరదృష్టికలవాడు చంద్రుని అనేకచంద్రులుగ చూచును. వాని నపేక్షించి చంద్రుడొకడే యని చూచువానికి "స ఏవ పశ్యతి" (వాడే చూచుచున్నాడు) అని విశేషణ మీయబడును. అట్లే ప్రస్తుతమునందు గూడ ఏకము, అవిభక్తుడు నగు పూర్వోక్తమైన యాత్మను యెవడు చూచునో వాడే అనగా విభక్తానేకాత్మ విపరీతదర్శుల కంటె విలక్షణుడని "స ఏవ పశ్యతి" అని విశేషింపబడుచుండెను. ఇతరులు చూచుచుండినను అనేక చంద్రదర్శి వలె విపరీతదర్శులగుటవలన చూడనివారే యగుచున్నారు. ॥౨౭॥

పూర్వోక్తమైన సమ్యగ్దర్శనమును ఫలసంకీర్తనముచే స్తుతింపదగునని "సమం" అను శ్లోక మారంభింపబడుచుండెను.

—॥ ౧౩ వ అధ్యాయము, ౨౮ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ॥—

మ ధు సూ ద న స ర స్వ తీ య ము:— అట్టి పూర్వోక్తమగు ఆత్మజ్ఞానమును ఫలప్రదర్శనపూర్వకముగ స్తుతించుచుండెను:— "సమవస్థితం" జన్మాదిషడ్భావవికారశూన్యముగ లెస్సగనున్న ఈశ్వరుని

శాంకరభాష్యమ్:—

స్థిత మీశ్వర మతీతానన్తరశ్లోకోక్తలక్షణ మిత్యర్థః। సమం పశ్య న్హిం న హినస్తి హింస్తాం న కరో త్యాత్మనా స్వేనైవ స్వ మాత్మానం తత స్తదహింసనా ద్యాతి పరాం ప్రకృష్టాం గతిం మోక్షాఖ్యామ్। నను నైవ కశ్చిత్ప్రాణీ స్వయం స్వ మాత్మానం హినస్తి, కథముచ్య

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సర్వభూతములయందు నిర్విశేషముగ నున్న యీశ్వరుని (అతీతానంతర శ్లోకోక్త లక్షణములు కల యీశ్వరుని) చూచువాడు, సమముగ చూచువాడే యగును. తనచే తనను హింసింపకొనడు. అందువలన మోక్షమనెడి యుత్కృష్ట గతిని పొందుచున్నాడు.

ఏ ప్రాణియు స్వయముగ తనను తాను హింసింపకుండును కదా! తనచే తనకు ప్రాప్తిం పని హింసను "తనను తాను హింసించుకొనడు" అని నిషేధించుట అప్రాప్తప్రతిషేధ యగును.

అని యర్థము. (ఇట్లనుటచే నాత్మ కవినాశిత్వము లభించెను. ఇక శిష్టమగునది పూర్వము వ్యాఖ్యానింప బడెను) ఇట్టి పూర్వోక్తవిశేషణవిశిష్టమైన యాత్మను జూచువాడు (శాస్త్రకృష్టితో సాక్షాత్కరింపజేసు కొనినవాడు) "న హి నస్త్యాత్మ నాఽఽత్మానం" తనచే దనను హింసింపకుండును. లోకమున నజ్ఞుడగు వాడెల్ల వస్తుతః సద్రూపము, ఏకము, అకర్తృభోక్తృపరమానందరూపము నగు తనను (ఆత్మను) సత్య ముగ నుండి భాసించువస్తువు విషయమై "లేదు, భాసించుట లేదు." అను ప్రతీతిని కల్గించుటలో సమర్థమైన యవిద్యచే స్వయముగనే తిరస్కరించుకొనుచు, లేనిదానివలె తలచుచుండును. కాన నామూఢుడు తనను ఈవిధముగ హింసించుచుండును. ఇట్లే యవిద్యచే నాత్మగ దేహాదిసంఘాతమును పరిగ్రహించి, పురాతనమగు తనను (ఆత్మను) హింసించుకొనుచుండెను. కాన రెండు విధములుగను అట్టి మూఢుడు ఆత్మ హంతయే యగుచుండెను. ఈఆత్మహంత విషయమై శకుంతలావచనరూపమగు స్మృతి యిట్లున్నది:—
"యోఽన్యథా సంత మాత్మాన మన్యథా ప్రతిపద్యతే। కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహా రిణా॥" నిర్విశేషబ్రహ్మరూపమైయున్న యాత్మను మరియొకవిధముగ (విక్రియాదిమత్తుగ) నెవడు తెలిసికొనునో అట్టి ఆత్మాపహారి యగువోరుడే పాపము చేయలేదు? అన్ని పాపములు చేసినవాడే యగునని యర్థము. ఈవిషయమై "అసుర్యా నామ తే లోకా అంధేన తమసా వృతాః। తాంస్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే కే చాత్మహనో జనాః॥" అను శ్రుతియు తనను తాను తెలిసికొననివాడు ఆత్మహంత యగునని తెలుపు చున్నది. కాన ఆత్మజ్ఞుడగువాడు శుద్ధాత్మదర్శనముచే ననాత్మయెడ ఆత్మాభిమానమును బాధించుచుం డును. (వీడుచుండును.) అట్లగుట "న...గతిం" స్వరూపోపలబ్ధిచే తాను (ఆత్మను) హింసించుకొనక పరమగతిని పొందుచున్నాడు. ॥౨౮॥

శంకరానందీయము:— బ్రహ్మవేత్తయగు యతి యంతటను పరిపూర్ణమగు ఆత్మను ఒకేరూప మున నెల్లప్పుడు జూచుచుగాన నట్టి నిరంతరదర్శనముచేతనే ముక్తుడగునని తెల్పుచుండెను:— శ్రవణ, మననాదులచే నుత్పన్నమైన విజ్ఞానముచే "ఇదియే నేను" అని అపరోక్షముగా దెలిసుకొనిన యాత్మ తత్త్వము గల యతి "సర్వత్ర సమవస్థితం" బ్రహ్మాదిస్తంబపర్యంతము అగు భూతములయందు లోపలను, వెలుపలను అంతటను (లెస్సగ) ఉత్కర్షాపకర్షరాహిత్యముతో నొకేవిధముగా ఘటమఠాదులయందా కాశమువలె నైరంతర్యముతో వ్యాపించియున్నట్టియు, "సమం" ఏకరసమైనట్టియు, (నిర్విశేషమైనట్టియు)

శాంకరభాష్యమ్:—

తేఽప్రాప్తం న హినస్తీతి। యథా న పృథివ్యా మగ్ని శ్చేతవ్యో నాన్తరిక్ష ఇత్యాది। నైష దోషః, అజ్ఞానామాత్మతిరస్కరణోపపత్తేః। సర్వో హ్యజ్ఞోఽత్యన్తప్రసిద్ధం సాక్షా దపరోక్షా దాత్మానం తిరస్కృత్యానాత్మాన మాత్మత్వేన పరిగృహ్య తమపి ధర్మాధర్మౌ కృత్వోపాత్త మాత్మానం హత్వాఽన్య మాత్మాన ముపాదత్తే నవం తం చైవం హత్వాఽన్య మేవం త

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"న పృథివ్యా మగ్ని శ్చేతవ్యః నాన్తరిక్షే" పృథివియం దగ్నిచయనము చేయరాదు. అంతరిక్షమునం దగ్నిచయనము చేయరాదు. అనుచోట అంతరిక్షమునం దగ్నిచయనము ప్రసక్తమే కానప్పుడు దానిని నిషేధించుట అప్రాప్తప్రతిషేధ మయినట్లు ఇట్టి యప్రాప్తప్రతిషేధ మెట్టుల చెప్పబడెను? అని శంకింపఁబడును. అజ్ఞుల కాత్మతిరస్కారముచే నది యుపపన్నమే. అది యెట్లనిన: ప్రతియజ్ఞానియు యత్యంతప్రసిద్ధము సాక్షాత్తు అపరోక్షస్వరూపము నగు ఆత్మను కప్పిపుచ్చి అనాత్మ నాత్మనుగ పరిగ్రహించి దానినిగూడ ధర్మాధర్మముల నాచరించి స్వీకరింపఁబడిన యాత్మను హింసించి మరియొక యాత్మను గ్రహించుచున్నాడు. నూతనమైనదానిని హింసించి మరియొకదానిని, ఇట్లే దానిని హింసించి మరియొకదానిని

"ఈశ్వరం" మున్నగునటులె స్వస్వరూపముల ప్రవృత్తికి కారణమైనట్టియు "ఆత్మానం" తనను (ఆత్మను) "పశ్యన్" తెలిసికొనినవాడై, "న హినస్త్యాత్మ నాఽఽత్మానం" తనచే తనను హింసించుకొనుటలేదు. (తాను ఆత్మహంత కాకుండెను.) ఇట ఆత్మహననమన: నిష్క్రియము, నిస్సంగము, నిరాకారము, లేపరహితమునగు ఆత్మకు (తనకు) దేహేంద్రియాదితాదాత్మ్యాధ్యాసచే "నేను కర్తను, భోక్తను, సుఖిని, దుఃఖిని, శిష్టుడను, భ్రష్టుడను, సుకృతిని, దుష్కృతిని" అను మొదలగు ననాత్మధర్మములను ఆత్మకు ఆరోపించుకొని యాత్మాఽప్రతీతిని కలుగజేసుకొనుటయే యాత్మహనన మనబడును. తాను స్వయముగ కూటస్థాసంగచిన్మాత్రుడైనను సదానందస్వరూపుడైనను, పై యాత్మహననదోషమున దేహవంతుడై కర్తృత్వభోక్తృత్వాదిధర్మములుకలవాడై, జన్మమృత్యుదుఃఖబహుళ సంసారసాగరమున మునుగుచుండును. కాని నీయాత్మ హననమును కైవల్యార్థియు, బ్రహ్మజ్ఞానియునగు యతి యాచరింపడు. ఇక నేమన: బాహ్యాపాహనాకృతమగు యసత్ప్రవృత్తిని విడచి, యెల్లపుడు నాత్మనిష్ఠతోడనే యుండును. "తతో యాతి పరాం గతిం" పై కారణముచే సదాత్మనిష్ఠచేతనే యజ్ఞాన, తత్కార్యములను తొలగించుకొనినవాడై, నిత్యనిరతిశయానందరూపమగు విదేహకైవల్యమును పొందుచున్నాడు. "బ్రహ్మసంస్థోఽమృతత్వ మేతి" అను శ్రుతియు స్వస్వరూపమునుండి పరిచ్యుతుడుగాని బ్రహ్మనిష్ఠునకే యమృతత్వము సిద్ధించునని బోధించుచున్నది. కాన స్వరూపనిష్ఠయందే సర్వదా యుండు యతికే మోక్షము సిద్ధించునని పర్యవసితము.

లేక, "సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం" అను శ్లోకోక్తరీతిని సర్వభూతములయందు నుత్కర్షాపకర్షరహితముగ అంతటను వ్యాపించియున్న పరమాత్మను తనయందును, అంతటను యేకరసుడై పరిపూర్ణుడయినవానిగ తెలిసికొనునాడు గాన తనను హింసించుకొనడు. (అనగా సమ్యగ్దర్శియైన విద్వాంసుడు మోక్షేచ్ఛతో నెల్లపుడు నంతటను సమదర్శనమును వీడనివాడై "నేను బ్రాహ్మణుడను, శూద్రుడను, శిష్టుడను, భ్రష్టుడను" అనియు, "ఇది శుద్ధమైనది, ఇది శుద్ధము కానిది" అను నీ మొదలగు భేదదర్శనముచే

గీ॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి ॥ ॥౨౯॥

పదవిభాగము:— ప్రకృత్యా- ఏవ- చ- కర్మాణి- క్రియమాణాని- సర్వశః- యః- పశ్యతి- తథా- ఆత్మానం- అకర్తారం- సః- పశ్యతి ॥ ॥౨౯॥

ప్రతిపదార్థము:— ప్రకృత్యైవచ=మహదాది కార్య కారణాకారముగ పరిణమించిన సత్త్వ రజస్తమోగుణాత్మకమగు మాయచేతనే; కర్మాణి=వాఙ్మనః కాయములచే నారంభింపబడు కర్మలను; సర్వశః =సర్వవిధముల; క్రియమాణాని=చేయబడుచున్నవని; యః=ఎవడు; పశ్యతి=తెలుసుకొనుచున్నాడో; తథా= అట్లే; ఆత్మానం=ఆత్మను, క్షేత్రజ్ఞుని; అకర్తారం=సర్వోపాధివివర్జితునిగ; యః=ఎవడు, పశ్యతి=తెలిసి కొనుచున్నాడో; సః=వాడు; పశ్యతి=పరమార్థదర్శి యగుచున్నాడు. ॥౨౯॥

---

శాంకరభాష్యమ్:—

మపి హత్వాఽన్య మిత్యేవ ముపాత్త ముపాత్త మాత్మానం హన్తీత్యాత్మహా సర్వోఽజ్ఞః । యస్తు పరమార్థాత్మాఽసావపి సర్వదాఽవిద్యయా హత ఇవ విద్యమానఫలాభావాదితి సర్వ ఆత్మహన ఏవాఽవిద్వాంసః । య స్త్వితరో యథోక్తాత్మదర్శీ స ఉభయథాఽప్యాత్మానం న హినస్తి తతో యాతి పరాం గతిం యథోక్తం ఫలం తస్య భవతీత్యర్థః ॥ ॥౨౮॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇట్టితీరున గ్రహించబడిన ప్రతియాత్మను హింసించుచున్నాడు. అందువలన నజ్ఞు లందరు ఆత్మహంతలే యగుచున్నారు. ఎవడు ఇదియు పరమార్థమైన యాత్మయే యని విద్యమాన ఫలము లేమింజేసి యెల్లపుడు అవిద్యచే కొట్టబడినవాడువలెనుండునో అట్టి నిఖిలయవిద్వాంసులు ఆత్మహంతలే. ఎవడు యథోక్తమైన యాత్మదర్శియో వాడుభయవిధములుగను తనచే తనను హింసించుకొనడు. అందువలన నట్టివానికి యథోక్తమైన ఫలము (మోక్షము) సంభవించును. ॥౨౮॥

---

బరిపూర్ణాత్మతిరోభావరూప మగు ఆత్మహననమును జేయకుండును. ఇక నేమన: "ఇది. నేను, ఈసర్వము బ్రహ్మమే" అని యంతటను బరిపూర్ణాత్మనే జూచును. అనంతర మట్టి సర్వతాత్మదర్శనముచే నిర్దగ్ధభేదలేశముకలవాడై పరమగతిని పొందుచున్నాడు. పరిపూర్ణాత్మను సర్వదా చూచుచున్నవాడై ముక్తు డగును. కాన ఆత్మతత్త్వమును తెలిసికొన్న విదేహకైవల్యసుఖార్థులు- జన్మాదిదుఃఖహేతువగునట్టియు, శరీరమునందును, తద్ధర్మ, తత్కర్మలయందును "నేను, నాది" యను యధ్యాసను జేయుదగదని సూచిత మయ్యెను. ॥౨౮॥

—• ౧౩ వ అధ్యాయము ౨౯ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:—

శుభాశుభకర్మలను జేయువారై ప్రతిదేహమునందును భిన్నులై యాయావిచిత్రకర్మఫలభోక్త లగుట మచ్చావచభేదము కలుగగా విషములై యనేకాత్మలు కన్పట్టుచుండెను. ఇట్లుండ "సర్వభూతము

శాంకరభాష్యమ్:—

సర్వభూతస్థ మీశం సమం పశ్య న్న హినస్త్యాత్మనాఽఽత్మాన మిత్యుక్తం తదనుపపన్నం స్వగుణకర్మవైలక్షణ్యభేదభిన్నేష్వాత్మ స్వితేత్యేత దాశంక్యాఽఽహ — ప్రకృత్యా ప్రకృతి ర్భగవతో మాయా త్రిగుణాత్మికా "మాయాం తు ప్రకృతిం విద్యాత్" ఇతి మన్త్ర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సర్వభూతములయందున్న నిర్విశేషమగు పరమేశ్వరుని చూచువాడై, తనచే తనను హింసించుకొనడు అని చెప్పబడెను. ఈచెప్పుట తమ గుణకర్మవైలక్షణ్యభేదముచే భిన్నమైన యాత్మలయం దనుపపన్న మని యాశంకించుకొని "ప్రకృత్యైవ" అని చెప్పుచుండెను—

యందు నేకరసుడై, నిర్విశేషుడై యుండు నేకాత్మను జూచు విద్వాంసుడు ఆత్మచేతను జంపుకొనడు" అని చెప్పుట యెట్లు పొసగును యాశంకమై జెప్పుచుండెను. "కార్యాణి" వాఙ్మనఃకాయములచే నారంభింపబడు కర్మలన్నియు "సర్వశః" అన్నివిధములచేతను, "ప్రకృత్యైవ దేహేంద్రియసంఘాతాకారముగ పరిణమించినదియు, సర్వవికారములకు కారణభూతము, త్రిగుణాత్మికము నగు భగవన్మాయచేతనే "క్రియమాణాని యః పశ్యతి" చేయబడుచున్నవి గాని, సర్వవిక్రియాశూన్యుడగు పురుషునిచే చేయబడుట లేదు. అని యెవడు తెలిసికొనునో, మరియు లిట్టి క్షేత్రముచే నిర్వహింపబడు కర్మలవిషయమై క్షేత్రజ్ఞుడగు తనను అకర్తనుగను, సర్వోపాధివివర్జితునిగను, సంగరహితునిగను, ఏకరసస్వరూపునిగను అంతటను వ్యాపించి పరిపూర్ణుడైనవానిగను. యెవడు తెలిసికొనునో, సపశ్యతి" అట్టివాడు పరమార్థమును (ఆత్మను) చూచుచుండెను. వికారసహిత క్షేత్రము ఆయా విచిత్రకర్మలకు కర్తయగుటచే ప్రతిదేహమునందు భేదము, వైషమ్యము కన్పట్టినను ఆకాశమువలె నిర్విశేషము నకర్తయు నగు ఆత్మ భిన్నము (అనేకము) అనుటలో ప్రమాణమేమియు లేదని యుపపాదింపబడినది. ॥౨౯॥

శంకరానందీయము:— సుఖము, దుఃఖము, వివేకము, అవివేకము, శూరత్వము, భీరుత్వము మొదలగు పరస్పరవిరుద్ధగుణములచేతను, స్వకృతకర్మవిశేషములచేతను, "నేను, నేను" అనెడి ప్రత్యయభేదములచేతను, ప్రతిశరీరమునందును ఆత్మలు విభిన్నములై యుండ బ్రహ్మవిద్యతి సర్వభూతములయందు నొకే యాత్మను సమముగ నెట్లు చూడగల్గును? అను యాశంకమై "విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి కురుతేపి చ" అనియు, "ఏష ద్రష్టా స్ప్రష్టా శ్రోతా కర్తా విజ్ఞానాత్మా పురుషః" అను శ్రుతులు- విజ్ఞానాత్మకే (అంతఃకరణమునకే) కర్మకర్తృత్వమును, ఆయాకర్మలఫలము ననుభవించుటయు వివేకాదిగుణవత్త్వము, ప్రతిశరీరమునందును (నేను, నేను) అను అభిమానకృతమగు భేదమును్ను చెప్పుచున్నవి. ఇంతియేకాని పరమాత్మము, అసఙ్గము, నిరింద్రియము, నిరవయవము, నగుటచే దానికి పైగుణములుగాని, కర్మలుగాని, భేదములుగాని యుపపన్నములు గానేరవు. కాన సర్వకర్మలను ప్రకృతియే జేయుచున్నది. ఆత్మ కట్టి కర్మకర్తృత్వ మేమియు లేదు. కనుక నాత్మకు సర్వభూతసమత్వ ముపపన్నమే యని బోధించుచుండెను— 'ప్రకృత్యైవ' దేహేంద్రియమనోబుద్ధ్యాదిరూపముగ పరిణమించిన త్రిగుణాత్మికయగు మాయ ప్రకృతి యనబడును. ఈప్రకృతియే "కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే" అని నిర్వచింపబడెను. ఇట్టి ప్రకృతిచే (ఇట ఏవకారము (అన్యయోగవ్యవచ్ఛేదార్థకము.) "కర్మాణి" శ్రవణ, దర్శన, స్పర్శన, వచన, ఆదాన, విసర్గాదిరూపము లగు కర్మలను (ఇట చకారము ఆకర్మఫలానుభూతిసంగ్రాహకము) అనగా నాయాకర్మఫలానుభూతములను "క్రియమాణాని" చేయబడువాటినిగ "యః పశ్యతి" శ్రుతి, యుక్తి,

శాంకరభాష్యమ్:—

సర్వభూతస్థమీశం సమం పశ్యన్న హినస్త్యాత్మనాఽఽత్మానమిత్యుక్తం తదనుపపన్నం స్వగుణకర్మవైలక్షణ్యభేదభిన్నేష్వాత్మసు ఇత్యేతదాశంక్యాఽఽహ — ప్రకృత్యా ప్రకృతిర్భగవతో మాయా త్రిగుణాత్మికా "మాయాం తు ప్రకృతిం విద్యాత్" ఇతి మన్త్ర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సర్వభూతములయందున్న నిర్విశేషమగు పరమేశ్వరుని చూచువాడై, తనచే తనను హింసించుకొనడు అని చెప్పబడెను. ఈచెప్పుట తమ గుణకర్మవైలక్షణ్యభేదముచే భిన్నమైన యాత్మలయం దనుపపన్నమని యాశంకించుకొని "ప్రకృత్యైవ" అని చెప్పుచుండెను—

యుండు నేకరసుడై, నిర్విశేషుడై యుండు నేకాత్మను జూచు విద్వాంసుడు ఆత్మహంత కాకుండును" అని చెప్పుట యెట్లు పొసగునను యాశంకపై జెప్పుచుండెను. "కార్యాణి" వాఙ్మనఃకాయములచే నారంభింపబడు కర్మలన్నియు "సర్వశః" అన్నివిధములచేతను, "ప్రకృత్యైవ దేహేంద్రియసంఘాతాకారముగ పరిణమించినదియు, సర్వవికారములకు కారణభూతము, త్రిగుణాత్మికము నగు భగవన్మాయచేతనే "క్రియమాణాని యః పశ్యతి" చేయబడుచున్నవి గాని, సర్వవిక్రియాశూన్యుడగు పురుషునిచే చేయబడుట లేదు. అని యెవడు తెలిసికొనునో, మరియు లిఙ్గే క్షేత్రముచే నిర్వహింపబడు కర్మలవిషయమై క్షేత్రజ్ఞుడగు తనను అకర్తనుగను, సర్వోపాధివివర్జితునిగను, సంగరహితునిగను, ఏకరసస్వరూపునిగను అంతటను వ్యాపించి పరిపూర్ణుడైనవానిగను. యెవడు తెలిసికొనునో, సపశ్యతి"" అట్టివాడు పరమార్థమును (ఆత్మను) చూచుచుండెను. వికారసహితక్షేత్రము ఆయా విచిత్రకర్మలకు కర్తయగుటచే ప్రతిదేహమునందు భేదము, వైషమ్యము కన్పట్టినను ఆకాశమువలె నిర్విశేషము నకర్తయు నగు ఆత్మ భిన్నము (అనేకము) అనుటలో ప్రమాణమేమియు లేదని యుపపాదింపబడినది. ॥౨౯॥

శంకరానందీయము:— సుఖము, దుఃఖము, వివేకము, అవివేకము, శూరత్వము, భీరుత్వము మొదలగు పరస్పరవిరుద్ధగుణములచేతను, స్వకృతకర్మవిశేషములచేతను, "నేను, నేను" అనెడి ప్రత్యయభేదములచేతను, ప్రతిశరీరమునందును ఆత్మలు విభిన్నములై యుండ బ్రహ్మవిద్యతి సర్వభూతములయందు నొకే యాత్మను సమముగ నెట్లు చూడగల్గును? అను యాశంకపై "విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి కురుతేపి చ" అనియు, "ఏష ద్రష్టా స్ప్రష్టా శ్రోతా కర్తా విజ్ఞానాత్మా పురుషః" అను శ్రుతులు- విజ్ఞానాత్మకే (అంతఃకరణమునకే) కర్మకర్తృత్వమును, ఆయాకర్మలఫలము ననుభవించుటయు వివేకాదిగుణవత్త్వము, ప్రతిశరీరమునందును (నేను, నేను) అను అభిమానకృతమగు భేదమును చెప్పుచున్నవి. ఇంతియేకాని పరమాత్మము, అమనస్కము, నిరింద్రియము, నిరవయవము, నగుటచే దానికి పైగుణములుగాని, కర్మలుగాని, భేదములుగాని యుపపన్నములు గానేరవు. కాన సర్వకర్మలను ప్రకృతియే జేయుచున్నది. ఆత్మకట్టి కర్మకర్తృత్వ మేమియు లేదు. కనుక నాత్మకు సర్వభూతసమత్వ ముపపన్నమే యని బోధించుచుండెను— 'ప్రకృత్యైవ' దేహేంద్రియమనోబుద్ధ్యాదిరూపముగ పరిణమించిన త్రిగుణాత్మికయగు మాయ ప్రకృతి యనబడును. ఈప్రకృతియే "కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే" అని నిర్వచింపబడెను. ఇట్టి ప్రకృతిచే (ఇట ఏవకారము (అన్యయోగవ్యవచ్ఛేదార్థకము.) "కర్మాణి" శ్రవణ, దర్శన, స్పర్శన, వచన, ఆదాన, విసర్గాదిరూపము లగు కర్మలను (ఇట చకారము అకర్మఫలానుభూతిసంగ్రాహకము) అనగా నాయాకర్మఫలానుభూతములను "క్రియమాణాని" చేయబడువాటినిగ "యః పశ్యతి" శ్రుతి, యుక్తి

గీ॥ యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥ ॥౩౦॥

పదవిభాగము:— యదా- భూతపృథగ్భావం- ఏకస్థం- అనుపశ్యతి- తతః- ఏవ- చ- విస్తారం- బ్రహ్మ- సంపద్యతే- తదా ॥ ॥౩౦॥

ప్రతిపదార్థము:— యదా=ఎపుడు; భూతపృథగ్భావం- భూత=భూతములయొక్క; పృథగ్భావం=పృథక్త్వమును; ఏకస్థం=ఒకయాత్మయందే యున్నదానినిగ; అనుపశ్యతి=ఈనిఖిలజగత్తు ఆత్మయే యని తెలిసికొననో; తతఏవచ=ఆయాత్మవలననే; విస్తారం=ఉత్పత్తిని; యదా=ఎప్పుడు; పశ్యతి=చూచునో; తదా=అపుడు; బ్రహ్మసంపద్యతే=బ్రహ్మస్వరూపమే యగుచున్నాడు. ॥౩౦॥

శాంకరభాష్యమ్:—

సర్వా త్రయా ప్రకృత్యైవ చ నాన్యేన మహదాదికార్యకరణాకారపరిణతయా కర్మాణి వాఙ్మనఃకాయారభ్యాణి క్రియమాణాని నిర్వర్త్యమానాని సర్వశః సర్వప్రకారై ర్యః పశ్య త్యుపలభతే తథాఽఽత్మానం క్షేత్రజ్ఞ మకర్తారం సర్వోపాధివివర్జితం పశ్యతి స పరమార్థదర్శీ త్యభిప్రాయః । నిర్గుణ స్యాకర్తు ర్నిర్విశేషస్యాఽఽకాశస్యేవ భేదే ప్రమాణానుపపత్తి రిత్యర్థః ॥ ॥౨౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రకృతి యనగ సత్త్వరజస్తమోగుణాత్మికమైన పరమేశ్వరునియొక్క మాయ. "మాయాం తు ప్రకృతిం విద్యాత్" అను మంత్రవర్ణ మిమాయనే బోధించుచున్నది. మహదాదికార్యకారణాకారముగ పరిణతమైన యామాయచేతనే సర్వవిధములు వాఙ్మనఃకాయములచే నాచరింపబడు కర్మలు చేయబడుచున్నవాటినిగ నెవడు తెలిసికొనునో, అట్లే క్షేత్రజ్ఞుని సర్వోపాధివివర్జితునిగ తెలిసికొనునో వాడు పరమార్థమును తెలిసికొనినవా డని యర్థము. నిర్గుణము, అకర్త, నిర్విశేషము నగు నాత్మకు ఆకాశమునకువలె భేదమునందు ప్రమాణము లేదు. అని యర్థము. ॥౨౯॥

అనుభవములచే ననాత్మయగు ప్రకృతియొక్కయు, నాత్మరూపుడగు పురుషునియొక్కయు స్వరూపమును నిరుక్తవిధముగ తెలిసికొనునో, అనగా లెస్సగ వివేచనముజేసి యనాత్మ (ప్రకృతి) నుండి యాత్మస్వరూపమును ముంజమునుండి యిషీకమునువలె వేరుపరచి సాక్షాత్కరింపజేసుకొని యెల్లపుడు స్వస్వరూపముతో నుండు బ్రహ్మవేత్తయగు యతి "తననుండి యవిభక్తమగు ప్రకృతిచేతనే సర్వకార్యములు చేయబడుచున్న వని తెలిసికొనును. ఆప్రకృతిచే చేయబడు ఆయాకర్మఫలానుభూతియు నాతనికి యుపలబ్ధమగును. ఇట్టి యాత్మానాత్మవివేకజ్ఞానశక్తిచే సర్వచేష్టలను, తత్ఫలానుభూతులను ప్రకృతికర్తృకములుగను, అట్లే తనను (ఆత్మను) అకర్తనుగను, అభోక్తనుగను, నిష్క్రియునిగను, నిత్యకూటస్థునిగను యేయతి సాక్షాత్ తెలిసికొనునో, అట్టివాడే స్వానుభవముచే బ్రహ్మాదిస్తంబపర్యంతసర్వభూతములయందు నంతటను తనను (ఆత్మను) అకర్తృ, అభోక్తృ, సర్వోపాధివినిర్ముక్త, ఏకరసస్వరూపునిగనే తెలిసికొనును. కాన నాతడు పరమగతిని పొందును. ॥౨౯॥

శాంకరభాష్యమ్:—

పునరపి తదేవ సమ్యగ్దర్శనం శబ్దాన్తరేణ ప్రపంచయతి — యదా యస్మిన్కాలే భూతపృథగ్భావం భూతానాం పృథగ్భావం పృథక్త్వ మేకస్థ మేకస్మిన్నాత్మని స్థిత మేకస్థ మనుపశ్యతి శాస్త్రాచార్యోపదేశతో మత్వాఽఽత్మప్రత్యక్షత్వేన పశ్యత్యాత్మైవేదం సర్వ మితి। తత ఏవ చ తస్మా దేవ చ విస్తార ముత్పత్తిం వికాస మాత్మతః ప్రాణ ఆత్మత ఆశా ఆత్మతః స్మర ఆత్మత ఆకాశ ఆత్మత స్తేజ ఆత్మత ఆప ఆత్మత ఆవిర్భావతిరోభావా వాత్మతోఽన్న మిత్యేవమాదిప్రకారై ర్విస్తారం యదా పశ్యతి బ్రహ్మ సంపద్యతే బ్రహ్మైవ భవతి తదా తస్మిన్కాల ఇత్యర్థః॥ ॥३०॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

తిరిగి యాసమ్యగ్దర్శనమునే శబ్దాంతరముచే స్తుతించుచుండెను—

ఏకాలమునందు భూతముల పృథక్త్వమును యాత్మయందున్నదానినిగ శాస్త్రాచార్యోపదేశమువలన తలచి యాత్మను ప్రత్యక్షముగ "ఆత్మైవేదం సర్వం" అని తెలిసికొనునో, అయాత్మవలననే ప్రాణము, ఆత్మవలననే ఆశలు, ఆత్మవలననే స్మరుడు, ఆత్మవలననే ఆకాశము, ఆత్మవలననే తేజస్సు, ఆత్మవలననే జలము, ఆత్మవలననే ఆవిర్భావతిరోభావములు, ఆత్మవలననే యన్నము ఇత్యాదిప్రకారములచే విస్తారమును ఎపుడు తెలిసికొనునో అట్టి సమయమున బ్రహ్మమే యగుచున్నాడు. ॥३०॥

—• ౧౩ వ అధ్యాయము ३० వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈవిధముగ ఆపాతతః క్షేత్రభేదదర్శనము నంగీకరించి, క్షేత్రజ్ఞభేద దర్శనము నిరాకరింపబడెను. ఇక ప్రస్తుతము మాయిక మగుటచే క్షేత్రభేదదర్శనముగూడ యథార్థము గాదని నిరాకరించుచుండెను:— "యదా...... అనుపశ్యతి" ఏకాలమునందు స్థావరజంగమరూపములగు సర్వభూతములయొక్క పరస్పరభిన్నత్వమును "ఏకస్థం" సద్రూపమైన యాత్మయందే కల్పితమైనదానిగ (అనగా కల్పితమగునది యెల్ల యధిష్ఠానమునకంటె యతిరిక్తము గానందున సద్రూపాత్మస్వరూపముకంటె వేరుగ లేనిదానిగ) "అనుపశ్యతి" శాస్త్రాచార్యోపదేశము ననుసరించి "ఇది యంతయు నాత్మస్వరూపమే" అని బ్రహ్మజ్ఞాని యాలోచించునో, అట్లయ్యును మాయావశమున "తత ఏవ చ విస్తారం" ఒక యాత్మనుండియే యీభూతముల విస్తారమును, పృథగ్భావమునుగూడ స్వప్నమాయాదికమునువలె జూచునో "బ్రహ్మ సంపద్యతే తదా" అట్టి సమయమున సజాతీయవిజాతీయభేదదర్శన ముండదుగాన సర్వానర్థశూన్య మగు బ్రహ్మమే సంపన్న మగును. "యస్మిన్ సర్వాణి భూతా న్యాత్మైవా భూ ద్విజానతః। తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః" అను శ్రుత్యుక్తరీతిని "ప్రకృత్యైవ చ" అనుస్థలమునం దాత్మభేదము నిరాకృతము. "యదా భూతపృథగ్భావం" అనుస్థలమునందన్నో యనాత్మభేదముగూడ నిరాకరింపబడెను. ॥३०॥

శంకరానందీయము:— "సమం సర్వేషు భూతేషు" అను గీతోక్తరీతిని భూతములకు నాత్మకు ఆధారాధేయభావము తెలియబడుచుండ ద్వైతమే సిద్ధ మగుచున్నది. ఇట్టి ద్వైతదర్శికి "తతో యాతి పరాం గతిమ్" అనువిధమున కైవల్యసిద్ధి యెట్లు చెప్పబడుచున్నది? అను శంకపై అట్లు కాదని చెప్పుచుండెను—ఒక క్షేత్రమునకు (పొలమునకు) నలుపైపుల గట్లను కల్పించినపుడు ఆగట్ల మధ్యభాగమునందు భూమి కలదని చెప్పెదము. ఆసేతువులు (గట్లు) ను భూమియందు కల వందుము. ఆలోచించినచో భూమియు, సేతు

గీ॥ అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః ।
శరీరస్థోఽపి కౌన్తేయ! న కరోతి న లిప్యతే ॥ ॥౩౧॥

పదవిభాగము:— అనాదిత్వాత్- నిర్గుణత్వాత్- పరమాత్మా- అయం- అవ్యయః- శరీరస్థః- అపి- కౌన్తేయ!- న- కరోతి- న- లిప్యతే ॥ ॥౩౧॥

ప్రతిపదార్థము:— హేకౌన్తేయ!=ఓకుంతీపుత్రుడవగు నర్జున; అనాదిత్వాత్= కారణరహితుడగుటవలనను; నిర్గుణత్వాత్=గుణరహితుడగుటవలనను, అవ్యయః=నాశరహితుడైన; అయం=ఈ; పరమాత్మా=పరమాత్మ; శరీరస్థోఽపి=శరీరమునం దుండినవాడైనను; న కరోతి=చేయుటలేదు; నలిప్యతే=లేపమును పొందుటలేదు. ॥౩౧॥

శాంకరభాష్యమ్:—

ఏక స్యాఽఽత్మనః సర్వదేహాత్మత్వే తద్దోషసంబంధే ప్రాప్త ఇద ముచ్యతే—అనాదిత్వా దనాదే ర్భావోఽనాదిత్వ మాదిః కారణం త ద్యస్య నాస్తి త దనాది । య ద్ధ్యాదిమ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఒక్క యాత్మయే సర్వదేహముల కాత్మ యగుచో దేహాదిగతమైన కర్తృత్వాదికముచే పవిత్రమైన పంచగవ్యాదులకు అపవిత్రవస్తుసంబంధమువలన నపవిత్రత్వము ప్రాప్తించి

వులును అన్నియు మృత్స్వరూపమే. ఇట్లే కల్పితము లగు భూతములయం దాత్మ యున్నది. భూతములును ఆత్మయందున్నవి. శ్రుతియుక్తులచే విచారించినచో నీసర్వము ఆత్మస్వరూపమే. కాన యాత్మవ్యతిరిక్త వస్తువే లేనందున యాత్మైకత్వదర్శనము విద్వాంసునకు (బ్రహ్మజ్ఞానికి) సంభవించును. అందుచే బ్రహ్మసంపత్తియు జేకూరును. అని యీశ్లోకమున చెప్పబడినదైను-నిత్యనిరంతరసమాధినిష్ఠచే నిర్మూలితమైన ద్వైతప్రత్యయములు కల బ్రహ్మవేత్త యగు యతి "యదా" ఏకాలమున "భూతపృథగ్భావం" ఆకాశాది భూతములయొక్కయు, భూతకార్యములయొక్కయు, పృథక్త్వమును (వేర్వేరు పదార్థములుగ భాసించు జ్ఞానములో విషయమగుటను) "ఏకస్థం" ఒకే యాత్మయందు గల్పితమైన దానినిగ (అనగ శుభ్రవస్త్రమునందు చిత్రమువలె, దారువునందు గజమువలె ప్రతీయమానమైనను, ఆత్మసత్తావ్యతిరేకముగ బృథక్సత్త లేనందున ఆత్మమాత్రముగనే "అనుపశ్యతి" శ్రుతిచేతను, ఆచార్యోపదేశమువలనను కల్గిన జ్ఞానముచే నీసర్వము నాత్మనుగనే చూచునో, (అధిష్ఠానమునం దారోపితమైన ప్రకృతిని, తత్కార్యములను సర్వమును స్వస్వరూపమైన యాత్మయందు సద్వృత్తిచే బ్రవిలాపన మొనర్చి యద్వితీయాత్మనే జూచునో) "తత ఏవ చ విస్తారం" దేనినుండి యేది పుట్టునో యదియెల్ల యా కారణస్వరూపమే యను న్యాయమున ప్రతీతిదశయందు గూడ ప్రపంచము ఆత్మస్వరూపమే యగునుగాన "తస్మాత్త త్సర్వ మభవత్" అను శ్రుత్యుక్తరీతిని యాత్మనుండియే ద్వైతప్రపంచము స్ఫురించు చున్నదనియు తెలిసికొనునో, (అనగా మృత్తునుండి జనించిన ఘటము మృత్స్వరూపమే యగుట యనుభవసిద్ధము. అట్లే యాత్మనుండి యుత్పన్నమైన యీభూతవిస్తారము ప్రతీతిదశయందుగూడ నాత్మసత్తావ్యతిరేకముగ స్వతస్సత్తలేనిది గాన సర్వము నాత్మగనే చూచునో, "ఈసర్వము నేనే" యని సర్వమును తననుగనే జూచునో) "తదా" నూర్యోదయ-తమోఽపగమము లొకేకాలమున యగుటవలన వాటికి యంతరాలకాలము లేనట్లే బ్రహ్మజ్ఞాన- తత్ఫలములకు మధ్య నంతరాలకాలము లేనందున ఏక్షణమున సర్వము నాత్మనుగ తెలిసికొనునో అక్షణమునందే "బ్రహ్మసంపద్యతే" బ్రహ్మభావము నొందుచున్నాడు. (తనకు ఉపాధికృతమగు పరిచ్ఛేదము లేకుండగ బూర్ణుడుగ నుండుటయే బ్రహ్మభావము. అట్టి బ్రహ్మభావము నొందగలడని యర్థము.) ॥౩౦॥

శాంకరభాష్యమ్:—

త్స్వేనాఽఽత్మనా వ్యేత్యయం త్వనాదిత్వా న్నిరవయవ ఇతి కృత్వా న వ్యేతి । తథా నిర్గుణత్వా త్సగుణో హి గుణవ్యయా ద్వ్యేత్యయం తు నిర్గుణత్వా న్న వ్యేతీతి పరమాత్మాఽయ మవ్యయో నాస్య వ్యయో విద్యత ఇ త్యవ్యయః । యత ఏవ మతః శరీరస్థోఽపి శరీరే ష్వాత్మన ఉపలబ్ధి ర్భవతీతి శరీరస్థ ఉచ్యతే తథాఽపి న కరోతి । తదకరణా దేవ తత్ఫలేన న

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నటుల ఆత్మకు శరీరదోషసంబంధము ప్రాప్తించును. అను శంకపై యీశ్లోకము చెప్పబడెను—

ఆది యనగ కారణము. కారణము లేనిది అనాది యని యనబడు. దాని ధర్మము అనాదిత్వము. ఈపరమాత్మ అనాది యగుటవలన, ఏది యాది కలదో అది స్వస్వరూపముచేత నశించును. ఈపరమాత్మ అనాది యగుటవలన నిరవయవము. అందువలన నశింపదు. అట్లే "నిర్గుణత్వాత్" గుణము కలది గుణవ్యయమునుబట్టి నశించును. ఈపరమాత్మయన్ననో నిర్గుణ

—• ౧౩ వ అధ్యాయము ౩౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఆత్మ స్వతః అకర్తయైనను, దానికి శరీరసంబంధోపాధికముగ కర్తృత్వ ముండరాదా? అను యాశంకను తొలగించుచు "యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి" అనుదానిని వివరించుచుండెను:— "అయం పరమాత్మా" ఈయపరోక్షుడు, పరమేశ్వరాభిన్నుడు నగు ప్రత్యగాత్మ "అవ్యయః, న వ్యేతీత్యవ్యయః" వ్యయరహితుడు. అనగా సర్వవికారశూన్యుడు. ఇట నీవ్యయము రెండు విధములుగ నిర్వచింపదగును. ఉత్పత్తి కలది వ్యయ మగును. ధర్మిస్వరూపమే ఉత్పత్తికలదగుటచే దానికి కల్గు వ్యయము మొదటిది. ఇక ధర్మిస్వరూపమునకు ఉత్పత్తి లేకున్నను ధర్మముల యుత్పత్తిచే నగు ధర్మియొక్క వ్యయము రెండవది. అందు ప్రథమవ్యయము ఆత్మకు లేదని చెప్పుచుండెను— "అనాదిత్వాత్" ప్రాక్కాలాఽసత్త్వావస్థ ఆది యనబడును. సద్రూపమగు పరమాత్మ అట్టి ఆదిమత్త్వము లేనిది. అట్టి ఆదిమత్త్వరూపకారణము లేనందున యాత్మకు జన్మయు లేదు. ఆత్మకు జన్మము లేనందున జన్మోత్తరభావు లగు భావవికారములు సంభవింపనేరవు. కాన ఆత్మ స్వరూపముచే వ్యయము నొందునది కాదు. ఇక రెండవ వ్యయస్వరూపమును నిరసించుచుండెను— "నిర్గుణత్వాత్" ఆత్మ నిర్ధర్మమని యర్థము. ధర్మ ధర్ములకు తాదాత్మ్యమే సంబంధము గాన ధర్మిని విక్రియ కలదానినిగ జేయకుండగ నేధర్మము రాక, పోకలు కలది కానేరదు. ఇక నీయాత్మ యేధర్మములు లేనిదిగాన ధర్మద్వారమునగూడ వ్యయము నొందకుండును. "అవినాశీ వా అరేఽయ మాత్మాఽనుచ్ఛిత్తిధర్మా" అను శ్రుతియు పైవిషయమునే చెప్పుచున్నది. "జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, వినశ్యతి" (పుట్టుట, ఉండుట, వృద్ధినొందుట, విపరిణామము నొందుట, క్షీణించుట. నశించుట) అను షడ్భావవికారములు లేనిదిగాన యాత్మ "శరీర... లిప్యతే" అధ్యాసికసంబంధముతో శరీరమునందున్నను ఆశరీరము చేయుచుండ నేమియు చేయక నుండును. అధ్యాసికసంబంధముతో సూర్యుడు జలమునందు ప్రతిబింబరూపమున నున్నను, ఆజలము చలించుచుండ సూర్యుడు చలింపకుండును. అనునది ఇట దృష్టాంతముగ జూడదగును. పైవిధముగ ఆత్మ యేకర్మను జేయక నుండును. కనుకనే యెట్టి కర్మఫలముచేతను లేపమును పొందకుండును. ఎవడు యేకర్మను చేయునో యాతడు ఆ కర్మఫలముచే లేపము నొందును. ఇది లోకానుభవసిద్ధము. ఈయాత్మ యేకర్మను చేయడుగాన నీతనికి ఏకర్మ

శాంకరభాష్యమ్:—

లిప్యతే । యో హి కర్తా స కర్మఫలేన లిప్యతేఽయం త్వకర్తాఽతో న ఫలేన లిప్యత ఇత్యర్థః । కః పున ర్దేహేషు కరోతి లిప్యతే చ యది తావ దన్యః పరమాత్మనో దేహీ కరోతి లిప్యతే చ తత ఇద మనుపపన్న ముక్తం క్షేత్రజ్ఞేశ్వరైకత్వం క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధీత్యాది । అథ నాస్తీశ్వరా దన్యో దేహీ కః కరోతి లిప్యతే చేతి వాచ్యం పరో వా నాస్తీతి । సర్వథా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మగుటవలన నశింపనిది. కాన నీపరమాత్మ అవ్యయ మనబడును. అందువలన శరీరముల యందాత్మ యొక్క యుపలబ్ధి సంభవించును. కాన నాత్మ శరీరస్థు డనబడును. అట్టివాడైనను దేనిని చేయువాడు కాడు. దేనిని చేయువాడు కానందుననే యాకర్మఫలముచే లేపమును పొందుటలేదు. ఎవడు కర్తయో వాడు కర్మఫలముచే లేపమును పొందుచున్నాడు. ఈయాత్మ యన్ననో యకర్త. అందువలన ఫలముచే లేపమును పొందుటలేదు. (అట్లగుచో) ఎవడు దేహములయందుండి చేయుచున్నాడు? లేపమునుపొందుచున్నాడు? అనుశంక పైపరమాత్మకంటె వేరుగ నుండెడుక దేహి దేహమునం దుండి చేయుచుండెను. అతడే లేపమును పొందుచుండెను. అని యనినచో "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని చెప్పబడిన క్షేత్రజ్ఞేశ్వరైకత్వ మనుపపన్న మగును. ఈశ్వరునికంటె వేరె దేహి లేడన్నచో ఎవడు చేయుచుండెను? ఎవడు లేపమును

లేప [illegible] యర్థము. ఇచ్ఛ. ద్వేషము, సుఖము, దుఃఖము నివి క్షేత్రధర్మములే యని చెప్పుటచేతను, "ప్రకృత్యైవ [illegible]" అనువానిచే సర్వకర్మలు మాయాకార్యములే యని చెప్పుటచేతను, ఆత్మ దేనికిని కర్త [illegible] లేపమును పొందదనియు స్పష్టము. కనుకనే పరమార్థదర్శులగువారలకు సర్వకర్మత్యాగ [illegible] పని పూర్వము వ్యాఖ్యానించియుంటిమి. ఈచెప్పుటచే-నాత్మ నిర్ధర్మక మని చెప్పుటచే [illegible] స్వగతభేదము నిరాకృతము. "ప్రకృత్యైవ చ కర్మాణి" అను స్థలమున సజాతీయ భేదము నిరాకరింపబడెను. "యదా భూతపృథగ్భావం" అను స్థలమున విజాతీయభేదము నిరాకరింపబడెను. "అనాదిత్వా న్నిర్గుణత్వాత్" అనుసీస్థలమున స్వగతభేదము నిరాకరింపబడెను. కాన ఆత్మ యద్వితీయ బ్రహ్మస్వరూపమే యని సిద్ధించినది.

॥౩౧॥

[illegible]:— "సమం సర్వేషు భూతేషు" అను గీతోక్తరీతిని యాత్మ సర్వభూతములయందు [illegible] వ్యాపించి యున్ననో "నాశ్రయము నశించిన దాని నాశ్రయించిన యాధేయము గూడ నశించును" అను న్యాయమున ఆత్మ కాశ్రయములైన భూతములు నశించుచుండ వాని నాశ్రయించిన యాత్మకూడ నశింపవలసివచ్చును. వాయువు నశించున్నో దార్వాశ్రితమగు యగ్నిగూడ నశించుచున్నదికదా! కాన ఉపాధి నశించినచో నుపహితముగూడ నశించును. మరియు నశ్వము నడచుచుండ నశ్వారూఢుడు గూడ గమనకర్తయే యగును. ఈవిధముగనే ప్రకృతిచే గర్మలు చేయబడుచుండ నాప్రకృతిస్థు డగు ఆత్మకుగూడ నాకర్మకర్తయు, తత్ఫలానుభూతియు సంభవించును. ఇట్లుండ ఆత్మకు నిత్యత్వము, అకర్తృత్వము నెట్లుపపన్నమగును? అని యీవిధముగ సింహావలోకనన్యాయమున పూర్వోక్తశ్లోకద్వయార్థము నాశం కించుకొని, ఆత్మ అజము, నిర్గుణముగాన భూతములు నశించినను నశించునది కాదు. మరియు కూటస్థమగు ఆత్మకు విక్రియ సంభవింపమిగాన కర్తృత్వాదికము గూడ నాత్మకు సంభవింపదు. అని యీశ్లోకమున చెప్పుచుండెను— "అనాదిత్వాత్-న విద్యతే ఆది రుత్పత్తికారణం యస్య సః" అనువ్యుత్పత్తిచే నిమిత్తకార

శాంకరభాష్యమ్:—

దుర్విజ్ఞేయం దుర్వాచ్యం చేతి భగవత్ప్రోక్త మౌపనిషదం దర్శనం పరిత్యక్తం వైశేషికైః సాంఖ్యార్హతబౌద్ధైశ్చ। తత్రాయం పరిహారో భగవతా స్వేనైవోక్తః "స్వభావస్తు ప్రవర్తతే" ఇతి। అవిద్యామాత్రస్వభావో హి కరోతి లిప్యత ఇతి వ్యవహారో భవతి న తు పర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పొందుచున్నాడు? (లేదా) పరమాత్మయైన లేదని చెప్పవలయును. అందువలన సర్వథా దుర్విజ్ఞేయము, దుర్వాచ్యము అని భగవత్ప్రోక్తౌపనిషదదర్శనమును వైశేషికులు, సాంఖ్యులు, అర్హతులు బౌద్ధులు పరిత్యజించిరి. అందువా? ఈవిషయమై పరిహారము శ్రీకృష్ణ పరమాత్మచేతనే "స్వభావస్తు ప్రవర్తతే" అని చెప్పబడెను. అవిద్యామాత్రస్వభావుడై "కరోతి,

ణముగాని, యుపాదానకారణముగాని లేనిది గాన యాత్మ "యనాది" యనబడును. ఈవిషయమునే "న కస్య కశ్చిజ్జనితా నచాధిపః" అనుశ్రుతియు చెప్పుచున్నది. కాని ఆత్మ కారణము లేనివాడు. లేక, "న విద్యతే ఆదిమవికారో యస్య సః" అను వ్యుత్పత్తి ననుసరించి జన్మరూపము భావవికారము ఆదిమవికారము లేనివాడు ఆత్మ యని యర్థము. ఈవిషయమును "అజో నిత్యః" అను శ్రుతి తెల్పుచున్నది. ఆత్మ యుక్త యనాదిమత్త్వముగుటవలన యని పర్యవసితార్థము. సావయవమగునవి యెల్ల యాదిమత్త్వము. అదియు త్రైగుణ్యమెల్ల వికారి యగును. వికారియగు భూతజాతమెల్ల వ్యయము నొందును. (నశించును.) తన కుపాధి యగు భూతజాతము నశించుచున్నను యీయాత్మ నశింపకుండ నున్నది యని యర్థము. "అవినాశీ వా అరే అయ మాత్మా" అను శ్రుతికూడ ఉపాధి నశించినను యాత్మ నశించునది కాదని చెప్పుచున్నది.

"నిర్గుణత్వాత్ గుణేభ్యో నిర్గతః" అను విగ్రహము ననుసరించి యాత్మ సత్త్వాదిగుణములనుండిగాని, లేక శబ్దాదిగుణములనుండిగాని, ఇచ్ఛాదులనుండి నిర్గతుడు (తొలగినవాడు) లేక సాంశకలాకల్పవాచ్యము లగు గుణకార్యములగు ప్రాణాదులు గుణము లనబడును. ఆత్మ ఇట్టి గుణముల నుండి తొలగినవాడు గాన నిర్గుణుడనబడును. అనగా నిరవయవుడని యర్థము. గుణములతో గూడిన భూతగణమెల్ల గుణవ్యయముచేతను వ్యయము నొందును. (నశించును.) ఈయాత్మ నిర్గుణముగుటచే నశించునది కాదు. అనగా నిత్యుడని యర్థము. ఈవిషయమునే "నిత్యో నిత్యానాం" అనుశ్రుతి బోధించుచున్నది.

ఆత్మ యనాది యగుటవలనను, నిర్గుణముగుటచేతను, కారణనాశద్వారమునగాని, గుణనాశద్వారమునగాని, నశింపనిదే యగుగాక. అట్లయ్యును దండాదికముచే ఘటమువలెను, వాయువువలె స్వతఃగాని యాత్మ నశించునదే, యనరాదా? అను యాశంకపై జెప్పుచుండెను.— "పరమాత్మా- పరమ శ్చాసా వాత్మా" అని విగ్రహము. ఇట 'పరమ, ఆత్మ' అను నీరెండును హేతుగర్భితవిశేషణములు. ఆత్మ దేహము వలె ఖడ్గ, అగ్న్యాదులచే నశించునది కాదు. కారణమేమన: యాత్మ పరమము, (ఉత్కృష్టము). దేహ మపర మము. (అనుత్కృష్టము.) ఇట పరమత్వమన: ఆత్మ నిరవయవ మగుటచే శస్త్రాస్త్రముకంటెగూడ నతి సూక్ష్మమగుట, నిరతిశయమహత్త్వము కల్గియుండుట నీరెండును పరమత్వ మనబడును. ఆత్మ యిట్టి పర మగుటవలన నాశయితకవిషయకమగుటచే దండముచే ఘటము నశించునట్లు నశించునది కాదని పర్యవసి తము. ఆత్మస్వస్వరూపముగుటచే వాయువువలె స్వతః నశించునది కాదు. అహంప్రత్యయార్థమగు ప్రత్యక్త్వ మిట యాత్మత్వముగా వివక్షితము. సర్వావస్థలయందు నెల్లపుడు నందరిచేతను "నేను ఉంటిని" అని యాత్మసత్త్వమనుభూయమాన మగుటచే బుద్ధ్యాదిస్థూలాంతములు ప్రతిక్షణము విపరీతభావమును పొందు చున్నను, నిరవయవము, నిరాకారము, నిత్యము, నిష్క్రియము, పరిపూర్ణము నగు నీయాత్మ "శరీరస్థోఽపి" శరీరమునం దున్నను (ఇట: తన మహిమయందే యుండి పరమమహత్త్వము కల్గియున్న యాత్మకు దేహమని

శాంకరభాష్యమ్:—

మార్థత ఏకస్మి న్పరమాత్మని త దస్తి । అత ఏతస్మి న్పరమార్థసాంఖ్యదర్శనే స్థితానాం జ్ఞాననిష్ఠానాం పరమహంసపరివ్రాజకానాం తిరస్కృతావిద్యావ్యవహారాణాం కర్మాధికారో నాస్తీతి తత్ర తత్ర దర్శితం భగవతా ॥ ॥౩౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లిప్యతే'' అను వ్యవహారము కలుగుచున్నది. పరమార్థమున "న కరోతి, న లిప్యతే" అను వ్యవహారము ఒకటగు పరమాత్మయందు లేదు. అందువలన నొకటియగు పరమార్థసాంఖ్యదర్శనము నందుండు జ్ఞాననిష్ఠులగు తిరస్కృతమైన యవిద్యయొక్క వ్యవహారములు కల పరమహంస పరివ్రాజకులకు కర్మాధికారము లేదని యచటచట శ్రీకృష్ణపరమాత్మచే చెప్పబడెను. ॥౩౧॥

కరణము లేకున్నను, శరీరములయం దాత్మోపలబ్ధినిబట్టి యాత్మ శరీరస్థమని చెప్పబడుచున్నది.) బ్రహ్మాది స్తంబపర్యంతములగు శరీరములయందు ఘటాదులయం దాకాశమువలె ఆత్మ యున్నను ఆశరీరములు స్వయముగ ప్రవర్తించుచుండ "న కరోతి" పుణ్యపాపరూపమగు ఏకర్మనుగూడ చేయుటలేదు. ఇక నేమన:- శరీరములయందు బుద్ధితద్వృత్తిసాక్షిగ తూష్ణీంభావముతో నుండును. వాయువుచే వృక్షములు చలించుచుండగ నావృక్షస్థమగు ఆకాశమువలె కొంచెమైనను చలింపక నుండును. కారణ మేమన:- నిరవయవము, పరిపూర్ణము నగుదానికి చలించు స్వభావ ముండదుకదా! "వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠతి" అను శ్రుతియు పైవిషయమునే తెల్పుచున్నది.

"కూటస్థమగు ఆత్మ స్వతః కర్మలను చేయకున్నను దేహమునం దుండుటచే నగు దేహసంయోగము వలన దేహేంద్రియాదికృతములగు కర్మలచే నాత్మకు లేపము కలుగును. "తత్సంయోగీ చ పంచమః" అను స్మృతి పాపకర్తతో నుండుటమాత్రముననే పాపలేపమును తెల్పుచున్నది. అన్యాయము ననుసరించియే యిటగూడ ఆత్మకు పాపలేపము సంభవించు'' నందువా? అట్లు కాదు. పై స్మృతియందు సంయోగిత్వము పాపలేపము నాపాదించుటలో హేతువుగ శ్రూయమాణము చున్నదిగాన పాపకర్తృసంయోగముకలవానికి పాపలేపము సంభవించునుగాని, తదసంయోగియగు దూరవర్తికి పాపలేపము సంభవింపదు. ఈవిధముగనే యిటగూడ ఆత్మ నిరవయవమగుటచే నతిసూక్ష్మము కాన ఆత్మకు దేహేంద్రియాదులతోడను, తత్కృతకర్మలతోడను సంయోగము సంభవింపమి తత్కృతకర్మలేపముగూడ లేదని "న లిప్యతే" దేహ, ఇంద్రియ, తద్వికార, తద్వ్యాపారసాక్షి యగుటవలన అవిక్రియుడగు ఆత్మ స్వయముగ నసంగుడగుట దేహేంద్రియాదికృతకర్మలచే లేపము నొంద దని యర్థము. ॥౩౧॥

నీలకంఠీయము:— ఆత్మకు విభుత్వధర్మపురస్సరముగ కర్తృత్వము నంగీకరింపజనదు కాని ఆయా దేహాద్యవచ్ఛేదరూపముగ నాకర్తృత్వమును చెప్పియే తీరవలయును. అట్లు కానిచో లోకమున నానావిధరచనానిష్పన్నమైన కార్యజాతము కన్పట్టుచున్నది. ఇట్టి యనుభవమునకు విరోధము వాటిల్లును. అను యాశంకపై జెప్పుచున్నాడు— "అయం" సర్వప్రాణులకు నిత్యాపరోక్ష మగు "పరమాత్మా" ఉత్కృష్టములుగాని దేహాదులకంటెను, కోశపంచకముకంటెను వేరగు పరమాత్మ "అవ్యయః" దేశము వలనగాని, కాలమువలనగాని, వస్తువువలనగాని పరిచ్ఛేదమును పొందనివాడు. కారణమేమన: "అనాదిత్వాత్" ఆదిమత్తగు ఆకాశాదికము కాలాదికముచే పరిచ్ఛిన్నమగును. అట్లుకాక అనాదియగుటచే నీపర

గీ॥ యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే ॥ ౩౨॥

పదవిభాగము:— యథా- సర్వగతం- సౌక్ష్మ్యాత్- ఆకాశం- న- ఉపలిప్యతే- సర్వత్ర- అవస్థితః- దేహే- తథా- ఆత్మా- న- ఉపలిప్యతే ॥ ౩౨॥

ప్రతిపదార్థము:— యథా=ఎట్లు; ఆకాశం=ఆకాశము; సర్వగతం=అంతటనుండినను; సౌక్ష్మ్యాత్=సూక్ష్మభావమువలన; నోపలిప్యతే=సంబంధింపబడదో; తథా=అట్లే; ఆత్మా=ఆత్మయు; దేహే=దేహమునందు; సర్వత్ర=అంతటను; అవస్థితః=ఉండినను; నోపలిప్యతే=సంబంధింపబడదు. ॥౩౨॥

శాంకరభాష్యమ్:—

కిమివ న కరోతి లిప్యత ఇత్యత్ర దృష్టాన్తమాహ— యథా సర్వగతం వ్యాప్యపి సత్సౌక్ష్మ్యాత్సూక్ష్మభావా దాకాశం ఖం నోపలిప్యతే న సమ్బధ్యతే సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే ॥ ౩౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆత్మ ఏమియు చేయకుండును. దేనిచేతను సంబంధింపబడదు? అనుటలో దృష్టాంతము

మాత్మ త్రివిధపరిచ్ఛేదరహితము, అనంతముగూడ తప్పక యగునుగాన నాత్మకు కాలముచే పరిచ్ఛేదము లేకుండుట యుక్తమే. అట్లే దేశమువలన పరిచ్ఛిన్నమగునది యవశ్యము నశించునదిగూడ యగును. కాన యనాది యగు ఆత్మకు దేశముచేనైన పరిచ్ఛేదము లేకుండుటగూడ యుక్తమే. ఇటనొక సంశయము కలుగుచున్నది— ఏమన: పరమాణువు ఆద్యంతములు లేదనియ్యును, దేశకృతమైన పరిచ్ఛేదము కలదియే యగుచున్నది. అట్లే యాత్మగూడ పరమాణువువలె దేశకృతమగు పరిచ్ఛేదము కలవాడు కాడా. అను సంశయము కలుగుచున్నది. కాని దశదిగవచ్ఛిన్నమగు ప్రదేశము కల ద్రవ్యమునకు సావయవత్వ… త్వమే సంభవించును. కాన పరమాణువువలె నాత్మకు దేశకృతమగు పరిచ్ఛేదము సంభవించదు. ఇటుకనే సజాతీయ, విజాతీయ, స్వగతభేదములచే నగు పరిచ్ఛేదముగూడ ఆత్మకు లేకుండునుగాక. అట్లయ్యును విచిత్రశక్తియుక్తము, నిత్యనూతనప్రపంచరచనాపటువు, సర్వేశ్వరత్వ, సర్వజ్ఞత్వాదిగుణయుక్తము నగు పరమేశ్వరునకు స్వగతభేదము నవశ్యమంగీకరింపవలసియున్నది. కాన స్వీయశక్తిమాయావచ్ఛిన్నరూపముగ జగత్కర్తృత్వమును, దేహావచ్ఛిన్నరూపముగ నగ్నిహోత్రాదికర్తృత్వమును పరమేశ్వరున కంగీకరింపవలసియున్నదను యాశంకపై జెప్పుచున్నాడు — "నిర్గుణత్వాత్ గుణవత్తగు ఆకాశాదికము సంయోగమునుగాని, వియోగమునుగాని యుపాధిగ స్వీకరించి స్వనిష్ఠమగు శబ్దగుణము నావిష్కరించుచున్నదికాని తనయందు లేని స్పర్శరూప గుణము నేయుపాధిచేతను ప్రకటించుటలేదు. ఇట్లే సర్వగుణహీనమగు ఆత్మ అవచ్ఛేదాలంబనమున్నను తన యందులేని కర్తృత్వాదికము నావిష్కరింపజాలదు. (ఇక శిష్టము సుస్పష్టము.) ॥౩౨॥

—• ౧౩ వ అధ్యాయము, ౩౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఆత్మ శరీరస్థుడైనను తాను స్వయముగ నసంగుడుగాన శరీరకృతకర్మలచే లేపము నొందడని పూర్వశ్లోకమున జెప్పిన విషయమునకు దృష్టాంతము నీశ్లోకమున

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చెప్పుచుండెను. ఎట్లాకాశముసర్వగతమైనను సూక్ష్మభావమువలన దేనిచేతను సంబంధింపబడదో, అట్లే యాత్మయు దేహము నందంతట నుండినను దేనిచేతను సంబంధింపబడదు. ॥౩౨॥

జెప్పుచుండెను:— ఆకాశము సర్వగతమైనను సూక్ష్మమగుటవలన (అసంగస్వభావముకలదగుటచే) పంకాదులచే లేపము నొందుట లేదు. అని దృష్టాంత మీయబడెను. ॥౩౨॥

శంకరానందీయము:— ఉపాధులు స్వప్రారబ్ధానుసారముగ నేవిధముగనైన నుండనిమ్ము. అట్లయ్యును ఆయుపాధులయందుండు ఆత్మ ఔపాధికము లగు ధర్మ, కర్మ, అవస్థాదులచే నేసమయమందైనను, కొంచెమైనను గూడ సంస్పృష్టములు గాకుండగనే యుండుననుదృఢనిశ్చయముతో బ్రహ్మవేత్తలుతమకర్తృత్వభోక్తృత్వాదిభ్రమను వీడి మౌనముతో నెల్లపుడు నాత్మానందరసమునే యనుభవింపదగునని సూచించుటకై శ్రీకృష్ణభగవానులు ఆత్మకు ఉపాధికృతమగు కర్మలేప ముండదని ఉక్తపూర్వమైనదైనను మందప్రజ్ఞులకు కర్తృత్వభోక్తృత్వభ్రమవిచ్ఛేదముకై సదృష్టాంతముగ జెప్పుచుండెను:— "సర్వగతం ఆకాశం" ఆకాశము నిరవయవమగుటచే గమనను పంభవింపమగాన సర్వమును వ్యాపించియుండును. దృష్టాదృష్టము లగు ఘటమఠాదిసర్వమూర్తద్రవ్యములయందు లోపల వెలుపలగూడ వ్యాపించియుండును.) అట్టి యాకాశము "సౌక్ష్మ్యాత్" తను వ్యాపించియున్న ద్రవ్యము నపేక్షించి తా నతిసూక్ష్మమగుటవలన ఆయాద్రవ్య, గుణ, దోషములచేతను, సుగంధాదులచేతను, వర్ష, వాత, ఆతప వహ్నిధూమ, రజః, పంకాదులచేతను "యథా నోపలిప్యతే" లేప్య, లేపక, లేపనక్రియాఽవిషయమగుట లేపనమును పొందదో (స్పృశింపబడదో) "తథా సర్వత్ర దేహేఽవస్థిత ఆత్మా నోపలిప్యతే" అట్లే ఆత్మ దేవతిర్యఙ్మనుష్యాద్యుచ్చావచసర్వదేహములయందు లోపలను, వెలుపలను అంతటను వ్యాపించి యున్నను, "సూక్ష్మాచ్చ తత్సూక్ష్మతరం విభాతి" అను శ్రుత్యుక్తరీతిని యవ్యక్తమునకంటె బరమసూక్ష్మ మగుటవలన—దేహేంద్రియ, మనో, బుద్ధ్యాదులచే నిప్పుడు, పూర్వమున ననేకకోటిజన్మలయందాచరితములైన పుణ్యపాపరూపకర్మలచే లేపమును పొందబడ (స్పృశింపబడ) దని యర్థము.) ఈచెప్పుటచే- సమ్యగ్జ్ఞానముచే నవిద్యను, అవిద్యాకార్యములను నశింపజేసుకొనిన బ్రహ్మవేత్త లగు యతు లాకప్పుడాహారాదినిమిత్తకమగు నెట్టి కర్మచేతను లేపమును బొందరుగాన కైవల్యము సిద్ధించుటకు ప్రతిబంధక మగు ద్వైతవాసన నిశ్శేషముగ నివర్తించుటకును, స్వానందానుభూతికొరకును "సమం పశ్యన్తి సర్వత్ర" అనుగీతోక్తరీతిని యెల్లపుడును సమ్యగ్దృష్టినిష్ఠతోడనే యుండదగు నని సూచిత మయ్యెను. ఇంతియే కాని ఆత్మకు కర్మలేప ముండదని తలచి యథేష్టముగ నాచరించుట యుట యభిప్రేతము గాదు. కారణమేమనః నిరుక్తవచన విరోధము వాటిల్లును. మరియు సంన్యాస, శ్రవణాదిశ్రమకు ఫలము నుండదు. కాన నెల్లపుడు పూర్ణవృత్తితో నుండదగు నని సిద్ధించుచున్నది. ॥౩౨॥

భాష్యార్కప్రదీపిక:— ఆత్మకు కర్తృత్వము లేమింజేసి లేపము సంభవింపనేరదని దృష్టాంతసహితముగ జెప్పుచుండెను— యెట్లు "సర్వగతం" అన్నిదేశములయందు నున్నదైనను "ఆకాశం" ఆకాశము "సౌక్ష్మ్యాత్" అసంగస్వభావము కలదగుటచే దేహాదిగతకర్తృత్వాదికముచే "నోపలిప్యతే" సంబంధింపబడదో, "తథా", అట్లే "సర్వత్రావస్థితః ఆత్మా" అంతటను నిండియున్న యాత్మ "నోపలిప్యతే" దేహధర్మములచే లేపమును పొందకుండును. ॥౩౧॥

గీ॥ యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత! ॥ ॥౩౩॥

పదవిభాగము:— యథా- ప్రకాశయతి- ఏకః- కృత్స్నం- లోకం- ఇమం- క్షేత్రం- క్షేత్రీ- తథా- కృత్స్నం- ప్రకాశయతి- భారత! ॥౩౩॥

ప్రతిపదార్థము:— ఏకః=ఒకడైన; రవిః=సూర్యుడు: ఇమం=ఈ; కృత్స్నం=సమస్తమైన; లోకం=లోకమును; యథా=ఎట్లు; ప్రకాశయతి=ప్రకాశింపచేయుచుండెనో; తథా=అట్లే; హేభారత!=భరతవంశోద్భవుడవగు యర్జున; క్షేత్రీ=పరమాత్మ: కృత్స్నం=సమస్తమైన; క్షేత్రం=మహాభూతాది ధృత్యంతమైన క్షేత్రమును; ప్రకాశయతి=ప్రకాశింపజేయుచున్నాడు. ॥౩౩॥

---

శాంకరభాష్యమ్:—

కించ— యథా ప్రకాశయ త్యవభాసయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః సవితాఽఽదిత్య స్తథా తద్వ న్మహాభూతాదిధృత్యన్తం క్షేత్ర మేకః సన్ప్రకాశయతి కః క్షేత్రీ

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు:— ఓయర్జున! ఒకేసూర్యుడీనిఖిలలోకమును యెట్లు ప్రకాశింపజేయుచుండెనో యట్లే పరమాత్మయు నిఖిలమైన మహాభూతాదిధృత్యంతమైన క్షేత్రమును ప్రకాశింప

---

—• ౧౩ వ అధ్యాయము ౩౩ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఆత్మ యసంగ మగుటవలననే కేవలము లేపమును పొందకుండుటలేదు. మరియు ప్రకాశకమగుటచే గూడ ప్రకాశ్యధర్మములచే లేపము నొందుటలేదు. అని దృష్టాంత పూర్వకముగ జెప్పుచుండెను — "యథా...రవిః" యెట్లు సూర్యు డొక్కడే రూపవత్తు లగు ద్రవ్యముల నన్నిటిని ప్రకాశింపజేయుచు నాప్రకాశ్యధర్మములచే లేపమును పొందకుండెనో, అట్లే యాప్రకాశధర్మ భేదములచే భిన్నుడు గాకుండెనో "క్షేత్రం...భారత;" అట్లే ఓభారతవంశోద్భవుడవగు అర్జునా! క్షేత్రజ్ఞు డొక్కడే యీసమస్తక్షేత్రజాతమును ప్రకాశింపజేయుచుండెను. ప్రకాశ్య (క్షేత్ర) ధర్మములచే లేపమును పొందుటలేదు. మరియు బ్రకాశ్యభేదముచే భిన్నుడు నగుట లేదు. "సూర్యో యథా సర్వలోకస్య చక్షు ర్న లిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః। ఏక స్తథా సర్వభూతాంతరాత్మా న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః" అను శ్రుతియు నీవిషయమునే చెప్పుచున్నది. ॥౩౩॥

శంకరానందీయము:— శ్రుతి, యుక్తి, అనుభవములచే నాత్మకు ప్రకృతివైలక్షణ్యమును దెలుసుకొని, ప్రకృతిని యాత్మయందు ప్రవిలాపన మొనరించి, యాత్మకు సామ్యమునే సర్వదా చూచు యతికి విదేహముక్తి కల్గు నని నిశ్చయించి, యీప్రకరణము నుపసంహరింపదలచినవాడై, శ్రీకృష్ణభగవానులు ఆత్మకు-ప్రకృతికి కలవైలక్షణ్యజ్ఞానమే మోక్షమున కాదికారణముగాన మందప్రజ్ఞులకు నియుక్తజ్ఞానము విషయమై సందేహము లేకుండుటకై తిరిగి "ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞః" అను ఉక్తలక్షణ ములుగల యాత్మ యగు క్షేత్రజ్ఞునకు క్షేత్రవైలక్షణ్యమును సూర్యదృష్టాంతముతో స్పష్టము చేయు

గీ॥ క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మన్తరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతిమోక్షం చ యే విదు ర్యాన్తి తే పరమ్ ॥ ।౩౪॥

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే ప్రకృతి-పురుష
వివేకయోగో నామ త్రయో
దశోఽధ్యాయః ॥౧౩॥
హరిః ఓమ్ తత్సత్ ॥

---

పదవిభాగము:— క్షేత్రక్షేత్రజ్ఞయోః- ఏవం- అంతరం- జ్ఞానచక్షుషా- భూతప్రకృతి మోక్షం- చ- యే- విదుః- యాంతి- తే- పరమ్ ॥ ॥౩౪॥

ప్రతిపదార్థము:— క్షేత్రక్షేత్రజ్ఞయోః= క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క; ఏవం=పూర్వమునందు చెప్పబడినరీతిచే; అంతరం=పరస్పరవైలక్షణ్యవిశేషమును; భూతప్రకృతిమోక్షంచ=భూత=భూతములయొక్క; ప్రకృతి=ప్రకృతియైన యావిద్యయొక్క; మోక్షంచ=విమోక్షమును; యే=ఎవరు; విదుః= తెలిసికొనుచున్నారో; తే=వారు; పరం=పరబ్రహ్మమును; యాన్తి=పొందుచున్నారు. ॥౩౪॥

---

శాంకరభాష్యమ్:—

సమస్తాధ్యాయార్థోపసంహారార్థోఽయం శ్లోకః— క్షేత్రక్షేత్రజ్ఞయో ర్యథావ్యాఖ్యాతయో రేవం యథాప్రదర్శితప్రకారే ణాన్తర మితరేతరవైలక్షణ్యవిశేషం జ్ఞానచక్షుషా శాస్త్రాచార్యోపదేశజనిత మాత్మప్రత్యయికం జ్ఞానం చక్షు స్తేన జ్ఞానచక్షుషా భూతప్రకృతి

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సమస్తాధ్యాయార్థోపసంహారమునిమిత్త మీశ్లోకము చెప్పబడుచుండెను— పూర్వమునందు వ్యాఖ్యాతులగు క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క పూర్వప్రదర్శితప్రకారముచే నితరేతర

---

—• ౧౩ వ అధ్యాయము ౩౪ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ప్రస్తుత మీయధ్యాయార్థమును ఫలప్రదర్శనపూర్వకముగ నుపసంహరించుచుండెను.— ఈయధ్యాయమున వివరింపబడిన రీతిగ క్షేత్ర-క్షేత్రజ్ఞులయొక్క పరస్పరవైలక్షణ్యమును (జాడ్య-చైతన్య, వికారిత్వ- నిర్వికారిత్వాదిరూపమగు వైలక్షణ్యమును) శాస్త్రాచార్యోపదేశజనితాత్మజ్ఞానరూపమగు చక్షుస్సుతో నెవరు తెలిసికొందురో, సర్వభూతములయొక్క ప్రకృతి (మాయాశబ్దవాచ్యమగు అవిద్య) యొక్క మోక్షమును (అభావాపాదనమును) పరమార్థమగు ఆత్మవిద్యచే నెవరు తెలిసికొనుదురో అట్టివారు పరమార్థాత్మవస్తురూపమగు కైవల్యమును పొందెదరు. తిరిగి దేహమును ధరింప

శాంకరభాష్యమ్:—

మోక్షం చ భూతానాం ప్రకృతి రవిద్యాలక్షణాఽవ్యక్తాఖ్యా తస్యా భూతప్రకృతే ర్మోక్షణ మభావగమనం చ యే విదు ర్విజానన్తి యాన్తి గచ్ఛన్తి తే పరం పరమార్థతత్త్వం బ్రహ్మ న పున ర్దేహ మాదదత ఇత్యర్థః ॥ ॥౩౪॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య గోవిందభగవత్పూజ్య
పాదశిష్య శ్రీమచ్ఛంకరభగవతఃకృతౌ శ్రీభగవద్గీతా
భాష్యే క్షేత్ర-క్షేత్రజ్ఞయోగో నామ
త్రయోదశోఽధ్యాయః ॥౧౩॥

హరిః ఓమ్ తత్సత్ ॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వైలక్షణ్యవిశేషమును, భూతములకు ప్రకృతియైన యవిద్యయొక్క యభావగమనమును శాస్త్రాచార్యోపదేశమువలన పుట్టిన జ్ఞానమనెడి చక్షుస్సుచే నెవరు తెలిసికొనుచున్నారో వారు పరబ్రహ్మమును పొందుచున్నారు. తిరిగి దేహమును పొందరని యర్థము. ॥౩౪॥

ఇట్లు నూరువేల సంఖ్యకలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపము నగు మహాభారత
మునం దంతర్గతమైన భీష్మపర్వము నందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యా
రూపమును, యోగశాస్త్రమును, నగు భగవద్గీతలయందున్న శ్రీకృష్ణార్జున
సంవాదమునందు గల క్షేత్రక్షేత్రజ్ఞయోగ మను పేరి త్రయోదశా
ధ్యాయమునకు గౌతమసగోత్రుడగు "తర్కరత్న, న్యాయవేదాన్త
విద్యాపారీణ, దర్శనాలంకార" బులుసు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన
ఆనందగిరీయవ్యాఖ్యానుసృత శ్రీభగవద్గీతాశాంకర
భాష్యతత్త్వబోధిని సమాప్తము.
హరిః ఓమ్ తత్సత్ ॥

---

కుందురని యర్థము. కాన నీవిధముగ నమానిత్వాదిసాధననిష్ఠుడగు క్షేత్ర-క్షేత్రజ్ఞవివేకవిజ్ఞానవంతునకు సర్వానర్థనివృత్తియై పరమపురుషార్థము సిద్ధించునని నిర్గళితభావము.

ఇట్లు మధుసూదన సరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా
త్రయోదశాధ్యాయ గూఢార్థదీపికకు "తర్కరత్న,
న్యాయవేదాన్త విద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రి విరచితతాత్పర్యబోధిని
సమాప్తము.

శంకరానందీయము:— ఈయధ్యాయార్థము నంతను సంక్షేపముగ ప్రతిపాదించుచు నధ్యాయము నుపసంహరించుచుండెను.— "క్షేత్రక్షేత్రజ్ఞయోః"- "ఇదం శరీరం కౌంతేయ! క్షేత్ర మిత్యభిధీయతే" "ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞం" అను గీతావాక్యములచే నిర్వచింపబడిన ప్రకృతి పురుషులయొక్క "ఏవం"— "మహాభూతాని" "జ్ఞేయం యత్తత్" అను గీతావాక్యములచే జెప్పబడిన రీతిని "అంతరం" జ్ఞేయత్వ- జ్ఞాతృత్వాది విశేషణములచే వైలక్షణ్యమును, తన యాత్మస్వరూపముగ క్షేత్రజ్ఞుని, "భూతప్రకృతిమోక్షంచ" (ఇట భూతశబ్దముచే వ్యక్తమగు నామరూపాత్మకమగు సచ్ఛబ్ద వాచ్యమగు జగత్తు చెప్పబడును. ప్రకృతిపదముచే నస్పష్టనామరూపాత్మకము నసచ్ఛబ్దవాచ్యము నగు జగత్కారణమగు నవ్యక్తము చెప్పబడును. ఇట్టి వ్యక్తావ్యక్తములయొక్క "న సత్త న్నాస దుచ్యతే" అను గీతావాక్యానుసారము అభావాపాదనమును "జ్ఞానచక్షుషా" పూర్వోక్త అమానిత్వాదిసాధనసంపత్తి చేతను, తీవ్రమోక్షేచ్ఛచేతను, లెస్సగ నాచరింపబడిన శ్రవణాదికముచేతను, క్షేత్ర- క్షేత్రజ్ఞయాథాత్మ్యగ్రహణ సమర్థమగు, అతిసూక్ష్మమగు జ్ఞానమనెడి చక్షుస్సుతో "యేవిదుః" నే ముముక్షువులగు యతులు ప్రకృతి, తత్కార్యవిలాపనాధిష్ఠానభూతము, నిర్విశేషము, నిత్యశుద్ధబుద్ధముక్తసత్యస్వభావము సదా ఆనందైకరసము, అపూర్వము, అనపరము, అనంతరము, అబాహ్యము, అద్వితీయము నగు పరబ్రహ్మస్వరూపము నేను యీసర్వము నయితినని స్వాత్మతో తెలిసికొందురో "తే" అట్టివారు 'పరం యాంతి' పరమపురుషార్థమగు కైవల్యమును పొందెదరు. ॥౩౪॥

ఇట్లు శ్రీశంకరానందసరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా త్రయోదశాధ్యాయ

వాక్యతాత్పర్యబోధినికి "తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ,

దర్శనాలంకార" బులుసు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన

తాత్పర్యబోధిని సమాప్తము.

---

శ్రీధరీయము:— అధ్యాయార్థము నుపసంహరించుచుండెను. "ఏవం" ఈచెప్పిన విధమున "క్షేత్ర-క్షేత్రజ్ఞయో రంతరం" క్షేత్రక్షేత్రజ్ఞుల భేదమును "జ్ఞానచక్షుషా" వివేకజ్ఞానరూపమగు చక్షుస్సుచే 'యే విదుః' యెవరు తెలిసికొనెదరో, మరియు నట్లే "భూతప్రకృతిమోక్షంచ" భూతముల ప్రకృతినుండి విడుపబడుటకు తగు నుపాయమగు ధ్యానాదికమును యెవరు తెలిసికొనెదరో "తే పరం యాంతి" అట్టివారు పరమపదమును పొందెదరు. ॥౩౪॥

ఇట్లు శ్రీధరస్వామివిరచిత శ్రీభగవద్గీతాత్రయోదశాధ్యాయ టీకకు

"తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ, దర్శ

నాలంకార" బులుసు అప్పన్నశాస్త్రి

విరచిత తాత్పర్యబోధిని

సమాప్తము.

---

సదానందీయము:— శ్రీకృష్ణభగవానులు నిశ్శేషముగ నధ్యాయార్థము నీశ్లోకమున నుపసంహరించుచుండెను.— పూర్వోక్తమగు క్షేత్ర-క్షేత్రజ్ఞులయొక్క జాడ్య-చైతన్య, మిథ్యాత్వ-సత్యత్వాదిరూపమగు భేదమును, శాస్త్రాచార్యోపదేశములచే గల్గిన సమ్యగ్జ్ఞానమను చక్షుస్సుతో నెవరు తెలిసికొనెదరో, అట్లే యీసర్వప్రపంచమునకు కారణమగు నవిద్యను, ఆత్మజ్ఞానముచే నవిద్యానివృత్తి కారణమును నెవరు తెలిసికొనెదరో అట్టివారు అపునర్భవనరూపమగు కైవల్యము నొందెదరు. ॥౩౪॥

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞభేదం విమల మతిభరాః ప్రాహ ముక్త్యై య ఈశః,
జ్ఞానజ్ఞేయావబోధం ప్రతిపద మమృతం దర్శయామాస సమ్యక్ ।
భక్తేభ్యః ప్రీతిమద్భ్యో విశదపద ముదే త్యస్య భక్త్యా ముముక్షో,
స్తం శ్రీ కాంతం ముకుందం నిరవధిచరితం కృష్ణ మారాధయామి ॥

తా॥ ఏశ్రీకృష్ణభగవానులు భక్తుల ముక్తికై అత్యంతము విశదమగు క్షేత్ర-క్షేత్రజ్ఞ భేదమును బోధించెనో, ప్రీతియుక్తులగు భక్తులకు ప్రతిపదమునను అమృతము స్రవించునట్లు జ్ఞాన, జ్ఞేయముల వివేకమును జూపెనో, ఏశ్రీకృష్ణునియొక్క భక్తిచే దోషవర్జితమగు (పునరావృత్తిరహితమగు) స్థానములభించునో, అట్టి లక్ష్మీకాంతుడు, ముకుందుడు నవధిలేని చరిత్రకలవాడు నగు శ్రీకృష్ణపరమాత్మ నారాధించెదను.

ఇట్లు శ్రీసదానందసరస్వతీ విరచిత త్రయోదశాధ్యాయ భావప్రకాశకకు
"తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ' దర్శనాలంకార"
బిరుదు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

---

భాష్యోత్కర్ష దీపిక:— ఫలప్రదర్శనపూర్వకముగ నీ యధ్యాయార్థము నుపసంహరించుచుండెను— పూర్వోక్తరీతిని క్షేత్ర-క్షేత్రజ్ఞుల యితరేతర వైలక్షణ్యావిశేషమును, (కూటస్థత్వ- పరిణామరూపవైలక్షణ్యమును) శాస్త్రాచార్యోపదేశసంజనితాత్మప్రత్యక్షరూప మగు జ్ఞాన మనెడి చక్షుస్సుచే భూతముల ప్రకృతియగు అవ్యక్తముయొక్క మోక్షమును (లేనివానిగతలచుటను) ఆత్మయాథాత్మ్యజ్ఞానముచే నెవరు తెలిసికొనెదరో అట్టివారు పరమార్థతత్త్వమగు బ్రహ్మమును పొందుచుండిరి. తిరిగి దేహమును ధరింపకుందురు. ఈత్రయోదశాధ్యాయమున యమానిత్వాదికమును నిరూపించుటచే- తన్నిష్ఠుడగు క్షేత్ర-క్షేత్రజ్ఞ యాథాత్మ్యవిజ్ఞానవంతునకు సర్వానర్థనివృత్తి పూర్వకముగ పరమపురుషార్థము సిద్ధించుననిచెప్పుటచే తత్త్వంపదార్థముల నైక్యము ప్రతిపాదింపబడెను. ॥౩౪॥

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞ యాథాత్మ్యం సమ్య గ్యేన ప్రకాశితం ।
వందే తం పరమాత్మానం శంకరం కృష్ణ మద్వయం ॥

తా॥ క్షేత్రక్షేత్రజ్ఞుల యాథాత్మ్యము యేభగవానునిచే లెస్సగ నిరూపింపబడెనో, యట్టి యద్వయుడును, లోకమంగళకరుడు నగు శ్రీకృష్ణపరమాత్మనుగూర్చి నేను నమస్కరించెదను.

ఇట్లు ధనపతిసూరి విరచిత శ్రీభగవద్గీతా త్రయోదశాధ్యాయ భాష్యోత్కర్ష
దీపికకు "తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ, దర్శనాలంకార"
బిరుదు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

పదని యర్థము. ప్రకృతి యనునదొకటి సత్యమై, బింబభూతమై యున్నచో నప్పుడు విభువులు, అలిప్త ద్రష్టలు ముక్తులునగు ననేకపురుషులకు అప్రకృతిదర్శన మపరిహార్యమే యగును. అప్పట్టున నట్టివారికి బంధమే ప్రసక్తమగును. అట్లుగాక యాప్రకృతి మిథ్యయే యగుచో నెవనికి ఆత్మసాక్షాత్కార మగునో వానియెడ వీనిదృష్టిచే ప్రకృతి యన్నివిధముల రజ్జూరగమువలె బాధితమై కాలత్రయమునందును లేనిదియే యగును. అట్టి ఆత్మద్రష్టకంటె వేరగువారికి అప్రకృతి అనాదియు, ననంతయునై వారిదృష్టిచే భాసించుచునే యుండును. కాన కేవల ప్రకృతి-పురుషభేదజ్ఞానమ మాత్రముచేతనే కైవల్యము సిద్ధింపదు. ఇక ప్రకృతిబాధపురస్సరముగ గల్గు పురుషజ్ఞానమువలన (సర్పబాధపురస్సరముగ గలుగు రజ్జుయథార్థజ్ఞానము వలన భయము నివర్తించినట్లు) భవబంధము నివర్తించునని పర్యవసితాశయము. ॥౩౪॥

ఇట్లు నీలకంఠాచార్యవిరచిత శ్రీభగవద్గీతా త్రయోదశాధ్యాయ భారత భావదీపమునకు

బులుసు వెంకటశాస్త్రిచే రచియింపబడిన తాత్పర్యబోధిని

సమాప్తము.

— —

శుభమస్తు.

# శ్రీభగవద్గీతా శాంకరభాష్యతత్త్వబోధిని

## చతుర్దశోఽధ్యాయః.

### గుణత్రయవిభాగయోగః

శ్రీభగవానువాచ;—

గీ॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్ ।
యజ్జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః ॥ ॥౧॥

పదవిభాగము:— శ్రీభగవాన్- ఉవాచ- పరం- భూయః- ప్రవక్ష్యామి- జ్ఞానానాం- జ్ఞానం- ఉత్తమం- యత్- జ్ఞాత్వా- మునయః- సర్వే- పరాం- సిద్ధిం- ఇతః- గతాః ॥ ॥౧॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=పలికెను; సర్వే=నిఖిలమైన; మునయః=మననశీలురైన సంన్యాసులు; యత్=ఏజ్ఞానమును; జ్ఞాత్వా=తెలిసికొని, ఇతః=ఈదేహసంబంధమునకూర్ధ్వము; పరాంసిద్ధిం=మోక్షమును; గతాః=పొందిరో; భూయః=తిరిగి; జ్ఞానానాం=జ్ఞానములలో; ఉత్తమం=ఉత్తమమైన; పరం=ఉత్కృష్టమైన; తత్=అట్టి; జ్ఞానం=జ్ఞానమును; ప్రవక్ష్యామి=చెప్పగలను. ॥౧॥

---

—• ౧౪ వ అధ్యాయము ౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వాధ్యాయమున "యావ త్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజంగమమ్ । క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్త ద్విద్ధి" అని చెప్పబడెను. అట నిరీశ్వరసాంఖ్యమతనిరాకరణపురస్సరముగ క్షేత్రక్షేత్రజ్ఞసంయోగము ఈశ్వరాధీన మని చెప్పవలసియున్నది. ఇట్లే "కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు" అని చెప్పబడెను. ఏగుణమునందు సంగమెట్టిది? గుణము లెవ్వి? ఆగుణము లెట్లు బంధించుచున్నవి? అనుయీప్రశ్నలకు సమాధానము చెప్పవలసియున్నది. అట్లే "భూతప్రకృతిమోక్షం చ యే విదు ర్యాంతి తే పరమ్" అని చెప్పబడెను. ఇట భూతప్రకృతిశబ్దముచే చెప్పబడు గుణములనుండి మోక్షమెట్లు కల్గునో, అట్టిమోక్షమునకు లక్షణమును చెప్పవలసియున్నది. ఈవిషయము నంతను సవిస్తరముగ జెప్పుటకై యీచతుర్దశాధ్యాయ మారంభింపబడుచున్నది- ఇట మున్ముందు చెప్పబోవు విషయమును, రెండుశ్లోకములచే రుచ్యుత్పాదనమునకై స్తుతించుచు శ్రీకృష్ణభగవానులు చెప్పుచుండెను— "పరం ...మితో గతాః" "జ్ఞానం" దీనిచే తెలియబడునది గాన "జ్ఞానం" అనిఅనబడును. ఈజ్ఞానము పరమాత్మజ్ఞాన

శాంకరభాష్యమ్:—

సర్వ ముత్పద్యమానం క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా దుత్పద్యత ఇత్యుక్తం. తత్కథమితి తత్ప్రదర్శనార్థం 'పరం భూయః' ఇత్యాది రధ్యాయ ఆరభ్యతే। అథ వేశ్వరపరతంత్రయోః క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జగత్కారణత్వం న తు సాంఖ్యానా మివ స్వతంత్రయో రిత్యేవ మర్థం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జనించుచున్న సర్వము క్షేత్రక్షేత్రజ్ఞసంయోగమువలన జనించుచున్న దని చెప్పబడెను. అది యెట్లు జనించుచున్నదో దానిని చూపుటకొరకు "పరం భూయః" అనుశ్లోకము మొదలు కొని పదునాల్గవ యధ్యాయము ప్రారంభింపబడుచుండెను.

లేక:— ఈశ్వరపరతంత్రులైన క్షేత్రక్షేత్రజ్ఞులకు జగత్కారణత్వము, సాంఖ్యులకు వలె స్వతంత్రులైన క్షేత్రక్షేత్రజ్ఞులకు జగత్కారణత్వము లేదు. అని బోధించుటకు ప్రకృతి

---

సాధనమై, పరవస్తువిషయక మగుటచే శ్రేష్ఠము. "జ్ఞానానా ముత్తమం" జ్ఞానబహిరంగసాధనములగు యజ్ఞాదులలో నుత్తమఫలసాధన మగుటచే నుత్తమము. (అమానిత్వాద్యంతరంగసాధనములకంటె నుత్తమమైనది కాదు. ఏమన: అవి యంతరము లగుటచే నుత్తమములు) "పరం" అను విశేషణముచే నుత్కృష్టత్వము చెప్పబడెను. "ఉత్తమం" అను విశేషణముచే నుత్కృష్టఫలత్వము చెప్పబడెను. ఇట్టి జ్ఞానమును పూర్వాధ్యాయములం దనేకమార్లు చెప్పబడినదైనను తిరిగి నేను చెప్పెదను. ఏయీజ్ఞానమును తెలిసికొని అనుష్ఠించి మననశీలు రగు సంన్యాసులు ఈదేహబంధమునుండి మోక్ష మనెడి పరమసిద్ధిని పొందిరో యట్టి జ్ఞానమును చెప్పెదను. ॥౧॥

శంకరానందీయము:— పూర్వాధ్యాయమున ముముక్షువై యాత్మానాత్మతత్త్వమును తెలిసికొనుటకై యిచ్ఛగలవానికై ఈశరీరము క్షేత్రశబ్దితమై యనాత్మ యగును. అహంపదార్థమే క్షేత్రజ్ఞుడు. అని బోధించి, క్షేత్రమునుండి విభక్తమైన క్షేత్రజ్ఞునకు "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" యని బ్రహ్మాభిన్నత్వమును ప్రతిపాదించి, ప్రకృతికే కర్తృత్వ, భోక్తృత్వము లనియు, ప్రకృతి, తత్కార్యములకు సాక్షి యగు నాత్మకు ప్రకృతిగుణసాంగత్యమువలననే సంసారము కలుగుచున్నదనియు, వస్తుతః ఆత్మ సంసారియే కాదనియు జెప్పబడెను. ఇట గుణములన నెవ్వి? ఆగుణములయందు పురుషునకు సంగ మెట్లు? ఆగుణములు పురుషు నెట్లు బంధించును? ఆగుణములనుండి మోక్షణ మెట్లు కల్గును? గుణములచే ముక్త డగువాని లక్షణ మెట్టిది? అను ప్రశ్నములపై ప్రకృతియొక్క ప్రవృత్తిసామర్థ్యమును, అప్రకృతిగుణవిభాగమును, గుణముల స్వరూపమును, అవి చేయు పనిని, బంధకత్వమును వాటి స్వస్వోత్కర్షచే బరస్పరాభిభవమును, వాటి ఫలభేదమును, ఆగుణబద్ధుడైన పురుషునికి కల్గు అనర్థఫలమును, ఆగుణములనుండి ముక్తుడగువానికి కల్గు ఫలమును, గుణముక్తుని లక్షణమును, ఆగుణముల నతిక్రమించుట కుపాయమును, ఈసర్వమును "గుణసంగోఽస్య" అను వాక్యార్థమును విస్పష్టముగా జెప్పుటకై యీచతుర్దశాధ్యాయ మారంభింపబడుచున్నది. అందు మున్ముందు క్షేత్ర, క్షేత్రజ్ఞులు వేరనియు, తనకును, క్షేత్రజ్ఞునకును భేదము లేదనియు దెలిసికొనిన బ్రహ్మవిద్యతికి కల్గిన జ్ఞానమును రక్షించుకొనుటకై ముందు చెప్పబోవు జ్ఞానకార్యమునందే ప్రవృత్తి కల్గుటకై గుణతత్కార్యజ్ఞానమే ముక్తికి ఉత్కృష్టమగు కారణ మని బోధించుటకై శ్రీకృష్ణభగవానులు చెప్పుచుండెను— "త్రిభి ర్గుణమయై ర్భావైః" అనియు, "ఇచ్ఛాద్వేషసముత్థేన" అనియు, "రాక్షసీ మాసురీం చైవ" అను స్థలములయందనేకమార్లు చెప్పబడినను, విశేషప్రతిపత్త్యైకై "భూయః" తిరిగి "జ్ఞానం" గుణములయొక్కయు, గుణ కార్యములు

శాంకరభాష్యమ్:—

ప్రకృతిస్థత్వం గుణేషు చ సంగః సంసారకారణ మిత్యుక్తం కస్మి న్గుణే కథం సంగః కే వా గుణాః కథం వా తే బధ్నన్తీతి గుణేభ్యశ్చ మోక్షణం కథం స్యా న్ముక్తస్య చ లక్షణం వక్తవ్య మిత్యేవ మర్థం చ— పరం జ్ఞాన మితి వ్యవహితేన సమ్బన్ధః । భూయః పునః పూర్వేషు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

స్థత్వము, గుణములయందు సంగము సంసారకారణమని చెప్పబడెను. ఏగుణమునం దెట్లు సంగము? గుణము లేవి? ఆగుణము లెట్లు బంధించును? అనియు, గుణములవలన మోక్షణ మెట్లు సంభవించును? అనియు, ముక్తుని యొక్క లక్షణమున్ను చెప్పదగియున్నది. అందు నిమిత్తమై శ్రీకృష్ణపరమాత్మ చెప్పమొదలిడెను—.

యొక్కయు జ్ఞానమును నీకై "ప్రవక్ష్యామి" చెప్పెదను. అజ్ఞాన మెట్టిదందువా? "పరం" సాంఖ్య, యోగ, కర్మాదివిషయకములగు జ్ఞానములలో శ్రేష్ఠమైనది. కనుకనే "ఉత్తమం" ఉత్తమ మగు పరమపురుషార్థమగు మోక్షమునకు కారణమగుటచే నుత్తమమగు నీజ్ఞానమును నాభక్తుడవు, ముముక్షువవు నగు నీకై యుపదేశించెద నని యర్థము. లేక, క్షేత్రము అనాత్మస్వరూపము. క్షేత్రజ్ఞు డాత్మస్వరూపము. సచ్చిదానందరూప మగు బ్రహ్మమే క్షేత్రజ్ఞుడు. ఈమొదలగు జ్ఞానములలో గుణములయు, తత్కార్యములయు జ్ఞానము శ్రేష్ఠము, నుత్తమము నగును. వస్తుతః ఆత్మానాత్మవివేచనము, ఆత్మ బ్రహ్మాభిన్న మనెడి జ్ఞానము, ప్రకృతిప్రవిలాపన జ్ఞానము, ముక్తిని గూర్చి యసాధారణకారణమే యగును. అట్లైనను అట్టి జ్ఞానము అవిద్యాకామాదిదోష దూషితునికి కలుగవలె నన్న యాయవిద్యాకామాదిదోషములే ప్రతిబంధకము లగును. ఈవిషయము భార తాదులయందు ప్రసిద్ధము. గుణములయొక్కయు, తత్కార్యములయొక్కయు నీజ్ఞానము బ్రహ్మవేత్తను గుణవాసనచే చేయబడిన బహిఃప్రవృత్తినుండి విముఖునిగ జేసి, దేనిచే జ్ఞానము, తత్ఫలము ప్రతిబంధింప బడవో అట్టిస్థలమునందే సమ్యగ్దర్శననిష్ఠను ప్రతిష్ఠించి, గుణములనుండి విడువడజేసి విదేహముక్తిని ప్రసా దించును. కాన యీగుణ, తత్కార్యజ్ఞానము ఆత్మాఽనాత్మవివేకాదిజ్ఞానములకంటె నుత్తమము. లోకమున నారోగ్యమును కోరువానికి–రోగజ్ఞానముకంటెను, ఔషధజ్ఞానముకంటెను, పథ్యజ్ఞానముకంటెను "ఇది భక్షింపగూడని పదార్థము, దీనిని భక్షించిన ఔషధమునకు, ఆరోగ్యమునకుగూడ ప్రతిబంధకము" అను జ్ఞాన మున్నచో నాతడు అపథ్యాచరణమునుండి నివృత్తు డగును. అందుచే నారోగ్యముగూడ లభించును. కాన అపథ్యజ్ఞానము పూర్వోక్తములగువానికంటె నుత్తమసాధన మగును. ఔషధముగూడ నపథ్యములేని దగునో నతిప్రభావముకల దగును. దాన నారోగ్యము తప్పక సిద్ధించుట యనుభవసిద్ధము. ఈవిధముగనే జ్ఞానమును, జ్ఞానఫలమును ప్రతిబంధించెడి గుణములయొక్కయు, వానికార్యములయొక్కయు జ్ఞానము జ్ఞానసాధనము లగు పూర్వోక్తజ్ఞానములకంటె నుత్తమము. ఏమందురా? ఆత్మజ్ఞానము, తత్ఫలభూతమగు మోక్షము నివి సిద్ధించుటకు గుణములతోటి, వానికార్యములతోటి సంబంధము లేకుండుటయే ప్రధానమగు బలము. కాన గుణతత్కార్యజ్ఞాన మావశ్యక మగుటచే నితరజ్ఞానములకంటె నుత్తమమనుగుసి విషయమునే వివరించుచుండెను. "యద్ జ్ఞాత్వా...గతాః" శ్రవణాదికమువలన గలిగెడు జ్ఞానమును సంక్షీరంచున దగుటచేతను, మరియు గుణముల నతిక్రమించుటకు హేతువగుటచేతను, మోక్షమునకు పరమకారణమైన గుణ, తత్కార్యజ్ఞానము నార్జించి (అట్టి జ్ఞానముచే గర్తవ్యము నాచరించి) బ్రహ్మవేత్త లగు శుకాదియతులు యీగుణత్రయమునుండి

శాంకరభాష్యమ్:—

సర్వేష్వధ్యాయే ష్వసకృ దుక్తమపి ప్రవక్ష్యామి । తచ్చ పరం పరవస్తువిషయత్వాత్ । కిం తత్? జ్ఞానం సర్వేషాం జ్ఞానానా ముత్తమ ముత్తమఫలత్వాత్ । జ్ఞానానామితి నామానిత్వాదీనాం, కిం తర్హి యజ్ఞాదిజ్ఞేయవస్తువిషయాణామితి । తాని న మోక్షాయేదం తు మోక్షాయేతి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"పరం" అనుదానికి ముందు వ్యవహితముగ నున్న "జ్ఞానం" అనుదానితో సంబంధము. ఏజ్ఞానమును తెలిసికొని (పొంది) మననశీలురగు నిఖిలసంన్యాసులు మోక్ష మనెడి యుత్కృష్ట మైన సిద్ధిని యీదేహపాతానంతరము పొందిరో, జ్ఞానములలో నుత్తమమైన ఫలముకలదగుట వలన నుత్తమమైనట్టిన్ని, పరవస్తువిషయకమగుటవలన నుత్కృష్టమైనట్టి జ్ఞానము పూర్వా ధ్యాయములయం దనేకసార్లు చెప్పబడినను తిరిగి యట్టి జ్ఞానమును చెప్పెదను. ఇచట "జ్ఞానా

ముక్తులైనవారై, పునరావృత్తి లేని దగుటచేతను, నిత్యనిరతిశయానందరూపమగుటచేతను సర్వసిద్ధులకంటె నుత్తమమగు సిద్ధిని పూర్ణత్వమును (విదేహముక్తిని) పొందిరని యర్థము. ॥౧॥

శ్రీధరీయము:— "పుంప్రకృత్యో స్స్వతంత్రత్వం వారయన్ గుణసంగతః । ప్రాహ సంసార వైచిత్ర్యం విస్తరేణ చతుర్దశే ॥ పురుషప్రకృతులకు గుణసంగముచే స్వాతంత్ర్యమును తొలగించుచు సంసార వైచిత్ర్యమును సవిస్తరముగ నీచతుర్దశాధ్యాయమున జెప్పుచుండెను— "యావ త్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజంగమమ్ । క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్త ద్విద్ధి భరతర్షభ!" (స్థావరజంగమాత్మక మగు నీప్రపంచ మంతయు క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగమువలన గలుగుచుండెను.) అని చెప్పబడెను. ఆక్షేత్ర క్షేత్రజ్ఞసంయోగముగూడ నిరీశ్వరసాంఖ్యులకువలె స్వతంత్రముగ గాక, ఈశ్వరేచ్ఛచేతనే కలుగుచున్నదని చెప్పుచు, "కారణంగుణ సంగోఽస్య సదసద్యోనిజన్మసు" అనుదానిచే నీసంసారవైచిత్ర్యము సత్త్వాదిగుణ కృతము అని వివరించుచు నిట్టి వక్ష్యమాణార్థమును రెండుశ్లోకములచే శ్రీకృష్ణభగవానులు స్తుతించుచుండెను— "పరం" పరమార్థనిష్ఠ కలదియు, "జ్ఞానానా ముత్తమం" తపస్సు, కర్మయు, మొదలగునవి విషయముగా గల జ్ఞానములలో మోక్షహేతువగుట నుత్తమమైనదియు నగు, "జ్ఞానం" జ్ఞానమును తెలియచేయు నుప దేశమును నీకై సవిస్తరముగా జెప్పెదను. "య ద్జ్ఞాత్వా...గతాః" ఈయుపదేశమును గ్రహించి మననశీలు రగు బ్రహ్మవేత్తలు ఈదేహబంధమునుండి విముక్తులై పునరావృత్తిరహితమగు మోక్షమును పొందిరి. ॥౧॥

పరమార్థప్రపః— పూర్వాధ్యాయమున "మహాభూతా న్యహంకారః" అను నీమొదలగు వాక్యములచే క్షేత్రస్వరూపమొకటే నిరూపింపబడెనుగాని యుత్పత్తినిగూర్చి యేమియు చెప్పలేదు. అట్లే క్షేత్రముయొక్క వికారత్వమే చెప్పబడెనుగాని, వైచిత్ర్యకారణమేమియు నిరూపింపబడలేదు. అట్లే క్షేత్రజ్ఞులు సూక్ష్మవ్యష్టిరూపముగనే నిరూపింపబడిరిగాని, సమష్టిరూపముగ నిరూపింపబడలేదు. కాన నిరూపింపబడని యాసర్వవిషయములను నిరూపించుటకై యీయధ్యాయ మారంభింపబడుచున్నది. (శేషము గతార్థము.) ॥౧॥

నీలకంఠీయము:— పూర్వాధ్యాయమున చెప్పబడిన "భూతప్రకృతి మోక్షం చ యే విదు ర్యాంతి తే పరం" అను స్థలమున భూతప్రకృతి యెట్టిది? ఆ ప్రకృతి యేది ఆశ్రయముగా గలదై భూతజనకమగును? ఆప్రకృతి బంధక మెట్లగుచున్నది? దానినుండి విమోక్ష మెట్లగును? మరియు ముక్తుల కేమి లక్షణము?

గీ॥ ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః ।
సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ ॥ ॥౨॥

పదవిభాగము:— ఇదం- జ్ఞానం- ఉపాశ్రిత్య- మమ- సాధర్మ్యం- ఆగతాః- సర్గే-అపి-న- ఉపజాయన్తే- ప్రలయే- న- వ్యథన్తి- చ ॥ ॥౨॥

ప్రతిపదార్థము:— ఇదం=ఈపూర్వోక్తమైన; జ్ఞానం=జ్ఞానమును; (జ్ఞానసాధనమును) ఉపాశ్రిత్య=అనుష్ఠించి; మమ=నాయొక్క; సాధర్మ్యం=స్వరూపత్వమును; ఆగతాః=పొందిరి; సర్గేఽపి=సృష్టికాలమునందును; నోపజాయన్తే=పుట్టరు; ప్రలయే-హిరణ్యగర్భవినాశకాలమునందు; నవ్యథన్తి చ=వ్యథను పొందరు. ॥౨॥

---

శాంకరభాష్యమ్:—

పరోత్తమశబ్దాభ్యాం స్తౌతి శ్రోతృబుద్ధిరుచ్యుత్పాదనార్థమ్ । యద్జ్ఞాత్వా యద్జ్ఞానం జ్ఞాత్వా ప్రాప్య మునయః సంన్యాసినో మననశీలాః సర్వే పరాం సిద్ధిం మోక్షాఖ్యా మితోఽస్మా ద్దేహబన్ధనా దూర్ధ్వం గతాః ప్రాప్తాః ॥ ॥౧॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నాం" అను శబ్దమునకు యజ్ఞాదిజ్ఞేయవస్తువిషయకమైన జ్ఞానము అని యర్థము. అమానిత్వాదులుకూడ జ్ఞానశబ్దముచే చెప్పబడినను ఇచట "జ్ఞానానాం" అను శబ్దమునకు అమానిత్వాదులు అర్థము కాదు. యజ్ఞాదిజ్ఞేయవస్తువిషయకమైన జ్ఞానములు మోక్షముకొరకు సమర్థములు కావు. ఈపరమాత్మవిషయకజ్ఞాన మన్ననో మోక్షము కొరకు సమర్థము. కాన నీజ్ఞానమును వినువాని బుద్ధియొక్క ప్రరోచనార్థము "పరం, ఉత్తమం" అను శబ్దములచే స్తుతించుచుండెను. ॥౧॥

---

అను నీప్రశ్నలపై యావిషయమునంతను వివరించుటకై యీ నతుర్దశాధ్యాయమును వివరించుచుండెను.— అందు రుచ్యుత్పాదనమునకై పర (బ్రహ్మ) జ్ఞానమును శ్రీకృష్ణభగవానులు స్తుతించుచుండెను.— "పరం జ్ఞానం ప్రవక్ష్యామి" బ్రహ్మవిషయక మగుటచే నుత్కృష్టమగు బ్రహ్మజ్ఞాన మనేకపర్యాయములు చెప్పబడినదైనను దీనిని నీకై తిరిగి చెప్పుచుంటిని. ఆ జ్ఞానస్వరూప మెట్టిదందువా? "జ్ఞానానా ముత్తమం" అమానిత్వాదికము, యజ్ఞాదికము జ్ఞానసాధనములు. అట్టి జ్ఞానసాధనములలో మోక్షఫలక మగుటచే నంతరంగమైన పరజ్ఞానమే యుత్తమమైనది. "అహం ఘటం జానామి" (నేను ఘటమును తెలిసికొనుచుంటిని.) అను స్థలమున అహమర్థముయొక్కయు; ఘటాకారవృత్తియొక్కయు, ఘటముయొక్కయు జ్ఞానము కలదుగాన విషయభేదము ననుసరించి మూడు జ్ఞానములు కలవు. అందు ఆద్యములగు అహమర్థము ఘటాకారవృత్తి విషయములుగాకల రెండుజ్ఞానములు కాక మూడవదియగు ఘటప్రకాశఫలరూపమగు జ్ఞానమే యుత్తమమైనది. అదియే పరబ్రహ్మస్వరూపమని యర్థము. "పరాగర్థప్రమేయేషు యా ఫలత్వేన సంమతా సంవిత్సైవేహ జ్ఞేయోఽర్థో వేదాంతోక్తిప్రమాణతః॥" పరాగ్రూపములగు ప్రమేయములయందు ఏజ్ఞానము ఫలరూపముగ సంమతమగునో యట్టి సంవిద్రూపబ్రహ్మమే యుపనిషద్వాక్యప్రామాణ్యము ననుసరించి తెలిసికొనదగును.) అని వార్తికకారులు నుడివిరి. "యద్జ్ఞాత్వా...గతాః" యేజ్ఞాన (బ్రహ్మ) మును వేదాంతవాక్యజన్యమగు ధీవృత్తిచే నపరోక్షముగా జేసికొని యీసంసారమును వీడి మోక్షము నొందిరో అట్టి జ్ఞానమును నీకొరకై చెప్పెదను. ॥౧॥

శాంకరభాష్యమ్:—

అస్యాశ్చ సిద్ధేరైకాన్తికత్వం దర్శయతి— ఇదం జ్ఞానం యథోక్త ముపాశ్రిత్య జ్ఞానసాధన మనుష్ఠాయేత్యేతత్ । మమ పరమేశ్వరస్య సాధర్మ్యం. మత్స్వరూపతా మాగతాః

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జ్ఞానఫలసిద్ధికి కర్మఫలవైలక్షణ్యరూపమైన ఐకాన్తికత్వము నీశ్లోకమునందు చూపుచుండెను.

—• ౧౪ వ అధ్యాయము ౨ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— గుణ, తత్కార్య జ్ఞానపూర్వకమైన బ్రహ్మనిష్ఠచే మోక్షరూపమగు పరమసిద్ధి (ఐకాంతికము) అవశ్యంభావి అని యీశ్లోకమున జెప్పుచుండెను.— "ఇదం...వ్యథంతిచ" ఈయక్తార్థమగు జ్ఞానసాధనమగు గుణ, తత్కార్య జ్ఞానము ననుష్ఠించి నాయొక్క (ఈశ్వరునియొక్క) యత్యంతాభేదరూపముననైన సాధర్మ్యమును పొందినవారు హిరణ్యగర్భాదులు బుట్టుసమయముననుగూడ బుట్టకుందురు. బ్రహ్మప్రలయకాలముననుగూడ నశింపకుందురు. ॥౨॥

శంకరానందీయము:— పునరావృత్తిరహితత్వాదికము కలదగుట విదేహముక్తి శ్రేష్ఠమైనది అని పూర్వము చెప్పినవిషయమునే విస్పష్టముగ జెప్పుచుండెను.— "ఇదం జ్ఞాన ముపాశ్రిత్య" ఈచెప్పుటకై యుపక్రాంతమైన- మోక్షమునకు జరమకారణమైన- గుణ, తత్కార్యవిషయక జ్ఞానము నాశ్రయించి (గుణములను, ఆగుణకార్యములను తెలిసికొని, బ్రహ్మనిష్ఠచే గుణత్రయము నతిక్రమించి) "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, అస్థూల మన ణ్వహ్రస్వమ్") ఈమొదలగు శ్రుతులయందు ప్రతిపాదితమైన, విశేషరహితుడనైన "మమ" నాయొక్క (పరబ్రహ్మముయొక్క) "సాధర్మ్యం" పూర్ణత్వమును అని యర్థము. (ఇట సాధర్మ్యమన సమానజాతి, రూపాదిమత్త్వమని యర్థము గ్రహింపరాదు. ఏమందురా? నిరవయవము, నిర్గుణము, నిర్విశేషము నగు బ్రహ్మమునకు సమానజాతి. రూపాదికము సంభవింపనేరదు. "అజాత మభూత మప్రతిష్ఠమశబ్ద మస్పర్శ మరూప మరస మగంధ మవ్యయమ్" అనియు; "అప్రాణమసుఖ మశ్రోత్ర మవా గమనోఽతేజస్క మచక్షుష్క మగోత్ర మశిరస్క మపాణిపాదమ్" అను నీశ్రుతులు బ్రహ్మమునకు సర్వధర్మములను నిషేధించుటచే బ్రహ్మము దృశ్యధర్మములేమియు లేనిది. అటుగాక దృశ్యధర్మములు కలదియే యన్నచో బ్రహ్మమునకు పరిచ్ఛిన్నత్వము, సావయవత్వము, అనిత్యత్వము మొదలగు దోషములు ప్రసక్తములయ్యెడిని. మరియు "ఆకాశవ త్సర్వగత శ్చ నిత్యః, సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ," అను శ్రుతులకు విరోధము ప్రాప్తించెడిని. కాన "పూర్ణ మదః పూర్ణ మిదం" అను శ్రుత్యుక్తరీతి నిట సాధర్మ్యమనగా పూర్ణత్వమే యని గ్రహింపనగును. అట్టి పూర్ణత్వమును పొందిన బ్రహ్మవేత్తలగు యతులు "సర్గేపి" మహదాదిప్రాకృతసృష్టియందుగూడ 'నోపజాయంతే' పుట్టకుందురు. (జన్మబీజమగు ప్రకృతి నతిక్రమించి, చిదేకరసస్వరూపులగుటచే నట్టివారికి ప్రకృతిసంబంధ ముండదుగాన మహాసృష్టి సమయమందుగూడ నుత్పత్తి యుండదని యర్థము.) అట్లే "ప్రలయే న వ్యథంతి చ" హిరణ్యగర్భనాశకాలమగు మహాప్రలయమందుగూడ నశింపరు. (పరమసూక్ష్మబ్రహ్మభావము నొందిన యట్టివారు ప్రలయకాలికమగు క్రియకు అవిషయులగుటచే వారికి గొంచెమైనను చలన ముండదని యర్థము)

శాంకరభాష్యమ్:—

ప్రాప్తా ఇత్యర్థో న తు సమానధర్మతాం సాధర్మ్యం క్షేత్రజ్ఞేశ్వరయో ర్భేదానభ్యుపగమా ద్గీతాశాస్త్రే। ఫలవాదశ్చాయం స్తుత్యర్థ ముచ్యతే। సర్గేఽపి సృష్టికాలేఽపి నోపజాయన్తే నోత్పద్యన్తే, ప్రళయే బ్రహ్మణోఽపి వినాశకాలే న వ్యథన్తి చ వ్యథాం నాఽఽపద్యన్తే న చ్యవన్తీత్యర్థః ॥ ॥ ౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వమునందు చెప్పబడిన జ్ఞానసాధనము ననుష్ఠించి నాస్వరూపత్వమును పొందిరి. గీతాశాస్త్రమునందు క్షేత్రజ్ఞేశ్వరులకు భేదము నంగీకరింపనందున ఇచట సాధర్మ్య మనగ సమానధర్మత్వమని యర్థము కాదు. స్తుతినిమిత్త మీఫలవాదము చెప్పబడెను. సృష్టికాలము నందును పుట్టరు. బ్రహ్మ (హిరణ్యగర్భుని) యొక్క వినాశకాలమునందును వ్యథను పొందరు. ॥ ౨॥

బ్రహ్మభావము నొందిన ముక్తులకు జన్మమరణములు లేవందురుగదా! అట్టియెడ అప్రసక్తములగు వీజన్మ మరణములు కలుగుటలేదని చెప్పుటచే నప్రసక్తప్రతిషేధరూపమగు దోషము ప్రాప్తింపదా! యని శంకింపరాదు. ఏమన: శివ, విష్ణ్వాదిలోకములందు సారూప్యాదిముక్తులను పొందినవారు మహాసృష్టిసమయమున జన్మించుటయు, మహాప్రళయమునందు నశించుటయు సంభవించును. ఇట్లే బ్రహ్మభావము నొందిన ముక్తులకు జన్మలయములు కలుగునని పండితులకుగూడ సంశయము కలుగవచ్చును. అట్టి సంశయము నివర్తించుటకును, ముముక్షువులకు నిస్సందేహముగ విదేహముక్తియెడ బ్రవృత్తి కలుగుటకును పైవిధముగ జెప్పం బడెను. బ్రహ్మవిద్వ్యతిరిక్తులగు సారూప్యాదిముక్తులకు జన్మప్రళయములు కలవని చెప్పుటకు శ్లోకమే ప్రమాణము. మరియు భాగవతమునందు కొలువైయున్న జయవిజయులును ప్రమాణము. ॥ ౨॥

భాష్యోత్కర్షదీపికా:— కర్మఫలములకంటె మోక్షరూపమగు సిద్ధి యుత్కృష్టమగుటకును, తత్సాధనమగు జ్ఞాన ముత్తమమగుటకును హేతు వేమి? అను ప్రశ్నపై నిట మోక్షరూపమగు సిద్ధి నియతమైనదని చెప్పుచున్నాడు.— "ఇదం జ్ఞాన ముపాశ్రిత్య" పూర్వోక్తము, వక్ష్యమాణమునగు నీజ్ఞానము నాశ్రయించి శ్రవణమననాది జ్ఞానసాధనముల ననుష్ఠించి, "మమ సాధర్మ్య మాగతాః" నాదు స్వరూపత్వము నొందినవారు "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" అను శ్రుత్యుక్తరీతిని బ్రహ్మస్వరూపులైనవారు అని యర్థము. ఇట (సాధర్మ్యమన సమానధర్మత్వమని భ్రమింపదగదు. ఏమన: యీగీతాశాస్త్రమున క్షేత్రక్షేత్రజ్ఞులకు భేదము నంగీకరింపలేదు. గాన భిన్నవస్తువులకే సమానధర్మత్వ ముండునుగాని యభిన్నవస్తువుల కది యుపపన్నము గానేరదు. మరియు, ప్రస్తుతప్రసక్తమైన జ్ఞానఫలమును విడచి అప్రస్తుత ధ్యానఫలమును స్వీకరించుటయు నగును. కాన నిట సాధర్మ్యమన సమానధర్మత్వమని భ్రమింపక, బ్రహ్మస్వరూపత్వము అను నర్థమునే గ్రహింపనగును.) అట్టివారు "సర్గేపి నోపజాయంతే" బ్రహ్మసృష్టికాలమునగూడ జన్మింపరు. "ప్రలయే న వ్యథంతి చ" బ్రహ్మప్రలయకాలమునందుగూడ నశింపరు. అట్టివారు ఆవాంతర సృష్టి, ప్రలయములందు జన్మలయముల నొందరని వేరే చెప్పవలెనా? అని ఇట నున్న "అపి" శబ్దమున కర్థము. ॥ ౨॥



గీ॥ మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మి న్గర్భం దధా మ్యహమ్ ।
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత । ॥౩॥

పదవిభాగము:— మమ– యోనిః– మహత్– బ్రహ్మ–తస్మిన్– గర్భం– దధామి– అహం– సంభవః– సర్వభూతానాం– తతః– భవతి– భారత ॥ ॥౩॥

ప్రతిపదార్థము:— మమ=నాసంబంధమై త్రిగుణాత్మికమైన ప్రకృతి; సర్వభూతానాం=నిఖిలభూతములకు: మహత్=గొప్పదైన; బ్రహ్మ=బ్రహ్మరూపమైన; యోనిః=కారణము; తస్మిన్=అప్రకృతిరూపమైనయోనియందే (కారణము) నందే; అహం=నేను; గర్భం=బీజమును; దధామి=ఉంచుచుంటిని; తతః=అబీజాధానమువలన; సర్వభూతానాం=నిఖిలభూతములయొక్క: సంభవః=ఉత్పత్తి; హేభారత=ఓభరతవంశసంభూతుడవైన యర్జున!: భవతి=అగుచున్నది. ॥౩॥

శాంకరభాష్యమ్:—

క్షేత్రక్షేత్రజ్ఞసంయోగ ఈదృశో భూతకారణ మిత్యాహ— మమ స్వభూతా మదీయా మాయా త్రిగుణాత్మికా ప్రకృతి ర్యోనిః సర్వభూతానాం సర్వకార్యేభ్యో

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భూతకారణమైన క్షేత్రక్షేత్రజ్ఞసంయోగ మిట్టిదని చెప్పుచుండెను.

నాసంబంధమైన త్రిగుణాత్మకమైన ప్రకృతి యనెడి మాయయే సర్వభూతములకు గొప్పదైన బ్రహ్మమైన యోని. (కారణము) ఈప్రకృతియే సర్వకార్యముల కంటె గొప్ప

నీలకంఠీయము:— "ఇదం జ్ఞాన ముపాశ్రిత్య" విషయవిషయిరూపవికల్పవినిర్ముక్తమైన యీజ్ఞానము నాశ్రయించి, 'మమ' ఈశ్వరుడనగు నాయొక్క "సాధర్మ్య ముపాగతాః" సర్వాత్మత్వము, సర్వనియంతృత్వము, సర్వభావాధిష్ఠాతృత్వము, మొదలగు ధర్మములయొక్క సామ్యము నొందినవారు "సర్గేపి ...వ్యథంతి చ" సృష్టికాలమున జన్మింపరు. మరియు ప్రళయకాలమున నశింపరు. "య ఏవ వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి సర్వస్య వశీ సర్వస్యేశానః సర్వస్యాధిపతిః స న సాధునా కర్మణా భూయాన్ నో ఏవాసాధునా కనీయాన్" (ఎవడు 'నేను బ్రహ్మనైతి' నని తెలిసికొనునో అట్టివాడు ఈసర్వస్వరూపుడునగును; సర్వమునకు వశియగును; సర్వమునకు ప్రభువగును. సర్వఅధిపతియగును; అట్టివాడు పుణ్యకర్మచే గొప్పవాడును, పాపకర్మచే తక్కువవాడును గాడు.) అనుశ్రుతి జ్ఞానఫలమును ఈశ్వరసాధర్మ్యప్రాప్తిగా జెప్పుచున్నది. మరియు భుసుండిప్రభృతులు జ్ఞానబలముచేతనే సృష్టికాలమున పుట్టుటలేదు. ప్రలయకాలమునందు నశించుటయు లేదు. ఈరెండుశ్లోకములు చెప్పబోవు గుణ, తత్కార్యజ్ఞానపరములుగ భాష్యమున వ్యాఖ్యానింపబడినవి. ॥౨॥

—• ౧౪ వ అధ్యాయము, ౩ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈవిధముగ ప్రశంసించి శ్రోతను అభిముఖునిగా జేసుకొని,, సర్వభూతోత్పత్తినిగూర్చి ప్రకృతిపురుషులు పరమేశ్వరాధీనులయియే హేతువగుదురుగాని నిరీశ్వరసాంఖ్యసిద్ధాంతమునందువలె స్వతంత్రముగ గారణముగాదు. అని రెండు శ్లోకములచే జెప్పుచుండెను.—

కార్యము లన్నిటిలో నధికమగునది యగుటచే మహచ్ఛబ్దవాచ్యము, కార్యములన్నిటికి వృద్ధిహేతువగు

  

శాంకరభాష్యమ్:—

మహత్త్వా ద్భరణాచ్చ స్వవికారాణాం మహ ద్బ్రహ్మేతి యోని రేవ విశిష్యతే । తస్మి న్మహతి బ్రహ్మణి యోనౌ గర్భం హిరణ్యగర్భస్య జన్మనో బీజం సర్వభూతజన్మకారణం బీజం దధామి నిక్షిపామి, క్షేత్రక్షేత్రజ్ఞప్రకృతిద్వయశక్తిమా నీశ్వరోఽహ మవిద్యాకామకర్మోపాధిస్వరూ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దగుటవలన మహత్తు అనియు తనవికారము ననుభవించుటవలన బ్రహ్మ అనియు ప్రకృతిరూప యోనియే "మహత్, బ్రహ్మ" అను విశేషణములచే విశేషింపబడెను. అట్టి మహద్రూపమైన బ్రహ్మస్వరూపమైన యోనియందే నేను సర్వభూతజన్మకారణమైన హిరణ్యగర్భునియొక్క జన్మకు బీజమును ఉంచుచుంటిని. క్షేత్రక్షేత్రజ్ఞప్రకృతిద్వయశక్తి కల యీశ్వరస్వరూప

బృంహణము కలదగుట బ్రహ్మశబ్దవాచ్యము, అవ్యాకృతము నగు ప్రకృతి (త్రిగుణాత్మిక యగు మాయ) "మహత్, బ్రహ్మ" అనబడును. ఆమాయ "మమ యోనిః" ఈశ్వరుడ నగు నాకు గర్భము నుంచుటకు తగు స్థానము. "తస్మి న్గర్భం దధా మ్యహం" నే నా మాయయందు సర్వభూతజన్మ కారణమగు "బహు స్యాం ప్రజాయేయ" అను ఈక్షణరూపమైన సంకల్పమును గర్భముగ నుంచెదను. (అట్టి సంకల్పములో విషయము చేయుదును.) లోకమున యొకానొకడు (తండ్రి) తనయందు వ్రీహ్యాదిరూపమున స్వకర్మబద్ధుడై లీనమై యున్న పుత్రుని శరీరయుక్తుని జేయుటకై యోనియందు రేతస్సేకపూర్వకముగ గర్భము నుంచును. ఆగర్భాధానమువలన బుత్రుడు శరీరయోగము కలవాడగును. ఆశరీరయోగమునకై మధ్యకాలమున కల లాద్యవస్థలు కలుగుచున్నవి. ఈవిధముగనే ప్రళయమునందు నాయందు లీనమైయున్న యవిద్యాకామకర్మా నుశయముగల క్షేత్రజ్ఞుని సృష్టిసమయమున భోగార్థ మగు క్షేత్రము (కార్యకరణసంఘాతము) తో గూర్చుటకై నేను చిదాభాసమనెడు రేతస్సేకమును జేసి, మాయావృత్తిరూప మగు గర్భము నుంచెదను. ఆగర్భ నిమిత్తమై మధ్యకాలమునందు ఆకాశ, వాయు, తేజో, జల, పృథివ్యాద్యుత్పత్త్యవస్థలు కలుగుచున్నవి. కాన నిట్టి గర్భాధానమువలననే హిరణ్యగర్భాది సర్వభూతముల యుత్పత్తియు జరుగుచున్నది. ఇంతియేగాని యీశ్వరకృత మగు గర్భాధానము (సంకల్పము) లేకుండగ నుత్పత్తి జరుగనేరదని యర్థము. ॥3॥

శంకరానందీయము:— పైవిధముగ గుణములయొక్కయు, తత్కార్యములయొక్కయు జ్ఞానము— సముత్పన్నాత్మజ్ఞానమునకు రక్షాహేతువగుటవలనను, గుణత్రయము నతిక్రమించుటకు సాధనమగుట వలనను, నీవిధముగ (పరంపరగ) విదేహముక్తికి కారణ మగునని ప్రతిపాదించి, ప్రకృతియు, ప్రకృతిగుణ ములుగూడ నాదు (ఈశ్వరుని) శక్తిసామర్థ్యమును పురస్కరించుకొనియే తమతమ కార్యముల నిర్వహించు చున్నవిగాని స్వతంత్రముగ నిర్వహింపనేరవని సూచించుటకై ప్రకృతికి స్వశక్తిసంబంధమును, సర్వభూతో త్పాదకత్వము నీశ్లోకమున ప్రతిపాదించుచుండెను.— "మమ" నాసంబంధమగు (నాకు ఉపాధిభూతము, మత్స్వరూపము, గుణత్రయసామ్యావస్థారూపము నగు) ప్రకృతి "యోనిః" సర్వభూతోత్పత్తికి కారణము. అప్రకృతి తన కార్యము లన్నిటికంటెను గొప్పది యగుటచే "మహత్" అనబడును. మరియు నాప్రకృతి తన కార్యములకు బృంహకమగుటచే, లేక బ్రహ్మకుపాధియగుటచేగాని "బ్రహ్మ" బ్రహ్మమనబడును. "తస్మిన్" అట్టిజగద్బీజము, బ్రహ్మము నగు నవ్యక్తమునందు సాక్షాత్తుగ గాని, పరంపరగగాని కార్య కారణరూపముగ పరిణమించుటకై ప్రకృత్యవచ్ఛిన్న చైతన్యస్వరూపుడ నగు "అహం" నేను (ఈశ్వరుడు

శాంకరభాష్యమ్:—

పానువిధాయినం క్షేత్రజ్ఞం క్షేత్రేణ సంయోజయామీత్యర్థః । సంభవ ఉత్పత్తిః సర్వభూతానాం హిరణ్యగర్భోత్పత్తిద్వారేణ తత స్తస్మా ద్గర్భాధానా ద్భవతి హే భారత! ॥ ॥3॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మగు నేను క్షేత్రజ్ఞుని అవిద్యాకామకర్మోపాధిస్వరూపానువిధాయునిగ క్షేత్రముతో సంయోజనము చేయుచుంటిని. అని యర్థము. అట్టి గర్భాధానమువలననే హిరణ్యగర్భోత్పత్తి ద్వారమున సర్వభూతములయొక్క యుత్పత్తి ఓభరతవంశోద్భవుడవగు యర్జున! యగుచున్నది. ॥3॥

తనుపహితానంతశక్తి సంపన్నుడనై స్వాభాసరూపము, ప్రకృతి, తద్గుణవికారవిజృంభణరూపము నగు "గర్భం దధామి" గర్భమునుంచుచుంటిని. "తతః" మదాభాససంభావితసామర్థ్యము చేతనే మదాభాసశక్తి సమన్విత మగుప్రకృతినుండియే "సర్వభూతానాం సంభవో భవతి" మహదాదిక్రమముగ ఆకాశాది సర్వభూతములయొక్కయు. ఆభూతకార్యములయొక్కయు, చతుర్విధప్రాణి శరీరములయొక్కయు నుత్పత్తి యగుచున్నది. ॥3॥

భాష్యోత్కర్షదీపిక:— జ్ఞానస్తుతిచే సమాహితమైన చిత్తముకల యర్జునునకు- ఇట్టి క్షేత్రక్షేత్రజ్ఞసంయోగము భూతకారణమని వివక్షితార్థమును చెప్పుచున్నాడు "మమ" నాయొక్క (స్వతంత్రగాకమదధీనస్థితయైన) త్రిగుణాత్మకమైన ప్రకృతి (మాయ) సర్వభూతములకు (యోని) కారణము. ఆప్రకృతి సర్వకార్యములకంటె పెద్దది యగుట "మహత్" అనబడును; సర్వవికారజాతమును భరించుటచే "బ్రహ్మ" అనబడును. ఉక్త ప్రకృతిరూప మగు యోనియందు హిరణ్యగర్భాది సర్వభూతములకు జన్మకారణమగు బీజమును నేనుంచుచుంటిని. క్షేత్రక్షేత్రజ్ఞ ప్రకృతిద్వయ శక్తిమంతుడ నగు నేను (ఈశ్వరుడు) అవిద్యాకామకర్మోపాధిస్వరూపానువిధాయక మగు క్షేత్రజ్ఞుని క్షేత్రముతోఁ గలుపుదు నని యర్థము. కాన యట్టి గర్భాధానమువలన హిరణ్యగర్భాది స్తంబపర్యంతము అగు సర్వభూతములయొక్క యుత్పత్తి యగుచున్నది. ఇట- హిరణ్యగర్భుడు అట్టి గర్భాధానమువలన నుత్పన్నుడైనను, ఇతరులందరును స్వస్వమాతృ పిత్రాదికమునుండియే యుద్భవించుచుండిరి. గాన సర్వభూతములకు నట్టి పూర్వోక్త గర్భాధానమువలన సంభవ మెట్లుపపన్నమగును? అను శంక కలుగుచున్నది. అట్టి శంకానిరాసమునకై "భారత!" అని సంభోధించెను. ఎట్లుతల్లిదండ్రులనుండి బుట్టిన నీ బోంట్లు భరతోద్భవులుగా వ్యవహరింపబడుచుండిరో అట్లే సర్వభూతములును వారివారి పితృమాత్రాదికమునుండి కల్గుచున్నను, పరమకారణ మగు ప్రకృత్యుద్భవులుగ వ్యపదేశింపబడెనని సంబోధనాశయము. ॥3॥

నీలకంఠీయము:— భూతప్రకృతి యన నెట్టిది? అయ్యది దేనిని యాశ్రయముగా జేసుకొని భూతజనక మగుచున్నది? అను ప్రశ్నములకు సమాధానముగ నీశ్లోకమును జెప్పుచున్నాడు— "మమ" శుద్ధ చిన్మాత్రస్వరూపుడ నగు నాకు "యోనిః" ప్రవేశస్థానము, "మహద్బ్రహ్మ" ప్రథమకార్య మగు మహత్తత్త్వమునకు బృంహకము (కారణము) అవ్యక్తమనియు, అవ్యాకృతమనియు నామములచే వ్యవహరింపబడునదియు, త్రిగుణాత్మక మగు మాయ యనునది కలదు. "తస్మిన్ గర్భం దధా మ్యహం" చిదాత్మ నగు నేను ఆమాయయందు స్వప్రతిబింబరూప మగు గర్భము నర్పించుచుంటిని. "తతః" నాప్రతిబింబగర్భితమగు

గీ॥ సర్వయోనిషు కౌన్తేయ! మూర్తయ స్సంభవన్తి యాః ।
తాసాం బ్రహ్మ మహ ద్యోని రహం బీజప్రదః పితా ॥ ॥౪॥

పదవిభాగము:— సర్వయోనిషు- కౌన్తేయ- మూర్తయః- సంభవన్తి- యాః- తాసాం- బ్రహ్మ- మహత్- యోనిః- అహం- బీజప్రదః- పితా ॥ ॥౪॥

ప్రతిపదార్థము:— హే కౌన్తేయ!=ఓ యర్జునా!; సర్వభూతేషు=దేవపితృమనుష్యపశుమృగాది నిఖిల యోనులయందు; యాః=ఏ; మూర్తయః=దేహసంస్థానరూపమైన మూర్తులు; సంభవన్తి=పుట్టుచున్నవో; తాసాం=ఆమూర్తులకు; మహద్బ్రహ్మ=మహద్బ్రహ్మరూపమైన మాయ; యోనిః=కారణము; అహం=నేను; బీజప్రదః=బీజము నిచ్చు; పితా=తండ్రిని. ॥౪॥

శాంకరభాష్యమ్:—

సర్వయోని ష్వితి । దేవపితృమనుష్యపశుమృగాదిసర్వయోనిషు కౌన్తేయ! మూర్తయో దేహసంస్థానలక్షణా మూర్ఛితాఙ్గావయవా మూర్తయః సమ్భవన్తి యా స్తా సాం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కుంతీపుత్రుడవగు నోయర్జునా! దేవ, పితృ, మనుష్య, పశు, మృగాది సర్వయోనులయందు యే దేహసంస్థానరూపమైన మూర్ఛితాంగావయవరూపమైన మూర్తులు సంభవించుచున్నవో

మాయనుండి "సర్వభూతానాం సంభవః భవతి భారత!" ఓభరతవంశోద్భవా! భవనధర్మములు గల మహదాదులయొక్కయు, హిరణ్యగర్భాదులయొక్కయు నుత్పత్తి యగుచున్నది. (ఈప్రకృతి చిదాత్మయొక్క ప్రతిబింబము నపేక్షించునని చెప్పుటచే సాంఖ్యమతాభిమత మగు స్వాతంత్ర్యము నిరసింపబడెను. ॥౩॥

—• ౧౪ వ అధ్యాయము ౪ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— దేవగంధర్వాదుల దేహము లనేకవిధములుగ నుండును. అవి వేశ్వేర కారణముల వలన కల్గుచున్నవి. కాన నట్టి వివిధములగు దేహములకు ఒక ప్రకృతియే కారణ మను టెట్లు పొసగు నను యాశంకపై జెప్పుచున్నాడు. "సర్వయోనిషు...యాః" ఓయర్జునా! దేవతలు, పితరులు, మనుష్యులు, పశువులు, మృగములు మొదలగు సర్వయోనులయందు జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్జాది భేదముతో వివిధసంస్థానవిశేషములతో నేయే శరీరములు పుట్టుచున్నవో "తాసాం... యోనిః" ఆట్టి శరీరము లన్నిటికి ఆయా కారణభావము నొందిన ప్రకృతియే మాతృస్థానము. "అహం...పితా" నేను (పరమేశ్వరుడు) గర్భధానకర్త నగు జనకుడను. కాన ప్రకృతియొక్క యవస్థావిశేషములే యీవివిధ కారణములనియు, నానినుండియే యీసర్వభూతముల యుత్పత్తి గల్గుచున్నదనియు లెస్సగ జెప్పుటచే "సర్వభూతములు ప్రకృతి సంభవము లని జెప్పుట యుక్తముగనే యున్నది. ॥౪॥

శంకరానందీయము:— తన (ఈశ్వర) యనుగ్రహ బలము నాధారముగ జేసుకొనియే ప్రకృతి సర్వభూతోత్పాదక మగుచున్నదని ప్రతిపాదించి, ప్రస్తుతము ప్రకృతి సర్వభూతప్రసవిత్రి యగుటచే జగజ్జనని యనియు, తాను (ఈశ్వరుడు) గర్భాధానకారణమగుట జగజ్జనకు డనియు, ప్రతిపాదించుటకై యీశ్లోకమును జెప్పుచుండెను. "సర్వయోనిషు" దేవతిర్యఙ్మనుష్యాదులయందు "యా మూర్తయస్సంభవంతి" యేప్రాణుల దేహములు పుట్టుచున్నవో "తాసాం బ్రహ్మ మహ ద్యోనిః" అశరీరములకు

గీ॥ సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః ।
నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్ ॥ ౫॥

పదవిభాగము:— సత్త్వం- రజః- తమః- ఇతి- గుణాః- ప్రకృతిసంభవాః- నిబధ్నన్తి - మహాబాహో- దేహే- దేహినం- అవ్యయమ్ ॥ ॥౫॥

ప్రతిపదార్థము:— హేమహాబాహో=ఓగొప్పబాహువులు కల యర్జునా!; సత్త్వం=సత్త్వము; రజః=రజస్సు; తమః=తమస్సు; ఇతి=ఇట్టిపేర్లుగల; గుణాః=గుణములు; ప్రకృతిసంభవాః=భగవన్మాయా సంభవములై; దేహే=దేహమునందు; అవ్యయం=నాశరహితమైన; దేహినం= దేహముకల క్షేత్రజ్ఞుని, నిబధ్నన్తీవ=బంధించుచున్నవి వలె నున్నవి. ॥౫॥

---

శాంకరభాష్యమ్:—

మూర్తీనాం బ్రహ్మ మహ త్సర్వావస్థం యోనిః కారణ మహం మీశో బీజప్రదో గర్భాధానస్య కర్తా పితా ॥ ॥౪॥

కే గుణాః కథం బధ్నన్తీత్యుచ్యతే— సత్త్వం రజ స్తమ ఇత్యేవంనామానో, గుణా ఇతి పారిభాషికః శబ్దో న రూపాదివ ద్ద్రవ్యాశ్రితాః । నచ గుణగుణినో రన్యత్వ మత్ర వివ

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆమూర్తులకు సంతతమున్న మహద్బ్రహ్మస్వరూపమైన మాయయే కారణము. పరమేశ్వరుడు బీజప్రదుడు. గర్భాధానకర్తయైన తండ్రి. ॥౪॥

గుణములేవి? ఆగుణములు క్షేత్రజ్ఞుని యెటుల బంధించుచున్నవి? అను శంకపై చెప్పుచుండెను—

---

ప్రకృతి తల్లియు, "అహం బీజప్రదః పితా" గర్భప్రదాత నగు నేను తండ్రిని అగుచుంటిని. ఈ చెప్పుటచే దల్లియగు ప్రకృతియొక్కయు, దండ్రినగు నాయొక్కయు ననుగ్రహమువలననే మోక్షము ప్రాప్తించునని సూచితమయ్యెను. "జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వః" అనియు, "తగ్ంహ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే" అను శ్రుతులు ప్రకృతి, ఈశ్వరుడు వీరిద్దరియొక్క యనుగ్రహముచేతనే ముక్తుడగునని చెప్పుచున్నవి. మరియు, "బుద్ధిప్రసాదాచ్చ శివప్రసాదా ద్గురుప్రసాదా త్పురుషస్య ముక్తిః" (ఈ స్మృతియు బుద్ధి (ప్రకృతి) ప్రసాదములవలనను, శివ (ఈశ్వర) ప్రసాదమువలనను, సద్గురుప్రసాదమువలనను మోక్షము ప్రాప్తించుచున్నది.) అని చెప్పుచున్నది. ॥౪॥

—• ౧౪ వ అధ్యాయము ౫ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వోక్తవిధముగ నిరీశ్వరసాంఖ్యమతనిరాకరణముచే క్షేత్రక్షేత్రజ్ఞసంయోగ మీశ్వరాధీన మని చెప్పి, ప్రస్తుతము ఏఏగుణమునందు సంగ మెట్లు కల్గును? గుణము లనవెవ్వి? ఆగుణము లెట్లు బంధించును? అను ప్రశ్నములకు సమాధానమును ఈశ్లోకము మొదలుకొని "నాఽన్యం గుణేభ్యః కర్తారం" అను శ్లోకమువరకు గల పదునాల్గు శ్లోకములచే జెప్పుచుండెను—

శాంకరభాష్యమ్:—

క్షితమ్ । తస్మాద్గుణా ఇవ నిత్యపరతన్త్రాః క్షేత్రజ్ఞం ప్రత్యవిద్యాత్మకత్వా త్క్షేత్రజ్ఞం నిబధ్నన్తీవ తమాస్పదీకృత్యాఽఽత్మానం ప్రతిలభన్త ఇతి నిబధ్నన్తీ త్యుచ్యతే! తే చ ప్రకృతిసంభవా భగవన్మాయాసంభవా నిబధ్నన్తీవ హే మహాబాహో! మహాన్తౌ సమర్థతరౌ వా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సత్త్వము, రజస్సు, తమస్సు అను పేర్లు గలవి గుణములు. ఇచట "గుణాః" అను శబ్దము పారిభాషికము. (తార్కికులు చెప్పునటుల) రూపరసగంధాదులువలె ద్రవ్యాశ్రితములు కావు. తార్కికులు ద్రవ్య (గుణి) గుణములకు పరస్పరభేదమంగీకరించినటుల) మాయకు మాయాగుణము లగు సత్త్వరజస్తమస్సులకు భేదము వివక్షితము కాదు. (అనగా భేదము

"సత్త్వం...సంభవాః" సత్త్వము, రజస్సు, తమస్సు అను గుణములు నిత్యపరతంత్రములు. (పురుషునిగూర్చి యచేతనములు చేతనాధీనములే యగునుగాన గుణములు పరతంత్రము అని యర్థము.) వైశేషికులు గుణములు భేదసంబంధమగు సమవాయసంబంధముచే గుణి (ద్రవ్యము) నందుండునవి యని యంగీకరించిరి. ఇట గుణశబ్దముచే నిట్టి గుణములు వివక్షితము గావు. ఏమన: ఇట గుణములకు భేదము గాక యభేదమే చెప్పఁబడెను. ప్రకృతి గుణత్రయాత్మకముగనే చెప్పబడెను. అట్లయిన "గుణాః ప్రకృతిసంభవాః" అనుట యెట్లు పొసగునందువా? వినుము — ఆగుణముల మూడింటియొక్క సామ్యావస్థయే భగవత్ప్రకృతి యనియు, మాయ యనియు బిలువబడుచున్నది. అట్టి మూడును౦డి పరస్పరాంగాంగీభావముతో విషమముగా పరిణమించిన గుణములు ప్రకృతిసంభవము లగును. కావున నుక్తానుపపత్తి లేదని తెలిసికొనదగును. ఆవిధముగ బరిణమించిన గుణములు "నిబధ్నంతి...అవ్యయం" ప్రకృతికార్యమగు శరీరేంద్రియాది కార్యకరణసంఘాతమునందు-స్వతః సర్వవిక్రియాశూన్య మగుటచే నవ్యయుడైనను, దేహతాదాత్మ్యాధ్యాసాపన్ను డగు జీవుని బంధించుచున్నవి. అనగా ఆకాశమున నిశ్చలముగనున్న సూర్యుడు జలపాత్రములందు ప్రతిబింబింపగా స్వీయకంపాదికముచే ప్రతిబింబాధ్యాసను పురస్కరించుకొని "సూర్యుడు చలించుచుండె" నను భ్రమను కల్గించునట్లు సర్వవిక్రియాశూన్య మగు శుద్ధపరబ్రహ్మము- దేహాదితాదాత్మ్యాధ్యాసాపన్నమై జీవశబ్దవాచ్యమయి దేహాదిగతవికారములు కలదిగా భ్రాంతిచే కన్పట్టుచున్నదిగాని వస్తుతః పరమాత్మకు గుణాదికృతబంధము లేదని యర్థము. ॥౫॥

శంకరానందీయము:— ప్రకృతికిగాని, ప్రకృతిగుణములకుగాని తన (ఈశ్వరుని) యనుగ్రహబలముచేతనే కార్యకరణసామర్థ్యము కల్గుచున్నదని ప్రతిపాదించి, ప్రస్తుతము గుణవిభాగపూర్వకముగ వానికి గల బంధకత్వమును జెప్పుచుండెను.— "సత్త్వం రజ స్తమ ఇతి" సత్త్వము, రజస్సు, తమస్సు, అనెడి గుణములు "ప్రకృతిసంభవాః" ప్రకృతియే యుపాదాన కారణముగ గలవి. ఇట ముక్తిసాధన మగుటంజేసి యుత్కృష్టమగుటచే బ్రథమమున సత్త్వమును నిర్దేశించెను. సర్వమునకు ప్రవృత్తికారణము గాన సత్త్వగుణనిర్దేశానంతరము రజోగుణమును నిర్దేశించెను. రజోగుణముకంటె నపకృష్టమ (తక్కువని) గుటచే దరువాత తమోగుణమును నిర్దేశించెను. ఈసత్త్వరజస్తమోగుణములు రూపాదులువలె కేవలద్రవ్యాశ్రితములే గావు. మరేమన: ప్రకృతికార్యము అగుటంజేసి సర్వగతము అగును: కార్యకారణముల కభేదముగాన కారణమగు ప్రకృతి సర్వగతగాన నీసత్త్వాదికముకూడ సర్వగతము (అర్థము.)

శాంకరభాష్యమ్:—

**జానుప్రలమ్బౌ బాహూ యస్య స మహాబాహు స్త్వం మహాబాహో! దేహే శరీరే దేహినం దేహవన్త మవ్యయ మవ్యయత్వం చోక్త మనాదిత్వాదిత్యాది శ్లోకే। నను దేహీ న లిప్యత ఇత్యుక్తం త త్కథ మిహ నిబధ్నన్తీ త్యన్యథోచ్యతే, పరిహృత మస్మాభి రివశబ్దేన నిబధ్నన్తీ వేతి ॥**

॥౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లేదనుట) అందువలన సత్త్వరజస్తమస్సులు క్షేత్రజ్ఞునికూర్చి నిత్యపరతంత్రములై, అవిద్యాత్మకము లగుటవలన క్షేత్రజ్ఞుని బంధించుచున్నవి వలె క్షేత్రజ్ఞుని యాస్పదముగ జేసుకొని స్వస్వరూపమును పొందుచున్నవి. కాన క్షేత్రజ్ఞుని బంధించుచున్నవని చెప్పబడుచుండెను. జానుపర్యంతము వ్రేలాడు బాహువులు కల యో యర్జున! ఆగుణములు భగవన్మాయా సంభవములై దేహవంతుడైన నాశరహితుడైన క్షేత్రజ్ఞుని శరీరమునందు బంధించుచున్నవి వలె నున్నవి. క్షేత్రజ్ఞున కవ్యయత్వము "అనాదిత్వాత్" అను శ్లోకమునం దిదివరకే చెప్పబడెను. పూర్వమునందు దేహి లేపమును పొందడని చెప్పబడెను. ఇచట దానికి వ్యతిరేకముగ గుణములు దేహిని బంధించుచున్నవని యెటుల చెప్పబడెనని శంకింపజనదు. ఇట్టిశంకను తొలగించుటకే "నిబధ్నన్తీవ" అని "ఇవ" శబ్దప్రయోగము చేయబడెను. అందువలన బంధించుచున్నవి వలె నున్నవి. అనగా బంధించుట లేదని యర్థము.

॥౫॥

కాన నీజగత్తంతయు గుణస్వరూపమే. కనుకనే వెలుపల విషయరూపముగను, లోపల రాగద్వేషలోభాదిరూపముగను, నిద్రాలస్యప్రమాదాదిరూపముగను, శమదమసత్యదయాదాక్షిణ్యాదిరూపముగను, సర్వత్ర వర్తమానము లగు ఈ గుణములు– "అవ్యయం దేహినం దేహే నిబధ్నంతి" స్వయముగ నాశరహితుడగు ఆత్మను స్వీయవికార వ్యాప్తిచే తిరోహిత మగు ప్రత్యగ్భావము కలవానిగను, దేహమునందే యాత్మభావము నొందినవానిగను జేసి, దేహమునందును దేహకర్మల యందును, దేహధర్మములందును, అహంమమాభిమానాభినివేశమును కలుగజేసి జన్మమరణాదికముతో గూర్చి బాధించుచున్నవి. ఇట ఆత్మ యగు క్షేత్రజ్ఞునకు క్షేత్రముయొక్కయు; తద్ధర్మములయొక్కయు, తత్కర్మల యొక్కయు సంబంధము లేదనియు, ఆత్మకు కర్తృత్వము, లేపము లేదనియు పూర్వము చెప్పబడెను. అట్టి కూటస్థాసంగచిద్రూప మగు నాత్మకు సత్త్వాదిగుణములచే నగు బంధ మెట్లు పొసగును? అను ప్రశ్న కలుగుచున్నది. ఇట చెప్పెదము వినుడు.— నిష్కలము. నిష్క్రియము, అసంగము నగు ఆత్మకు జ్ఞానదశ యందుగాని, యజ్ఞానదశయందుగాని వస్తుతః బంధమే లేదు. అట్టి బంధమే యున్నచో వాస్తవ మగు నట్టి బంధమునుండి మోక్షమే యుపపన్నము గాదు గాన నిరవయవము నసంగము నగు ఆత్మకు సూర్యునకు జీకటితో సంబంధము లేనట్లు అవిద్య, తత్కార్యములతో సంబంధము లేదు. స్వానుభూతియెడ ప్రమాదము నొందు బ్రహ్మవిద్యతికి యనాత్మాధ్యాసము, దానివలన సత్త్వాదిగుణములచే భేదింపబడుటయు సంభవించును. నిత్యనిరంతరానుభూతితో నుండినచో స్వానుభూతియెడ ప్రమాదము సంభవింపనేరదు. దానివలన యనాత్మాధ్యాసము కలుగనేరదు. అట్టి వానికి దృష్టము లగు దుఃఖము లేమియు లేకుండుటయు, నెల్లపుడు నాత్మానంద రసానుభూతియు, గుణాతిక్రమణము, విదేహముక్తియు సంభవించును. అట్లుగాక

గీ॥ తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్ ।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ! ॥ ॥౬॥

పదవిభాగము:— తత్ర- సత్త్వం- నిర్మలత్వాత్ ప్రకాశకం- అనామయం- సుఖసంగేన- బధ్నాతి- జ్ఞానసంగేన- చ- అనఘ! ॥ ॥౬॥

ప్రతిపదార్థము:— హే అనఘ!=ఓవ్యసనరహితుడ వగు నర్జునా!; తత్ర=సత్త్వరజస్తమో గుణములలో, నిర్మలత్వాత్=నిర్మలమగుటవలన; ప్రకాశకం=ప్రకాశక మైనట్టిన్ని; అనామయం=ఉపద్రవ రహిత మైనట్టి; సత్త్వం=సత్త్వగుణము; దేహినం=(ఈపదమనుషక్తము) క్షేత్రజ్ఞుని; సుఖసంగేన=సుఖ సంగముచేతను; జ్ఞానసంగేన చ=జ్ఞానసంగముచేతను; బధ్నాతీవ=బంధించుచున్నదివలె నున్నది. ॥౬॥

శాంకరభాష్యమ్:—

• తత్ర సత్త్వమితి । తత్ర సత్త్వాదీనాం సత్త్వస్యైవ తావల్లక్షణ ముచ్యతే నిర్మలత్వా త్స్ఫటికమణిరివ ప్రకాశక మనామయం నిరుపద్రవం సత్త్వం తన్నిబధ్నాతి కథం సుఖ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సత్త్వరజస్తమస్సులలో సత్త్వమునకే (యీశ్లోకమునందు) లక్షణము చెప్పబడుచుండెను. మలరహితమగుటవలన స్ఫటికమణివలె ప్రకాశకము ఉపద్రవరహితము నగు

సత్త్వాదిగుణదోషముచే నట్టి యనాత్మాధ్యాసను చేయు యతికి యలవడిన జ్ఞానముగూడ సంకోచించుటయు, చిత్తవిక్షేపము కలిగి, జన్మాదిబంధము సంభవించును. కాన విద్వాంసుడగువాడు దేహేంద్రియాదులందు గాని, ఇతరత్ర గాని యహంమమాధ్యాస చేయతగదు. అట్టివానికే జీవన్ముక్తి సిద్ధించును. అహంమమాధ్యాసమే బంధము. సత్త్వాదిగుణదోషములచే నట్టి యధ్యాస నాచరించినచో విద్వాంసుడుగూడ బద్ధుడగును. ఎట్లన:- భరతుడు సత్త్వగుణముచేనైన దయాదోషముచే దూషితమైన యంతరంగము కలవాడై యనాత్మయం దాత్మభావమును జేసి, కురంగమునందు పోష్యత్వమనుత్వాధ్యాస కలవాడై స్నేహపాశముచే బద్ధుడై, జన్మాదిబంధము నొందెను. కాన విదేహకైవల్యము నొందగోరు విద్వాంసుడు సత్త్వాదిగుణములచేతను, వాని కార్యములచేతను, చలింపనివాడై సదా ఆత్మనిష్ఠతోనే యుండదగు నని బోధించుటకే యీచతుర్దశాధ్యాయ మారంభింపబడెను. ॥౫॥

—• ౧౪ వ అధ్యాయము ౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సత్త్వరజస్తమోగుణములలో నేగుణము ఎట్టి సంగముచే క్షేత్రజ్ఞుని బంధించుచున్నదో యీశ్లోకము మొదలుకొని చెప్పుచున్నాడు— గుణత్రయములో సత్త్వమనెడి గుణము నిర్మలమగుటచే, (చిద్బింబగ్రహణయోగ్యమగుటవలన) తమోగుణకృత ఆవరణతిరోధాయకమై చైతన్యమునకు ప్రకాశకమగును. మరియు "అనామయం" దుఃఖవిరోధి యగు సుఖమున కభివ్యంజక మగుచున్నది. అట్టి సత్త్వగుణము సుఖజ్ఞానసంగములచేతను దేహిని బంధించుచున్నది. (ఇట నున్న సుఖజ్ఞానములచే నంతఃకరణపరిణామము లగు సద్వ్యంజకములను గ్రహింపవలెను.) అంతఃకరణధర్మ మగు సుఖము, జ్ఞానము వీనియొక్క యధ్యాసమే సంగమనబడును. దాని యాకారము "నేను సుఖిని, నేను తెలిసికొంటిని" అని యుండును. విషయమునకు సంబంధించిన ధర్మము యెపుడును విషయికి కలుగనేరదు. కాన యంతఃకరణ

శాంకరభాష్యమ్:—

సఙ్గేన సుఖ్యహమితి విషయభూతస్య సుఖస్య విషయిణ్యాత్మని సంశ్లేషాపాదనం మృషైవ సుఖే సఞ్జన మితి। సైషాఽవిద్యా। న హి విషయధర్మో విషయిణో భవతి। ఇచ్ఛాది చ ధృత్యన్తం క్షేత్రస్యైవ విషయస్య ధర్మ ఇత్యుక్తం భగవతా। అతోఽవిద్యయైవ స్వకీయ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సత్త్వము— "సుఖసంగేన" నేను సుఖము కలవాడను" అను జ్ఞానములో విషయమైన సుఖమునకు విషయి యగు నాత్మయందు సంశ్లేషము నాపాదించుట సుఖమునందు సంజనము. ఇది మృషయే (మిథ్యయే). ఇది యవిద్యయే. విషయధర్మము విషయి కెన్నడును సంభవించదు. ఇచ్ఛ మొదలుకొని ధృత్యంతము విషయరూపమైన క్షేత్రముయొక్క ధర్మమే యని శ్రీకృష్ణపరమాత్మచే జెప్పబడెను. అందువలన విషయవిషయ్యవివేకస్వరూపమైన స్వకీయధర్మ

ధర్మమగు నీసుఖ, జ్ఞానములు ఆత్మయం దధ్యస్తము లగుచున్నవి. ఇట్టి యధ్యాసయే సంగమనబడును. కాన నీసుఖజ్ఞానాదిక మంతయు నవిద్యామాత్రమే యని యర్థము. ॥౬॥

శంకరానందీయము:— సామాన్యరూపముగ గుణత్రయముయొక్క సమిష్టి కార్యమును జెప్పి, వేర్వేరుగ నాగుణముల స్వరూపమును, అవి చేయుపనిని పదమూడు శ్లోకములచే జెప్పుచుండెను "తత్ర... అనామయం" అసత్త్వరజస్తమోగుణములలో నిదగసత్త్వగుణము మలరూపము లగు రజస్తమోగుణము లకంటె "నిర్మలత్వాత్" మలరూపము లగు రజస్తమోగుణములనుండి విడువడుటచే నతి స్వచ్ఛము. అట్లగుటచే "ప్రకాశకం" ప్రత్యగ్వస్తుస్వరూపమును భాసింపజేయును. మరియు "అనామయం" సత్త్వగుణమున కామయమనః విక్షేపము, జాడ్యము చెప్పబడును. ఈవిక్షేపజాడ్యములకు కారణమగు రజస్తమస్సుల సంపర్కము లేని శుద్ధసత్త్వగుణము విక్షేప, జాడ్యములు లేనిదగును. సత్త్వగుణమిట్టి లక్షణము కలదైనను తనతో గూడిన బ్రహ్మవేత్తను గూడ "సుఖసంగేన...చానఘ!" శబ్దాదివిషయములకు నింద్రియములకునైన సంపర్కముచే సుఖమునందలి సంగముచే బంధించుచున్నది. (విషయసుఖ లంపటునిగా చేయుచున్నదని భావము.) లేక, శమ, దమ, దయాఽహింసా, క్షాంత్యాదిసాధనసంపత్తిచే బ్రహ్మవేత్తను గూడ నుపాసనాసాధ్యమగు— బ్రాహ్మ, వైష్ణవ, శైవపారలౌకిక సుఖకామనచే బంధించుచున్నది. అనగా బ్రహ్మజ్ఞానము నుండియు. బ్రహ్మానందానుభూతి నుండియు చ్యుతిని గల్గించి బహిర్ముఖునిగా జేయుచున్నదని భావము. మరియు "జ్ఞానసంగేన" నానాశాస్త్రార్థ విచారజన్యమగు జ్ఞానమునందు కామనను కల్గించి బంధించుచున్నది. అనగా తర్క, మీమాంసా, సాంఖ్య, యోగ, ఆగమ, తంత్రములయొక్క యర్థజ్ఞానము నందాసక్తి కలుగజేసి బ్రహ్మవేత్తను గూడ బహిర్ముఖునిగ జేయుచున్నది. లేక, "జ్ఞాయతేఽనేన పరమేశ్వర ఇతి జ్ఞానం" అను వ్యుత్పత్తి ననుసరించి యిట జ్ఞానమున నీశ్వరమహత్త్వ ప్రతిపాదకమగు శాస్త్రము చెప్పబడును. యందలి సంగము (అశాస్త్రప్రతిపాద్యమగు పరమేశ్వర గుణకథాశ్రవణ, భజన, కీర్తనాదుల యందలి యాసక్తి)చే బ్రహ్మవేత్తను గూడ బంధించుచున్నది. (బ్రహ్మనిష్ఠ నుండి చ్యుతిని కలుగజేసి శ్రవణ, భజన, కీర్తనాది ప్రవణునిగ జేయుచున్నది.) ॥౬॥

శ్రీధరీయము:— ఆగుణత్రయములో సత్త్వమునకు లక్షణమును, బంధకత్వప్రకారము నీశ్లోకమున జెప్పుచున్నాడు— ఆగుణములలో నిర్మల (స్వచ్ఛ) మగుట స్ఫటికమువలె భాస్వరము, అనామయము,

గీ॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసంగేన దేహినమ్ ॥ ॥౭॥

పదవిభాగము:— రజః- రాగాత్మకం- విద్ధి- తృష్ణాసంగసముద్భవం- తత్- నిబధ్నాతి- కౌన్తేయ!- కర్మసంగేన- దేహినమ్ ॥ ॥౭॥

ప్రతిపదార్థము:— హే కౌన్తేయ=ఓకుంతీపుత్రుడ వగు యర్జున!; రజః=రజోగుణమును; రాగాత్మకం=గైరికాదిధాతువువలె రాగాత్మకముగను; తృష్ణాసంగసముద్భవం= తృష్ణా=అప్రాప్తాభిలాషకు; ఆసంగ=ప్రాప్తవిషయమునందు మనఃప్రీతిస్వరూపసంశ్లేషకు; సముద్భవం=కారణముగను; విద్ధి=తెలిసికొనుము; తత్=ఆరజోగుణము; దేహినం=దేహవంతుడైన క్షేత్రజ్ఞుని; కర్మసంగేన=కర్మసంగముచే నిబధ్నాతి=బంధించుచున్నది. ॥౭॥

శాంకరభాష్యమ్:—

రజో రాగాత్మక మితి । రజో రాగాత్మకం రంజనా ద్రాగో గైరికాదివ ద్రాగాత్మకం విద్ధి జానీహి తృష్ణాసంగసముద్భవం తృష్ణాఽప్రాప్తాభిలాష ఆసంగః ప్రాప్తే విషయే మనసః ప్రీతిలక్షణః సంశ్లేషః, తృష్ణాసంగయోః సముద్భవం తృష్ణాసంగసముద్భవం త

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓకుంతీపుత్రుడ వగు నర్జునా! రజోగుణము రంజనమువలన రాగ మనబడును. గైరికాదిధాతువువలె రాగాత్మక మగును. అప్రాప్తమైనదానియం దభిలాష తృష్ణ యనబడును సంప్రాప్తమైన విషయమునందు మనఃప్రీతిరూపమైన సంశ్లేషయే ఆసంగ మనబడును. అట్టి

—• ౧౪ వ అధ్యాయము, ౭ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "రజో...సముద్భవం" పురుషుడు విషయములయందు దీనిచే రక్తుడగును గాన రాగ మనబడును. రాగమన గామము. (కోరిక). ఓయర్జున! ఈరాగమే స్వరూపముగా గలది రజోగుణముగా తెలిసికొనుము. (ధర్మధర్ములకు తాదాత్మ్యమే గాన రాగస్వరూపమే రజోగుణ మని యర్థము. కనుకనే "తృష్ణాసంగసముద్భవమ్" ప్రాప్తింపనిదానివిషయమై యభిలాషము తృష్ణ యనబడును. పొందబడిన వస్తువును రక్షించు యభిలాషము ఆసంగ మనబడును. ఇట్టి తృష్ణాసంగముల యుత్పత్తికి కారణము ఈరజోగుణ మగుచున్నది. ఇయ్యది దృష్టాదృష్టార్థము లగు కర్మలయందలి "నేనీకర్మను జేయుచుంటిని, కర్మఫలము ననుభవించెదను" అను అభినివేశవిశేషముచే దేహవంతుని బంధించుచున్నది. (రజోగుణము ప్రవృత్తి హేతు వగుట వస్తుతః కర్త కాకున్నను క్షేత్రజ్ఞుని కర్తృత్వాభిమానునిగ జేయుచున్నది. ॥౭॥

శంకరానందీయము:— పైవిధముగ సత్త్వగుణమునకు నిర్మలత్వము, ప్రకాశకత్వము, అవిక్షిప్తత్వమును వీటిలక్షణముగా చెప్పి, సుఖసంయోజనమును, జ్ఞానసంయోజనమును సత్త్వకార్యములుగా జెప్పి రజోగుణముయొక్క లక్షణమును, కార్యమును నీశ్లోకమున జెప్పుచున్నాడు— "రజో...సముద్భవం" స్త్రీగాదివిషయములయందు పురుషుడు దీనిచే రక్తిని పొందును గాన రాగ మనబడును. అట్టి రాగము

శాంకరభాష్యమ్:—

నిద్రాభిః ప్రమాద శ్చాఽఽలస్యం చ నిద్రా చ ప్రమాదాలస్యనిద్రా స్తాభి స్తత్తమో నిబధ్నాతి భారత! ॥ ॥౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కలుగజేయునదిగ తెలిసికొనుము. ఓయర్జునా! ఆతమోగుణము ప్రమాదముచేతను, ఆలస్యముచేతను, నిద్రచేతను (దేహిని) బంధించుచున్నది. ॥౮॥

విరోధియైన వస్తువివేకాసామర్థ్యము ప్రమాద మనియు, రజోగుణకార్య మగు ప్రవృత్తికి విరోధి యగు ప్రవృత్త్యసామర్థ్యము ఆలస్యమనియు, సత్త్వకార్య మగు ప్రకాశమునకును, రజఃకార్యమగు ప్రవృత్తికిని విరోధియు తమోగుణము ఆలంబనముగా కలదియు నగు వృత్తి నిద్రయనియు తెలిసికొనదగును.) ॥౮॥

శంకరానందీయము:— ఇక తమోగుణమునకు లక్షణమును, కార్యమును చెప్పుచుండెను— తమోగుణము ప్రమాదనిద్రాలస్యరూపదోషములచే బంధకమగుట రజస్సత్త్వగుణములకంటె నెక్కుడిది అని తెల్పుటకై యిట "తు" శబ్దము నివేశితమయ్యెను. ఏస్థలమున జ్ఞాన ముండుటకు వలనుపడదో యది యజ్ఞానమనబడును. ఇంతియేగాని యజ్ఞానమన జ్ఞానాభావ మర్థము కాదు. ఏమన:- అభావమునకు కార్యకారిత్వము లేదు. కాన యజ్ఞాన మభావరూపమన జెల్లదు. "గుణాః ప్రకృతిసంభవాః" అను గీతానుసారము గుణములు మూడును ప్రకృతిజన్యములే యైనను, తమోగుణము అజ్ఞానస్వభావ ముండు స్థలమున నియతముగ నుండునదిగాన యజ్ఞానజన్యత్వరూపవిశేషణవిశిష్టమని తెలిసికొనుము. కనుకనే "మోహనం సర్వదేహినాం" ఈతమోగుణము స్వోపసృష్టము అగు బ్రహ్మాదిస్తంబపర్యంత మగు సర్వప్రాణులను నిర్విశేషముగ మోహింపజేయుచున్నది. (తమోగుణము స్వావిర్భావముచే స్వతస్సిద్ధ మగు సదసద్వివేకమును గూడ నశింపజేయుచున్నది.) తమోగుణము అజ్ఞానజన్యము, స్వరూపమునచే జ్ఞానావరకము నని తెలిసికొనుము. అని యర్థము. తమోగుణముయొక్క పుట్టుకను, స్వరూపమును జెప్పి, ఇక తమఃకార్యమును చెప్పుచుండెను.— "ప్రమాదాలస్య...భారత!" అజ్ఞానము జడరూపము. తమోగుణము దానినుండి పుట్టునది కాన వివేకజ్ఞానావరక మగుచున్నది. మరియు నిది స్వయముగ ప్రమాద, ఆలస్య, నిద్రలచే (ప్రయత్నముతో జేయదగు కార్యమును మరచుట ప్రమాద మనబడును. చేయదగిన కార్యమునందు శ్రద్ధారాహిత్యముతో నైన నిరుత్సాహము ఆలస్యమనబడును. బుద్ధిజాడ్యాధిక్యముచే గర్తవ్యమును విడచి నిద్రించుట నిద్ర యనబడును.) నాత్మజ్ఞునిగూడ బంధించి బ్రహ్మనిష్ఠావిముఖునిగ జేయుచున్నదని యర్థము. బుద్ధి నిర్మల మగుటనుబట్టియు, విషయసుఖాసంగముచేతను సత్త్వగుణము జనించుననియు, విషయములయెడ రాగావిర్భావముచేతను, కర్మాసక్తిచేతను రజోగుణము జనించుననియు, బుద్ధిజాడ్యముచేతను, విపరీతప్రత్యయావిర్భావముచేతను, ప్రమాదాలస్యనిద్రలచేతను తమోగుణము జనించుననియు తెలిసికొని బ్రహ్మవేత్తయగు యతి- సత్త్వరజస్తమోగుణవికారములకు వశుడుగాక, ఆయావికారములకు ప్రతియోగులగు సద్గుణముల నాశ్రయించి గుణదోషముల దెలిసికొని, యెల్లప్పుడు నాత్మనిష్ఠయందే యుండదగు నని సూచితమయ్యెను. ॥౮॥

భాష్యార్థదీపికా:— ఎట్టి లక్షణము గలది తమస్సు? పురుషు నెట్లు బంధించుచున్నది? అను ప్రశ్నలకు సమాధానముగ జెప్పుచున్నాడు— సత్త్వరజస్తమోగుణములు మూడును అజ్ఞానమువలన బుట్టునవి యైనను తమోగుణము తనకు కారణ మగు నజ్ఞానముయొక్క స్వభావమునకు విపరీతమైన స్వభావముకలదిగాక

గీ॥ సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత! ।
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయ త్యుత ॥ ॥౯॥

పదవిభాగము:— సత్త్వం- సుఖే- సంజయతి- రజః- కర్మణి- భారత- జ్ఞానం- ఆవృత్య- తు- తమః- ప్రమాదే- సంజయతి- ఉత ॥ ॥౯॥

ప్రతిపదార్థము:— సత్త్వం=సత్త్వగుణము; సుఖే=సుఖమునందు; సంజయతి=సమకూర్చుచున్నది; రజః=రజోగుణము; హే భారత!=ఓ యర్జునా; కర్మణి=కర్మయందు; సంజయతి=సమకూర్చుచున్నది; తమస్తు=తమోగుణమైతే; జ్ఞానం=జ్ఞానమును; ఆవృత్య=కప్పిపుచ్చి; ప్రమాదే=ప్రమాదమునందు; సంజయత్యుత; సమకూర్చుచున్నది. ॥౯॥

శాంకరభాష్యమ్:—

పున ర్గుణానాం వ్యాపారః సంక్షేపత ఉచ్యతే— సత్త్వం సుఖే సంజయతి సంశ్లేషయతి రజః కర్మణి హే భారత సంజయతీతి వర్తతే । జ్ఞానం సత్త్వకృతం వివేక మావృత్యా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

తిరిగి సత్త్వరజస్తమోగుణముల వ్యాపారము సంక్షేపముగ చెప్పబడుచుండెను—

సత్త్వగుణము సుఖమునందు సంశ్లేషను పొందించుచున్నది. ఓభరతవంశోద్భవుడవగు నర్జునా! రజోగుణము కర్మయందు సంశ్లేషను పొందించుచున్నది. తమోగుణ మన్ననో

యనుపమైన స్వభావముకలది యగుట సత్త్వరజస్సులకంటె విశేషము. ఈ విశేషమును ఇట "తు" అను శబ్దముచే సూచించెను. "అజ్ఞానజం" అజ్ఞానమువలన బుట్టునదిగా దెలిసికొనుము. "మోహనం సర్వదేహినాం" సర్వులగు దేహధారులకు హితాహితవివేకప్రతిబంధకము. "ప్రమాద" కార్యాంతరాసక్తుడై చేయదగినదియు, జేయుటకు సంకల్పించినదియు నగు పనిని జేయకుండుట ప్రమాద మనబడును. "ఆలస్య" నిరాశతో నుత్సాహమును బ్రతిబంధించునది యాలస్య మనబడును. "స్వాప" నిద్ర తమోగుణము. ఈప్రమాదాలస్యనిద్రలచే బంధించుచున్నది. నిర్వికారు డగు నాత్మనుగూడ వికారవంతునిగ జేయుచున్నది. "భారత!" ఓయర్జునా! ఈసంబోధనముచే నీవు భరతవంశోద్భవుడవుగాన నీతమోకృత మగు బంధనమునకు తగవు" అని సూచితమయ్యెను. ॥౯॥

—॥ ౧౪ వ అధ్యాయము ౯ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ॥—

మధుసూదనసరస్వతీయము:— ఈ చెప్పిన గుణత్రయములో నేయే కార్యమునం దేయే గుణమునకు నుత్కర్ష (ఎక్కువభాగము) కలదో నీశ్లోకమున జెప్పుచున్నాడు— "సత్త్వం సుఖే సంజయతి" సత్త్వరజస్తమోగుణములలో సత్త్వగుణ మధికమైనచో దుఃఖకారణమును కప్పిపెట్టి పురుషుని సుఖమునందు సంసక్తుని చేయును. "రజః కర్మణి భారత!" రజోగుణ మధికమైనచో నది సుఖకారణమును కప్పిపుచ్చి కర్మయందు సక్తుని చేయును. "జ్ఞాన...ఉత" ఇక తమోగుణమన్ననో ప్రమాణబలముచేగల్గిన సత్త్వకార్యమునైనను జ్ఞానము నావరించి (కప్పిపుచ్చి) తెలిసినదానిగ జేయుచున్నది. (అజ్ఞానమునందు సక్తుని జేయుచున్నది.) "ఉత" చేయదగినదియై ప్రాప్తమైన కార్యమునుగూడజేయకుండుటరూపమగు ఆలస్యమునందును నిద్రయందును సక్తునిగ జేయుచున్నది. ॥౯॥

గీ॥ రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత! ।
రజ స్సత్త్వం తమశ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా ॥ ॥౧౦॥

పదవిభాగము:— రజః– తమః– చ– అభిభూయ– సత్త్వం– భారత! భవతి– రజః– సత్త్వం– తమః– చ– ఏవ– తమః– సత్త్వం– రజః– తథా ॥ ॥౧౦॥

ప్రతిపదార్థము:— హేభారత!=ఓభరతవంశోద్భవుడ వగు నర్జునా!; సత్త్వం=సత్త్వగుణము; రజః=రజోగుణమును; తమశ్చ=తమోగుణమును; అభిభూయ=తిరస్కరించి; భవతి=అగుచున్నది; రజః=రజోగుణము; సత్త్వం=సత్త్వగుణమును; తమశ్చైవ=తమోగుణమును; అభిభూయ=తిరస్కరించి భవతి=అగుచున్నది; తమః=తమోగుణము; తథా=అట్లే; సత్త్వం=సత్త్వగుణమును; రజః=రజోగుణమును; అభిభూయ=తిరస్కరించి; భవతి=అగుచున్నది. ॥౧౦॥

శాంకరభాష్యమ్:—

ఽఽచ్ఛాద్య తు తమః స్వేనాఽఽవరణాత్మనా ప్రమాదే సంజయ త్యుత ప్రమాదో నామ ప్రాప్తకర్తవ్యాకరణమ్ ॥ ॥౯॥

ఉక్తం కార్యం కదా కుర్వన్తి గుణా ఇ త్యుచ్యతే— రజ స్తమ శ్చోభా వ వ్యభిభూయ సత్త్వం భవ త్యుద్భవతి వర్ధతే తదా లబ్ధాత్మకం సత్త్వం స్వకార్యం జ్ఞానసుఖా ద్యార

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జ్ఞానమును కప్పిపుచ్చి స్వస్వరూప మగు ఆవరణస్వరూపముచే ప్రమాదమునందు సంశ్లేషను పొందించుచున్నది. ప్రమాద మనగ ప్రాప్తకర్తవ్యాకరణము. ॥౯॥

సత్త్వరజస్తమోగుణములు చెప్పబడిన తమ కార్యముల నెపుడు చేయును? అను శంకపై చెప్పబడుచుండెను—

శంకరానందీయము:— జ్ఞాననిష్ఠకు విరోధులైన గుణత్రయముయొక్క కార్యములను చెప్పినదానినే బ్రహ్మవేత్త యగు యతి జ్ఞానమును దృఢముగ నుండుటకై వీనిని తప్పక వీడవలయు నను జ్ఞానము కల్గుటకై తిరిగి చెప్పుచున్నాడు— సత్త్వగుణను వైషయికసుఖమునందు పురుషుని సక్తుని జేయును. రజోగుణము వైదికముగాని, లౌకికముగాని యగు కర్మమునందు సక్తుని చేయుచున్నది. ఇక తమోగుణము స్వరూపజ్ఞానము నాచ్ఛాదించి తప్పకుండగ కర్తవ్య మగు జ్ఞాననిష్ఠను విస్మరింపజేయుచున్నది. మరియు నిద్రా, ఆలస్యములయందు సక్తుని జేయుచున్నది. ॥౯॥

—• ౧౪ వ అధ్యాయము ౧౦ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈచెప్పిన కార్యములను గుణములేయేసమయమున చేయుచున్నవి? అను ప్రశ్నకు సమాధానముగ నీశ్లోకమును జెప్పుచున్నాడు— “రజః...భారత!” సత్త్వగుణము రజస్తమోగుణములు రెంటిని యొకేమారు తిరస్కరించి యెపుడు వృద్ధి నొందునో ఆసమయమునందే పూర్వోక్త మగు తన కార్యమును జేయుచున్నది. “రజః...తథా” ఆవిధముగనే తమోగుణముగూడ సత్త్వతమోగుణముల రెంటిని యొకే సమయమున తిరస్కరించి వృద్ధి నొందినచో నదియే పూర్వోక్త మగు తన కార్య

శాంకరభాష్యమ్:—

భవతి హే భారత। తథా రజోగుణః సత్త్వం తమ శ్చైవోభా వప్యభిభూయ వర్ధతే యదా తదా కర్మతృష్ణాది స్వకార్య మారభతే। తమ ఆఖ్యో గుణః సత్త్వం రజ శ్చోభా వప్యభిభూయ తథైవ వర్ధతే తదా జ్ఞానావరణాది స్వకార్య మారభతే॥ ౧౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సత్త్వగుణము రజస్తమోగుణముల నభిభవ మొనరించి పుట్టుచున్నది. ఎపుడు సత్త్వ గుణము వృద్ధినొందునో అపుడు లబ్ధాత్మకమై స్వకార్య మగు జ్ఞానసుఖాదుల నారంభించును. అట్లే రజోగుణము సత్త్వము తమస్సు అనెడి రెంటిని అభిభవ మొనరించి యెపుడు వృద్ధి నొందునో అపుడు స్వకార్యమగు కర్మతృష్ణాదుల నారంభించును. తమోగుణము సత్త్వ మును, రజస్సును అభిభవము చేసి యెపుడు వృద్ధి నొందునో అపుడు స్వకార్య మగు జ్ఞానావ రణాదికమును ఆరంభించును. ॥౧౦॥

ముచు చేయుచున్నది. అట్లే తమోగుణముకూడ సత్త్వరజోగుణముల రెంటిని యొకే సమయమున నభిభవము జేసి వృద్ధినొందునో ఆసమయముననే ప్రాబల్య మగు స్వకార్యమును నిర్వహించుచున్నది. ॥౧౦॥

శంకరానందీయము:— జడలో నల్లుకొనిన కేశపాశభాగములవలె సత్త్వరజస్తమోగుణ ములు సమముగ బ్రవర్తించునో సమిష్టిగనే తమ కార్యము నారంభించునవగును కాని వేర్వేరుగ నాగుణము లను కార్యారంభకత్వ మెట్లు పొసగు నను ప్రశ్నపై ప్రాణులయొక్క కర్మఫలానురూపముగ గుణములకు హ్రాసము, వృద్ధియు కలుగుచుండును గాన సమముగ ప్రవర్తింపవు. అట్లే యగుచో కర్మలకు, వాని ఫలము లకు వైచిత్ర్యము సంభవింపకపోయెడిని. కాన నవి యంగాంగీభావతో కలుసుకొనినవియై కార్యకారు లగు చున్నవని బోధించుచున్నాడు:— ప్రాణుల యదృష్టవశమున సుఖము సాధింపవలసిన సమయమున "రజః భారత!" రజోగుణమును, తమోగుణమును తక్కువవానిగా జేసుకొని సత్త్వగుణము స్వయముగ నుత్కృష్ట మగుచుండును. (రజస్తమోగుణముల నంగములుగా జేసుకొని సత్త్వగుణము స్వయముగ అంగియై తన కార్యమును నెరవేర్చుచుండును.) ప్రాణుల యదృష్టవశమున కర్మను సాధింపవలసిన సమయ మాసన్న మైనప్పుడు "రజ స్సత్త్వం తమశ్చైవ" సత్త్వగుణమును, తమోగుణమును తక్కువగా జేసి రజోగుణ ముత్కృష్టమగుచుండును. (సత్త్వతమోగుణముల నంగములుగా జేసుకొని రజోగుణ మంగియై తన కార్యమును నెరవేర్చుచున్నది.) ఇట్లే జ్ఞానావరణము సాధింపదగు సమయమున "తమ సత్త్వం రజ స్తథా" రజస్సత్త్వ గుణముల రెంటిని తక్కువగా జేసి తమోగుణ ముత్కృష్ట మగును. (రజస్సత్త్వగుణముల నంగములుగా జేసుకొని తమోగుణ మంగియై తన కార్యమును నెరవేర్చుచుండును.) ॥౧౦॥

భాష్యోత్కర్ష దీపిక:— ఈశ్లోకమున "భారత!" అను సంబోధనముచే "భాయాం బ్రహ్మ విద్యాయాం రతః" అనువ్యుత్పత్తి ననుసరించి బ్రహ్మవిద్యయం దాసక్తికల యోయర్జునా! నీవు రజ స్తమస్సులకు తిరోధాయక మగు సత్త్వవృద్ధిని సంపాదింపదగుదువు." అని సూచింపబడెను. (శేషము నిర్వి శేషము.) ॥౧౦॥

గీ॥ సర్వద్వారేషు దేహేఽస్మి న్ప్రకాశ ఉపజాయతే ।
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వ మి త్యుత ॥ ॥౧౧॥

పదవిభాగము:— సర్వద్వారేషు- దేహే- అస్మిన్- ప్రకాశః- ఉపజాయతే- జ్ఞానం- యదా- తదా- విద్యాత్- వివృద్ధం- సత్త్వం- ఇతి- ఉత ॥ ॥౧౧॥

ప్రతిపదార్థము:— సర్వద్వారేషు=తనకుపలబ్ధిద్వారములైన శ్రోత్రాదినిఖిలకరణములయందు; జ్ఞానం=జ్ఞానరూపమైన; ప్రకాశః=బుద్ధివృత్తిరూపప్రకాశ; అస్మిన్=ఈ; దేహే=దేహమునందు; యదా=ఎపుడు; ఉపజాయతే=కలుగుచున్నదో; తదా=అపుడు; సత్త్వముత=సత్త్వగుణమున్న, వివృద్ధం=పుట్టుచున్నది; ఇతి=ఈరీతిని; విద్యాత్=తెలిసికొనదగును. ॥౧౧॥

శాంకరభాష్యమ్:—

యదా యో గుణ ఉద్భూతో భవతి తదా తస్య కిం లింగ మిత్యుచ్యతే— సర్వద్వారే ష్వాత్మన ఉపలబ్ధిద్వారాణి శ్రోత్రాదీని సర్వాణి కరణాని తేషు సర్వద్వారే ష్వన్తఃకరణస్య బుద్ధే ర్వృత్తిః ప్రకాశో దేహేఽస్మి న్నుపజాయతే । తదేవ జ్ఞానమ్ । యదైవం ప్రకాశో జ్ఞానాఖ్య ఉపజాయతే తదా జ్ఞానప్రకాశేన లింగేన విద్యా ద్వివృద్ధ ముద్భూతం సత్త్వ మిత్యుతాపి ॥ ॥౧౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎపు డేగుణము పుట్టినదో అపు డాగుణమునకు లింగము (చిహ్నము) ఏమిటి? అను శంకపై "సర్వద్వారేషు" అని చెప్పుచుండెను.

తన కుపలబ్ధిద్వారములైన శ్రోత్రాదినిఖిలకరణములయందు అంతఃకరణరూపమైన బుద్ధికి ప్రకాశ యీదేహమునం దెపుడు జనించునో, అది జ్ఞాన మనబడును. ఎపుడు జ్ఞానమనెడి ప్రకాశ జనించునో అపుడు జ్ఞానప్రకాశరూపలింగముచే సత్త్వము జనించిన దని తెలిసికొన వలయును. ॥౧౧॥

—• ౧౪వ అధ్యాయము ౧౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:—

ప్రస్తుతము పూర్వోక్తవిధముగా నుద్భవించిన (ప్రవృద్ధమైన) గుణముల కు లింగముల జెప్పుచున్నాడు.— "సర్వ...ఉత" ఆత్మకు భోగాయతన మగు నీశరీరమున నుపలబ్ధిసాధనము లగు శ్రోత్రాదీంద్రియములయందు కలుగు బుద్ధి పరిణామవిశేషరూపము, విషయాకారకము స్వవిషయావరణవిరోధియు నగు ప్రకాశమే శబ్దాదివిషయక మగు జ్ఞాన మనబడును. అట్టి జ్ఞాన మేసమయమున కల్గునో యపుడు ప్రకాశరూపలింగముచే సత్త్వము వివృద్ధమైన దని తెలిసికొనదగును. ॥౧౧॥

శంకరానందీయము:— సత్త్వాదిగుణముల వృద్ధిహ్రాసములు ఏఏ లింగములచే దెలియనగును? అసత్త్వాదిగుణముల యుత్కర్ష తెలిసికొనియే కదా? వాని యుపశమనమునకై యత్నించుట! అను

గీ॥ లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమ స్స్పృహా ।
రజ స్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ! ॥ ॥౧౨॥

పదవిభాగము:— లోభః- ప్రవృత్తిః- అరంభః- కర్మణాం- అశమః- స్పృహా- రజసి- ఏతాని- జాయన్తే- వివృద్ధే- భరతర్షభ ॥ ॥౧౨॥

ప్రతిపదార్థము:— హేభరతర్షభ!=ఓభరతవంశశ్రేష్ఠుడా; రజసి=రజోగుణము; వివృద్ధే=వృద్ధినొందినదై యుండ; లోభః=పరద్రవ్యమును స్వీకరింపవలయు నను కోరిక; ప్రవృత్తిః=ప్రవర్తనము; (సామాన్యచేష్ట) కర్మణాం=కర్మలయొక్క; అరంభః=అరంభము; అశమః=శాంతిలేకపోవుట; స్పృహా=సర్వసామాన్యవస్తువిషయకతృష్ణ; (అనెడి) ఏతాని=ఈలింగములు; జాయన్తే=పుట్టుచున్నవి. ॥౧౨॥

శాంకరభాష్యమ్:—

రజస ఉద్భూతస్యేదం చిహ్నమ్— లోభః పరద్రవ్యాదిత్సా, ప్రవృత్తిః ప్రవర్తనం సామాన్యచేష్టా, అరమ్భః, కస్య, కర్మణామ్ । అశమోఽనుపశమః, హర్షరాగాదిప్రవృత్తిః, స్పృహా సర్వసామాన్యవస్తువిషయా తృష్ణా, రజసి గుణే వివృద్ధ ఏతాని లింగాని జాయన్తే హే భరతర్షభ ॥ ॥౧౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓభరతవంశశ్రేష్ఠుడా! రజోగుణము వృద్ధి నొందినదై యుండ పరద్రవ్యమును స్వీకరింప వలయు నను కోరిక, ప్రవర్తనము (సామాన్యచేష్ట) కర్మల ప్రారంభము, శాంతి లేకపోవుట, హర్షరాగాది ప్రవృత్తి, సర్వసామాన్యవస్తువిషయకమైన కోరిక అనెడి యీలింగములు పుట్టు చున్నవి. ॥౧౨॥

యాశంకపై జెప్పుచున్నాడు:— ఏసమయమున అంతఃకరణప్రవృత్తిద్వారము లగు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లను ఇంద్రియములందును, దేహమునందును జ్ఞానప్రసాదలక్షణ మగు ప్రకాశము (స్ఫురణము) విజృంభించునో ఆసమయమున సత్త్వగుణము ప్రవృద్ధమైనదనియు, "ఉత" రజస్తమస్సులు హ్రాసము నొందినవనియు దెలియనగును. (అంతఃకరణప్రసాదాతిశయరూప మగు లింగముచే సత్త్వముయొక్క వృద్ధిని, తెలిసికొనదగును.) "ఉత" సుఖాదిలింగములచే గూడ సత్త్వవృద్ధిని తెలియ నగు నని యర్థము. ॥౧౧॥

—• ౧౪వ అధ్యాయము ౧౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఎక్కువగా ధనాదికము ప్రాప్తించుచున్నను అనుక్షణము ప్రవర్ధమాన మగు ధనాద్యభిలాషము లోభ మనబడును. (ఒకానొక యుక్కేచ్ఛలోని విషయము ప్రాప్తించినను ఆయిచ్ఛ నివర్తింపక ఇంకను పెరుగుచున్నచో నాయిచ్ఛ లోభ మనబడును.) ఎల్లపుడు ప్రయత్నించుట ప్రవృత్తి యనబడును. బహువిత్తవ్యయసాధ్యము లగు కామ్య, నిషిద్ధ, లౌకికమహాగృహాదివిషయక మగు వ్యాపారముల యుద్యమము అరంభ మనబడును. "ఈకార్యము నెరవేరగనే యాకార్యమును చేయుదు" నను సంకల్పప్రవాహానుపరమము అశమ మనబడును. (నానావిధము లగు పరధనాదులను చూచినంతమాత్రముననే యేదోయొక యుపాయముచే స్వీకరింపవలె నను యిచ్ఛ స్పృహ యనఁబడును. "రజస్యేతాని...

గీ॥ అప్రకాశో ఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।
తమ స్యేతాని జాయన్తే వివృద్ధే కురునందన! ॥ ॥౧౩॥

పదవిభాగము:— అప్రకాశః- అప్రవృత్తిః- చ- ప్రమాదః- మోహః- ఏవ- చ- తమసి- ఏతాని- జాయన్తే- వివృద్ధే- కురునన్దన! ॥ ॥౧౩॥

ప్రతిపదార్థము:— హేకురునన్దన!=ఓకురువంశోద్భవుడ వగు నర్జునా!; తమసి=తమోగుణము; వివృద్ధే=వృద్ధిపొందినదైయుండ; అప్రకాశః=అవివేకము; అప్రవృత్తిశ్చ=ప్రవృత్త్యభావము; ప్రమాదః=ప్రమాదము; మోహ ఏవ చ=మోహముసు; ఏతాని=ఈలింగములు; జాయన్తే=పుట్టుచున్నవి. ॥౧౩॥

శాంకరభాష్యమ్:—

అప్రకాశ ఇతి । అప్రకాశోఽవివేకోఽత్యంత మప్రవృత్తిశ్చ ప్రవృత్త్యభావ స్తత్కార్యం ప్రమాదో మోహ ఏవ చావివేకో మూఢతేత్యర్థః । తమసి గుణే వివృద్ధ ఏతాని లింగాని జాయంతే హేకురునందన! ॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధని:—

ఓకురువంశోద్భవుడ వైన యర్జున! తమోగుణము వృద్ధిబొందినదై యుండ అవివేకము, ప్రవృత్తి లేకపోవుట, తత్కార్య మగు ప్రమాదము, మోహము (మూఢత్వము) ఈలింగములు జనించుచున్నవి ॥౧౩॥

భరతర్షభ!" ఓయర్జున! రజోగుణము ప్రవృద్ధమైన సమయమున రాగరూపము అగు నీచిహ్నములు కన్పట్టు చుండును. (ఈలింగములచే రజోగుణము ప్రవృద్ధమైన దని తెలిసికొనదగునని యర్థము.) ॥౧౨॥

శంకరానందీయము:— రజోగుణము ప్రవృద్ధమైనచో నీచిహ్నములు కన్పట్టునని చెప్పుచుండెను.— "లోభః" పరద్రవ్యమాత్రము స్వాధీనముగ వహించవలెనండుట లోభము. "ప్రవృత్తిః" సామాన్యముగ నన్ని యింద్రియముల చేష్ట ప్రవృత్తి. "కర్మణా మారంభః" వైదికములు, లౌకికములు నగు కర్మలను క్రమించుట [illegible]. "అశమః" కామసంకల్పాదులచే నంతఃకరణ మును శమింపకుండుట. 'స్పృహా' విషయములందు మోహ [illegible] "...జని...భరతర్షభ" రజోగుణము వృద్ధి నొందినచో యీపైనజెప్పిన కార్యములు పుట్టుచుండును. (కనుక నీ లింగములచే రజోగుణము ప్రవృద్ధమైనదనియు, సత్త్వ, తమోగుణములు తగ్గిన వని తెలిసికొనదగునని యర్థము.) ॥౧౨॥

—• ౧౪ వ అధ్యాయము ౧౩ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— తమోగుణాభివృద్ధి ద్యోతకలింగముల జెప్పుచున్నారు:— "అప్రకాశః" ఉపదేశాదిరూప మగు బోధకారణ మున్నను బోధకయోగ్యుడగుట. "అప్రవృత్తిశ్చ" ప్రవృత్తికి కారణము "అగ్నిహోత్రం జుహుయాత్" ఇత్యాదిశాస్త్ర మున్నను. దానివలన కర్తవ్యజ్ఞానము కలిగినను ప్రవర్తింపకుండుట. "ప్రమాదః" ఆయాకాలములలో కర్తవ్యముగ ప్రాప్త మగుదానిని మరచుట. "మోహ ఏవ చ" విద్యావిపర్యయ మగు మూఢావస్థ. (ఇట ఏవకారము తమోగుణము ప్రవృద్ధమైనపుడే యీపూర్వోక్తము లగుపడ కల్గును. అని కార్యకారణములకు అవ్యభిచారిత్వమును ద్యోతన జేయును. కావున నీ కార్యరూపలింగములచే తమోగుణము వివృద్ధమైన దని తెలిసికొనదగు నని యర్థము. ॥౧౩॥

గీ॥ యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్ ।
తదోత్తమవిదాం లోకా నమలా న్ప్రతిపద్యతే ॥ ॥౧౪॥

పదవిభాగము:— యదా- సత్త్వే- ప్రవృద్ధే- తు- ప్రలయం- యాతి- దేహభృత్- తదా- ఉత్తమవిదాం- లోకాన్- అమలాన్- ప్రతిపద్యతే ॥ ॥౧౪॥

ప్రతిపదార్థము:— యదా=ఎపుడు; సత్త్వే=సత్త్వగుణము; ప్రవృద్ధే తు=ఉద్భూతమైయుండ; దేహభృత్=శరీరధారి; ప్రలయం=మరణమును; యాతి=పొందునో; తదా=అపుడు; ఉత్తమవిదాం=మహదాది తత్త్వవేత్తలయొక్క; అమలాన్=మలరహితమైన; లోకాన్=లోకములను; ప్రతిపద్యతే=పొందు చున్నాడు. ॥౧౪

శాంకరభాష్యమ్:—

మరణద్వారేణాపి య త్ఫలం ప్రాప్యతే త దపి సంగరాగహేతుకం సర్వం గౌణ మేవేతి దర్శయ న్నాహ— యదా సత్త్వే ప్రవృద్ధ ఉద్భూతే తు ప్రలయం మరణం యాతి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరణద్వారముచే గూడ నేఫలము పొందబడునో ఆసర్వము సంగరాగములు హేతువుగా కలదగుటఁఆసర్వము గౌణఫలమే యని చూపుచు చెప్పుచుండెను.

శంకరానందీయము:— "అప్రకాశః" బుద్ధికి స్ఫూర్తిలేకపోవుట. "అప్రవృత్తిః" ఆలసత్వము. "ప్రమాదః" కర్తవ్యమునందు అవహితుడు కాకపోవుట. "మోహః" మూఢత్వము, (ఇట చకారముచే నిద్రాపారవశ్యమును గ్రహింపవలయు.) ఇవియే తమోగుణము ప్రవృద్ధమైనదని తెలిసికొనుటకు లింగములు. వీనిచే దమోవృద్ధిని, ఇతరగుణములు హ్రాసము నొందినవని తెలిసికొనదగునని యర్థము. ॥౧౩॥

శ్రీధరీయము:— "అప్రకాశః" వివేకభ్రంశము, "అప్రవృత్తిః" ఉద్యమరాహిత్యము "ప్రమాదః" కర్తవ్యము నను సంధింపకపోవుట; "మోహః" మిథ్యాఽభినివేశము; వీనిచే దమోవృద్ధిని తెలుసుకొనవలెను. ॥౧౩॥

భాష్యార్కప్రదీపిక:— ప్రవృద్ధమైన తమోగుణముయొక్క లింగముల జెప్పుచున్నాడు:— "అప్రకాశః" కర్తవ్యాకర్తవ్యములయెడ వివేకము లేకపోవుట; "అప్రవృత్తిః" ప్రవృత్తిరాహిత్యము, "ప్రమాదః" అవివేకకార్యము; "మోహః" జ్ఞాతవ్యావివేకరూప మగు మూఢత్వము; (ఇట చకారము ఆలస్యాదిసముచ్చాయకము.) ఈపూర్వోక్తము లగు లింగముల ప్రవృద్ధి ననుసరించి తమోగుణ మభివృద్ధమయినదని తెలిసికొనదగు నని భావము. "ఓయర్జునా! నీవు ఉత్తమవంశోద్భవుడవు గాన నీతమోలింగముల నాశ్రయింపదగవు. అని సూచించుటకై "కురునందన!" అని సంబోధించెను. ॥౧౩॥

—• ౧౪ వ అధ్యాయము ౧౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇక ప్రస్తుతము సత్త్వరజస్తమోగుణములలో నేగుణము మరణసమయమున ప్రవృద్ధమైన నేఫలము కల్గునో చెప్పుచుండెను— సత్త్వగుణము ప్రవృద్ధమై యుండగా నాసమయమున దేహాభిమాని యగు జీవుడు మృతి నొందినచో నప్పుడు హిరణగర్భాద్యుపాసకులు పొందుట

గీ॥ రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే ।
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే ॥ ౹౧౫॥

పదవిభాగము:— రజసి- ప్రలయం- గత్వా- కర్మసంగిషు- జాయతే- తథా- ప్రలీనః- తమసి- మూఢయోనిషు- జాయతే ॥ ॥౧౫॥

ప్రతిపదార్థము:— రజసి=రజోగుణము; వివృద్ధే=ఉద్భూతమైయుండ; ప్రలయం=మరణమును; గత్వా=పొంది; కర్మసంగిషు=కర్మాసక్తితో గూడిన మనుష్యులయందు; జాయతే=పుట్టుచున్నాడు; తథా= ఆట్లే; తమసి=తమోగుణము; వివృద్ధే=ఉద్భూతమైయుండ; మూఢయోనిషు=పశ్వాదియోనులయందు; జాయతే =పుట్టుచున్నాడు. ॥౧౫॥

---

శాంకరభాష్యమ్:—

ప్రతిపద్యతే దేహభృ దాత్మా తదోత్తమవిదాం మహదాదితత్త్వవిదా మిత్యేతత్ । లోకా నమలా న్మలరహితా న్ప్రతిపద్యతే ప్రాప్నోతీత్యేతత్ ॥ ॥౧౪

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శరీరధారి యెపుడు సత్త్వగుణము జనించియుండ మరణించునో అపుడాశరీరధారి మహదాదితత్త్వవేత్తలయొక్క నిర్మలమైన లోకములను పొందుచున్నాడు. ॥౧౪

---

కర్వ్యమైనవియు, దేవతలు అనుభవించు భోగములకు స్థానములును, రజస్తమోగుణరహితములు నగు లోకములను పొందును. ॥౧౪॥

శంకరానందీయము:— గుణానుషంగానుగుణముగనే మృతులకు పారలౌకికగతి సంభవించును. ఇంతియేగాని వర్ణాశ్రమాదుల కనురూపముగ గాదని గుణములే మరణానంతరము గతికారణ మగునని బోధించుచుండెను— "యదా...దేహభృత్" (ఇట "తు" శబ్దము రజస్తమోగుణముల వ్యావృత్తి పరము.) ఏకాలమున సత్త్వగుణము ప్రవృద్ధమై యుండగా దేహధారి మృతి నొందినచో "తదా... ప్రతిపద్యతే" ఆకాలమున హిరణగర్భాద్యుపాసకులు పొందుట కర్వ్యమైనవియు, జన్మజరాదిదుఃఖరహితములు నగు లోకములను పొందును. "య త్కర్మ కురుతే త దభిసంపద్యతే" అనుశ్రుతి పుణ్యాపాపకర్మానుగుణముగనే పరలోకము ప్రాప్తించు నని తెల్పుచున్నది. ఇట గుణానురూపముగనే గతి యని చెప్పుట శ్రుతివిరుద్ధము గాదా! అను శంక కలుగుచున్నది. సత్యమే. ప్రాణులకు స్వస్వకర్మానురూపముగనే శుభాశుభగతులు కలుగును. ఇంతియేకాని వర్ణాశ్రమానురూపముగగాని, పాండిత్యానురూపముగగాని సంభవింపవు. అట్లైనను ప్రాణికోటికి మరణసమయమందు జన్మాంతరీయపుణ్యాపాపకర్మవశముననే సత్త్వాది గుణోత్కర్షయు, తదనురూపముగనే బ్రహ్మాదిలోకప్రాప్తియు కలుగుచుండును. కాన పైశ్రుతివిరోధముగాని స్మృతివిరోధముగాని ప్రాప్తింపదు. ॥౧౪॥

—• ౧౪ వ అధ్యాయము ౧౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— రజోగుణము ప్రవృద్ధమైనపుడు దేహధారి మృతు

గీ॥ కర్మణ స్సుకృత స్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।
రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్ ॥ ॥౧౬॥

పదవిభాగము:— కర్మణః- సుకృతస్య- ఆహుః- సాత్త్వికం- నిర్మలం- ఫలమ్- రజసః- తు- ఫలం- దుఃఖం- అజ్ఞానం- తమసః- ఫలమ్ ॥ ॥౧౬॥

ప్రతిపదార్థము:— సుకృతస్య=వేదోక్తవిధానముతో నాచరింపబడిన; కర్మణః=కర్మకు నిర్మలం=మలరహితమైన సాత్త్వికమగు; ఫలం=ఫలమును; రజసస్తు కర్మణః=రాజసకర్మకు; దుఃఖం=దుఃఖ రూపఫలమును; తమసః కర్మణః=తామసకర్మకు; (అధర్మమునకు) అజ్ఞానరూపఫలమును; శిష్టాః=శిష్టులు; ఆహుః=చెప్పుచుండిరి. ॥౧౬॥

శాంకరభాష్యమ్:—

రజసి గుణే వివృద్ధే ప్రలయం మరణం గత్వా ప్రాప్య కర్మసంగిషు కర్మాసక్తి-యుక్తేషు మనుష్యేషు జాయతే । యథా తద్వ దేవ ప్రలీనో మృత స్తమసి వివృద్ధే మూఢ యోనిషు పశ్వాదియోనిషు జాయతే ॥ ॥౧౫॥

అతీతశ్లోకార్థస్యైవ సంక్షేప ఉచ్యతే— కర్మణః సుకృతస్య సాత్త్వికస్యేత్యర్థః । ఆహుః శిష్టాః సాత్త్విక మేవ నిర్మలం ఫల మితి రజస స్తు ఫలం దుఃఖం రాజసస్య కర్మణ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

రజోగుణ ముద్భూతమై యుండ మరణమును పొంది కర్మాసక్తితో గూడిన మనుష్యుల యందు జనించును. తమోగుణ ముద్భూతమైయుండ మరణించి పశ్వాదియోనులయందు జనించుచున్నాడు. ॥౧౫॥

అతీతశ్లోకముయొక్క యర్థమునే సంక్షేపముగ నీశ్లోకమునందు చెప్పుచుండెను. వేదోక్తవిధానముచే లెస్సగ ననుష్ఠింపబడిన కర్మ సుకృత మనబడును. అట్టి స్సాత్త్వికమైన కర్మకు సాత్త్వికమైన నిర్మలమైన ఫలమును, రాజసకర్మకు దుఃఖరూపఫలమును, కర్మాధి

డగునో శ్రుతిస్మృతివిహిత, నిషిద్ధకర్మఫలాధికారముగల మనుష్యులలో జన్మించును. అట్లే తమోగుణము ప్రవృద్ధమైనపుడు మృతు డగునో పశ్వాదిమూఢయోనులలో జన్మించును. ॥౧౫॥

శంకరానందీయము:— రజోగుణము, తమోగుణము నుత్కర్షను పొందినచో నాసమ యమున మృతులగు వారి గతిని జెప్పుచున్నాడు— రజోగుణము వృద్ధినొందిన సమయమున దేహధారి మృతుడగుచో నాతడు రజఃప్రవృద్ధి వేగముచే తిరిగి కర్మయోగయుక్తులగు మనుష్యులలో జన్మించును. తమోగుణము ప్రవృద్ధమగు సమయము మృతుడగుచో బశ్వాదియోనులయందు జన్మించును. ॥౧౫॥

—• ౧౪ వ అధ్యాయము ౧౬ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ప్రస్తుతము సత్త్వాదిగుణములను స్వానురూపకర్మద్వారా తల్లు విచిత్రఫలములను సంక్షేపముగ జెప్పుచుండెను— సుకృతరూపమగు సాత్త్వికరూపమగు కర్మకు

గీ॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ ॥ ॥౧౭॥

పదవిభాగము:— సత్త్వాత్— సంజాయతే— జ్ఞానం— రజసః— లోభః— ఏవ— చ— ప్రమాద మోహౌ— తమసః— భవతః— అజ్ఞానం— ఏవ— చ ॥ ॥౧౭॥

ప్రతిపదార్థము:— సత్త్వాత్=ఉద్భూతమైన సత్త్వగుణమువలన; జ్ఞానం=జ్ఞానము; సంజాయతే =జనించుచున్నది; రజసః=రజోగుణమువలన; లోభఏవచ=లోభము; సంజాయతే=జనించుచున్నది; తమసః= తమోగుణమువలన; ప్రమాదమోహౌ=ప్రమాదము, మోహము; భవతః=సంభవించుచున్నవి; అజ్ఞానమేవచ= అజ్ఞానమున్ను; భవతి=సంభవించుచున్నది. ॥౧౭॥

---

శాంకరభాష్యమ్:—

ఇత్యర్థః । కర్మాధికారాత్ఫలమపి దుఃఖ మేవ కారణానురూప్యాద్రాజస మేవ । తథాఽజ్ఞానం తమస స్తామసస్య కర్మణోఽధర్మస్య పూర్వవత్ ॥ ॥౧౬॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కారణమువలన ఫలముగూడ కారణానురూప్యమువలన రాజసమే యగు దుఃఖమే రాజస కర్మకు ఫలము. అట్లే తామసకర్మకు అధర్మమునకు (అనగా శాస్త్రనిషిద్ధకర్మకు) పూర్వము వలె తామసమగు యజ్ఞానమే ఫల మని శిష్టులు చెప్పుచున్నారు. (శిష్టు లనగ వేదోక్తత్త్వ జ్ఞానముచే వేదవిహితమైన కర్మల నాచరించువారు. ॥౧౬॥

---

సత్త్వగుణముచే నిష్పన్నము రజస్తమోమలామిశ్రితము నగు సుఖమును ఫలముగా మహర్షులు చెప్పుదురు. రాజసకర్మకు (పాపమిశ్రితమైన పుణ్యకర్మకు) దుఃఖబహుళ మగు నల్పసుఖమును ఫలముగా చెప్పుదురు. కార్య మెప్పుడును కారణానురూపమే గాన పాపమిశ్రితపుణ్యఫలము దుఃఖబహుళసుఖరూపమే యగును. తామస కర్మమునకు (అధర్మమునకు) అజ్ఞానమును (అవివేకప్రాయ మగు దుఃఖమును) ఫలముగా జెప్పుదురు. ఈసాత్త్వికాదికర్మలకు లక్షణములు ౧౭వ అధ్యాయమున జెప్పబడును. (ఇట రజస్తమశ్శబ్దములు తత్కార్యము లగు కర్మలయందు ప్రయోగింపబడెను.) ॥౧౬॥

శంకరానందీయము:— ఈవిధముగ గుణస్వరూపమును, వాని బంధకత్వమును, వాని వృద్ధిని, ఆట్టి గుణవృద్ధివలన గల్గు కార్యమును జెప్పి, యాగుణములు ప్రధానముగా గల కర్మల ఫలమును జెప్పుచున్నాడు.— "సుకృతస్య కర్మణః" శమదమశ్రద్ధాదిసత్త్వగుణసంపత్తితోడియు, నీశ్వరార్పణబుద్ధి తోను లెస్సగ ననుష్ఠింపబడిన సాత్త్వికకర్మకు "సాత్త్వికం... ఫలం" సత్త్వోపబృంహితము, గుణత్రై వవ్యకృత మగు దుఃఖముతో విరహితము నగు వైష్ణవముగాని, బ్రాహ్మముగాని యగు సుఖమును ఫలముగా మునులు చెప్పుదురు. "రజసస్తు ఫలం దుఃఖం" రజోగుణప్రధానము, కామసంకల్పాది పూర్వ కముగ ననుష్ఠితమైన కర్మకు— యాతాయాతదుఃఖబహుళ మగు స్వర్గసుఖమును ఫలముగా జెప్పుదురు. "అజ్ఞానం తమసఃఫలం" తమోగుణనిష్పన్నము, విధినియమశూన్యము నగు తామసకర్మమునకు— "వీడు భోక్త, ఇది భోగ్యము, దీని గుణమిది, దీని రస మిట్టిది" అను జ్ఞానము లేకుండగ కేవల నిద్రామయమగు అనుభూతిని ఫలముగా జెప్పుదురు. ॥౧౬॥

గీ॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః ।
జఘన్యగుణవృత్తస్థా అధో గచ్ఛన్తి తామసాః ॥ ॥౧౮॥

పదవిభాగము:— ఊర్ధ్వం- గచ్ఛన్తి- సత్త్వస్థాః- మధ్యే- తిష్ఠన్తి- రాజసాః- జఘన్యగుణవృత్తస్థాః- అధః- గచ్ఛన్తి- తామసాః ॥ ॥౧౮॥

ప్రతిపదార్థము:— సత్త్వస్థాః=సత్త్వగుణవృత్తియందున్నవారు; ఊర్ధ్వం=మీదుగ; గచ్ఛన్తి= వెళ్ళుచున్నారు; (అనగా దేవలోకాదులయందు జనించుచున్నారు.) రాజసాః=రజోగుణవృత్తియందున్నవారు; మధ్యే=మనుష్యలోకమునందు; తిష్ఠన్తి=ఉండెదరు; (అనగా మనుష్యులయందు జనించుచున్నారు) జఘన్యగుణవృత్తస్థాః=నీచమైన గుణము తమస్సు, దానిస్వభావము నిద్రాలస్యాదికము. అట్టి నిద్రాలస్యాదికము నందున్న; తామసాః=తమోగుణము కలవారు; అధః=పశ్వాదులయందు; ఉత్పద్యన్తే=పుట్టుచున్నారు. ॥౧౮॥

---

శాంకరభాష్యమ్.—

కించ గుణేభ్యో భవతి — సత్త్వాత్ లబ్ధాత్మకాత్ సంజాయతే సముత్పద్యతే జ్ఞానం రజసో లోభ ఏవ చ । ప్రమాదమోహౌ చోభౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ భవతి ॥౧౭॥

---

శాంకరభాష్యార్థతత్త్వబోధిని:—

మరియు సత్త్వరజస్తమోగుణములవలన నేదేది సంభవించునో యెరుగవా?

సత్త్వగుణము [illegible] జ్ఞానము [illegible]. ఉద్భూతమైన రజోగుణమువలన లోభము ప్రాప్తించును. ఉద్భూతమైన తమోగుణమువలన ప్రమాదము, మోహము సంభవించును. మరియు అట్టి తమోగుణమువలన అజ్ఞానముగూడ సంభవించును. ॥౧౭॥

---

—• ౧౪ వ అధ్యాయము ౧౭ వ శ్లోకవ్యాఖ్యావిశేషము •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వోక్తమగు [illegible] పూర్వోక్తహేతువు [illegible] చెప్పుచున్నారు— "సత్త్వాత్ సంజాయతే జ్ఞానం" [illegible] "రజసో లోభ ఏవ చ" [illegible] ఫలము దుఃఖమే ఫలించును. ఈవిధముగనే తమోగుణమువలన ప్రమాద, మోహములు కల్గును. మరియు అజ్ఞానముగూడ కలుగును. (ఇట ఏవకారము— ప్రకాశప్రవృత్తి [illegible] తెల్పుటకై ప్రయోగింపబడెను) కాన తామసకర్మకు అజ్ఞానాదిప్రాయమగు ఫలము [illegible]. (ఇట [illegible] ప్రమాద, మోహాజ్ఞానములు "అప్రకాశోఽప్రవృత్తిశ్చ" అను శ్లోకవ్యాఖ్యానావసరమున వ్యాఖ్యాతములు.) ॥౧౭॥

శంకరానందీయము:— ఆయా కార్యములచే కారణముల నూహించుటకై సత్త్వాదిగుణముల కార్యముల నీశ్లోకమునం దెప్పుచున్నారు — "సత్త్వాత్...జ్ఞానం" సత్త్వగుణావిర్భావమువలన కార్యాకార్యవివేకజ్ఞానము గల్గును. "రజసో లోభ ఏవ చ" రజోగుణావిర్భావమువలన పదార్థములయెడ తృష్ణ కలుగును. "ప్రమాదమోహౌ తమసో భవతః" తమోగుణావిర్భావమువలన ప్రమాద, మోహములు కల్గును. మరియు అజ్ఞానమును (ఇతికర్తవ్యతాఽనభిజ్ఞత్వరూపమగు బుద్ధిజాడ్యము.) కలుగును. ॥౧౭॥

శాంకరభాష్యమ్:—

కిం చ ఊర్ధ్వం గచ్ఛంతి దేవలోకాది షూత్పద్యంతే సత్త్వస్థాః సత్త్వగుణవృత్తస్థాః । మధ్యే తిష్ఠన్తి మనుష్యే షూత్పద్యన్తే రాజసాః । జఘన్యగుణవృత్తస్థాః జఘన్యశ్చాసౌ గుణశ్చ జఘన్యగుణస్తమ స్తస్య వృత్తం నిద్రాలస్యాది తస్మిన్ స్థితా మూఢా అధో గచ్ఛంతి పశ్వాది షూత్పద్యంతే తామసాః ॥ ॥౧౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు సత్త్వగుణస్వభావమునం దుండువారు దేవలోకాదులయందు జనించుచున్నారు. రజోగుణస్వభావమునందుండువారు మనుష్యులయందు జనించుచున్నారు. నీచమైన గుణము తమస్సు. అట్టి తమోగుణముయొక్క స్వభావము నిద్ర ఆలస్యాదులు. అట్టినిద్రాలస్యాదుల యందుండు తామసులు పశ్వాదులయందు జనించుచున్నారు. ॥౧౮॥

—• ౧౪వ అధ్యాయము ౧౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ప్రస్తుతము సత్త్వాదివృత్తమునందుండువారికి ఊర్ధ్వ, మధ్య, అధోభావముతో నగు ఫలమును జెప్పుచున్నాడు.— "ఊర్ధ్వం...సత్త్వస్థాః" శాస్త్రీయ మగు సత్త్వవృత్తియందు (జ్ఞానమునందుగాని, కర్మయందుగాని) నిరతులగువారు సత్యలోకపర్యంతము గల దేవలోకమును పొందెదరు. (అట్టివారు జ్ఞానకర్మతారతమ్యానుసారము దేవతలలో బుట్టుదు రని యర్థము.) "తథా...రాజసాః" లోభాదిపూర్వక మగు రాజసకర్మలయందు నిరతు లగువారు పుణ్యపాప మిశ్ర మగు మనుష్యలోకమం దుందురు. (మనుష్యులలో బుట్టెదరు.) అంతియేకాని యూర్ధ్వలోకమునకుగాని, యధో లోకమునకుగాని వెళ్ళరు. సత్త్వ, రజోగుణములకంటె నికృష్ట మగు తమోగుణవృత్తమునం (నిద్రాలస్యాదులయం) దుండువారు. అధోలోకములను (పశ్వాదిజన్మలను) పొందుదురు. (ఇట జఘన్యగుణవృత్తిస్థాః అనునంతమాత్రమే పైవివక్షితార్థమును తెలుపుచున్నను "తామసాః" అను విశేషణవిన్యాసముచే సర్వదా తమఃప్రధానులగువారు అను విశేషవివక్షితార్థము లభించును. అందుచే నెపుడో కొంత కాలము తమోగుణ ప్రధానులై తరువాత సత్త్వవృత్తమునం దుండువారు కాక సర్వదా తమోగుణవృత్తముకలవారు అధోలోకములను పొందుదురని సూచింపబడెను. ॥౧౮॥

శంకరానందీయము:— సత్త్వాదిగుణముల కార్యములను జెప్పి, అట్టి సత్త్వాదిగుణనిష్ఠులకు గల్గు గతుల నీశ్లోకమున జెప్పుచున్నాడు.— "సత్త్వస్థాః" మోక్షేచ్ఛతో, సత్త్వగుణోత్పన్న మగు సదసద్వివేకజ్ఞానకార్యమునందును, జ్ఞానకార్య మగు పరమేశ్వరోపాసనమందును ఉండు పురుషులు "ఊర్ధ్వం" బ్రహ్మవిష్ణ్వాదిలోకస్థానమును "గచ్ఛంతి" పొందుచున్నారు. "రాజసాః" రజోగుణముచే నిష్పన్న మగు జ్ఞానమునందును, నట్టి జ్ఞానకార్యమును, కామసంకల్పాదిగుణయుక్త మగు శ్రౌతాదికర్మలయందు భోగేచ్ఛతో ప్రవర్తించు పురుషులు "మధ్యే" బ్రహ్మతిర్యక్ లోకముల మధ్యభాగమునం (యాతాయాతములతో దేవమనుష్య లోకములం) దుందురు. "జఘన్యగుణవృత్తస్థాః" తమఃప్రధాన మగుజ్ఞానము నందును, సదసద్వివేకవర్జితమగు కర్మయం దుండువారు కృత్యాకృత్యవివేకశూన్యులై, "అధో గచ్ఛంతి" తిర్యగ్యోనులయందు జన్మించెదరు. తిర్గి తిర్గి పుట్టుచు గిట్టుచునుందురు. ॥౧౮॥

గీ॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥ ॥౧౯॥

పదవిభాగము:— న- అన్యం- గుణేభ్యః- కర్తారం- యదా- ద్రష్టా- అనుపశ్యతి- గుణేభ్యః- చ- పరం- వేత్తి- మద్భావం- సః- అధిగచ్ఛతి ॥ ॥౧౯॥

ప్రతిపదార్థము:— ద్రష్టా=విద్వాంసుడు; యదా=ఎపుడు; గుణేభ్యః=కార్యకారణవిషయాకారముగ పరిణతమైన గుణములకంటె; అన్యం=మరియొక; కర్తారం=కర్తను; నానుపశ్యతి=చూడడో; గుణేభ్యశ్చ= గుణములకంటె, పరం=అతిరిక్తుడైన గుణవ్యాపారసాక్షిభూతుడైన వానిని; వేత్తి =తెలిసికొనునో; సః=అవిద్వాంసుడు; మద్భావం=నాభావమును; అధిగచ్ఛతి=పొందుచున్నాడు. ॥౧౯॥

శాంకరభాష్యమ్:—

పురుషస్య ప్రకృతిస్థత్వరూపేణ మిథ్యాజ్ఞానేన యుక్తస్య భోగ్యేషు గుణేషు సుఖదుఃఖమోహాత్మకేషు సుఖీ దుఃఖీ మూఢోఽహ మస్మీ త్యేవంరూపో యః సంగ స్తత్కారణం పురుషస్య సదసద్యోనిజన్మప్రాప్తిలక్షణస్య సంసారస్యేతి సమాసేన పూర్వాధ్యాయే యదుక్తం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రకృతిస్థత్వరూపమైన మిథ్యాజ్ఞానముతో గూడిన పురుషునకు సుఖదుఃఖమోహాత్మకములైన భోగ్యము లగు గుణములయందు "సుఖీ, దుఃఖీ మూఢోఽహమస్మి" అనెడి యేసంగము కలదో యాసంగమే పురుషునకు సదసద్యోని జన్మప్రాప్తిరూపమైన సంసారము

—• ౧౪ వ అధ్యాయము, ౧౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈయధ్యాయమున జెప్పదగినవిగా మూడు విషయములు ప్రస్తుతమయ్యెను. అందు క్షేత్రక్షేత్రజ్ఞసంయోగ మీశ్వరాధీన మనియు, ఏయేగుణములు ఏయేవిధముగా బురుషుని బంధితుని చేయుచున్నవి? అను నీరెండువిషయములు నిరూపింపబడెను. ప్రకృతమున గుణముల నుండి విమోచన మెట్లు కలుగును? అట్టి ముక్తుని లక్షణమేమి? అను విషయము వక్తవ్యముగా మిగిలియున్నది. అందు గుణములు మిథ్యాజ్ఞానస్వరూపములుగాన సమ్యగ్జ్ఞానమువలన వానినుండి విముక్త డగు నని యీశ్లోకమున జెప్పుచుండెను. "గుణేభ్యః అన్యం కర్తారం యదా ద్రష్టా నానుపశ్యతి" కార్య, కారణ, విషయాకారముగ పరిణమించిన గుణములకంటె వేరుగ నితరు డగు కర్తను ఏకాలమున విచారకుశలు డగు ద్రష్ట చూడకుండునో, అనగా గుణములే యంతఃకరణబహిష్కరణశరీరవిషయభావము నొందినవై సర్వకర్మలను జేయుచున్నవి. అని విచారకుశలుడు తెలిసికొని. "గుణేభ్యశ్చ పరం వేత్తి" క్షేత్రజ్ఞుని ఆయా యవస్థావిశేషములుగ పరిణమించిన గుణములకంటె అతీతునిగ అనగా ఎట్లు సూర్యుడు జలతత్కంపాద్యవభాసకుడయ్యు జలతత్కంపాదికముచే నసంస్పృష్టు డగుచుండెనో యట్లే క్షేత్రజ్ఞుడుగూడ గుణతత్కార్యావభాసకుడయ్యు గుణతత్కార్యములచే నసంస్పృష్టుడనియు, నిర్వికారుడనియు, సర్వసాక్షియనియు; సర్వసముడనియు; నొకడే యనియు నే విచారకుశలుడు తెలిసికొనునో యట్టి ద్రష్ట నాస్వరూపము నొందుచున్నాడు, ॥౧౯॥

శాంకరభాష్యమ్:—

తదిహ సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవా ఇత్యత ఆరభ్య గుణస్వరూపం. గుణవృత్తం స్వవృత్తేన చ గుణానాం బన్ధకత్వం గుణవృత్తనిబద్ధస్య చ పురుషస్య యా గతి రిత్యేత త్సర్వం మిథ్యాజ్ఞాన మజ్ఞానమూలం బన్ధకారణం విస్తరేణోక్త్వాఽధునా సమ్యగ్దర్శనా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నకు కారణమని సంగ్రహముగ పూర్వాధ్యాయమునందు చెప్పబడిన విషయమే యీయధ్యాయమునందలి "సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః" అనునది మొదలుకొని గుణస్వరూపము, గుణవృత్తము, గుణవృత్తముచే గుణములకు బంధకత్వము, గుణవృత్తనిబద్ధమైన పురుషునకు ప్రాప్తించుగతి యీసర్వమున్ను, మిథ్యాజ్ఞాన మజ్ఞానమూలము, బంధకారణమును విస్తారముగ జెప్పి యిపుడు సమ్యగ్దర్శనమువలన మోక్షము ప్రాప్తించు నని చెప్పదగియున్న దని శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచుండెను.

శంకరానందీయము:— 'త్రిభి ర్గుణమయై ర్భావైః' అనియు 'దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా' అనియు. "కారణం గుణసంగోఽస్య" అనియు వీనిచే గుణములు మోహకము లనియు, జయింపశక్యమైనవి కానివనియు, సదసద్యోనిజన్మ కారణము లనియు (జెప్పబడెను. ఈవిషయమునే సుస్పష్టము చేయుటకై తిరిగి "సత్త్వం రజ స్తమః" ఇత్యాదికముచే -గుణములే సుఖ, జ్ఞాన, తృష్ణా ఆసక్తి, కర్మప్రవృత్తి, ప్రమాద, ఆలస్య, నిద్రాదులయందు సక్తిని కల్గించున వగుటచే నవిద్యాదిదోష వంతుడును, గుణతత్కార్యములయందు "నేను, నాది" అను మిథ్యాజ్ఞానముతో నుండువాడును అగు పురుషునకు దేవ, మర్త్య, తిర్యగ్యోనిజన్మాద్యనర్థములకు కారణము లగుచున్న వని ప్రతిపాదించి, ప్రస్తుతము "మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే" అను గీతోక్తరీతిని శాస్త్రాచార్యానుగ్రహము చేతను, నా (ఈశ్వర) అను గ్రహముచేతను లెస్సగ వివేచనము చేసి, యాత్మానాత్మస్వరూపమును తెలిసి కొనిన బ్రహ్మవేత్త యగు యతి గుణసంగముచే గల్గు ననర్థమును తెలుసుకొని. యనాత్మవాసనకు స్వాయముగ నవశుడై ప్రత్యగ్దృష్టిని విడువనివాడై; సర్వావస్థలయందు, సర్వకాలములందును కర్తృత్వ, కారయితృత్వ, భోక్తృత్వ ధర్మములు గుణములకే కలవనియు, క్షేత్రజ్ఞు డగు తాను అసంగు డనియు, గుణతత్కార్య, తదవస్థాసాక్షి వనియు తలచినవాడై సదాత్మనిష్ఠచే కార్యసహితముగ గుణత్రయము నతిక్రమించి ముక్తు డగు నని రెండుశ్లోకములచే ప్రతిపాదించుచుండెను:— "చక్షుషో ద్రష్టా శ్రోత్రస్య ద్రష్టా వాచో ద్రష్టా మనసో ద్రష్టా బుద్ధే ర్ద్రష్టా ప్రాణస్య ద్రష్టా తమసో ద్రష్టా సర్వస్య ద్రష్టా" అనియు, "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అనియు, "అప్రాణో హ్యమనా శ్శుభ్రః" అనియు నీమొదలగు శ్రుతులచేతను, "ఆత్మ ద్రష్ట యగుటవలన దేహేంద్రియమనోబుద్ధ్యాదులకంటె భిన్నమైనది. ఘటద్రష్ట ఘటముకంటె భిన్నముకదా! అట్లేయని యిట గూడ తెలిసికొనదగును." అను నీమొదలగు యుక్తులచేతను ఆత్మ దేహేంద్రియమనోబుద్ధ్యాదులకంటె వేరగుటచే స్వాత్మచే విజ్ఞాతమైన యాత్మయాథార్థ్యముకలవాడై, తన నవిక్రియాత్మనుగ తెలిసి కొనిన యతి సమాధిచే జ్ఞానపరిపక్వావస్థయందు "గుణేభ్యోఽన్యం కర్తారం. నానుపశ్యతి". గుణ కార్యము

శాంకరభాష్యమ్:—

న్మోక్షో వక్తవ్య ఇత్యాహ భగవాన్— నాన్యం కార్యకారణవిషయాకారపరిణతేభ్యో గుణేభ్యః కర్తార మన్యం యదా ద్రష్టా విద్వా న్సన్నానుపశ్యతి । గుణా ఏవ సర్వావస్థాః సర్వకర్మణాం కర్తార ఇత్యేవం పశ్యతి । గుణేభ్యశ్చ పరం గుణవ్యాపారసాక్షిభూతం వేత్తి మద్భావం మమ భావం స ద్రష్టాఽధిగచ్ఛతి ॥ ॥౧౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విద్వాంసుడై యుండి ద్రష్ట యెపుడు కార్యకరణవిషయాకార పరిణతములైన గుణములకంటె వేరుగ కర్తను చూడడో సర్వావస్థములైన గుణములే సర్వకర్మలకు కర్తలని తెలిసికొనునో. గుణములకంటె, పరుని గుణవ్యాపారసాక్షిభూతుని తెలిసికొనునో. ఆద్రష్ట నాయొక్క భావమును (ధర్మమును) పొందుచున్నాడు. ॥౧౯॥

లగు దేహేంద్రియాదులకంటె వేరుగ నింకొక కర్తను తెలిసికొనకుండును. అనగా కాయికములు, వాచికములు, మానసికములు నగు విహితాఽవిహితసామాన్యరూపము లగు సర్వకర్మలకును దేహేంద్రియాదికము కంటె వేరొక కర్తను తెలిసికొనకుండును. ఆయాకర్మలు నిష్పన్నమైన యుత్తరక్షణమునందే యాయాకర్మలకు కర్తనుగా దేహేంద్రియాదికమునే తెలిసికొనును. "చూచునది చక్షురింద్రియము, వినునది శ్రోత్రేంద్రియము; మనస్సే మననము చేయుచున్నది; బుద్ధియే తెలుసుకొనుచున్నది: వాగింద్రియమే పలుకుచున్నది: నేను ఇంద్రియస్వరూపుడను గాను కాన దేనికిని కర్తను గాను" అని తెలుసుకొనును. గజము నధిష్ఠించినవాడు ఆగమనకర్తృత్వమును గజనిష్ఠముగనే తెలిసికొనును. అట్లే బ్రహ్మవేత్త తనకంటె భిన్నములుగ గ్రహ్యమాణము లగు దేహేంద్రియాదులకే కర్తృత్వ మనియు, సత్త్వాదిగుణకార్యము లగు అవిద్యాకామాదులకే కారయితృత్వ మనియు, విజ్ఞానాత్మకే తత్ఫలభోక్తృత్వ మనియు తెలుసుకొనును. ఇంతియేగాని యీకర్తృత్వ, కారయితృత్వ, ఫలభోక్తృత్వములు క్షేత్రజ్ఞు డగు తనకు లేవని తలచును. యానారూఢన్యాయమున బ్రహ్మవేత్త యగు యతి యాత్మానాత్మవివేకవిజ్ఞానముచే స్వాతిరిక్త మగు దేహేంద్రియాదులకే కర్తృత్వాదికమునే పరిపక్వావస్థయందు జూచునో ఆసమయమునందే "గుణేభ్యశ్చ పరం వేత్తి" తనను (ఆత్మను) గుణములకంటెను, గుణకార్యము లగు అహంకారాదులకంటెను విలక్షణమైనవానిగను, అకర్తనుగను, గమనవర్జితునిగను, మననరహితునిగను, అబోద్ధనుగను, విక్రియాశూన్యునిగను, క్షేత్ర, తద్ధర్మ, తత్కార్యాఽస్పృష్టునిగను తెలుసుకొనును. మరియు దనను నిష్కలునిగను, నిష్క్రియునిగను, శాంతునిగను, ఆకాశమువలె పరిపూర్ణునిగను జూచును. ఈవిధముగ నెవడు దేహేంద్రియాదులకే కర్తృత్వమును, ఆత్మకు అకర్తృత్వమును స్వయముగ నపరోక్షముగ నెవడు జూచునో "మద్భావం సోఽధిగచ్ఛతి" అట్టి బ్రహ్మవేత్త నిర్విశేషపరబ్రహ్మభావరూప మగు మత్స్వరూపత్వమును (పరిపూర్ణత్వమును) పొందగలడు. నిత్యనిరంతరసమాధిచే బ్రాప్తమైన సమ్యగ్జ్ఞానముచే "నీసర్వము, నేను బ్రహ్మస్వరూపమే" యని సర్వమునకు బ్రహ్మమాత్రత్వమునే తెలిసికొనినవాడై, గుణ, తత్కార్యరూప మగు అనర్థవ్రాతము నధిగమించినవాడై జీవించియుండగనే బ్రహ్మాత్మభావముతో నుండి ముక్తు డగును. ॥౧౯॥

గీ॥ గుణా నేతా నతీత్య త్రీ న్దేహీ దేహసముద్భవా౯ ।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే ॥ ॥౨౦॥

పదవిభాగము:— గుణా౯- ఏతా౯- అతీత్య- త్రీ౯- దేహీ- దేహసముద్భవా౯- జన్మమృత్యుజరాదుఃఖైః- విముక్తః- అమృతం- అశ్నుతే ॥ ॥౨౦॥

ప్రతిపదార్థము:— దేహీ=జీవుడు; దేహసముద్భవా౯=దేహోత్పత్తికి బీజభూతమైన; త్రీ౯=మూడైన; ఏతా౯=ఈ; గుణా౯=మాయోపాధిభూతమైన సత్త్వరజస్తమోగుణములను; అతీత్య=అతిక్రమించి; జన్మమృత్యుజరాదుఃఖైః=జన్మమృత్యుజరాదుఃఖములచే; విముక్తః=విడవబడినవాడై; అమృతం=పరమేశ్వరభావమును; అశ్నుతే=పొందుచున్నాడు. ॥౨౦॥

శాంకరభాష్యమ్.—

కథ మధిగచ్ఛతీ త్యుచ్యతే— గుణా నేతా న్యథోక్తా నతీత్య జీవన్నే వాతిక్రమ్య మాయోపాధిభూతాం (స్త్రీ) న్దేహీ దేహసముద్భవా న్దేహోత్పత్తిబీజభూతా౯, జన్మమృత్యు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎటుల (యీశ్వరభావమును) పొందుచున్నాడను శంకపై చెప్పుచుండెను.

క్షేత్రజ్ఞుడు విద్వాంసుడై మాయోపాధిభూతమైన దేహోత్పత్తికి బీజభూతములైన యీసత్త్వరజస్తమోరూపమైన మూడుగుణములను బ్రతికియుండగనే యతిక్రమించి జన్మ

—: ౧౪ వ అధ్యాయము ౨౦ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— పూర్వశ్లోకమున విచారకుశలుడగు ద్రష్ట నాస్వరూపమును పొందును నని చెప్పెను. అట్టి మద్భావాపత్తి నెట్లు పొందగలడో యీశ్లోకమున జెప్పుచుండెను:— "గుణా౯—దేహసముద్భవా౯" బ్రహ్మజ్ఞాని యగు దేహి దేహోత్పత్తికి బీజభూతములు, మాయాస్వరూపములు నగు సత్త్వరజస్తమోనామకము లగు మూడుగుణములను అతిక్రమించి (చింతించియుండగనే తత్త్వజ్ఞానముచే బాధించి) "జన్మ... అశ్నుతే" జన్మముచేతను, మృత్యువుచేతను, ముదిమిచేతను కలుగు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికము లగు దుఃఖములచే విముక్తుడై, జీవించియుండగనే గుణసంబంధరహితుడై మోక్షమును పొందుచుండెను. ॥౨౦॥

శంకరానందీయము:— అవిక్రియుడైన యాత్మను కర్తృత్వభోక్తృత్వాదిధర్మములు కల దేహేంద్రియాదులకంటె భిన్నమైనదిగ దెలిసికొని, బ్రహ్మవేత్త యగు యతి స్వానుభవముచే నెల్లపుడు గుణత్రయమును దాటియే ముక్తుడగునుకాని, వేరొండు విధమున ముక్తుడు కానేరడని యీశ్లోకమున బోధించుచుండెను.— "గుణా౯... దేహసముద్భవా౯" బ్రహ్మవేత్త యగు దేహి— మేఘమునకంటె వేరగు సూర్యుడు మేఘ, తత్కార్యములచే నెట్లు అసంస్పృష్టుడో యట్లే యాత్మ దేహేంద్రియాదులకంటె భిన్నుడై దేహతత్కార్యములచే నసంస్పృష్టుడై, యకర్త; యభోక్త యగు నని తెలిసికొని, చిత్తప్రసాద, రాగ, మోహ, లోభాదిలింగములచే దెలియబడు సుఖ, జ్ఞాన, కర్మప్రవృత్తి, ప్రమాదాదులయందే పురుషునకు తత్పరత్వము నాపాదించునట్టియు, కనుకనే దేహారంభకము లగునట్టియు, (అనగా సత్త్వగుణపరిణామవిశేషములగు

అర్జున ఉవాచ:—

గీ॥ కై ర్లింగై స్త్రీ న్గుణా నేతా నతీతో భవతి ప్రభో! ।
కి మాచారః కథం చై తాం స్త్రీ న్గుణా నతివర్తతే ॥ ॥౨౧॥

పదవిభాగము:— కైః- లింగైః- త్రీన్- గుణాన్- ఏతాన్- అతీతః- భవతి- ప్రభో- కిం- ఆచారః- కథం- చ- ఏతాన్- త్రీన్- గుణాన్- అతివర్తతే ॥ ॥౨౧॥

ప్రతిపదార్థము:— అర్జునః=అర్జునుడు; ఉవాచ=పలికెను; (ప్రశ్నించెను.)
హేప్రభో=ఓజగదీశ్వర!; కైః=ఏ; లింగైః=చిహ్నములచే; త్రీన్=మూడైన; ఏతాన్=పూర్వమునందు వ్యాఖ్యానింపబడిన సత్త్వరజస్తమోగుణములను; అతీతః=అతిక్రమించినవాడై; భవతి=అగుచున్నాడు; కిమాచారః=ఎట్టియాచరణ కలవాడు; ఏతాన్=ఈ; త్రీన్=మూడగు; గుణాన్=గుణములను; కథం=ఎట్లు; అతివర్తతే=అతిక్రమించును. ॥౨౧॥

శాంకరభాష్యమ్:—
జరాదుఃఖైః జన్మ చ మృత్యుశ్చ జరా చ దుఃఖాని చ తై ర్జీవన్నేవ విముక్తః స న్విద్వా నమృత మశ్నుతే । ఏవం మద్భావ మధిగచ్ఛతీత్యర్థః ॥ ॥౨౦॥
జీవన్నేవ గుణా నతీ త్యామృత మశ్నుత ఇతి ప్రశ్నబీజం ప్రతిలభ్య— కై ర్లింగై

శాంకరభాష్యతత్త్వబోధిని:—
మృత్యుజరాదుఃఖములచే బ్రతికియుండగనే విముక్తుడై పరమేశ్వరభావమును పొందుచున్నాడు. ॥౨౦॥

సమ్యగ్దర్శనమునకు ఫలము త్రిగుణాతిక్రమణ పూర్వకమైన అమృతత్వ ముక్తము. అట్లగుచో బ్రతికియుండగనే త్రిగుణముల నతిక్రమించి యమృతత్త్వమును పొందుననుటలో ప్రశ్నబీజమును గ్రహించి యర్జునుడు ప్రశ్నించుచుండెను.

దయా, సత్య, శౌచ, వినయ, దానశీలత్వాది సాత్త్వికవికారములచేతను, రాగ, ద్వేష, లోభ, అసూయాదులగు రాజసవికారములచేతను, మోహ, అభినివేశ, అహంకార, మమకారాది తామసవికారములచేతను, పుణ్యపాపములచేతను, సత్త్వరజస్తమోగుణములే దేహోత్పత్తికి హేతువు అగుచున్నవి.) గుణత్రయమును, ఆగుణధర్మము లగు అవిద్యాకామాదికమును అతిక్రమించి (అనగా ప్రత్యగ్దృష్టిచే "నీసర్వము, నేను బ్రహ్మస్వరూపమే" అని యంతటను బ్రహ్మమాత్రత్వదర్శనాగ్నిచే గుణములను, గుణకార్యము లగు యహం మమేత్యాదివిపరీతప్రత్యయములను అన్నిటిని దహించి) సత్తామాత్రుడై "జన్మ...అశ్నుతే" దేహసంబంధముచే గల్గు జన్మమృత్యుజరాదుఃఖములచే విడువబడినవాడై, జన్మాదిదుఃఖములచే నసంస్పృష్టుడై విదేహకైవల్యము నొందును. నిత్యాఖండాద్వయబ్రహ్మస్వరూపమున నుండగల డని యర్థము. ॥౨౦॥

—• ౧౪వ అధ్యాయము ౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈగుణత్రయము నతిక్రమించినవాడు జీవించియుండియే ముక్తుడగు ననువిషయమును విని యర్జునుడు- గుణాతీతుని లక్షణమేమి? అతని యాచార మెట్టిది? అట్టి గుణా

శ్రీభగవానువాచ:—

గీ॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవ చ పాండవ! ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ ॥౨౨॥

పదవిభాగము:— శ్రీభగవాన్- ఉవాచ- ప్రకాశం- చ- ప్రవృత్తిం- చ- మోహం- ఏవ- చ- పాండవ- న- ద్వేష్టి- సంప్రవృత్తాని- న- నివృత్తాని- కాంక్షతి ॥ ॥౨౨॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=(అర్జునుని ప్రశ్నకు) సమాధానము చెప్పెను; హేపాండవ!=పాండురాజు పుత్రుడవగు ఓ యర్జున; ప్రకాశం చ=సత్త్వకార్యమును; ప్రవృత్తిం చ=రజఃకార్యమగు ప్రవృత్తిని: మోహమేవ చ=తమఃకార్యమగుమోహమును; ఏతాని= ఈసత్త్వరజస్తమఃకార్యములు; సంప్రవృత్తాని=లెస్సగ విషయభావముచే నుద్భూతమైయుండ; నద్వేష్టి= ద్వేషించడు; నివృత్తాని=నివర్తించిన యీసాత్త్వికరాజసతమఃకార్యములను; న కాంక్షతి=కోరడు. ॥౨౨॥

---

శాంకరభాష్యమ్:—

త్రిభి ర్లింగై రేతా న్వ్యాఖ్యాతా న్గుణా నతీతోఽతిక్రాన్తో భవతి ప్రభో । కిమాచారః కోఽస్యాచార ఇతి కిమాచారః । కథం కేన చ ప్రకారేణ చైతాం స్త్రీ న్గుణా నతివర్తతే ॥ ॥౨౧॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓజగత్ప్రభువగు శ్రీకృష్ణ! ఏచిహ్నములచే పూర్వమునందు వ్యాఖ్యానింపబడిన సత్త్వరజస్తమోగుణముల నతిక్రమించుచున్నవా డగుచున్నాడు? ఎట్టియాచరణ కలవాడు? ఏతీరున త్రిగుణముల నతిక్రమించుచున్నాడు? ॥౨౧॥

---

తీతత్త్వము ప్రాప్తించుట కుపాయ మేమి? అను నీవిషయములను తెలిసికొను నిచ్ఛకలవాడై ప్రశ్నించుచున్నాడెను.— "త్రైః...ప్రభో!" ఈగుణముల నతిక్రమించినవాడు ఏలింగములతో నుండును? అనగా నట్టి వానిని ఏలింగములచె దెలిసికొనదగును? ఈవిషయమును నాకు తెల్పుము. ఇదియొకప్రశ్నము. (ఇట ప్రభువగుటవలన భృత్యదుఃఖమును భగవంతుడ వగు నీవే నివారింప సమర్థుడవు అని సూచించుటకై "ప్రభో!" అని సంబోధించెను.) "కిమాచారః" అట్టి గుణాతీతుడు- ఎట్టి ఆచరణము కలవాడగును? అనగా స్వచ్ఛందాచరణము కలవా డగునా? లేక అన్యనియంత్రితు డగునా? (అని రెండవప్రశ్నము.) "కథం...అతివర్తతే" ఈమూడుగుణములను నేయుపాయముచే నతిక్రమింపనగును? అనగా గుణాతిక్రమణమున కేయే యుపాయము నాశ్రయింపదగును? (ఇది మూడవప్రశ్నము.) ॥౨౧॥

శంకరానందీయము:— ఆత్మ దేహముకంటె వ్యతిరిక్తముగ తెలిసికొనిన బ్రహ్మవేత్త గుణత్రయము నతిక్రమించి జీవన్ముక్తు డగు నను విషయము నాకర్ణించి, ఆశ్చర్యచకితుడై, యర్జునుడు అట్టి గుణాతీతుని లక్షణములను, ఆచరణమును, గుణాతిక్రమణోపాయమును ప్రశ్నించి తెలుసుకొనుమండెను— "ప్రభో!" ప్రకృష్టభాస్వరస్వరూపు డగువాడు ప్రభు వనబడును. అనగా చిద్ఘనస్వరూపా! అని సంబోధించుట) హేప్రభూ! "త్రైర్లింగైః—భవతి" ఈగుణత్రయము నతిక్రమించి బ్రహ్మవేత్త స్వరూపముతో నుండు యతి యేయేలక్షణములచే తెలియబడును? అనగా నేగుణములచే నీతడు గుణాతీతుడని తెలియబడునో అట్టి లక్షణము లేవి? "కిమాచారః" గుణాతీతుని ఆచరణ మెట్టిది? అనగా ఈగుణాతీతుడు వైదికర్మ

శాంకరభాష్యమ్:—

గుణాతీతస్య లక్షణం గుణాతీతత్వోపాయం చార్జునేన పృష్టోఽస్మిన్ శ్లోకే ప్రశ్నద్వయార్థం ప్రతివచనమ్। యత్తావ త్త్రైః లింగై ర్యుక్తో గుణాతీతో భవతీతి త చ్ఛృణు— ప్రకాశం చ సత్త్వకార్యం ప్రవృత్తిం చ రజఃకార్యం మోహమేవ చ తమఃకార్య మిత్యేతాని

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏచిహ్నములతో గూడినవాడైన గుణాతీతు డగునో దానిని వినుము.

సత్త్వకార్యము ప్రకాశము, రజఃకార్యము ప్రవృత్తి, తమఃకార్యము నివృత్తి ఇవి లెస్సగ విషయభావముచే నుద్భూతమై యుండ గుణాతీతుడు వాటిని ద్వేషింపడు. సమ్యగ్దర్శనము లేనివాడన్ననో తాసమ్యగ్దర్శియగుటచే నాకు తామసప్రత్యయము జనించినది.

నాచరించునా? లేక, లౌకికము నాచరించునా? లేక యథేష్టాచారవంతుడా? "కథం—అతివర్తతే" ఈగుణత్రయములో నొక్కొక్కగుణమే తన వికారవిశేషములతో గూడి సాగరమువలె నపారమై యనంతమై యుండును. అట్టిచో నీమూడుగుణముల నెట్లతిక్రమింపగలడు? (ఇట కథం తు" అను స్థలమున "తు" అను నది సాధనము దుర్లభమైన దని సూచించుటకు ప్రయుక్తము) అనగా నేయుపాయముచే నీగుణాతిక్రమణమును జేయగలడు? (పై మూడుప్రశ్నములకు సమాధానము చెప్పుమని యర్జునాభిప్రాయము.) ॥౨౧॥

## —• ౧౪ వ అధ్యాయము ౨౨ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "స్థితప్రజ్ఞస్య కా భాషా" అనుదానిచే బ్రశ్నింపబడి "ప్రజహాతి యదా కామాన్" అనుగ్రంథభాగముచే సమాధానమీయబడినదైనను. తిరిగి ప్రకారాంతరమున దెలిసికొను నిచ్ఛచే నర్జునుడు ప్రశ్నించుచున్నాడె నని తలచి శ్రీకృష్ణభగవానులు పైప్రశ్నములకు ప్రకారాంతరముచే నైదు శ్లోకములచే సమాధానము చెప్పుచుండెను— ఏయేలింగములతో గూడినవాడు గుణాతీతు డగునో (తెలియబడునో) ఆలక్షణములను ముందుగ జెప్పెదను వినుము— "ప్రకాశం చ... కాంక్షతి" సత్త్వగుణకార్య మగు ప్రకాశము, రజోగుణకార్య మగు ప్రవృత్తి. తమోగుణకార్య మగు మోహము (ఈపదములుపలక్షణము) ఈగుణకార్యము లన్నియు స్వస్వసామగ్రీవశమున యథానుకూలముగ నుద్భూతములై దుఃఖస్వరూపములై యున్నను వాని నెవడు ద్వేషింపకుండునో, మరియు నట్లే యాగుణకార్యములు వినాశసామగ్రీవశమున నివృత్తములగుచుండును. అట్టివి సుఖరూపములైయున్నను, స్వప్నమువలె మిథ్యారూపములు అను నిశ్చయముతో వానిని సుఖబుద్ధితో నెవడు కాంక్షింపకుండునో అట్టివాడు (ఇట్టిద్వేషరాగశూన్యుడు) గుణాతీతు డని చెప్పబడును. "గుణాతీతః స ఉచ్యతే" అని ముందున్న నాల్గవశ్లోకముతో నన్వయము) ఈగుణాతీతలక్షణము స్వాత్మచే ప్రత్యక్షమగునుగాన తనకే యుపయోగించునుగాని పరార్థముపయోగింపదు. కారణ మేమన: తన నాశ్రయించిన రాగతదభావములుగాని, ద్వేషతదభావములుగాని యితరుడు తెలిసికొననేరడు. ॥౨౨॥

శంకరానందీయము:— అందు ప్రథమప్రశ్నమునకు సమాధానమును శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచుండెను:— గుణములకు, గుణకార్యములకు స్వయముగ నవశుడై. (లోనుగాక) నారెండింటిని చిద్వృత్తిచే నతిక్రమించి యెల్లపుడు బ్రహ్మమునందే బ్రహ్మస్వరూపముగ నెవడుండునో అట్టి బ్రహ్మ

శాంకరభాష్యమ్:—

న ద్వేష్టి సంప్రవృత్తాని సమ్యగ్విషయభావే నోద్భూతాని । మమ తామసః ప్రత్యయో జాత స్తేనాహం మూఢ స్తథా రాజసీ ప్రవృత్తి ర్మమోత్పన్నా దుఃఖాత్మికా తేనాహం రజసా ప్రవర్తితః ప్రచలితః స్వరూపా త్కష్టం మమ వర్తతే యోఽయం మత్స్వరూపావస్థానా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దానిచే నేను మూఢుడ నైతిని. అట్లే నాకు దుఃఖాత్మక రాజసప్రవృత్తి జనించినది. దానిచే నేను స్వరూపమునుండి ప్రచలితుడను. నాస్వరూపావస్థానమునుండి యే యీభ్రంశము కలదో ఇది నాకు కష్టమగుచున్నది. అట్లే ప్రకాశస్వరూప మగు సాత్త్వికగుణము నన్ను వివేకము కలవానినిగ నాపాదించుచు సుఖమునందు సమకూర్చుచు బంధించుచున్నది, అని యీసత్త్వ

వేత్త యగు యతి గుణాతీతు డనబడును. అట్టి బ్రహ్మవేత్త “ప్రకాశంచ” విషయసుఖముల యందును జ్ఞానమునందు ఆసక్తిజనక మైనదియు, చిత్తేంద్రియప్రసాదరూపము, సమాధ్యంతరాయరూపము నగు రసాస్వాద రూప మగు సత్త్వవికారము ప్రకాశమనబడును, “ప్రవృత్తించ” రజోగుణకార్యము, రాగమూలకము, మనస్సును ఇంద్రియములను బహిఃప్రవణములుగ జేయు విక్షేపరూపము, సమాధ్యంతరాయము నగు ఇంద్రియములకు గల్గువిషయప్రవృత్తి ఇట ప్రవృత్తిశబ్దముచే జెప్పబడును. “మోహ మేవ చ” నిద్రా, ఆలస్య, ప్రమాదాసంజకము, లయము, కషాయము, అను శబ్దములచే జెప్పబడునదియు, సమాధ్యంతరాయము నగు తమోవికారము మోహమనబడును. ఇట్టి సత్త్వరజస్తమఃకార్యములు ప్రసక్తము లైనపుడు యెవడు ప్రతికూలత్వబుద్ధితో ద్వేషింపకుండునో, తన్నివృత్తిని అనుకూలత్వబుద్ధితో కోరకుండునో అనగా ఆప్రకాశాదులు చిదాభాసవిషయము లగుటచేతను, వానితో దన కేవిధమైన సంబంధము లేనందునను కొంచె మైనను విక్షేపమును పొందకుండునో అట్టివాడు గుణాతీతు డనబడును. సాధకు డగు నిదిధ్యాసువు సత్త్వాది గుణకార్యము లగు రసాస్వాద, విక్షేప, లయ కషాయరూపము లగు ప్రకాశ, ప్రవృత్తి, మోహములు ప్రవృత్తము లైనపుడు నాకివి సమాధివిఘ్నములు ప్రాప్తించిన” వని ద్వేషించును. వాని నివృత్తినిగూడ కోరుకొని దృశ్యనిందాదికమును గూడ చేయును. ఇట్టి సాధకు డగు నిదిధ్యాసువవలెగాక ఈగుణాతీతుడగు సిద్ధుడు సంప్రవృత్తము లగు ప్రకాశాదులను ద్వేషింపకుండును. మరియు ప్రకాశాదులను నివృత్తము లగు వానిగను కోరకుండును. కారణ మేమనః- ఆప్రకాశాదులు చిద్విలసితము లగుట బ్రహ్మదర్శనములో నంతర్భవించునుగాన వాని నివృత్తినిగూడ యపేక్షింపడని యర్థము. అధ్యాసము వల్లనైనను యనాత్మ తాదాత్మ్య మున్నచో నపుడు రాగద్వేషాదులు సంభవించెడిని. అట్లుగాక నిత్య నిరంతరనిర్వికల్పసమాధ్యగ్ని నిర్దగ్ధాహంమమాధ్యాససంబంధము కలవా డగుటచే గుణాతీతు డగు బ్రహ్మవేత్తకు రాగద్వేషాద్యనాత్మగుణములు లావిర్భవింపకుండుట యుక్త మని భావము. ఈచెప్పుటచే విక్షేపకారణము లగు గుణ, తత్కార్యములు ప్రాప్తించినను వానియెడ ద్వేషాదులు లేకుండుట గుణాతీతునకు స్వప్రత్యక్ష విషయ మగు లింగమని సూచింపబడెను. ॥ ౨౨ ॥

సీ ల క ం ఠీ య ము:— ప్రథమప్రశ్నమునకు సమాధానమును చెప్పుచుండెను— ప్రకాశ, ప్రవృత్తి, మోహములు సత్త్వరజస్తమోగుణముల కార్యములు. సమాధివ్యుత్థానదశయందు పై గుణకార్యములు ప్రాప్తించినచో వానిని గుణాతీతుడు ద్వేషింపకుండును. ఇక సమాధిదశయందవి నివర్తించినచో వానిని

శాంకరభాష్యమ్:—

ద్విష్టి। ఏవం సత్త్వకార్యే ప్రకాశాత్మకే విషయే సతి తం న కాంక్షతి, రజఃకార్యే ప్రవృత్త్యాత్మకే సతి న కాంక్షతి తథా తమఃకార్యే మోహాత్మకే సతి తం న ద్వేష్టి, ఇతి ప్రకాశాదీనాం ... ద్వేష్టి సంప్రవృత్తాని। యథా చ సాత్త్వికాదిపురుషః సాత్త్వికాదికార్యాణ్యాత్మానం ప్రతి ప్రకాశ్య నివృత్తాని కాంక్షతి న తథా గుణాతీతో నివృత్తాని కాంక్షతీత్యర్థః। ఏతన్న పరప్రత్యక్షం లింగం, కిం తర్హి స్వాత్మప్రత్యక్షత్వా దాత్మవిషయ మేవైతల్లక్షణమ్। న హి స్వాత్మవిషయం ద్వేష మాకాంక్షాం వా పరః పశ్యతి॥ ॥౨౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

రజస్తమఃకార్యములను ద్వేషించును. ఎట్లు సాత్త్వికాదిపురుషుడు సాత్త్వికాదికార్యములు తమ స్వరూపము ప్రకాశింపజేసి నివృత్తమై యుండ వాటిని తిరిగి కోరునో అట్లు గుణాతీతుడు సాత్త్వికాదికార్యములు నివృత్తమై యుండ వాటిని కోరడు. ఈచిహ్నము పరునకు ప్రత్యక్షము కాదు. మరేమనిన గుణాతీతునకే ప్రత్యక్ష మగుటవలన నీలక్షణమాత్మ విషయమే యగుచున్నది. స్వాత్మవిషయమైన ద్వేషమును కాని, కోరికను కాని పరుడు తెలిసికొనజాలడుకదా! ॥౨౨॥

కోరకుండ నుండును. ఇట్టి నిత్యసమాధిస్థుడే బ్రహ్మవిద్వరిష్ఠుడనబడును. ఇట్టి గుణాతీతుని గూర్చియే శ్రీభాగవతమునందు— "దేహం చ నశ్వర మవస్థిత ముత్థితం వా సిద్ధో న పశ్యతి" గుణాతీతు డగు సిద్ధుడు దేహమును నశ్వరమని గాని, ఆసీనమైయున్నదని గాని, నిలువబడియున్నదని గాని తెలిసికొనకుండ సర్వదా బ్రహ్మానుసంధానముతోనే యుండును. అని చెప్పబడినది. ఈవిషయమై వాసిష్ఠమునందు యోగభూమిసప్తకము చెప్పబడెను— "జ్ఞానభూమి శ్శుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా। విచారణా ద్వితీయా తు తృతీయా తనుమానసా॥ సత్త్వాపత్తి శ్చతుర్థీ స్యా త్తతో௨సంసక్తినామికా। పదార్థభావనీ షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా॥" అని చెప్పబడెను. శమాదిముముక్షాంత మగు సాధనసంపత్తులు ప్రథమభూమికగా చెప్పబడెను. శ్రవణమననాఖ్య విచారము రెండవభూమిక. నిదిధ్యాసనము మూడవ భూమిక. ఈమూడును సాధనభూమిక లనబడును. బ్రహ్మసాక్షాత్కారరూపమైన సత్త్వాపత్తి నాల్గవ భూమిక. ఇది ఫలభూతము. ఈభూమికయందుజ్ఞానయోగి కృతార్థు డయ్యును జీవన్ముక్తిసుఖమును పూర్తిగననుభవింపకుండును. శిష్టము లగు మూడుభూమికలు జీవన్ముక్త్యవాంతరభేదములు. అందునను అయిదవభూమికయందుండు యోగి స్వయముగ గూర్చుండి, స్వయముగనే లేచుచుండును. ఆరవభూమికయందుండు యోగి పరప్రయత్నముచే నాసీను డగును. పరప్రయత్నముచేతనే యుత్థితు డగుచుండును. ఇక సప్తమభూమికయందుండు బ్రహ్మజ్ఞాని స్వప్రయత్నముచేగాని, పరప్రయత్నముచేగాని యాసీనుడును, ఉత్థితుడును గాకుండును. ఈసప్తమభూమికాసంస్థు డగు జ్ఞానయోగియే ఈ "ప్రకాశంచ" అనుశ్లోకమున నిర్దిష్టుడయ్యెను. ॥౨౨॥

గీ॥ ఉదాసీనవ దాసీనో గుణై ర్యో న విచాల్యతే ।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే ॥ ॥ ౨౩॥

పదవిభాగము:— ఉదాసీనవత్- ఆసీనః- గుణైః- యః- న- విచాల్యతే- గుణాః- వర్తన్తే- ఇతి- ఏవ- యః- అవతిష్ఠతి- న- ఇంగతే ॥ ॥౨౩॥

ప్రతిపదార్థము:— గుణాః=కార్యకరణ విషయాకారముగ పరిణతమైన సత్త్వరజస్తమో గుణములు; అన్యోన్యస్మిన్=(ఈపదమధ్యాహార్యము) పరస్పరమునందు; వర్తన్తే=ఉంటున్నవి; ఇత్యేవ= అనియే; యః=ఎవడు; అవతిష్ఠతి=ఉంటున్నాడో; నేంగతే=(స్వరూపావస్థనుండి) చలింపడో; యః=ఎవడు; (ఏసంన్యాసి) ఉదాసీనవత్=ఉదాసీనునివలె; ఆసీనః=ఉండునో; నవిచాల్యతే=చలింపజేయబడడో. ॥౨౩॥

శాంకరభాష్యమ్:—

అథేదానీం గుణాతీతః కిమాచార ఇతి ప్రశ్నస్య ప్రతివచన మాహ— ఉదాసీన వద్యథోదాసీనో న కస్యచి త్పక్షం భజతే తథాఽయం గుణాతీతత్వోపాయమార్గేఽవస్థిత ఆసీన ఆత్మ విద్గుణై ర్యః సంన్యాసీ న విచాల్యతే వివేకదర్శనావస్థాతః । తదేతత్స్ఫుటీకరోతి గుణాః

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇపుడు గుణాతీతు డెట్టి యాచరణ కలవాడు? అను అర్జున ప్రశ్నకు సమాధానమును చెప్పుచుండెను.

ఉదాసీను డెవని పక్షము నాశ్రయింపకుండును. అట్లే యీగుణాతీతత్వోపాయమార్గము నందున్న యాత్మవిత్తగు యే సంన్యాసి వివేకదర్శనావస్థ నుండి చలింపడో. ఈవిషయమునే

—। ౧౪ వ అధ్యాయము ౨౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ।—

మధుసూదనసరస్వతీయము:— పూర్వము గుణాతీతుని లక్షణమును జెప్పి, గుణాతీతుని యాచరణమును మూడు శ్లోకములచే జెప్పుచుండెను.— లోకమున ఇద్దరు వివాద పడుచున్న సమయమున నుదాసీను డగు వాడు వారిద్దరిపక్షములలో నేయొక పక్షమునను జేరక, వారియెడ రాగమునుగాని, ద్వేష మునుగాని జూపక నుండును. అట్లే బ్రహ్మవేత్తయగు గుణాతీతు డుదాసీనుడై, రాగద్వేషశూన్యుడై; స్వస్వరూపమునందే స్థితికలవాడై, సుఖదుఃఖాద్యాకారముగ పరిణతములైన గుణములచే స్వస్వరూపావ స్థితినుండి చలింపజేయబడడు. (దిగజార్చబడడు.) ఇక నేమనః- బ్రహ్మవేత్త "ఈగుణములు దేహేంద్రియ విషయాకారముగ పరిణమించినవై పరస్పరము నాధారముగ జేసికొని ప్రవర్తించుచున్నవి. సూర్యునివలె సర్వావభాసకుడ నగు నాకు యేభాస్యధర్మముతోడను సంబంధములేదు. స్వప్నమువలె మాయామయ మగు యీభాస్యప్రపంచము జడము. స్వయంజ్యోతిస్స్వ భావుడ నగు నేను పరమార్థసత్యుడను, నిర్వికారుడను, ద్వైతశూన్యుడను," అని నిశ్చయించుకొని స్వస్వరూపమునందే స్థితిగలవాడగును. మరియు నేవ్యాపారమును జేయకుండును. ఇట్టి యాచరణము కలవా డెవడో యాతడే గుణాతీతు డనబడును. ॥౨౩॥

శంకరానందీయము:— "గుణాతీతు డగు బ్రహ్మవేత్త- సత్త్వాదిగుణకార్యములు ప్రవర్తిం చినతరి ద్వేషింపకుండుననియు, వాని నివృత్తిని కోరకుండనుండు ననియు నంటివి. అట్లగుచో నీసర్వము

శాంకరభాష్యమ్:—

కార్యకరణవిషయాకారపరిణతా అన్యోన్యస్మిన్వర్తన్త ఇతి యోఽవతిష్ఠతి । ఛన్దోభంగభయాత్పరస్మైపదప్రయోగః । యోఽనుతిష్ఠతీతి వా పాఠాన్తరమ్ । నేంగతే న చలతి స్వరూపావస్థ ఏవ భవతీత్యర్థః ॥ ॥౨౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

స్పష్టము చేయుచుండెను. సత్త్వరజస్తమోగుణములు కార్యకరణవిషయాకారముగ పరిణతమై పరస్పరమునందు యుండి యున్నవి అని యెవడుండునో. "అవతిష్ఠతి" అని పరస్మైపద ప్రయోగము ఛందోభంగభయమువలన ప్రయోగించబడెను. లేక "యోఽనుతిష్ఠతి" అని పాఠాంతరమైన యిచట చూడనగును. అట్లగుచో ఛందోభంగము లేదు. (అర్థము సమానమే) స్వరూపావస్థుడై యుండునో. ॥౨౩॥

మిథ్యయని యాయాగుణవృత్తుల కనురూపముగ యథేష్టముగనే ప్రవర్తించునా" అను ప్రశ్నపై- యట్లు కాదు. కారణ మేమందువా? ప్రవృత్తిహేతు వగు వాసనారూప మగు యవిద్య- దాని కార్యముతోగూడ నిర్వికల్పకసమాధ్యగ్నినిర్దగ్ధ మగుటవలన, ఆబ్రహ్మవేత్తకు ప్రవృత్తియే సంభవింపదు. ఇకనాతడు స్వానందానుభూతితో తనయందే (బ్రహ్మమునందే) నిశ్చలుడై, యుండునుగాని యేవిధమైన వికృయను పొందకుండును. అని చెప్పుచుండెను.— వాదిప్రతివాదుల యుభయపక్షములలోను నేపక్షము నవలంబింపక, వారి యుభయుల వ్యాపారములను జూచుచు, తటస్థుడగు పురుషుడుదాసీను డని పిలువబడును. అట్లే విషయముల యందు ప్రవర్తింపజేయు ప్రకాశ, దయా, దాక్షిణ్య, సత్య, వినయ, రాగ, ద్వేష, లోభ, మోహాదిరూపము లగు సత్త్వ, రజ, స్తమోగుణవికారములను, అట్లే ప్రవర్త్యము లగు దేహేంద్రియాదులను, వాని వ్యాపారములను జూచుచు, (వానికి ద్రష్టయై) తాను స్వయముగా నుదాసీనుడువలె వానికి సాక్షిగా దూరమున (సంపర్కము లేకుండునట్లు) నున్నవాడై బ్రహ్మవేత్త సాత్త్వికములగు ప్రకాశాదిగుణములచేగాని, రాజసము లగు రాగాదిగుణములచేగాని, తామసము లగు మోహాదిగుణములచేగాని స్వీయబ్రహ్మనిష్ఠనుండి పరిచ్యుతుడుగా జేయబడడు. బాహ్యవాసనాబద్ధు డగు పామరుని వైగుణ, తత్కార్యములు చలింపచేసినట్లు బ్రహ్మనిష్ఠుని చలింపజేయజాలవని భావము.

అట్లే యగుచో నీబ్రహ్మవేత్త దేహయాత్రవిషయమై యెట్లు ప్రవర్తించు నను యాకాంక్షపై జెప్పుచుండెను.— "గుణా...నేంగతే" చిరకాలము నిత్యనిరంతరనిర్వికల్పసమాధినిష్ఠచే స్థిరమైన ప్రజ్ఞకల జ్ఞానసిద్ధుడైన బ్రహ్మవేత్త- "దేహేంద్రియాదిగుణములు ఒకే ఫలము ననుభవింపజేయు కర్మచే ఏకకాలమున ప్రేరేపింపబడినవై విషయములయందు ప్రవర్తించుచున్నవి. (భోజనాదిక్రియలను జేయుచున్నవి.) దేహేంద్రియాదులకు, తద్వ్యాపారములనుగూడ సాక్షినై ప్రత్యగాత్ముడ నగు నేను వాటియందు ప్రవర్తింపకుండ నిష్క్రియుడనై యుంటిని." అని తలచి బ్రహ్మాకారవృత్తిచే నెల్లప్పుడు బ్రహ్మస్వరూపముగనే యుండును. ఇంతియేగాని, తాను స్వయముగ గుణములవలనగాని; గుణకార్యములవలనగాని కొంచెమైనను చలింపకుండును. "నేను కర్తను, భోక్తను, నాకియ్యది భోగ్యము" అని కర్తృత్వభోక్తృత్వాధ్యాసను చేయకుండును. (ఇట్టి లక్షణములు కలవా డెవడో అతడే గుణాతీతు డని చెప్పబడునని యుత్తరగ్రంథముతో సంబంధము.)

గీ॥ సమదుఃఖసుఖ స్స్వస్థ స్సమలోష్టాశ్మకాంచనః ।
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః ॥ ॥౨౪॥

పదవిభాగము:— సమదుఃఖసుఖః– స్వస్థః– సమలోష్టాశ్మకాంచనః– తుల్యప్రియాప్రియః– ధీరః– తుల్యనిన్దాత్మసంస్తుతిః ॥ ॥౨౪॥

ప్రతిపదార్థము:— సమదుఃఖసుఖః=సమానమైన దుఃఖసుఖములు కలవాడు; స్వస్థః=ఆత్మయందు ప్రసన్నుడు; సమలోష్టాశ్మకాంచనః=సమానమైన లోష్టము, అశ్మ, కాంచనము కలవాడు; తుల్యప్రియాప్రియః=సమానమైన ప్రియాప్రియములు కలవాడు; ధీరః=ధీమంతుడు; తుల్యనిన్దాత్మసంస్తుతిః=సమానమైన నిందయు, ఆత్మస్తుతియు కలవాడు. ॥౨౪॥

శాంకరభాష్యమ్:—

కించ— సమదుఃఖసుఖః సమే దుఃఖసుఖే యస్య స సమదుఃఖసుఖః । స్వస్థః స్వ ఆత్మని స్థితః ప్రసన్నః । సమలోష్టాశ్మకాంచనో లోష్టం చాశ్మా చ కాంచనం చ సమాని యస్య స సమలోష్టాశ్మకాంచనః । తుల్యప్రియాప్రియః ప్రియం చాప్రియం చ ప్రియా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు:— ఏయతి సమానమైన దుఃఖసుఖములు కలవాడు, ఆత్మయందు ప్రసన్నుడు,

ఈ చెప్పుటచే- గుణప్రేరణచే దేహేంద్రియాదులకు విషయప్రవృత్తి యున్నను, ఔదాసీన్యము, విక్రియాశూన్యత్వము నీరెండును నీతడు గుణాతీతు డని తెలిసికొనుటలో లింగ మని సూచితమయ్యెను. మరియు గుణాతీతుని యాచారమును చెప్పుటచే "కిమాచారః" అను ప్రశ్నమునకు సమాధాన మీయబడెను. ॥౨౩॥

—• ౧౪వ అధ్యాయము ౨౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ద్వేషరాగశూన్యు డగుటచే సుఖదుఃఖములు అనాత్మధర్మము లగుటచేతను, అనృతము లగుటచేతను సమములుగనే కలవాడగునో "స్వస్థః" ద్వైతజ్ఞానశూన్యు డగుటచే తన (ఆత్మ) యందే యుండునో, సమలోష్టాశ్మకాంచనుడై (మట్టిముద్ద, రాయి, బంగారము వీనిలో నిది గ్రహింపదగినదనిగాని, విడువదగినదనిగాని భావము లేనివాడై) తుల్యములైన ప్రియాప్రియములు కలవాడై (సుఖసాధన మగుటచే నిష్టమగుదానినిగాని, దుఃఖసాధనమగుటచే ననిష్టమగుదానినిగాని హితాహితసాధనత్వజ్ఞానము లేమిఁజేసి యుపేక్షించినవాడై) ధీరుడై, తుల్యములైన దోషకీర్తన, గుణకీర్తనములు కలవాడై యెవడుండునో యట్టివాడు గుణాతీతు డని చెప్పబడును. ॥౨౪॥

శంకరానందీయము:— దేహేంద్రియాదికము స్వస్థముగా నున్నతరి యాబ్రహ్మవేత్తయగు గుణాతీతుని తన బ్రహ్మనిష్ఠనుండి గుణములచే చలింపజేయబడకుండు ననుకొందము. ఇక నాధ్యాత్మిక దుఃఖముగాని, యాధిభౌతికదుఃఖముగాని, నిందాద్యనర్థముగాని ప్రాప్తించినచో నట్టితరి గుణములచే నాత్మనిష్ఠనుండి పరిచ్యావితుడై ఖేదమోదములను తప్పక యనుభవింపడా? అను ఆశంకపై "అట్లుకాదు; కారణ మేమందువా! అట్టి గుణాతీతుడు "బాహ్యసుఖదుఃఖాదులకును, నిందాస్తుత్యాదులకును ఆనాత్మయే విషయముగును గాని, నిర్విశేషుడను, నిరాకారుడను, చిదేకరసస్వరూపు డను నగు నేను కాదు" అని తలచి నిశ్చల

శాంకరభాష్యమ్:—

ప్రియే తుల్యే సమే ప్రియాప్రియే యస్య సోఽయం తుల్యప్రియాప్రియః । ధీరో ధీమాన్ ।
తుల్యనిన్దాత్మసంస్తుతి ర్నిన్దా చాఽఽత్మసంస్తుతిశ్చ నిన్దాత్మసంస్తుతీ తుల్యే నిన్దాత్మసంస్తుతీ యస్య
యతేః స తుల్యనిన్దాత్మసంస్తుతిః ॥ ॥౨౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సమానమైన లోష్టము (మట్టిపుండ) అశ్మ (రాయి) కాంచనము కలవాడు, సమానమైన
ప్రియాప్రియములు కలవాడు, ధీమంతుడు, సమానమైన నిన్ద, ఆత్మస్తుతులు కలవాడో ॥౨౪॥

బుద్ధితో బాహ్యసుఖదుఃఖాద్యవస్థలయందుగూడ స్వాత్మనిష్ఠు డయియే యుండును. ఇంతియేగాని మూఢునివలె
ననాత్మయందు "నేను, నాది" అను బుద్ధ్యధ్యాసను జేయకుండును. అని రెండు శ్లోకములచే జెప్పుచుండెను.—
ఎవడు– "సమదుఃఖసుఖః" ఏయవస్థయందు శోభనములగు (హృష్టములగు) చిత్తవృత్తులు కల్గునో యది సుఖ
మనబడును. నేయవస్థయందు దుష్టము లగు చిత్తవృత్తులు కల్గునో యది దుఃఖమనబడును. అట్టి సుఖదుఃఖముల
యెడ సముడో; సుఖదుఃఖములయెడ సమచిత్తత్వ మన యిష్టానిష్టభావనారహితత్వము. ప్రాకృతజనులు వలె
నా సుఖదుఃఖనోత్త యెడ నేనను యధ్యాససంబంధము లేనందున యని యర్థము. కనుకనే "స్వస్థః" సర్వా
వస్థలయందును యొల్లప్పుడు తన (పరబ్రహ్మ) యందే యుండును గాన బ్రహ్మవేత్త యొకడే స్వస్థు డన
బడును. కనుకనే యట్టివాడు జన్మాదిదుఃఖములచే నభిభూతుడు గానేరడు, ఇక నీబ్రహ్మవేత్తకంటె
నితరు లగు ప్రాకృతులు అస్వస్థులై బహిర్ముఖు లగుదురు. అట్టివారు జన్మాదిదుఃఖములచేతను ఆధ్యాత్మి
కాదిదుఃఖములచేతను, అనాత్మధర్మము లగు యితరము లయిన ఆధిభౌతికములచేతను నభిభూతులగుచుండిరి.
విక్షేపకారణము లున్నను, బ్రహ్మాత్మస్థితినుండి యప్రచ్యుతత్వమే స్వస్థత్వము గాని, ధైర్యముతో ద్వంద్వా
ములను సహించుట గాదు. కనుకనే "తుల్య ప్రియా ప్రియః" ఇష్టానిష్టములయెడ సమభావము కలవాడై,
అని యర్థము. ఇట నొక సంశయము కల్గుచున్నది. అది యేమనవా; సుఖదుఃఖములయెడగాని, ఇష్టానిష్ట
ములయెడగాని విద్వాంసునకైనను (బ్రహ్మవేత్తకైనను) సమభావము కలుగనేరదు. ఏమందువా? అతి మధు
రము నతికటువు (కారము కలది) యగు రెండు ద్రవ్యములను వేర్వేరుగ భుజించువాడును, తీక్ష్ణాతపాఽనా
తపములలో నివసించువాడును విద్వాంసులైనను వారికి "ఇది యిష్టము, ఇయ్యది యనిష్టము." అను యను
భూతి కలుగుట దుర్వార మగుటచే నట్టి యనుభూతిచే విషమబుద్ధి తప్పక కల్గునందువా? సత్యమే, గ్రాహ్యము
అనేకము అగుటచే గ్రహణములుగూడ ననేకము అగును గాన సుఖదుఃఖములు గాని, ప్రియాప్రియములు గాని
ప్రాప్తింప విద్వాంసునకుగూడ విషమబుద్ధి కల్గియే తీరును. అట్లయ్యును కారణము లేనందున బ్రహ్మవేత్తను
విషమబుద్ధి కలుగనేరదు. అట్టి విషమబుద్ధికి కారణము విషమపదార్థముల సంయోగ మనవలయును. ఇట్టి విషమ
పదార్థసంయోగ ముండినపుడే యిష్టానిష్టత్వజ్ఞానము కల్గుచున్నది. అట్టి యిష్టానిష్టత్వజ్ఞాన మున్నపుడే విషమ
బుద్ధికల్గును గాని యిష్టానిష్టత్వజ్ఞానము లేనపుడు విషమబుద్ధి కలుగనేరదు. చిరకాలనిత్యనిరంతరసమాధ్యభ్యాస
బలముచే బ్రహ్మాకారత్వము నొందినదై బుద్ధివృత్తి సర్వదా బ్రహ్మమునందు నిశ్చలముగ నున్నపుడే విష
మము లగు విషయములతో బుద్ధికి సంయోగము సంభవింపకుండును. అట్టి స్థితియందే యిష్టానిష్టత్వజ్ఞానము
కలుగకుండును. అట్టి యిష్టానిష్టత్వజ్ఞానము లేనపుడే బ్రహ్మవేత్తకు విషమబుద్ధియు గలుగకుండును. కాన నట్టి
వానికి సుఖదుఃఖములయెడగాని, ప్రియాప్రియములయెడగాని సామ్యభావము కల్గుట యవిరుద్ధము. ఇట అతి
బలీయమగు విక్షేపకారణ మున్నచో నాసమయమున బుద్ధి బ్రహ్మాత్మభావముతో నుండుట యెట్లు పొసగు

గీ॥ మానాపమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే ॥ ॥౨౫॥

పదవిభాగము:— మానాపమానయోః- తుల్యః- తుల్యః- మిత్రారిపక్షయోః- సర్వారమ్భపరిత్యాగీ- గుణాతీతః- సః- ఉచ్యతే ॥ ॥౨౫॥

ప్రతిపదార్థము:— మానాపమానయోః=మానమునందు, అపమానమునందు; తుల్యః=వికారము లేనివాడు; మిత్రారిపక్షయోః=మిత్రపక్షమునందు, శత్రుపక్షమునందు; తుల్యః=సమానుడు; సర్వారంభపరిత్యాగీ=నిఖిలదుష్టాదుష్ట కర్మలను పరిత్యజించువాడు; యః=ఏసంన్యాసి; భవతి=అగుచున్నాడో; సః=ఆసంన్యాసి; గుణాతీతః=గుణాతీతుడని; ఉచ్యతే=చెప్పబడుచున్నాడు. ॥౨౫॥

---

నని శకింపవలదు. బుద్ధికి అట్టి బ్రహ్మాత్మభావస్థితి యభ్యాసాతిశయము వలననే ప్రాప్తించు నని చెప్పుచుంటిమి. బ్రహ్మాత్మభావమునకు ఔషధముగాని, మంత్రముగాని, లయయోగముగాని కారణములు గావు. అభ్యసింపకపోవుటవలననే సత్పురుషులకుగూడ బహిర్ముఖత్వము కల్గుచున్నది కాని వివేకము లేక కాదు. "అభ్యాసేన తు కౌంతేయ" అను గీతోక్తరీతిని శ్రద్ధాభక్తిపూర్వకముగ నగు సమాధ్యభ్యాసముచేతనే బాహ్యాలంబనశూన్యమై బ్రహ్మమునందు నిష్ఠ సిద్ధించుచున్నది. కాన నన్నిటిలోను అభ్యాసమే బలవత్కారణ మగుచున్నది. "అభ్యాసా త్పక్వవిజ్ఞానః కైవల్యం లభతే నరః" అను స్మృతియు నీవిషయమునే ధృఢపరచుచున్నది. ప్రియాప్రియములయెడ సమభావమును స్పష్టపరచుచుండెను.— "సమలోష్టాశ్మకాంచనః" సమము లగు (ప్రీత్యప్రీతులలో నవిషయము లగు) మృత్పిండము, రాయి, సువర్ణము కలవాడు. లేక "సమాని ప్రత్యగ్దృష్ట్యా సమభావం గతాని బ్రహ్మాత్మనా దృష్టాని లోష్టాశ్మకాంచనాని యస్య సః సమలోష్టాశ్మకాంచనః" ప్రత్యగ్దృష్టిచే సమభావమును పొందింపబడిన లోష్టాశ్మకాంచనములు కలవాడు. అనగా అంతటను బ్రహ్మదృష్టి కలవా డని యర్థము: విద్వాంసునకు (బ్రహ్మజ్ఞానికి) సుఖదుఃఖప్రియాప్రియము లన్నిటియందును సమదృష్టి కల్గుటకు కారణ మేమందువా? "ధీరః- ఆభాసవాసనయా బహిర్ముఖాయమానాం ధియం రాతి నిగృహ్ణాతి స్వాకారేణైవ స్థాపయతీతి ధీరః" అవిద్యకాభాసవాసనచే బహిర్ముఖమైన బుద్ధిని నిగ్రహించు (బ్రహ్మాకారముగ స్థాపించు) వాడు ధీరు డనబడును. అనగా స్వబ్రహ్మనిష్ఠాఽవ్యభిచరితబుద్ధివృత్తి కలవాడని యర్థము. కనుకనే "తుల్యనిందాత్మసంస్తుతిః" తుల్యములైన (అనాత్మగోచరములైన) దూషణము, దేహ గుణాదులయొక్క స్తుతియు కలవాడు. అనాత్మ విషయము లగు నిందాస్తుతులలో నవిషయ మగు స్వస్వరూపము కలవా డని యర్థము. ఇట్టి లక్షణములు కలవాడు గుణాతీతు డని చెప్పబడును. సుఖ, దుఃఖ, ప్రియా, ప్రియములయెడ సామ్యభావ ముండుట గుణాతీతు డగు జీవన్ముక్తు డని తెలిసికొనుటలో పరప్రత్యక్షము లగు లింగములు సూచింపబడెను. ॥౨౪॥

—• ౧౪ వ అధ్యాయము ౨౫ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "మానాపమానయో స్తుల్యః" ఆదరాపరపర్యాయ మగు సత్కారము మాన మనబడును. అనాదరాపరపర్యాయ మగు తిరస్కారము అపమాన మనబడును. ఇట్టి మానాపమానములయెడ సమభావముకలవాడై (హర్షవిషాదశూన్యుడై) (నిందాస్తుతులు శబ్దరూపము లనియు, మానాపమానములు మనఃకాయవ్యాపారము లనియు భేదము గ్రహింప నగును). "తుల్యో మిత్రా

శాంకరభాష్యమ్:—

కించ— మానాపమానయో స్తుల్యః సమో నిర్వికారః । తుల్యో మిత్రారిపక్షయోః, యద్యప్యుదాసీనా భవన్తి కేచి త్స్వాభిప్రాయేణ తథాఽపి పరాభిప్రాయేణ మిత్రారిపక్షయో రివ భవన్తీతి తుల్యో మిత్రారిపక్షయో రిత్యాహ సర్వారమ్భపరిత్యాగీ దృష్టాదృష్టా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మానాపమానములయందు వికారములేనట్టిన్ని, మిత్రపక్షమునందు, శత్రుపక్షము నందు సమానమైనట్టిన్ని, విచారింప కొందరు స్వాభిప్రాయముచే నుదాసీను లగుదురు. అయినను పరాభిప్రాయముచే మిత్రారిపక్షములయందువలె నుండుటచే "మిత్రారిపక్షయోః" రిపక్షయోః" మిత్రపక్షమునవలె శత్రుపక్షమునకుగూడ ద్వేషములేనివాడై [illegible] వానియొక్క అనుగ్రహనిగ్రహశూన్యుడై, "సర్వారంభపరిత్యాగీ" దృష్టాదృష్టఫలార్థములగు కర్మలను పరిత్యజించినవాడై, (ఉదాసీనవ దాసీనః" అనురీతి నాదరించువాడై యెవడుండునో అట్టివాడు "గుణాతీత స్స ఉచ్యతే" గుణాతీతు డని చెప్పబడును. నిరుక్త మగు సర్వజాతము [illegible] ప్రయత్నసాధ్య మగు విద్యయం దధికారిచే సాధనముగా ననుష్ఠింపదగినదిగా జెప్పబడెను. [illegible] నంతరము జీవన్ముక్తుడగు గుణాతీతునకు పూర్వోక్త మగు సర్వజాతము అయత్నసిద్ధ మగు లక్షణముగా నుండు నని యర్థము. ॥౨౫॥

శంకరానందీయము:— "ఇతడు గుణాతీతుడు" అని గుణాతీతత్వజ్ఞానము [illegible] రముగ "కిమాచారః" అను ప్రశ్నమునకు సమాధానమును జెప్పుచు జీవన్ముక్తుని లక్షణము నుపసంహ రించుచున్నాడు:— "మానా...ఉచ్యతే" ఉపచారములచే బహూకరించుట మాన మనబడును. అప చారములచే అపూకరించుట యవమాన మనబడును. ఆరెండిటియొక్క ముఖవికారము, [illegible] సమచిత్తము కలవా డగుట జీవన్ముక్తుని లక్షణము. బ్రహ్మవేత్త యగు యతి సర్వము బ్రహ్మముగనే జూచుచుండును గాన వానికి ప్రియాప్రియ, మిత్రామిత్రాదిభేదదర్శనమే సంభవింపదు. అట్టివాడు దేనిని యిష్టముగుదానివలె భుజించునో యది యిష్టమైన దనియు. దేనిని యనిష్టముగుదానివలె నుపేక్షించునో యది యనిష్టమైన దనియు, ఇట్లే యెవడు బ్రహ్మవేత్త చర్య నభినందించునో వాడు మిత్రపక్ష మనియు, నెవడు బ్రహ్మవేత్తచర్య నభినందింపడో వాడు శత్రుపక్ష మనియు లోకదృష్టికి భాసించును. లోకదృష్టికి భాసించు నిట్టి ప్రియాప్రియములయెడను, మిత్రారిపక్షములయెడను సమదర్శనముకలవాడు జీవన్ముక్తు డని తెలిసికొనదగు నని పరప్రత్యక్ష మగు జీవన్ముక్తలక్షణము చెప్పబడెను. "సర్వారంభపరిత్యాగీ" నాకీ ఫలము కలుగవలె" నను ఫలకామనతో నారంభింపబడునవి గాన దృష్టాఽదృష్టఫలవిషయములు, శ్రౌత ములు, స్మార్తములు, ఉపాసనారూపములు మరియు శాస్త్రమోచితములు నగునవి. [illegible] లౌకికములు నగు సర్వకర్మలు సర్వారంభపదముచే గ్రహీతము లగును. గుణాతీతుడు బ్రహ్మభావాపత్తి కలవా డగుట నవాప్తసకలకాము డగును. అట్లగుట నిక సాధింపదగిన దేదియు లేనందున నట్టి సర్వారంభము లను పరిత్యజించు స్వభావముకలవా డగును. బ్రహ్మభావాపన్నుడు, ఆప్తకాముడు, శ్రోత్రియుడు. [illegible] మగు బ్రహ్మవేత్తను కర్మచే సాధింపదగు దేదియు నుండదు. అట్టి సాధ్యమునందు యుక్తుడు గా.

శాంకరభాష్యమ్.—

ర్థాని కర్మాణ్యారభ్యన్త ఇత్యారమ్భాః సర్వా నారమ్భా న్పరిత్యక్తుం శీల మస్యేతి సర్వారమ్భ పరిత్యాగీ దేహధారణమాత్రనిమిత్తవ్యతిరేకేణ సర్వకర్మపరిత్యాగీత్యర్థః । గుణాతీతః స ఉచ్యతే । ఉదాసీనవదిత్యాది గుణాతీతః స ఉచ్యత ఇత్యేత దన్త ముక్తం యావ ద్యత్నసాధ్యం తావ త్సంన్యాసినాఽనుష్ఠేయం గుణాతీత్వసాధనం ముముక్షోః స్థిరీభూతం తు స్వసంవేద్యం సద్గుణాతీతస్య యతే ర్లక్షణం భవతీతి ॥ ॥౨౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అని చెప్పెను. దృష్టాదృష్టకర్మ లారంభము లనిపించుకొనును. అట్టి సర్వకర్మలను పరిత్యజించి నట్టిన్ని యతి గుణాతీతు డని చెప్పబడును. "ఉదాసీనవత్" అనునది మొదలుకొని 'గుణాతీత స్స ఉచ్యతే" అనునంతవరకు యత్నసాధ్య మెంతవరకు చెప్పబడెనో గుణాతీతత్వసాధన మైన యదంతయు సంన్యాసి యనుష్ఠింపదగినది, ముముక్షువునకు స్వసంవేద్యము స్థిరీభూత భూతమైయుండ గుణాతీతునకు లక్షణ మగును. ॥౨౫॥

కర్మను జేయుట! కాన కర్మకర్తృత్వతగూడ సంభవింపదు. కాన నట్టి బ్రహ్మవేత్తకు సర్వారంభపరిత్యాగము యుక్తమే యగును. ఇట నొక ప్రశ్న కల్గుచున్నది ఏమన: సార్వభౌమానందము మొదలు బ్రహ్మానందము వరకుగల యానందవిశేషములు పదులకొలది కర్మోపాసనాసాధ్యములు కలవు. అవిగూడ విద్వాంసునిచే కోర దగినవై యున్నవి. ఇట్లుండ బ్రహ్మవేత్త సర్వారంభపరిత్యాగి యగుట యెట్లు పొసగు నందువా? అట్లు కాదు. నిత్యము, నిరతిశయము, అనపాయియు నగు బ్రహ్మానందరసానుభూతి కల బ్రహ్మవేత్త యట్టి పూర్వోక్తానందవిశేషములను కోరుటయే సంభవింపదు. ఏమన: అట్టి ఆనందవిశేషములు క్రియాజన్యము లగుటచే ననిత్యములు, అల్పములు, అసదూపములు కాన విద్వదాకాంక్ష్యములు కానేరవు. "ఏతస్యైవా నందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవంతి" అను న్యాయముచే నీయానందము లన్నియు బ్రహ్మానందాంత ర్భూతము లగుట బ్రహ్మానందావాప్తిచే "శతే పంచాశత్" (నూటిలో నేబది యంతర్భవించుట) అను న్యాయ మున నీయానందవిశేషయు లన్నియు నంతర్భవించును గాన నట్టి బ్రహ్మానందానుభూతి కల్గిన సర్వాత్మభావా పన్నుడగు మహాత్మునకు ప్రాప్తవ్యశేషమేమి నుండదు. సార్వాత్మ్యభావము. ప్రాప్తవ్యశేషము నొకే వ్యక్తికి సంభవింపనేరవు. కాన బ్రహ్మవేత్తకు సర్వకర్మసంన్యాసము యుక్తమే యని సిద్ధించినది. (ఈ చెప్పు టచే— "కి మాచారః" అను ప్రశ్నమునకు "పూర్ణవృత్తితో నంతట నుదాసీనభావమును విడచి వేరొక యాచరణ మేమియు లేదని సమాధాన మీయబడెను. నిరహంకర్తృత్వము బ్రహ్మవేత్త జీవన్ముక్తు డనుటలో పరప్రత్యక్ష మగు లింగ మని సూచితమయ్యెను). "గుణాతీత స్స ఉచ్యతే" ఇట్టి సమసుఖదుఃఖిత్యాది లక్షణలక్షితుడు గుణాతీతుడుగా జెప్పబడును. "గుణేషు దేహేంద్రియాదిషు. ప్రతిబింబ, ప్రతిచ్ఛాయా, పరదేహేష్వివ ఆత్మభావ ముత్సృజ్య గుణకార్యవిలక్షణే తద్ధర్మకర్మాద్యస్పృష్టే స్వస్వరూపే పరే బ్రహ్మణి తదాత్మనా స్థిత్వా ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహం చ యోఽతిక్రామతి స గుణాతీత ఇ త్యుచ్యతే" (ప్రతిబింబము, ప్రతిచ్ఛాయ, పరదేహము వీనియందు ఆత్మభావమును విడిచినట్లే దేహేంద్రి యాదులయందు ఆత్మభావమును వీడి గుణకార్యవిలక్షణము, తద్ధర్మకర్మాద్యస్పృష్టము, స్వస్వరూపము నగు పరబ్రహ్మమునందు, తత్స్వరూపముతో నుండి, ప్రకాశమును, ప్రవృత్తిని, మోహమును యెవ డతిక్రమి

గీ॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ ॥౨౬॥

పదవిభాగము:— మాం- చ- యః- అవ్యభిచారేణ- భక్తియోగేన- సేవతే- సః- గుణాన్- సమతీత్య- ఏతాన్- బ్రహ్మభూయాయ- కల్పతే ॥ ॥౨౬॥

ప్రతిపదార్థము:— యః=ఏయతి, లేక కర్మిగాని; అవ్యభిచారేణ=ఎన్నడు వ్యభిచరింపని; భక్తియోగేన=భక్తియనెడి యోగముచే; మాం=నారాయణుడనగు నన్ను; సేవతే=సేవించుచున్నాడో; సః=వాడు; ఏతాన్=ఈ; గుణాన్=సత్త్వరజస్తమోగుణములను; అతీత్య=అతిక్రమించి; బ్రహ్మభూయాయ=మోక్షముకొరకు; కల్పతే=సమర్థుడగుచున్నాడు. ॥౨౬॥

శాంకరభాష్యమ్:—

అథునా కథం చ త్రీన్గుణా నతివర్తత ఇతి ప్రశ్నస్య ప్రతివచన మాహ— మాం చేశ్వరం నారాయణం సర్వభూతహృదయాశ్రితం యో యతిః కర్మీ వాఽవ్యభిచారేణ న కదాచి ద్యో వ్యభిచరతి భక్తియోగేన భజనం భక్తిః సైవ యోగ స్తేన భక్తియోగేన సేవతే స

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

ఇపుడు యెటుల మూడు గుణముల నతిక్రమించు నను యర్జునప్రశ్నకు సమాధానమును చెప్పుచుండెను.

ఏయతిగాని, కర్మిగాని ఎన్నడును వ్యభిచరింపని భక్తి యనెడి యోగముచే నీశ్వరుడు, నారాయణుడు సర్వభూతహృదయాశ్రితుడు అగు పరమేశ్వరుని సేవించునో వాడు క్రార్య

మించునో వాడు గుణాతీతు డని పిలువబడును.) గుణములకును, గుణకార్యములకును అవిషయు డగుటను బట్టి జీవన్ముక్తు డగు బ్రహ్మవేత్త తల్లక్షణజ్ఞులచే గుణాతీతుడుగ జెప్పబడు నని యర్థము. ॥౨౫॥

—• ౧౪ వ అధ్యాయము ౨౬ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:—ప్రస్తుతము బ్రహ్మవేత్త యీగుణముల నెట్లు అతిక్రమించు నను తృతీయప్రశ్నమునకు సమాధానమును చెప్పుచుండెను.— "మాం చ" సర్వభూతాంతర్యామిని, మాయావశమున క్షేత్రజ్ఞత్వము నొందినవాడను, పరమానందఘనుడను, భగవంతుడను నగు నన్ను (వాసుదేవుని) పరమప్రేమరూపమగు ద్వాదశాధ్యాయోక్తమగు భక్తియోగముచే సేవకుడు సేవించునో (ఎల్లప్పుడు చింతించునో) అట్టి నాభక్తుడు ఈప్రాగుక్తములగు గుణముల నతిక్రమించి (అద్వైతజ్ఞానముచే బాధించి) మోక్షమునకై సమర్థు డగును. (ఎల్లప్పుడు భగవంతుని చింతించుటయే గుణాతీతత్వమున కుపాయ మని యర్థము. ॥౨౬॥

శంకరానందీయము:— ఈమూడు గుణముల నెట్లు అతిక్రమించును? అను మూడవప్రశ్నమునకు సమాధానము నీశ్లోకమున జెప్పుచుండెను.— ఏబ్రహ్మవేత్త యగు యతి తీవ్రమోక్షేచ్ఛచే వాసనాకృత మగు సర్వబాహ్యప్రపంచమును పరిత్యజించి, యత్యంతవైరాగ్యముచే తద్బుద్ధిత్వాదిసాధనసంపత్తితో గూడినవాడై ప్రత్యగభిన్నుడను, చిదాభాసుడను, నిరాకారుడను, అఖండచిదేకరసుడను, పరిపూర్ణుడను,

శాంకరభాష్యమ్:—

గుణాన్ సమతీత్యైతాన్ యథోక్తాన్ బ్రహ్మభూయాయ భవనం భూయో బ్రహ్మభూయాయ బ్రహ్మభవనాయ మోక్షాయ కల్పతే సమర్థో భవతీత్యర్థః ॥ ॥౨౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కరణవిషయాకారముగ పరిణతమైన సత్త్వరజస్తమోగుణముల నతిక్రమించి మోక్షముకొరకు సమర్థుడగుచున్నాడు. ॥౨౬॥

పరబ్రహ్మస్వరూపుడను అగు నన్ను (వాసుదేవుని) "భక్తియోగమున" విషయాఽనుల్లేఖి యగు చిత్తము ధ్యేయాకారముగ నఖండాకారముగ పరిణమించుట (అఖండాకారవృత్తి) భక్తి యనబడును. "మత్కథాశ్రుతిమాత్రేణ మయి సర్వగుహాశయే । మనోగతి రవిచ్ఛిన్నా యథా గంగాంభసోఽంబుధౌ ॥ అహైతుక్యవ్యవహితా యా భక్తిః పురుషోత్తమే । లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతమ్॥" అను శ్రుత్యుక్త మగు భక్తి యనెడు యోగము కైవల్యసిద్ధికి పరమోపాయ మగును. అట్టి భక్తి ప్రత్యయాంతరములచే వ్యవహిత మగునో నది వ్యభిచారి యగును. ఎపుడు అట్టి వ్యభిచారి కాని భక్తి యోగముచే (నిత్యనిరంతర సమాధిచే) నెవడు సేవించునో (విషయగ్రహణవిముఖము, నిర్మలము, నిశ్చలతైలధారవోలె అవిచ్ఛిన్నము నగు వృత్తి వ్యుత్థాన, అవ్యుత్థాన దశలయందు లోపల వెలుపలగూడ పరిపూర్ణము, సర్వోపాధివినిర్ముక్తము, నిష్కలము, నిష్క్రియము, శాంతము, అనంతము, కనుకనే గగనోపమము, ఆనందఘనము నగు "మాం" (నన్ను) పరబ్రహ్మమును "ఈసర్వము నేను అంతయు బ్రహ్మస్వరూపమే" అని తనను ఈవిశ్వమును బ్రహ్మాకారముగనే జూచుచు సర్వదా అనుసంధానము జేయునో అని యర్థము.) ఈవిధముగ చిరకాలనిత్యనిరంతరబ్రహ్మనిష్ఠయందే ప్రతిష్ఠితుడైన ఆయతి సదాకారాకారితాంతఃకరణ కలవాడగుటచే నెల్లపుడు సర్వమును బ్రహ్మనుగనే జూచువాడై, స్వయముగ నీపూర్వోక్తము లగు సత్త్వాదిగుణములను, వాని కార్య మగు ప్రపంచముతో గూడ నతిక్రమించి, ప్రకృతిని; ప్రకృతికార్య మగు విశ్వము నంతను అధిష్ఠాన మగు బ్రహ్మమునందు సన్మాత్రముగ ప్రవిలాపన మొనరించి, యీవిధముగ గుణాత్యయము నొనరించి, (గుణాత్యయమనః— ఆభాసగ ప్రతీయమానములు, ఆరోపితములు నగు గుణ. తత్కార్యములను అధిష్ఠానయాథాత్మ్యజ్ఞానముచే నధిష్ఠానమాత్రముగ నవగహింపజేసెడి చిదాకారవృత్తిచే నగు "నేను, ఇది, అది" అను అగ్రహామే ( తెలిసికొనకుండుటే) గుణాత్యయ మనబడును.) అట్టి గుణాత్యయమును జేసి, బ్రహ్మీభూతమైన సర్వప్రపంచము కలవాడైన బ్రహ్మవిత్తముడు "బ్రహ్మభూయాయ కల్పతే" జీవించియుండగనే బ్రహ్మాత్మనా యుండుటకై సమర్థు డగును. "మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే" అను న్యాయముచే దనయందును, అంతటను బ్రహ్మమాత్రత్వదర్శనరూపము, భగవత్ప్రతిపత్తిరూపము నగు బ్రహ్మనిష్ఠయం దెవడు ప్రతిష్ఠితుడగునో అట్టివాడే గుణ, తత్కార్య, తద్వ్యవహారరూప మగు మాయను, అతిక్రమించి విదేహకైవల్యసుఖము నొందునని భావము. (ఈ చెప్పుటచే "ఇది, నేను, సర్వము బ్రహ్మమే" అను పూర్ణవృత్తితో నెల్లపుడు నంతటను ప్రత్యయాంతరానంతరిత మగు బ్రహ్మదర్శనమే సత్త్వాదిగుణములను, వాని కార్యములను అతిక్రమించుట కుపాయమని సూచితమయ్యెను.) ॥౨౬॥

గీ॥ బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృత స్యావ్యయస్య చ ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాన్తికస్య చ ॥ ॥౨౭॥

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
గుణత్రియవిభాగయోగో నామ
చతుర్దశోధ్యాయః ॥౧౪॥

—

పదవిభాగము:— బ్రహ్మణః- హి- ప్రతిష్ఠా- అహం- అమృతస్య- అవ్యయస్య- చ- శాశ్వతస్య- చ- ధర్మస్య- సుఖస్య- ఏకాన్తికస్య- చ ॥ ॥౨౭॥

ప్రతిపదార్థము:— హి=ఏ కారణమువలన; అహం=నేను; అమృతస్య=నాశరహితమైనట్టిన్ని; అవ్యయస్యచ=వికారి కానట్టిన్ని; శాశ్వతస్యచ= నిత్యమైనట్టిన్ని; ధర్మస్య=జ్ఞానయోగ ధర్మ ప్రాప్యమైనట్టిన్ని ఏకాంతికస్య=అవ్యభిచారియైన; సుఖస్య=అనందరూపమైనట్టి; బ్రహ్మణః=పరమాత్మకు, ప్రతిష్ఠా=ప్రత్యగాత్మ స్వరూపుడను. ॥౨౭॥

శాంకరభాష్యమ్:—

కుత ఏత దిత్యుచ్యతే-— బ్రహ్మణః పరమాత్మనో హి యస్మా త్ప్రతిష్ఠాఽహం ప్రతితిష్ఠ త్యస్మి న్నితి ప్రతిష్ఠాఽహం ప్రత్యగాత్మా । కీదృశస్య బ్రహ్మణోఽమృత స్యావినాశినోఽవ్యయ స్యావికారిణః శాశ్వతస్య చ నిత్యస్య ధర్మస్య జ్ఞానయోగధర్మప్రాప్యస్య సుఖ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విద్వాంసుడు బ్రహ్మమే యగు ననుటయందు హేతువును చెప్పుచుండెను:—

నాశరహితము, వికారరహితము, నిత్యము, జ్ఞానయోగ మనెడి ధర్మముచే ప్రాప్యము, (పొందదగినది) ఆనందరూపము, అవ్యభిచారి యగు పరమాత్మకు నేనే యాశ్రయము. అమృతాదిస్వరూపమైన బ్రహ్మమునకు (పరమాత్మకు) పత్యగాత్మ సమ్యక్ జ్ఞానముచే పరమాత్మ

—• ౧౪వ అధ్యాయము ౨౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సర్వదా భగవచ్చింతనమే గుణాతీతత్వమును జేగూర్చుటలో నుపాయ మని చెప్పుటలో హేతువు నీశ్లోకమున జెప్పుచున్నాడు:— "బ్రహ్మణో హి ప్రతిష్ఠాహం" తత్పదవాచ్యము, జగదుత్పత్తి, స్థితి, లయహేతువు నగు సోపాధికబ్రహ్మమునకు తత్పదలక్ష్యము, పారమార్థికము, నిర్వికల్పకము, సచ్చిదానందస్వరూపము, నిరుపాధిక పరబ్రహ్మము నగు (నేను) ప్రతిష్ఠ అయినవాడను. (ఆధారమును.) కల్పితరూపరహితుడనై నిరుపాధికుడ నగు నన్ను ఎవడు సేవించునో

శాంకరభాష్యమ్:—

స్యాఽఽనన్దరూపస్యైకాన్తికస్యావ్యభిచారిణః । అమృతాదిస్వభావస్య పరమాత్మనః ప్రత్యగాత్మా ప్రతిష్ఠా సమ్యగ్జ్ఞానేన పరమాత్మతయా నిశ్చీయతే । తదేత ద్బ్రహ్మభూయాయ కల్పత ఇత్యుక్తమ్ । యయా చేశ్వరశక్త్యా భక్తానుగ్రహాదిప్రయోజనాయ బ్రహ్మ ప్రతిష్ఠతే

శాంకరభాష్యతత్త్వబోధిని:—

రూపమున నిశ్చయింపబడును. కాన మోక్షముకొరకు సమర్థుడగు నని చెప్పబడెను. ఈశ్వర శక్తిచే భక్తానుగ్రహాదిప్రయోజనమునకై యెట్లు బ్రహ్మ ప్రవర్తించునో శక్తిశక్తిమంతుల కనన్యత్వమువలన ఆశక్తి నాస్వరూపమైన బ్రహ్మమే అని యాశయము.

---

వాడు బ్రహ్మముగా నగుటకు సమర్థుడగు నని చెప్పుట యుక్తమే. ఆబ్రహ్మము నెట్టిదను ప్రశ్నపై నీవిశేషణముల జూపుచుండెను— ఆబ్రహ్మము "అమృతస్య" వినాశరహితము. మరియు "అవ్యయస్య" విపరిణామరహితము. "శాశ్వతస్య" అపక్షయరహితము. "ధర్మస్య" జ్ఞాననిష్ఠారూప మగు ధర్మముచే పొందదగినది. "సుఖస్యైకాంతికస్య చ" సర్వదేశ, కాలములయందుండు (అవ్యభిచారి యగు) సుఖరూప మైనది. ఇట్టి బ్రహ్మమునకు నేను వాస్తవరూపమును గాన నాభక్తుడు సంసారముక్తుడగు నని భావము. ఈవిషయమే బ్రహ్మ శ్రీకృష్ణభగవానునితో నిట్లు విన్నవించెను— "ఏక స్త్వ మాత్మా పురుషః పురాణః సత్యః స్వయంజ్యోతి రనంత ఆద్యః । నిత్యోఽక్షరోఽజస్రసుఖో నిరంజనః పూర్ణోఽద్వయో ముక్త ఉపాధితోఽమృతః॥" ఇట "నీవు సర్వోపాధిశూన్యుడవగు పరబ్రహ్మము" అని శ్రీకృష్ణుని చతుర్ముఖ బ్రహ్మ స్తుతించెను. శుకయోగీంద్రునిచేగూడ స్తుతిరూపముగగాక వాస్తవకథన మిట్లు చేయబడెను- "సర్వేషా మేవ వస్తూనాం భావార్థో భవతి స్థితః । తస్యాపి భగవాన్ కృష్ణః కిమతద్వస్తు రూప్యతాం ॥" (సర్వ వస్తువులకు భావార్థమైన సత్తారూపమైన పరమార్థము కలదు. కారణసత్తాతిరిక్తముగ కార్యసత్తయే యుండదు గాన సోపాధికబ్రహ్మము కార్యాకారముగ నున్నసమయమున సత్తారూప మగు పరమార్థము బ్రహ్మము నందు తెలియు. సోపాధిక మగునది నిరుపాధికమునందు కల్పింపబడునుగాన అట్టి కారణ మగు సోపాధిక బ్రహ్మమునకు భావార్థము (సత్తారూపార్థము) శ్రీకృష్ణపరమాత్మయే యగును. కారణమేమనుమనా: కల్పిత మగునది యధిష్ఠానానతిరిక్తము. శ్రీకృష్ణపరమాత్మ సర్వకల్పనాధిష్ఠాన మగుటచే పరమార్థసత్యనిరుపాధి స్వరూపుడు. కాన శ్రీకృష్ణమాత్మకంటె వేరే పారమార్థికవస్తువు లేదని యర్థము.) ఈవిషయమే "బ్రహ్మణో హి ప్రతిష్ఠాహం" అని యిటగూడ చెప్పబడెను.

లేక, నీభక్తునకు త్వద్భావాపత్తి కల్గుగాక, ఇంతియేకాని యాతనికి బ్రహ్మభావ మెట్లు కల్గును? బ్రహ్మకంటె నీవు వేరుకదా! అను ఆశంకపై జెప్పుచున్నాడు:— "బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహం" పరమాత్మకు ప్రతిష్ఠను (పర్యాప్తిభూతుడను) నేనే. ఇంతియేగాని నాకంటె వేరుగ బ్రహ్మ లేదని యర్థము. అట్లే "అమృతస్య అవ్యయస్య చ ప్రతిష్ఠాఽహమేవ" సర్వథా అనుచ్ఛేద్య మగు మోక్షమునకు ప్రతిష్ఠను (పర్యాప్తిభూతుడను) నేనే. అనగా నాయందే మోక్షము పర్యవసితము. మత్ప్రాప్తియే మోక్ష మని యర్థము. అట్లే "శాశ్వతస్య ధర్మస్య ప్రతిష్ఠాఽహమేవ" నిత్యమోక్షఫలక మగు జ్ఞాననిష్ఠారూపధర్మమునకు ప్రతిష్ఠను (పర్యాప్తిభూతుడను) నేనే. జ్ఞాననిష్ఠారూప మగు ధర్మము నాయందే పర్యవసితము. ఆధర్మముచే నాకంటె వేరగు పొందదగునది లేదని యర్థము. అట్లే "ఐకాంతికస్య సుఖస్య అహమేవ ప్రతిష్ఠా" అవ్యభిచారి

శాంకరభాష్యమ్:—

ప్రవర్తతే సా శక్తిః బ్రహ్మైవాహం, శక్తిశక్తిమతో రనన్యత్వా దిత్యభిప్రాయః । అథవా బ్రహ్మశబ్దవాచ్యత్వాత్ సవికల్పకం బ్రహ్మ తస్య బ్రహ్మణో నిర్వికల్పకోఽహ మేవ నాన్యః ప్రతిష్ఠాఽఽశ్రయః । కింవిశిష్టస్యామృతస్యామరణధర్మక స్యావ్యయస్య వ్యయరహితస్య । కించ శాశ్వతస్య చ నిత్యస్య ధర్మస్య జ్ఞాననిష్ఠాలక్షణస్య సుఖస్య తజ్జనిత స్యైకాన్తిక స్యైకాన్తనియతస్య చ ప్రతిష్ఠాఽహ మితి వర్తతే ॥ ॥ ౨౭ ॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య గోవిందభగవత్పూజ్య
పాదశిష్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ
శ్రీభగవద్గీతాభాష్యే గుణత్రయ
విభాగయోగో నామ
చతుర్దశోఽధ్యాయః ॥ ౧౪ ॥
హరిః ఓమ్ తత్సత్ ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లేక బ్రహ్మశబ్దవాచ్య మగుటవలన "బ్రహ్మ" శబ్దముచే సవికల్పబ్రహ్మమే చెప్పబడును. అట్టి సవికల్పబ్రహ్మమునకు నేనే యాశ్రయము. సవికల్పబ్రహ్మ మెట్టిదనిన? మరణధర్మము లేనిది. వ్యయరహితము. మరియు నిత్యము, జ్ఞాననిష్ఠాలక్షణము; ఆనందరూపము, ఏకాంత నియతము. అట్టి సవికల్పబ్రహ్మమునకు నేను ప్రతిష్ఠాస్వరూపుడను (ప్రత్యగాత్మ) అయి యుంటిని. ॥ ౨౭ ॥

ఇట్లు మూలమేల వ్యాఖ్యకలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపము నగు మహాభారత
మునం దంతర్గతమైన భీష్మపర్వమునందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యా
రూపమును, యోగశాస్త్రము నగు భగవద్గీతలయందున్న శ్రీకృష్ణార్జున
సంవాదమునందు గల గుణత్రయవిభాగయోగ మను పేరి చతుర్దశా
ధ్యాయమునకు గౌతమసగోత్రుడగు "తర్కరత్న, న్యాయవేదాంత
విద్యాప్రవీణ, దర్శనాలంకార" బిరుదు అప్పన్నశాస్త్రిచే రచింప
బడిన, ఆనందగిరియ వ్యాఖ్యానుసృత శ్రీభగవద్గీతాశాంకర
భాష్య తత్త్వ బోధిని సమాప్తము.
హరిః ఓమ్ తత్సత్.

యగు సుఖమునకు ప్రతిష్ఠను (పర్యాప్తభూతుడను) నేనే. నేను పరమానందస్వరూపుడ నగుట నాకంటె వేరగు పొందదగు సుఖము లేదని యర్థము. కాన నాభక్తుడు బ్రహ్మభావమునకు సమర్థుడగునని చెప్పుట యుక్తమే. ॥ ౨౭ ॥

శ్లో॥ పరాకృతనమద్బంధం పరం బ్రహ్మ నరాకృతి ।
సౌందర్యసారసర్వస్వం వందే నందాత్మజం మహః ॥

నమస్కరించెడి భక్తుల సంసారబంధమును తొలగించువాడును, లీలామానుషాకారమును ధరించినవాడును, సౌందర్యసారసర్వస్వస్వరూపుడును, నందునకు నందనుడై అమందానందసంధాయకు డగు శ్రీకృష్ణపరబ్రహ్మమునుగూర్చి నమస్కరించుచుంటిని.

ఇట్లు మధుసూదన సరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా
చతుర్దశాధ్యాయ గూఢార్థ దీపికకు "తర్కరత్న,
న్యాయవేదాన్త విద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రి విరచితతాత్పర్యబోధిని

సమాప్తము.

---

శంకరానందీయము:— బ్రహ్మవేత్త గుణ, తత్కార్యవ్యపోహమాత్రముచే బ్రహ్మభూతు డెట్లగును? ఏమన: 'బ్రహ్మవేత్త యహమర్థమగుటచే జ్ఞాత యగును. పరబ్రహ్మము ఇదమర్థమగుటచే జ్ఞేయ మగును. ఘటజ్ఞాతకు ఘటమునందుండు జ్ఞేయత్వము సంభవించుట ప్రత్యక్షవిరుద్ధముకదా! ఇట్లే జ్ఞాత యగు వానికి జ్ఞేయత్వము సంభవింపనేరదు. కాన బ్రహ్మవేత్త బ్రహ్మభూతు డెట్లగు నని యాశంకించెదవా? అట్లు కాదు: లోకమున "అయ మహ మస్మి" (ఇక్కడియే నేనుంటిని) అను స్థలమున అహంశబ్దేదంశబ్దార్థములకు శబ్దోపాధిని బట్టి జ్ఞాతృజ్ఞేయధర్మపురస్సరముగ భేదము ప్రతీయమానమైనను, ఆలోచించినచో నారెంటికి అర్థమునుబట్టి యేకత్వ ముపపన్న మగుచున్నదిగాన నిట ప్రత్యక్షవిరోధము కన్పట్టుట లేదు. ఈవిధముగనే ప్రస్తుతస్థలమునగూడ నుపపన్న మగును. మరియు "సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామాని కృత్వాఽభివద న్యదాస్తే" అను శ్రుతియు, "అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" అను శ్రుతియు పరబ్రహ్మమే నామరూపవ్యాకరణోపాధియందు జ్ఞాతృరూపముగ నుండు ననియు ప్రతిపాదించుచున్నదిగాన జ్ఞాత యగు బ్రహ్మవేత్తకు ఉపాధ్యుపరమకాలమున బ్రహ్మభావ ముపపన్నము. ఘటోపాధి నశింపగనే ఘటాకాశమునకు మహాకాశత్వము సిద్ధించుచున్నదిగదా! అట్లే పైస్థలమునగూడ జూడదగును. "నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా" "అవిజ్ఞాతం విజ్ఞాతం" అను శ్రుతులు విజ్ఞాతృ-బ్రహ్మల కభేదమునే బోధించుచున్నవి. కనుకను, బ్రహ్మకు ప్రతిష్ఠారూపు డగుటచేతను ప్రత్యగ్రూపు డగు బ్రహ్మవేత్తకు బ్రహ్మభావ ముపపన్నము. అని బోధించుటకై చెప్పుచుండెను— "అమృతస్య"— "ఏత దమృత మభయ మేత ద్బ్రహ్మ" అనుశ్రుత్యనుసారము బ్రహ్మము అమరణధర్మము కలది. అవినాశియు జన్మరహితము నగు వస్తువునకే యవినాశిత్వము యుక్తము. కాన "అమృతస్య" అనువిశేషణముచే బ్రహ్మమున కాద్యంతవికారశూన్యత్వము సూచింపబడెను. "అవ్యయస్య" బ్రహ్మము వ్యయరహితమైనది. (ఈవిశేషణముచే బ్రహ్మము వృద్ధివిపరిణామములు లేని దని సూచిత మయ్యెను. "శాశ్వతస్య" బ్రహ్మము నిత్యము. (ఈవిశేష

ణముచే బ్రహ్మము ఆగంతుకాస్తిత్వ, అపక్షయములు లేనిదని సూచింపబడెను.) "ధర్మస్య—అవిద్యయా జన్మమరణాదిదుఃఖప్రవాహే పాత్యమానః పురుషః ధ్రియతేఽనేనేతి ధర్మః జ్ఞానం" అవిద్యచే జన్మమరణాది దుఃఖప్రవాహమున త్రోయబడు పురుషుని ధరించునది (ఉద్ధరించునది) కాన నిట ధర్మశబ్దము జ్ఞానమును చెప్పును. బ్రహ్మము అట్టి ధర్మ (జ్ఞాన) గమ్యుఁ డగుటచే ధర్మరూపుఁ డగు నని యర్థము. "సుఖస్య" బహ్మము ఆనందస్వరూపము. "ఐకాంతికస్య చ- అత్యంత మిద మేవ మేవేతి నిశ్చీయతేఽనేనేతి అంతః ఏక శ్చాసా వంత శ్చేతి ఏకాంతః ఏకప్రత్యయః, తేనాఽవగమ్యత ఇత్యైకాంతికం, తస్యైకాంతికస్య" (ఇది యిట్టిదే యని ఏజ్ఞానముచే నిశ్చయింపబడునో యట్టి జ్ఞానము అంతము అనబడును. ఒకటి యగు అంతము ఏకప్రత్యయము. అట్టి యేకప్రత్యయముచే దెలియబడునది గాన బ్రహ్మము ఐకాంతిక మనబడును. అట్టి యవ్యభిచరితసత్తాకము, పరిపూర్ణము, నిర్విశేషము నగు బ్రహ్మమునకు "అహం" అహమర్థము సర్వదృశ్య జ్ఞాతను నగు ప్రత్యగాత్మ (నేను) "ప్రతిష్ఠా- ప్రతితిష్ఠత్యనేన జ్ఞాతృస్వరూపేణ నామరూపవ్యాకరణాయ ప్రవర్తత ఇతి ప్రతిష్ఠా" "తదేవానుప్రావిశత్" అను శ్రుత్యుక్తరీతిని జ్ఞాతృస్వరూపముతో నామరూప వ్యాకరణమునకై యుండువాఁడను అని యర్థము.) పరబ్రహ్మమే ప్రత్యగాత్మరూపమున నుపాధి యందుండి బుద్ధ్యాదిసర్వదృశ్యజాతమును తెలిసికొనుచుండెను. మరియు ప్రకాశింపజేయుచుండెను. కాన ప్రత్యగాత్మకు బ్రహ్మత్వ మవ్యభిచారియే యగును. అగ్ని దీపరూపమున ఘటపటాద్యర్థజాతమును ప్రకాశింపజేయు తరి దీపరూపమున నున్న యగ్నికి యగ్నిత్వము (లోపింపనట్లు) వ్యభిచరింపనట్లు జ్ఞాత యగు ఆత్మకు నుపాధి లేని తరి బ్రహ్మత్వము యుక్తమే. విద్వాంసు డగు జ్ఞాతయే యాత్మ గాన బ్రహ్మజ్ఞాని బ్రహ్మమే యగునని యర్థము.

లేక, నిరుక్తలక్షణములు కల నిర్విశేషపరబ్రహ్మమునకు "అహం ప్రతిష్ఠా" ప్రత్యగాత్మస్వరూపుఁడ నగు నేను (శ్రీకృష్ణపరమాత్మ) ప్రతిష్ఠా (స్థితి) హేతుభూతుఁడను. పరబ్రహ్మమునకు సత్త్వ, చిత్త్వ, ఆనందరూపత్వ, పరిపూర్ణత్వ, అద్వితీయత్వాదికము బుద్ధ్యుపాధికుఁ డగు ప్రత్యగాత్మరూపచేతనముచేతనే సిద్ధించుచున్నది గాని స్వతః సిద్ధించుట లేదు. కాన అహమర్థ మగు నేను (ప్రత్యగాత్మ) బ్రహ్మకు ప్రతిష్ఠా హేతు వగుచుంటిని. బ్రహ్మవ్యతిరిక్తముగ చేతనయే లేదు గాన "అయ మాత్మా బ్రహ్మ" అను శ్రుత్యుక్త రీతిని ప్రత్యగాత్మయే యుపాధిలేనితరి బ్రహ్మమగుట యుక్తము. కాన బ్రహ్మజ్ఞాని బ్రహ్మమే యగు నని సిద్ధించుచున్నది. ॥౨౭॥

ఇట్లు శ్రీశంకరానందసరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా చతుర్దశాధ్యాయవాక్య

తాత్పర్యబోధినికి "తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ, దర్శనా

లంకార" బిరుదు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన తాత్పర్యబోధిని

స మా ప్త ము.

—

శ్రీ ధ రీ య ము:—

శ్లో॥ కృష్ణాధీనగుణాసంగప్రసంజితభవాంబుధిం, ।
సుఖం తరతి తద్భక్త ఇత్యభాణి చతుర్దశే ॥

మాయాతీతుడగు శ్రీకృష్ణభగవానుల కధీనమైనది గుణత్రయము. దానియొక్క సంగముచే నీసంసార సాగరనిమజ్జనము ప్రసక్తమగును. అట్టియెడ ఆశ్రీకృష్ణుని యెడ భక్తి యనెడు నావ నాశ్రయించినవాడే యీసంసారసాగరమును దాటగల్గునని యీచతుర్దశాధ్యాయమున జెప్పబడెను.

ఇట్లు శ్రీధరస్వామివిరచిత శ్రీభగవద్గీతా చతుర్దశాధ్యాయ టీకకు "తర్కరత్న
న్యాయవేదాన్త విద్యాపారీణ, దర్శనాలంకార" బిరుదు
అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
స మా ప్త ము.

---

స దా నం దీ య ము:—

శ్లో॥ సత్త్వాదీనాం గుణానాం జనిమృతిగహనే దుస్తరే ఽస్మిన్ భవాబ్ధౌ, కార్యాకారేణ నిత్యం పరిణతవపుషాం పాతహేతుత్వ ముక్త్వా । తేభ్యో మోక్షం స్వబోధా త్స్వపదరతధియాం లక్షణాది ప్రదర్శ్య, స్వీయాం నిష్ఠాం జగౌ యో విమల మతిరమాం నౌమి తం కృష్ణ మీడ్యమ్ ॥

తా॥ జననమరణప్రవాహముచే దుస్తరమైన యీసంసారసాగరగర్భమున నిమగ్నుడగుటకు కార్యరూపముగ పరిణమించిన సత్త్వరజస్తమోగుణములే హేతువులని చెప్పి, భగవద్భక్తులకు ఆత్మజ్ఞానమువలననే వానినుండి మోక్షమగుననియు జూపి, స్వీయనిష్ఠను నిరూపించిన శ్రీకృష్ణపరబ్రహ్మమును గూర్చి నమస్కరించెదను. ॥౨౭॥

ఇట్లు సదానందవిరచిత శ్రీభగవద్గీతా చతుర్దశాధ్యాయ సదానందీయమునకు
"తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ, దర్శనాలంకార"
బిరుదు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
స మా ప్త ము.

---

భాష్యోత్కర్షదీపిక:— ఈచతుర్దశాధ్యాయమున, ఉత్పన్నమగు సర్వము క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగమువలననే క్షేత్రక్షేత్రజ్ఞసంయోగము వలననే పుట్టుచున్నదనియు, ఏయేగుణమునందు సంగ మెట్లగుచున్నదో, ఏయేగుణము లెట్లు బంధించుచున్నవో, ఆగుణములనుండి మోక్ష మెట్లు కల్గుచున్నదో ముక్తుని లక్షణ మేమో యనునవ్వియును జెప్పి, తత్త్వపదార్థమగు ప్రత్యగభిన్నమగు బ్రహ్మము నిరూపింపబడెను.

ఇట్లు ధనపతి సూరివిరచిత శ్రీభగవద్గీతా చతుర్దశాధ్యాయ భాష్యోత్కర్ష
దీపికకు "తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ, దర్శనా
లంకార" బిరుదు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
స మా ప్త ము.

---

పరమార్థప్రప:— శ్రీకృష్ణపరమాత్మ మనుష్యవేషధారి గాన మూఢుల దేహాత్మభావ నిరాసము నకై తన యీశ్వరస్వరూపత్వమును తెల్పుచుండెను— "బ్రహ్మణోహం ప్రతిష్ఠా" చిదానందమాత్రస్వరూప డగు బ్రహ్మమునకు నేను (శ్రీకృష్ణపరమాత్మ) ప్రతిమారూపమగు ఘనీభావస్వరూపుడను. ఎట్లు ఘనీభూత మైన తేజస్సే సూర్యు డగుచుండెనో ఘనీభూతమైన పంచుళమే కర్పూరాకారమును పొందుచుండెనో అట్లే నేను బ్రహ్మమునకు ఘనీభూతమైన యాకారము నగుదు నని యర్థము. అబ్రహ్మము నిత్యము, నిత్యముక్త మునగుట మోక్షస్వరూపము. అట్లే అనశ్వరఫలము నిచ్చునదగుట శాశ్వతము. శుద్ధసత్త్వస్వరూపుడనగుట ధర్మమునకు నేను ప్రతిష్ఠారూపుడను. అట్లే పరమానందరూపుడ నగుట అఖండానందమునకు ప్రతిష్ఠాభూతు డను. కాన నన్ను సేవించువానికి తద్భావాపత్తి యవశ్యంభావి గాన నట్టివాడు "బ్రహ్మభూయాయ కల్పతే" (బ్రహ్మస్వరూపు డగుటకు సమర్థుడు.) అని చెప్పుట యుక్తమే. ఈవిషయమే యథాత్మమీమాంసయం దిట్లు చెప్పబడెను—"కృష్ణాకారేణ సాక్షా దిహ హి విజయతే సూత్రసంజ్ఞః పరాత్మా, జ్యోతి ర్విశ్వప్రకాశం ప్రజతి దినకరాకారతాం యద్వ దత్ర। యత్స్వే గాత్రేథ వక్త్రే ఉర్జునజననికృతేఽదర్శయ ద్విశ్వరూపం, తం నత్వా స్వానుభూతిప్రద ముపనిషదాం హార్ద మర్థం బ్రవీమి॥" ప్రకాశింపజేయు తేజస్సు సూర్యా కారముగ నున్నట్లే సూత్రసంజ్ఞ కల పరమాత్మయే సాక్షాత్తు కృష్ణాకారమున నీలోకమును ప్రకాశింపజేయు చున్నది, ఏతేజస్సు కృష్ణాకారమున నున్న తన శరీరమునందును, ముఖమునందును కుంతీదేవికి తన విశ్వ రూపమును జూపెనో, అట్టి శ్రీకృష్ణ పరబ్రహ్మమును నమస్కరించి స్వానుభూతిప్రద మగు ఔపనిషద హృదయ మగు యర్థమును చెప్పుచుంటిని.)

.: అధ్యాయ తాత్పర్యము :-

శ్లో॥ ఏకోపాదానకత్వే ప్యతనువిష మభూ ద్విశ్వ గుణై ర్విశ్వ మేతే,
బధ్నం త్యజ్ఞానజంతూ న్న చ మదనుచరాం స్తోషలోభప్రమాదైః
స్వీకుర్వ న్శుద్ధసత్త్వం జయతి తదితరో య స్స మా మేతి సత్యం,
ప్రోక్తస్సమ్య క్చతుర్థే స్సమధికదశమేఽసౌ గుణాతీతయోగః।

తా॥ ఈ విశ్వము ఒక పరబ్రహ్మమే యుపాదానముగా కలదియైనను సత్త్వరజస్తమో గుణములచే ననేక విధములుగ నుపబృంహిత మగుచున్నది. ఈ గుణములు అజ్ఞానావృతులగు జనులను తోషలోభాదిప్రమాదములచే బంధించుచున్నవి అట్లనినాపరమభక్తులగువారిని మాత్ర మేమియు బంధింపలేకున్నవి. ఎవడు ఈగుణముల నతిక్రమించి శుద్ధసత్త్వమును స్వీకరించునో యట్టివాడు నిత్యస్వరూపుడనగు నన్ను పొందుచుండెను. అని యీ చతుర్దశాధ్యాయమున గుణాతీతయోగము చెప్పబడెను.

ఇట్లు దైవజ్ఞపండిత విరచిత శ్రీభగవద్గీతా చతుర్దశాధ్యాయ పరమార్థప్రపకు
"తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రి విరచితతాత్పర్యబోధిని
సమాప్తము.

నీలకంఠీయము :— విషయప్రదర్శనద్వారమున విచారణయను పేరు గల ద్వితీయభూమిక నీశ్లోకమున జెప్పుచుండెను: — "అమృతస్య అవ్యయస్య బ్రహ్మణఃప్రతిష్ఠాఽహం" వేదముకర్మబ్రహ్మోభయప్రదర్శన ద్వారమున మోక్షసాధనము. అనాదియు, ననంతము నగుటచే నపౌరుషేయముగాన అప్రామాణ్యశంకాకలంక శూన్యము. అట్టి వేదమునకు నేను ప్రతిష్ఠాభూతుడను. (తాత్పర్యముచే పర్యవసానభూతుడను.)( ఈచెప్పుటచే వేదాఽవిరుద్ధ మగు ఉపక్రమోపసంహారాదిపర్యాలోచనచే సమస్తవేదమునకు తాత్పర్యమును నా దర్శనమునుకోరు ముముక్షువు నిర్ణయింప దగు నని విచారణ యను పేరు గల ద్వితీయభూమిక నిరూపింప బడెను. హేతుఫలప్రదర్శనద్వారమున శుభేచ్ఛయను పేరు గల ప్రథమభూమికను చెప్పుచుండెను:— "శాశ్వతస్య చ ధర్మస్య ప్రతిష్ఠా అహ మేవ" భగవంతునికై యర్పింపబడిన ధర్మము కామ్యకర్మలవలె ఫలదానముచే నశించునదిగాదు కాన శాశ్వతము. మరియు వివిదిషాపాదంపర్యముగ మోక్షమనెడు శాశ్వతఫలమునకు హేతు వగుట భగవదర్పిత మగు ధర్మము శాశ్వత మనబడును. అట్టి శాశ్వతధర్మమునకు ప్రతిష్ఠను నేనే. అట్లే "ఐకాంతికస్య సుఖస్య ప్రతిష్ఠాఽహ మేవ" విషయసంగముచే గల్గు సుఖమునకు వ్యభిచారి స్వరూపమగు మోక్షసుఖమునకు పరాకాష్ఠాస్వరూపు డను నేనే. ఈవిధముగ నిష్కామకర్మముచే విశుద్ధమైన చిత్తముగలవానికి ఐకాంతిక (మోక్ష) సుఖేచ్ఛకల్గును. ఇదియే శుభేచ్ఛయను పేరు గల ప్రథమభూమిక. ఇట ముందు ముందు భూమి నధిరోహించుట కశక్తునకు పూర్వభూమిక యుపదేశించుచుండెను.) ఇట్లే "ధ్యానే నాత్మని పశ్యంతి" అను స్థలమున నిదిధ్యాసనాఽశక్తునకు సాంఖ్య మను పేరి విచారము, దానియందు నశక్తునకు కర్మయోగము నుపదిష్టమయ్యెను.

ఇట్లు శ్రీనీలకంఠాచార్య విరచిత శ్రీభగద్గీతా చతుర్దశాధ్యాయ

భారతభావదీపమునకు బులుసు వేంకటశాస్త్రి విరచిత

తాత్పర్యబోధిని సమాప్తము.

శుభమస్తు.

# శ్రీభగవద్గీతా శాంకరభాష్యతత్త్వబోధినీ

## పంచదశోఽధ్యాయః.

### పురుషోత్తమయోగః

**శ్రీ భగవానువాచ :-**

గీ॥ ఊర్ధ్వమూల మధ శ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్ ।
ఛన్దాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్ । ॥౧॥

పదవిభాగము :- శ్రీభగవాన్- ఉవాచ- ఊర్ధ్వమూలం - అధశ్శాఖం - అశ్వత్థం- ప్రాహుః- అవ్యయమ్- ఛన్దాంసి- యస్య- పర్ణాని- యః తం- వేద- సః _ వేదవిత్ ॥ ॥౧॥

ప్రతిపదార్థము :— శ్రీభగవాన్= శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=పలికెను; ఊర్ధ్వమూలం= ఊర్ధ్వ=అవ్యక్తమాయాశక్తికల బ్రహ్మము; మూలం=మొదలుగాకలదిగ; అధశ్శాఖం=తలక్రిందుగ; మహదహంకారతన్మాత్రాదులు శాఖలుగా కలదిగ; అశ్వత్థం=న×శ్వః×స్థాతేత్యశ్వత్థః, తమశ్వత్థం = నశ్వరమైన సంసారవృక్షమును; ప్రాహుః=చెప్పుచుండిరి; అవ్యయం=ఈసంసారవృక్ష మనాదికాలప్రవృత్త మగుట వలన ప్రవాహతఃనాశరహితము అని; ప్రాహుః=చెప్పుచుండిరి; యస్య=ఏసంసారవృక్షమునకు; ఛన్దాంసి= ఋగ్యజుస్సామవేదములు; పర్ణాని=పర్ణములో (ఆకులో); యః=ఎవడు; తం= యథావ్యాఖ్యాతమైన మూలముతో కూడిన సంసారవృక్షమును; వేద=తెలిసికొనునో; సః = అట్టివాడు; వేదవిత్=వేదార్థమును తెలిసికొనినవాడు. ॥౧॥

---

శాంకరభాష్యమ్ :—

(1) యస్మా న్మదధీనం కర్మిణాం కర్మఫలం జ్ఞానినాం చ జ్ఞానఫల మతో భక్తియోగేన మాం యే సేవన్తే తే మత్ప్రసాదా జ్జ్ఞానప్రాప్తిక్రమేణ గుణాతీతా మోక్షం గచ్ఛన్తి కిము

---

శాంకరభాష్యతత్త్వబోధిని :—

(1) కర్ములకు కర్మఫలము, జ్ఞానులకు జ్ఞానఫలము నాయధీన మగుటవలన నెవరు భక్తియోగముచే నన్ను సేవించెదరో వారు నాయనుగ్రహమువలన జ్ఞానప్రాప్తిక్రమముచే

---

—♦ ౧౫ అధ్యాయము ౧వ శ్లోక వ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము :— పూర్వాధ్యాయమున శ్రీకృష్ణపరమాత్మ సంసారసంబంధ

శాంకరభాష్యమ్ :—

వక్తవ్య మాత్మన స్తత్త్వమేవ సమ్యగ్విజానన్త ఇత్యతో భగవా నర్జునే నాపృష్ట మప్యాత్మన స్తత్త్వం వివక్షు రువాచ ఊర్ధ్వమూల మిత్యాది। తత్రతావ ద్వృక్షరూపకకల్పనయా వైరాగ్యహేతోః సంసారస్వరూపం వర్ణయతి విరక్తస్య హి సంసారా ద్భగవత్తత్త్వజ్ఞానేఽధికారో నాన్యస్యేతి।

---

శాంకరభాష్యతత్త్వబోధిని : —

గుణాతీతులై మోక్షమును పొందుచున్నారు. ఆత్మయొక్క తత్త్వము లెస్సగ తెలిసికొనిన వారు మోక్షమును పొందుదు రని చెప్పదగిన దేమియున్నది. కాన శ్రీకృష్ణపరమాత్మ యర్జునునిచే ప్రశ్నింపబడకున్నను ఆత్మయొక్క తత్త్వమును వివక్షచేయదలచినవాడై 'ఊర్ధ్వమూలం' అనునది మొదలుకొని చెప్పమొదలిడెను. అందు వైరాగ్యహేతుః వగుటవలన వృక్షరూపకకల్పనచే సంసారస్వరూపమును వర్ణించుచుండెను. సంసారమందు విరక్తునకే భగవత్తత్త్వజ్ఞానమునం దధికారము. ఇతరునకు అట్టి యధికారము లేదు.

---

హేతువు లగు గుణములను వ్యాఖ్యానించి, వాని నతిక్రమించుటచే బ్రహ్మభావాపత్తి రూప మగు మోక్షము నన్ను సేవించువారలకు కలుగుచున్న దని చెప్పియుండెను "మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే। స గుణా న్సమతీ త్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥" అను శ్లోకమున పై విషయమును చెప్పియుండెను. ఇట మనుష్యుడ వగు నీయెడ గల భక్తియోగముచే బ్రహ్మ భావ మెట్లు కలుగును? అను ఆకాంక్షపై తనకు బ్రహ్మరూపత్వజ్ఞాపనమునకై సూత్రభూతముగ శ్రీకృష్ణపరమాత్మచే "బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృత స్యావ్యయస్య చ। శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాంతికస్య చ॥" అను శ్లోకము చెప్పబడెను. సూత్రభూత మగు నీశ్లోకమునకు వృత్తిస్థానీయముగ నీయధ్యాయము నారంభించుచుండెను. శ్రీకృష్ణభగవానుని తత్త్వమును తెలిసికొనికదా శ్రీకృష్ణప్రేమపాత్రుడై, గుణాతీతుడై, బ్రహ్మభావము పొందుటః దేహధారి అట్లు శ్రీకృష్ణప్రేమపాత్రుడు కానిచో బ్రహ్మ భావము నెట్లు పొందగలడు! అను సంశయము కలుగుచున్నది. ఇట "బ్రహ్మణోహి ప్రతిష్ఠాహం" అను నిత్యాదిభగవద్వచనము నాకర్ణించి యర్జునుడు "నాతో తుల్యుడగు మనుష్యుడుగదా శ్రీకృష్ణుడు. ఇట్టివా డీవిధముగ బల్కుచుండెనేమి! ఇట్లగుట విరుద్ధము కాదా: అని విస్మయావిష్టమానసుడయ్యెను. అట్లయి ప్రతిభారాహిత్యముతోడను, లజ్జచేతను కొంచమైన నడుగుటకు సమర్థుడు కాకయున్న యర్జునుని జూచి కృపచే దన స్వరూపమును వివేచన జేయ నిచ్ఛగలవాడై, శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచుండెను— అందు సంసారముయెడ విరక్తు డగువాడే తత్త్వజ్ఞానమున కధికారియగును కాని, యితరుడు కానేరడు. అని పూర్వాభ్యాయోక్త మగు పరమేశ్వరాధీనప్రకృతిపురుషసంయోగ కార్య మగు సంసారమును-గుణాతీతత్వోపాయ మగు వైరాగ్యము సిద్ధించు నను యూహతో వృక్షరూపకకల్పనచే వర్ణించుచుండెను — "ఊర్ధ్వమూలం- ఊర్ధ్వ ముత్కృష్టం మూలం కారణం యస్య" పరబ్రహ్మము స్వప్రకాశపరమానందరూపమగుట చేతను,నిత్యమగుటచేతను నుత్కృష్టమగు మూలకారణము. లేక, 'ఊర్ధ్వం' సర్వసంసారము బాధితమైనను యబాధితము. సర్వసంసారభ్రమాధిష్ఠానమున్నగునది బ్రహ్మము. ఆబ్రహ్మమే మాయచే మూలము (వేరు) కలదిగాన సంసారము ఊర్ధ్వమూల మనబడును. "అధశ్శాఖం" అధశ్శబ్దముచే గార్యోపాధు లగు హిరణ్యగర్భాదులు గ్రహింపబడుదురు. వారు నానాదిక్కులకు వ్యాపించినవారగుట

శాంకరభాష్యమ్ :—

(2) ఊర్ధ్వమూలం కాలతః సూక్ష్మత్వా త్కారణత్వా న్నిత్యత్వా న్మహత్త్వా చ్చోర్ధ్వము చ్యతే బ్రహ్మాఽవ్యక్తమాయాశక్తిమ త్తన్మూల మస్యేతి సోఽయం సంసారవృక్షఊర్ధ్వమూలః। శ్రుతేశ్చ 'ఊర్ధ్వమూలోఽర్వాక్శాఖః' ఇతి। పురాణే చ — "అవ్యక్తమూలప్రభవ

శాంకరభాష్యతత్త్వబోధిని :—

(2) కాలముకంటె సూక్ష్మమగుటవలనను, కారణమగుటవలనను, నిత్యమగుటవలనను, మహత్తగుటవలనను, "ఊర్ధ్వం" అనిచెప్పబడుచున్నది. అది అవ్యక్త మాయాశక్తిమత్తగు బ్రహ్మము. అట్టి బ్రహ్మమే సంసారవృక్షమునకు మీదునయుండు మూలము. పరశ్రుతియు "ఊర్ధ్వమూలోఽర్వాక్శాఖః" అనునది పైయర్థమునే బోధించుచున్నది.

పురాణమునందుగూడ :— "అవ్యక్తమూలప్రభవస్తస్యైవానుగ్రహోత్థితః। బుద్ధిస్కన్ధ మయశ్చైవ ఇన్ద్రియాన్తరకోటరః॥ మహాభూతవిశాఖ శ్చ విషయైః పత్రవాం స్తథా। ధర్మా ధర్మసుపుష్ప శ్చ సుఖదుఃఖఫలోదయః॥ ఆజీవ్య స్సర్వభూతానాం బ్రహ్మవృక్షస్సనాతనః। ఏత ద్బ్రహ్మవనం చైవ బ్రహ్మ చరతి నిత్యశః॥ ఏత చ్ఛిత్వా చ భిత్వా చ జ్ఞానేన పరమా సినా। తత శ్చాత్మరతిం ప్రాప్య యస్మా న్నావర్తతే పునః॥ ఇత్యాది"

శాఖలువలె సుందరుగాన నట్టివారు శాఖలుగా కలది. నశించునదిగాన "న శ్వోపి స్థాతేతి విశ్వాసాఽనర్హ మశ్వత్థం" (రేపుగూడ నుండునని విశ్వసించుట కనర్హమైనది.) మాయామయ మగు సంసారవృక్షము "అవ్యయం" అనాద్యనంతదేహాదిసంతానాశ్రయమై, తత్త్వజ్ఞానమును విడచి దేనిచేతనుగూడ నివారింప శక్యముగానిదై, యనంత మగుటచే నవ్యయ మని శ్రుతులు స్మృతులు "ఆహుః" చెప్పుచున్నవి. ఇట శ్రుతులు "ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థ స్సనాతనః" అను మొదలగునవి కఠవల్లులలో పఠింప బడినవి. ఈ శ్రుతిలోనున్న "అవాంచః శాఖాః అస్య" (నికృష్టము లగు కార్యోపాధు లగు మహదహంకార తన్మాత్రాదులు శాఖలు కలదిగాన సంసారము అవాక్శాఖము అనబడును. ఈపదము అధశ్శాఖపదసమా నార్థకము "సనాతనః" పదము అవ్యయపదసమానార్థకము. స్మృతులు "అవ్యక్తమూలప్రభవ స్తస్యైవాను గ్రహోత్థితః। బుద్ధిస్కంధమయ శ్చైవ ఇంద్రియాంతరకోటరః। మహాభూతవిశాఖశ్చ విషయైః పత్రవాం స్తథా। ధర్మాధర్మసుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః॥ ఆజీవ్య స్సర్వభూతానాం బ్రహ్మవృక్ష స్సనాతనః। ఏత ద్బ్రహ్మవనం చైవ బ్రహ్మచరతి సాక్షివత్॥ ఏత చ్ఛిత్వా చ భిత్వా చ జ్ఞానేన పరమాసినా। తత శ్చాత్మగతిం ప్రాప్య తస్మా న్నావర్తతే పునః॥" అను మొదలగునవి అవ్యక్తము, అవ్యాకృతము, మాయోపాధికమునగు బ్రహ్మమే మూలము (కారణము). ఆబ్రహ్మమునుండి జన్మము కలది సంసార వృక్షము, ఆయవ్యక్తముయొక్క యనుగ్రహముచేతనే సంవర్ధితము. వృక్షమున శాఖలుస్కంధము (మాను) నుండి పుట్టుచుండునుగదా : అట్లే సంసారమునకు నానావిధము లగు పరిణామములు కలుగుచున్నవి. ఈసాధ ర్మ్యముచే సంసారవృక్షమునకు బుద్ధియే స్కంధస్థానీయము. ఈసంసారవృక్షమున కింద్రియములే కోటర ములు (ఛిద్రములు) మరియు నీవృక్షమునకు ఆకాశాదిమహాభూతములు నానావిధశాఖలు. పరబ్రహ్మమునే నధిష్ఠితమ్ముగాన నిది బ్రహ్మవృక్ష మనబడును. ఈవృక్షము ఆత్మజ్ఞానము లేనిదే ఛేదింప శక్యముకాదుగాన సనాతనము. ఇయ్యది బ్రహ్మమునకు వనరూపము. అనగా జీవరూపమగుబ్రహ్మమునకు భోగ్యమై సంజభనీయ

**శాంకరభాష్యమ్ :—**

స్తస్యైవానుగ్రహోత్థితః । బుద్ధిస్కన్ధమయశ్చైవ ఇంద్రియాన్తరకోటరః ॥ మహాభూతవిశాఖశ్చ విషయైః పత్రవాం స్తథా । ధర్మాధర్మసుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః॥ ఆజీవ్యః సర్వభూతానాం బ్రహ్మవృక్షః సనాతనః । ఏత ద్బ్రహ్మవనం చైవ బ్రహ్మ చరతి నిత్యశః ॥ ఏతచ్ఛిత్త్వా చ భిత్త్వా చ జ్ఞానేన పరమాసినా । తతశ్చాఽఽత్మరతిం ప్రాప్య యస్మా న్నాఽఽవర్తతే పునః॥'' ఇత్యాది । త మూర్ధ్వ మూలం సంసారమాయామయం వృక్షమధశ్శాఖం మహదహంకారతన్మాత్రాదయః శాఖా ఇవాస్యాధో భవన్తీతి సోఽయమధశ్శాఖ స్తమధశ్శాఖం న శ్వోఽపి స్థాతేత్యశ్వత్థస్తం క్షణప్రధ్వంసిన మశ్వత్థం ప్రాహుః కథయన్తి ।

**శాంకరభాష్యతత్వబోధిని :—**

సనాతనమైన బ్రహ్మవృక్షము అవ్యక్తమూలప్రభవము, బ్రహ్మానుగ్రహోత్థితము, బుద్ధిస్కంధప్రచురము. ఇంద్రియము లనెడి లోపల తొర్రలు కలది. పంచమహాభూతము లనెడి విశేషమైన శాఖలు (కొమ్మలు) కలది. అట్లే శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయము లనే పత్రములు కలది. ధర్మాధర్మము లనెడి సుపుష్పములు కలది. సుఖదుఃఖము లనెడి ఫలోత్పత్తి కలది. సర్వభూతముల కాజీవ్యము. నిత్యము ఈబ్రహ్మవనముననే బ్రహ్మము చరించుచుండును. ఇట్టి బ్రహ్మవనమును గొప్పఖడ్గరూపమైన జ్ఞానముచే ఛేదించి, భేదించి యనంతరమునందు ఆత్మరతిని పొందినవాడు దేనినుండి పునరావృత్తిని పొందడో దానిని పొందునని చెప్పబడెను. అట్టి అవ్యక్తమాయాశక్తిమత్తగు బ్రహ్మమే మీదుగ మొదలుగా కల సంసార మాయామయమైన వృక్షమునకు మహదహంకారతన్మాత్రాదులు శాఖలువలె క్రిందుగ నగుచున్నవి. కాన నీవృక్షము అధశ్శాఖ మనబడును. మరియు మరునాడుండనిది కాన 'అశ్వత్థం' అని చెప్పుచుండిరి.

---

మగును గాన బ్రహ్మ సాక్షిభూతుడై యుండును. అనగా నీసంసారకృత మగు ధర్మాధర్మములచే లేపమును పొందడని యర్థము. ఈసంసారవృక్షరూపమైన బ్రహ్మవనమును "బ్రహ్మాహ మస్మి'' అను దృఢజ్ఞానఖడ్గముచే ఛేదించి యాత్మస్వరూప మగు గతిని పొందినవాడు అట్టి మోక్షమునుండి తిర్గి రాడని పైస్మృతికి యర్థము.) ఇట గంగాతరంగనుద్యమాన మగు తీరమునందు అడ్డముగా పడియున్నదియు, వాయువశమున యర్ధోన్మీలితము నగు యశ్వత్థవృక్షము నుపమానముగా జేసికొని జీవునిగూర్చి చేసిన రూపకకల్పనగా జూడదగును, ఇట్టి కల్పనచే నూర్ధ్వమూలత్వ, అధశ్శాఖత్వోపాధికముగ నున్నను ఇట్టి మాయామయమగు సంసారవృక్షమునకు కర్మకాండాత్మకఋగ్యజుస్సామములు పర్ణములవలె నాచావదకములై (తత్త్వవస్తుప్రాచ్ఛకములై ధర్మాధర్మ, తద్ధేతు, ఫలప్రదర్శనార్థము లగుటచే సంసారవృక్షరక్షకములై) పర్ణము లగును. ''యస్తం.... వేదవిత్" అట్టి యథావ్యాఖ్యాతమైన, మాయామయసంసారాశ్వత్థవృక్షము నెవడు తెలిసికొనునో యట్టివాడే కర్మబ్రహ్మాఖ్యవేదార్థము తెలిసినవాడు. సంసారవృక్షమునకు మూలము బ్రహ్మము. హిరణ్యగర్భాది జీవులు శాఖాస్థానీయులు; ఆసంసారవృక్షము స్వరూపముచే నశ్వరము; ప్రవాహరూపమున యనంతము; ఆవృక్షము వేదోక్తకర్మలచే దడుపబడి వృద్ధినొందును; బ్రహ్మజ్ఞానఖడ్గముచే ఛేదింపబడును, ఇంతమాత్రమే వేద

శాంకరభాష్యమ్ :—

(౩) అవ్యయం సంసారమాయామయ మనాదికాలప్రవృత్తత్వా త్సోఽయం సంసారవృక్షోఽవ్యయోఽనాద్యనన్తదేహాదిసంతానాశ్రయో హి సుప్రసిద్ధ స్తమవ్యయమ్। తస్యైవ సంసారవృక్ష స్యేద మన్య ద్విశేషణం, ఛన్దాంసి ఛాదనా దృగ్యజుస్సామలక్షణాని యస్య

శాంకరభాష్యతత్త్వబోధిని :—

(౩) మాయామయమైన యీసంసారము అనాదికాలప్రవృత్తమగుటవలన అవ్యయము, అనాద్యనంతదేహాదిసంతానాశ్రయము, సుప్రసిద్ధము కాన అవ్యయ మనబడును. ఈచెప్పుట వలన సంసారము క్షణప్రధ్వంసి యని చెప్పి, తిరిగి అవ్యయమని చెప్పుట విరుద్ధము కాదా! అను శంక తొలగింపబడెను. ఆసంసారవృక్షమునకే "ఛందాంసి" అని మరియొక విశేష

ప్రయోజనము. ఇట్టి వేదార్థవేత్తయే సర్వవేత్తయగు నని సమూలవృక్షజ్ఞానమును ''స వేదవిత్'' అనుదానిచే స్తుతించెను. ॥౧॥

శంకరానందీయము:— ''సత్త్వం రజస్తమః" అను మొదలగువానిచే సత్త్వరజస్తమోగుణములు జ్ఞానమును, తత్ఫల మగు మోక్షమును ప్రతిబంధించున వగుటచే నవి జ్ఞానిచే విడువదగినవి. వానియొక్క స్వరూపమును, వాని కార్యమును, ఈగుణములు కలవారికి కలుగుఫలమును, గుణాతిక్రమణము చేసినవాని లక్షణమునుఫలమును లెస్సగప్రతిపాదించియధ్యాయాంతమున వివేచనజేయు నిచ్ఛతో "మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే'' అని బ్రహ్మానుసంధానమునే గుణాతిక్రమణసాధనముగా చెప్పియుండెను. ఆ గుణము లెన్ని ? ముముక్షు వగు పురుషున కెట్టి బ్రహ్మము అనుసంధాతవ్యము? ఆబ్రహ్మానుసంధాన మెట్టిది? అను యాకాంక్షపై క్షరాఽక్షరవిలక్షణ మైన పురుషోత్తమాఖ్యమగు బ్రహ్మమును, తదనుసంధానమును, ఈయనుసంధానమునందు మహాత్ము లగువారి ప్రవృత్తిని, దానిఫలమును ప్రతిపాదించుటకై యీపంచదశాధ్యాయము ప్రారంభింపబడుచున్నది:— అందు ముందుగ ముముక్షువునకు సంసారమునందు జుగుప్స, వైరాగ్యము, సంన్యాసము మొదలగు మోక్షసాధనములు సిద్ధించుటకై సంసారమును వృక్షముగా శ్రీకృష్ణభగవానులు వర్ణించుచుండెను:— "ఊర్ధ్వమూలం-ఊర్ధ్వ'' పరబ్రహ్మము అవ్యక్తమహదాదులకంటెనుకూడ పరమమహత్తు, అతిసూక్ష్మము, ప్రకాశకము, సర్వాస్పదము, సర్వవ్యాపకము, సర్వకారణము నగుట సర్వోత్తమము. అట్లగుట నూర్ధ్వశబ్దముచే వ్యపదిష్టమగును, ఊర్ధ్వమన నున్నతము, ఉత్కృష్టతమము నని యర్థము. ఇట్టి బ్రహ్మమే మాయాశబలమై "మూలం" బీజముగా గలది సంసారవృక్షము. ఈవిషయము "ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థ స్సనాతనః'' "ఊర్ధ్వ మూలమవాక్శాఖం వృక్షం యో వేద సంప్రతి" అను శ్రుతిప్రసిద్ధము. వటబీజమెట్లు అవ్యక్తము, అతిసూక్ష్మము, అవిజ్ఞేయము, అపారశక్తిసంపన్నము నగునో యట్లే జగద్బీజము, అవ్యక్తమునగు బ్రహ్మముఅతిసూక్ష్మము, అవిజ్ఞేయసారము, అపారశక్తిసంపన్నము నగుచున్నది. కనుకనే యీసంసారవృక్షము అతివిస్తృతము, అతివిచిత్రతరము వగుచున్నది. "అధశ్శాఖం" — "అవ్యక్తా న్మహత్, మహతోఽహంకారః, అహంకారాత్పంచతన్మాత్రాణి. పంచతన్మాత్రేభ్యః పంచమహాభూతాని'' (అవ్యక్తమునుండిమహత్తుదానినుండిఅహంకారము,దానినుండిపంచతన్మాత్రలు,వానినుండిపంచమహాభూత

శాంకరభాష్యమ్ :—

సంసారవృక్షస్య పర్ణానీవ పర్ణాని । యథా వృక్షస్య పరిరక్షణార్థాని పర్ణాని తథా వేదాః సంసార వృక్షపరిరక్షణార్థా ధర్మాధర్మతద్ధేతుఫలప్రకాశనార్థత్వాత్ । యథావ్యాఖ్యాతం సంసారవృక్షం సమూలం యస్తం వేద స వేదవిద్వేదార్థవిదిత్యర్థః । నహి సంసారవృక్షా దస్మా త్సమూలా జ్జ్ఞేయోఽన్యోఽణుమాత్రోఽప్యవశిష్టోఽస్త్యతః సర్వజ్ఞః స యో వేదార్థ విదితి సమూలవృక్ష జ్ఞానం స్తౌతి ॥ ॥౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—

ణము. ఆచ్ఛాదనమువలన ఋగ్యజుస్సామరూపమైన పర్ణములువలె పర్ణములు యీసంసారవృక్ష మునకో, ఎట్లు పర్ణములు వృక్షముయొక్క పరిరక్షణార్థమో అట్లే వేదములున్ను ధర్మాధర్మ తద్ధేతుఫలప్రకాశనార్థ మగుటవలన సంసారవృక్షపరిరక్షణార్థము లగుచున్నవి. వ్యాఖ్యానింపబడినతీరున నిట్టి సమూలసంసారవృక్షమును యెవడు తెలిసికొనునో వాడు వేదా ర్థమును తెలిసికొననివాడు. ఈసమూలవృక్షముకంటె వేరుగ తెలిసికొనదగినది యణుమాత్ర ముకూడ నవశిష్టము లేదు. కాన నెవడు వేదార్థమును తెలిసికొనునో వాడు సర్వజ్ఞుడు అని సమూలవృక్షజ్ఞానమును స్తుతించుచుండెను. ॥౧॥

ములు జనించుచున్నవి.) అను శ్రుతి ననుసరించి మహదాదిసర్వవికారములు ప్రకృతికంటె క్రిందుపేగాననివి యధశ్శబ్దముచే చెప్పబడును. అధశ్శబ్దవాచ్యము లగు మహదాదులు శాఖలుగా కలది యీసంసారవృక్షము. అందు మహత్తు అంకురరూపము. అహంకారము స్కంధరూపము. పంచతన్మాత్రలు శాఖములు. పంచమహా భూతము లుపశాఖములు, అని తెలిసికొనదగును. అట్టి సంసారవృక్షము "అశ్వత్థం- శ్వో న తిష్ఠతీ త్యశ్వత్థః" (రేపుండునదికాదు గాన యశ్వత్థము.) అను వ్యుత్పత్తి ననుసరించి క్షణభంగురము. ఇట్టి సంసారాశ్వత్థవృక్షమును "అవ్యయం ప్రాహుః" ప్రరోచనోక్తి మోహితు లగు మీమాంసకులు "న కదాచి దనీదృశం జగత్" అని నిత్యమునుగా చెప్పుచుండిరి. అట్టి సంసారవృక్షమునకు 'ఛందాంసి' అనిత్యత్వ, దుఃఖరూపత్వ, వ్యామోహకత్వ, అనర్థకారిత్వాదిదోషజాతమును ఆచ్ఛాదించునవిగాన "ధృవా ద్యౌర్ధ్రువా పృథివీ దక్షిణావంతోఽమృతత్వం భజంతే : స్వర్గే లోకే న భయం కించ నాస్తి : స్వర్గలోకామృతత్వం భజంతే, ఏష వః పుణ్యః, సుకృతో లోకః" ఇత్యాదిప్రరోచనావాక్యములచే యథార్థమును కప్పిపుచ్చి సంసార మును రక్షించుచున్నవి. కాన ఋగ్యజుస్సామములు ఈసంసారవృక్షమునకు "పర్ణాని" పత్రములై యున్నవి. (అనగా నెట్లు లోకమున పర్ణములు వృక్షదోషము నాచ్ఛాదించి రక్షించుచున్నవో యట్లే పురాణేతిహాసాదు లతోగూడ వేదములు, కర్మ, ఉపాసన, యోగ, ఆగమ, తంత్రక్రియాపరములై కర్మ, తత్సాధన, తత్ఫలము లను, ప్రకాశింపజేసి, అనిత్యత్వ, దుఃఖరూపత్వాదిదోషముల నాచ్ఛాదించుచున్నవై యీసంసారవృక్షమును వృద్ధిబొందించుచున్న వని యర్థము.) వేదములు పత్రములుగా గలదియు. ధర్మాధర్మములు పుష్పములుగా గలదియు, జన్మమరణాదిదుఃఖమే ఫలముగా కలదియు నగు నీసంసారవృక్షమును సమూలముగా నెవడు తెలిసికొనునో "స వేదవిత్" వాడే వేదార్థమును తెలిసినవా డగును.

అనృతము, జడము, దుఃఖరూపము, స్వగుణములచే వ్యామోహక మగుట జన్మాద్యనర్థహేతువు నగు సంసారవృక్షమును తెలిసికొనినచో వేదార్థవేత్త యెట్లగు నందువా? చెప్పెద వినుము:— ఏబీజమునుండి

గీ॥ అధ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయప్రవాలాః ।
అధ శ్చ మూలా న్యనుసన్తతాని కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥ ॥౨॥

పదవిభాగము :— అధః- చ- ఊర్ధ్వం- ప్రసృతాః-తస్య- శాఖాః- గుణప్రవృద్ధాః- విషయప్రవాలాః- అధః- చ- మూలాని- అనుసన్తతాని- కర్మానుబన్ధీని- మనుష్యలోకే ॥ ॥౨॥

ప్రతిపదార్థము :— తస్య= ఆసంసారవృక్షమునకు; శాఖాః=శాఖలు (కొమ్మలు): అధః=క్రిందునకు; ఊర్ధ్వంచ=మీదునకు; ప్రసృతాః=వ్యాపించినవి; (ఆశాఖలు) గుణప్రవృద్ధాః= గుణ=సత్త్వరజస్తమోగుణములచే; ప్రవృద్ధాః=వృద్ధిపొందినవి; (మరియు) విషయప్రవాలాః=విషయ=శబ్దస్పర్శరూపరసగంధము లనెడి; ప్రవాలాః=చిగురుటాకులు కలవి; అధశ్చ=క్రిందుగ; మనుష్యలోకే=మనుష్యలోకమునందు; కర్మానుబన్ధీని=ధర్మాధర్మరూపమైన కర్మయే అనుబంధముగాగల; మూలాని=మూలములు (వేళ్లు) అనుసంతతాని=అనుప్రవిష్టములు. ॥౨॥

శాంకరభాష్యమ్ :—

తస్యైవ సంసారవృక్షస్యాపరాఽవయవకల్పనోచ్యతే— అధో మనుష్యాదిభ్యో యావత్స్థావర మూర్ధ్వం చ యావ ద్బ్రహ్మ విశ్వసృజో ధర్మ ఇత్యేతదన్తం యథాకర్మ యథాశ్రుతం జ్ఞానకర్మఫలాని తస్య వృక్షస్య శాఖాఇవ శాఖాః ప్రసృతాః ప్రగతా గుణప్రవృద్ధా గుణైః సత్త్వరజస్తమోభిః ప్రవృద్ధాః స్థూలీకృతా ఉపాదానభూతై ర్విషయ

శాంకరభాష్యతత్త్వబోధిని :—

ఆసంసారవృక్షమునకే మరియొక విధమున అవయవకల్పనము చెప్పబడుచుండెను. —
మనుష్యాదులు మొదలుకొని స్థావరాంతమువరకు అధోభాగ మనబడును. మనుష్యాదులు మొదలుకొని హిరణ్యగర్భలోక మగు సత్యలోక పర్యంతము ఊర్ధ్వ మనబడును. ఇట్టి

పుట్టినవృక్షము ఆబీజరసముకలదే యగుచున్నది. తిక్త (చేదు) రసముకల వేపగింజనుండి యుత్పన్నమైన వేపచెట్టు తిక్తరసము కలదియే యగుచున్నది. ఈన్యాయమే యంతటను ప్రసిద్ధము. పై విధముగనే చిదేకరసస్వరూప మగు బ్రహ్మబీజమునుండి యుత్పన్నమైన సంసారవృక్షము చిద్రసము కలదియే యగును; కావున "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాది శ్రుతులచేతను, "సంసారవృక్షము స్వబీజరసాత్మకమే యగుచున్నది. వృక్షమగుటవలన;నింబవృక్షమువలె" అనుమొదలగుయుక్తులచేతను, స్వానుభవముచేతను యీసంసారవృక్షము చిదేకరసస్వరూప మగు కారణబ్రహ్మమాత్రముగనే యేశుద్ధాంతఃకరణు డగు పండితుడు తెలిసికొనునో అట్టివాడు వేదార్థవేత్తయే యగును. "సర్వే వేదా యత్పద మామనంతి" అను శ్రుత్యుక్తరీతిని సర్వవేదార్థము బ్రహ్మమే యగును. కాన యట్టి వేదార్థవేత్త బ్రహ్మవేత్తయే యగును. "కస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" అను శ్రుత్యుక్తరీతిని యట్టివాడు సర్వజ్ఞుడే యగును. అట్టి సర్వజ్ఞుని కర్తవ్యమును గూడ "స సర్వవి ద్భజతి మాం" అని ముందు చెప్పగలడు. కనుక కారణవిజ్ఞానముచే గార్యమగు సంసారవృక్షము కారణమాత్రస్వరూపమే యని తెలియబడును. కానవిద్వాంసునకు (బ్రహ్మవేత్తకు) వేదార్థవిత్త్వము సిద్ధించుచున్న దని యర్థము. ॥౧॥

—: ౧౫వ అధ్యాయము ౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూధనసరస్వతీయము :— ఆసంసారవృక్షముయొక్క అవయవములకు సంబంధించి

శాంకరభాష్యమ్ —

ప్రవాలా విషయాః శబ్దాదయః ప్రవాలా ఇవ దేహాదికర్మఫలేభ్యః శాఖాభ్యోఽంకురీభవన్తీవ. తేన విషయప్రవాలాః శాఖాః। సంసారవృక్షస్య పరమమూల ముపాదానం కారణం పూర్వ ముక్త మథేదానీం కర్మఫలజనితరాగద్వేషాదివాసనామూలానీవ ధర్మాధర్మప్రవృత్తికారణా

శాంకరభాష్యతత్త్వబోధిని :—

అధఃప్రదేశము మొదలుకొని ఊర్ధ్వప్రదేశ మగు సత్యలోకపర్యంతము "యథాకర్మ" ఆయా ప్రాణులు చేసుకొనిన కర్మల నతిక్రమింపకుండగ "యథాశ్రుతం" ఆయాప్రాణుల జ్ఞానము నతిక్రమింపకుండగ యే యె జ్ఞానకర్మఫలములు కలవో ఆయాజ్ఞానకర్మఫలములే యాసంసార వృక్షమునకు శాఖలువలె వ్యాప్తములైనవి. ఈశాఖలు ఉపాదానభూతమైన సత్త్వరజస్తమో గుణములచే స్థూలీకృతములు(వృద్ధిపొందింపబడినవి) స్పర్శరూపరసగంధములనెడుచిగురుటాకు లువలె దేహాదికర్మఫలములైన శాఖలువలన మొలకెత్తుచున్నవి. కాన శాఖలు విషయము లనెడి ప్రవాళములు కలవి. సంసారవృక్షమునకు పరమమూలము, ఉపాదాన కారణము

మరియొక రూపకల్పనను చేయుచుండెను:— పూర్వశ్లోకమున కార్యోపాధు లగుహిరణ్యగర్భాదిజీవులు శాఖాస్థానీయులుగా జెప్పబడిరి. ప్రస్తుతము తద్గత మగు విశేషమును జెప్పుచుండెను:— కపూయచరణు (దుష్కృతు) లు "అధః ప్రసృతాః" పశ్వాదియోనులయందు ప్రసరించినవారు (విస్తృతిపొందినవారు) అగుచుండిరి. రమణీయచరణులు (సుకృతులు) "ఊర్ధ్వంప్రసృతాః" దేవాదియోనులయందు ప్రసరించు చుండిరి. కాన నీవిధముగ మనుష్యత్వము మొదలుకొని విరించిపర్యంతము క్రిందుభాగమునను విరించి లోకము మొదలు సత్యలోకపర్యంత మూర్ధ్వభాగమునందును "తస్య శాఖాః ప్రసృతాః" ఆసంసార వృక్షముయొక్క శాఖలు వ్యాపించి యున్నవి. మరియు నా శాఖలు "గుణప్రవృద్ధాః" దేహేంద్రియ విషయాకారముగ పరిణమించిన సత్త్వరజస్తమోగుణములచే ప్రవృద్ధములైనవి. మరియునాశాఖలు "విషయ ప్రవాలాః" శబ్దాదివిషయము లనెడి ప్రవాళములు గలవి. సంసారవృక్షశాఖాగ్రస్థానీయము లగు నింద్రి యప్రవృత్తులతో సంబంధ ముండుటచేతను, రాగాధిష్ఠానము లగుటచేతను, (విషయములు అనురాగాధి ష్ఠానము లగుటచేతను, పల్లవములు రక్తిమకు అధిష్ఠానము లగుటచేతను) విషయములు పల్లవము లనుట తగును. "అధశ్చ....మనుష్యలోకే" క్రిందుగను నూర్ధ్వముగను తత్తద్భోగజనితరాగద్వేషాదివాసనారూపము లగు ధర్మాధర్మప్రవృత్తికారణము లగు అవాంతరమూలములు సంసారవృక్షమునకు అనున్యూతములై యున్నవి. ముఖ్య మగు మూలము బ్రహ్మమేగాన పూర్వోక్తవిషయమునకు విరోధము లేదు. ఈయవాంతర మూలము లెట్టివందువా? "కర్మానుబంధీని మనుష్యలోకే" మనుష్యరూప మగు లోకమునందు ధర్మాధర్మరూప మగు కర్మను జేగూర్చు స్వభావము కలవి. బ్రాహ్మణ్యాదివిశిష్టమైన మనుష్యదేహము కర్మలకధికృత మగును గదా! ॥౨॥

శంకరానందీయము :— పరమేశ్వరానుగ్రహము కల పరిశుద్ధాంతఃకరణునకే కారణజ్ఞాన ముచే గార్యరూప మగు సంసారవృక్షము కారణమాత్రస్వరూపమే యని తెలియబడుటవలన బ్రహ్మవి త్త్వము, విదేహకైవల్యము గూడ సిద్ధించుచున్నవి. ఇక మలినాంతఃకరణుడు సంసారవృక్షస్వరూపమును తెలిసికొని, దానినుండి విరక్తుడగుచో నాతనికి బ్రహ్మజ్ఞానము, మోక్షము సిద్ధించుచున్న వని బోధించుటకై

శాంకరభాష్యమ్:—

న్యవాన్తరభావీని తాన్యధశ్చ దేహాద్యపేక్షయా మూలా న్యనుసంతతా న్యనుప్రవిష్టాని కర్మాను బన్ధీని కర్మ ధర్మాధర్మాలక్షణ మనుబన్ధః పశ్చాద్భావీ యేషా ముద్భూతి మనుభవతీతి తాని కర్మానుబన్ధీని మనుష్యలోకే విశేషతోఽత్ర హి మనుష్యాణాం కర్మాధికారః ప్రసిద్ధః ॥ ॥౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—

"ఊర్ధ్వమూలం" అను శ్లోకమునందు అవ్యక్తమాయాశక్తిమత్తగు బ్రహ్మ మని చెప్పబడెను. ఇపుడు ధర్మాధర్మప్రవృత్తి కారణములైన అవాంతరభావు లగు కర్మఫలజనితమైన రాగద్వేషాది వాసనలే మూలములు వలె ప్రసృతములు కాన నవి దేహాద్యపేక్షచే మూలములుగ ననుప్రవిష్టములు. మరియు, అమూలములు కర్మానుబంధులు. అనగా ధర్మాధర్మ రూపమగు కర్మలే యనుబంధముగా కలవి. అనగా అనంతరభావి యగునట్టి ధర్మాధర్మరూప కర్మఫలముల నుద్భూతిని యనుభవించును. కాన నామూలములు కర్మానుబంధులనబడును. ఇట్టి కర్మాను బంధిత్వమువిశేషముగ ఈమనుష్యలోకమందే కలదు మనుష్యులకు కర్మాధికారముప్రసిద్ధము।౨।

తిరిగి సంసారవృక్షమును వర్ణించుచుండెను:— "సత్య శాఖా అధ శ్చోర్ధ్వం చ ప్రసృతాః" ఆపూర్వోక్త లక్షణలక్షిత మగు సంసారవృక్షముయెక్క ఉపశాఖాస్థానీయము లగు పుణ్యాపాపకర్మఫలభూతము లగు దేహములు మనుష్యాదిస్థావరాంతముక్రిందుగను, మనుష్యాదిబ్రహ్మలోకపర్యంత మూర్ధ్వముగనుప్రసరించి నవి. ఇట నిష్కృష్టాభిప్రాయమిది:— క్షణిక మగు నీదేహము నష్టమగుచో బురుషునకు ముక్తి స్వయముగనే ప్రాప్తించునుగదా! ఇక నిందుకై పురుషప్రయత్న మెందులకు? అని తలువరాదు. ఏమన: పుణ్యపాపరూప ములు, ననంతములు, విచిత్రములు, విచిత్రఫలకములునగు నేయే కర్మలు కలవో యవన్నియు "నాఽభుక్తం క్షీయతే కర్మ" అను న్యాయమున నీ దేహము నష్టమైనను స్థావరాది బ్రహ్మలోకపర్యంతము ఆయాలోకముల యందు బురుషునకు శరీరములను జేగూర్చుచునే యుండును. కనుక పురుషప్రయత్నము లేనిదే ముక్తి స్వయముగ సిద్ధింపనేరదు. ఆయాకర్మలఫలము ననుభవించిన యనంతరమాదేహము లన్నియునశింప, యనంతరము స్వయముగనేముక్తి సంభవించునుగదా! ఇక పుంప్రయత్న మెందులకు? అనియాశంకించెదవా! అట్లును కాదు సర్వదాపౌనఃపున్యముగా చేయబడు కర్మలచేతనే జేకూర్పబడు దేహముల సంఖ్య పెరుగుచుండును. అని సూచించుటకై చెప్పుచుండెను:— సంసారవృక్షమునకు శాఖాస్థానీయము లగు దేహములు "గుణ ప్రవృద్ధాః" సత్త్వాదిగుణవికారము లగు కామ, క్రోధ, లోభాదులచేతను, తత్కారణము లగు పుణ్యాపాపాదులచేతను ప్రవృద్ధములైనవి. (కామాదికము చేతను కర్మాదికముచేతను, పైపైకి ప్రవృద్ధము లగుచున్నవని యర్థము.) అట్లు ప్రవృద్ధము లగుటకు కారణ మేమందువా? ఆ శాఖారూపము లగు దేహములు "విషయ ప్రవాళాః" భోగ్యపదార్థము లగు శబ్దాదివిషయములు శాఖలనుండి పల్లవములవలె నీదేహములనుండి కల్గుచున్నవిగాన నా దే హ ము లు వి ష య ము ల ను ప్రవాళములు కలవి యగుచున్నవి. (అనగా శాఖలు ప్రవాళము లను వలె దేహములు అక్కడక్కడ శబ్ద, స్పర్శ, రూప, రసాదిభోగ్యముల నింద్రియసన్నికర్ష ద్వార మున స్వీకరించుచు, వానియెడ రాగమును, ద్వేషమును, క్రోధమును, లోభమునుపుట్టించి, పౌనఃపున్యముగా కర్మలను జేయించుచున్నవని యర్థము) కామాదికము యొక్కయు, కర్మలయొక్కయు సిద్ధికి కారణమును

గీ॥ న రూప మస్యేహ తథోపలభ్యతే నాన్తో న చాది ర్న చ సంప్రతిష్ఠా ।
అశ్వత్థ మేనం సువిరూఢమూల మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥ ॥౩॥

పదవిభాగము:— న- రూపం- అస్య- ఇహ- తథా- ఉపలభ్యతే-న-అన్తః- చ- ఆదిః- న- చ- సంప్రతిష్ఠా- అశ్వత్థం-ఏనం- సువిరూఢమూలం- అసంగశస్త్రేణ- దృఢేన- ఛిత్త్వా ॥ ॥౩॥

ప్రతిపదార్థము:— ఇహ= ఈశాస్త్రమునందు; అస్య=ఈసంసారవృక్షముయొక్క; రూపం= స్వరూపము=తథా; వర్ణితరీతిని; నోపలభ్యతే=కనబడుటలేదు;అన్తః=అన్తము;నోపలభ్యతే=కనబడుటలేదు; ఆదిః=మొదలు; నచ=కనబడుటలేదు; సంప్రతిష్ఠా=లెస్సగస్థితియు;నచ=కనబడుటలేదు; సువిరూఢమూలం =బాగుగరూఢమైన మొదలుకల; ఏనం=ఈ; అశ్వత్థం=సంసారవృక్షమును; దృఢేన=దృఢమైన; అసంగ శస్త్రేణ=నిస్సంగ మనెడి శస్త్రముచే; ఛిత్త్వా=ఛేదించి ॥

---

చెప్పుచుండెను.— "కర్మానుబంధీని" కామ్యములు, నిత్యములు నైమిత్తికములు, విప్రతిషిద్ధములు నానా విధశరీరారంభకములు నగు నేకర్మలు కలవో అకర్మ లనే స్వోత్పత్త్యనంతరము అనుబంధించుచున్నవి; (చేగూర్చుచున్నవి.) కాన కర్మవాసనలు కర్మానుబంధు లనబడును. అట్టివాసనలు "మూలాని" కామ, కర్మ సముత్పత్తికిమూలములు. (కారణములు.) (అనగావిషయవాసనలు. కర్మవాసనలు సంసారమునకు పూర్వోక్త కారణముకంటె నతిరిక్తములగు నవాంతరకారణము లని పర్యవసితార్థము:) ఆకర్మ.విషయవాసనలు 'అధశ్చ' (ఇది చకార మూర్ధ్వసముచ్చాయకము) అధశ్శరీరము లందును, (హీనలింగశరీరములందును) ఊర్ధ్వ (ఉత్కృష్ట) లింగశరీరములందును "అనుసంతతాని మనుష్యలోకే" ప్రాణికర్మానురూపముగ వ్యాప్తము లగుచున్నవి. ఈవిషయవాసనలు మనుష్యలోకము నందున్న ప్రాణివర్గమునందు (విషయములయెడనంతట కోరికలను కలుగజేయుచు, కర్మలను జేయించుచు, లింగశరీరములయం దెల్లపుడు నివసించుచున్నవి. కాన వాసనలు కోర్కెలను కలిగించును. అవి కర్మలను జేయించును. కర్మలు అంతటను పౌనఃపున్యముగా శరీరములను పుట్టించుచున్నవి. ఈవిధముగా వాసనలచేతను, కామములచేతను, పుణ్యపాపాదికర్మలచేతను శరీరపరంపర యభివృద్ధమగుచున్నది. కాని యొకప్పుడును యాపరంపర విచ్ఛిన్నమగుట లేదు, కాన అట్టి సంసారవృక్షము నధిరోహించినట్టి విషయసుఖాశాపాశబద్ధు లగువారు జననమరణప్రవాహమున బడుదురే కాని, ఏవిధముగను, ఏస్థలమునందును, ఏకాలమునందును ముక్తిని పొందజాల రని యర్థము. (ఈచెప్పుటచే కర్మోపాసనాఫలము లగు స్వర్గ, సత్యలోక, వైకుంఠాదులు. తత్సుఖములు, నివి యనిత్యములు, నసత్యములు నను నిశ్చయబుద్ధితో నుండి ముముక్షు వగువానికి వైరాగ్యసిద్ధికై మాయోపహిత మగుబ్రహ్మమునుండి యుత్ప న్నమైనయీసంసారవృక్షమునకు స్కంధ, శాఖ, ఉపశాఖలుగా వర్ణితములైన మహదాదిమాయాకార్యో పాధిభూతు లగు హిరణ్యగర్భ, విరాట్పురుషులకును, గుణత్రయోపాధికులగు బ్రహ్మవిష్ణ్వాదులకును, ఇంద్రా దులకును, మాయికత్వము, ననిత్యత్వము సూచితమయ్యెను. మరియుకర్మ, ఉపాస్తి, తత్సాధన,తత్ఫలములను ప్రతిపాదించు వేదములు సంసారవృక్షమునకు పర్ణములుగా వర్ణింపబడుటచే నవి వటాశ్వత్థపర్ణములవలె నిష్ప్రయోజనములు గాన నుపేక్ష్యము లనీ సూచింపబడెను. ॥౨॥

—♦ ౧౩వ అధ్యాయము ౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— "న రూప....సంప్రతిష్ఠా", ఈ వర్ణితమైన సంసారము నందున్న ప్రాణులచే యథా వర్ణితమైన యూర్ధ్వమూలత్వాదిరూపమున నున్న రూపము సంసారవృక్షమునకు

శాంకరభాష్యమ్:—

యస్త్వయం వర్ణిత స్సంసారవృక్షః— న రూప మస్యేహ యథా వర్ణితం తథా నైవోపలభ్యతే స్వప్నమరీచ్యుదకమాయాగంధర్వనగరసమత్వా ద్దృష్టనష్టస్వరూపోహిన ఇత్యత ఏవ నాంతో న పర్యంతో నిష్ఠా సమాప్తి ర్వా విద్యతే। తథా న చాఽఽది రిత ఆరభ్యాయం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏ ఈ వర్ణితమైన సంసారవృక్షము కలదో దానియొక్క స్వరూపము యెట్లు వర్ణితమో అట్లు కనబడుటలేదు. స్వప్న, మరీచ్యుదక, మాయాగంధర్వనగరసమానమగుటవలన యీసంసారవృక్షము దృష్టనష్టస్వరూపము కలది. అందువలననే యీ సంసారవృక్షమునకు అంతముకాని

కన్పట్టుట లేదు. స్వప్న, మరీచ్యుదక, మాయాగంధర్వనగరాదులువలె మిథ్యారూపము గాన దృష్టనష్ట స్వరూపము కలదగుటచే సంసారవృక్షముయొక్క స్వరూపము కన్పట్టుట లేదని యాశయము. కనుకనే యాసంసారవృక్షమున కంతమున్ను కన్పట్టుట లేదు. కారణ మేమందువా? ఇంతకాలమున కిది నశించు నను పర్యంతము లేనిది. ఇప్పటినుండి యిది ప్రస్సృష్ట మయ్యెనను ఆదియు లేనిది. ఈసంసారవృక్షము ఆద్యంతములులేనిదగుట మధ్యావస్థయు కన్పట్టుటలేదు. కనుక నీసంసారవృక్షము దురుచ్ఛేదము; సర్వానర్థకరము నగుచున్నది. కనుక అనాద్యజ్ఞానముచే నత్యంతము రూఢమైన మూలము కలది. ప్రాగుక్త మగునిట్టి సంసారాశ్వత్థమును "అసంగశస్త్రేణ" సంగవిరోధి యగు పుత్రవిత్తలోకైషణాత్యాగరూపమగు వైరాగ్యము అసంగ మనబడును. అట్టి అసంగము రాగ, ద్వేష మయ సంసార విరోధి యగుట శస్త్ర మన దగును, అయ్యది పరమాత్మజ్ఞానౌత్సుక్యముచే దృఢమైన దగును. వివేకాభ్యాసముచే నిశితమయిన దగును. అట్టి యసంగశస్త్రముచే ఛేదించి అనగా సమూలోచ్ఛేదమును జేసి (వైరాగ్యశమదమాదిసంపత్తిచే సర్వకర్మ సంన్యాసము నొనరించి) అని ముందు శ్లోకముతో నన్వయము. ।౩॥

శంకరానందీయము:— లోకసామాన్యముగ జూచినచో సర్వవేదముల నధ్యయన మొనరించి యందలి యర్థమును గ్రహించిన పురుషులు పండితులయ్యును అవిద్యాకామపరతంత్రులై, ప్రరోచనోక్తులచే బ్రలోభితులై సంసారవృక్షఫలము లగు దృష్టాదృష్టము లగు స్వర్గాదులయందును, తత్సుఖములయందును, రమ్యత్వబుద్ధిచేతను, నిత్యత్వబుద్ధిచేతను మోహితులై, యితరులను భ్రమింపజేయుచు స్వయముగ భ్రమపడు చుండిరి. అట్లయ్యును ఆలోచించినచో వారిలో సూక్ష్మబుద్ధికల యుక్కొక్కడు నిత్యానిత్యవివేకవంతుడై, శుద్ధాత్ముడై, ముముక్షు వగుచుండును. అట్లగుట "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే, । శ్వోభావా మర్త్యస్యయదంతకైతత్ । శ్రేయశ్చ ప్రేయశ్చమనుష్య మేతస్తౌ సంపరీత్య వివినక్తి ధీరః" ఇత్యాది శ్రుతులచేతను, "ఈసర్వము మిథ్య, మాయా కార్యమగుటచే ఇంద్రజాలాదికము వలె'' అనుయనుమానరచనచేతను, సదసద్విచారణము చేసి, దానిచే జనించిన వైరాగ్యమను ఖడ్గముచే, సంసారవృక్షమును ఛేదించి, సర్వమును సంన్యసించి, మోక్షమునకై ప్రయత్నింప దగు నని రెండుశ్లోకములచే బోధించుచుండెను:— సంసారవృక్షము పామరదృష్టిచే బూర్వోక్తరీతిని విశిష్టవర్ణ, పుష్ప, ఫలాదులు కలదగుటచే రమణీయ మగుట నాశ్రయింపదగినదనియే తోచును. అట్లయ్యును సూక్ష్మబుద్ధి కల పండితు లీవిషయమై యాలోచించినచో "ధ్రువా ద్యౌః ధ్రువా పృథివీ" అనియు, "స్వర్గలోకా అమృతత్వం భజంతే" అను మొదలగు ప్రరోచనా శ్రుతులచే యథారూపమగు స్వరూపము నిత్యముగను, సుఖరూపముగను వర్ణింపబడినను, ఆవిధముగ

**శాంకరభాష్యమ్:—**

ప్రవృత్త ఇతి న కేన చిద్గమ్యతే । న చ సంప్రతిష్ఠా స్థితి ర్మధ్య మస్య న కేనచి దుపలభ్యతే।
అశ్వత్థ మేనం యథోక్తం సువిరూఢమూలం సుష్ఠు విరూఢాని విరోహం గతాని మూలాని
యస్య త మేవం సువిరూఢమూల మసంగశస్త్రే ణాసంగః పుత్రవిత్తలోకైషణాదిభ్యో

**శాంకరభాష్యతత్త్వబోధిని :—**

అనగా యింతవర కిది యుండును. అని కాని, సమాప్తి కాని లేదు. అట్లే అది లేనిది. అనగా
ఇది లగాయితు ఇది ప్రవృత్త మని యెవనిచేతను తెలిసికొనుటకు శక్యముకానిది. మధ్య
మావస్థ స్థితి. అదియు నెవనిచేతను తెలిసికొనుటకు శక్యముకాదు. యథోక్తమైన, లెస్సగ

కన్పట్టుటలేదు. "ధ్రువా ద్యౌః" అను స్థలమున యంతరిక్షాదికము నిత్య మని శ్రూయమాణ మగుచున్నదికదా?
నిత్యత్వ మెందుల కుపలబ్ధము కాదు. అని శంకించెదవా? అట్లు కాదు. ఇట నున్న "ధ్రువేణ హవిషా"
అను వాక్యశేషముచే క్షణికమగు హవిస్సుగూడ ధ్రువమనియే తెలియబడుచున్నది. ఆన్యాయముచేతనే యంతరి
క్షాదికమునకుగూడ ధ్రువత్వము ఔపచారిక మని తెలియబడుచున్నది. "య త్సావయవం త దనిత్యం" అను
యుక్తిబలముచేతను "త్రయ మప్యేత త్సుషుప్తం స్వప్నం మాయామాత్రం" అనియు, "యథా స్వప్న
ప్రపంచోఽయం" అను మొదలగు శ్రుతిస్మృతిన్యాయములచేతను సంసారవృక్షము స్వాప్నికపదార్థము
వలె ననియత మగు సత్త కలదికనుకను, జ్ఞేయ మగుటవలనను, జన్మలయాదికము కలదగుటవలనను, ప్రత్యక్ష
ముగా నుపలభ్యమాన మగు సంసారము నిత్యము, సుఖరూపము నగుట యప్రామాణిక మని యర్థము,
(ఈ చెప్పుటచే స్వర్గాదికము నిత్యము, నిత్యసుఖము కలది అనుకొనుట బుద్ధిభ్రమమూలక మని సిద్ధించినది).
సంసారవృక్షము దుఃఖరూపము, ననిత్యము నను నిశ్చయమే యున్నచో నట్టి సంసారము మేఘాచ్ఛాదనచే
నేర్పడిన నీడవలె క్షణికమే గాన నది తొలగగనే సుఖము ననుభవింపవచ్చునుగదా? అని యాశంకించెదవా?
అట్లుకాదు; "నాఽన్తో నచాది ర్నచ సంప్రతిష్ఠా" ఈసంసారవృక్షము జననమరణప్రవాహరూపమున
సంతతము ప్రవర్తించుచుండుటచే నీసంసారప్రవృత్తికి ఆదికనబడకున్నది. అవిద్యయొక్కయు, తత్కార్యమగు
సంసారముయొక్కయు ప్రవృత్తి ఆదిలేని దని యర్థము. కకనే ప్రతిష్ఠ (మధ్యస్థితియు) కన్పట్టుటలేదు.
ఇది దీని కాది యనియు, నిది మధ్యమనియు తెలిసికొనుటకు శక్యము కానిదని యర్థము. అట్లె యీసంసార
వృక్షమున కంతము (పర్యవసానము) గూడ కన్పట్టుటలేదు. (ఇది యిక్కడకు సమాప్తమైన దని సమా
గూడ తెలియబడుట లేదని యర్థము). అట్లగుట సదసద్వివేకి యగు ముముక్షువేమి చేయదగునందువా? "శ్వః
కార్య మద్య కర్తవ్యం" అను న్యాయము ననుసరించి సర్వమును సంన్యసించి, మోక్షమునకై ప్రయత్నింప
దగును. ఈవిషయమునే బోధించుచుండెను:— "అశ్వత్థ...ఛిత్వా" అనేకజన్మారాధితేశ్వరానుగ్రహము
గల ముముక్షు వగు విద్వాంసుడు అసంగ (విరాగ) మనెడు శస్త్రముచే ("సజ్జతే విషయే ష్వనేనేతి
సంగో వైషయికో రాగః తదభావో విరాగః" దేనిచే విషయములయందు సక్తి కలవాడగునో యట్టి వైషయికరాగము
సంగ మనబడును. తదభావము అసంగ మనబడును. ఇదియే విరాగ మనబడును. తీవ్రమోక్షేచ్ఛచేతను, సదసద్వి
వేకవిజ్ఞానముచేతను సముత్పన్నమైన యావైరాగ్య మను శస్త్రము పునఃపునః విషయములయందు దోషాను
దర్శనముచేతను, విషయములయెడనివి బంధకములను జ్ఞానముచే జనించిన భయముచేతను, తీవ్రమోక్షేచ్ఛ
చేనైన వివేకబలముచేతను దృఢతమమైన దగును. అట్టి దృఢాసంగశస్త్రముచే సంసార మనెడు అశ్వత్థమును
ఛేదించి (అనగా సంసారాశ్వత్థవృక్షము అత్యంతము ఏరండతైలలిప్తపాత్రమువలె నంతటను విశేషముగా

శాంకరభాష్యమ్ :—

వ్యుత్థానం తేనాఽసంగశస్త్రేణ దృఢేన పరమాత్మాభిముఖ్యనిశ్చయదృఢీకృతేన పునః పున ర్వివేకాభ్యాసాశ్మనిశితేన ఛిత్వా సంసారవృక్షం సబీజ ముద్ధృత్య ॥ ॥౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—

నాటుకుపోయిన వేళ్ళుకల యీసంసారవృక్షమును (పుత్రవిత్తలోకేషణాదులనుండి వ్యుత్థాన మసంగము) అట్టి దృఢమైన యసంగశస్త్రముచే సబీజముగ పెల్లగించి ॥౩॥

వ్యాపములైన వివిధవిషయవాసనాజాలము లను మూలములు గలది. అనేక కోటిబ్రహ్మకల్పానుస్యూత నానావిధవాసనాపటలజటిల మగు నీసంసారమును సమూలముగ ఛేదించి (పుత్రైషణాదిసర్వేషణలను వీడి సర్వకర్మలను సంన్యసించి) ముందున కన్వయము. ॥౩॥

నీలకంఠీయము :— ఈసంసారము "శ్వోపి స్థాతు మనర్హో౽శ్వత్థో౽వ్యయశ్చ" (రేపు ఉండుట కనర్హమైనదిగాన) యశ్వత్థము. మరియు నవ్యయము నగు నని చెప్పినచో నది ప్రతిక్షణవినాశియగు విజ్ఞానసంతానరూపమా! లేక, వ్రీహ్యాదికమువలె నిత్యమా! అట్లగుచో వాసనలు, కర్మలు బీజాంకురన్యాయమున నన్యోన్యజన్మహేతువు లగుటచే నవర్జనీయము లగునుగాన సంసారము దురుచ్ఛేద మగునుకదా! అను నాశంకపై యాసంసారము సత్త్వాఽసత్త్వములచే ననిర్వచనీయ మను పక్షము నాశ్రయించి పై యాశంకను పరిహరించుచుండెను! — "న రూప మస్యేహ" రజ్జూరగమువలె నీసంసారముయొక్క రూపము దేహజీవదశయందే లెస్సగ జూడబడుచున్నను నుపలబ్ధ మగుటలేదు. అజ్ఞానదశయం దెట్లుపలబ్ధ మగునో యట్లు జ్ఞానదశయం దుపలబ్ధ మగుట లేదని భావము. అందుచే నీసంసారవృక్షము మృషారూప మని యనుభవైకవేద్య మగుచున్నది: (ఈచెప్పుటచే ననుపలబ్ధ మగు రూపముకల దని చెప్పుటచే) స్వప్రకాశము లగు విజ్ఞానములయొక్కయు, రూపవత్తు లగు బీజములయొక్కయు సాదృశ్యము వ్యావృత్తమయ్యెను. అట్లగుట నీసంసారము, శశవిషాణమువలె తుచ్ఛమే (అప్రసిద్ధమే) అగును కాదా? అను నాశంకపై జెప్పుచుండెను— "నాంతో న చాదిః" ఈసంసారమున కుపాదానకారణ మగు నవిద్య యాద్యంతములు లేనిదిగాన సంసారముగూడ నాద్యంతరహిత మని యర్థము, అట్లగుచో నీసంసార మపరిహార్యమే యగునుకదా! తద్విముక్తికి ప్రయత్న మెందులకు! అని ప్రశ్నించెదవా! "న చ సంప్రతిష్ఠా" ఈసంసారవృక్షమునకు సాధారణ వృక్షమునకు భూమివలె లయస్థాన మేమియు లేదు. పరబ్రహ్మమునకు ఈసంసారము వికృతిరూపము గాదు. అట్లే యగుచో నీసంసారమునకు లయస్థానము పరబ్రహ్మమని చెప్పుట సంగత మగును. కాన దీనికి లయస్థాన మేమియు నుపలబ్ధ మగుటలేదు. సంసారము బ్రహ్మవికారమే యని యంగీకరించుదమన్న బ్రహ్మమునకు గూటస్థత్వము లేకపోవలసివచ్చును. ఇక నేమన తుచ్ఛ మగు నజ్ఞానమే యీసంసారమున కుపాదాన మగును. జ్ఞానముచే నాయజ్ఞానము నశించినచో సమూలము నీసంసారము నశించును. అజ్ఞానము తుచ్ఛమనుటలో "తుచ్ఛేనాభ్వపిహితం యదాసీత్" అను శ్రుతి ప్రమాణము. అజ్ఞానకార్య మగు రజ్జూరగము నశింపగనే యాయజ్ఞానముగూడ నుపలబ్ధ మగుటలేదు. ఈయనుభవముచేగూడ నజ్ఞానము తుచ్ఛ మని సిద్ధించుచున్నది. కాన నీసంసారమునకు ప్రతిష్ఠ (లయస్థానము)ఉపలబ్ధ మగుటలేదని చెప్పుట యుక్తమే. ఇట్టి యీసంసారాశ్వత్థము వాసనలను దృఢతరమూలములుగలది. ఈసంసారమును అసంగశస్త్రముచే (అనగా దేహతాదాత్మ్యబుద్ధి సంగ మనబడును. దానిని విడచుట యసంగ మగును.) దృఢమగు నట్టి యసంగశస్త్రముచే ఛేదించి, "తతః పదం తత్పరిమార్గితవ్యం" అను ముందుదానితో సంబంధము)- స్థూలసూక్ష్మసంస్కారములతో (శరీరములతో) నీసంగముసుషుప్త్యవస్థయందుస్వయముగ నేకగ్గుచున్నది. అందుచే

గీ॥ తతః పదం త త్పరిమార్గితవ్యం, యస్మి న్గతా న నివర్త న్తి భూయః।
త మేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥

పదవిభాగము:— తతః- పదం- తత్- పరిమార్గితవ్యం- యస్మిన్- గతాః- న- నివర్తన్తి- భూయః- తం- ఏవ- చ- ఆద్యం- పురుషం- ప్రపద్యే- యతః- ప్రవృత్తిః- ప్రసృతా- పురాణీ॥ ॥౪॥

ప్రతిపదార్థము:— తతః=దృఢమైన యసంగశస్త్రముచే సంసారవృక్షమును ఛేదించినపిమ్మట; తత్=ఆ; పదం=వైష్ణవసానము; పరిమార్గితవ్యం=వెతుకదగినది; యస్మిన్=ఏ వైష్ణవపదమునందు; గతాః=ప్రవేశించినవారై సంసారమునుగూర్చి; ననివర్తన్తే=తిరిగి రారో; తమేవచ=ఆ పదశబ్దవాచ్యమైన; ఆద్యం_మొదటిదియైన; పురుషం=పురుషుని; ప్రపద్యే=శరణుపొందుచున్నాను; యతః = ఏ పురుషునివలన; పురాణీ=చిరంతనమైన; ప్రవృత్తిః=సంసారమాయావృక్షప్రవృత్తి; ప్రసృతా=నిస్సృతమో. బయలువెడలెనో; ॥౪॥

శాంకరభాష్యమ్ :—

తత ఇతి। తతః పశ్చా త్పదం వైష్ణవం త త్పరిమార్గితవ్యం పరిమార్గణ మన్వేషణం జ్ఞాతవ్య మిత్యర్థః। యస్మిన్పదే గతాః ప్రవిష్టా న నివర్తంతి నాఽఽవర్తంతే భూయః పున స్సంసారాయ। కథం పరిమార్గితవ్య మిత్యాహ। త మేవ చ యః పదశబ్దే నోక్త ఆద్యమాదౌ భవం పురుషం ప్రపద్య ఇత్యేవం పరిమార్గితవ్యం తచ్ఛరణతయే త్యర్థః। కోఽసౌ పురుష ఇత్యుచ్యతే- యతో యస్మాత్పురుషా త్సంసారమాయావృక్షప్రవృత్తిః ప్రసృతా నిసృతైంద్రజాలికాదివ మాయా పురాణీ చిరంతనీ॥ ॥౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—

ఏపురుషుని వలన చిరంతనమైన సంసారమాయాప్రవృత్తి ఐన్ద్రజాలకునివలన మాయవలెప్రవృత్తమో, ఏవైష్ణవపదమునందు ప్రవిష్టులై తిగ్గి సంసారమునం దావర్తులు కారో, పదశబ్దముచే చెప్పబడు నట్టి యాద్యమైన పురుషుని శరణు పొందుచుంటినను దృఢమైన యసంగశస్త్రముచే సంసారవృక్షమును ఛేదించి ఆవైష్ణవపదము అన్వేషింపదగినది. తెలిసికొనదగినది.

---

దన్మూలము లగు వాసనలతోగూడ నాత్మ కసంగ మూహింపబడుచున్నది. అల్లైనను వాసనామూల మగు నజ్ఞానమునకు అజ్ఞానముచే నుచ్ఛేదము సంభవింపమిగాన నసంగజ్ఞానము దృఢము కానేరదు. కాన నిర్వికల్పకసమాధ్యభ్యాసచే కారణ (లింగ) శరీరమునకుగూడ నసంగము సాధింపవలసియున్నది. అట్టి యసంగశస్త్రముచే నీసంసారమునకు మూలోచ్ఛేదము (లవణోదకమువలెగాని. రజ్జూరగమువలెగాని ప్రవిలాపనరూపము) చేయదగును. ఇంతియేగాని సాంఖ్యులకువలె స్వరూపముతోనున్నదానియొక్క పరివర్జనమిట యసంగచ్ఛేద మర్థము గాదు. ॥౩॥

—♦ ౧౫వ అధ్యాయము ౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము :— పూర్వోక్తసంసారవృక్షము నసంగశస్త్రముచే ఛేదించి, సద్గురువును జేరి యా యశ్వత్థమున నూర్ధ్వమున నున్న యావైష్ణవస్థానము వేదాంతవాక్యవిచారణచే వెదుకదగి

గీ॥ నిర్మానమోహా జితసంగదోషా, అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।
ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞై, ర్గచ్ఛన్త్యమూఢాః పద మవ్యయం తత్ ॥౫॥

పదవిభాగము :— నిర్మానమోహాః- జితసంగదోషాః- అధ్యాత్మనిత్యాః- వినివృత్తకామాః- ద్వంద్వైః- విముక్తాః- సుఖదుఃఖసంజ్ఞైః- గచ్ఛన్తి- అమూఢాః- పదం- అవ్యయం- తత్ ॥ ॥౫॥

ప్రతిపదార్థము :— నిర్మానమోహాః=పోయిన మానమోహములు కలిగినట్టిన్ని; జితసంగదోషాః=జయించబడిన సంగమనెడి దోషము కలిగినట్టిన్ని; అధ్యాత్మనిత్యాః=పరమాత్మస్వరూపాలోచనతత్పరులైనట్టిన్ని; వినివృత్తకామాః=మరలిపోయినకామములు కలిగినట్టిన్ని; యతయః=(ఈపదమధ్యాహార్యము) సంన్యాసులు; సుఖదుఃఖసంజ్ఞైః=సుఖదుఃఖములనెడి సంజ్ఞకల; ద్వంద్వైః=ద్వంద్వములతో; విముక్తాః=విడువబడినవారై; అమూఢాః=మోహవర్జితులై; అవ్యయం=నాశములేని; తత్=ఆ; పదం=వైష్ణవపదమును; గచ్ఛన్తి=పొందుచున్నారు. ॥౫॥

శాంకరభాష్యమ్ —

కథంభూతా స్తత్పదం గచ్ఛంతీ త్యుచ్యతే— నిర్మానమోహా మానశ్చ మోహశ్చ మానమోహౌ తౌ నిర్గతౌ యేభ్య స్తే నిర్మానమోహా మానమోహవర్జితా జితసంగదోషాః సంగ ఏవ దోష స్సంగదోషో జితః సంగదోషో యై స్తే జితసంగదోషా అధ్యాత్మనిత్యాః పర

శాంకరభాష్యతత్త్వబోధిని :—

ఎట్టివారై యావైష్ణవపదమును పొందుచున్నారు? అను శంకపై చెప్పబడుచుండెను— మానమోహములు కలిగినట్టిన్ని, జయింపబడిన సంగమనెడి దోషము కలిగినట్టిన్ని, పరమాత్మస్వరూపాలోచనతత్పరులైనట్టిన్ని, విశేషముగ నిర్లేపముచే నివృత్తమైన కామములు కలిగి

యున్నది. "సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" అను శ్రుతి యిందులకు ప్రమాణము. ఆవైష్ణవపదము శ్రవణాదికముచే దెలిసికొనదగు నని యర్థము. ఆవైష్ణవస్థాన మెట్టి దందువా: యేపదమును పొందినవారు తిరిగి రారో అట్టిదని యర్థము. ఆస్థానము నెట్లు వెదుకదగునందువా: యెవడు పదశబ్దముచే జెప్పబడునో యట్టియాది పురుషుని శరణము నొందితినని తదేకశరణముగా నాపదము వెదుకదగునని యర్థము. ఆయాదిపురుష డెట్టివాడను: ఏపురుషునినుండి యీమాయామయసంసారముయొక్క యనాది యగు ప్రవృత్తి ఐంద్రజాలికునుండి మాయాగజాదికమువలె ప్రసృతమైనదో యట్టి పురుషుని శరణము నొందెద నని యన్వయము. ॥౪॥

శంకరానందీయము :— ఈవిధముగ సదసద్వివేకముచే నుద్భూతమైన వైరాగ్యముచే కలిగిన తీవ్రమోక్షేచ్ఛావేగముచే విషయప్రవణ మగు నంతఃకరణమును ప్రత్యగ్బ్రహ్మమున కభిముఖముగా జేసి మోక్షైక కాము డగు యతి యాత్మజ్ఞానైకతత్పరుడు కాదగు నని చెప్పుచుండెను :— "తతః" "సంన్యస్య శ్రవణం కుర్యాత్" అను న్యాయమున సద్గురుసన్నిధానమందు "తత్పదం పరిమార్గితవ్యం" ఆపరతత్త్వము అన్వేషింప దగునను. శ్రుతియుక్తులచే లెస్సగ విచారింపదగు నని యర్థము. లేక, "తతః" అను స్థలమున తసిల్ ప్రత్యయమునకు షష్ఠ్యర్థము. ఆసంసారవృక్షముయొక్క ప్రవృత్తికి మూలకారణ మగు పరబ్రహ్మము వెదుకదగినది యని యర్థము. ఆబ్రహ్మమును బ్రహ్మవేత్తల సన్నిధియందు లెస్సగ విచారించి తెలిసికొనదగు నని యర్థము. ఆజ్ఞానమునకు ఫల మేమందువా?— "యస్మిన్....భూయః" పరమేశ్వరునియొక్కయు, నాచార్యునియొక్కయు ననుగ్రహముతోగూడిన యతు లగు మహాత్ములు శ్రవణ, మననాదికముచే నుత్పన్న

శాంకరభాష్యమ్ :—
మాత్మస్వరూపాలోచననిత్యా స్తత్పరా వినివృత్తకామా విశేషతో నిర్లేపేన నివృత్తాః కామా యేషాం తే వినివృత్త కామా యతయః సంన్యాసినో ద్వంద్వైః ప్రియాప్రియాదిభి ర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైః పరిత్యక్తా గచ్ఛన్త్యమూఢా మోహవర్జితాః పదమవ్యయం తద్యథోక్తమ్॥౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—
నట్టి సంన్యాసులు సుఖదుఃఖము లనెడి సంజ్ఞ కల ద్వంద్వములతో ప్రియాప్రియాదులతో పరిత్యక్తమైనవారై మోహరహితులై పూర్వోక్తమైన నాశరహితమైన నా వైష్ణవపదమును పొందుచున్నారు. ॥౫॥

మైన విజ్ఞానముచే నిర్విశేషము, చిదేకరసము నగు బ్రహ్మమునందు స్వాత్మభావమును పొందిన (బ్రహ్మత్వమును పొందిన) వారై తిరిగి సంసారమునకై తిరిగిరారు. (తిరిగి శరీరమును ధరించుటకై తగరని యర్థము.) సదసద్వివేకవైరాగ్యములచేతను, తీవ్రముముక్షచేతను సర్వమును సంన్యసించి, జ్ఞానము సిద్ధించుటకై శ్రవణాదికము నాచరించు యతి యీవిధముగ కాదగు నని చెప్పుచుండెను :— "తమేవ పురుషంపురాణం" జగజ్జన్మాదిహేతువగు నేయీశ్వరునుండి యనంతకాలీనమైన యీసంసారవృక్షప్రవృత్తి అంతటను ప్రాణులకు ప్రసరించినదో, యేపరమేశ్వరుడు యీసంసారవృక్షమునకు బీజభూతుడై, పదశబ్దవాచ్యు డయ్యెనో యట్టి యాదిభూతుడైనట్టియు, మాయచే సగుణభావము నొందినట్టియు, భక్తవత్సలుడు నగు పరమేశ్వరునే శరణము పొందెదను. "యగ్ం హ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే" అను శ్రుత్యను సారము సంసారబంధమును వీడుటకై పరమేశ్వరునే శరణము వేడెద ననిపరమేశ్వరైకశరణపూర్వకముగా ముముక్షువగువాడు శ్రవణాదికమును జేయ దగు నని యర్థము. ॥౪॥

— ♦ ౧౫వ అధ్యాయము ౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦

మధుసూదనసరస్వతీయము :— పూర్వోక్తవిధముగా వైష్ణవస్థానమును పొందువారలకు నితరములైన యంగముల గొన్నిటి నిట చెప్పుచుండెను— "నిర్మాన....తత్" మాన మన గర్వాపర పర్యాయ మగు నహంకారము. మోహ మన అవివేకము, లేక, విపర్యయజ్ఞానము, ఈ రెండింటిచేతనువిడువ బడినవారై, (అనగా అహంకారావివేకరహితు లని యర్థము.) ప్రియాప్రియసన్నిధానమునందుగూడ రాగ ద్వేషశూన్యులు జితసంగదోషు లనబడుదురు. అట్టివారై, "అధ్యాత్మనిత్యాః" పరమాత్మ స్వరూపాలోచన తత్పరులై "వినివృత్తకామాః" వివేకవైరాగ్యములచే సర్వకర్మలను వీడినవారలై, "ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైః" సుఖదుఃఖసంజ్ఞకల శీతోష్ణక్షుత్పిపాసాదులచే విడువబడినవారై, "అమూఢాః" వేదాంతప్రమాణముచే నుత్పన్నమైన సమ్యగ్జ్ఞానముచే నివారితమైన యాత్మాజ్ఞానముకలవారై "పదమవ్యయం తత్ గచ్ఛంతి" వ్యయరహితమైన యావైష్ణవపదమును పొందుచున్నారు. ॥౫॥

శంకరానందీయము :— ఈవిధముగా నవిద్యా, కామ, కర్మాదులచే సంసారచక్రమునందు బంభ్రమ్యమాణు లగు బ్రహ్మనిష్ఠు లగు ముముక్షువు లీశ్వరానుగ్రహప్రాప్తమైన సదసద్వివేకజ్ఞానసంజాత తీవ్రవైరాగ్యముచే సంన్యస్తమైన సర్వకర్మ, తత్సాధనములు కలవారై, శ్రవణాదిజన్యమైన యాత్మజ్ఞానముచే జగత్కారణ మగు నిర్విశేషపరబ్రహ్మమును స్వస్వరూపముగ తెలిసికొనదగు నని యుపదేశించియట్టి ఆత్మస్వరూపమును తెలుసికొనిన యతులు "న సర్వవి ద్భజతి మాం" అను వక్ష్యమాణన్యాయమున కలిగిన

జ్ఞానమునకు, తత్ఫలసిద్ధికి ప్రతిబంధకమైన యనాత్మ, దద్ధర్మాధ్యాస తొలగుటకై సర్వదా బ్రహ్మదృష్టితో డనే యుండ దగు నని బోధించుటకై యిట్టి లక్షణములు గల యతులే విదేహముక్తి నొందగల రని చెప్పు చుండెను:— "నిర్మాన మోహాః" మాన మన నభిమానము; దేహేంద్రియాదులయెడ "నేను" అను అభిమానవిశేషరూప మగు నహంకారము, తత్కారణము మోహ మనబడును. ఇయ్యది యావృత్తిరూపమైన యనాత్మయం దాత్మత్వజ్ఞానహేతు వగు నజ్ఞానము. ఇట్టి మానమోహములనుండి నిర్గతులైనట్టి (శ్రవణాది సముత్పన్న మగు "అయ మహ మస్మి" అను విజ్ఞానముచే నాత్మయందే యాత్మత్వజ్ఞానవ్యవస్థచే ననాత్మయం దహంభావశూన్యులైనట్టియు) మానమోహములు, వక్ష్యమాణాఽవిద్యాకామాదికము నిశ్శేషముగ నివృత్త మగుటకు కారణమును జెప్పుచున్నాడు :— "అధ్యాత్మనిత్యాః" అధ్యాత్మ మన యాత్మ జ్ఞానము. అది సర్వత్ర బ్రహ్మమాత్రదర్శనరూపము. అట్టి యాత్మజ్ఞానమునందు నిరతులైన యాత్మారాము లెవరో వారు అధ్యాత్మనిత్యు లనబడుదురు. ("ఈసర్వము, నేను బ్రహ్మస్వరూపమే" అని తనయందును, అంతటను బ్రహ్మప్రత్యయదార్ఢ్యమునకై బ్రహ్మనిష్ఠయందే పరినిష్ఠితులైనట్టియు) కనుకనే "వినివృత్త కామాః- కామ్యంతే విషయా ఏభి రితి కామా వాసనాః" (వీనిచే విషయములు కోరబడునుగాన కామములన వాసనలని యర్థము.) అవి విషయములను కోరునట్లు చేయునుకదా! కానవాసనలేయిటకామశబ్దముచే వ్యపదిష్టములగును. నిరంతరబ్రహ్మనిష్ఠచే నంతఃకరణమునుండి పూర్తిగ నివృత్తములైన కామములు (బాహ్యవాసనలు) కలవారు గాన వినివృత్త కాము లనబడుదురు. నిరంతరసమాధిచే నిర్దగ్ధము లగు నహంమమాదిగ్రంథులు కలినట్టియు, సర్వవాసనానాశ మగుచో గల్గు ఫలమును చెప్పుచుండెను— "జితసంగదోషాః" ఇంద్రియములకు, మనస్సునకు విషయములతో నగు సన్నికర్ష సంగ మనబడును. ఈసంగమే కామ, సంకల్పాదిదోషములకు హేతువు గాన దోష మనబడును. ధ్యానము, శ్రవణము, దర్శనము మొదలగువాటిచే జిత్తమునకు నింద్రియములకు విషయములతో సంసర్గముకలుగగనే కామసంకల్పాదిదోషములు కల్గుచున్నవి. దానివలన భోక్తృ భోగ్యాద్యధ్యాసము కల్గును. దానివలన ప్రవృత్తియు, దానివలన ప్రత్యగ్దర్శనవిచ్ఛిత్తియు, దానివలన "ధ్యాయతో విషయా న్పుంసః" అను గీతోక్తానర్థపరంపరయు కల్గును. కాననట్టి యనర్థజాతము కలుగకుండుటకై యిట్టి సంగదోష మెవరిచే విడువబడునో వారు "జితసంగదోషు లనబడుదురు. అనగాబహిఃప్రావణ్యరహితులైనట్టియు, నిత్యము అధ్యాత్మనిరతులు గనుకనే నిర్మానమోహులగుదురు. కనుకనే వినివృత్త కాములగుదురు. కనుకనే జితసంగదోషులగుదురు. కనుకనే "సుఖదుఃఖసంజ్ఞైః ద్వంద్వై ర్విముక్తాః" ఇదిసుఖమిది దుఃఖము నని వీటిచే తెలియబడునుగాన శీతోష్ణ, ప్రియాప్రియ, శత్రుమిత్రాదిద్వంద్వములు సుఖదుఃఖము లనబడును. వాటిచే విముక్తు (గుణాతీతు) లైనట్టియు, ఇట్టి వారుకనుకనే "అమూఢాః" "నేను. నాది" యనుభేదప్రత్యయము కలవారు మూఢు లనబడుదురు. వారికంటె విలక్షణు లగువారు "అమూఢు" లనబడుదురు. నిశ్శేషముగా నివృత్తమైన యవిద్యకల బ్రాహ్మణులు "అమౌనం చ మౌనంచ నిర్విద్యాథబ్రాహ్మణః" అను శ్రుత్యుక్తలక్షణములు గల యతు లగు బ్రహ్మవేత్తలు "అవ్యయం" దేనిచేతను నశించని దగు ("నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం త దవ్యయం' అను శ్రుతిచే (బ్రహ్మవ్యతిరిక్తము లగు నన్నిటికి వ్యయము (నాశనము) సూచితమయ్యెను. మరియు ముముక్షువులగువారు నిర్విశేష మగు బ్రహ్మమే తెలుసు కొనదగుననియు, చెప్పదగుననియు జ్ఞాపితమయ్యెను.) "తత్" ఏపరబ్రహ్మరూప మగు స్థానము సర్వ వేదాంతప్రసిద్ధమో, దేనిని పొంది ముక్తులగువారు తిరిగి రారో అట్టిప్రసిద్ధమగు నిత్యశుద్ధముక్తస్వభావము, సచ్చిదానందైకరసము, నద్వితీయము నగు "పదం" పరబ్రహ్మను "గచ్ఛంతి" పొందుచున్నారు. (ఉపాధి విచ్ఛిత్తిచే నాభాసపరిచ్ఛేదమును వీడి పరిపూర్ణత్వమును పొందుచుండి రని భావము.) ॥౫॥

గీ॥ న త ద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।
య ద్గత్వా న నివర్తన్తే త ద్ధామ పరమం మమ ॥ ॥౬॥

పదవిభాగము :— న- తత్- భాసయతే- సూర్యః- న- శశాంకః- న- పావకః- యత్- గత్వా- న- నివర్తన్తే- తత్- ధామ- పరమం- మమ॥ ॥౬॥

ప్రతిపదార్థము :.... యత్=ఏవైష్ణవపదమును; గత్వా=పొంది; ననివర్తంతే = తిరిగిరారో; (సంసారమును పొందరో); తత్=ఆపరమపదమును; సూర్యః=సూర్యుడు; నభాసయతే=ప్రకాశింపజేయజాలడు; శశాంకః=చంద్రుడు; నభాసయతే=ప్రకాశింపజేయజాలడు; పావకః=అగ్నిహోత్రుడు; నభాసయతే=ప్రకాశింపజేయజాలడు; తత్=ఆ; పరమం=ఉత్కృష్టమైన; ధామ=స్థానము; మమ=నాసంబంధ (స్వరూప) మైనది. ॥౬॥

---

శాంకరభాష్యమ్:—

తదేవ పదం పున ర్విశిష్యతే—తద్ధామేతి వ్యవహితేన ధామ్నా సంబంధః । ధామ తేజోరూపం పదం న భాసయతే సూర్య ఆదిత్యః సర్వావభాసనశక్తిమత్త్వేఽపి సతి । తథా న

---

శాంకరభాష్యతత్త్వబోధిని :—

ఆ వైష్ణవపదమే తిరిగి నిశ్శేషముగ చెప్పబడుచున్నది :— తేజోరూపమైన యా ధామను ఆదిత్యుడు పరావభాసకశక్తి కలవాడై యుండియు ప్రకాశింపజేయలేడు. అట్లే

---

—: ౧౫వ అధ్యాయము ౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీమతము :— బ్రహ్మవేత్తలు పొందదగు స్థానమునే వివరించుచుండెను— "న తత్ సూర్యః" ఏవైష్ణవస్థానమును పొంది తిరిగి రారో అట్టి పరబ్రహ్మరూప మగు స్థానమును సమస్తమును ప్రకాశింపజేయు శక్తి కలవాడయ్యును సూర్యుడు ప్రకాశింపజేయనేరడు. అట్లగుచో సూర్యాస్తమయమున చంద్రుడు భాసకుడు కాడా? అను శంకపై జెప్పుచుండెను— "న శశాంకః" చంద్రుడును ఆస్థలమును భాసింపజేయజాలడు. అట్లగుచో నగ్ని ప్రకాశకుడుగదా : అను శంకపై జెప్పుచుండెను — "న పావకః" ఆస్థానమును అగ్నియు ప్రకాశింపజేయజాలడు. సూర్యాదు లాస్థానము నేల ప్రకాశింపజేయజాల రందువా— "త ద్ధామ పరమం మమ" ఆజ్యోతిస్సు స్వయంప్రకాశము, ఆదిత్యాదిసకలజడజ్యోతిభాసకము, "పరమం మమ పదం" ప్రకృష్టమగు నాదగు (విష్ణుస్వరూపమగు) స్థానము. "ఏది దేనిచే భాసించునో యది స్వభాసక మగుదానిని భాసింపజేయనేరదు." అను సామాన్యముఖన్యాయమున సూర్యాదిభాసక మగు పరబ్రహ్మరూపజ్యోతిస్సును సూర్యాదిజ్యోతిస్సులు భాసింపజేయనేర వని భావము. ఈవిషయముననే "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః। త మేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి" అను శ్రుతియు జెప్పుచున్నది. (ఈ చెప్పుటచే — "ఆపరబ్రహ్మతేజస్సు తెలిసికొనదగినదా, కాదా! తెలిసికొనదగినదే యగుచో వేద్యభిన్నముగ వేదితృసాపేక్ష మగుట ద్వైతమే సంభవించెడిని. తెలిసుకొనదగినది కాదను ద్వితీయపక్షమున పురుషార్థత్వమే లేకపోయెడిని." అను యాపత్తులు తొలగింపబడినవి. ఏమందువా! ఆబ్రహ్మము అవేద్య మైనను స్వయముగ నపరోక్షరూపము గాన ద్వైతాపత్తియు, నపురుషార్థత్వా

శాంకరభాష్యమ్:—

శశాంక శ్చన్ద్రో న పావకో నాఽగ్ని రపి। యద్ధామ వైష్ణవం పదం గత్వా ప్రాప్య న నివర్తంతే, యచ్చ సూర్యాది ర్న భాసయతే తద్ధామ పదం పరమం మమ విష్ణోః ॥ ॥౬॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని :—

చంద్రుడు; అగ్నియును ప్రకాశింపజేయజాలరు. ఏవైష్ణవపదమును పొంది తిరిగిరారో (సంసారమును పొందరో), ఏవైష్ణవపదమును సూర్యాదులు ప్రకాశింపజేయజాలరో ఆ పరమపదమే విష్ణుసంబంధ (స్వరూప) మైనది. ॥౬॥

---

పత్తియుగూడ లేదని యాశయము. ఇట నవేద్యత్వము సూర్యాద్యభాస్యత్వముచే జెప్పబడెను. అపరోక్షత్వము "య దాదిత్యగతం తేజః" అను శ్లోకముచే ముందు చెప్పగలడు. ఈవిధముగ రెండు శ్లోకములచేతను శ్రుతియందున్న యవేద్యత్వ. అపరోక్షత్వబోధక దలద్వయము వ్యాఖ్యాతమయ్యెను. ॥౬॥

శంకరానందీయము :— బ్రహ్మవిష్ణ్వాదిలోకములను పొందినవారికి పునరావృత్తి కలదు కదా! అట్లే నిర్విశేషబ్రహ్మభావమును పొందినవారికి గూడ పునరావృత్తి ఏల కలుగరాదు? అను నాశంక పై "న స పున రావర్తతే న స పునరావర్తతే" అను శ్రుతి దహరాద్యుపాసనము జేసి క్రమముక్తి నందిన సగుణోపాసకునకే పునరావృత్తి లేదని చెప్పుచున్నది. ఇట్లుండ నుపాధి నశించి. సాక్షాత్తునిర్విశేషబ్రహ్మము, సచ్చిదానందైకరసము నగు పరబ్రహ్మమును స్వాత్మభావముతో పొందిన బ్రహ్మవేత్తలకు పునరావృత్తి లేదని యేమి చెప్పవలెను! అను నీవిషయమును బోధించుటకై పరబ్రహ్మమునకు సూర్యాద్యభాస్యత్వమును, స్వయంజ్యోతిష్ట్వమును. నిజస్వరూపత్వమును బోధించుచుండెను — "న తద్భాసయతే సూర్యః" పూర్వోక్తమైన ముక్తోపసృప్యమైన పదశబ్దవాచ్య మగు పరమజ్యోతిస్సును పరమజ్యోతీరూపుడును, సర్వప్రకాశనశక్తి సంపన్నుడును, సహస్రాంశువు నగు సూర్యుడుగూడ ప్రకాశింపజేయజాలడు. "న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతోఽయ మగ్నిః" అను శ్రుతియు పై విషయమునే తెల్పుచున్నది. "న శశాంకో న పావకః" చంద్రుడు, నగ్నియుగూడ నాజ్యోతిస్సును ప్రకాశింపజేయజాలరు. ఈవాక్యము చక్షురాదికము, మనస్సుగూడ బ్రహ్మమును ప్రకాశింపజేయజాల వనుట కుపలక్షణము. "న తత్ర చక్షు ర్గచ్ఛతి. న చక్షుషా గృహ్యతే। నాపి వాచా నాన్యై ర్దేవైః" అను శ్రుతులుగూడ బ్రహ్మమును చక్షురాదికము బ్రకాశింపజేయజాల దని చెప్పుచున్నవి (ఈచెప్పుటచే బాహిరము, భౌతికము నగు సూర్యాదులు. చక్షురాదికము వీనిచే బ్రహ్మము భాస్యము కానందున బ్రహ్మమునకు అభౌతికత్వ. అతిసూక్ష్మత్వ, సర్వాంతరత్వ, అన్యాఽనవభాస్యత్వ. సర్వప్రకాశకత్వ. అదృశ్యత్వ. అజడత్వ. అప్రమేయత్వ, నిరవయవత్వ, నిష్క్రియత్వ, నిర్వికారత్వ, నిత్యశుద్ధత్వములు సిద్ధించినవి.) "న సత్తన్నాసదుచ్యతే" "తస్మాత్తమ స్సంజాయతే" "సూక్ష్మాత్సూక్ష్మతరం" "ఏష త ఆత్మా సర్వాంతరః" "న తత్ర సూర్యో భాతి" "తస్య భాసా సర్వ మిదం విభాతి" "అత్రాయం పురుష స్స్వయంజ్యోతిః" "స్వప్రకాశానందఘనం" "అదృశ్య మవ్యవహార్యం" "సాక్షీ చేతా కేవలః" "అప్రమేయం ధ్రువం" "నిష్కలం నిష్క్రియం" చిద్రూప ఏవావికారో హ్యుపలబ్ధా,, "నిత్యం శుద్ధం బుద్ధం ముక్తం సత్యం (సూక్ష్మం) పరిపూర్ణ మద్వయం సదానందచిన్మాత్రం" అను నీ విధ మగు శ్రుతులు పై విషయమునే చెప్పుచున్నవి. పై విధముగ పరమజ్యోతిస్సగుబ్రహ్మము సూర్యాద్యభాస్య మగుటచే నభౌతికత్వాదిలక్షణసంపత్తిని సూచించి యుపక్రాంతవిషయము నుపసంహరించుచుండెను — "యద్గత్వా.... మమ"

నిర్మానమోహత్వాదిలక్షణయుక్తులగు మహాత్ములు ఏభౌతికత్వాదిలక్షణలక్షితము, పరమజ్యోతిస్స్వరూపము, పదశబ్దవాచ్యము నగు పరబ్రహ్మమును పొంది (బ్రహ్మభావాపత్తిని పొంది) "నేను, నాది" యనునట్టి సంసారమునకు తిరిగి రారని యర్థము. "తద్ధామ పరమం మమ" యేతేజస్సును ఆదిత్యాదులు భాసింపజేయ జాలరో, యద్భావాపన్నులకు పునరావృత్తి లేదో యెయ్యది అపూర్వము, అనపరము, అనంతరము, అబాహ్యము, నఖండానందైకరసము, నద్వితీయము నగునో యట్టి జ్యోతిస్సు నాదగు (వైష్ణవ మగు) నమాయిక మగు స్వరూప మని యర్థము.

"సోమ్యేమా స్సర్వాః ప్రజా స్సత ఆగమ్య న విదు స్సత ఆగచ్ఛామహే" అను శ్రుతియందు సత్సంపత్తిగలవారలకుకూడ పునరావృత్తి శ్రూయమాణ మగుచున్నది. ఇట్లుండ "య ద్గత్వా న నివర్తంతే" అని సత్సంపన్నులకు పునరావృత్తి లేదని చెప్పుట యెట్లు పొసగు నందువా? నిజమే. సత్సంపన్నులకుగూడ శ్రుతి పునరావృత్తి చెప్పుచున్నది. అట్లయ్యును అక్కడ యొక విశేషమున్నది. చెప్పెద వినుము !— "ప్రియతో వా జ్మనసి సంపద్యతే, మనః ప్రాణే, ప్రాణ స్తేజసి, తేజః పరస్యాం దేవతాయాం" అను శ్రుతిచొప్పున విద్వదవిద్వాంసు లుభయులకు, సత్సంపత్తి సమానమైనను, అవిద్యాకామాదిసంసారబీజ విశిష్టుడగు నవిద్వాంసుడు సత్సంపన్ను డయ్యునుగూడ సంసారహేతు వగు నవిద్య యుండుటచే దాని వేగమున సతునుండి పునరావృత్తిని పొందును. ఈవిషయమై "తేనైష ఆత్మా నిష్క్రామతి చక్షుషో వా మూర్ధ్నోవాఽన్యేభ్యో వా శరీరదేశేభ్యస్త ముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణ మనూత్క్రామన్తం సర్వే ప్రాణా అనూత్క్రామంతి సవిజ్ఞానో భవతి సవిజ్ఞానమేవాన్వవక్రామతి తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞా చ....అవిద్యాం గమయిత్వాఽన్య న్నవతరం కల్యాణతరం రూపం కురుతే పిత్ర్యం వా గాంధర్వం వా దైవం వా ప్రాజాపత్యం వా బ్రాహ్మం వాన్యేషాం వా భూతానాం" అనియు, "తదేవ సక్త స్సహ కర్మణైతి లింగం మనో యత్ర నిషక్త మస్య" అనియు, "కామా న్యః కామయతే మన్యమానః స కామభి ర్జాయతే తత్ర తత్ర" అనియు, "పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన" ఇత్యాదిశ్రుతులును, "నాభుక్తం క్షీయతే కర్మ" మొదలగు స్మృతులును చెప్పుచున్నవి. కనుక నవిద్యాకామాదిబలముచే శిష్టమగు కర్మ ననుభవించుటకై యవిద్యాకామాదిపరివృతు లగు ననాత్మజ్ఞులు సత్సంపన్నులై గూడ సుషుప్తినుండివలె పునరావృత్తు లగుచుండిరి. ఈ విధముగ బ్రహ్మవేత్త యగు యతి పునరావృత్తిని పొందకుండును. సదేకత్వవిజ్ఞాన మను యగ్నిచే నవిద్యాకామాదికము నిశ్శేషముగ దహింపబడుటచే నుపాధిలయము నొంద నిర్విశేషమగు స్వస్వరూపము, నిత్యశుద్ధమునగు పరబ్రహ్మమును పొందిన బ్రహ్మవేత్తకు తిరిగి వ్యుత్థానహేతువు లేమింజేసి బ్రహ్మస్వరూపముగ నుండుట తప్ప వేరే పున రుత్క్రమణము సంభవింపదు. "గుహాగ్రంథిభ్యో విముక్తోఽమృతో భవతి। యోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామః న తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవ స న్బ్రహ్మాప్యేతి। పర్యాప్తకామస్య కృతాత్మన స్త్విహైవ సర్వే ప్రవిలీయంతి కామాః" అనియు, "యథా నద్య స్స్యందమానా స్సముద్రేఽస్తం గచ్ఛంతి నామరూపే విహాయ। తథా విద్వాన్నామరూపా ద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యం" అను శ్రుతియు పైవిషయమునే స్పష్టపరచుచున్నవి. మరియు గూటస్థ మగుటచే నాత్మకు నిర్గమముగాని, యాగమముగాని సంభవింపనేరవు. ఎట్లన: ఘటాకాశము మహాకాశరూపమేయైనను ఘటోపాధిచే వేరుగ ప్రతీయమాన మగుచు ఘటనాశానంతరము స్వస్వరూప మగు మహాకాశరూపముగ నుండుట తప్ప వేరే దానికి పునరావృత్తి సంభవింపదు. అట్లే బ్రహ్మస్వరూప మగు తాను (బ్రహ్మవేత్త) అవిద్యోపాధిచే భిన్నముగ ప్రతీయమానుడగుచు, పూర్వోక్తరీతిగ నవిద్యాతత్కార్యములు నశింపగనే స్వస్వరూప మగు బ్రహ్మరూపముగ నుండుట తప్ప పునరావృత్తిని పొందకుండును. కారణ మేమందువా? కూటస్థు డగుటచే నాతనికి

గీ॥ మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః ।
మనష్షష్ఠా నీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ ॥౭॥

గీ॥ శరీరం య దవాప్నోతి యచ్చా ప్యుత్క్రామ తీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి వాయు ర్గంధా నివాశయాత్ ॥ ॥౮॥

పదవిభాగము :— మమ- ఏవ- అంశః - జీవలోకే- జీవభూతః- సనాతనః- మనష్షష్ఠాని- ఇంద్రియాణి- ప్రకృతిస్థాని-కర్షతి ॥ ॥౭॥

పదవిభాగము :— శరీరం- యత్- అవాప్నోతి- యత్- చ- అపి- ఉత్క్రామతి- ఈశ్వరః- గృహీత్వా- ఏతాని- సంయాతి- వాయుః- గంధాన్- ఇవ- ఆశయాత్ ॥ ॥౮॥

ప్రతిపదార్థము :— జీవలోకే=జీవులయొక్క లోకమునందు; (సంసారమునందు) సనాతనః=చిరంతనుడైన; జీవభూతః = జీవస్వరూపుడు;మమైవ = నాయొక్కయే;అంశః = భాగము, (ఏకదేశము) సచ=ఆజీవుడు; (ఈపదమధ్యాహార్యము) ప్రకృతిస్థాని=స్వస్థానములగుకర్ణశష్కుల్యాదులయందున్న; మనష్షష్ఠాని=మనస్సుఆరవదిగాగల; ఇన్ద్రియాణి=త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణరూపమైన ఇన్ద్రియములను; కర్షతి=ఆకర్షించుచున్నాడు. ॥౭॥

ప్రతిపదార్థము :— యచ్చాపి=ఎపుడు; ఈశ్వరః=దేహేంద్రియాదిసంఘాతస్వామియగుజీవుడు; ఉత్క్రామతి=ఉత్క్రమించునో; తదా=అపుడు; (ఈపదమధ్యాహార్యము) మనష్షష్ఠాని ఇన్ద్రియాణి=మనస్సుఆరవదిగాగల యింద్రియములను; కర్షతి=ఆకర్షించుచున్నాడు; (ఈమూడుపదములు పూర్వశ్లోకము నుంచి యనువృత్తములు) యత్=ఎపుడు; శరీరం=శరీరమును; అవాప్నోతి=పొందుచున్నాడో;తదా=(ఈపదమధ్యాహార్యము) అపుడు; వాయుః=వాయువు; ఆశయాత్=పుష్పాదికమునుండి: గంధానివ=గంధములవలె, ఏతాని=ఈషడింద్రియములను; గృహీత్వా=గ్రహించి; సంయాతి=వెన్నగ వెళ్ళుచున్నాడు. ॥౮॥

---

క్రియాశ్రిత్వ ముపపన్నముగాదు. కాన సమ్యగ్దర్శనముచేతను, బ్రహ్మనిష్ఠచేతను నవిద్యాదులు నశింపగనే యుపాధివిలయ మవగనే నిర్విశేష, నిత్యశుద్ధబ్రహ్మభావము నొందిన మహాత్ములకు పునరావృత్తి లేదని సిద్ధించినది. ॥౬॥

నీలకంఠీయము : బ్రహ్మనేత్ర లుత్కృష్టస్థానమును పొందువారగుచో వారికటనుండి యధఃపతనముగూడ నవశ్యంభావియే యగును. "పతనాంతాః సముచ్ఛ్రియాః" అని గదా న్యాయము. కాన నాపదమును పొందినవారు తిరిగి రారనుట యనుపపన్నము. అనునాశంకపై నాపదముయొక్క స్వరూపమును జెప్పుచుండెను;— "న త ద్భాసయతే సూర్యః" ఆవైష్ణవస్థానము రూపాదిరహితమగుట చక్షురయోగ్యము కాన నాపదమును సూర్యుడు ప్రకాశింపజేయజాలడు (ఈ చెప్పుటచే పరబ్రహ్మము సర్వబాహ్యేంద్రియములకు నగ్రాహ్యమని సూచితమయ్యెను. రూపవత్తగు ద్రవ్య మెల్ల చక్షురనుగ్రాహకుడగు సూర్యునిచే భాస్య మగును. ఈపరబ్రహ్మము అట్లు కానిదని యర్థము,) "న శశాంకః" చంద్రుడుగూడ నీపరబ్రహ్మమును భాసింపజేయజాలడు. మనోగ్రాహ్యమగు వస్తువెల్ల మనోగ్రాహక మగు చంద్రునిచే భాస్య మగును. ఈపరబ్రహ్మపద మట్టిది కానిదని యర్థము. ఈవిషయమునే "య న్మనసా న మనుతే" అనుశ్రుతి చెప్పుచున్నది. "న పావకః" వాగింద్రియముచే గ్రహింపబడున దెల్ల వాగింద్రియానుగ్రాహక మగు నగ్నిచే భాస్య మగును. ఈపరబ్రహ్మము అట్టిది కానిదని యర్థము "యద్వాచాఽనభ్యుదితం" అను శ్రుతియు

**శాంకరభాష్యమ్ :—**

(1) యద్గత్వా న నివర్తంత ఇత్యుక్తమ్। నను సర్వా హి గతి రాగత్యంతా, సంయోగా విప్రయోగాంతా ఇతి హి ప్రసిద్ధం, కథ ముచ్యతే తద్ధామగతానాం నాస్తి నివృత్తి రితి? శృణు తత్ర కారణమ్—మమైవ పరమాత్మనోంఽశో భాగోఽవయవ ఏకదేశ ఇత్యనర్థాంతరం జీవలోకే జీవానాం లోకే సంసారే జీవభూతో భోక్తా కర్తేతి ప్రసిద్ధ స్సనాతనః। యథా జలసూర్యకః సూర్యాంశో జలనిమిత్తాపాయే సూర్య మేవ గత్వా న నివర్తతే తథాఽయ మప్యంశ స్తేనై వాత్మనా సంగచ్ఛ త్యేవమేవ యథా వా ఘటాద్యుపాధిపరిచ్ఛిన్నో ఘటాద్యాకాశ ఆకాశాంశః సన్ఘటాదినిమిత్తాపాయ ఆకాశం ప్రాప్య న నివర్తత ఇత్యేవ మత ఉపపన్న ముక్తం యద్గత్వా న నివర్తంత ఇతి। నను నిరవయవస్య పరమాత్మనః కుతోఽవయవ ఏకదేశోంఽశ ఇతి। సావయవత్వే చ వినాశప్రసంగోఽవయవవిభాగాత్। నైష దోషోఽవిద్యాకృతోపాధిపరిచ్ఛిన్న ఏక దేశోంఽశ ఇవ కల్పితో యతః। దర్శిత శ్చాయ మర్థః క్షేత్రాధ్యాయే విస్తరశః। నచ జీవో మదంశత్వేన కల్పితః కథం సంసర త్యుత్క్రామతి చే త్యుచ్యతే మనః షష్ఠానీంద్రియాణి శ్రోత్రాదీని ప్రకృతిస్థాని స్వస్థానే కర్ణశష్కుల్యాదౌ ప్రకృతౌ స్థితాని కర్ష త్యాకర్షతి. ॥౭॥

**శాంకరభాష్యతత్త్వబోధిని :—**

(1) “యద్గత్వా న నివర్తన్తే” దేనిని పొంది తిరిగి రారో అని చెప్పబడెను. గమన మెల్లయు ఆగత్యంతము (తిరిగిరావడ మంతముగా కలది.) సంయోగము వియోగాంత మని

---

నిబ్రహ్మము వాగ్గోచరము కానిదని చెప్పుచున్నది. ఈవిషయమునే “న చక్షుషా గృహ్యతే నాపి వాచా” అను శ్రుతియు జెప్పుచున్నది. అద్వయ మగు నిబ్రహ్మము- మనో వా క్చక్షు ర్గోచరముగాదు. కనుకనే స్థూలసూక్ష్మకారణప్రపంచాతీతమయినది. “నాంతఃప్రజ్ఞం న బహిఃప్రజ్ఞం అస్థూలమనణు” అను నీమొదలగు శ్రుతులచే సర్వవిశేషరహితముగా ప్రతిపాదింపబడిన ‘యద్గత్వా న నివర్తంతే’ యేపరబ్రహ్మమును బొంది (తెలుసుకొని) నివృత్తి కారణమగు మూలాజ్ఞానము నశించుటచే పునరావృత్తులుకారు. ‘తద్ధామ పరమం మమ’ అపరమ (అనుత్కృష్ట) మగు వృత్తిజ్ఞానముకంటె విలక్షణమగు స్వయంప్రకాశమగు నాజ్యోతిస్సు నాస్వ రూపమైనది. ఈవిధముగ వ్యాఖ్యానించిన ‘యదా హ్యేవైష ఏత స్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనే ఽభయం ప్రతిష్ఠాం విందతే: అథ సోఽభయం గతో భవతి’’ అను శ్రుత్యర్థము అనుగత మగును. ॥౬॥

—♦ ౧౫వ అధ్యాయము ౭, ౮ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము :— “యద్గత్వా న నివర్తంతే” (పరబ్రహ్మను పొంది తిరిగిరాదు) అని చెప్పుట యయుక్తము. ఏమన: దేనినిగూర్చియైనను వెళ్ళినచోతిరిగివచ్చెదరు. స్వర్గమునకు వెళ్ళినవారు తిరిగి వచ్చుటలేదా? తిరిగి రారందువా? అట్లయినవారు వెళ్ళుటయే యసత్యము. కాన ఒకదానిని గూర్చి వెళ్ళెదరనుట, వారు తిరిగి రారనుట నీరెండును పరస్పరవిరుద్ధములు, “సర్వే క్షయాంతా నిచయాః పతనాంతా స్సముచ్ఛ్రయాః। సంయోగా విప్రయోగాంతా మరణాంతం హి జీవితమ్॥” అని లోకము నందును, శాస్త్రమునందుగూడ ప్రసిద్ధముకదా! కాన “యద్గత్వా న నివర్తంతే” అనిచెప్పుట యసంగతము. ఇట నొక సంశయము కల్గుచున్నది. అది యేమందువా: లోకశాస్త్రములనుబట్టి యట్లు ప్రసిద్ధమైనను అట్టి అనాత్మవిషయకమైన ప్రాప్తి పునరావృత్తిపర్యవసానకమైనను ఆత్మప్రాప్తిమాత్రము పునరావృత్తి లేనిదే.

శాంకరభాష్యతత్త్వబోధిని :—

కదా ప్రసిద్ధము ! ఆ వైష్ణవపదమును పొందినవారికి తిరిగి నివృత్తి లేదని యెట్టుల చెప్పబడెను. (అని ప్రశ్నించెదవా?) అందుకు కారణమును వినుము—

(2) జీవుల లోకమునందు (సంసారమునందు) సనాతనుడైన జీవభూతుడు భోక్త, కర్త అని ప్రసిద్ధిని పొందినవాడు పరమాత్మయొక్క భాగము. భాగమన అవయవము. ఏకదేశము. జలగతసూర్యుడు జలరూపమైన నిమిత్తము తొలగ సూర్యుని పొంది యెట్లు తిరిగిరాడో అట్లే ఈయంశరూపమైన జీవుడు ఆపరమాత్మను కలుసుకొనును. ఎట్లు ఘటాద్యుపాధిపరిచ్ఛిన్నమైన ఘటాకాశము మహాకాశాంశమై ఘటాదినిమిత్తము తొలగ మహాకాశమును పొంది తిరిగిరాదో అట్లే 'య ద్గత్వా న నివర్తన్తే' అని చెప్పబడెను.

---

యగునందువా! అట్లు కాదు; సుషుప్తియందు "సతా సోమ్య తదా సంపన్నో భవతి" అను శ్రుతి ఆత్మప్రాప్తికి పునరావృత్తిపర్యంతత్వమును ప్రతిపాదించుచున్నది. అట్లేకానిచో సుషుప్తిని పొందినవాడును ముక్తుడేగాన నాతనికి పునరుత్థానము లేకపోయెడిని. కాన ఆత్మప్రాప్తివిషయమై "యద్గత్వా" అని చెప్పుట యసంగతము. అది జ్ఞానార్థక మగుట నౌపచారికప్రయోగ మన్నను, అపునరావృత్తి యుపపన్నము గానేరదు. అని పూర్వపక్షము ప్రాప్తింప నిట చెప్పుచుంటిమి. "య ద్గత్వా" అను స్థలమున గంత యగు జీవుడు గంతవ్య మగు బ్రహ్మముకంటె వేరు కాదు గాన "గత్వా" అనునది యౌపచారిక పద మగును. ఈపదము అజ్ఞానమాత్రవ్యవహిత మగు బ్రహ్మము జ్ఞానమాత్రముచేతనే ప్రాప్త మగు నని తత్ప్రాప్తినే వ్యపదిశించుచున్నది. జీవుడు బ్రహ్మముయొక్క ప్రతిబింబరూపు డను పక్షమున-జలప్రతిబింబితసూర్యునకు ఉపాధిభూత మగు జలము లేనితరి బింబభూతుడగు సూర్యుని పొందుట, ఆసూర్యునుండి తిగ్గి రాకుండుట యెట్లు ఔపచారికముగ చెప్పబడుచున్నవో యట్లే జీవున కుపాధినాశానంతరము నిరుపాధిబ్రహ్మస్వరూపగమనము, ఆబ్రహ్మమునుండి యపునరావృత్తియు, నౌపచారికముగ చెప్పబడుచున్నవి. ఇక బుద్ధ్యవచ్ఛిన్న బ్రహ్మభాగము జీవు డను పక్షమున ఎట్లు ఘటాకాశమునకు ఘటము నశింపగనే మహాకాశమును పొందుటయు, ఆమహాకాశమునుండి యపునరావృత్తియు నౌపచారికముగ చెప్పబడుచున్నవో యట్లే జీవునకుగూడ నుపాధినశింపగనే నిరుపాధిబ్రహ్మస్వరూపప్రాప్తియు, దానినుండి యపునరావృత్తియు నౌపచారికముగ చెప్పబడుచున్నది. ఆజీవబ్రహ్మములు ఒకే స్వరూపము కలవిగాన ఉపాధి నశించినచో "నారెండును వేరు" అను భ్రమ నివృత్త మగును. ఇక సుషుప్తియం దన్ననో జీవోపాధియగు నంతఃకరణము భావనాకర్మపూర్వప్రజ్ఞాసహితమై తనకు కారణమగు నజ్ఞానమునందు సూక్ష్మరూపముగ నుండుటచే నట్టి యజ్ఞానమునుండియే యంతఃకరణోపాధి యుద్భవించుచున్నది. జ్ఞానముచే నజ్ఞానము తొలగినచో గారణము లేమింజేసి కార్య ముత్పన్నము కానేరదు గాన నజ్ఞానము కారణముగాగల నంతఃకరణోపాధు లుత్పన్నములు కాజాలవు. కాన జీవునకు "అహం బ్రహ్మాస్మి" అను సాక్షాత్కారముచే "నేను బ్రహ్మముగ కాను" అను అజ్ఞాన నివృత్తియే యిట "గత్వా" అను పదముచే చెప్పబడును. అనాద్యజ్ఞానము నివృత్త మగుచో దానికి పునరుత్థానము లేదుగాన నట్టి యవిద్యాకార్య మగు సంసారము లేనితరి "న నివర్తంతే" అని చెప్పుట యేమియు విరుద్ధముగాదు, జీవునకు పారమార్థిక మగు స్వరూపము పరబ్రహ్మమే యని యనేకమారు చెప్పియే యుంటిమి. ఈవిషయమంతయు ఉత్తరగ్రంథముచే జెప్పబడుచుండెను :—అందు జీవుడు పరబ్రహ్మస్వరూపు డగుట నజ్ఞాననివృత్తిపూర్వకముగ స్వరూపాపన్నునకు ఆబ్రహ్మమునుండి ప్రచ్యుతి సంభ

శాంకరభాష్యతత్త్వబోధిని :—

(౩) నిరవయవమగు పరమాత్మకు అవయవము, ఏకదేశము, అంశమును చెప్పుట యెటుల పొసగును? పరమాత్మ సావయవమే యన్నచో నవయవవిభాగమువలన వినాశము ప్రాప్తింప వలసివచ్చును. అని ప్రశ్నింపవలదు. అవిద్యాకృతమైన యుపాధితో పరిచ్ఛిన్నమైన యేక దేశము అంశవలె కల్పితము. అందువలన పూర్వోక్తదోషము లేదు. ఈయర్థమే క్షేత్రా ధ్యాయమునందు విస్తారముగ చూపబడెను. ఆజీవుడు నాయంశ కల్పితుడై యెట్లు సంసరించుచుండెను? యెట్లు యుత్క్రమించుచుండెను? అను శంకపై చెప్పుచుండెను. స్వస్థా నము లగు కర్ణశష్కుల్యాదిప్రకృతియం దున్న త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణాదిరూపమై మనస్సు ఆరవదిగా గల యింద్రియములను ఆకర్షించుచున్నాడు. ॥౭॥

వింపదని "మమైవాంశః" అనునది మొదలుకొని శ్లోకార్థముచే జెప్పుచుండెను:— సుషుప్తికాలమందు సర్వకార్యసంస్కారసహిత మగు నజ్ఞాన ముండుటచే నాయజ్ఞానముచే జీవునకు సంసారము కలుగుచున్న దని "మనష్షష్ఠా నీంద్రియాణి" అను శ్లోకార్థముచే బ్రతిపాదించుచుండెను:—కాన ప్రస్తుతః అసంసారి యైనను. మాయచే సంసృతిని పొందినట్టియు, మందప్రజ్ఞులచే దేహతాదాత్మ్యభావమును పొందింపబడినట్టియాజీవునకు దేహముకంటె వేరగుటను "శరీరం య దవాప్నోతి" అను శ్లోకార్థముచే సూచించుచుండెను:— ఇక "శ్రోత్రం చక్షుః" అను శ్లోకముచే విషయములయందింద్రియములను ప్రవర్తింపజేయువాడగుట నాయింద్రియములకం టెవేరగుటను ప్రతిపాదించుచుండెను. పై విధముగ దేహేంద్రియాదులకంటె విలక్షణుడగు జీవుడుత్క్రాం త్యాందిసమయమున స్వాత్మరూపుడే యగును కదా! అట్టివానినందరు నేల జూడజాలకుండిరి: అనుప్రశ్నపై విషయవిక్షిప్తచిత్తు లగుట దర్శనార్హుడైనను ఆజీవుని (ఆత్మను) జూడజాలకుండిరి. అని ప్రత్యుత్తరమును "ఉత్క్రామంతం" అను శ్లోకముచే జెప్పుచుండెను— అట్టిజీవుని జ్ఞానచక్షుష్కులగు యతులు విపుల ప్రయత్నముచే జూచుచుండిరని "యతంతో యోగినః" అను శ్లోకముచే జెప్పుచుండెను.— ఇక "యతంతో ప్యకృతాత్మానః అను శ్లోకార్థముచే మూఢులగువారు చూడలేరని చెప్పుచుండెను. ఈవిధముగా నైదుశ్లోకములకు సంగతి నిరూపిత మయ్యెను, ఇక నీశ్లోకము వ్యాఖ్యానింపబడుచుండెను.— "మమై వాంశో.... సనాతనః" నా (పరమాత్మ) యొక్క (పరమాత్మ నిరంశమైనను, సూర్యునకు జలమునందును, ఆకాశమునకు ఘటమునందువలె మృషాభేదము కల యంశమువంటి) యంశము సంసారమునందు ప్రాణ ధారణోపాధిచే "కర్త, భోక్త, సంసారి" అను మృషాప్రసిద్ధిని పొందిన జీవరూపముగ సనాతన (నిత్య) మై యున్నది. (ఆ అంశము ఉపాధిపరిచ్ఛిన్నమైనను వస్తుతః పరమాత్మస్వరూప మగుటచే నిత్యమైనది.) కాన జ్ఞానముచే నజ్ఞానము తొలగినచొ స్వస్వరూపబ్రహ్మమును పొంది దానినుండి నివర్తింపడని చెప్పుట యుక్తమే. ఇట్టివాడైనను సుషుప్తమునుండి యెట్లావర్తితు డగుచుండెను? అను ప్రశ్నపై జెప్పుచుండెను.— "మనష్షష్ఠాని .... కర్షతి" శ్రోత్ర. త్వక్, చక్షూరసనఘ్రాణము లనునవి మనస్సుతో నారింద్రియము లగును. "ఇంద్రస్య ఆత్మన, విషయోపలబ్ధికరణతయా లింగాని" అను విగ్రహము ననుసరించి (ఆత్మకు విషయోప లబ్ధికి కరణములు గాన నివి యింద్రియము లనబడును.) ఈఆరు యింద్రియములు జాగ్రత్స్వప్నభోగజనక మగు కర్మము క్షీణింప, ప్రకృతి.(అజ్ఞానము) యందుసూక్ష్మరూపముగ నుండును. అట్టి యింద్రియములను జాగ్రద్భోగజనక మగు కర్మ ముదయింపగనే దాని ననుభవించుటకై 'కర్షతి' అజ్ఞానమునుండి ఆకర్షించు చుండెను, (విషయగ్రహణయోగ్యములుగా నావిర్భవింపజేయుచుండెను.) కనుకనే జ్ఞానమునుండి పునరావృత్తి లేకున్నను, అజ్ఞానమునుండి పునరావృత్తి యుపపన్నమే యగు నని భావము. ॥౭॥

శాంకరభాష్యమ్:—

కస్మిన్ కాలే — యచ్చాపి యదా చా ప్యుత్క్రామ తీశ్వరో దేహాదిసంఘాతస్వామీ జీవ స్తదా కర్షతీతి శ్లోకస్య ద్వితీయపాదోఽర్థవశా త్ప్రాథమ్యేన సంబధ్యతే । యదా చ

శాంకరభాష్యతత్త్వబోధిని :—

ఏకాలమునందు దేహాదిసంఘాతస్వామి యగు జీవు డుత్క్రమించునో అపుడు మనస్సు ఆరవదిగా గల యింద్రియముల నాకర్షించును. "కర్షతి" అను శ్లోకముయొక్క రెండవపాదము అర్థవశమున ప్రథమముగ యీశ్లోకముతో సంబంధించును. ఎపుడు

ఏ కాలమున యాకర్షించునో చెప్పుచుండెను — "శరీరం.... ఈశ్వరః" ఏకాలమున దేహేంద్రియసంఘాతమునకు ప్రభువగు జీవుడు ఏదేహమునుండి యుత్క్రమించునో, అసమయమున నాదేహము నుండి యింద్రియముల నాకర్షించును. ఇంతియేకాదు: ఏసమయమున ఏశరీరమునుండి మరియొక శరీరమును పొందునో ఆసమయమున నింద్రియములను గ్రహించిలెస్సగ నాశరీరమునుగూర్చి వెళ్ళును. శరీరముండగనే యగు నింద్రియగ్రహణమునకు దృష్టాంతమును చెప్పుచుండెను. "వాయుః....ఆశయాత్" గంధస్థానమగు కుసుమాదికమునుండి వాయువు గంధరూపము లగు సూక్ష్మాంశములను గ్రహించి వెళ్ళునో యట్లే జీవుడు యింద్రియషట్కమును గ్రహించి, శరీరాంతమును పొందునని యర్థము. ॥౭, ౮॥

శంకరానందీయము:— ఈవిధముగ వర్ణితమైన సంసారవృక్షస్వరూపమును తెలుసుకొని, విరక్తుడై, సదసద్వివేకము కల్గి, మోక్షైకకామనతో సర్వమును వీడిన యతికి సద్గురువనుగ్రహమున జ్ఞానము కల్గి దాన బ్రహ్మప్రాప్తియు, నపునరావృత్తియు గల్గు నని ప్రతిపాదించి, ప్రస్తుతము శ్రవణాదికమునాచరింపని యతులకు అనాత్మయందు కల్గు ఆత్మత్వభ్రాంతి తొలగుటకై బ్రహ్మమునకే యవిద్యోపాధివశమున జీవత్వము కల్గు నని బోధించుటకై జీవుడు బ్రహ్మాంశమే యనియు, నాత్మ దేహేంద్రియాదులకంటె వ్యతిరిక్తము, నవిక్రియము, నసంసారియు నగు నని మూడుశ్లోకములచే జెప్పుచుండెను:— "మమైవ" నిర్విశేషము చిదేకరసస్వరూపము నగు నా (బ్రహ్మము) యొక్క "అంశః" అంశవంటి యంశము (అవిద్యాకల్పితమైన భాగము) "జీవలోకే" సంసారమునందు. లేక, "జీవేన లోక్యతే అనుభూయత ఇతి జీవలోకః" (జీవునిచే ననుభవింపబడునది గాన దేహము జీవలోక మనబడును.) అను విగ్రహానుసారము క్షేత్రమునందు "జీవభూతః" నామరూపవ్యాకరణమునకై క్షేత్రజ్ఞత్వమును పొందియుండెను. (ప్రమాతయై యుండె నని యర్థము.)

నిరవయవము, నిర్విశేషము నగు పరబ్రహ్మముయొక్క అంశము జీవుడు అని యంశాంశిభావకల్పనము తగదు. ఏమందువా? బ్రహ్మము సాంశమే యగుచో సావయవము, ననిత్యము, నద్వితీయముగూడ కావలసివచ్చును. అట్లయిన "నిష్కలం నిష్క్రియం" "ఏక మేవాఽద్వితీయం" అను శ్రుతులకు విరోధము వాటిల్లును కాన నంశాంశిభావకల్పన తగ దందువా? నిన్నిట ప్రశ్నింపదగును (1) నీవు బ్రహ్మముకంటెవేరుగ జీవుడుండె నందువా! లేక (2) నాబ్రహ్మమునకే జీవత్వము చెప్పెదవా? (3) లేక జీవుడే లేడందువా, (4) ఇట ప్రమాతయగు జీవుడే లేడను పక్షము ఉపపన్నము గాదు. ఏమన: ఎదుట నున్న నీవే లేకపోవలసివచ్చును. ఇష్టాపత్తి యందువా: ప్రత్యక్షవిరోధము వాటిల్లును, (1) ఇక బ్రహ్మముకంటె వేరొండు జీవుడు కల డను నొకపక్షమున నాజీవుడు సచేతనుడా! లేక, నచేతనుడా! అచేతనుడను పక్షమున "నేను ఇది నాది" యను వ్యవహారము లేకపోయెడిని. అప్పుడు సుషుప్తియందువలె నంతట ను సర్వవ్యవహారములులోపించుట

శాంకరభాష్యమ్ :—

పూర్వస్మా చ్ఛరీరా చ్ఛరీరాంతర మాప్నోతి తదా గృహీత్వైతాని మనష్షష్ఠానీంద్రియాణి సంయాతి సమ్య గ్యాతి గచ్ఛతి। కి మివే త్యాహ– వాయుః పవనో గంధా నివాఽఽశయా త్పుష్పాదేః। ॥౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—

పూర్వశరీరము కంటె మరియొకశరీరమును పొందునో అపుడు మనస్సు ఆరవదిగా గల యింద్రియములను త్వక్చక్షుః శ్రోత్రజిహ్వాఘ్రాణములను గ్రహించి వాయువు పుష్పాదికమునుండి గంధములను గ్రహించి మరియొక స్థలమునకు వెళ్ళునటుల లెస్సగ వెళ్ళును. ॥౮॥

ప్రసక్తమగును. ఇక నాజీవుడు సచేతనుడే యను ప్రథమపక్షమున "సాక్షీ చేతా కేవలః" అను శ్రుత్యుక్త రీతిని బ్రహ్మాతిరిక్త మగు నదెల్ల నచేతనమే యగును. అట్లగుచో బ్రహ్మమునకే జీవత్వ మందువా? అట్లును గాదు; అట్లే యగుచో సర్వప్రాణిమాత్రమునకు "నేను బ్రహ్మను" అను పూర్ణత్వ. అసంసారిత్వజ్ఞానము కలుగవలసివచ్చును. సంసరణములేకపోవలసివచ్చును. మరియు నట్లే యగుచో ప్రత్యక్షాదిసర్వప్రమాణము లకు విరోధను వాటిల్లును. ఇక నేమన: బ్రహ్మమునకే యవిద్యచే జీవత్వ మందువా? అట్లైన చిరంజీవివి కమ్ము! ఈయర్థమునే శ్రీ కృష్ణభగవానులుకూడ వేరొండు గతి లేనందున "మమైవాంశో జీవలోకే జీవ భూతః" అని చెప్పియుండెను. "నీవు చెప్పినరీతిని బ్రహ్మమునకే యవిద్యచే జీవత్వ మేర్పడుగాక. అట్లైనను నిరవయవము, నేకము నగు బ్రహ్మమునకు అంశాంశిభావ మెట్లుపపన్న మగును." అందువా? ఆయంశాంశిభావముఅవిద్యోపాధిచే నేర్పడును. నిరవయవము, నేకమునగు మహాకాశమునకు ఘటోపాధివైశిష్ట్యముచే ఘటాకాశత్వమును కల్పించి, ఘటాకాశము మహాకాశాంశము అని యొకే మహాకాశమునకే యంశాంశిభావము కల్పితమై యుపపన్న మగుచున్నది. అట్లే యొకేబ్రహ్మను అవిద్యాప్రత్యుపస్థాపిత బుద్ధ్యుపాధి విశిష్టుడగుటబుద్ధ్యవచ్ఛిన్నుడగుజీవునకుఅంశత్వమునుకల్పించిన"జీవుడుబ్రహ్మాంశము"అనియొకే బ్రహ్మమునకు కల్పితమైన యంశాంశిభావ ముపపన్న మగును. ఇంతియేగాని బ్రహ్మమునకు వస్తుతః అంశాంశిభావము లేదని యాశయము. బ్రహ్మమునకు వాస్తవికాంశాంశిభావ మున్నప్పుడే నీచే జెప్పబడిన (బ్రహ్మము సాంశమే యగుచో బ్రహ్మము సావయవము, అనిత్యము, సద్వితీయము "నిష్కలం నిష్క్రియం, ఏక మేవాద్వితీయం" ఇత్యాదిశ్రుతివిరోధము వాటిల్లును, అను) దోషము, శ్రుతివిరోధముసంభవించెడివి. అట్టి వాస్తవికాంశాంశిభావ మిట లేదుగాన నిట నేయనుపపత్తియు నుండదు. నూనెతో తడిపిన వర్తిని యగ్ని సంబంధముచే దీప మని యందుముగదా! అట్లే యుపాధివిశిష్టుడగు బ్రహ్మమునకే జీవుడు అని వ్యపదేశము చేయబడెను. సంగరహిత మగు బ్రహ్మమున కుపాధిసంబంధ మెట్లుపపన్నమగును? మరియు వికారిత్వ మెట్లు సిద్ధించు నని యాశంకించెదవా? చెప్పెద వినుము: తెల్లనిదై పీతిమాసంబంధములేని శంఖము నేత్రస్థ పీతిమతోఆధ్యాసికసంబంధముకలదగును. యట్టిసంబంధముచేతనే "శంఖముపచ్చనిది" అనిశంఖమునకు పీతత్వము సిద్ధించుచున్నది. అట్లే బ్రహ్మముగూడ నుపాధిచే నాధ్యాసిక సంబంధము కల దగును. అట్టి సంబంధముచేతనే "యాత్మచేయుచున్నది. అనుభవించుచున్నది" అను సంసారిత్వముగూడనాత్మకు సిద్ధించు చున్నది. ఈసంబంధ మాధ్యాసికమేగాని, వాస్తవికముగాదు. ఈవిషయమే "ధ్యాయతీవ లేలాయతీవ" అను శ్రుతి చెప్పుచున్నది. ఆత్మ ఈయాధ్యాసికసంసారమునే "ప్రకృతిస్థాని కర్షతి" అని ప్రతిపాదించెను. ఈశ్లోకద్వయమునకు అన్వయానురూపముననైన యైకమత్యముతో నర్థము వర్ణింపదగును. బ్రహ్మస్వరూప

గీ॥ శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ ।
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే ॥ ॥౯॥

పదవిభాగము :— శ్రోత్రం- చక్షుః- స్పర్శనం- చ- రసనం- ఘ్రాణం- ఏవ- చ- అధిష్ఠాయ- మనః- చ- అయం- విషయాన్- ఉపసేవతే ॥ ॥౯॥

ప్రతిపదార్థము :— అయం=ఈజీవుడు; శ్రోత్రం=శ్రోత్రేంద్రియమును; చక్షుః=చక్షురింద్రియమును; స్పర్శనంచ=త్వగింద్రియమును; రసనం=రసనేంద్రియమును; ఘ్రాణం=ఘ్రాణేంద్రియమును; మనశ్చ=(ఆరవదియగు) మనస్సును; అధిష్ఠాయ=అధిష్ఠించి; విషయాన్=శబ్దస్పర్శరూపరసగంధములను; ఉపసేవతే=సేవించుచున్నాడు. ॥౯॥

---

శాంకరభాష్యమ్ :—

కాని పున స్తానీతి—శ్రోత్రం చక్షుః స్పర్శనం చ త్వగింద్రియం రసనం ఘ్రాణ మేవ చ మనశ్చ షష్ఠం ప్రత్యేక మింద్రియేణ సహాధిష్ఠాయ దేహస్థో విషయా న్శబ్దాదీ నుపసేవతే ॥ ॥౯॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని :—

ఆ యింద్రియము లేవి? యనిన—శ్రోత్రేంద్రియము, చక్షురింద్రియము, త్వగింద్రియము, రసనేంద్రియము, ఘ్రాణేంద్రియము, యీ యింద్రియములను, ఆరవది యగు మనస్సును నధిష్ఠించి, దేహస్థుడై, శబ్దస్పర్శరూపరసగంధములను సేవించుచున్నాడు. ॥౯॥

---

డగుట సనాతనుడు (నిత్యుడు). కనుకనే "ఈశ్వరః" దేహేంద్రియాదికమునకు ప్రవృత్తిహేతు వగుట జీవుడు ప్రభువగును. ఆజీవుడు— "యచ్చాప్యుత్క్రామతి" ఏకాలమున పూర్వోపాత్తదేహమునుండి యుత్క్రమించునో, ఆసమయమున మనస్సుతో సహా ఆరింద్రియములను, ప్రాణములనుగూడ నాకర్షించును. ప్రాప్తవ్యశరీరమునందు విషయోపభోగార్థమై యాకర్షించు నని యర్థము. "గృహీత్వైతాని...ఆశయాత్" జీవుడు పూర్వశరీరమునుండి మరియొక శరీరమునకు వెళ్ళునపుడు వాయువు పుష్పస్థానమునుండి సూక్ష్మరూపములగు గంధములనువోలె మనఃప్రాణములను, పంచజ్ఞాన. కర్మేంద్రియములను గ్రహించి శరీరాంతరమును పొందు నని యర్థము. ॥౩౯ ౮॥

—• ౧౫ వ అధ్యాయము ౯వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఆయింద్రియములనే చెప్పుచు వీని నెందులకై గ్రహించి జీవుడు వెళ్ళునో ఆవిషయము నీశ్లోకమున జెప్పుచుండెను,— ఈజీవుడు శ్రోత్రమును, చక్షుస్సును, త్వగింద్రియమును, రసనేంద్రియమునుఘ్రాణేంద్రియమును, ఇట్లే పంచకర్మేంద్రియములను, ప్రాణమును. మనస్సును, ఆశ్రయించియే శబ్దాదివిషయముల ననుభవించుచుండెను. ॥౯॥

శంకరానందీయము:— జీవుడు యింద్రియములను గ్రహించి మరియొక శరీరమునొంది ఏమి చేయును? అను నాశంకపై జెప్పుచుండెను.— "శ్రోత్రం....ఏవచ" శ్రోత్ర. చక్షు, స్త్వగింద్రియములను, (ఇట చకారమ్ము సముచ్చయార్థము) పంచకర్మేంద్రియములను, ఆరవది యగు మనస్సును, బుద్ధ్యహంకారములను భోగసాధనములుగా గ్రహించి శబ్దాదివిషయముల ననుభవించుచుండెను. "ఏకస్మి న్నుద్దానే రత్వా

గీ॥ ఉత్క్రామంతం స్థితం వాఽపి భుంజానం వా గుణాన్వితమ్ ।
విమూఢా నాఽనుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః ॥ ॥౧౦॥

పదవిభాగము :— ఉత్క్రామంతం- స్థితం- వా- అపి- భుంజానం- వా- గుణాన్వితం- విమూఢాః- న- అనుపశ్యన్తి- జ్ఞానచక్షుషః। ॥౧౦॥

ప్రతిపదార్థము :— ఉత్క్రామంతం=పూర్వోపాత్తమైన దేహమును పరిత్యజించుచున్నట్టిన్ని; స్థితంవా=దేహమునందున్నట్టిన్ని; భుంజానంవా=శబ్దాదులననుభవించుచున్నట్టిన్ని; గుణాన్వితం=సుఖదుఃఖమోహములనెడి గుణములతో కూడినట్టి; ఏనం= అత్యంతదర్శనగోచరమైన పరమాత్మను; (ఈపదమధ్యాహార్యము) విమూఢాః=అనేకవిధములుగ మూఢులైనవారు, నానుపశ్యన్తి=తెలిసికొనలేరు; జ్ఞానచక్షుషః=ప్రమాణ జనిత జ్ఞానమనెడి చక్షుస్సు కలవారు; పశ్యన్తి=చూచుచున్నారు. ॥౧౦॥

శాంకరభాష్యమ్ :—

ఏవం దేహగతం దేహాత్ ఉత్క్రామంతం పరిత్యజంతం దేహం పూర్వోపాత్తం స్థితం వా దేహే తిష్ఠంతం భుంజానం వా శబ్దాదీం శ్చోపలభమానం గుణాన్వితం సుఖదుఃఖమో-

శాంకరభాష్యతత్త్వబోధిని :—

“శరీరం య దవాప్నోతి” ఇత్యాదిశ్లోకమునందు దేహముకంటే యాత్మ యతిరిక్తుఁడని చెప్పి, ‘శ్రోత్రం చక్షుః’ అను శ్లోకమునందు స్వాభిలషితవిషయమునందు యథాయథ

-చరిత్వా దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ” అను శ్రుత్యనుసారము ఇంద్రియార్థ సన్నికర్షచే నుత్పన్నమైన పుణ్యపాపక్రియలను; యింద్రియములను విషయములను జూచుచుండునని యర్థము. (ఇట శరీరోత్క్రమణ, తత్సంక్రమణ, శరీరాంతరసంక్రమణ ప్రతిపాదనముచే జీవాత్మ స్థూలశరీరవిశిష్టమనియు, హేయమునుపాదేయమునగు స్థూలశరీరముకంటె వేరనియు సూచితమయ్యెను. “మనష్షష్ఠానీంద్రియాణి కర్షతి గృహీత్వాసంయాతి” అని చెప్పుటచే గ్రాహ్యగ్రాహకములగు భేదము ప్రత్యక్షసిద్ధమే గాన యాత్మబుద్ధిమాత్రోపాధికుడనియు, నింద్రియాదులకంటెను వేరనియు, ప్రతిపాదింపబడెను. మరియు, ‘శ్రోత్రం చక్షుః’ అను మొదలగుదానిచే శ్రోత్రాదీంద్రియములను, మనస్సును, బుద్ధిని గ్రహించి, విషయములను సేవించునని చెప్పుటచే నుపలబ్ధయగు నాత్మ యుపాదేయము లగు నింద్రియాదికముకంటెను, నింద్రియార్థములకంటెను, మనస్సుకంటెను, బుద్ధికంటెను, భోగాయతనమగు శరీరముకంటెను భిన్నమని సూచితమయ్యెను. ఈ చెప్పుటచే “చక్షుష స్సాక్షీ శ్రోత్రస్య స్సాక్షీ వాచ స్సాక్షీ మనస స్సాక్షీ బుద్ధే స్సాక్షీ ప్రాణస్య స్సాక్షీ తమస స్సాక్షీ సర్వస్య సాక్షీ తతోఽవిక్రియః” అను శ్రుతిప్రతిపాదితమయిన సర్వసాక్షిత్వము, అవిక్రియత్వము నాత్మకు సూచితమయ్యెను. ॥౯॥

—♦ ౧౫వ అధ్యాయము ౧౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము :— ఈవిధముగ నాత్మ దేహగతుడై దర్శనయోగ్యుడైనను దేహమునుండి యుత్క్రమించువానినిగాని దేహమునందున్నవానినిగాని ఆదేహమునందే శబ్దాదివిషయముల ననుభవించువానినిగాని, సుఖదుఃఖమోహరూపము లగు గుణములతో గూడినవానిని ఈవిధముగా సర్వావ

శాంకరభాష్యమ్ :—

హాభిర్గుణైరన్విత మనుగతం సంయుక్త మిత్యర్థః। ఏవంభూత మప్యేన మత్యంతదర్శన గోచరప్రాప్తం విమూఢా దృష్టాదృష్టవిషయభోగబలాకృష్టచేతస్తయాఽనేకధా మూఢా నానుపశ్యంత్యహో కష్టంవర్తత ఇత్యనుక్రోశతి చ భగవాన్। యేతు పునః ప్రమాణ జనితజ్ఞానచక్షుష స్త ఏనం పశ్యంతి జ్ఞానచక్షుషో వివిక్తదృష్టయ ఇత్యర్థః ॥౧౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—

ముగ కరణములకు ప్రవర్తక మగుటవలన నట్టి కరణములకంటె యీ యాత్మ యతిరిక్తమని చెప్పబడెను. అట్లగుచో నుత్క్రాంత్యాదులను చేయుచున్న యాత్మను అందరు స్వరూప మగుటవలన నెందులకు తెలిసికొనరు? అని శంకింపజనదు. దేహమువలన దేహమును పొందుచున్నట్టిన్ని, పూర్వోపాత్తమైన దేహమును పరిత్యజించుచున్నట్టిన్ని, దేహమునం దున్నట్టిన్ని, శబ్దస్పర్శరూపరసగంధముల ననుభవించుచున్నట్టిన్ని, సుఖదుఃఖమోహము లనెడి గుణములతో కూడినట్టి యీ యత్యంతదర్శనగోచరమైన యాత్మను యనేకవిధముల మూఢులైనవారు దృష్టాదృష్టవిషయభోగబలాకృష్టమైన చిత్తము కలవా రగుటచే తెలిసికొనలేకుండిరి. అహో! ఎంత కష్టము! అని శ్రీకృష్ణపరమాత్మ యనుక్రోశించుచుండెను. ఎవరైతే ప్రమాణజనిత జ్ఞానచక్షుస్సులు కలవారో యట్టి వివిక్తదృష్టికలవారు యీ పరమాత్మను తెలుసుకొనుచున్నారు. ॥౧౦॥

---

సలయందు దర్శయోగ్యుడైనను యీయాత్మను దృష్టములు, నదృష్టములునగు విషయముల ననుభవించుటచేనైన వాసనలచే నాకృష్టమైన మనస్సుకలవా రగుటచే నాత్మానాత్మవివేకాఽయోగ్యు లగు మూఢులు తెలిసికొనజాలకుండిరి. ('ఎంతకష్టము!' అని అజ్ఞానులయెడ ననుక్రోశమును జూపుచుండెను.) ఇకప్రమాణ జనితజ్ఞానచక్షుష్కులగు వివేకవంతులే యాత్మయాథార్థ్యమును తెలిసికొనుచుండిరి. ॥౧౦॥

శంకరానందీయము :— ఈవిధముగ దేహేంద్రియాదివ్యతిరిక్తము, క్రియాశూన్యము, అకర్తయు నగు తనను (ఆత్మను) మహాత్ములగు బ్రహ్మవేత్తలు సర్వసాక్షిగ నున్నవానినిగ నెల్లపుడు తెలిసికొనెదరు' మూఢు లన్ననో యట్లు తెలిసికొనజాలరు. అని యీశ్లోకమున జెప్పుచుండెను.—యీశ్లోకమున మొదటి 'వ' కారము 'ఇవ' కారార్థకము ద్వితీయ 'వ' కారము "అప్య" ర్థకము) ఉపాధి (దేహము) భిక్షాదికృత్యమునకై లేచి యెటకేని వెళ్ళినచో తనను (ఆత్మను) "ఉత్క్రామంతంవా" స్వయముగ లేచి వెళ్ళుచున్నదివలె "ధ్యాయతీవ లేలాయతీవ" అను శ్రుత్యుక్తరీతిని ప్రతీయమానునిగను, జ్ఞానచక్షుష్కులు (ప్రత్యగ్భావాపన్నమగు శుద్ధబుద్ధివృత్తి జ్ఞానమనబడును. అజ్ఞానమే రూపాదిగ్రహణమున చక్షురింద్రియము వలె స్వరూపగ్రహణమున నుపయోగించును గాన నట్టి జ్ఞానచక్షువు కలవారు, ఆదేహ మేదేని కార్యమునకై ఆగియున్నచో తనను (ఆత్మను) ఆగియున్నదివలె ప్రతీయమానునిగను, దేహము భుజించుచున్నచో "భుంజానం వా" ఆత్మ భుజించుచున్నదివలె ప్రతీయమానునిగను, ఉపాధి సత్త్వాదిగుణవికారములతోడను, సుఖదుఃఖకామక్రోధమోహభయాదిగుణములతోడను కూడియుండ తాను (ఆత్మ) "గుణాన్వితం వా" నిరుక్తగుణములతోగూడినదివలెప్రతీయమానునిగను, స్వభావముచే నిష్కలము, నిష్క్రియము, నిర్వికారము, నిర్వికల్ప

గీ॥ యతంతో యోగిన శ్చైనం పశ్యం త్యాత్మ న్యవస్థితమ్ ।
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యం త్యచేతసః ॥ ॥౧౧॥

పదవిభాగము :— యతంతః- యోగినః- చ- ఏనం- పశ్యన్తి- ఆత్మని - అవస్థితం - యతంతః- అపి-అకృతాత్మానః న- ఏనం- పశ్యన్తి-అచేతసః॥ ॥౧౧॥

ప్రతిపదార్థము:— యతంతః=ప్రయత్నమును చేయుచున్న; యోగినశ్చ=సమాహిత చిత్తులు; ఆత్మని=తమ బుద్ధియందు; అవస్థితం=ఉండిన; ఏనం=ఈప్రకృతమైనయాత్మను; పశ్యన్తి =చూచుచుండిరి. అకృతాత్మానః=అసంస్కృతాంతఃకరణకల; అచేతనః=అవివేకులు; యతన్తోపి=శాస్త్రాది ప్రమాణములచే ప్రయత్నించు వారైనను; ఏనం=ఈయాత్మను; నానుపశ్యన్తి =తెలిసికొనలేరు. ॥౧౧॥

శాంకరభాష్యమ్ ;—

కేచిత్తు యతంతః ప్రయత్నం కుర్వంతో యోగినశ్చ సమాహితచిత్తా ఏనం ప్రకృత మాత్మానం పశ్యం త్యయ మహ మస్మీ త్యుపలభంత ఆత్మని స్వస్యాం బుద్ధా వవస్థితం యతం తోఽపి శాస్త్రాదిప్రమాణై రకృతాత్మానోఽసంస్కృతాత్మాన స్తపసేంద్రియజయేన చ దుశ్చ రితా దనుపరతా అశాంతదర్పాఽఽత్మానః ప్రయత్నం కుర్వంతోపి నైనం పశ్యం త్యచేతసోఽ వివేకినః ॥ ॥౧౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—

కొందరు సమాహితచిత్తులు ప్రయత్నమును చేయుచుండినవారై తమ బుద్ధియం దున్న ప్రకృతమైన యాత్మను "అయ మహ మస్మి" అని తెలుసుకొనుచున్నారు. శాస్త్రాది ప్రమాణములచే కొంద రవివేకులు ప్రయత్నించుచుండినను యింద్రియజయముచే నసంస్కృత మైన యంతఃకరణము కలవారై, దుశ్చరితము నుండి నుపరతులు కానివారై, అనగా దురా చారితత్పరులై, అశాంతమైన దర్పము కల యంతఃకరణము కలవారై, ప్రయత్నము చేయు వార లైనను యీప్రకృతమైన పరమాత్మను దెలిసికొనలేకుండిరి. ॥౧౧॥

కము, చిదేకరసము, ఆనందఘనము నగు నాత్మను (తనను) అవిక్రియునిగనే జూచెదరు. (ఆహారాదిసర్వ కర్మల యందును)తనను నిష్క్రియము, నిష్కలము, నిత్యశుద్ధము, సర్వోపాధివినిర్ముక్తము. పరిపూర్ణమునగు నాత్మనుగనే తెలిసికొందు రని యర్థము) "విమూఢాః నాఽనుపశ్యంతి" దృష్టాదృష్టవిషయాశావశీభూత మనస్కులు, దుర్విదగ్ధులు, బహిర్ముఖులు నగు మూఢులు సదసద్వివేక, వైరాగ్య, సంన్యాస, శమదమాది సాధనసంపత్తిచేతను, తీవ్రమోక్షేచ్ఛచేతను, సద్గురూపపత్తిచేతను లెస్సగ సంపాదింపబడిన విశేషవిజ్ఞానము లేమింజేసి "అహ మేవేదం సర్వం" అను వాక్యార్థానురూపముగా నాత్మను జూడలేకుండిరి. ఇక నేమన ? "నేమ కర్తను, భోక్తను, సుఖిని, దుఃఖిని, నిహతుడ నైతిని. మరణింపగలను. నాసంబంధమగు నిది నష్ట మయ్యెను." అనియే తనను సంసారిగా జూచెద రని యర్థము. ॥౧౦॥

—: ౧౫వ అధ్యాయము ౧౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము :— పూర్వశ్లోకము జ్ఞానచక్షుష్కులు ఆత్మను తెలుసుకొనెద రని చెప్పెనుగదా ! దానినే యీశ్లోకమున వివరించుచుండెను!— "ఆత్మ న్యవస్థితం ఏనం" తమ బుద్ధి

గీ॥ య దాదిత్యగతం తేజో జగ ద్భాసయతేఽఖిలమ్ ।
య చ్చంద్రమసి య చ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ ॥౧౨॥

పదవిభాగము:— యత్- ఆదిత్యగతం- తేజః- జగత్- భాసయతే- అఖిలం- యత్- చన్ద్రమసి- యత్- చ- అగ్నౌ- తత్- తేజః- విద్ధి- మామకమ్ ॥ ॥౧౨॥

ప్రతిపదార్థము:— యత్ = ఏ; ఆదిత్యగతం = సూర్యునియందున్న; తేజః = తేజస్సు; అఖిలం = సమస్తమైన; జగత్ = జగత్తును; భాసయతే = ప్రకాశింప జేయుచున్నదో; చంద్రమసి = చంద్రునియందున్న; యత్ = ఏ; తేజః = తేజస్సు; జగత్ = జగత్తును; భాసయతే = ప్రకాశింప జేయుచున్నదో; అగ్నౌ = అగ్నియందున్న; యత్ చ = ఏ; తేజః = తేజస్సు; జగత్ = జగత్తును; భాసయతే = ప్రకాశింపజేయుచున్నదో; తత్ = ఆ; తేజః = తేజస్సును; మామకం = విష్ణుస్వరూపమైన నాసంబంధమైనదిగా; విద్ధి = తెలిసికొనుము॥ ॥౧౨॥

యందు ప్రతిఫలించిన యీయాత్మను "యతంతో యోగినః పశ్యంతి" ధ్యానాదులచే బ్రయత్నించినవారై యోగులు చూచెదరు. "యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః" యజ్ఞాదికర్మలచే శోధితము కాని యంతఃకరణము గల వివేక శూన్యులు ఈయాత్మను చూడజాలరని వివరణము. ॥౧౧॥

శంకరానందీయము:—ఎవరు సంసిద్ధులు, ప్రబుద్ధులు, శుద్ధాత్ములు నగుదురో వారే యాత్మను తెలిసికొనగలరు గాని, యితరులు తెలిసికొన జాలరను యాశంకపై యట్లుగాదు—నాయనుగ్రహసంపత్తిచే యోగనిష్ఠు లయినవారుగూడ నాత్మను తెలిసికొన గలరని యీశ్లోకమున చెప్పుచున్నాడను— శాస్త్రాచార్యేశ్వరప్రసాదసంపన్నులయి, సదసద్వివేక, తీవ్రవైరాగ్య, శమ, దమాదిసాధన సంపత్తితో 'యతంతః' శ్రవణమననాదులచే జ్ఞానసిద్ధికై ప్రయత్నించు యతులు యోగులనబడుదురు. 'లక్ష్యైకతాంసమాపాద్య నిర్వికారతయాఽఽత్మని । మనసో నిశ్చలత్వేన స్థితి ర్యోగ ఇతీర్యతే" (లక్ష్యమునందేకాగ్రతను సంపాదించి, మనస్సును ఆత్మయందు నిర్వికారరూపముగా నిశ్చలముగా నుంచుటయే యోగ మనబడును) అను రీతిని తీవ్రమోక్షేచ్ఛావైరాగ్యములచే నైజబహిఃప్రావణ్యవైముఖ్యముతో చిత్తము విక్రియారాహిత్యముతో నుండుటరూపమగు యోగము కలవారు స్వాత్మయందే యవహితచిత్తము కలవారగుదురు. 'యోగినః' అట్టి యోగులు గూడ "ఆత్మని" బుద్ధి గుహాయందుండి బుద్ధ్యాదిప్రకాశకుడైన యాత్మను "అయమేవాహం" అని స్వాత్మచే సాక్షాత్కరింపజేసికొని, తన నకర్తనుగను, అభోక్తనుగను, అసంసారినిగను జూచెదరు. "యతంతః...చేతసః" ఇక నాయనుగ్రహపాత్రులు గానివారు శ్రవణమననాదికముచే నాత్మ సాక్షాత్కారసిద్ధికై యనేకవిధములుగా ప్రయత్నించినను "అకృతాత్మానః- అకృతో బాహ్యవాసనాభి ర్విషయకర్మవాసనాభిశ్శాస్త్రాదిగోచరాభి రవశీకృతో బహిరేవ ప్రవాహ్యమానఆత్మా చిత్తం యేషాం తే" (విషయములకు, కర్మలకు, శాస్త్రాదులకు సంబంధించిన వాసనలచే వివశమై బహిఃప్రావణ్యము గల చిత్తముగలవారు అకృతాత్ములనబడుదురు.) అట్టి, యకృతాత్ములై యవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశము కలవారై కనుకనే "అచేతసః" వివేకరహితు లగువారు బహిర్ముఖు లగుదురు. అట్టివారు నిర్విశేషపరబ్రహ్మమును స్వాత్మనుగ తెలిసికొనజాలరు. ॥౧౧॥

—॥౧౫ వ అధ్యాయము ౧౨వ శ్లోక వ్యాఖ్యావిశేషములు॥—

మధుసూదనసరస్వతీయము:— ఏ పదమును-సర్వమును ప్రకాశింపజేయ సమర్థులగు ఆదిత్యాదులు గూడ ప్రకాశింపజేయజాలరో, ముముక్షువు లేస్థానమును పొంది సంసారమునకు తిరిగిరారో, ఏపదమున

శాంకరభాష్యమ్:—

(1) యత్పరం సర్వస్యావభాసక మప్యగ్న్యాదిత్యాదికం జ్యోతి ర్నావభాసయతే, యత్ప్రాప్తాశ్చ ముముక్షవః పునః సంసారాభిముఖా న నివర్తంతే, యస్య చ పదస్యోపాధిభేద మనువిధీయమానా జీవా ఘటాకాశాదయ ఇవాఽఽకాశస్యాంశా స్తస్య పదస్య సర్వాత్మత్వం సర్వవ్యవహారాస్పదత్వం చ వివక్షు శ్చతుర్భిః శ్లోకై ర్విభూతిసంక్షేప మాహ భగవాన్—
(2) యదాఽఽదిత్యగత మాదిత్యాశ్రయం కిం తత్తేజో దీప్తిః ప్రకాశో జగ ద్భాసయతే ప్రకాశయ త్యఖిలం సమస్తం య చ్చంద్రమసి శశభృతి త త్తేజోఽవభాసకం వర్తతే, యచ్చాఽగ్నౌ హుతవహే త త్తేజో విద్ధి విజానీహి మామకం మదీయం మమ విష్ణో స్త జ్జ్యోతిః । అథ వా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) ఏ స్థానమును సర్వమున కవభాసకమైనను అగ్న్యాదిత్యాదిజ్యోతిస్సులు ప్రకాశింప జేయలేకున్నవో, ఏస్థానము పొందిన ముముక్షువులు సంసారాభిముఖులై తిరిగి వచ్చుటలేదో, ఏస్థానముయొక్క యుపాధిభేదము ననుసరించి యనువిధీయమానులైన జీవులు ఆకాశముయొక్క యంశలగు ఘటాకాశాదులవంటివారో యట్టి స్థానమునకు సర్వాత్మత్వమును, సర్వవ్యవహారాస్పదత్వమును వివక్ష చేయదలచినవాడై శ్రీకృష్ణపరమాత్మ నాలుగుశ్లోకములచే విభూతిసంక్షేపమును చెప్పుచుండెను.

(2) ఆదిత్యగతమైన నిఖిలజగద్భాసకమైన యే ప్రకాశ కలదో, ప్రకాశకమైన చంద్రునియందున్న ఏతేజస్సుకలదో, అగ్నియం దేతేజస్సుకలదో ఆతేజస్సు లన్నిటిని విష్ణుస్వరూప మగు నాతేజస్సులుగ తెలిసికొనుము.

కుపాధిభేదమును కల్పించుచు జీవులు-ఘటాకాశములు మహాకాశమునకువలె కల్పితాంశలై మిథ్యాభూతమగు సంసారము ననుభవించుచుండిరో, అట్టి పదము (బ్రహ్మము)నకే సర్వాత్మత్వ, సర్వవ్యవహారాస్పదత్వ ప్రదర్శనముచే "బ్రహ్మణో హి ప్రతిష్ఠాహం" అని పూర్వోక్తవిషయమునే వివరించుటకై యాత్మవిభూతిని నాల్గుశ్లోకములచే సంక్షేపముగ జెప్పుచుండెను. "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతో ఽయమగ్నిః" అను శ్రుత్యుక్తార్థము పూర్వము "న తద్భాసయతే సూర్యః" అను మొదలగు దానిచే వివరింపబడెను. ఇక ప్రస్తుతము "త మేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి" అను శ్రుత్యర్థమీశ్లోకమున వివరింపబడుచుండెను. సూర్యునియందున్న చైతన్యాత్మక జ్యోతిస్సు, చంద్రునియందున్న జ్యోతిస్సు, అగ్నియందున్న జ్యోతిస్సు ఈ నిఖిలజగత్తును ప్రకాశింపజేయుచున్నవి. ఆతేజస్సును నాసంబంధమయినదిగా తెలిసికొనుము. ఆలోచించినచో స్థావరజంగమము లన్నిటియందును చైతన్యరూపమగు జ్యోతిస్సు సమానముగనే యున్నది. అటులైనను పరోత్కర్షచే నాదిత్యాదులకుత్కర్షయున్నదిగానఅక్కడనేచైతన్యజ్యోతిస్సు భాసించును. కాన యట్లు చెప్పెను. ముఖములుసాన్నిధ్యము సమానమైనను, కాష్ఠకుడ్యాదులయందు ప్రతిఫలింపక స్వచ్ఛమగు నాదర్శనమునందే తర తమభావముతో నావిర్భవించుచున్నవికదా! అట్లే ఇటగూడ సూర్యాదులయందు ఆజ్యోతిస్సు ప్రస్ఫుటమగుచున్నదిగాన దానినే యిట గ్రహించెను. ॥౧౨॥

శంకరానందీయము:— అకృతాత్ము లగువారు ప్రయత్నించినను నాయనుగ్రహము లేమిం జేసి యాత్మసాక్షాత్కారము నొందజాలకుండిరి. కాన నాయనుగ్రహసంపాదనమునకై యవశ్యము నన్నుపాసింపదగును. అంతను నాస్వరూపముగనన్నుజూచియుపాసించువ్యానికి రాగాదిదోషములుకలుగకుండును. దాన

గీ॥ గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా ।
పుష్ణామి చౌషధీస్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః ॥ ॥౧౩॥

పదవిభాగము:—గాం-ఆవిశ్య-చ-భూతాని-ధారయామి-అహం-ఓజసా-పుష్ణామి-చ-ఓషధీః-సర్వాః-సోమః-భూత్వా-రసాత్మకః॥ ॥౧౩॥

ప్రతిపదార్థము:— అహం = నేను; ఓజసా = బలముచే; గాం = భూమిని; ఆవిశ్య = ప్రవేశించి; భూతానిచ = చరాచరాత్మక భూతములను; ధారయామి = ధరించుచుంటిని; రసాత్మకః = రసస్వరూపుడైన; సోమః = చంద్రుడను; భూత్వా = అయి; సర్వాః = నిఖిలమైన; ఓషధీః = ఓషధులను; పుష్ణామి = పోషించుచున్నాను. ॥౧౩॥

శాంకరభాష్యమ్:—

యదాఽఽదిత్యగతం తేజ శ్చైతన్యాత్మకం జ్యోతి ర్యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకం మదీయం మమ విష్ణోస్తజ్జ్యోతిః। (3) నను స్థావరేషు జంగమేషు చ తత్సమానం చైతన్యాత్మకం జ్యోతి స్తత్ర కథ మిదం విశేషణం య దాదిత్యగత మిత్యాది। నైష దోషః సత్త్వాధిక్యా దాధిక్యోపపత్తేః। ఆదిత్యాదిషు హి సత్త్వ మత్యంతప్రకాశ మత్యంతభాస్వర మత స్తత్రైవాఽఽవిస్తరం జ్యోతి రితి త ద్విశిష్యతే, న తు తత్రైవ త దధిక మితి। యథా హి లోకే తుల్యేఽపి ముఖసంస్థానే న కాష్ఠకుడ్యాదౌ ముఖ మావిర్భవ త్యాదర్శాదౌ తు స్వచ్ఛే స్వచ్ఛతరే చ తారతమ్యే నావిర్భవతి తద్వత్। ॥౧౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(3) స్థావరములయందు, జంగమములయందు చైతన్యస్వరూపమై తేజస్సు సమానమై యుండ ఆదిత్యాదిగతమైన తేజస్సు నా తేజస్సని చెప్పుట యెట్లుపొసగును నెదవా? యిట్టిదోషము ప్రాప్తింపదు.

ఆదిత్యాదులయందు అత్యంతప్రకాశగల భాస్వరమైన సత్త్వము కలదు. అందువలన అచటనే అంతట విస్తారమగు జ్యోతిస్సుకలదని, ఆదిత్యాదిగతమైన జ్యోతిస్సు నాసంబంధమైన దేయని చెప్పబడెను. అచటనే అది యధికముకాదు. ఎట్లు లోకమునందు ముఖసంస్థానము సమానమైనను కాష్టకుడ్యాదికమునందు ముఖము ప్రతిబింబింపదో, స్వచ్ఛము, స్వచ్ఛతరము అయిన దర్పణాదికమునందు తారతమ్యముగ ముఖాదిక మావిర్భవించునో అట్లే యని గ్రహింపవలయును. ॥౧౨॥

చిత్తనైర్మల్యము, నాత్మజ్ఞానము గూడ సిద్ధించును. అని బోధించుటకై తన (పరమేశ్వరుని) సార్వాత్మ్యము ను ప్రతిపాదించుచుండెను- "యదాదిత్యగతం తేజః" సూర్యునకు లోపల వెలుపల నంతటను వ్యాపించి యున్న యేతేజస్సు జగత్తునంతను ప్రకాశింపచేయుచున్నదో, అట్లే చంద్రునియం దున్న యేతేజస్సు జగత్తునంతను భాసింపచేయుచున్నదో, అట్లే యగ్నియం దున్న యేతేజస్సు జగత్తు నంతను భాసింపచేయు చున్నదో, ఆతేజస్సును నా సంబంధమైనదిగా తెలిసికొనుము. "యదగ్నే రోహితగ్ రూపం" అను శ్రుత్యుక్తరీతిని సూర్యాదులకు తేజస్సుకంటె వేరుగా పృథక్సత్తలేనందున సూర్యాదులు తేజోమాత్ర స్వరూపులే యనిసిద్ధించినది. సూర్యచంద్రాగ్న్యాత్మకం తేజః మామకం" అను స్థలమునందు "రాహోశ్శిరః" అను-స్థలమునందువలె మద్బుద్ధి తేజశ్శబ్దార్థముల కభేదమే గాన సూర్యచంద్రాదులు నేనే. నావిభూతి యగుట వారియందు మద్బుద్ధి చేయదగునని బోధింపబడెను.

శాంకరభాష్యమ్:—

కించ— గాం పృథివీ మావిశ్య ప్రవిశ్యచ ధారయామి భూతాని జగ దహ మోజసా బలేన య ద్బలం కామరాగవివర్జిత మైశ్వరం రూపం జగద్విధారణాయ పృథివ్యాం ప్రవిష్టం యేన పృథివీ గుర్వీ న అధః పతతి న విదీర్యతే చ। తథా చ మన్త్రవర్ణః 'యేన ద్యౌ రుగ్రా పృథివీ చ దృఢా'' ఇతి, ''స దాధార పృథివీ'' మిత్యాదిశ్చ। అతో గా మావిశ్య చ భూతాని చరాచరాణి ధారయామీతి యుక్త ముక్తమ్। కించ పృథివ్యాం జాతా ఓషధీ స్సర్వా వ్రీహియవాద్యాః పుష్ణామి పుష్టిమతీః రసస్వాదుమతీశ్చ కరోమి, సోమో భూత్వా రసాత్మక స్సోమః సర్వరసాత్మకో రసస్వభావః సర్వరసానా మాకర స్సోమః। స హి సర్వా ఓషధీః స్వాత్మరసా ననుప్రవేశయన్ పుష్ణాతి। ॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు నేను బలముచే భూమిని ప్రవేశించి జంగమస్థావరాత్మకమైన జగత్తును ధరించుచున్నాను. కామరాగవివర్జితమైన ఈశ్వరసంబంధమైన యేబలము జగద్విధారణకొరకు పృథివియందు ప్రవిష్టమో, యేతేజస్సుచే బరువైన పృథివి క్రింద పడుటలేదో, బద్దలగుటలేదో, ఈ విషయమునే "యేన ద్యౌ రుగ్రా పృథివీ చ దృఢా'' యేతేజస్సుచే ద్యులోక ముగ్రముగ నున్నదో, పృథివి దృఢముగ నున్నదో ''స దాధార పృథివీం'' ఆపరమాత్మ యెల్లప్పుడుభూమిని ధరించుచున్నాడు అని శ్రుతియు బోధించుచున్నది. అందువలననే "గా మావిశ్య చ భూతాని'' అని చెప్పుట యుక్తమే. మరియు పృథివియందు జనించిన వ్రీహియవాదిరూపమైన ఓషధులను రసాత్మకమైన చంద్రస్వరూపుడనై రసస్వాదుమత్తులుగ చేయుచుంటిని. సోముడు సర్వరసాత్మకుడు, రసస్వభావుడు, సర్వరసముల కాకరుడు. అట్టి సోముడు సర్వౌషధులను తన రసానుప్రవేశముచే పోషించుచున్నాడు. ॥౧౩॥

౧౫ వ అధ్యాయము ౧౩వ శ్లోక వ్యాఖ్యావిశేషములు ♦ —

మధుసూదనసరస్వతీయము:—మరియు "గాం...ఓజసా" పృథివీదేవతారూపముగా భూమిని పొంది, స్వీయతేజస్సుచే ధూళిముష్టితుల్యముగ నున్న పృథివిని దృఢముగజేసి, పృథివియందున్న వస్తువులను నేనే ధరించుచుంటిని. అట్లేకానిచో సికతాముష్టివలె విడిపోయియుండెడిది. లేక క్రిందుగ జలములో మునిగిపోయియుండెడిది. "యేన ద్యౌ రుగ్రా పృథివీ చ దృఢా" అను మంత్రవర్ణ మీవిషయమునే జెప్పుచున్నది. మరియు "స దాధార పృథివీం" అను శ్రుతి హిరణ్యగర్భాపన్నుడగు పరమేశ్వరునే ధారకునిగా జెప్పుచున్నది. ఇట్లే పుష్ణామి...రసాత్మకః" సర్వరసస్వభావము కల చంద్రుడనై పృథివియందుత్పన్నమగు వ్రీహియవాదిసర్వౌషధులను పోషించుచుంటిని. ॥౧౩॥

శంకరానందీయము:— "గాం...ఓజసా" ఈశ్వరుడనగు నేను భూమిని, బలమును స్వస్నేహసంభావితచిక్కణత్వ బలముతో గోడవలె సంతతను వ్యాపించి, స్థావరజంగమాత్మక సర్వభూతములను- వాయువు ఎట్లు మేఘమండలమును ప్రవేశించి, జలమును ధరించుచున్నదో యట్లే ధరించుచుంటిని. విచారించుచో వాయువతీంద్రియ మగుట మేఘమండలమున కన్పట్టుటలేదు. అట్లైనను, యోగిదృష్టితోడను, యుక్తిచేతను నాలోచించుచో వాయువు కంటె వేరుగ మేఘమునకు పృథక్సత్త్వమే లేదు.

గీ॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్ ॥ ॥౧౪॥

పదవిభాగము:—అహం–వైశ్వానరః–భూత్వా–ప్రాణినాం–దేహం–ఆశ్రితః–ప్రాణాపానసమాయుక్తః–పచామి–అన్నం–చతుర్విధమ్ ॥ ॥౧౪॥

ప్రతిపదార్థము:—అహం = నేనే; వైశ్వానరః = జాఠరాగ్నిస్వరూపమై; భూత్వా = అయి; ప్రాణినాం = జీవులయొక్క; దేహం = దేహమును; ఆశ్రితః = ఆశ్రయించినవాడనై; ప్రాణాపానసమాయుక్తః = ప్రాణాపానములతో గూడినవాడనై; చతుర్విధం = భక్ష్యము, భోజ్యము, చోష్యము, లేహ్యము అనెడి నాలుగువిధములైన; అన్నం = అన్నమును; పచామి = పచనము చేయుచుంటిని. ॥౧౪॥

శాంకరభాష్యమ్:—

కించ— అహమితి । అహమేవ వైశ్వానర ఉదరస్థోఽగ్ని ర్భూత్వా– "అయ మగ్ని ర్వైశ్వానరో యోఽయ మన్తః పురుషే యేనేద మన్నం పచ్యతే" ఇత్యాదిశ్రుతేః । వైశ్వానర స్స న్ప్రాణినాం ప్రాణవతాం దేహ మాశ్రితః ప్రవిష్టః ప్రాణాపానాభ్యాం సమా

మరియు నేనే యుదరమందుండు యగ్నిస్వరూపడనై "అయ మగ్ని ర్వైశ్వానరో యోఽయ మన్తః పురుషే, యేనేద మన్నం పచ్యతే" పురుషునిలోపల యే వైశ్వానరుఁడు గలఁడో, యెవనిచే యీ యన్నము పచనము చేయఁబడుచున్నదో, అను శ్రుత్యుక్తరీతిని ప్రాణుల దేహము నాశ్రయించినవాడనై ప్రాణాపానసమాయుక్తుడనై భోజ్యము, భక్ష్యము,

పై విధముగనే నాచే వ్యాప్తమైన భూమికి నాకంటె వేరుగ సత్త్వము లేదు. కాన భూమియందంతటను మద్బుద్ధియే చేయదగు నని యర్థము. "పుష్ణామి...రసాత్మకః" అమృతరసస్వరూపుడుగాని, లేక రసస్వరూపుడు గాని యగు చంద్రుడనై వ్రీహియవగోధూమాదిరూపము, వృక్షలతాతృణగుల్మాదిరూపము నగు సర్వౌషధిజాతమును పోషించుచుంటిని. (ఈచెప్పుటచే జంద్రుడు, చంద్రామృతరసపుష్టములగు సర్వౌషధులు గూడ నావిభూతులే గాన వానియందు మద్బుద్ధిని జేయదగు నని సూచితమయ్యెను) ॥౧౩॥

—• ౧౫ వ అధ్యాయము ౧౪ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మరియు నేను (ఈశ్వరుడు) "అయ మగ్ని ర్వైశ్వానరో యోఽయ మంతఃపురుషే యేనేద మన్నం పచ్యతే" అను శ్రుత్యుక్తరీతిని జాఠరాగ్నినై, సర్వప్రాణుల దేహముల నాశ్రయించినవాడనై, ప్రాణాపానవాయువులతో సంధుక్షితుడనై, భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యరూపముగ నున్న నాలుగువిధములైన యన్నమును పచనము చేయుదును. (దంతములతో కొరికి ముక్కలుగ జేయబడి నమలబడు చక్కిలము మొదలగునది భక్ష్యమనబడును. జిహ్వచే నిటునటు లోడన జేసి మ్రింగెడి మాంసాదికము భోజ్యమనబడును. జిహ్వయందుంచుకొని రసాస్వాదముతో నాకబడు గుడరసాలాదికము లేహ్యమనబడును. దంతములతో పిండి రసాంశమును మ్రింగి పిప్పి తుక్కు మొదలగు దానిని విడచి సేవింపబడు చెరకుకఱ్ఱ మొదలగునది చోష్యమనబడును.) భోక్తయగు నగ్ని, భోజ్యమగు నన్నము (సోమము) నీరెండును అగ్నిషోమము లనబడును. ఈరెండింటిని సర్వాత్మ యగు బ్రహ్మముగా ధ్యానించుచో నన్నదోషజనిత మగు లేపము తొలగునని తెలిసికొనదగును. ॥౧౪॥

గీ॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తస్స్మృతి ర్జ్ఞాన మపోహనం చ ।
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో వేదాన్తకృ ద్వేదవిదేవ చాహమ్ ॥ ॥౧౫॥

పదవిభాగము:— సర్వస్య- చ- అహం- హృది- సన్నివిష్టః- మత్తః- స్మృతిః- జ్ఞానం- అపోహనం- చ- వేదైః- చ- సర్వైః- అహం- ఏవ- వేద్యః- వేదాంతకృత్- వేదవిత్- ఏవ- చ- అహమ్ ॥

॥౧౫॥

ప్రతిపదార్థము:— సర్వస్య = నిఖిలప్రాణులయొక్క; హృది = బుద్ధియందు; అహం = నేను; ఆత్మా సన్ = (ఈపదవ ధ్యాహార్యము) ఆత్మయైనవాడనై; సంనివిష్టః = లెస్సగ నుంటిని; మత్తః = నావలననే; సర్వస్య = నిఖిల ప్రాణులకు; స్మృతిః = స్మృతియు; జ్ఞానం = జ్ఞానము; అపోహనంచ = స్మృతిజ్ఞానముల భ్రంశయు; భవంతి = (ఈపదమధ్యాహార్యము) కలుగుచున్నవి; సర్వైః = నిఖిలమైన; వేదైః = వేదములచేత; అహమేవ = నేనే; వేద్యః = తెలిసికొనదగినవాడను; అహమేవ = నేనే; వేదాంతకృత్ = వేదాంతార్థసంప్రదాయమునుచేసిన వాడను; అహమేవచ = నేనే; వేదవిత్ = వేదార్థవేత్తను।

॥౧౫॥

శాంకరభాష్యమ్:—

యక్త స్సంయుక్తః పచామి పక్తిం కరో మ్యన్న మశనం చతుర్విధం చతుష్ప్రకారం భోజ్యం భక్ష్యం చోష్యం లేహ్యం చ భోక్తా వైశ్వానరోఽగ్ని ర్భోజ్య మన్నం సోమః, తదే తదుభయ మగ్నీషోమౌ సర్వ మితి పశ్యతోఽన్నదోషలేపో న భవతి ॥ ॥౧౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చోష్యము, లేహ్యము అనెడి నాలుగు విధములైన యన్నమును పచనము చేయుచుంటిని. భోక్త వైశ్వానరుడు. (అగ్ని) భోజ్యమైనది యన్నము.(సోముడు)ఈరెండును అగ్నీషోమములు. సర్వము యీ యగ్నీషోమస్వరూపము అని తెలిసికొనినవానికి అన్నదోషలేపము సంభవింపనేరదు.

॥౧౪॥

శంకరానందీయము:— నేను (ఈశ్వరుడు) "అయ మగ్ని ర్వైశ్వానరో యోఽయ మంతః పురుషే యేనేద మన్నం పచ్యతే" అను శ్రుత్యనుసారము జఠరాగ్నిహోత్రముగా నయి సర్వప్రాణులదేహము నాశ్రయించినవాడనై, ('తస్య మధ్యే మహా నగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతోముఖః) అనియు "వాశ్యా ముపరి తిష్ఠతి" అను శ్రుతిచెప్పున ప్రాణుల యుదరమునం దున్నవాడనై). పాకసహకారులగు ఉచ్ఛ్వాసనిశ్శ్వాస రూపములు నగు ప్రాణాపానవాయువులతో ప్రజ్వలించినవాడనై, భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య, భేదముచే నాలుగువిధములుగ ప్రాణులచే భుక్తమగు నన్నమును పచనము చేయుచుంటిని. లేక "ప్రాణినాం" అను సామాన్యోక్తిచే ప్రాణు లందరిచే ననుభవింపబడు అన్నమని యర్థము. అన్నము పార్థివ, ఆప్య, తైజస, వాయవ్యరూపముగ నాలుగువిధములు. అందు మనుష్యాదులకు పార్థివము, చాతకాదులకు ఆప్యము, వాలఖిల్యాదులకు తైజసము, సర్పాదులకు వాయవ్యము నగు నన్నమును ఆయా జఠరములలో నుండి పచనము చేయుదును. (ఈచెప్పుటచే నగ్నిస్వరూపుడ నగు నాచే నాపాదతలమస్తకము వ్యాపింపబడిన ప్రాణులకు మద్వ్యతిరేకముగ (నన్ను విడచి) వేరుగ సత్త్వము లేమింజేసి, యా ప్రాణులయందు మద్బుద్ధిని (ఈశ్వరత్వబుద్ధిని) చేయదగు నని సూచితమయ్యెను.

॥౧౪॥

శాంకరభాష్యమ్:—

కించ— సర్వస్యేతి। సర్వస్య ప్రాణిజాతస్యాహ మాత్మా సన్ హృది బుద్ధౌ సంనివిష్టః। అతో మత్త ఆత్మనస్సర్వప్రాణినాం స్మృతి ర్జ్ఞానం తదపోహనం చాపగమనం చ; యేషాం పుణ్యకర్మణాం చ పుణ్యకర్మానురోధేన జ్ఞానస్మృతీ భవతః, తథా పాపకర్మణాం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు నిఖిలప్రాణులకు నేనే యాత్మనై బుద్ధియందు లెస్సగనుంటిని. ఆత్మవలననే నిఖిల ప్రాణులకు స్మృతి, జ్ఞానము, స్మృతిజ్ఞానముల భ్రంశయు కలుగుచున్నవి. ఎవరు పుణ్యకర్మ కలవారో వారలకు పుణ్యకర్మానురోధముచే స్మృతిజ్ఞానములు సంభవించుచున్నవి. అట్లే ఎవరు

—౧౫వ అధ్యాయము ౧౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు.—

మధుసూదనసరస్వతీయము:— "సర్వస్య...సంనివిష్టః" బ్రహ్మాదిస్థావరాంతమగు సర్వ ప్రాణిజాతమునకు నాత్మనై బుద్ధియందుంటిని. "స ఏష ఇహ సంనివిష్టః" అనియు, "అనేన జీవే నాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" అను శ్రుతియు నీవిషయమునే చెప్పుచున్నది. కాన "మత్తస్స్మృతి ర్జ్ఞాన మపోహనం చ" నానుండియే పూర్వానుభూతార్థములు విషయములుగా గల వృత్తి రూప మగు స్మృతియు, అట్లే విషయేంద్రియసంయోగజన్య మగు జ్ఞానమున్ను కల్గుచున్నవి. యోగులకు దేశకాలవిప్రకృష్టవిషయక మగు జ్ఞానము కల్గుచుండెను. ఇట్లే కామ క్రోధ శోకాదులచే వ్యాకులమగు చిత్తము గలవానికి, ఆస్మృతి. జ్ఞానముల యపగమమున్ను నానుండియే కల్గుచున్నవి. ఈవిధముగా తాను జీవరూపుడ నని చెప్పి బ్రహ్మస్వరూపుడ నని చెప్పుచుండెను— "వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః" "ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్। ఏకం స ద్విప్రా బహుధా వ దం త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః" అను మంత్రవర్ణము ననుసరించియు, "ఏష ఉహ్యేవ సర్వే దేవాః" అను శ్రుతి ననుసరించియు, నింద్రాదిదేవతాప్రకాశకము లగు సర్వవేదములచేతను, సర్వాత్మ నగుట నేనే తెలిసికొనదగినవాడను. "వేదాంతకృత్" వేదవ్యాసాదిరూపమున సర్వవేదాంతార్థ సంప్రదాయ ప్రవర్తకుడను నేనే. ఇంతమాత్రమే కాదు. "వేదవిదేవ చాహం" కర్మోపాసనాజ్ఞాన కాండాత్మకమై మంత్రబ్రాహ్మణ రూపమగు సర్వవేదముల యొక్క యర్థమును తెలిసికొనినవాడను గూడ నేనే. కనుకనే "బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహం" అని లెస్సగ జెప్పబడెను.

శంకరానందీయము;— ఈవిధముగ జాఠరాగ్నిస్వరూపు డగు నీశ్వరునిచే వ్యాప్తులైన సర్వ ప్రాణులు నీశ్వరవిభూతు లగుట నీశ్వరమూర్తు లగుట సిద్ధించినను, భ్రమప్రమాదములచే 'నీతడు శిష్టుడు, ఈతడు భ్రష్టుడు, ఈతడు శూద్రుడు. ఈతడు పుల్కసుడు,'' అను భేదబుద్ధి నీశ్వరోపాసకు లగు ముముక్షువులు చేయరాదు. కాన నట్టి వారలకు సర్వత్ర పరమేశ్వరత్వబుద్ధిదార్ఢ్యమునకై, సర్వప్రాణులు తనచే వ్యాపింపబడినవారు గాన స్వస్వరూపులే యనియు, తన నుపాసించు శుద్ధాత్ములకాత్మజ్ఞానము, తన నుపా సింపని యపరిశుద్ధాత్ములకు అజ్ఞానముగూడ తననుండియే కల్గుచున్న వని యీశ్లోకమున ప్రతిపాదించు చుండెను— "సర్వస్య చాహం హృది సంనివిష్టః"— "మమై వాంశో జీవలోకే జీవభూత స్సనాతనః" అను గీతోక్తరీతిని బ్రహ్మాదిస్తంబపర్యంత మగు ప్రాణిజాతము యొక్క (ఇచ్చట చకారసన్నివేశము అంతటను సమమైనదే యనిసూచించుటకై ప్రయుక్తము.) బుద్ధిగుహయందు పరమాత్మ నగు నేను

శాంకరభాష్యమ్:—

**పాపకర్మానురూపేణ స్మృతిజ్ఞానయో రపోహనం చాపాయన మపగమనం చ। వేదైశ్చ సర్వై రహమేవ పరమాత్మా వేద్యో వేదితవ్యః। వేదాన్తకృ ద్వేదాన్తార్థసమ్ప్రదాయకృ దిత్యర్థః। వేదవి ద్వేదార్థవిదేవ చాహమ్। ॥౧౫॥**

శాంకరభాష్యతత్త్వబోధిని:—

**పాపకర్మ కలవారో వారలకు పాపకర్మానురోధముచే స్మృతిజ్ఞానముల యపోహనము (భ్రంశము) సంభవించుచున్నది. నిఖిలవేదములచేతను నేనే తెలిసికొనదగినవాడను. వేదాన్తార్థసంప్రదాయకర్తను నేనే, నేనే వేదార్థవేత్తను. ॥౧౫॥**

క్షేత్రజ్ఞస్వరూపముతో సన్నిహితుడనై యుంటిని. కాన సమస్తప్రాణివర్గము నేనే యని యర్థము. (ఈచెప్పుటచే భేదదర్శనమున కవకాశమే లేదని సూచిత మయ్యెను.) ఈవిధముగా నంతయు పరమేశ్వరస్వరూపమే యని యంతటను పరమేశ్వరత్వబుద్ధితో బరమేశ్వరోపాసనమునే చేయువారికి ప్రాప్తించు ఫలమును, పైవిధముగ బరమేశ్వరోపాసనము జేయని వారికి కలుగు దుష్ఫలమును జెప్పుచుండెను.— "మత్తస్స్మృతి ర్జ్ఞాన మపోహనం చ" నానుండియే (పరమేశ్వరునుండియే) నన్నుపాసించుటచే బరిశుద్ధాంతఃకరణు లగువారలకు శాస్త్రాచార్యానుగ్రహము వలన "స ఆత్మా తత్త్వ మసి" అను శ్రుత్యుక్తరీతిని నిర్విశేషుడను, త్రివిధపరిచ్ఛేదశూన్యుడు నగు నాత్మ నీవై తివని శ్రీగురువుచే బోధితుడైన యాయాత్మనే నేను అని యా యాత్మయందే స్వస్వరూపత్వస్మృతియు, ఈసర్వము నేను బ్రహ్మమే యను బ్రహ్మమాత్రత్వజ్ఞానము కల్గును. ఇక నన్నుపాసించని మలినబుద్ధులగు రాగాదిదోషదుష్టులకు నానుండియే (ఈశ్వరునుండియే) అస్మృతిజ్ఞానములయొక్క యసంభవము ప్రాప్తించును. మరియు "వేదాంతకృత్"— "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అను శ్రుత్యుక్తరీతిని బ్రహ్మకు గూడ వేదాంతామగ్రహకర్తను నేనే. లేక, లోకమున శిష్యులకు ఆచార్యరూపుడనై వేదాంతార్థములను ప్రకాశింపచేయువాడను నేనే. "వేదవిదేవ చాహం" వేదార్థమైన నిర్విశేషబ్రహ్మమును నాయనుగ్రహముచేతను, గుర్వనుగ్రహముచేతను తెలిసికొనినవాడు బ్రహ్మవేత్త యనబడును. అట్టి వేదవేత్తను గూడ నేనే యగుదును (ఇట "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" అనుగీతానుసారము సర్వప్రాణిజాతముగూడనాత్మవ్యాప్తిచే నాత్మస్వరూపమే యని సిద్ధించుచుండెను. అట్లయ్యును "వేదాంతోపదేష్ట యగు గురువుయందును బ్రహ్మవేత్తయందును పరమేశ్వరత్వబుద్ధి నవశ్యము చేయదగు" నని సూచించుటకు "వేదాంతకృద్వేదవిదేవచాహం" అని విశేషించి చెప్పబడెను.) "య దాదిత్యగతం తేజః" అను మొదలగు వానిచే ముముక్షువు లుపాసించుటకై యాత్మవిభూతి చెప్పబడెను. ఇట్లుండ నీయాదిత్యగతతేజస్సే యాత్మయొక్క పారమార్థికరూప మని భ్రమ కల్గవచ్చును. అట్టి భ్రమ కలుగకుండుటకై చెప్పుచుండెను.— "వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః" "సర్వే వేదా యత్పద మామనన్తి" అను శ్రుత్యనుసారము నేను ఋగ్యజుస్సామాథర్వణవేదములలోని కర్మభాగముచే దెలిసికొనదగినవాడను. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, విజ్ఞాన మానందం బ్రహ్మ, ఆనందో బ్రహ్మ, తదేత ద్బ్రహ్మాపూర్వ మస్థూల మన ణ్వహ్రస్వ మప్రాణ మముఖ మశ్రోత్ర మవా గమనో ఽ తేజస్క మచక్షుష్కం, అనామగోత్రం, అశబ్దమస్పర్శ మరూప మవ్యయం, నిష్కలం నిష్క్రియం శాంతం, నిత్యశుద్ధం బుద్ధం ముక్తం సత్యం సూక్ష్మం పరిపూర్ణ మద్వయం సదానందచిన్మాత్రం శాంతం చతుర్థం మన్యంతే

గీ॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ ౧౬॥

పదవిభాగము:— ద్వౌ- ఇమౌ- పురుషౌ- లోకే- క్షరః- చ- అక్షరః- ఏవ- చ- క్షరః- సర్వాణి- భూతాని- కూటస్థః- అక్షరః- ఉచ్యతే ॥

ప్రతిపదార్థము:— క్షరశ్చ = (క్షరతీతి క్షరః వినాశీ) నశించునది; అక్షరఏవచ = నశించనిభగవన్మాయాశక్తి; ఇమౌ = ఈ; ద్వౌ = రెండు; లోకే = సంసారమునందు; పురుషౌ = పురుషులు; సర్వాణి = నిఖిలమైన; భూతాని = భూతములు (నిఖిల వికారజాతము) క్షరః = క్షరమనియు; కూటస్థః = (కూటఇవస్థితః కూటస్థః) రాశివలెనుండునది; లేక అనేకమాయాదిప్రకారముగా నుండునది కాన కూటస్థము మాయాశక్తి; అక్షరః = అక్షరమని; ఉచ్యతే = చెప్పబడుచున్నది. ॥౧౬॥

శాంకరభాష్యమ్:—

భగవత ఈశ్వరస్య నారాయణాఖ్యస్య విభూతిసంక్షేప ఉక్తో విశిష్టోపాధికృతః "యదాదిత్యగతం తేజ" ఇత్యాదినా । అథ అధునా తస్యైవ క్షరాక్షరోపాధిప్రవిభక్తతయా నిరుపాధికస్య కేవలస్య తత్త్వనిర్దిధారయిషయా ఉత్తరే శ్లోకా ఆరభ్యన్తే । తత్ర సర్వ మేవాతీతానాగతాధ్యాయార్థజాతం త్రిధా రాశీకృత్యాహ — ద్వావితి । ద్వావిమౌ పృథగ్రాశీకృతౌ పురుషా విత్యుచ్యేతే లోకే సంసారే। క్షరశ్చ-క్షరతీతి క్షరో వినాశీ త్యేకో రాశిః, అపరః

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భగవంతు డగు నారాయణుని (యీశ్వరునియొక్క) విభూతిసంక్షేపము విశిష్టోపాధికృతము "యదాదిత్యగతం తేజః" ఇత్యాదికముచే చెప్పబడెను. ఇప్పుడు అట్టి యీశ్వరుడు క్షరాక్షరోపాధివిభక్తు డగుటచే నిరుపాధికమైన కేవలపరమేశ్వరునియొక్క స్వరూపమును నిర్ధారణ చేయు నిచ్ఛచే నుత్తరశ్లోకము లారంభింపబడుచున్నవి. అందతీతానంతరాధ్యాయార్థజాతమును మూడు రాశులుగ జేసి చెప్పుచుండెను. "క్షరతీతి క్షరః వినాశీ" నశించునది యగు క్షర మొకరాశి. అపరపురుషుడు, క్షర మనెడు పురుషున కుత్పత్తిబీజము. అనేక జీవుల కామ

స ఆత్మా స విజ్ఞేయః, తత్త్వమసి," అను మొదలగు శ్రుతులచే నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావుడు, సచ్చిదానందైకరసుడు, నద్వితీయుడు నగు పరమాత్మ తెలిసికొనదగును. పరమార్థముగ నట్టి పరమాత్మను నేనేయగుదును గాని మాయోపాధికమగు సూర్యాది గతతేజస్స్వరూపుడను గానని యర్థము. ॥౧౪॥

౧౫వ అధ్యాయము ౧౫వ శ్లోక వ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఈవిధముగా సోపాధిక మగు నాత్మను నిరూపించి, క్షరాక్షరశబ్దవాచ్యము లగు కార్య, కారణోపాధుల విభాగపురస్సరముగ నిరుపాధిక శుద్ధబ్రహ్మమును శ్రీకృష్ణ భగవానులు కృపతో నర్జునునకు మూడుశ్లోకములచే జెప్పుచుండెను:— "ద్వా విమౌ... ఏవచ" సంసారమున వేర్వేరుగ రాశులుగ జేయబడిన పురుషశబ్దవ్యపదిష్టులు రెండు విధములుగ నుండిరి. వారెవరన? అందొకడు క్షరుడు (వినాశి) కార్యరాశిగ నుండెను. వేరొకడు అక్షరుడు (వినాశరహితుడు). క్షరాఖ్యపురుషునకు ఉత్పత్తిబీజమైన భగవన్మాయాశక్తియే యక్షరు డనబడును. ఈక్షరాక్షరములను వివరించుచుండెను.

శాంకరభాష్యమ్:—

పురుషోఽక్షర స్తద్విపరీతో భగవన్మాయాశక్తిః క్షరాఖ్యస్య పురుష స్యోత్పత్తిబీజ మనేకసంసారిజన్తు కామకర్మాదిసంస్కారాశ్రయః, అక్షరః పురుష ఉచ్యతే। కౌ తౌ పురుషా విత్యాహ స్వయమేవ భగవాన్— క్షర స్సర్వాణి భూతాని, సమస్తం వికారజాత మిత్యర్థః। కూటస్థః కూటో రాశీ రాశిరివ స్థితః। అథవా కూటో మాయా వంచనా జిహ్మతా కుటిలతేతి పర్యాయా అనేకమాయావంచనాది ప్రకారేణ స్థితః కూటస్థః సంసారబీజానన్త్యా న్న క్షరతీ త్యక్షర ఉచ్యతే। ॥౧౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కర్మసంస్కారములకాశ్రయము అగు భగవంతునియొక్క మాయాశక్తి అక్షర మనెడు పురుషుడని చెప్పబడుచున్నది. ఆపురుషు లిరువురెవరనిన కృష్ణపరమాత్మ స్వయముగనే చెప్పుచుండెను. నిఖిలవికారజాతము క్షర మనబడును. కూట మనగ రాశి. రాశి వలె నుండునది కూటస్థ మనబడును. లేక, కూట మనగ మాయ. అనగా వంచన. దీనినే జిహ్మత అనియు, కుటిలత యనియు నందురు. అనేక మాయాది ప్రకారములచే నుండునట్టి కూటస్థము యీశ్వర మాయాశక్తి. సంసారబీజానంత్యము వలన నశించునదికాదు. కాన అక్షరమనబడును. ॥౧౬॥

"క్షర...ఉచ్యతే" సర్వభూతములు (సమస్తకార్యజాతము) క్షర మనబడును. యథార్థవస్త్వాచ్ఛాదనము, నయథార్థవస్తుప్రకాశనము (వంచనము) కూట మనబడును. ఇదియే మాయ; అట్టి ఆవరణవిక్షేపశక్తిద్వయరూప మగు కూటము తో నుండువాడు గాన భగవన్మాయాశక్తిరూపుడగు కారణోపాధి కూటస్థునబడును. అట్టి కూటస్థుడు సంసారమునకు బీజ మగుటచే నగు నానంత్యమువలన అక్షరు డనబడును. ॥౧౬॥

శంకరానందీయము:— విచక్షణులు, యుక్తికుశలురు, సూక్ష్మబుద్ధులు ముముక్షువులు నగు శుద్ధాత్ములకు వివేకవైరాగ్యములు సిద్ధించుటకై సంసారమును వృక్షముగా వర్ణించి, ఆసంసారవృక్షము నధిరోహించిన యవివేకులు, నవిరక్తులు నగు మూఢులకు అధఃపతనమును విడచి వేరొండు గతి లేదనియు, నట్టివారికి మోక్షఫలము చేకూరదుగాన వివేకోత్పన్న మగు వైరాగ్యఖడ్గముచే నీసంసారవృక్షమును ఛేదించి సదసద్వివేచనమునుజేసి పరతత్త్వము తెలిసికొనదగును. కాన నీతత్త్వమును తెలిసికొను ప్రవృత్తి కల్గుటకై బ్రహ్మవేత్తలకు బ్రహ్మప్రాప్తిని, తత్ప్రాప్తిసాధనమును, తత్ఫలమును గూడ నిరూపింప ప్రస్తుతము జ్ఞాతవ్యమగు బ్రహ్మస్వరూపమును అతన్నిషేధపూర్వకముగ మూడు శ్లోకములచే చెప్పుచుండెను— అందు మొదటి శ్లోకముచే పురుషోత్తము డగు పరబ్రహ్మకు వేని నపేక్షించి పురుషోత్తమత్వము సిద్ధించునో యట్టి ప్రకృతి, తత్కార్యరూపోపాధిభూతు లగు నాపురుషులను చెప్పుచుండెను— దేనినపవదించుటచే బ్రహ్మకు అసంసారిత్వము, నిర్విశేషత్వము, శుద్ధత్వము, నిత్యముక్తత్వము, నద్వితీయత్వము సిద్ధించునో యట్టిదానిని చెప్పుచుండెను— "క్షరశ్చ" (ఇట చకారము సముచ్చయార్థకము.) తన కాలమున నశించు స్వభావము కల మహదాదిస్థూలాంత మగు సంసారరూపమైన కార్యవర్గము సర్వము నొక పురుషుడు. "అక్షరశ్చ" (ఇట గూడ చకారము సముచ్చయార్థకము.) అక్షరుడు రెండవపురుషుడు. క్షరాఖ్యపురుషుడెట్లు స్వకాలమున నశించునో యట్లు ఈయక్షరపురుషుడు నశించువాడు కాడు. సంసారకారణ మగు మూలప్రకృతిరూపమైన యీయక్షరపురుషుడు పరమాత్మవిజ్ఞానమును విడచి వేరొకదానిచే నశించువాడు కాడు. పురుషశబ్దవాచ్య మగు నాత్మకుపాధు లగుటచే నీక్షరాక్షరములు రెండును పురుషు లనబడును గాని వస్తుతః

గీ॥ ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః ॥ ॥౧౮॥

పదవిభాగము:— ఉత్తమః- పురుషః- తు- అన్యః- పరమాత్మా- ఇతి- ఉదాహృతః- యః- లోకత్రయం- ఆవిశ్య- బిభర్తి- అవ్యయః- ఈశ్వరః ॥ ॥౧౮॥

ప్రతిపదార్థము:— అన్యః=క్షరాక్షరములకంటె యత్యంత విలక్షణుడైన; ఉత్తమః=ఉత్కృష్టతముడైన; పురుషః=పురుషుడు; పరమాత్మేతి=పరమాత్మ యని; ఉదాహృతః= చెప్పబడెను; యః=ఏ; అవ్యయః= నాశరహితుడైన; ఈశ్వరః=ఈశ్వరుడు; లోకత్రయం=భూలోక, భువర్లోక, సువర్లోకములను; ఆవిశ్య=ప్రవేశించి; బిభర్తి=ధరించుచుండెనో: "స ఉత్తమః పురుషః" అని పూర్వముతో నన్వయము. ॥౧౮॥

---

ఇవి పరిచ్ఛిన్నము లగుటచేతను, అనిత్యము లగుటచేతను, అసత్తు లగుటచేతను నివి ముఖ్యార్థముగ పురుషశబ్ద వాచ్యములు గావు. (పదవినియోగము అర్థానుసారియగుట నిట ఏవ కారము ననుసంధింపదగును.) ఈక్షరాక్షరములు రెండే పురుషులు. అనగా సంసారమున ఆత్మకు సంసారిత్వము సిద్ధించుటకై క్షరాక్షరములు రెండే పురుషోపాధులు. (ఇంతకంటె వేరుగ నెవడును లేడు. అని యిట ఏవకారమున కర్థము.) ఆ క్షరాక్షరములేవి? అను నాకాంక్షపై జెప్పుచుండెను— ఆకాశాది భూమ్యంతము లగు భూతములు, భూతకార్యము లగు దేహేంద్రియాదులు నివన్నియు "క్షర" శబ్దముచే జెప్పబడును. అభివ్యక్త నామరూపాత్మక మగు మహదాది వికారజాతమంతయు 'క్షర' నామకపురుషు డని యర్థము. మహదాదిపృథివ్యంతము, సమష్టివ్యష్ట్యాత్మకము, స్థూలసూక్ష్మప్రపంచరూపము నగు కార్యరాశి కూట మనబడును. ఈకూటమునందు సర్వవికారజాతము జేరును. ఈకూటమునందంతటను ఘటాదికమునందు మృత్తువలె లోపల వెలుపల నంతటను, కారణమగుట వ్యాపించియుండునది గాన ప్రకృతిశబ్దవాచ్యమగు నవ్యక్తము కూటస్థ మనబడును. లేక పుత్రసంతతికిని, పుత్రికాసంతతికిని మూలపురుషుడు కూటస్థు డనబడును. పైవిధముగ రజఃకార్యసంతతికిని, తమఃకార్యసంతతికిని, సత్త్వకార్యసంతతికిని మూలభూత మగు త్రిగుణాత్మక యగు ప్రకృతి కూటస్థమనబడును. లేక 'కూటసాక్షి' మొదలగు స్థలములందు కూటశబ్దము కపటమును చెప్పును. అట్టి కూట (పురుషుని విపరీతభావాపాదన) మునందుండు త్రిగుణాత్మిక యగు మాయ కూటస్థ మనబడును. అట్టి మాయయే అక్షర మని చెప్పబడును. ఈక్షరాక్షరములు రెండే యాత్మకు సంసారిత్వము నాపాదించుటలో గారణములు. ఇక ఈ సంసారిత్వ నివృత్తికి "న సత్త న్నాస దుచ్యతే" అను న్యాయమున నీక్షరాక్షరనిరసనమే కారణ మగును. ఈవిధముగ నిరస్తాశేష విశేషములు గల పరబ్రహ్మమునందే యాత్మభావాపత్తితో దిరిగి యనాత్మాఽనాలంబనమే విదేహకైవల్యమునకు కారణ మగు నని పూర్వమే చెప్పియుంటిమి. దానిని మాత్రము మరువదగదు. ॥౧౬॥

## —౧౫ వ అధ్యాయము ౧౮వ శ్లోక వ్యాఖ్యావిశేషములు—

మధుసూదనసరస్వతీయము:— "ఉత్తమః... ఈశ్వరః" ఈక్షరాక్షరములకంటె విలక్షణుడును, అక్షరాక్షరోపాధిద్వయదోషాఽసంస్పృష్టుడును, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుడును, ఉత్తము (ఉత్కృష్టు) డగు పురుషుడు- జడరాశు లగు నీక్షరాక్షరములకంటె వేరై యాక్షరాక్షరములకవభాసకుడై మూడవదియగు చేతనారాశిగ నుండెను. ఆయుత్తమపురుషుడు "పరమాత్మేత్యుదాహృతః" "పరమశ్చాసావాత్మాచ" అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ రూపపంచకోశములు అవిద్యాకల్పితాత్మరూపములు. అట్టి కోశపంచకముకంటెను పరమ (ప్రకృష్ట) మై యకల్పితమగు బ్రహ్మము

శాంకరభాష్యమ్:—

ఆభ్యాం క్షరాక్షరాభ్యా మన్యో విలక్షణః క్షరాక్షరోపాధిద్వయదోషేణాస్పృష్టో నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావః— ఉత్తమ ఇతి। ఉత్తమ ఉత్కృష్టతమః పురుష స్త్వన్యోఽత్యన్త విలక్షణః ఆభ్యాం, పరమాత్మేతి పరమ శ్చాసౌ దేహాద్యవిద్యాకృతాత్మభ్యః, ఆత్మా చ సర్వ భూతానాం ప్రత్యక్చేతన ఇత్యతః పరమాత్మేత్యుదాహృత ఉక్తో వేదాన్తేషు। స ఏవ విశి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈక్షరాక్షరములకంటె విలక్షణుడు, క్షరాక్షరోపాధిద్వయదోషముచే నసంస్పృష్టుడు, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుడు, ఉత్కృష్టతముడు, అత్యన్తవిలక్షణుడు నగు పురుషుడు పరమాత్మయని చెప్పబడుచుండెను. 'పరమ శ్చాసా వాత్మేతి పరమాత్మా' దేహాద్యవిద్యాకృతాత్మలకంటె నుత్కృష్టుడు, సర్వభూతములకు ప్రత్యక్చేతనుడును కాన పరమాత్మ యని

"బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అను శ్రుత్యుక్తరీతిని ఆత్మగ (సర్వభూతములకు ప్రత్యక్చేతనముగ) వేదాంతములయందు చెప్పబడెను. "యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః" యేపరమాత్మ భూర్భువస్సువరాది లోకత్రయము నంతను స్వీయమాయాశక్తిచే నధిష్ఠించి సత్తాస్ఫూర్తిప్రదానముచే భరించుచుండెనో, మరియు పోషించుచుండెనో, ఆపరమాత్మ యెట్టివాడన: అవ్యయుడు, (సర్వవికారశూన్యుడు.) ఈశ్వరుడు. (సర్వనియంత.) అట్టి పరమాత్మ ఉత్తమపురుషుడుగా చెప్పబడెను. ॥౧౭॥

శంకరానందీయము:— ఈవిధముగా కార్యకారణము లగు క్షరాక్షరముల రెండింటికి పురుషశబ్దవాచ్యత్వమును ప్రతిపాదించి ఉపాధులగు నీరెండింటికంటెను భిన్నము, తద్ధర్మకర్మాద్యసంస్పృష్టము నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము, పరశబ్దార్థము, ముక్తోపసృప్యము, నగు పరతత్త్వమును నిర్దేశించుచుండెను— "ఉత్తమః" పరబ్రహ్మము "జ్యాయానన్తరిక్షాజ్జ్యాయా న్దివః" అనియు, "తతో జ్యాయాంశ్చ పూరుషః" అను శ్రుతుల చొప్పున స్వయముగ సత్తచేతను, స్ఫూర్తిచేతను, మహత్తమమై, నిరతిశయవైభవము కలదియై, పరిచ్ఛేదరహితమై సర్వోత్తమమగును. కనుకనే యంతటను పరిపూర్ణుడగుటచే పురుషుడు ఉత్తముడు (ఇట ఉత్తమత్వము కల్గియుండి పురుషుడగుట యొకయాత్మకే చెల్లునని సూచించుటకు "తు" శబ్దము ప్రయుక్తము) ఈయుత్తమపురుషుడు సంసారకార్యకారణరూపము లగు క్షరాక్షరపురుషులకంటె "అన్యః" పరమమహత్తగుటచేతను, చేతనమగుటవలనను, జ్ఞాత యగుటచేతను, ప్రకాశక మగుటచేతను ఉత్తముడయిన యసంసారి యగు ప్రత్యగాత్మ వేరు. లోకమున స్థావరజంగమములకు ప్రకాశకుడై జ్ఞాతయైన సూర్యుడు ఆస్థావరజంగమములకంటె వేరై తద్ధర్మకర్మాద్యసంస్పృష్టు డెట్లగునో, అట్లే "నేనజ్ఞుడననియు, నాయహంకారమున నితడు దుష్టుడు," అనియు, స్వప్రకాశ్యములగు నజ్ఞానతత్కార్యములకంటె జ్ఞాతయు, తత్ప్రకాశకుడునగు ఆత్మ భిన్నుడుగనే కన్పట్టుచుండెను. కాన పరమాత్మ జ్ఞాత యగుటచేతను, అతిసూక్ష్మమగుటచేతను, అసంగ మగుటచేతను, ఆక్షరాక్షరములకంటె భిన్నుడై, తద్ధర్మకర్మాదులచే స్పృశింపబడకుండు నని యర్థము.

వాయువు మహత్త్వముకలదియై యతిసూక్ష్మమైనదైనను స్వభిన్నద్రవ్యములతో సంయోగించినపుడు దానికి దుష్టాదుష్టగంధములచే లేపము కన్పట్టుచున్నది. కనుకనే వాయువు దుర్గంధి యనియు, సుగంధి యనియు ననుభూతి కల్గుచున్నది. ఇట్లే పురుషోత్తము డగు నాత్మకూడ క్షరాక్షరభిన్నుడైనను, వాని సంబంధముచే తద్ధర్మకర్మాదులచే లేపము నొందును కదా? అనియాశంకింపదగదు. అట్లుకాము వాయువుపావయవ

శాంకరభాష్యమ్:—

ష్యతే। యో లోకత్రయం భూర్భువస్స్వరాఖ్యం స్వకీయయా చైతన్యబలశక్త్యాఽఽవిశ్య ప్రవిశ్య బిభర్తి స్వరూపసద్భావమాత్రేణ బిభర్తి ధారయతి। అవ్యయః- నాస్య వ్యయో విద్యత ఇత్యవ్యయః। కః? ఈశ్వర స్సర్వజ్ఞో నారాయణాఖ్య ఈశనశీలః॥ ॥౧౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వేదాంతములందు జెప్పబడెను. ఉత్తరార్థముచే నాయుత్తమపురుషుడే విశేషింపబడుచుండెను. నాశరహితమైన యేయీశ్వరుడు (నారాయణుడు) భూలోక భువర్లోక సువర్లోకములను తన చైతన్యబలశక్తిచే ప్రవేశించి స్వరూపసద్భావముచే ధరించుచుండెనో, అట్టి యుత్తమపురుషుడు పరమాత్మ యని చెప్పబడె నని పూర్వముతో నన్వయము. ॥౧౭॥

మగుట జెప్పిన యానత్వము సంభవించును గ్రా?. నిరవయవత్వాదిధర్మములు కల యాత్మ యాక్షరాక్షరముల కంటె నుత్కృష్ట మగుట తద్ధర్మకర్మాదులచే లేపము నొందకుండు నని బోధించుచుండెను— పరమాత్మే త్యుదాహృతః" "అన్యోఽంతర ఆత్మా ప్రాణ మయః" అని అన్నమయాదికూటస్థాంతమగు కోశముల కాత్మత్వము శ్రూయమాణమగుచున్నది. కాని ఆత్మశబ్దవాచ్యము లగు క్షరాక్షరములకంటె నిరవయవ మగుటచేతను, అతి సూక్ష్మమగుటచేతను ఆంతర మగుటచేతను, ప్రత్యగ్రూప మగుటచేతను జ్ఞాత యగుటచేతను, భాసకమగుట చేతను వ్యాపక మగుట చేతను, అసంగమగుటచేతను నిరతిశయ మగుట వలనను, ఆత్మ ప్రత్యగ్లక్షణములు కలదియై ప్రకృతికార్యములచే స్పృశింపబడుట కశక్యమై "పరమ" మని చెప్పబడును. "పరమశ్చాసా వాత్మేతి పరమాత్మా" అని విగ్రహము. "ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః। మనస స్తు పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహా న్పరః। మహతః పర మవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః। పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః" అనియు, "దివ్యో హ్యమూర్తః పురుష స్స బాహ్యాభ్యంతరో హ్యజః। అప్రాణో హ్యమనా శ్శుభ్రో హ్యక్షరాత్పరతః పరః॥" అనియు "అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః, పాదోఽస్య విశ్వా భూతాని. త్రిపాదస్యామృతం దివి" అను నీ మొదలగు శ్రుతులచేతను ఈయుత్తమ పురుషుడు పరమాత్మగ ప్రతిపాదింపబడెను.

పరమత్వ, చేతనత్వ, జ్ఞాతృత్వ, ప్రకాశకత్వాదిధర్మములచే నుత్తము డగు పురుషునకు సంసారతద్ధేతు భావములు కల క్షరాక్షరములకంటె నన్యత్వమును ప్రతిపాదించి, దానినే తిరిగి విశేషణములచే స్పష్టము చేయు చుండెను— "యో... ఈశ్వరః" సుషుప్తి సమాధ్యవస్థలు వ్యయమును నొందినను, ఆత్మ స్వయముగ నశింప కుండును గాన యవ్యయ మనబడును. (ఇత్యాది హేతుగర్భితవిశేషణము.) దాన ఆత్మ యవ్యయము గాన క్షరాక్షరములకంటె భిన్నము. అవ్యయము కానిది క్షరాక్షరభిన్నము కాకుండును. బుద్ధ్యాదిక మిట్టిదే యగును. ఇక సుషుప్తి సమాధులలో నాదెంటికి సాక్షిగానుండుటచే నాత్మకు వ్యయము సంభవింపదుగాన నిత్యమగుటచే నాక్షరాక్షరములకంటే భిన్నమగుటయు నుత్తమమగుటయు సిద్ధించును. ఆత్మ— "ఈశ్వరః" స్వసన్నిధిమాత్రముచే నాక్షరాక్షరముల వ్యాపృతికి హేతు వగుటచే నీశ్వరు డనబడును. ఈవిశేషణము హేతుగర్భితము, అందుచే— "క్షరాక్షరముల ప్రవృత్తికి హేతు వగుటవలన ఆత్మ ఆక్షరాక్షరములకంటె భిన్నము. లోకమున నొకప్రభువుచే ప్రవర్తితులగు ప్రధానాదులకంటె నాప్రభువు భిన్నుడును, నుత్తముడు నగును కదా? అట్లే యాత్మ స్వప్రవర్త్యము లగు క్షరాక్షరములకంటెభిన్నుడును నుత్తముడు నగును" అనిసిద్ధించును. ఇట్టియాత్మ "లోకత్రయమావిశ్య— లోక్యంతే జ్ఞాయంత ఇతి లోకాః సముష్టి

గీ॥ యస్మాత్క్షర మతీతో౽హ మక్షరా దపి చోత్తమః ।
అతో౽స్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥ ॥౧౮॥

పదవిభాగము:— యస్మాత్- క్షరం- అతీతః- అహం- అక్షరాత్- అపి- చ- ఉత్తమః- అతః- అస్మి- లోకే- వేదే- చ- ప్రథితః- పురుషోత్తమః । ॥౧౮॥

ప్రతిపదార్థము;— యస్మాత్ = ఏకారణమువలన; అహం = నేను; క్షరః = అశ్వత్థమనెడి సంసారమాయావృక్షమును; అతీతః = అతిక్రమించితినో; అక్షరాదపి = సంసారభూతమైన మాయాశక్తికంటెను; ఉత్తమః = ఉత్కృష్టతముడనో, ఊర్ధ్వతముడనో; అతః = ఆకారణమువలన; అనగా క్షరాక్షరములకంటె యుత్తముడ నగుటవలన; లోకే = లోకమునందు; వేదేచ = వేదమునందు; పురుషోత్తమః = పురుషోత్తముడనని; ప్రథితః = ప్రఖ్యాతమైనవాడనై; అస్మి = అయితిని. ॥౧౮॥

శాంకరభాష్యమ్:—

యథా వ్యాఖ్యాత స్యేశ్వరస్య పురుషోత్తమ ఇత్యేత న్నామ ప్రసిద్ధం తస్య నామ నిర్వచనప్రసిద్ధ్యా అన్వర్థత్వం నామ్నో దర్శయన్ 'నిరతిశయో౽హ మీశ్వర' ఇత్యాత్మానం దర్శయతి భగవాన్— యస్మాదితి । యస్మాత్క్షర మతీతో౽హం సంసారమాయావృక్ష మశ్వత్థాఖ్య మతిక్రాంతః, అహ మక్షరా దపి సంసారమాయావృక్షబీజభూతా దపి చోత్తమ ఉత్కృష్ట

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యథావ్యాఖ్యాతుడైన యీశ్వరునకు "పురుషోత్తముడు" అను నామము ప్రసిద్ధము. అట్టి నామముయొక్క నిర్వచనప్రసిద్ధిచే "పురుషోత్తమః" అను నామమున కర్థవత్త్వమును చూపుచు నిరతిశయమైన యీశ్వరుడను నేనే యని శ్రీకృష్ణపరమాత్మ తనను చూపుచుండెను.

వ్యష్టిలక్షణాః" అను విగ్రహము నాశ్రయించిన తెలియబడు నవియు, సమష్టివ్యష్టిరూపములు నగు స్థూలసూక్ష్మకారణదేహములు లోకము లనబడును. ఈదేహత్రయము నాధారముగ జేసికొని లోపల, వెలుపల అంతటను వ్యాపించి, సత్తాస్ఫూర్తుల నిచ్చుచు ధరించుచున్నది. "వ్యక్తావ్యక్తం భరతే విశ్వ మీశః" అనుశ్రుతి యీవిషయమునే చెప్పుచున్నది. (ఈచెప్పుటచే- "ఆత్మ లోకత్రయమున కాధార మగుటవలన స్వాధార్యమగు లోకత్రయముకంటె భిన్నము. చిత్తరువున కాధారమగు కుడ్యము చిత్తరువు నకు వేరగును కదా? కాన ఆత్మక్షరాక్షరములకంటె భిన్నము, సత్తమము అని సిద్ధించినది. లేక "లోక్యంతే దృశ్యంత ఇతి లోకాః" అను విగ్రహము ననుసరించి జూడబడు జాగ్రత్స్వప్నసుషుప్తములు లోకము లనబడును. ఆత్మ సాక్షిమాత్ర భోగ్యార్థము లగు జాగ్రత్స్వప్నసుషుప్తముల త్రయమును వ్యాపించి ప్రకాశింపజేయువాడు. "జాగ్రత్స్వప్నసుష ప్త్యాఖ్యప్రపంచం యత్ప్రకాశతే" అను శ్రుతి యీవిషయమునే చెప్పుచున్నది. "సూర్యుడు ప్రకాశకు డగుటచే స్వప్రకాశ్యమగు ఘటాదికముకంటె భిన్నుడుకదా? ఇట్లే ఆత్మ ప్రకాశకమగుటచే స్వప్రకాశ్య మగు జాగ్రత్స్వప్న సుషుప్తిరూపలోకత్రయముకంటె భిన్నుడు." అను అనుమానముగూడ ప్రమాణము. "ఏ నేను జాగరము ననుభవించితినో, స్వప్నమును చూచితినో, సుఖముగ నిద్రించితినో అట్టి నేనిప్పుడుంటిని." అను ప్రత్యభిజ్ఞ యుండుటచే ప్రకాశకమగు నాత్మ లోకత్రయభిన్న మనుటలో శ్రుతి, అనుమానము, ప్రత్యక్షము గూడ ప్రమాణములు. ఆత్మ లోకత్రయప్రకాశక మని సిద్ధించుటచే నాత్మకు నిత్యత్వ, పరమమహత్వ, చేతనత్వ, ప్రకాశస్వరూపత్వ, అభోక్తృత్వ, అవిక్రియత్వములు సిద్ధించినవి. ఆత్మ యవ్యయ మగుటచేతను, ఈశ్వరు డగుటచేతను, భర్తయగుటచే క్షరాక్షరపురుషులకంటె నుత్కృష్టు డగుటచే నాత్మకు పురుషోత్తమత్వము సర్వప్రమాణసిద్ధ మని భావము.

శాంకరభాష్యమ్:—

అత ఊర్ధ్వతమో వా అత స్తాభ్యాం క్షరాక్షరాభ్యా ముత్తమత్వా దస్మి భవామి । లోకే వేదే చ ప్రథితః ప్రఖ్యాతః పురుషోత్తమ ఇత్యేవం మాం భక్తజనా విదుః । కవయః కావ్యాదిషు చేదం నామ నిబధ్నన్తి పురుషోత్తమ ఇత్యనే నాభిధానే నాభిగృణన్తి । ॥౧౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏకారణమువలన నశ్వత్థమనెడి సంసారమాయావృక్షమును నే నతిక్రమించితినో, సంసారబీజభూతమైన అక్షరమైన మాయాశక్తికంటె నుత్కృష్టతముడనో (ఊర్ధ్వతముడనో) ఆకారణమువలన అనగా క్షరాక్షరముల కంటె నుత్తముడ నగుటవలన లోకమునందు, వేదమునందు "పురుషోత్తమః" అని ప్రఖ్యాతుడనై యుంటిని. భక్తులు నన్ను పురుషోత్తమునిగ తెలిసికొనుచున్నారు. కవులు కావ్యాదులయందు పురుషోత్తముడు అని నా నామమును సమర్పించుచుండిరి. అనగా "పురుషోత్తముడు" అను నామముచే స్తుతించుచుండిరి. ॥౧౮॥

## —• ౧౫ వ అధ్యాయము ౧౮ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ప్రస్తుతము యథావ్యాఖ్యాతమైన క్షరాక్షరవిలక్షణుడగు నీశ్వరుని "పురుషోత్తముడు" అను ప్రసిద్ధనామముచే నిర్వచించి, యిట్టి పరమేశ్వరుడను నేనే యని తన "బ్రహ్మణో హి ప్రతిష్ఠాహం తద్ధామ పరమం మమ" అని ప్రాగుక్తమగు స్వీయమహిమ నిర్ధారణమునకై చెప్పుచుండెను— "యస్మాత్ క్షర మతీతోఽహం" కార్యమగుటచే వినాశియు మాయామయము అశ్వత్థనామకము నగు సంసారము నతిక్రమించిన నేను "అక్షరా దపి చోత్తమః" మాయాస్వరూప మగు (అక్షరము) నవ్యక్తముకంటె అనగా "పరతః పరః" అను శ్రుతియందు పంచమ్యంతనిర్దిష్ట మగు సంసారవృక్షబీజ మగు సర్వకారణమగు నక్షరముకంటె నుత్కృష్టతముడను. కాన: పురుషో హాధు అగు (అధ్యాయచే బురుషవ్యపదేశ్యములగు) క్షరాక్షరములకంటె నుత్తముడనగుట లోకమునందును, వేదమునందును పురుషోత్తముడ నని విఖ్యాతుడనైతిని. "స ఉత్తమః పురుషః" అని వేదమునందును, "హరి ర్యథైకః పురుషోత్తమ స్స్మృతః" అని లోకమున (కవికావ్యాదులయందు) ను ప్రసిద్ధము. శ్లో॥ కారుణ్యతో నరవదాచరతః పరార్థాన్ పార్థాయ బోధితవతో నిజ మీశ్వరత్వమ్ । సచ్చిత్సుఖైకవపుషః పురుషోత్తమస్య నారాయణస్య మహిమా న హి మాన మేతి ॥ కేచి న్నిగృహ్య కరణాని, విసృజ్య భోగ మాస్థాయ యోగ మమలాత్మధియో యతంతే। నారాయణస్య మహిమాన మనంతపార మాస్వాదయ న్నమృతసార మహం తు ముక్తః॥" (కరుణారస సముద్రు డగుట నరుడు వలెనే (లీలామానుషవిగ్రహుడై) శిష్టరక్షణము, దుష్టశిక్షణము మొదలగు పరోపకారముల నాచరించునట్టియు, నర్జునునకు నిజతత్త్వము నుపదేశించునట్టియు, సచ్చిదానందస్వరూపుడైనట్టియు బురుషోత్తము డగు నారాయణుని మహిమ మేరలేనిది. (అపారమైనది.) కొందరు నిర్మలమనస్కులగు సాధకులు యింద్రియముల నిగ్రహించి, భోగముల విడనాడి, యోగము నవలంబించి విముక్తికై ప్రయత్నింతురు, ఇక నేనన్ననో ఆనారాయణుని యనంతము నపారము నగు మహిమ మనెడి యమృతసారము నాస్వాదించి ముక్తుడనైతిని ) ॥౧౮॥

శంకరానందీయము:—అవ్యయత్వము ఈశ్వరత్వము, భర్తృత్వము మొదలగు ధర్మములచే బురుషోత్తమత్వసిద్ధి ప్రకారమునే విశదము జేయుచు, అట్టి పురుషోత్తమనామసిద్ధ మగు అర్థవత్త్వము నాకు వేదశాస్త్రప్రసిద్ధమే యని తెలుపుటద్వారా తన కవిక్రియత్వమును, నసంసారిత్వమును సచ్చిదాన

గీ॥ యో మా మేవ మసంమూఢో జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత! ॥ ॥౧౯॥

పదవిభాగము:— యః- మాం- ఏవం- అసంమూఢః- జానాతి- పురుషోత్తమం- సః- సర్వవిత్- భజతి- మాం- సర్వభావేన- భారత! । ॥౧౯॥

ప్రతిపదార్థము:— పురుషోత్తమం=పురుషోత్తమునిగ; యః=ఎవడు, మాం=నన్ను; ఏవం = చెప్పినవిధమున; అసంమూఢ = సంమోహము లేనివాడై; జానాతి = తెలిసికొనునో; సః = వాడు; సర్వవిత్ = సర్వజ్ఞుడై : మాం = నన్ను; సర్వభావేన = సర్వాత్మత్వము చే; హేభారత = ఓయర్జున!; భజతి = సేవించుచున్నాడు. ॥౧౯॥

శాంకరభాష్యమ్:—

అథేదానీం యథానిరుక్త మాత్మానం యో వేద తస్యేదం ఫల ముచ్యతే— య ఇతి । యో మా మీశ్వరం యథోక్త విశేషణ మేవం యథోక్తేన ప్రకారే ణాఽసమ్మూఢః స

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇపుడు పూర్వమునందు చెప్పబడిన విధమున నాత్మ నెవడు తెలిసికొనునో వానికిఫలము చెప్పబడుచుండెను.

ద్వైకరసస్వరూపత్వమును, అద్వితీయత్వమును సూచించుచుండెను.—'యస్మాత్ ... అహం' నిత్యత్వ జ్ఞాతృత్వాదిధర్మములచే-క్షరస్వభావముకల (మహదాదిస్థూలాంతము నుత్పత్తిలయాదివికారవిశిష్టము, కర్తృత్వ భోక్తృత్వాదిసంసారధర్మకము, కార్యరూపము నగు) పురుషుని నే నతిక్రమించినవాడను. కాన నిత్యత్వాది ధర్మములచే విలక్షణుడను. అట్లగుట నుత్కృష్టుడను. కాన నుత్తముడ నగుదును. "అక్షరా దపి చోత్తమః" అట్లే ప్రకాశస్వరూపత్వ, ప్రకాశకత్వ ఆధారత్వాదిధర్మములచే నేను- మహత్తు సంసారబీజము, అవ్యక్తము నగు అక్షరముకంటె నుత్తముడ నగుదును. "అతోఽస్మి...పురుషోత్తమః" లోక (పురాణ) మునందు, వేదమునందును పూర్వోక్తు లగు క్షరాక్షరపురుషులకంటె నిష్కలత్వ, నిత్యత్వ నిర్గుణత్వ చేతనత్వాది ధర్మములచే నుత్తముడ నగుటచే పురుషోత్తముడ ననియు, క్షరాక్షరపురుషుల ధర్మములయొక్క గాని, కర్మలయొక్కగాని, అవస్థలయొక్కగాని సంబంధలేశమైనను లేనివాడనగుటచే నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుడ ననియు, కేవలసచ్చిదానందఘనుడ ననియు, పరమాత్మ ననియు బ్రఖ్యాతి నందితిని. "మహతోఽవ్యక్త ముత్తమమ్ । అవ్యక్తాత్తు పరః పురుషః" అనియు, "పురుషా న్న పరం కించిత్" అనియు, "అయ మాత్మా సర్వాత్మా నిత్య శ్శుద్ధో బుద్ధ స్సత్యో ముక్తో నిరంజనో విభు రద్వయ ఆనందః పరః ప్రత్యగేకరసః" అనియు "తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః" అను నీమొదలగు శ్రుతులచే (వేదమునందు) పురుషోత్తముడుగా బ్రసిద్ధుడను, "కార్యకారణసంబంధరహితః కేవల శ్శివః" అను మొదలగు స్మృతులచే బురుషోత్తముడనుగా బ్రతిపాదింపబడితిని. 'చిత్రమితీత్య భిత్తి స్తిష్ఠతి' భిత్తి (గోడ) చిత్తరువు నతిక్రమించి యున్నది.) ఈ మ స్థలమున యుక్తిచేతను, సూక్ష్మబుద్ధిచేతను విచారించినచో భిత్తసత్తకంటె వ్యతిరేకముగ చిత్తరువునకు పృథక్సత్త లేనందున భిత్తికంటె వేరుగ చిత్తరువుస్వరూపము కన్పట్టుటలేదు. అట్లే "క్షరాక్షర పురుషాపతీతోహం" (నేను క్షరాక్షరపురుషుల నతిక్రమించినవాడను.) అనుస్థలమున 'వికల్పో న హి వస్తు మాయామాత్ర మిదం ద్వైతం అసత్యా దన్యస్య' ఈ మొదలగు శ్రుతులచే "ఈసర్వము నింద్రజాలమువలె మాయా కార్యమగుట నసద్రూపము. ఈసర్వము (మృదనువృత్తమైన ఘటాదికము మృద్రూపమైనట్లు) సదనువృత్తమగుటచే సద్రూపమే. అను మొదలగు యుక్తులచే నాలోచించినచో బరమాత్మసత్తా వ్యతిరేకముగా నాక్షరాక్షరములకు పృథక్సత్త లేనందున "సర్వం హ్యేత ద్బ్రహ్మ" అను నీ మొదలగు శ్రుతివాక్యములబలము చేతను, పురుషోత్తమాఖ్య మగు పరబ్రహ్మయద్వితీయమే యగును.

శాంకరభాష్యమ్:—

మోహవర్జితస్సన్ । జానాతి "అయ మహమ" స్మీతి పురుషోత్తమం స సర్వవి త్సర్వాత్మనా సర్వం వేత్తీతి సర్వజ్ఞః సర్వభూతస్థం భజతి మాం సర్వభావేన సర్వాత్మచిత్తతయా హే భారత ॥ ॥౧౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓయర్జున! ఎవడు పూర్వమునందు చెప్పబడిన విశేషణములు గల నన్ను చెప్పిన విధమున సంమోహము లేనివాడై నేనీయాత్మ నై తిని అని పురుషోత్తముని తెలిసికొనునో, సర్వాత్మచే సర్వమును తెలిసికొనిన సర్వజ్ఞుడగువాడు సర్వభావముచే (సర్వాత్మచిత్తత్వముచే) నన్ను సేవించుచున్నాడు.

—౧౫వ అధ్యాయము ౧౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు.—

మధుసూదనసరస్వతీయము:— పై విధముగ నామనిర్వచనము దెలిసికొనుటయందు ఫలమును చెప్పుచుండెను:— "యో పురుషోత్తమమ్" యెవడు పురుషోత్తముడగు నన్ను (ఈశ్వరుని) యథోక్త నామనిర్వచనముచే నసంమూఢుడై (ఈ కృష్ణుడొక మనుష్యమాత్రుడే అను సంమోహము లేనివాడై) ఈశ్వరుడే యని తెలిసికొనునో "సః— భారత" ఓభరతవంశోద్భవా! అట్టివాడు సర్వవేత్తయై ప్రేమరూపమగు భక్తిభావముతో నన్ను సేవించును. కనుకనే "మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే । స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥" అని పూర్వము చెప్పినది యుపపన్నతరము. మరియు "బ్రహ్మణో హి ప్రతిష్ఠాహం" అనునదియు నుపపన్నము.

"శ్లో॥ చిదానందాకారం జలదరుచి సారం శ్రుతిగిరాం, వ్రజస్త్రీణాం హారం భవజలధిపారంకృతధియాం।
విహంతుం భూభారం విదధదవతారం ముహు రహో మహో వారంవారం భజత కుశలారంభకృతినః ॥"

తా॥ కైవల్యరూపక్షేమమును జేగూర్చుకొనుటలో నిపుణులగు నో సాధకులారా! వస్తుతః సచ్చిదానంద స్వరూపుడును, ఆకారకల్పన జేయుచో నీలనీరదసుందరుడును, సర్వవేదాంత తాత్పర్యభూతుడును. గోపికాంగనలకు హారమువలె హృదయధార్యుడును తత్త్వజ్ఞానులకు సంసారసాగరమున దడ్డుగా నున్నవాడును, భూభారమును హరించుటకై యనేకావతారముల దాల్చినవాడును నగు శ్రీకృష్ణపరబ్రహ్మము స్వరూపముగా కల యఖండతేజస్సును మాటిమాటికిని సేవింపుడు. ॥౧౯॥

శంకరానందీయము:— ఈవిధముగ స్వీయమాయాతత్కార్యసంబంధము లేమింజేసి, తనయందు నిత్యసిద్ధమై యున్న నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావత్వమును ప్రతిపాదించి, ఇట్టి లక్షణములు గల నన్నెవడు తెలిసికొనునో వాడు ముక్తుడగునని చెప్పుచుండెను— అనేకసహస్రజన్మములయందు శ్రద్ధాభక్తులతో జేసినసత్కర్మలచే నారాధితుడైన పరమేశ్వరుని యనుగ్రహమునకు పాత్రుడై, శుద్ధాత్ముడై దైవీ సంపద్విశిష్టుడైన యే ముముక్షువగు నధికారి శమదమసంన్యాసాదిసాధనసంపత్తితో శ్రవణాదిజన్యమగు జ్ఞానముతో నీవిధముగ నిరుక్తలక్షణములు కల్గినట్టియు నిత్యత్వేశ్వరత్వాదిధర్మములు కలవాడగుటచే క్షరాక్షరవిలక్షణుడను, పురుషోత్తముడను, సర్వసంసారధర్మవినిర్ముక్తుడను, సదానందైకరసుడను, అద్వితీయుడను నగు (పరమాత్మను) "ఈయాత్మనే నేను" అని స్వాత్మచే సాక్షాత్తుగ దెలిసికొనునో అట్టివాడు "సర్వము బ్రహ్మస్వరూపమే" అని సర్వమును బ్రహ్మముగనే తెలిసికొనినవాడై, (సర్వజ్ఞుడై) కనుకనే

గీ॥ ఇతి గుహ్యతమం శాస్త్రమిద ముక్తం మయాఽనఘ ।
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమా న్స్యా త్కృతకృత్యశ్చ భారత ॥ ॥౨౦॥

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున
సంవాదే పురుషోత్తమయోగో నామ పంచదశాధ్యాయః ॥౧౫॥
సమాప్తః.

పదవిభాగము:— ఇతి- గుహ్యతమం- శాస్త్రం- ఇదం- ఉక్తం- మయా- అనఘ- ఏతత్- బుద్ధ్వా- బుద్ధిమాన్- స్యాత్- కృతకృత్యః- చ- భారత । ॥౨౦॥

ప్రతిపదార్థము:— హేఅనఘ=ఓపాపరహితుడవగు అర్జున: ఇతి= ఇట్లు; గుహ్యతమం= అతి రహస్యమైన; ఇదం=ఈ; శాస్త్రం=గీతా శాస్త్రము; మయా=నాచే; ఉక్తం=చెప్పబడెను; హేభారత!=ఓ యర్జున!; ఏతత్=ఈశాస్త్రమును; బుద్ధ్వా=తెలిసికొని; బుద్ధిమాన్=బుద్ధిమంతుడై; స్యాత్=అగును; కృతకృత్యశ్చ=చేయదగినదానినిచేసినవాడును; స్యాత్=అగును. ॥౨॥

శాంకరభాష్యమ్:—

**అస్మిన్నధ్యాయే భగవత్తత్త్వజ్ఞానం మోక్షఫల ముక్త్వా అథేదానీం తత్ స్తౌతి— ఇతీతి । ఇత్యేత ద్గుహ్యతమం గోప్యతమ మత్యన్తరహస్య మిత్యేతత్ । కిం తత్ ? శాస్త్రమ్ । యద్యపి గీతాఖ్యం సమస్తం "శాస్త్ర" ముచ్యతే; తథా ప్యయమేవాధ్యాయ ఇహ "శాస్త్ర" మిత్యుచ్యతే స్తుత్యర్థం ప్రకరణాత్ । సర్వో హి గీతాశాస్త్రార్థోఽస్మి న్నధ్యాయే సమాసే**

శాంకరభాష్యతత్త్వబోధిని:—

**ఈయధ్యాయార్థము ననుసరించి యుపసంహార శ్లోకము నవతరింపజేయుచుండెను — ఈయధ్యాయమున భగవతత్త్వజ్ఞానము మోక్షముఫలముగా కలదని చెప్పి, ప్రస్తుతము దానిని స్తుతించుచుండెను.— ఈగోప్యతమ (అత్యంతరహస్యమైన యీయధ్యాయరూప) మైన శాస్త్రము. (విచారించుచో గీతాశాస్త్రమంతయు శాస్త్రమని చెప్పబడును. అట్లేనను స్తుత్యర్థముగాప్రకర**

యసమ్మూఢుడై (దేహేంద్రియాదులయందు 'నేను నాది, అను జ్ఞానము కలవాడు సమ్మూఢు డనబడును. వానికంటె విలక్షణుడై.) సార్వాత్మ్యభావముతో నన్ను పొందును. ఈశరీరము పతితమయిన తోడనే పూర్ణాత్మగ నుండు నని యర్థము.

లేక, ఏముముక్షువు అసంమ్మూఢుడై (విషయాశాగ్రహగ్రస్తుడుకానివాడై) సర్వైషణలనుండి వ్యుత్థితుడై పురుషోత్తముడ నగు నన్ను స్వాత్మగ దెలిసికొనునో, అట్టి సర్వవేత్త సర్వబ్రహ్మాత్మదృష్టితో నన్ను సేవించును. (జ్ఞాన, తత్ఫలప్రతిబంధమునకై సర్వదా నన్ననుసంధించును.) బ్రహ్మజ్ఞానమునకు, బ్రహ్మనిష్ఠకు ఫలముగా నిర్మాన, నిర్మోహత్వాదిసాధనసంపత్తితో సర్వభావముతో నన్ను సేవించువాడు వ్యయరహిత మగు పదమును పొందగల డని పూర్వమే చెప్పబడెను. ॥౧౯॥

**౧౫ వ అధ్యాయము ౨౦వ శ్లోక వ్యాఖ్యావిశేషములు :—**

మధుసూదనసరస్వతీయము:— ఇక నీయధ్యాయార్థము నుపసంహరించుచుండెను:— వ్యసనరహితుడ వగు నోయర్జునా! ఈవిధముగ రహస్యతమ మగు సంపూర్ణశాస్త్రము నాచే చెప్పబడెను.

శాంకరభాష్యమ్:—
నోక్తః, న కేవలం గీతాశాస్త్రార్థ ఏవ । కింతు సర్వశ్చ వేదార్థ ఇహ పరిసమాప్తః "యస్తం వేద స వేదవిత్," "వేదైశ్చ సర్వై రహమేవ వేద్య" ఇతి చోక్తమ్ । ఇద ముక్తం కథితం మయా హే అనఘ! అపాప! ఏతచ్ఛాస్త్రం, యథాదర్శితార్థం బుధ్వా బుద్ధిమాన్ స్యాద్భవే న్నాన్యథా । కృతకృత్యశ్చ భారత! కృతం కృత్యం కర్తవ్యం యేన స కృతకృత్యః, విశిష్టజన్మ ప్రసూతేన బ్రాహ్మణేన యత్కర్తవ్యం త త్సర్వం భగవత్తత్త్వే విదితే కృతం భవే దిత్యర్థః ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—
ణమునుబట్టి యీయధ్యాయమే శాస్త్రమని చెప్పబడెను) సమస్తమైన గీతాశాస్త్రార్థము మాత్రమే నీయధ్యాయమునందు సమగ్రముగ జెప్పబడుటగాదు. సమస్తమగు వేదార్థము నిట పరిసమాప్తమైనది. "య స్తంవేద స వేదవిత్" 'వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః" అనువాని చే నీవిషయమే చెప్పబడెను. ఓపాపరహితుడా! ఈశాస్త్రము నాచే చెప్పబడెను. చూపించ బడిన యర్థముకల ఈశాస్త్రమును తెలిసికొని జ్ఞాని యగును. మరియొక విధము కాదు.

దీనిని తెలిసికొని యితరుడుగూడ నెవడైనను బుద్ధిమంతుడు (ఆత్మజ్ఞానవంతు) డగును. కృతకృత్యుడును కాగలడు. విశిష్టజన్మప్రసూతుడగు బ్రాహ్మణుడు చేయదగిన సర్వము భగవత్తత్త్వము తెలియబడినచో వానిచే చేయబడినదియే యగును. అట్లు కానిచో గర్తవ్యము సమాప్తము కానేర దని అభిప్రాయము. "హేభారత!" నీవు మహాకులప్రసూతుడవు; "అనఘ" వ్యసనరహితుడవు. కాన వంశగుణముచేతను, స్వీయ గుణముచేతను నేచెప్పినవిషయము నంతను తెలిసికొని కృతకృత్యుడవు కాగల వని వేరే చెప్పవలెనా? అను అభిప్రాయము పై సంబోధనద్వయముచే సూచితమయ్యెను.

### అధ్యాయాంతశ్లోకములు:—

శ్లో॥ వంశీవిభూషితకరా న్నవనీరదాభా త్పీతాంబరా దరుణబింబఫలాధరోష్ఠాత్ ।
పూర్ణేందుసుందరముఖా దరవిందనేత్రా త్కృష్ణా త్పరం కిమపి తత్త్వ మహం న జానే ॥

తా॥ పిల్లనగ్రోవిచే నలంకృతమైన కరములు కల్గినట్టియు, నీలనీరదాకారుడైనట్టియు, నెర్రని దొండపండువంటి యధరోష్ఠము కల్గినట్టియు, నిండుచంద్రునిబోలిన ముఖము కల్గినట్టియు పద్మాయత నేత్రములు కల్గినట్టి శ్రీకృష్ణపరబ్రహ్మముకంటె వేరొక తత్త్వమును నే నెరుంగను.

శ్లో॥ సదా సదానందపదే నిమగ్నం మనో మనోభావ మపాకరోతి ।
గతాగతాయాస మపాస్య సద్యః పరావరాతీత ముపైతి తత్త్వమ్ ॥ ॥౨॥

తా॥ మనస్సు ఎల్లప్పుడు సదానందస్వరూప మగు పరబ్రహ్మస్థానమునందు నిమగ్నమైన స్వభావసిద్ధ మనోభావమును (చాంచల్యమును) వీడుచున్నది. కనుక నే యాతాయాతాయాసమును వీడి పరావరాతీత మగు (పరాపరాతీతమగు) తత్త్వము నొందుచున్నది.

శ్లో॥ శైవా స్సౌరా శ్చ గాణేశా వైష్ణవా శ్శక్తిపూజకాః ।
భవన్తి యన్మయా స్సర్వే సోహ మస్మి పర శ్శివః ॥ ॥౩॥

తా॥ శైవులుగాని, సౌరులుగాని, గాణేశులుగాని, శక్తిపూజకులుగాని యెవరైనను, నాయా దేవతోపాసనాఫలముగ నొకే పరశివతత్త్వము నొందెదరో యట్టి పరబ్రహ్మను నేనైతిని. ॥౩॥

శాంకరభాష్యమ్:—

న చాన్యథా కర్తవ్యం పరిసమాప్యతే కస్యచి దిత్యభిప్రాయః। "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యత" ఇతి చోక్తమ్। "ఏతద్ధి జన్మసామగ్ర్యం బ్రాహ్మణస్య విశేషతః। ప్రాప్యైతత్కృతకృత్యో హి ద్విజో భవతి నాన్యథా." ఇతి చ మానవం వచనమ్। యత ఏత త్పరమార్థతత్త్వం మత్త శ్శ్రుతవా నసి తతః కృతార్థ స్త్వం భారత! ఇతి। ॥౨౦॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్యశ్రీమదాచార్య శ్రీశంకరభగవతః కృతౌ శ్రీభగవద్గీతాభాష్యే పురుషోత్తమయోగో నామ పంచదశాధ్యాయః ॥౧౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇంతియే కాదు. కృతకృత్యుడు (అనగా విశిష్టజన్మప్రసూతమైన బ్రాహ్మణునిచే నేది కర్తవ్యమో అదంతయు భగవత్తత్త్వము తెలియబడినదై యుండ చేయబడినదై యగును. మరియొకవిధమున నెవరికిని కర్తవ్యము పరిసమాప్తిని పొందదని యభిప్రాయము. ఈవిషయమే "సర్వంకర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే' అనుదానిచే చెప్పబడెను. ఇదియే బ్రాహ్మణునకు విశేషముగ జన్మసామగ్రము. ఈజ్ఞానమును పొందియే బ్రాహ్మణుడు కృతకృత్యుడు అగును. మరియొకవిధమున కృతకృత్యుడుకానేరడు. అని. 'ఏతద్ధిజన్మసామగ్ర్యం బ్రాహ్మణస్యవిశేషతః। ప్రాప్యైతత్కృతకృత్యోహి ద్విజోభవతి నాన్యథా" అను మనుస్మృతి తెలుపుచున్నది. ఓభరతవంశోద్భవ! ఈపరమార్థతత్త్వమును నావలన వినుటవలన నీవు కృతకృత్యుడ వైతివి. ॥౨౦॥

ఇట్లు నూరువేలసంఖ్య కలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపము నగు మహాభారతమునందంతర్గతమైన భీష్మపర్వమునందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యారూపమును, యోగశాస్త్రము నగు భగవద్గీతయం దున్న శ్రీకృష్ణార్జున సంవాదమునందు గల పురుషోత్తమయోగ మను పేరి పంచదశాధ్యాయమునకు గౌతమసగోత్రుడగు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బులుసు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన, ఆనందగిరీయవ్యాఖ్యానుసృత శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని

సమాప్తము.

హరిః ఓమ్ తత్సత్.

శ్లో॥ ప్రమాణతోఽపి నిర్ణీతం కృష్ణమాహాత్మ్య మద్భుతమ్।
న శక్నువంతి యే సోఢుం తే మూఢా నిరయం గతాః॥ ॥౪॥

తా॥ శ్రీకృష్ణపరబ్రహ్మముయొక్క అత్యద్భుత మాహాత్మ్యము ప్రమాణప్రదర్శనపూర్వకముగ

నిరూపింపబడినను దానిని తెలుసుకొని సహించుటకు ఎవరు సమర్థులు కారో వారు సంసారరూపమగు నరకమున గూలబడుదురు.

ఇట్లు మధుసూదన సరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా
పంచదశాధ్యాయ గూఢార్థ దీపికకు "తర్కరత్న,
న్యాయవేదాంత విద్యాపారీణ, దర్శనాలంకార"
బిరుదు అప్పన్న శాస్త్రి విరచిత తాత్పర్యబోధిని

స మా ప్త ము.

శం క రా న ం దీ య ము:— "అశోచ్యా నన్వశోచ స్త్వం" అని యారంభించి, యుపదిష్టమైన గీతాశాస్త్రము నుపలక్షణముగ జేసుకొని చెప్పిన పంచదశాధ్యాయరూప మగు నీశాస్త్ర మతిరహస్య మైనది. దీని యర్థమును తెలిసికొనువాడు కృతార్థుడు కాగలడని ప్రతిపాదించుచు నధ్యాయము నుపసంహరించుచుండెను— ఈవిధముగ నాచే చెప్పబడిన ఈశాస్త్రము (నిర్విశేషముగా పరతత్త్వమును శాసించునది (బోధించునది) గాన పంచదశాధ్యాయరూప మగు నీశాస్త్రము) బ్రహ్మస్వరూపప్రతిపాదనపర మగుటచే నత్యంతగోప్యమైనది. కాన అనధికారియు, దుష్టుడు నగు అసురసంపత్తి కలవాని కుపదేశింపదగినదికాదు. మరియు వినుపింపదగదు. శుభాచారనిరతుడు, సుశీలుడు, నధికారియు నగు బ్రాహ్మణుడు సర్వైషణా వైముఖ్యముతో మోక్షైకకాము డగుచో అట్టివాడు ఈపంచదశాధ్యాయరూప మగు శాస్త్రమును, తత్ప్రతిపాదిత మగు నర్థమును సద్గురువునుగ్రహమున లెస్సగా తెలిసికొని బుద్ధిమంతుడు (బ్రహ్మజ్ఞాన సంపన్నుడు) అగును. మరియు కృతకృత్యు డగును. శుద్ధాత్ము డగు బ్రాహ్మణుడు జేయదగు కృత్యము నిత్యాగ్నిహోత్రము మొదలుకొని యశ్వమేధాంతము, ఔపాసనాదిశానబల్యంతము నగు శ్రౌతము స్మార్తము నగు సర్వకర్మలును చేయకున్నను బ్రహ్మవేత్త యగుచో వానిచే నవి చేయబడినవే యగును. సర్వాత్మ యగు బ్రహ్మము తెలియబడినచో నట్టి విద్వాంసునిచే సర్వవేద, శాస్త్ర, పురాణ, ఇతిహాస, ఆగమ ప్రసిద్ధమగు సర్వకర్మలు చేయబడినవే యగును. ఆసర్వకర్మలచే నిష్పన్న మగు సుఖ మనుభూతమే యగును. కారణమేమనః బ్రహ్మానందములో సర్వానందము లంతర్భూతములే యగును. "ఏత స్యైవా నంద స్యాన్యాని భూతా న్యుపజీవన్తి" అను శ్రుతియు నీవిషయమునే చెప్పుచున్నది. కాన బ్రహ్మ వేత్తయే కృతార్థు డగు నని సిద్ధించినది.

ఇట్లు శ్రీశంకరానందసరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా పంచదశాధ్యాయవాక్య
తాత్పర్యబోధినికి "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలం
కార" బిరుదు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన తాత్పర్యబోధిని

స మా ప్త ము.

(శ్రీ) ధరీయము :— అధ్యాయసమాప్తిశ్లోకము:— "సంసారశాఖినం ఛిత్త్వా స్పష్టం పంచదశైర్భిః । పురుషోత్తమయోగాఖ్యే పరం పద ముపాదిశత్ ॥" తా॥ శ్రీకృష్ణభగవానులు పురుషోత్తమయోగ మను పేరుగల యీపంచదశాధ్యాయమున సంసారవృక్షము ను ఛేదించు పరమ పదరూపమగు పరబ్రహ్మమును స్పష్టముగ నుపదేశించెను. ॥౨౦॥

ఇట్లు శ్రీధరవిరచిత శ్రీభగవద్గీతా పంచదశాధ్యాయ టీకకు "తర్కరత్న, న్యాయవేదాంత విద్యాపారీణ, దర్శనాలంకార" బిరుదు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని సమాప్తము.

---

సదానందీయము— అధ్యాయసమాప్తిశ్లోకము :—

శ్లో॥ సమస్తవేదేషు తథైవ భారతే తదాద్యకావ్యే స్మృతిషూత్తమోత్తమః ।
పురాణజాలేపి హి వాస్తవం పదం ముకుంద ఏవాస్తి సతాం మతి స్త్వియమ్ ॥

తా॥ సమస్తవేదములయందును, భారతమందును, ఆదికావ్య మగురామాయణమందును, స్మృతులయందును, పురాణజాలమునందును పారమార్థిక మగుతత్త్వముగ ముకుందుడే కల డని తెలుపబడెను. ఇది సత్పురుషులకు సమ్మతమైన మతము.

శ్లో॥ చేతః! పరిత్యజ్య వికల్పజాలం రమస్వ భో! కృష్ణపదారవిందే ।
నాతఃపరం తత్త్వ మిహాస్తి కించిత్ సద్భి ర్వినిర్ణీత మిదం మతం తత్ ॥

తా॥ సంకల్పవికల్పాత్మక మగు నోచిత్తమా! నీసంకల్పవికల్పముల వీడి, (నిశ్చయాత్మకబుద్ధిగా పరిణమించి) శ్రీకృష్ణభగవానుని పాదపద్మముల దరి జేరి యానందింపుము. శ్రీకృష్ణపరబ్రహ్మముకంటె పారమార్థిక మగుతత్త్వము వేరొండు లేదు. ఈమతము సత్సమ్మతమైనది. ॥౨౦॥

ఇట్లు సదానందవిద్వత్కృత శ్రీభగవద్గీతా పంచదశాధ్యాయటీకకు "తర్కరత్న, న్యాయవేదాంత విద్యాపారీణ, దర్శనాలంకార" బిరుదు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని సమాప్తము.

---

భాష్యోత్కర్షదీపిక— అధ్యాయ సమాప్తి శ్లోకము;—

శ్లో॥ ఆధారం జగతాం గతిం గతిమతాం సూర్యాద్యభాస్యం సతాం సారం సారవతాం గతాగతవతాం చింతా మసంజానతాం, సంసారం పతతాం నతిం కృతవతాం సర్వార్థదం దేవతాం- శౌరిం పర్వతతాం పరాం భజ సితాం చేతో నచ్ఛాఽసాధుతాం ;

తా॥ ఓచిత్తమా! సర్వజగత్తులకు నాధారము, ఆత్మజ్ఞానముకల్గిన మోక్షార్థులకు పరమప్రాప్య స్థానమైనట్టియు, సర్వజగదవభాసకు డగుసూర్యాదులచేగూడ భాసింపచేయబడనట్టియు, సారవంతులలో సారభూతము, గతాగతములు కల్గి భగవచ్చింతనము నెరుగనివారలకు సంసారరూపము, విస్తృతముగ ప్రణిపాతపూర్వకనమస్కారము నాచరించువారికి పర్యాప్తముల జేయునదియు సర్వప్రాప్యమైనదియు, సత్త్వప్రధానమైనదియు నగు శ్రీకృష్ణపరబ్రహ్మరూప మగు దైవతమును సేవింపుము. ఇంతియేగాని యవ మార్గము నవలంబింకుము.

ఇట్లు ధనపతిసూరివిరచిత శ్రీభగవద్గీతా పంచదశాధ్యాయ భాష్యోత్కర్షదీపికకు
"తర్కరత్న, న్యాయవేదాంత విద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని

సమాప్తము.

---

పరమార్థప్రపః— అధ్యాయసముదితార్థము:—

శ్లో॥ బ్రహ్మాఖ్యం మూల మూర్ధ్వం శిరసి విజయతేఽర్వాక్కరాంఘ్ర్యాదిశాఖా
స్త్రైగుణ్యైః పల్లవా స్స్యు ర్విషయపరిణతి ర్వాసనాః పర్ణజాలమ్ ।
వృక్షేస్థాలే ప్రపంచే పురుషవర ముపాశ్రిత్య మూలం విదిత్వా,
ఽసఙ్గేన ఛ్ఛింది శేషం హరి రితి దశమే పంచయుక్తే జగాద ॥

తా॥ బ్రహ్మమనెడు నూర్ధ్వమూలము శిరమునందు కల్గి, అడ్డముగా వ్యాపించిన త్రిగుణము లనెడు శాఖలచే కరాంఘ్ర్యాదులు కల్గి విషయపరిణామములు పల్లవములుగా కల్గి విషయవాసనలు పత్రసము దాయముగా కలిగియున్న ప్రపంచ (సంసార) మను నశ్వత్థవృక్షమునందు సత్పురుషునుగ్రహముచే మూలము కనుగొని, దానిని యసంగమనెడు నిశితశస్త్రముచే ఛేదింపుము. అని శ్రీకృష్ణభగవానునిచే నీపంచ దశాధ్యాయమునం దుపదేశింపబడియె.

ఇట్లు దైవజ్ఞ పండిత విరచిత శ్రీభగవద్గీతా పంచదశాధ్యాయ పరమార్థప్రపకు
"తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని

సమాప్తము

---

నీలకంఠీయము:— ఈయధ్యాయమున భగవత్తత్త్వజ్ఞానము మోక్షఫలహేతు వగుటను జెప్పి ప్రస్తుత మీభగవత్తత్త్వమును స్తుతించుచుండెను.— "ఇతి... అనఘ!" ఈవిధముగ చెప్పినశాస్త్రము అతి రహస్యమైనది. ఆలోచించుచో నష్టాదశాధ్యాయరూప మగు నీగీతాగ్రంథమంతయు శాస్త్రమే. అట్లయ్యును సమస్తశాస్త్రార్థము నీయధ్యాయమున బ్రదర్శింపబడుటచే నీయధ్యాయము శాస్త్రమనబడెను. ఇట కార్యకారణవిభాగము, సంసారవృక్షానిత్యత్వము, భగవద్విభూతులు, "యస్తం వేద స వేదవిత్" "వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః" ఇత్యాదికముచే సమస్తశాస్త్రార్థము నిరూపింపబడెను. ఓయనఘ! (వ్యసనరహిత) ఈరహస్యము తెలిసికొనినవాడు బుద్ధిమంతుడు (జ్ఞాని) యగును. ఆత్మవేత్త యగును. అంత మాత్రము చేతనే కృతకృత్యు డగును. పరమాత్మను తెలిసికొనుటయందే సర్వపురుషార్థములు సమాప్త మగును గాన సర్వకృత్యములు పరమాత్మావగమనపర్యంతములే యగును. ఆత్మజ్ఞాని పొందదగినదానిని పొందినవాడు గాన నింతకంటె నాతనికి కర్తవ్యమేమియు మిగులకుండు నని యర్థము.

ఇట్లు శ్రీనీలకంఠాచార్య విరచిత శ్రీభగవద్గీతా పంచదశాధ్యాయ
భారతభావదీపమునకు బులుసు వెంకటశాస్త్రి విరచిత
తాత్పర్యబోధిని సమాప్తము.

---

# శ్రీభగవద్గీతా శాంకరభాష్య తత్త్వబోధిని

## చతుర్థ కుసుమమ్

"శాస్త్రరత్నాకర" బ్ర॥ వే॥ దెందుకూరి నృసింహశాస్త్రిణాం

ప్రియశిష్యేణ,

బ్ర॥ వే॥ బులుసు వేఙ్కటశాస్త్రిణాం

తనూభవేన,

శ్రీ శేషమాంబాగర్భశుక్తి ముక్తాఫలాయమానేన
"తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ, దర్శనాలంకార"
గౌతమసగోత్రోద్భవేన,

## బులుసు అప్పన్నశాస్త్రిణా

ప్రణీతా సతీ,

ఆస్తికవదాన్యానాం ద్రవ్యసహాయేన,
తత్పుత్రాభ్యాం న్యాయశాస్త్ర కోవిదాభ్యాం,
శ్రీవేఙ్కటశాస్త్రి, మిత్రసత్యనారాయణాభ్యాం
భట్నవిల్లి గ్రామసంస్థాపితే స్వీయ శ్రీశారదాముద్రణాలయే
ముద్రాపితాసతీ విజయతేతరామ్॥

పునర్ముద్రణమ్

గ్రంథప్రాప్తిస్థానమ్ :

**శ్రీ శారదా గ్రంథమాలిక**

భట్నవిల్లి – 533 222

అమలాపురం తా॥ (తూ॥ గో॥ జిల్లా.)



[మూల్యం : **16–00**

# శ్రీభగవద్గీతా శాంకరభాష్య తత్త్వబోధిని

## చతుర్థ కుసుమమ్

"శాస్త్రరత్నాకర" బ్ర॥ వే॥ దెందుకూరి నృసింహశాస్త్రిణాం

ప్రియ శిష్యేణ,

బ్ర॥ వే॥ బులుసు వేఙ్కటశాస్త్రిణాం

తనూభవేన,

శ్రీ శేషమాంబాగర్భశుక్తి ముక్తాఫలాయమానేన
"తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ, దర్శనాలంకార"
గౌతమసగోత్రోద్భవేన,

## బులుసు అప్పన్నశాస్త్రిణా

ప్రణీతా సతీ,

ఆస్తికవదాన్యానాం ద్రవ్యసహాయేన,
తత్పుత్రాభ్యాం న్యాయశాస్త్ర కోవిదాభ్యాం,
శ్రీవేఙ్కటశాస్త్రి, మిత్రసత్యనారాయణాభ్యాం
భట్నవిల్లి గ్రామసంస్థాపితే స్వీయ శ్రీశారదాముద్రణాలయే
ముద్రాపితాసతీ విజయతేతరామ్॥

పునర్ముద్రణమ్

గ్రంథప్రాప్తిస్థానమ్ :

**శ్రీ శారదా గ్రంథమాలిక**

భట్నవిల్లి – 533 222

అమలాపురం తా॥ (తూ॥ గో॥ జిల్లా.)



[మూల్యం : **16–00**